# కృతజ్ఞతావిష్కరణము.

బాపట్ల తాలూకా ఇంకొల్లు గ్రామవాస్తవ్యులగు పిశిపాటి బ్ర॥ వే పిచ్చయ్యగారి కుమారులు 1. బ్ర॥ వే॥ సీతారామయ్యగారు, 2. బ్ర॥ వే సత్యనారాయణగారు, సత్యనారాయణగారి దత్తతకుమారులు బ్ర॥ వే॥ జానకిరామయ్యగారు. సీతారామయ్యగారి తనూభవులును, వెంకట సుబ్బమాంబా గర్భశుక్తిముక్తాఫలభూతులు బ్ర॥ వే॥ పిచ్చయ్యగారు, 2. బ్ర॥ వే॥ఆంజనేయులుగారు, 3. బ్ర॥ వే॥జనార్దనశర్మగారు వీరిలో జ్యేష్ఠు లగు పిచ్చయ్యగారితో నా "శాంకరభాష్యతత్త్వబోధినీ" ప్రచురణము నకై సహాయము నర్థించుటతడవుగనే వీరు "వదాన్యశేఖర"స్థానమలంక రించి తమ యౌదార్యమును ప్రకటించిరి. ఇట్టివీరికిని, వీరికుటుంబము నకును—

"చత్వారః ప్రథయన్తు విద్రుమలతారక్తాంగులిశ్రేణయ
శ్శ్రీయుక్శోణసరోజకోరకరుచ స్తే శార్ఙ్గిణః పాణయః।
ఫాలే ప్వబ్జభువో లిఖంతి యుగప ద్యే పుణ్యవర్ణావళీః
కస్తూరీమకరీః పయోధరయుగే గండద్వయే చ శ్రియః॥"

బ్రహ్మదేవుని నాల్గుమోములం దొక్కసారిగ నాయుర్దాయ పంక్తులను, లక్ష్మీదేవియొక్క గండద్వయ, కుచద్వయములం దొక్క సారిగ కస్తూరీమకరికాపత్రములను నేవి విలిఖించుచుండెనో యట్టి పగడపుదీగలవలె నెర్రనైన-వ్రేళ్ళపంక్తులుకలశార్ఙ్గియగు శ్రీమహావిష్ణువు యొక్క నాలుగుబాహువులు ధర్మార్థ కామ మోక్షములనెడి పురు షార్థచతుష్టయమును, నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని ప్రసాదించు గాక! యని శ్రీమహావిష్ణ్వవతారభూత పార్థసారథిని ప్రార్థించు చున్నాను.

ఇట్లు,

గ్రంథరచయిత "దర్శనాలంకార

బులుసు అప్పన్నశాస్త్రి.



వదాన్యశేఖరులు:

బ్రి॥ వే॥ పిశిపాటి వెంకటసుబ్బమ్మ, సీతారామయ్యగార్లు.

వీరి కుమాళ్ళు

బ్రి॥ వే॥ 1. పిచ్చయ్యగారు. 2. ఆంజనేయులుగారు. ౩, జవార్దనరావుగారు.

ఇంకొల్లు, బాపట్లతాలూకా.



వదాన్యశేఖరులు:

బ్రి॥ వే॥ వింజమూరి సుబ్బారావుగారు.

ఎమ్. బి. బి. ఎస్.

# కృతజ్ఞతాభినందనము.

అమలాపురవాస్తవ్యులును, సుప్రసిద్ధ వైద్యశేఖరులై యనేకులకు జీవనదానమొనర్చి ప్రసిద్ధిగాంచినట్టియు, నా కత్యంతప్రియమిత్రులైనట్టి కీ॥ శే॥ వింజమూరి సుబ్బారావు (ఎం. బి. బి. యస్.) గారి కుమారరత్నమును, మచిలీపట్టణవాస్తవ్యులును, సుప్రసిద్ధన్యాయవాదులును, దేవబ్రాహ్మణభక్తిసంకలితులును అగు మ॥ రా॥ శ్రీ వింజమూరి వెంకటనరసింహారావుగారి సన్నిధికినేనేగి వారిని నా "భగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధినీ" ప్రకటనమునకై చేయూతనొసంగఁగోరుట తడవుగనే వారు 'వదాన్యశేఖర' స్థానమలంకరించి వారి భక్తివిశ్వాసముల బ్రకటించిరి. ఇట్టివీరికిని, వీరికుటుంబమునకును —

"చత్వారః ప్రథయన్తు విద్రుమలతారక్తాంగుళిశ్రేణయ
శ్శ్రీయశ్శోణసరోజకోరకరుచ స్తే శార్ఙ్గిణః పాణయః ।
ఫాలే ష్వబ్జభువో లిఖన్తి యుగప ద్యే పుణ్యవర్ణావళీః
కస్తూరీమకరీః పయోధరయుగే గండద్వయే చ శ్రియః ॥"

బ్రహ్మదేవుని నాల్గుమోములం దొక్కసారిగ నాయుర్దాయపంక్తులను, లక్ష్మీదేవియొక్క గండద్వయ, కుచద్వయములం దొక్కసారిగ కస్తూరీమకరికాపత్రములను నేవి విలిఖించుచుండెనో యట్టి పగడపుదీగలవలె నెఱ్ఱనైన-వ్రేళ్ళపంక్తులుకల శార్ఙ్గియగు శ్రీమహావిష్ణువుయొక్క నాలుగుబాహువులు ధర్మార్థ కామ మోక్షము లనెడి పురుషార్థచతుష్టయమును, నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని ప్రసాదించుగాక! యని శ్రీమహావిష్ణ్వవతారభూత పార్థసారథిని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

గ్రంథరచయిత "దర్శనాలంకార"

బులుసు అప్పన్నశాస్త్రి

# కృతజ్ఞతావిష్కరణము.

సికింద్రాబాదు వాస్తవ్యులు, ఇస్లామియాహైస్కూలు నందాంధ్రోపాధ్యాయులై ప్రస్తుతము విశ్రాంతి గైకొనినట్టియు, దేవీపూజాధురంధరులును, చిరకాలమునుండి మత్పోషణాదులయం దభిరతులును, అస్మత్సతీర్థులగుటంజేసి నాకు జ్యేష్ఠభ్రాతృసములునగు బ్రహ్మశ్రీ వేదమూర్తులైన బుర్రా సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు నేనీ "భగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధినీ" విషయమును మనవిచేయకుండగనే వారు తెలిసికొని వారియంతరాత్మ ప్రేరేపింప "వదాన్యశేఖర" స్థానమునలంకరించి, నాయందలి యవ్యాజవాత్సల్యమును ప్రకటించిరి. ఇట్టివీరికిని, వీరి కుటుంబమునకును—

శ్లో॥ అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠ
న్పశ్చార్ధేన ప్రణయరసయు క్చక్షుషాఽవేక్షమాణః ।
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథ మధివస న్పాతు వ స్సూత వేషః ॥

దక్షిణపాదమును ముందుంచి, వామజానువును భూమినోపి, శరీరోపరిభాగముతో నిలచి, వామహస్తమున తోత్రమును, (కశను) దక్షిణహస్తమున జ్ఞానముద్రను ధరించి, పార్థుని ప్రణయరసముతోగూడిన దృష్టితో జూచుచు, పార్థునిరథము నధిష్ఠించిన పార్థసారథి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని, ధర్మార్థకామమోక్షపురుషార్థముల నొసంగి సర్వదా రక్షించుగాక.

ఇట్లు,

గ్రంథరచయిత "దర్శనాలంకార"

బులుసు అప్పన్నశాస్త్రి.



వదాన్యశేఖరులు:

బ్ర॥ వే॥ బుర్రా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

సికింద్రాబాదు.

# కృతజ్ఞతాభినందనము.

సికిందాబాదువాస్తవ్యులును, దేవపూజాధురంధరులును, ఆస్తికాగ్రగణ్యులును, అస్మదత్యంతప్రియమిత్రులు నగు కీ. శే. వేమూరి వెంకటకృష్ణయ్యగారి ధర్మపత్నియగు వెంకటలక్ష్మమ్మగారితోను, వీరిజామాతయగు కీ॥ శే॥ గొల్లపూడి లక్ష్మీనారాయణగారి ధర్మపత్నియగు శశిరేఖగారితోను నాప్రియమిత్రులగు బుర్రా సుబ్రహ్మణ్యశాస్త్రి గారితో కలిసి వెళ్ళి నా "భగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధినీ" ప్రకటన విషయమై ప్రస్తావింప, వారు సంతోషపూర్వకముగా "వదాన్యశేఖర" స్థానమలంకరించి వారిభక్తివిశ్వాసముల నావిష్కరించిరి. ఇట్టివీరికి:—

"చత్వారః ప్రథయన్తు విద్రుమలతారక్తాంగుళిశ్రేణయ
శ్శ్రియశ్శ్లక్ష్ణసరోజకోరకరుచ స్తే శార్ఙ్గిణః పాణయః ।
ఫాలే ష్వబ్జభువో లిఖంతి యుగప ద్యే పుణ్యవర్ణావళీః
కస్తూరీమకరీః పయోధరయుగే గండద్వయే చ శ్రియః॥"

బ్రహ్మదేవుని నాల్గుమోములం దొక్కసారిగ నాయుర్దాయపంక్తులను, లక్ష్మీదేవియొక్క గండద్వయ, కుచద్వయములం దొక్కసారిగ కస్తూరీమకరికాపత్రములను నేవి విలిఖించుచుండెనో యట్టి పగడపుదీగలవలె నెర్రనైన వ్రేళ్ళపంక్తులుకల శార్ఙ్గియగు శ్రీమహావిష్ణువు యొక్క నాలుగు బాహువులు ధర్మార్థ కామ మోక్షము లనెడి పురుషార్థచతుష్టయమును, ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని ప్రసాదించు గాక. యని శ్రీమహావిష్ణ్వవతారభూత పార్థసారథిని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

గ్రంథరచయిత "దర్శనాలంకార"

జులుసు అప్పన్నశాస్త్రి.

# కృతజ్ఞతావిష్కరణము.

సికింద్రాబాదు వాస్తవ్యులును, శమదమాదిసద్గుణసంపన్నులును, ఆస్తికాగ్రగణ్యులును, దేవపూజాధురంధరులు నగు బ్ర॥ వే॥ పురాణం సుబ్రహ్మణ్యం గారితో నా "భగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని" ప్రకటన విషయమై సహాయము నర్థింప వారు "వదాన్యశేఖర" శ్రేణి నధిష్ఠించి వారి యాస్తిక్య, ఔదార్యములను వెల్లడించిరి. ఇట్టి వీరికిని, వీరి కుటుంబమునకు:—

శ్లో॥ అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠ
న్నశ్చాద్రేన ప్రణయరసయు క్చక్షుషాఽవేక్షమాణః ।
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథ మధివస న్పాతు వ స్సూతవేషః ॥

దక్షిణపాదమును ముందుంచి, వామజానువును భూమినోపి, శరీరోపరిభాగముతో నిలచి, వామహస్తమున తోత్రమును, (కశను) దక్షిణ హస్తమున జ్ఞానముద్రను ధరించి, పార్థుని ప్రణయరసముతోగూడిన దృష్టితో జూచుచు, పార్థుని రథము నధిష్ఠించిన పార్థసారథి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని, ధర్మార్థకామమోక్షపురుషార్థముల నొసంగి సర్వదా రక్షించుగాక.

ఇట్లు,

గ్రంథరచయిత "దర్శనాలంకార"

బులుసు అప్పన్న శాస్త్రి.



వదాన్యశేఖరులు:

బ్ర॥శ్రీ॥వే॥ పురాణం సుబ్రహ్మణ్యంగారు.

సికింద్రాబాదు.



వదాన్యశేఖరులు:

బ్రహ్మశ్రీ

కడియాల కామశాస్త్రిగారు.

తణుకు.

# కృతజ్ఞతాభినందనము.

పశ్చిమగోదావరిజిల్లా తణుకుగ్రామవాస్తవ్యులును, ఆస్తికాగ్రగణ్యులును, నిత్యకర్మానుష్ఠాన నిరతులు, నగు కీ॥ శే॥ కసేయాల కామశాస్త్రిగారిపౌత్రులగు, బ్రి. వే. సుబ్బారావు (బి. ఎ. బి. ఎల్. వకీలు) గారితో నా "శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధినీ" ప్రచురణవిషయమై సహాయమును గోరగా వారు "వదాన్యశేఖర" స్థానము నలంకరించి, వారి సహాయౌదార్యాస్తిక్యములను ప్రకటించిరి. ఇట్టి వీరికిని, వీరి కుటుంబమునకును:—

శ్లో॥ అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠ
న్పశ్చార్ధేన ప్రణయరసయు క్చక్షుషా౽వేక్షమాణః ।
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథ మధివస న్పాతు వ స్సూతవేషః ॥

దక్షిణపాదమును ముందుంచి, వామజానువును భూమినోపి, శరీరోపరిభాగముతో నిలచి, వామహస్తమున తోత్రమును, (కశను) దక్షిణహస్తమున జ్ఞానముద్రను ధరించి పార్థుని ప్రణయరసముతో గూడిన దృష్టితో జూచుచు, పార్థుని రథము నధిష్ఠించిన పార్థసారథి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని ధర్మార్థకామమోక్షపురుషార్థములనొసంగి సర్వదా రక్షించుగాక.

ఇట్లు,

గ్రంథరచయిత "దర్శనాలంకార"

బులుసు అప్పన్నశాస్త్రి.

# కృతజ్ఞతావిష్కరణము.

సికిందాబాదు వాస్తవ్యులును, వైశ్యకులశ్రేష్ఠులు నగు మ. రా. శ్రీ జూలూరి వెంకటేశంగారి కుమారరత్నము, నిత్యము దేవబ్రాహ్మణపూజాధురంధరులు నగు "భక్తాగ్రేసర" మ॥ రా॥ శ్రీ జూలూరి జగదీశ్వరయ్య శ్రేష్ఠిగారితో నా "భగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధినీ" ముద్రణముకై సహాయము నర్థింప వారు "వదాన్యశేఖర" శ్రేణి నధిష్ఠించి, వారి యనన్యసాధారణ భక్తివిశ్వాసముల బ్రకటించిరి. ఇట్టి వీరికిని, వీరి కుటుంబమునకును:—

"చత్వారః ప్రథయన్తు విద్రుమలతారక్తాంగుళిశ్రేణయ
శ్శ్రీయశ్శోణసరోజకోరకరుచ స్తే శార్ఙ్గిణః పాణయః ।
ఫాలేష్వబ్జభువో లిఖంతి యుగప ద్యే పుణ్యవర్ణావళీః
కస్తూరీమకరీః పయోధరయుగే గండద్వయే చ శ్రియః॥"

బ్రహ్మదేవుని నాల్గు మోములం దొక్కసారిగ నాయుర్దాయ పంక్తులను లక్ష్మీదేవియొక్క గండద్వయ, కుచద్వయములం దొక్కసారిగ కస్తూరీమకరికాపత్రములను నేవి విలిఖించుచుండెనో యట్టి పగ పగడపుదీగలవలె నెఱ్ఱనైన-వేళ్లపంక్తులుకలశార్ఙ్గియగు శ్రీమహావిష్ణువుయొక్క నాలుగు బాహువులు ధర్మార్థ కామ మోక్షములనెడి పురుషార్థచతుష్టయమును, నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని ప్రసాదించుగాక! యని శ్రీమహావిష్ణ్వవతారభూత పార్థసారథిని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,
గ్రంథరచయిత "దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రి.



వదాన్యశేఖరులు:

మహారాజశ్రీ

జూలూరి వెంకటేశంగారు.

సికిందాబాదు.



మ॥రా॥శ్రీ వదాన్యశేఖరులు: తవుటశంగరయ్యగారు,
వీరిభార్య మహాలక్ష్మమ్మగారు.



వీరికుమారుళ్ళు — వెంకటరామయ్యగారు,
వీరిభార్య సరోజనీదేవిగారు.

# కృతజ్ఞతాభినందనము.

సికింద్రాబాదు వాస్తవ్యులును, వైశ్యకులశిఖామణులు నగు శ్రీ. శే. టవుట శంకరయ్యగారి ధర్మపత్ని యగు మహాలక్ష్మమ్మగారితో అస్మత్ప్రియమిత్రులగు బ్ర. వే. బుర్రా సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు నాచే రచింపబడిన "శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని" ప్రచురణ విషయము ప్రస్తావించినతోడనే శ్రీమహాలక్ష్మమ్మగారు 'వదాన్యశేఖర' స్థానమలంకరించిరి. ఇట్టి మహాలక్ష్మమ్మగారికి పార్థసారధి ఆయురారోగ్యైశ్వర్యములను, బ్రహ్మైక్యానుసంధానమును ఒసంగుగాక— మరియు వీరి కుమారరత్నములగు మ. రా. శ్రీ వెంకటరామయ్యగారికిని, వీరిధర్మపత్ని చి॥ సౌ॥ సరోజనీదేవిగారికిని, ఈదంపతుల కుమారరత్నములగు శంకరయ్యప్రభృతులకును:—

"చత్వారః ప్రథయన్తు విద్రుమలతారక్తాంగుళిశ్రేణయ
శ్శ్రియశ్శోణసరోజకోరకరుచ స్తే శార్ఙ్గిణః పాణయః ।
ఫాలే ష్వబ్జభువో లిఖంతి యుగప ద్యే పుణ్యవర్ణావళీః
కస్తూరీమకరీః పయోధరయుగే గండద్వయే చ శ్రియః॥"

బ్రహ్మదేవుని నాల్గుమోములం దొక్కసారిగ నాయుర్దాయ పంక్తులను, లక్ష్మీదేవియొక్క గండద్వయ, కుచద్వయములం దొక్కసారిగ కస్తూరీమకరికాపత్రములను నేవి విలిఖించుచుండెనో యట్టి పగడపుదీగలవలె నెర్రనైన వ్రేళ్ళపంక్తులుకల శార్ఙ్గియగు శ్రీమహావిష్ణువు యొక్క నాలుగు బాహువులు ధర్మార్థ కామ మోక్షము లనెడి పురుషార్థచతుష్టయమును, ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని ప్రసాదించు గాక. యని శ్రీమహావిష్ణ్వవతారభూత పార్థసారథిని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,
గ్రంథరచయిత "దర్శనాలంకార"
బులుసు అప్పన్న శాస్త్రి.

# కృతజ్ఞతావిష్కరణము.

రాజమహేంద్రవర వాస్తవ్యులును, సుప్రసిద్ధన్యాయవాదులును, అగు కీ. శే. నిడమర్తి దుర్గయ్యగారి పౌత్రులును, అన్నపూర్ణాంబా గర్భశుక్తిముక్తాఫలస్వరూపులును, నిరంతర వేదాధ్యయనతత్పరులును, దేవ పూజాధురంధరులు నగు నిడమర్తి సత్యనారాయణమూర్తిగారిని, వారి మాతృశ్రీయగు అన్నపూర్ణాంబగారిని నా "భగవద్గీతాశాంకరభాష్య తత్త్వబోధిని" ప్రకాశమునకై సహాయమును కోరగనే వారు "వదాన్యశేఖర" శ్రేణి నధిష్ఠించి, తమ సహజౌదార్యమును, ఆస్తిక్య మును ప్రకటించిరి. ఇట్టి వీరికిని, వీరి కుటుంబమునకును —

శ్లో॥ అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠ
న్పశ్చాద్రేన ప్రణయరసయు క్చక్షుషా వేక్షమాణః ।
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథ మధివస న్పాతు వ స్సూతవేషః ॥

దక్షిణపాదమును ముందుంచి, వామజానువును భూమినోపి, శరీ రోపరిభాగముతో నిలచి, వామహస్తమున తోత్రమును, (కశను) దక్షిణ హస్తమున జ్ఞానముద్రను ధరించి, పార్థుని ప్రణయరసముతోగూడిన దృష్టితో జూచుచు, పార్థుని రథము నధిష్ఠించిన పార్థసారథి ఆయురారో గ్యైశ్వర్యాభివృద్ధిని, ధర్మార్థకామమోక్షపురుషార్థముల నొసంగి సర్వదా రక్షించుగాక.

ఇట్లు,
గ్రంథరచయిత "దర్శనాలంకార"
బులుసు అప్పన్న శాస్త్రి.

తర్క-వేదాంతవిశారద-బ్రి॥ వే॥ కడియాలసీతారామశాస్త్రిగారి ప్రియశిష్యులు.



బ్రి॥ వే॥ ఏలేశ్వరపు సూర్యనారాయణశర్మగారు.
వీరి ధర్మపత్ని — సత్యవతమ్మగారు,
నరసాపురము. పశ్చిమగోదావరిజిల్లా.



వదాన్యశేఖరులు:
వీరిజామాత: శ్రీగొల్లకోటి నరసింహారావుగారు.
వీరిధర్మపత్ని — సీతారామలక్ష్మికుటుంబము

# కృతజ్ఞతాభినందనము.

పశ్చిమగోదావరిజిల్లా నరసాపురంవాస్తవ్యులును తర్కవేదాన్త విశారద బ్ర॥ వే॥ కడియాల సీతారామశాస్త్రిగారి ప్రియశిష్యులును అగు బ్ర॥ వే॥ ఏలేశ్వరపు సూర్యనారాయణశర్మగారివద్దకు నేను, నా ప్రియప్రశిష్యులగు చి॥ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రులుగారును వెళ్ళి శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధినీముద్రణవిషయమును మనవి జేసి నంతమాత్రమున శ్రీసూర్యనారాయణశర్మగారు రు 50-0-0 లొసంగి సాగనంపుచు నేనొసగున దింతియే కాదని యొక వాక్యమును మాత్రము నుచ్చరింప అంతట నేను శలవు గైకొని నాస్వగ్రామము నకు వెళ్ళుసరికి జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారిద్వారా వారి ఫొటోను పంపుతూ మిగిలిన రు 300-0-0 వెంటనే పంపెదను. యీ మూడవసంపుటముననే నాబ్లాకు వేయించమని కోరియుండిరి. "అయాచితం బ్రాహ్మణాయ దద్యాత్" అను శ్రుతిని సార్థక మొనరించిన ఇట్టి వదాన్యశేఖరులగు నాప్రశిష్యులైన బ్ర॥ వే॥ ఏలేశ్వరపు సూర్యనారాయణశర్మగారికి, వారికుటుంబమునకు, వీరిజామాతయగు చి॥ గొల్లకోటి నరసింహారావుగారికి మరియు వీరి కుటుంబమునకు—

"చత్వారః ప్రథయన్తు విద్రుమలతారక్తాంగుళిశ్రేణయ
శ్శ్రీయశ్శోణసరోజకోరకరుచస్తే శార్ఙ్గిణః పాణయః।
ఫాలే వ్యబ్జభువో లిఖంతి యుగపద్యే పుణ్యవర్ణావళీః
కస్తూరీమకరీః పయోధరయుగే గండద్వయే చ శ్రియః॥"

బ్రహ్మదేవుని నాల్గుమోములం దొక్కసారిగ నాయుర్దాయ పంక్తులను, లక్ష్మీదేవియొక్క గండద్వయ, కుచద్వయములం దొక్కసారిగ కస్తూరీ మకరికాపత్రములను నేవి విలిఖించుచుండెనో యట్టి పగడపుదీగలవలె నెర్రనైన-వ్రేళ్ళపంక్తులుకల శార్ఙ్గియగు శ్రీమహావిష్ణువుయొక్క నాలుగుబాహువులు ధర్మార్థ కామ మోక్షము లనెడి పురుషార్థచతుష్టయమును, నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని ప్రసాదించుగాక! యని శ్రీమహావిష్ణ్వవతారభూత పార్థసారథిని ప్రార్థించు చున్నాను.

ఇట్లు,
గ్రంథరచయిత "దర్శనాలంకార"
బులుసు అప్పన్న శాస్త్రి.

# సోపానపంచకం.

శ్లో॥ వేదో నిత్య మధీయతాం త దుదితం కర్మ స్వనుష్ఠీయతాం,
తేనేశస్య విధీయతా మపచితిః కామ్యే మతి స్త్యజ్యతామ్,
పాపౌఘః పరిధూయతాం భవసుఖే దోషోఽనుసంధీయతాం
ఆత్మేచ్ఛా వ్యవసీయతాం నిజగృహాత్తూర్ణం వినిర్గమ్యతామ్ ॥౧॥
సంగ స్సత్సు విధీయతాం భగవతో భక్తి ర్దృఢాధీయతాం
శాంత్యాదిః పరిచీయతాం దృఢతరం కర్మాసు సంన్యస్యతామ్,
తద్విద్వా నుపసర్ప్యతా మనుదినం తత్పాదుకే సేవ్యతాం
బ్రహ్మైకాక్షర మర్థ్యతాం శ్రుతిశిరోవాక్యం సమాకర్ణ్యతామ్ ॥౨॥
వాక్యార్థశ్చ విచార్యతాం శ్రుతిశిరఃపక్ష స్సమాశ్రీయతాం
దుస్తర్కా త్సువిరమ్యతాం శ్రుతిసమిస్తర్కోఽనుసంధీయతామ్,
బ్రహ్మాస్మీతి విభావ్యతా మహరహ ర్గర్వః పరిత్యజ్యతాం
దేహేఽహంమతి రుజ్ఝ్యతాం బుధజనై ర్వాదః సముత్సృజ్యతామ్ ॥౩॥
క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతాం ప్రతిదినం భిక్షౌషధం భుజ్యతాం
స్వాద్వన్నం చ నిరస్యతాం విధివశా త్ప్రాప్తేన సంతుష్యతామ్,
ఔదాసీన్య మభీప్స్యతాం జనకృపానైష్ఠుర్య ముత్సృజ్యతామ్
శీతోష్ణాది విషహ్యతాం నతు వృథా వాక్యం సముచ్చార్యతామ్ ॥౪॥
ఏకాంతే సుఖ మాస్యతాం పరతరే చేత స్సమాధీయతాం
పూర్ణాత్మా సుసమీక్ష్యతాం జగ దిదం సంబాధితం దృశ్యతామ్,
ప్రాక్కర్మ ప్రవిలాప్యతాం చితిబలా న్నాప్యుత్తరం శ్లిష్యతాం
ప్రారబ్ధం త్విహ భుజ్యతా మథ పరబ్రహ్మాత్మనా స్థీయతామ్ ॥౫॥

ఇతి శ్రీమచ్ఛంకరభగవత్పాదవిరచిత సోపానపంచకం సంపూర్ణమ్ ॥

# కౌపీనపంచకం.

వేదాంతవాక్యేషు సదా రమంతో భిక్షాన్నమాత్రేణవ తుష్టిమంతః,
అశోక మంతఃకరణె రమంతః కౌపీనవంతః ఖలు భాగ్యవంతః ॥౧॥
మూలం తరోః కేవల మాశ్రయంతః పాణిద్వయే భోక్తు మమత్రవంతః,
కంథా మపి స్త్రీ మివ కుత్సయంతః కౌపీనవంతః ఖలు భాగ్యవంతః ॥౨॥
దేహాభిమానం పరిహృత్య దూరా దాత్మాన మాత్మ న్యవలోకయంతః,
అహర్నిశం బ్రహ్మణి సంరమంతః కౌపీనవంతః ఖలు భాగ్యవంతః ॥౩॥
స్వానందభావే పరితుష్టిమంతః సంశాంతసర్వేంద్రియవృత్తిమంతః,
నాంతం న మధ్యం న బహిః స్మరంతః కౌపీనవంతః ఖలు భాగ్యవంతః ॥౪॥
పంచాక్షరం పావన ముచ్చరంతః పతిం పశూనాం హృది భావయంతః,
భిక్షాశినో దిక్షు పరిభ్రమంతః కౌపీనవంతః ఖలు భాగ్యవంతః ॥౫॥

ఇతి శ్రీమచ్ఛంకరభగవత్పాదవిరచిత కౌపీనపంచకం సంపూర్ణమ్ ॥

శుభమస్తు—అవిఘ్నమస్తు.

# శ్రీభగవద్గీతా.

# శాంకరభాష్యతత్త్వబోధిని

## సప్తమోఽధ్యాయః.

శ్రీభగవా నువాచ— మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుంజ న్మదాశ్రయః ।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥౧॥

పదవిభాగము:— శ్రీభగవాన్ - ఉవాచ॥ మయి-ఆసక్తమనాః-పార్థ-యోగం- యుంజన్-మదాశ్రయః-- అసంశయం-సమగ్రం-మాం-యథా-జ్ఞాస్యసి-తత్-శృణు ॥౧॥

ప్రతిపదార్థము:— హేపార్థ=ఓయర్జునా: మయి=చెప్పబోవు విశేషణములుగల పరమేశ్వర రూపుడనగు నాయందు; ఆసక్తమనాః=ఆసక్త-లగ్నమైన మనాః=మనస్సుకలవాడవై: యోగం=మనస్సమాధానమును; యుంజన్=చేయువాడవై; మదాశ్రయః=మత్-పరమేశ్వరుడనగు నేనే: ఆశ్రయః=ఆశ్రయముగా కలవాడవై; అసంశయం=సంశయము లేకుండునటుల; సమగ్రం=విభూతిబలశక్త్యైశ్వర్యాదిగుణసంపన్నుడ నగు; మాం=నన్నును; యథా=ఏప్రకారముచే; (అనగా సంశయము లేకుండగ నిట్టివాడు భగవంతుడని) జ్ఞాస్యసి= తెలిసికొనెదవో; తత్=నేను చెప్పబోవునట్టిదానిని; శృణు=వినుము; ॥౧॥

---

శాంకరభాష్యమ్:—

"యోగినా మపి సర్వేషాం మద్గతే నాన్తరాత్మనా । శ్రద్ధావా న్భజతే యో మాం స మే యుక్తతమో మతః॥" ఇతి ప్రశ్నబీజ ముపన్యస్య స్వయ మేవేదృశం మదీయం తత్త్వ మేవం మద్గతాన్తరాత్మా స్యా దిత్యేత ద్వివక్షుః—

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కర్మసంన్యాసరూపమగు సాధనమే ప్రధానముగా కలిగినట్టి, త్వంపదార్థము ప్రధానముగాకల ప్రథమషట్కమును వ్యాఖ్యానించి, ఉపాస్యనిష్ఠము, తత్పదార్థనిష్ఠము నగు మధ్యషట్కమును వ్యాఖ్యానించుట కారంభించుచు పూర్వాధ్యాయమును "యోగినాం" అను యవతారరూపమున చూపుచుండెను.

---

—: ౭వ అధ్యాయము ౧వ శ్లోక వ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— శ్లో॥ "యద్భక్తిం న వినా ముక్తి ర్యస్సేవ్య స్సర్వయోగినామ్ । తం వన్దే పరమానన్దఘనం శ్రీనన్దనన్దనమ్"॥ ౧ ॥ ఎవని భక్తి లేనిదే మోక్షము ప్రాప్తింపదో, యెవడు సర్వయోగులచే సేవింపదగినవాడో యట్టి పరమానన్దఘనుడైన శ్రీనన్దనన్దనుని నమస్కరించుచుంటిని.

శాంకరభాష్యమ్:—

మయి వక్ష్యమాణవిశేషణే పరమేశ్వర ఆసక్తం మనో యస్య స మయ్యాసక్తమనా హే పార్థ! యోగం యుంజన్ మనః సమాధానం కుర్వన్ మదాశ్రయో౽హమేవ పరమేశ్వర ఆశ్రయో యస్య స మదాశ్రయో యో హి కశ్చిత్పురుషార్థేన కేనచిదర్థీ భవతి స తత్సాధనం కర్మాగ్నిహోత్రాది తపో దానం వా కించిదాశ్రయం ప్రతిపద్యతే౽యం తు యోగీ మామేవాశ్రయం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్వాధ్యాయాన్తమున "మద్గతేనాన్తరాత్మనా యో భజతే మాం" (మద్గతమగు అంతరాత్మచే నెవడు నన్ను భజించునో) అని చెప్పుటవలన "భగవంతుని తత్త్వ మెట్టిది? ఎట్లు తద్గతాంతరాత్మకలవాడగును? అను ప్రశ్నద్వయమును యర్జును డడుగకుండగనే యా ప్రశ్నద్వయమునుచెప్పనిచ్ఛగలవాడై నా తత్త్వమిట్టిది, ఇట్లు మద్గతాంతరాత్మ కావలెనని వివక్షచేయదలచి శ్రీకృష్ణపరమాత్మ "మయి" అను శ్లోకముమొదలుకొని చెప్ప మొదలిడెను.

ప్రథమషట్కము కర్మము, సంన్యాసము అనెడి సాధనములను ప్రధానముగ బోధించుచున్నది. అట్టి ప్రథమషట్కముచే యోగయుక్తము, జ్ఞేయము నగు త్వంపదలక్ష్యమును వ్యాఖ్యానించి యిపుడు ధ్యేయబ్రహ్మప్రతిపాదనపర మగు ద్వితీయషట్కముచే తత్పదార్థము వ్యాఖ్యానింప దగియున్నది. అందునను "యోగినామపి సర్వేషాం మద్గతే నాన్తరాత్మనా । శ్రద్ధావాన్భజతే యో మాం స మే యుక్తతమో మతః" ॥ అని పూర్వాధ్యాయమునందలి చెప్పబడిన భగవద్భజనముయొక్క వ్యాఖ్యానముకొఱకు సప్తమాధ్యాయము నారంభించుచుండెను.

అందు భగవంతుని యెట్టి రూపము సేవింపదగినది? ఎట్లు తద్గతమై యంతరాత్మ యుండును? అను నీ రెండువిషయములు యర్జును డడుగదగియున్నవి. అర్జును డట్టి ప్రశ్నములను చేయకున్నను శ్రీకృష్ణపరమాత్మ పరమకారుణికుడగుటచే యారెండు విషయములను వివక్షచేయదలచి "మయ్యాసక్త" అను శ్లోకము మొదలుకొని చెప్ప మొదలిడెను.

నిఖిలజగదాయతనత్వాదివివిధవిభూతియుక్తుడగు ఆ పరమేశ్వరునియందు విషయాంతర పరిహారపురస్సరముగ సర్వదా ప్రవేశపెట్టబడిన యంతఃకరణ కలవాడవై, కనుకనే మదేకశరణుడవై, రాజభృత్యుడు రాజాశ్రయుడు, భార్యాదులయిందు దాసక్త మగు మనస్సుకలవాడుఅగును. ముముక్షువన్నచో అట్లుగాక పరమేశ్వరుడేయాశ్రయముగ కలవాడు, పరమేశ్వరునియందే యాసక్తమగుమనస్సు కలవాడు నగును. అట్టి నీవు కాని, నీవంటివాడు కాని షష్ఠాధ్యాయమున చెప్పిన ప్రకారము యోగమును (మనస్సమాధానమును) చేయుచుండినచో సర్వవిభూతిబలశక్త్యైశ్వర్యాదిసంపన్నుడనగు నన్ను సంశయము లేకుండునటుల యెటుల తెలిసికొనునో చెప్పెద వినుము ॥౧॥

శంకరానందీయము:— ఆరవ యధ్యాయముచే జ్ఞానయోగము నధిష్ఠింపవలెనని నిచ్చగించువానికి కర్మయే సాధన మనియు, జ్ఞానయోగారూఢునకు సర్వకర్మసంన్యాసమే సాధనమనియు కర్మకు చిత్తశుద్ధినిగూర్చి, కర్మసంన్యాసమునకు జ్ఞానయోగసిద్ధినికూర్చియు కారణత్వమును చెప్పి యంగములతోటి, లక్షణములతోటి కూడిన యోగమును నిరూపించి. యోగభ్రష్టునకు నాశాశంకను తొలగించి యెవడు బ్రహ్మవేత్తయో వాడు యెల్లపుడు బ్రహ్మనిష్ఠతోడనే యుండవలయు నని చెప్పబడెను. ఇపుడు యేనిష్ఠతో బ్రహ్మవేత్త యుండున్నో

శాంకరభాష్యమ్:—

ప్రతిపద్యతే, హిత్వాఽన్య త్సాధనాన్తరం మయ్యేవాఽఽసక్తమనా భవతి । య స్త్వేవంభూత స్స న్నసంశయం సమగ్రహం సమస్తం విభూతిబలశక్త్యైశ్వర్యాదిగుణసంపన్నం మాం యథా యేన ప్రకారేణ జ్ఞాస్యసి సంశయ మన్తరేణైవమేవ భగవా నితితచ్ఛృణు ఉచ్యమానం మయా ॥౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సకలజగదాయతనత్వాది నానావిధవిభూతులు కల పరమేశ్వరుని యందాసక్తమైన మనస్సుకలవాడవై, అనగా మనస్సును విషయాంతరములయందు పోనీయక నాయందే లగ్నమైనదానినిగ యొనర్చి, పరమేశ్వరునియందే మనస్సు లగ్నమొనరించుటయందు చిత్తసమాధానమే కారణము. అట్టి చిత్తసమాధానరూపమగు యోగము నాచరించువాడవై, పరమేశ్వరరూపమైన నేనే యాశ్రయముగ కలవాడవై, లోకమున నొకానొకడు యేదో యొకపురుషార్థమును కోరువాడై యాపురుషార్థమునకు సాధనమగునట్టి యగ్నిహోత్రాదికర్మనో, తపస్సునో, లేక దానమునో చేయుచుండును. ఈయోగియన్నచో యితరమగు సాధనాంతరములను పరిత్యజించి నన్నే (పరమేశ్వరునే) యాశ్రయముగ పొంది నాయందే యాసక్తమైన మనస్సుకలవాడై యగును. ఇట్టివాడవై సంశయములేకుండునటుల సమస్తవిభూతిబలశక్త్యైశ్వర్యాది గుణసంపన్నుడనగు నన్ను యెటుల తెలిసికొనెదవో నాచే జెప్పబడు యారీతిని వినుము. ॥౧॥

ఆ బ్రహ్మమెట్టిది? ఏమి లక్షణములు కలది? ఎట్లు బ్రహ్మవేత్త యాబ్రహ్మమునందు స్థితిని పొందవలయును? అను యా శంకయందు ఆ బ్రహ్మస్వరూపాదికమును నిరూపించునిమిత్త మీసప్తమాధ్యాయ మారంభింపబడుచుండెను.

అందు మొట్టమొదట యీశ్వరైకశరణుం డగుటచే శుశ్రూషువు, మోక్షార్థి యగువాడు శ్రోతవ్యార్థమునందు సావధానుడై యుండవలయును. అని జ్ఞాపకము చేయుటకు యర్జునుని మదాశ్రయుడవై, నాయందే మనస్సు కలవాడవై నాచేబోధింపబడు విషయమును సావధానము కలవాడవై వినుమని బోధించుటకు "మయి" అను శ్లోకముచే బోధించుచుండెను.

ఎట్లు స్వర్గమును కోరువాడు అగ్నిహోత్రాదికర్మ నాశ్రయించునో, జయమును కోరువాడెట్లు శస్త్రాస్త్రముల నాశ్రయించునో అట్లే "ఈశ్వరానుగ్రహా దేవ పుంసా మద్వైతవాసనా"(ఈశ్వరానుగ్రహమువలననే పురుషుల కద్వైతవాసన సంభవించు) నను స్మృతివలన నాయాశ్రయముచేతనే ముముక్షువునకు జ్ఞానము, తత్సాధనసౌష్కల్యము, మోక్షము నిర్విఘ్నముగ సిద్ధించును. కాన ఓయర్జునునా నీవు ముముక్షువగు యోగివలె సదాత్మయు, సర్వాన్తర్యామియు, భక్తత్రాణపరాయణుడు నగు పరమేశ్వరుడే శరణగా కలవాడవై. వక్ష్యమాణలక్షములు కలవాడును, జ్ఞాతవ్యము నగు పరమాత్మయందే యాసక్తమైన మనస్సు కలవాడవై అనగాపరమేశ్వరలక్షణ పరమేశ్వరతత్త్వ, పరమేశ్వరమహత్త్వవిచార, తదుపగమ, తన్నిశ్చయాదులయందే సంలగ్నమైన మనస్సు కలవాడవై, యితరములయందు మనస్సును పోనీయనివాడవై మాయచే తద్గుణ, తద్ధర్మ, తచ్ఛక్తి,తద్వైభవోపలక్షితము, వస్తుతత్త్వము వలన తద్ధర్మాదిరహితము, నాచే చెప్పబడునట్టిదియునగు పరమాత్మను సంశయము లేకుండునటుల సాక్షాత్కారపర్యవసానముగ నెటుల తెలిసికొనెదవో అనగా "ఇదియే పరతత్త్వము" అని తెలిసికొనుటకు సమర్థుడవగుదువో అట్లు బోధించెదను వినుము. ॥౧॥

శ్రీధరీయము:— "విజ్ఞేయ మాత్మన స్తత్త్వం సయోగం సముదాహృతమ్। భజనీయ మథేదానీ మైశ్వరం రూప మీర్యతే" ॥ (తెలిసికొనదగిన యాత్మతత్త్వము యోగసహితముగ పూర్వమునందు చెప్పఁబడెను. ఈ సప్తమాధ్యాయము మొదలుకొని పదిరెండవ యధ్యాయాంతగ్రంథముచే భజనీయమగు (సేవింపదగిన) ఈశ్వరసంబంధమగు స్వరూపము చెప్పబడుచుండెను. పూర్వాధ్యాయాంతమున "మద్గతేనాంతరాత్మనా, యో మాం భజతే స మే యుక్తతమో మతః" ॥ ఎవడు నన్ను పొందిన యంతరాత్మచే నన్ను సేవించునో అట్టివాడు యుక్తతముడు. అని చెప్పబడెను. అందు ఎవనియందుభక్తి చేయదగినదో, అట్టి నీవుయెట్టివాడ వనుశంకపై భగవత్స్వరూపమును నిరూపింపదలచినవాడై శ్రీకృష్ణపరమాత్మ "మయ్యాసక్తమనాః" అని చెప్ప మొదలిడెను. ॥౧॥

సదానందీయము:— ఘనశ్యామం వామం సతత మభిరామం క్రతుపతిం, శ్రియో ధామా కామం విమలసుఖరామం మునిగతిమ్, సుదామాద్యారామం విధిహరలలామం శ్రుతిమతిం, శ్రయే రామారామం భగవతి విరామం వ్రజరతిమ్ ॥ మిగిలిన వ్యాఖ్యావిశేషము మధుసూదనసరస్వతీయముతో గతార్థము. ॥౧॥

భాష్యోత్కర్షదీపిక:— యతో జాతం యేన స్థిత మిద మశేషం ప్రవిలయం ప్రయా త్యాద్యే యస్మిన్ శ్రుతిభి రుదితే జన్తవ ఇమే। భవ స్త్వేకం బ్రహ్మామల మమృత మారాధ్య య మహం శివం రామం కృష్ణం త మజ మజరం నౌ మ్యఖిలగమ్ ॥

ప్రథమషట్కముచే త్వంపదార్థమును నిరూపించి ద్వితీయషట్కముచే తత్పదార్థమును నిరూపించుటకు యారవయధ్యాయాంతమున "యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా। శ్రద్ధావా న్భజతే యో మాం స మే యుక్తతమో మతః"

"ఎవడు నన్ను పొందిన (నాయందే నిలిపిన) యంతఃకరణచే శ్రద్ధావంతుడై నన్ను భజించునో అట్టివాడు సర్వయోగులలో యుక్తతముడై నాకు సమ్మతుడు" అని చెప్పబడెను. అందు నాతత్త్వ మిట్టిది! ఈతీరుగ మద్గతాంతరాత్మయగును. అను నీవిషయమును చెప్ప నిచ్ఛ కలవాడై శ్రీకృష్ణపరమాత్మ "మయి" అనునది మొదలుకొని చెప్ప మొదలిడెను.

చెప్పబోవు లక్షణములుకల నాయందే (పరమేశ్వరునియందే) యాసక్తమైన మనస్సు కలవాడు. ఓ యర్జునా నాయందే (పరమేశ్వరునియందు) మనస్సు లగ్నమగునటుల చేయుట నీకుసులభమని సూచించుటకు "పార్థ" అని ప్రయోగింపబడెను. మనస్సమాధానమును చేయువాడవై, ఐహికఫలలాభముకొఱకు రాజ్యాదికముగాని, స్వరాదిఫలముకొఱకు యజ్ఞదానాదికముగాని యాశ్రయముగ లేనివాడవై, కేవలము నన్నే యాశ్రయించినవాడవై సంశయము లేకుండునటుల యేతీరున తెలిసికొనెదవో నేను చెప్పబోవు యామార్గమును వినుము.

ఓ శ్రీకృష్ణ! నాయెదురుగ నీవుంటివే! సంశయమేమియు లేకుండగ నిన్ను తెలిసికొనుచుంటినే "అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు" అని చెప్పుట యెట్లు పొసగు ననెదవా? నీ దృష్టికి కనిపించు యీరూపమే నాది కాదు. మరియు నేను సమస్తవిభూతిబలశక్త్యైశ్వర్యాది సకలగుణవిశిష్టుడను. అట్టి సగుణరూపమును నిర్గుణతత్త్వమును యెటులసంశయములేకుండునటుల తెలిసికొనెదవో చెప్పెద వినుము. ॥౧॥

పరమార్థప్రప:— పూర్వాధ్యాయాన్తమువలన "మద్గతే నాంతరాత్మనా" ఇత్యాదికముచే నభ్యసయోగముచే దేహమునం దంతర్యామిగ నున్న స్వస్వరూపముయొక్క ప్రతీతిని. (జ్ఞానమును) చెప్పి యిపుడు సర్వాత్మకముగ నున్న పరమాత్మయొక్క ప్రతీతికి సాధనోపాయమును చూపించుచు యీశ్వరసంబంధమగు మాయా వైభవమును "మయి" అను శ్లోకము మొదలుకొని ప్రకటనచేయుచుండెను. ॥౧॥

గీ॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః ।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్ఞాతవ్య మవశిష్యతే ॥౨॥

పదవిభాగము:— జ్ఞానం- తే- అహం-సవిజ్ఞానం- ఇదం-వక్ష్యామి- అశేషతః-యత్-జ్ఞాత్వా-న-ఇహ-భూయః-అన్యత్-జ్ఞాతవ్యం-అవశిష్యతే- ॥౨॥

ప్రతిపదార్థము:— యత్=ఏజ్ఞానమును; జ్ఞాత్వా=తెలిసికొని; ఇహ=ఈజన్మమునందు: భూయః=తిరిగి; జ్ఞాతవ్యం=తెలిసికొనదగిన పురుషార్థసాధనము; నావశిష్యతే=మిగిలియుండదో: ఇదం=ఈచెప్పబోవు: సవిజ్ఞానం=స్వానుభవముతోగూడిన; జ్ఞానం=అపరోక్షరూపమగు మద్విషయకజ్ఞానమును, (చైతన్యమును) తే=నీకొఱకు, అశేషతః=సంపూర్తిగ, అహం=నేను, వక్ష్యామి=చెప్పగలను. ॥౨॥

శాంకరభాష్యమ్:—

జ్ఞాన మితి॥ తచ్చ మద్విషయం జ్ఞానం తే తుభ్య మహం సవిజ్ఞానం విజ్ఞానసహితం స్వానుభవయుక్త మిదం వక్ష్యామి కథయిష్యా మ్యశేషతః కార్త్స్న్యేన। త జ్జ్ఞానం వివక్షితం స్తౌతి-

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మొదటి శ్లోకమున "జ్ఞాస్యసి" అని చెప్పబడెను. ఆజ్ఞానము పరోక్షమా? అను శంక జనింపక మానదట్టిశంక జేయరాదు. ఏలన నాజ్ఞానము పరమేశ్వరవిషయకము, అపరోక్షము, స్వానుభవయుక్తముఅగునది అట్టి జ్ఞానమును సంపూర్ణముగ నీకొఱకు చెప్పగలను. అట్టి విజ్ఞానసహితమగు జ్ఞానము సంభవించిన నేమి ఫలము ప్రాప్తించు ననెదవా? అను శంకపై జ్ఞానఫలమును యుత్తరార్ధముచే జెప్పుచుండెను. ఇట్టి ఫలప్రదర్శనముచె జ్ఞానమును స్తుతించుచుండెను. అద్దాని

—: ౭వ అధ్యాయము ౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— పూర్వశ్లోకమున "యథా జ్ఞాస్యసి" అని చెప్పబడెను. "జ్ఞాస్యసి" అనగా తెలిసికొనగలవో అని యర్థము. తెలిసికొనడ మనగా జ్ఞానమని కదా. ఆ జ్ఞానము పరోక్షమా? యను శంకను తొలగించుచు యర్జునుని యభిముఖీకరణముకొఱకు "జ్ఞానం" అను దానిచే యాజ్ఞానమును స్తుతించుచుండెను.

సంశయము, అసంభావన, విపరీతభావన అనెడి ప్రతిబంధములచే ఫలజనకము కాని జ్ఞానము పరోక్ష మనంబడును. సంశయాసంభావనావిపరీతభావనలను తొలిగించిన విచారపరిపాకాన్తమున నాప్రమాణముచే జనించిన జ్ఞానము ఫలమును కలుగజేయుచు, యపరోక్ష మనబడును. విచారపరిపాకముచే జనించునదగుటచే యాజ్ఞానమే విజ్ఞాన మనబడును. అట్టి విజ్ఞానముతో గూడిన నాఆత్మవిషయకమగు శాస్త్రజనితమైన యపరోక్షజ్ఞానమును నీకొరకు నేను సాధనఫలాదిసహిత మగుటచే నిరవశేషముగ చెప్పెద.

శ్రుతిసిద్ధమైన యేకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానప్రతిజ్ఞ ననుసరించుచు "యజ్జ్ఞాత్వా" అని చెప్పుచుండెను. నిత్యచైతన్యరూపమగు యేజ్ఞానమును వేదాన్తజన్యమనోవృత్తి విషయమునుగ జేసుకొనినచో యీ వ్యవహారభూమియందు తిరిగి యితరమైన దేదియు తెలిసికొనదగినది కొంచమైన మిగిలియుండదు. ఎందువలననిన:— సర్వకల్పనాధిష్ఠానము సన్మాత్రము. అట్టి సన్మాత్రజ్ఞానముచే కల్పితములన్నియు బాధితములగును. ఇక సన్మాత్రమే మిగిలియుండును. అట్టి సన్మాత్రజ్ఞానముచే నీవు కృతార్థుడవు కాగలవని యభిప్రాయము. ॥౨॥

శాంకరభాష్యమ్:—

శ్రోతు రభిముఖీకరణాయ । యజ్జ్ఞాత్వా యజ్జ్ఞానం జ్ఞాత్వా నేహ భూయః పున ర్జ్ఞాతవ్యం పురుషార్థసాధన మవశిష్యతే నావశేషో భవతీతి । మత్తత్త్వజ్ఞో యః స సర్వజ్ఞో భవతీత్యర్థః । అతో విశిష్టఫలత్వా ద్దుర్లభం జ్ఞానమ్॥ ॥ ౨ ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వలన శ్రోత యభిముఖుడగును. ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానప్రతిజ్ఞ నాశ్రయించి యుత్తరార్థము చెప్పబడెను. ఏయపరోక్షరూపమగు జ్ఞానమును తెలిసికొని యీలోకమున కాని, యీశరీరమునందు కాని, తిరిగి తెలిసికొనదగిన పురుషార్థసాధన ముండదో యట్టి జ్ఞానమును చెప్పెదను. ఎవడు తత్త్వజ్ఞుడో వాడు సర్వజ్ఞుడు. కాన జ్ఞానము విశేషఫలము కలదగుటచే దుర్లభము. ॥ ౨ ॥

శంకరానందీయము:— శ్రీకృష్ణపరమాత్మ దేనిని యుపదేశించెద నని ప్రతిజ్ఞ చేసెనో అట్టి పరమాత్మజ్ఞానమునే "జ్ఞానం తేఽహం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

నా యుపదేశానంతర క్షణమున కలిగెడి యనుభవసంయుక్తమగు పరమాత్మవిషయకమైన జ్ఞానమును, ఎంత యుపదేశముచే వస్త్వనుభవముకలుగునో అంతయు నిరవశేషముగ నుపదేశించెదను.

నాచే యుపదేశింపబడిన జ్ఞానమును పొంది యీ బ్రహ్మవిషయమున తిరిగి పొందతగిన యితరపురుషార్థసాధన మపేక్షింపబడదు. దీనిచేతనే కృతార్థుడవు కాగలవు.

లేక:— నేను జగద్గురువును. అట్టి నేను ముముక్షువు శుద్ధాత్మ యగు నీకొఱకు "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" అను శ్రుతిప్రతిపాదితమైన జ్ఞానైకస్వరూపము, విద్వాంసులచే ప్రత్యక్షముగ ననుభూయమానము, అహ మర్థమగుటచే సాక్షాదపరోక్షరూపము, ఇదంతయానిర్దిష్టము నగు బ్రహ్మమును విజ్ఞానసహితముగ అనగా నట్టి బ్రహ్మానుభవము యెట్లుకలుగునో యట్లు సంపూర్ణముగ నుపదేశించెదను, అట్లుపదేశించిన ఫలమేమనిన! అట్టిపరమాత్మజ్ఞానము కలిగినచో "యేనాశ్రుతం శ్రుతం భవ త్యమతం మత మవిజ్ఞాతం విజ్ఞాతమ్, "కస్మి న్భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి" అనుశ్రుతివలన సిద్ధమైన యేకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము శ్రూయమాణ మగుటవలన విద్వాంసునకు తెలిసికొనదగిన దేదియు యితర ముండదు. అనగా నెవడు నాతత్త్వము తెలిసికొనునో వాడు సర్వజ్ఞుడని యర్థము. ॥ ౨ ॥

శ్రీధరీయము:— ఇచట జ్ఞాన మనగా శాస్త్రజన్యమని యర్థము. విజ్ఞానమనగ ననుభవము. మద్విషయమైన యనుభవముతో గూడిన జ్ఞానమును సంపూర్ణముగ నీకొఱ కుపదేశించెదను. దీనిని తెలిసికొని శ్రేయోమార్గమునం దుండినవానికి తిరిగి తెలిసికొనదగిన దేదియు లేదు. నాయుపదేశము మాత్రముచేతనే కృతార్థుడగు నని యర్థము. ॥ ౨ ॥

భాష్యోత్కర్షదీపిక:— పూర్వమునందు "జ్ఞాస్యసి" అని చెప్పబడెను. ఇపుడా జ్ఞానమునే "జ్ఞానం తేఽహం" అను శ్లోకముచే స్తుతించుచుండెను.

ఈ శ్లోకభాష్యమునందు మద్విషయకమైనట్టియు, స్వానుభవయుక్తమైన జ్ఞానమును సంపూర్ణముగ చెప్పగలనని చెప్పి శ్రోతయొక్క యాభిముఖ్యము కొఱకు వివక్షితమైన యా జ్ఞానమును "యజ్జ్ఞాత్వా" అను నుత్తరార్థముచే స్తుతించుచుండెను, పూర్వమునందు "జ్ఞాస్యసి" అని చెప్పుటచే "యాజ్ఞానము పూర్వోక్త

గీ॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే ।
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః ॥3॥

పదవిభాగము:— మనుష్యాణాం-సహస్రేషు-కః-చిత్-యతతి-సిద్ధయే-యతతాం- అపి-సిద్ధానాం-కః-చిత్-మాం-వేత్తి-తత్త్వతః- ॥3॥

ప్రతిపదార్థము :— మనుష్యాణాం=మనుష్యులయొక్క, సహస్రేషు=అనేక వేలలో, కశ్చిత్=ఒకానొకడే, సిద్ధయే=సిద్ధికొఱకు, (మోక్షముకొఱకు) యతతి=ప్రయత్నించును, యతతాం=ప్రయత్నించునట్టి, సిద్ధానామపి=సిద్ధులలోను, కశ్చిత్=ఒకానొకడే, తత్త్వతః=యథార్థముగ, మాం=నన్నును, వేత్తి=తెలిసికొనును. ॥3॥

---

జ్ఞానమా!” అనుశంక జనించును. అట్టిశంకను తొలిగించుటకు భాష్యమునందు “తచ్చ జ్ఞానం మద్విషయం” అని వివరించెను. ఈ చెప్పుటవలన ప్రథమశ్లోకమునందుగల “జ్ఞాస్యసి” అను దానిచే యపరోక్షజ్ఞానమే వివక్షితమైనది.

“ఇదం జ్ఞానం” ఈ అపరోక్షజ్ఞానము. అనగా చైతన్యము. విజ్ఞానముతో గూడిన యట్టి చైతన్యము యొక్క సాక్షాత్కారమగుచో నేమి ఫలము ప్రాప్తించు నను శంకను తొలిగించుటకు “యజ్జ్ఞాత్వా” అను నీ శ్లోకోత్తరార్థమును చెప్పెను. “ఇదం” అను దానిచే చైతన్యమునకు పరోక్షత్వము తొలిగించబడుచుండెను. ఈ విషయమే “సవిజ్ఞానం” అను దానిచే స్పష్టపరుపబడెను. “జ్ఞానం” అనగా “సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ” “విజ్ఞాన మానన్దం బ్రహ్మ” ఇత్యాది శ్రుతిబోధితమగు శుద్ధప్రజ్ఞానబ్రహ్మమును సాధన కలాపసహితముగ నీకొఱకు చెప్పగలను.

శబ్దమునకు పరోక్షజ్ఞానజనకత్వము స్వభావముకదా! నీ యుపదేశవాక్యములవలన కలిగెడి జ్ఞానము పరోక్షమే యగును కాని యపరోక్ష మెట్లగును? అను శంకను తొలిగించుటకు “సవిజ్ఞానం” అని చెప్పబడెను. “దశమ స్త్వమసి” అను వాక్యమువలన సన్నికృష్టవస్తుస్థలమున శబ్దమువలన యపరోక్షజ్ఞానము గూడ జనించుటచే శ్రీకృష్ణోపదేశమువలన నపరోక్షజ్ఞానము జనించును. కాన పూర్వోక్తాశంకకు తావు లేదు. అని కొందఱు వ్యాఖ్యానించిరి. ఇట్టి వ్యాఖ్యానము “తచ్చ మద్విషయం జ్ఞానం” అను భాష్యమువలన భాష్యకారుల కభిప్రేతముకాదు. కాన తద్భాష్యానురోధముచే “జ్ఞానం” అనుదానికి శాస్త్రజన్యజ్ఞానమనియు, “విజ్ఞానం” అనుదాని కనుభవము అనియే వ్యాఖ్యానింప నగును. ॥2॥

## —: 7వ అధ్యాయము 3వ శ్లోక వ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— నా యనుగ్రహము లేనిదే మహాఫలమగు జ్ఞాన మతిదుర్లభము. ఎందువలననిన? శాస్త్రీయజ్ఞానకర్మయోగులగు ననేకులలో యనేకజన్మకృతసుకృతపుంజపరిపాకముచే పొందబడిన నిత్యానిత్యవివేకముకల యొకానొకడే సత్త్వశుద్ధిద్వారమున జ్ఞానోత్పత్తికొఱకు ప్రయత్నించును. జ్ఞానముకొఱకు ప్రయత్నించునట్టియు పూర్వజన్మకృతసుకృతవిశేషముకల సాధకులలో యొకానొకడే శ్రవణమనననిదిధ్యాసల పరిపాకాన్తమున “మాం” పరమేశ్వరుని గురూపదిష్టమగు “తత్త్వమసి” ఇత్యాది మహావాక్యములవలన ప్రత్యగభిన్నముగ దెలిసికొనును. అనేక మనుష్యులలో ఆత్మజ్ఞానసాధనముల ననుష్ఠించువాడు పరమదుర్లభుడు. అట్టి సాధనముల ననుష్ఠించువారలలో ఫలమును పొందువాడు పరమదుర్లభుడు. కాన నీ జ్ఞానముయొక్క మాహాత్మ్య మేమి చెప్పవలెను! చెప్పుట కనువు కానిదని యభిప్రాయము. ॥3॥

శాంకరభాష్యమ్:—

కథ మిత్యుచ్యతే- మనుష్యాణా మితి। మనుష్యాణాం మధ్యే సహస్రేషు అనేకేషు కశ్చిద్యతతి ప్రయత్నం కరోతి సిద్ధయే సిద్ధ్యర్థం, తేషాం యతతా మపి సిద్ధానాం సిద్ధా ఏవ హి తే యే మోక్షాయ యతన్తే తేషాం కశ్చిదేవ మాం వేత్తి తత్త్వతో యథావత్ ॥౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జ్ఞానమునకు దుర్లభత్వ మెట్టిదనిన చెప్పెద వినుము. అనేకమంది మనుష్యులలో యెవడో యొకానొకడే మోక్షముకొఱకు ప్రయత్నించును. ఇట్టి ప్రయత్నము చేయు వారలందరు సిద్ధులే. ఇట్టి వారలలో యెవడో యొకానొకడే యథార్థముగ నన్ను తెలిసికొనును. ॥౩॥

శంకరానందీయము:— బ్రహ్మము అహమర్థమగుచో నంతటను "బ్రహ్మైవాహ మస్మి" అను జ్ఞానము యెందులకు కలుగదనెదవా? సత్యమే కలుగదు, విచారింప "యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ" అను శ్రుతియు బ్రహ్మము సాక్షా దపరోక్షమనియే చెప్పుచున్నది, అయనను యనేకజన్మార్జిత పుణ్యపుంజముచే జనించిన చిత్తపరిపాకమువలన పుట్టిన వివేక, వైరాగ్య, శమ, దమ, సంన్యాసాద్యుత్తమ సాధన సంపత్తి కలిగి పరమేశ్వరానుగ్రహపాత్రులైన వారలకే శ్రవణమననాదులచే బ్రహ్మపరోక్షజ్ఞానము సిద్ధించును. కాని మలినచిత్తులు, ఈశ్వరకృపాదూరవర్తులు, కామాగ్నిదందహ్యమానులు నగు వారలకు మాత్రము- సూర్యుని ప్రభ యంధులకువలె బ్రహ్మము సర్వగతమైనను తజ్జ్ఞానము దుర్లభము అని "మనుష్యాణాం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ఈ శ్లోకమున "మనుష్యాణాం" అని చెప్పుటచే మనుష్యులకంటె వేరగువారలకు (పశుపక్ష్యాదులకు) బంధమోక్షజ్ఞానము లేదని సూచింపబడెను. కాన మనుష్యులకే బంధమోక్షజ్ఞానశాస్త్రతదర్థగ్రహణాధికారము. అందుచే మనుజత్వమును పొందినవారలు మోక్షముకొఱకు ప్రయత్నింపవలయును. అందునను బ్రాహ్మణత్వమును పొందినవారలు తప్పక మోక్షముకొఱకు ప్రయత్నింపవలయును. అని సూచించుటకు యీశ్లోకమున "మనుష్యాణాం" అనిచెప్పబడెను.

మనుష్యులలోఁగూడ పాపపూరితదేహముకలవార లందరును ముక్తికి యోగ్యులు కారని సూచించుటకిట "సహస్రేషు" అని చెప్పబడెను. దేవకృపైకలభ్యమగు మోక్ష మతిదుర్లభము కాన "సహస్రేషు" అనుపదము అయుత, నియుత, లక్షల కుపలక్షణము. అనగా సహస్రము, అయుతము, నియుతము లక్షలలో యెవడో యొకానొకమనుష్యుడు మోక్షైక కామనచే శ్రద్ధాభక్తులచేతను, యీశ్వరార్పణబుద్ధిచే ననేకజన్మార్జితకర్మపుణ్యపరిపాకమువలన పరిశుద్ధాంతఃకరణము కలవాడై, వివేకవైరాగ్యశమదమాద్యుత్తమసాధన సంపన్నుడై జ్ఞానసిద్ధికొఱకు నిత్యనిరన్తరశ్రవణాదినిష్ఠతో ప్రయత్నించును. ఎవని చిత్తము దృష్టాదృష్టసర్వవిషయములందు వైముఖ్యమును పొంది శ్రవణమననిదిధ్యాసలయందే నిలుచునో అట్టివాడే సిద్ధుడనబడును. ఇట్టి పూర్వోక్తలక్షణసంపన్నులు, కేవలజ్ఞానసిద్ధికొఱకే శ్రవణాద్యేకనిష్ఠులగు సిద్ధులలోను వేలు కోటిపర్యంతులలోను యెవడో యొకానొకడే గుర్వాత్మేశ్వరసుప్రసాదసంపన్నుడై నిత్యనిరంతరనిర్వికల్పకసమాధినిష్ఠాపరిశ్రాంతుడగు బ్రహ్మవిదుత్తముడే "వాసుదేవ స్సర్వమిదం" అని సాక్షాత్తు నన్ను ఆనందైకరసస్వరూపము, చిద్ఘనము, అద్వితీయము, నగు పరబ్రహ్మనుగ దెలిసికొనును.

విష్ణువును, రాముని, కృష్ణదేవుని మనుష్యాదులు తెలిసికొనుచుండ నొకానొకడే నన్ను తెలిసికొనునని చెప్పుట యెట్లు పొసగుననెదవా? దేవమనుష్యాదులు తెలిసికొనుట యథార్థమే. కాని వారలు నన్ను అయథాభూతస్వరూపముగనే స్వతః భిన్నునిగ, పరిచ్ఛిన్నునిగ దెలిసికొనుచుండిరి. యథార్థస్వరూపమును దెలిసి

గీ॥ భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా॥ ॥౪॥

ప ద వి భా గ ము :— భూమిః–అపః–అనలః–వాయుః–ఖం–మనః–బుద్ధిః–ఏవ–చ– అహంకారః–ఇతి–ఇయం–మే–భిన్నా–ప్రకృతిః–అష్టధా॥ ॥౪॥

ప్ర తి ప దా ర్థ ము :— భూమిః=పృథివీతత్త్వము, అపః=జలతత్త్వము, అనలః=అగ్నితత్త్వము, వాయుః=వాయుతత్త్వము; ఖం=ఆకాశతత్త్వము; మనః=మనఃకారణమగునట్టియహంకారము; బుద్ధిరేవచ=అహంకారకారణమగుమహత్తత్త్వము; అహంకారః=అవిద్యాత్మకమగునవ్యక్తము; ఇతి=ఇట్టిదియగు; మే=నాయొక్క; ప్రకృతిః=మాయాశక్తి; అష్టధా=ఎనిమిదివిధములు; భిన్నా=వేరైయున్నది. ॥౪॥

శాంకరభాష్యమ్:—

శ్రోతారం ప్రరోచనే నాభిముఖీకృత్యాహ- భూమి రితి । భూమి రితి పృథివీతన్మాత్ర ముచ్యతే న స్థూలా । "భిన్నా ప్రకృతి రష్టధా" ఇతి వచనాత్ । తథాఽబాదయోఽపి తన్మాత్రాణ్యేవోచ్యన్తే । ఆపోఽనలో వాయుః ఖం మన ఇతి మనసః కారణ మహంకారో గృహ్యతే।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జ్ఞానార్థము ప్రయత్నము, ప్రయత్నద్వారమున జ్ఞానలాభము, ప్రయత్నజ్ఞానద్వారమున ముక్తియు దుర్లభ మని చెప్పుటకు శ్రోతృప్రరోచనమే ఫల మని తలచి ప్రరోచనముచే శ్రోత యగు యర్జునుని యభిముఖునిగ జేసుకొని తాను సర్వాత్మకుడగుటచే పరి

కొనుటలేదు. కనుకనే "కశ్చి న్మాం వేత్తి తత్త్వతః" అని చెప్పుచుండెను, "ఏతస్మి న్నదృశ్యేఽనాత్మ్యే" ఇత్యాది శ్రుతులచే దృశ్యత్వవైశిష్ట్యరహితునిగ చెప్పబడిన మాయాతత్కార్యలేశసంబంధశూన్యుని, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుని, ఆనందైకతనువును, అద్వితీయపరబ్రహ్మము నగు నన్ను బ్రహ్మవిదుత్తము డొకడే తన యాత్మస్వరూపముగ సాక్షాత్తు తెలిసికొనును. ఇతరు డెవడును తెలిసికొనలేడు.

ఈ చెప్పుటవలన దేలిన యాశయ మేమన: బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులలో నాలుగువర్ణముల వారికి ముముక్షుత్వము, చిత్తశుద్ధి, జ్ఞానోద్దేశముగ నియతశ్రవణాదిప్రవృత్తి, తత్సముత్పన్న సమ్యగ్జ్ఞానసిద్ధి, తదేకద్వారమున ముక్తియు సిద్ధించునుగాని యందు నాల్గువర్ణముల వారిలోను పూర్వపూర్వవర్ణములవారలకు సిద్ధించునటుల యుత్తరోత్తర వర్ణములవారలకు సిద్ధింపనేరదు. అనగా బ్రాహ్మణక్షత్రియవైశ్యాపేక్షచే శూద్రున కతిదుర్లభము. బ్రాహ్మణక్షత్రియాపేక్షచే వైశ్యున కతిదుర్లభము, బ్రాహ్మణాపేక్షచే క్షత్రియున కతిదుర్లభము. బ్రాహ్మణునికి సులభమైనటుల క్షత్రియునకు సులభసాధ్యము కాదు. క్షత్రియునకు సులభమైనంత వైశ్యునకు సులభసాధ్యము కాదు. వైశ్యునకు సులభమైనటుల శూద్రునకు సులభసాధ్యము కాదని సూచింపబడెను. కాన వివేకవంతులకు ప్రయత్నపూర్వకముగ పూర్వోక్తసాధనసంపత్తిచే ముక్తి సంపాదింపతగినది. ॥3॥

—• ౭వ అధ్యాయము ౪వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మ ధు సూ ద న స ర స్వ తీ య ము :— ఇట్లు శ్రోతయగు యర్జునుని ప్రరోచనద్వారా యభిముఖునిగ జేసుకొని సర్వాత్మకు డగుటచే తన (శ్రీకృష్ణపరమాత్మ) యొక్క పరిపూర్ణత్వమును చెప్పదలచి మొట్టమొదట అపరాప్రకృతిని "భూమి రాపః" అను శ్లోకముచే నుపన్యసించుచుండెను.

శాంకరభాష్యమ్:—

బుద్ధి రిత్యహంకారకారణం మహత్తత్త్వం । అహంకార ఇత్యవిద్యాసంయుక్తమవ్యక్తమ్ । యథా విషసంయుక్త మన్నం విష ముచ్యత ఏవ మహంకారవాసనావదవ్యక్తం మూలకారణ మహంకార ఇత్యుచ్యతే । ప్రవర్తకత్వా దహంకారస్య । అహంకార ఏవ హి సర్వస్య ప్రవృత్తిబీజం దృష్టం లోకే । ఇతీయం యథోక్తా ప్రకృతి ర్మే మమైశ్వరీ మాయాశక్తి రష్టధా భిన్నా భేద మాగతా॥ ॥౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్ణత్వము నవతరింపజేయుచు మొట్టమొదట యపరాప్రకృతిని "భూమిః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ఇచట భూమి శబ్దముచే "భిన్నా ప్రకృతి రష్టధా" అను ముందు వాక్యానురోధముచే పృథివీతత్త్వము చెప్పబడును. స్థూలపృథివిమాత్రము చెప్పబడదు. అట్లే అబాదిశబ్దములచే తన్మాత్రలే చెప్పబడును. అనగా "అపః" జలతన్మాత్రము. "అనలః" అగ్నితన్మాత్రము. "వాయుః"

సాంఖ్యులు:— పంచతన్మాత్రలు, అహంకారము, మహత్తత్త్వము, అవ్యక్తము యీ యెనిమిదిన్ని ప్రకృతులు. అయిదు మహాభూతములు, అయిదు కర్మేంద్రియములు, అయిదు జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియజ్ఞానేంద్రియసాధారణమగు మనస్సు యీ పదునారున్ను వికారములనియు, పైవాటి నన్నిటిని సమిష్టిగ లెక్కించిన యిరువదినాలుగు తత్త్వములనియు జెప్పెదరు. ఈ శ్లోకమునందు గల "భూమిః, అపః, అనలః, వాయుః, ఖం" అను యయిదు శబ్దములు లక్షణావృత్తిచే పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనెడి పంచమహాభూతముల సూక్ష్మావస్థారూపమగు గంధరసరూపస్పర్శశబ్దస్వరూపమైన పంచతన్మాత్రలను బోధించును. బుద్ధ్యహంకారశబ్దములు స్వార్థ (బుద్ధ్యహంకార) ములనే బోధించును. మనశ్శబ్దము "ప్రకృతిరష్టధా" అను స్థలమునందుగల ప్రకృతిశబ్దార్థముతో నభేదసంబంధముచే నన్వయించి యర్థమును బోధించుటచే స్వార్థమును విడచి లక్షణావృత్తిచే నవ్యక్తమును బోధించుచున్నది. లేక మనశ్శబ్దము పంచతన్మాత్రసంబంధము వలన మనఃకారణమగు నహంకారమును బోధించును. బుద్ధిశబ్దము యహంకారకారణమగు మహత్తత్త్వమును ముఖ్యవృత్తి (శక్తి) చే బోధించును. అహంకారశబ్దము ప్రవర్తకత్వాద్యసాధారణధర్మసంబంధమువలన సర్వవాసనావాసితమగు అవిద్యాత్మకమైన యవ్యక్తమును లక్షణావృత్తిచే బోధించుచున్నది. పైన చెప్పబడిన విధమున ప్రకృతి సాక్షిభాస్యమగుటవలన యపరోక్షరూపమై మాయ యని పేరుగలదై, పరమేశ్వరసంబంధశక్తియై, అనిర్వచనీయస్వభావముకలదై, త్రిగుణాత్మికయై, యెనిమిదివిధములుగ భిన్నమై యున్నది. నిఖిలజడవర్గము యీప్రకృతియందే యంతర్భవించుచున్నది. యని పైశ్లోకతాత్పర్యము. ॥౪॥

శంకరానందీయము:— బ్రహ్మ మెట్టిది? ఏలక్షణము కలది? అను ప్రశ్నకు సమాధానముగ "జ్ఞానం తేఽహం సవిజ్ఞానం" అనిబ్రహ్మమునకు జ్ఞానస్వరూపత్వము లక్షణ మని చెప్పి ప్రస్తుతము "తదనన్యత్వ మారంభణశబ్దాదిభ్యః" "వాచారంభణం వికారో నామధేయం," ఇత్యాదిశబ్దములవలన జగత్తు బ్రహ్మము కంటె యనన్యమనియు బోధించు సూత్రమువలనను, "సర్వంఖల్విదంబ్రహ్మ" అను శ్రుతివలనను నిఖిల జగత్తు బ్రహ్మకార్య మగుటవలనను, బ్రహ్మవివర్త మగుటవలనను నిఖిలజగత్తు బ్రహ్మస్వరూపమే యని బోధించుటకున్ను, నిర్వికారుడైన బ్రహ్మమునకు ప్రకృతిద్వారమున జగత్కారణత్వ సిద్ధికొఱకు మొట్టమొదట అపరాప్రకృతిని "భూమిరాపః" అను దానిచే నిర్దేశించుచుండెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—
వాయుతన్మాత్రము, సంకల్పవికల్పాత్మక మగు మనస్సు అహంకారము లేనిదే సంభవింపనందున మనఃకారణ మగు యహంకారమును మనశ్శబ్దముచే గ్రహింపనగును. బుద్ధిశబ్దముచే నహంకారకారణమగు మహత్తత్త్వమును గ్రహింపవలయును. విషసంయుక్తాన్నము విషమని చెప్పబడినట్లు యహంకారవాసనాయుతము, మూలకారణము నగు (లోకమున యహంకారమే సర్వమునకు బ్రవృత్తిబీజముగాన నట్టి యహంకారమునకు ప్రవర్తకమగు) యహంకార మవ్యక్తమని చెప్పబడును. కాన నిచట నుండు అహంకారశబ్దముచే యవిద్యాత్మకమగు నట్టి యవ్యక్తము చెప్పబడును. ఈచెప్పుటవలన తేలిన యాశయమేమి? పృథివీతన్మాత్రము 1, జలతన్మాత్రము 2, తేజస్తన్మాత్రము 3, వాయుతన్మాత్రము 4, ఆకాశతన్మాత్రము 5, మనఃకారణమగునట్టి యహంకారము 6, అహంకారకారణమగు మహత్తత్త్వము 7, అవిద్యాత్మకమగు నట్టి యవ్యక్తము8, అని నాసంబంధమగు యపరాప్రకృతి యెనిమిది విధములుగ భిన్నమై యున్నది. ॥౪॥

"భిన్నా ప్రకృతి రష్టధా" అని భూమిలగాయతు యెనిమిదింటికి ప్రకృతిత్వము జెప్పుటవలన ఇచట "భూమిః" అను మొదలగు శబ్దములచే గంధాదిన్మాత్రస్వరూపమగు కారణాత్మకమైన సూక్ష్మములు గ్రహింపనగును. "మహదాద్యాః ప్రకృతివికృతయః సప్త" అను కారికచే మహదాదులకు వికృతిత్వము చెప్పబడుచుండ ప్రకృతిత్వ మెటుల సంభవించు నని శంకింపజనదు. మహదాదులుగూడ జగదారంభకములగుటచే ప్రకృతిత్వము సంభవించును. అట్లే "ఆపః" రసతన్మాత్రలు, "అనలః" రూపతన్మాత్ర, "వాయుః" స్పర్శతన్మాత్ర, "ఖం" శబ్దతన్మాత్ర, "మనః" సంకల్పవికల్పము లహంకారప్రధానమగుటవలన మనశ్శబ్దముచే సంకల్పవికల్పాత్మకమగు మనస్సునకు కారణమగునట్టి యహంకారమును మనశ్శబ్దముచే గ్రహింపనగును. బుద్ధిశబ్దముచే సర్వసమిష్టియగు మహత్తత్త్వమును లక్షణచే గ్రహింపవలయును. "అహంకారః" అను శబ్దముచే అహంకారవాసనావిశిష్టమగు నవిద్యాత్మకమైన యవ్యక్తము చెప్పబడుచున్నది. బీజమునందు శాఖాపర్ణపుష్పవాసనలువలె సర్వకారణమగు యవ్యక్తమునందు మహదాదిసర్వవికారవాసనలు సంభవించుటవలన "కారణగుణా హి కార్యగుణా నారభన్తే" (కారణగుణములు కార్యగుణములను పుట్టించును.) అను న్యాయమువలన నీ ప్రకృతి కార్యైకవేద్యమై పైని జెప్పినవిధమున నెనిమిదివిధములై నిర్గుణుడైనను పరమాత్మకు ప్రకృతిగుణద్వారమున సగుణత్వమునందు సృష్టిస్థితిలయకారణత్వమునందు యుపాధి యగుచున్నది. దేని కార్యమగునీ జగజ్జాలమంతయు మరుమరీచికాకల్పమో అట్టి ప్రకృతి "మాయాం తు ప్రకృతిం విద్యాత్" అను శ్రుతిప్రసిద్ధమైనది. ॥౪॥

భాష్యోత్కర్ష దీపిక:— "యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్జ్ఞాతవ్య మవశిష్యతే" అని చెప్పుటచే శ్రోతయగు యర్జునుని యభిముఖముగ జేసుకొని తదుపపత్తికొఱకు (దేనిని తెలిసికొనుటచే తెలిసికొనునది మిగిలియుండదో అనుదాని యుపపత్తికొఱకు) చేతనాచేతనప్రపంచము తనయం దధ్యస్తమని బోధించుటకొఱకు "భూమి రాపః" అని చెప్ప మొదలిడెను.

"ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా" అను వాక్యశేషమువలన ఆకాశాదిశబ్దములచే శబ్దస్పర్శరూపరసగంధములనెడి తన్మాత్రలు లక్షణావృత్తిచే గ్రహింపనగును. మనశ్శబ్దముచే మనఃకారణమగు యహంకారమును గ్రహింపవలయును. బుద్ధిశబ్దముచే నహంకారకారణమగు మహత్తత్త్వమును గ్రహింపవలయును. విషమి

గీ॥ అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్॥ ॥౫॥

పదవిభాగము:— అపరా- ఇయం- ఇతః- తు- అన్యాం- ప్రకృతిం- విద్ధి- మే- పరాం- జీవభూతాం- మహాబాహో- యయా- ఇదం- ధార్యతే- జగత్॥ ॥౫॥

ప్రతిపదార్థము:— ఇయం=ఈయెనిమిదివిధములగుప్రకృతి; అపరా=నికృష్టమైనది; హే మహాబాహో!=ఓ గొప్పబాహువులుకల యర్జున!; యయా=ఏప్రకృతిచే; ఇదం=ఈ; జగత్=జగత్తు, ధార్యతే=ధరింపబడుచున్నదో? ఇతః=ఈఅష్టవిధములగుప్రకృతికంటె; అన్యాం=భిన్నమైనట్టిన్ని; జీవభూతాం=ప్రాణధారణనిమిత్తమైనట్టి; మే=నాయొక్క; ప్రకృతిం=ప్రకృతిని; పరాం=ఉత్కృష్టమైనదానినిగ; విద్ధి=తెలిసికొనుము;॥౫॥

శాంకరభాష్యమ్:—

అపరేతి । అపరా న పరా నికృష్టాఽశుద్ధాఽనర్థకరీ సంసారబంధనాత్మికేయ మితోఽస్యా యథోక్తాయా స్త్వన్యాం విశుద్ధాం ప్రకృతిం మమాత్మభూతాం విద్ధి మే పరాం ప్రకృష్టాం జీవభూతాం క్షేత్రజ్ఞలక్షణాం ప్రాణధారణనిమిత్తభూతాం హే మహాబాహో! యయా ప్రకృత్యేదం ధార్యతే జగ దన్తఃప్రవిష్టయా॥ ॥౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అచేతనవర్గము నేకీభావ మొనరించుటకు ప్రకృతి కష్టవిధత్వమును చెప్పి వికారావచ్ఛిన్న (వికారవిశిష్ట) కార్యకల్పమగు చేతనవర్గము నేకీభావ మొనరించుట కవిద్యాశక్త్యవచ్ఛిన్నుడగు

శ్రితమైన యన్నమును విషముఅని చెప్పువిధమున అహంకారవాసనావిశిష్టమగు నవ్యక్తము అహంకారమని చెప్పబడును. కాన అహంకారశబ్దముచే నవిద్యాసమ్మిశ్రితమగు నవ్యక్తమును గ్రహింపవలయును. ఇట్లు శబ్దస్పర్శరూపరసగంధరూపమగు పంచతన్మాత్రలు, అహంకారము, మహత్తత్త్వము, అవ్యక్తము, (ప్రకృతి) అను నెనిమిది విధములు పరమేశ్వరసంబంధమగు ప్రకృతి. ॥౪॥

పరమార్థప్రపా:— ఇట్లు నిరూపింపదగిన యర్థమునందు శ్రోతయగు యర్జునుని యభిముఖునిగ జేసుకొని ప్రతిజ్ఞాతమగు సృష్ట్యాదికర్తృత్వముచే నీశ్వరతత్త్వమును నిరూపింపదలచి "భూమి రాపః" అనునది మొదలు రెండు శ్లోకములచే పరాపరప్రకృతిద్వయమును చెప్పుచుండెను.

"భూమి రాపో ఽనలో వాయుః ఖం" అను యయిదు శబ్దములచేతను భూమ్యాదిపంచతన్మాత్రలు అనగా పంచసూక్ష్మములను గ్రహియింపవలయును. "మనః" అను శబ్దముచే తత్కారణమగు యహంకారమును గ్రహింపవలయును. "బుద్ధిః" అను శబ్దముచే తత్కారణమగు మహత్తత్త్వమును గ్రహింపవలయును. "అహంకారః" అను శబ్దముచే ప్రథమాధ్యాసరూపము, అహంకారకారణము నగు యవిద్యను గ్రహింపనగును. ఇట్లు ప్రకృతి (మాయ) యెనిమిది విధములు. ఇట "భిన్నా" అను పదముచే పదమూడవయధ్యాయమునందలి "మహాభూతా న్యహంకారః" ఇత్యాదికముచే చతుర్వింశతితత్త్వస్వరూపముగ చెప్పబడెడి ప్రకృతి యీయెనిమిదింటియందే యంతర్భావమని చెప్పబడెను. ॥౪॥

—• ౭వ అధ్యాయము ౫వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— క్షేత్రస్వరూపమగు ప్రకృతికి యపరత్వమును చెప్పుచు క్షేత్రజ్ఞలక్షణమగు పరాప్రకృతిని "అపరేయం" అను శ్లోకముచే చెప్పుచుండెను, పూర్వశ్లోకమున చెప్పు

శాంకరభాష్యతత్త్వబోధిని: —
చేతనుడైన పురుషునకు ప్రకృతిత్వమును చూపుటకు పూర్వశ్లోకమున చెప్పిన యష్టవిధప్రకృతిని యీశ్లోకమున "అపరా" అని తిరిగి గ్రహించుచుండెను.

పూర్వమునందు చెప్పబడిన యష్టవిధప్రకృతి నికృష్టమైనది, అశుద్ధమైనది. సంసారబంధనాత్మకమై యనర్థకారి యగును. దీనికంటె వేరుగ క్షేత్రజ్ఞలక్షణస్వరూపము ప్రాణధారణనిమిత్తము విశుద్ధము నైన నాస్వరూపమగు నాసంబంధమగు "పరా" అనెడి ప్రకృతి కలదని తెలిసికొనుము. ఆప్రకృతియే జగదంతఃప్రవిష్టమై ఈజగత్తును ధరించుచున్నది. జీవరహితమై జగత్తు స్థితినొంద జాలదు ||౫||

డిన నిఖిలమైన యచేతనస్వరూపమగు యెనిమిదివిధములైన ప్రకృతి జడమగుటవలనను, పరార్థమగుటవలనను, సంసారబంధరూపమగుటవలనను నికృష్టమైనది. ఇట్టి యచేతనవర్గరూపము, క్షేత్రస్వరూపము నగు ప్రకృతికంటె వేరగునది (విలక్షణమైనది.)యెటువంటిదనగా యీ యపరా(ప్రకృతిరూపము కానట్టి చేతనాత్మకము, క్షేత్రజ్ఞస్వరూపము, నాయాత్మస్వరూపము, విశుద్ధస్వరూపము అగునట్టిది పరాప్రకృతి యని తెలిసికొనుము. "అనేన జీవే నాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" అను శ్రుతిచెప్పిన విధమున నంతఃప్రవిష్టము, క్షేత్రజ్ఞస్వరూపము, జీవస్వరూపము నగు పరాప్రకృతిచేతనే — స్వతః విడిపోవునట్టి యపరాప్రకృతియగు యచేతనమగు జగత్తు ధరింపబడుచున్నదో అట్టి క్షేత్రజ్ఞస్వరూపమగు ప్రకృతిని పరాప్రకృతినిగ తెలిసికొనుము. జీవరహితమగు నేదియు ధరించుటకు శక్యము కాదని భావము. ||౪||

శంకరానందీయము: — ఇట్లు సృష్టిస్థితిలయములకు హేతువగు ప్రకృతి యెనిమిదివిధములని నిరూపించి యిట్టి ప్రకృతి మరియొక ప్రకృతికంటె భిన్నమనియు, దీనికి నామమును చెప్పుచు యిట్టి ప్రకృత్యంతరమును కూడ "అపరేయం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

పూర్వశ్లోకమునందు చెప్పబడిన ప్రకృతికి యపరాప్రకృతి యని పేరు. మరియు యిట్టి యపరాప్రకృతి యనృతమగుటవలనను, జడమగుటవలనను, దుఃఖాత్మకమగుటవలనను, అశుద్ధమగుటవలనను, పురుషాధీనమగుటవలనను, పురుషవేద్యమగుటవలనను, జ్ఞాననివర్త్యమగుటవలనను, పరాప్రకృత్యాపేక్షయా నికృష్టమగుటవలనను, నికృష్టము. ఇట "తు" అను శబ్దము పరాప్రకృతి యపరాప్రకృతికంటె విలక్షణమని ద్యోతనచేయుటకు ప్రయోగింపబడెను. ఈ చెప్పబడిన యపరప్రకృతికంటె భిన్నము, విలక్షణమైనది పరప్రకృతి. ఇట్టి పరప్రకృతి శుద్ధము, అపరప్రకృతికారణము, అపరప్రకృతికి సత్తాస్ఫూర్తుల నిచ్చునది యగుటచే శ్రేష్ఠమైనది. "పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే" అను శ్రుతిప్రసిద్ధము అగు నా ప్రకృతిని జీవభూతముగను, క్షేత్రజ్ఞస్వరూపముగను తెలిసికొనుము. అంతరంగమునందుండు క్షేత్రజ్ఞస్వరూపమైన యేపరాప్రకృతిచే నీ జగమంతయు ధరింపబడుచున్నదో, అనగా దేహేంద్రియాది నిఖిలజగత్తు "అహం మమ" అను యభిమానముచే తోషణపోషణరక్షణాదిక్రియలు సంపాదింపబడుచున్నవో అట్లే ఘటపటాదులను "ఘటోఽయం, పటోఽయం" అని సత్తాస్ఫూర్తిప్రదానముచేతను, నామరూపాదిభేదకల్పనచేతను, భోగ్యత్వసంభావనచేతను, వినియోగముచేతను, జగత్తుయొక్క నిర్వాహము పరాప్రకృతిచేతనే చేయబడుచున్నదో అట్టి క్షేత్రజ్ఞస్వరూపమగు నాప్రకృతి పరాప్రకృతియని తెలిసికొనుము. ||౫||

భాష్యోత్కర్షదీపిక: — అచేతనవర్గ మంతయు తన (పరమేశ్వరుని) యందు కల్పితమని చెప్పుటకొఱకు ప్రకృతి యెనిమిదివిధములుగ పరిణమించినదని చెప్పి వికారములతో గూడినట్టియు, అవిద్యావిశిష్ట

గీ॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా ॥ ॥౬॥

పదవిభాగము:— ఏతద్యోనీని- భూతాని- సర్వాణి- ఇతి- ఉపధారయ- అహం- కృత్స్నస్య- జగతః- ప్రభవః- ప్రలయః- తథా । ॥౬॥

ప్రతిపదార్థము:— సర్వాణి=సమస్తమైన, భూతాని=భూతములు, ఏతద్యోనీని ఏతత్=ఈపరాపరరూపమగుప్రకృతిద్వయము; యోనీని=కారణముముగాకలవి; ఇతి=ఇట్టితీరున; ఉపధారయ=తెలిసికొనుము; అహం=నేను; కృత్స్నస్య=సమస్తమైన; జగతః=జగత్తునకు; ప్రభవః=కారణము; తథా=అట్లే; ప్రలయః=నాశకుడను; ॥౬॥

శాంకరభాష్యమ్:—

ఏతదితి । ఏతద్యోనీ న్యేతే పరాపరే క్షేత్రక్షేత్రజ్ఞలక్షణే ప్రకృతీ యోనిర్యేషాం భూతానాం తా న్యేతద్యోనీని భూతాని సర్వా ణీత్యేవ ముపధారయ జానీహి । యస్మా న్మమ ప్రకృతీ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"ఏతద్యోనీని భూతాని" అని చెప్పుటవలన కార్యలింగకానుమానముచే పరాపరప్రకృతిద్వయమునకు జగత్కారణత్వము సిద్ధించుచున్నదని చూపబడెను. అది యెట్లన? ఈచరాచరాత్మకజగత్తు కార్యరూప మగుటవలన దీనికి కారణ ముండవలయును. అట్టి కారణ మీప్రకృతిద్వయమైనట్టి, కార్యసదృశ్యమగు చైతన్యమునకు ప్రకృతిత్వమును చెప్పుటకు పూర్వశ్లోకమునందు చెప్పబడిన యెనిమిది విధములగు ప్రకృతిని యనువదించి దానిస్వరూపమును "అపరా" అను దానిచే చెప్పుచుండెను.

పూర్వశ్లోకమునందు చెప్పబడిన యెనిమిది విధములగు ప్రకృతి యశుద్ధమగుటవలన, అనర్థకరమగుటవలన. సంసారస్వరూపమగుటవలన, బంధనస్వరూప మగుటవలనను, నికృష్టమైనది. ఈ యష్టవిధప్రకృతికంటె వేరగునట్టి క్షేత్రజ్ఞస్వరూపము, ప్రాణధారణనిమిత్తమగు పరమేశ్వరరూపమగు ప్రకృతి పరిశుద్ధ మగుటవలన యుత్కృష్టమైనది అని తెలిసికొనుము. ఈ పరాప్రకృతి యెటు జూచిన నపరాప్రకృతిరూపము కాదని తెలుపుటకు "తు" అను శబ్దము యీశ్లోకమున ప్రయోగింపబడెను. జీవరహితమగు జగత్తు ధారణయోగ్యము కాదను న్యాయమున నష్టవిధప్రకృతికంటె పరప్రకృతికి "యయేదం ధార్యతే జగత్" అను దానిచే విశేషమును చెప్పుచుండెను. జగదంతఃప్రవిష్టమగు యేపరప్రకృతిరూపమగు జీవునిచే "జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" అను శ్రుతిచెప్పిన విధమున స్వతః విడిచిపోవునట్టి యచేతనస్వరూపమైన జగత్తు గొప్ప బాహువులు కల నీచే (యర్జునునిచే) స్వతః నశించుచున్న రాజ్యము, క్షత్రియధర్మము ధరియించుటకు శక్యమగుచున్నట్లు శక్య మగుచున్నదో అట్టి క్షేత్రజ్ఞుడు పరప్రకృతి యనబడును. ॥౫॥

—• ౭వ అధ్యాయము ౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పరాపరప్రకృతిద్వయ ముండుటయందు కార్యలింగ కానుమానమును (కార్యముచే కారణము నూహించుటను) ప్రమాణముగ జూపుచు యీ ప్రకృతిద్వయద్వారా జగత్స్రష్ట్యాది కారణత్వమును "ఏతద్యోనీని" అను శ్లోకముచే జూపుచుండెను.

పుట్టుచుండెడి చేతనాచేతనాత్మకమగు నిఖిలజగత్తునకు యీ పరాపరప్రకృతులు రెండును కారణములని తెలిసికొనుము. కార్యములు చిదచిద్గ్రంధిరూపములు కాన తత్కారణములుకూడ చిదచిద్గ్రంధిరూపములే యని యూహింపుము. దీనినే కార్యలింగ కానుమాన మనెదరు.

శాంకరభాష్యమ్:—

యోనిః కారణం సర్వభూతానా మతోఽహం కృత్స్నస్య సమస్తస్య జగతః ప్రభవ ఉత్పత్తిః ప్రలయో వినాశ స్తథా ।ప్రకృతిద్వయద్వారే ణాహం సర్వజ్ఞ ఈశ్వరో జగతః కారణ మిత్యర్థః ॥ ॥౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ము. ఈవిషయమునే క్షేత్రక్షేత్రజ్ఞరూపమగు పరాపరప్రకృతులు కారణములుగా కలవి నిఖిల భూతములని భాష్యమున స్పష్టపరచిరి. అట్లగుచో నీశ్వరునకు జగత్కారణత్వ మెట్లు పొసగు నని శంకింపజనదు. పరమేశ్వరప్రకృతిద్వయము పరమేశ్వరున కుపాధులుకాన పరమేశ్వరునకు కారణత్వము సంభవమే. అట్లగుచో పరమేశ్వరుడు ప్రకృతిద్వయము అనెడి మూటికి జగత్కారణ

ఈ క్షేత్రక్షేత్రజ్ఞస్వరూప మగు పరాపరప్రకృతిద్వయము నా కుపాధులగుచున్నవి. కనుకనే యీ ప్రకృతిద్వయద్వారా నేను సర్వజ్ఞుడను, సర్వేశ్వరుడను, అనంతశక్తిమాయోపాధికుడను, చరాచరాత్మక జగత్తున కుత్పత్తి కారణము, వినాశకారణము, స్వప్న ప్రపంచకమునకువలె మాయికమగు నీ ప్రపంచకమునకు మాయాశ్రయుడనగుటచేతను, విషయమగుటచేతను నేనే మాయావిని, ఉపాదానము నేనే, ద్రష్టయు నేనే. యని యర్థము. ॥౬॥

శంకరానందీయము:— పూర్వశ్లోకద్వయమునందు చెప్పబడి . పరాపరప్రకృతిద్వయము యొక్క కార్యమును "ఏత ద్యోనీని" అను శ్లోకముచే జెప్పుచుండెను.

"బ్రహ్మాదిస్తంబపర్యంతమగు భూతభవిష్యద్వర్తమానకాలికమైన జంగమస్థావరాత్మకమైన నిఖిలభూతములు యీ పరాపరప్రకృతిద్వయమువలననే జనించుచున్నవి." అని నిశ్చయించుకొనుము. ఈ పరాపర ప్రకృతిద్వయమే జగత్కారణ మగుచో "యతోవా ఇమాని భూతాని జాయన్తే" అను శ్రుతిచే బోధితమగు బ్రహ్మమునకే జగత్కారణత్వ మను నది యెట్లుపొసగు నని శంకింపజనదు. ఎట్లు జీవవ్యాప్తిచే శరీరమునకు పుణ్యాపుణ్యకరణశక్తి సంభవించుచున్నదో కేవల శరీరమున కట్టి శక్తి కన్పించుటలేదో అట్లే నా వ్యాప్తిరహిత మగు ప్రకృతిద్వయమునకు జగజ్జననశక్తి లేమింజేసి నా వ్యాప్తిచేతనే జగజ్జననశక్తి సంభవించుటవలన పరా పరప్రకృతిద్వయోపాధికుడను, సర్వజ్ఞుడను, అగు నాకే యీ జగత్కారణ్వము. మరియు "సోఽకామ యత బహుస్యామ్" అనుశ్రుతిప్రసిద్ధబహుభవనసంకల్పము నాకే బోధితమగుటవలన సర్వజగత్కారణము నేనే యని "అహం" అను చరణముచే జెప్పుచుండెను.

ఈ స్థూలసూక్ష్మకారణజగత్తున కంతకును నేనే యుత్పత్తికారణము. (ఉపాదానకారణము.) "ప్రల యశ్చ" ఉపసర్గవశమున ("ప్రలీయతే నిష్పాద్యతే అనేనేతి ప్రలయః") అను విగ్రహము నాశ్రయించిన నిమి త్తకారణమని యర్థము సంభవించును.) అట్టి నిమిత్తకారణము నేనే. అనగా జగత్తునుగూర్చియభిన్ననిమిత్తో పాదము నేనే యని యర్థము. ॥౬॥

శ్రీధరీయము:— ఈ పరాపరప్రకృతులకు జగదుపాదానత్వమును చెప్పుచు యీ ప్రకృతిద్వయ ద్వారా తనకు సృష్ట్యాదికారణత్వమును "ఏతద్యోనీని" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ఈ క్షేత్రక్షేత్రజ్ఞరూపమగు ప్రకృతులవలన జంగమస్థావరాత్మకమగు నిఖిలభూతములు జనించుచున్నవి. అని తెలిసికొనుము. ఆ రెండు ప్రకృతులలో జడప్రకృతి దేహరూపముగ పరిణమించుచున్నది. పంచభూత

శాంకరభాష్యతత్త్వబోధిని:—

త్వమా? అని శంకింపజనదు. నాప్రకృతిద్వయమున నపరాకృతి యచేతన మగుటచే దానికి కారణత్వము పొసగదు. పరాప్రకృతిరూపమగు క్షేత్రజ్ఞుడు కించిజ్ఞుడగుటచేసి పరాప్రకృతికిని నిఖిలజగత్కారణత్వము సంభవింపదు. అర్థాత్తు ఉపధేయము, సర్వజ్ఞుడను, ఈశ్వరుడనగు నేనే సర్వజగత్కారణుడను, లయకారణుడను. ॥౬॥

మగు చేతనాప్రకృతి భోక్తగ దేహములయందు ప్రవేశించి తన కర్మచే దేహములను ధరియించుచున్నది. నా సంబంధమగు నారెండుప్రకృతులు నావలననే సంభవించుచున్నవి. కాన, ప్రకృతులతోఁగూడిన జంగమస్థావరాత్మకమగు నిఖిలప్రపంచమునకు నేనే కారణము. సంహారకర్తయు నేనే యని భావము. ॥౬॥

భాష్యార్థదీపిక:— ఎట్లు మృద్వికారమగు ఘటము మత్ప్రకృతికమో యట్లే నిఖిలభూతములు చేతనాచేతనస్వరూపములగుటవలన చేతనాచేతనస్వరూప పరాపరప్రకృతికములను కార్యలింగకానుమానమును ప్రమాణముగ జూపుచు యట్టిపరాపరప్రకృతిద్వారా తత్పదార్థము, ఈశ్వరుడునగు శ్రీకృష్ణపరమాత్మకుయభిన్ననిమిత్తోపాదానకారణత్వమును "ఏతత్" అను శ్లోకముచే జూపుచుండెను.

జరాయుజములు, అండజములు, స్వేదజములు, మొదలగు నీ జంగమస్థావరాత్మక నిఖిలప్రపంచము క్షేత్రక్షేత్రజ్ఞస్వరూపమగు పరాపరప్రకృతులే కారణముగాకలది. అనగా నిఖిలప్రపంచము పరాపరప్రకృతులవలననే జనించుచున్నది. అని నిశ్చయముగ తెలిసికొనుము. కాన నా ప్రకృతులే సర్వభూతములకు కారణమగుటవలన క్షేత్రక్షేత్రజ్ఞరూప ప్రకృతిద్వారా సర్వజ్ఞుడు, వేదాన్తప్రతిపాద్యుడు అగు ఈశ్వరుడే నిఖిలజగత్తుయొక్క యుత్పత్తికి, వినాశమునకు కారణము. ఈ విషయమునే వ్యాసభగవానులు తనచే రచియించబడిన బ్రహ్మసూత్రము లను యుత్తరమీమాంసాశాస్త్రమున సూత్రములచే స్పష్టపరచెను. అవి యేవనిన "జన్మాద్యస్య యతః" ఎదురుగ గనిపించుచున్న యీజగత్తునకు జన్మస్థితిలయములు యెవనివలన ప్రాప్తించుచున్నవో యది బ్రహ్మము అని పైసూత్రార్థము. ఈ విషయమునే "యతో వా ఇమాని భూతాని జాయన్తే। యేన జాతాని జీవన్తి। యత్ప్రయన్త్యభిసంవిశన్తి। తద్బ్రహ్మ। తద్విజిజ్ఞాసస్వ" అను తైత్తిరీయశ్రుతియు బోధించుచున్నది. పూర్వాధికరణమున బ్రహ్మ జిజ్ఞాస్యము అని చెప్పబడెను. ఎట్టి లక్షణముకలది బ్రహ్మము అనుశంకపై "జన్మాద్యస్య యతః" అను రెండవసూత్రము చెప్పబడెను. కాన నీ సూత్రము బ్రహ్మమునకు లక్షణప్రదర్శనపరము. యీ సూత్రమువలన తేలిన బ్రహ్మలక్షణమేమి యన? జగజ్జన్మస్థితిలయహేతుత్వము బ్రహ్మమునకు లక్షణమని తేలినది. విచారింప ఘటమునకు మృత్తు కారణమైనటుల జగత్తునకు బ్రహ్మ ముపాదాన మనినను లేక ఘటమునకు కుమ్మరివానివలె జగత్తునకు బ్రహ్మము నిమిత్తమనినను వైలక్షణము పొసగును. కాన జగత్తునకు బ్రహ్మ ముపాదానకారణమా? లేక నిమిత్తకారణమా? యని విమర్శింప "స ఈక్షాం చక్రే। సప్రాణ మసృజత" ఇత్యాదిశ్రుతులవలన బ్రహ్మమునకు జగత్తునుగూర్చి యీక్షాపూర్వకకర్తృత్వమే శ్రుత మగుటవలన కులాలాదులయందీక్షాపూర్వకకర్తృత్వము దృష్టమగుటవలన నట్టి కర్తృత్వముకల కులాలాదులు నిమిత్తకారణమే యగుటంజేసి కులాలాదిదృష్టాంతమున "క్రియాఫలసిద్ధి అనేక కారణపూర్వకమగును." అను న్యాయమునను బ్రహ్మమునకుకూడ నిమిత్తకారణత్వమే చెప్పుట సమంజసము. మరియు యీశ్వరులగు రాజవైవస్వతాదులకు కేవలము నిమిత్తకారణత్వమే లోకమున చూడబడుచున్నది. అట్లే పరమేశ్వరునకుకూడ నీశ్వరతత్త్వప్రసిద్ధివలన రాజవైవస్వతాదిదృష్టాంతము నవలంబించి నిమిత్తకారణత్వమే చెప్పుట మంచిది.

మఱియు కార్యమగు ఘట మచేతనము అశుద్ధము. అట్టి ఘటమున కుపాదానకారణమగు మృత్తుయు నచేతనము, అశుద్ధము కాన కార్యకారణములగు మృద్ఘటాదులకు సాదృశ్య ముండుటవలనను, బ్రహ్మమన్న చో

"నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరంజనమ్" ఇత్యాది శ్రుతులచే శుద్ధత్వము నిరవయత్వము చెప్పఖడుటవలనను, కార్యమగు జగత్తు సావయవము, అచేతనము, అశుద్ధము యగుటవలనను బ్రహ్మజగత్తులకు పైదృష్టాంతమున చెప్పిన రీతిని సాదృశ్యము పొసగనందున పరిశేషన్యాయముచే సాంఖ్యస్మృతిప్రసిద్ధమగు ప్రధానమునకో, కణాదగౌతమోక్తరీతిని యే యణువులకో జగ దుపాదానత్వము చెప్పి బ్రహ్మమునకు నిమిత్తత్వమే చెప్పుట సమంజసము. అట్లగుచో బ్రహ్మమునకు కారణత్వమును చెప్పెడి "యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాది శ్రుతులకు విరోధము ప్రాప్తింపదా! యని శంకింపజనదు. ఆ శ్రుతులు కారణత్వమును మాత్రము చెప్పును. ఆ కారణత్వము నిమిత్త కారణత్వమే యనిన విరోధము తొలగును. కాన బ్రహ్మము పైయుక్తిపరంపరచే జగత్తునకు నిమిత్తకారణమే యని శంకప్రాప్తింప దానిని తొలగించుటకై వ్యాసభగవానుడు "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్" అను సూత్రమును రచయించెను. ఛాందోగ్యోపనిషత్తునందలి యారవప్రపాఠకమున శ్వేతకేతువు తండ్రియగు యారుణి యాదేశానుసారము గురుకులమున కేగి వేదవేదాంగముల నభ్యసించి పితృగృహమున కేగి గర్వపర్వతారూఢుడై యుండ యారుణి కొమరుడగు శ్వేతకేతువును గర్వపర్వతమునుండి దించి బ్రహ్మోపదేశము చేయదలచి యిట్లు ప్రశ్నించెను. కుమారా! నీవు "ఉత తమాదేశ మప్రాక్ష్యః యే నాశ్రుతగ్ం శ్రుతం భవ త్యమతం మత మవిజ్ఞాతం విజ్ఞాతమ్" యే యొకవస్తువును తెలిసికొనుటచే సర్వము తెలిసికొనెదవో యట్టి దానిని నీ గురువు నడిగితివా! యని యేకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము కలుగునని ప్రతిజ్ఞ చేసెను. ఆటుపిమ్మట శ్వేతకేతువు "కథం ను స ఆదేశో భవతి" అని యొకదానిని తెలిసికొనిన సర్వము యెట్లు తెలియబడును. యని యాక్షేపింప ఆరుణి "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యా ద్వాచారంభణం వికారో నామధేయం" ఘటశరావాదుల కుపాదానమగు మృత్తు నొకదానిని తెలిసికొనిన మృద్వికారములన్నియు తెలియబడినవే యగును. ఏలయన మృత్తునకే పరిణామభేదము నాశ్రయించి ఘటము, శరావము అని నామమాత్రమే కాని మృత్తుకంటె వేరుగ ఘటశరావాదులు కాన్పించుటలేదు. అనగా యుపాదానావ్యతిరిక్తము కార్యము, నిమిత్తకారణమగు తక్షాదుల యవ్యతిరేకమే ప్రాసాదాదులయందు గోచరింపకపోవుటవలన కార్యము నిమిత్త కారణావ్యతిరిక్తముగా కాన్పింపనందున కార్యము నిమిత్త కారణవ్యతిరిక్తమే యగును. కాన నొకదానిని తెలిసికొనిన తద్వికారము లన్నియు తెలియును. అందుచే సర్వమున కుపాదానకారణమును తెలిసికొనిన సర్వము తెలియబడు నని దృష్టాంతము చెప్పబడెను. యిట్టి ప్రతిజ్ఞాదృష్టాంతములు బ్రహ్మము జగదుపాదాన మగుచో పొసగును. కానిచో ప్రతిజ్ఞాదృష్టాంతముల కుపరోధము (విరోధము) ప్రాప్తించును. కాన ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధమువలన బ్రహ్మము జగత్తున కుపాదానకారణము. "ప్రకృతిశ్చ" అని చకారమువలన నిమిత్త కారణముకూడ బ్రహ్మమే యని సూత్రస్థచకారమున కర్థము. ఇట్లే ప్రతియుపనిషత్తునందు బ్రహ్మమున కుపాదానత్వబోధకప్రతిజ్ఞాదృష్టాంతములు తెలిసికొన నగును. "యతో వా ఇమాని భూతాని జాయన్తే" అను శ్రుతియందు గల "యతః" అను శబ్దము "జనికర్తుః ప్రకృతిః" అను విశేషస్మరణవలన ప్రకృతిస్వరూపమగు యుపాదానవాచకమే. కాన "యతో వా" అను శ్రుతివలననుకూడ బ్రహ్మమున కుపాదానకారణత్వము బోధింపబడుచున్నది.

మఱియు "ఏకమేవాద్వితీయమ్" అను శ్రుతిచే జగదుత్పత్తికి పూర్వమునం దద్వితీయావధారణవలన (అద్వితీయనిశ్చయమువలన) బ్రహ్మముకంటె వేరుగ మఱియొకటి యధిష్ఠాత యుండినచో నేకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానప్రతిజ్ఞ పొసగనందున (విరోధము ప్రాప్తించుటచే) ప్రతిజ్ఞాదృష్టాంతముల కుపరోధమే ప్రాప్తించును. కాన మరియొక యధిష్ఠాత సృష్టికి పూర్వము లేనందున బ్రహ్మమునకు కర్తృత్వము (నిమిత్తకారణత్వము;) మఱియొక యుపాదానము లేమిచేసి బ్రహ్మమునకే యుపాదానకారణత్వము సిద్ధించుచున్నది. దీని

వలన దేలినయాశయ మేమి? బ్రహ్మమే జంగమస్థావరాత్మకమగు యీ నిఖిలప్రపంచమున కుపాదాన కారణము, నిమిత్త కారణముననియు దేలిన యాశయము.

బ్రహ్మమునకే యభిన్ననిమిత్తోపాదానత్వము కలదని వ్యాసభగవానులే మరియొక సూత్రముచే చెప్పుచుండెను. అది యేదనిన "అభిధ్యోపదేశాచ్చ" అవగా "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ" "తదైక్షత బహు స్యాం ప్రజాయేయ" ఆ పరమేశ్వరుడే నేను. అనేకవిధములుగ పుట్టగలను అని యిచ్ఛ కలవాడాయెను. ఇచట యిచ్ఛకలవాడు అనునది యొక యంశము. అట్లే :అనేకముగ పుట్టగలను అనునది రెండవ యంశము. యిచ్ఛకలవాడు అనుటచే కర్తకు కాని యిచ్ఛయనునది సంభవింపదు. కాన "సోకామయత తదైక్షత" అనునీశ్రుతి అభిధ్యానపూర్వకస్వాతంత్ర్యప్రవృత్తివలన బ్రహ్మమునకు నిమిత్త కారణత్వము నుపదేశించుచున్నది. మరియు నీ శ్రుతియందుగల "బహు స్యాం ప్రజాయేయ" అనుఅంశము మృదాదులు బహురూపములైనటుల బ్రహ్మము బహురూపములుగ పుట్టెదనని సంకల్పించుటచే కర్తృత్వమాత్రము. కలకులాలాదులకు బహుభవనము సంభవింపనందున బ్రహ్మమే స్వసంకల్పానుసారము బహురూపములగుట వలన అట్టి బహుభవనము ఉపాదానమునకే ప్రాప్తించుటచే బ్రహ్మ జగదుపాదాన కారణ మని కూడ పైశ్రుత్యుపదేశమువలన తేలినది. కాన బ్రహ్మమునకు అభిన్ననిమిత్తోపాదానత్వ మవ్యాహతము.

బ్రహ్మమునకు జగదుపాదానత్వము సంభవించుననుటయందు శ్రీవ్యాసభగవానులు "సాక్షాచ్చోభయామ్నానాత్" అను సూత్రముచే కారణాంతరమునుగూడ చెప్పెను. "సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశా దేవ సముత్పద్యన్తే। అకాశే ప్రత్యస్తంయన్తి" అను శ్రుతి బ్రహ్మరూపకారణమునే స్వీకరించి బ్రహ్మనుండియే జగత్తు పుట్టుచున్నదనియు, బ్రహ్మమునందే లయమును పొందుచున్నదనియు బోధించుట వలన నేది దేనివలన బుట్టి దేనియందే లయమగునో దానిని కూర్చి యదియే యుపాదాన కారణమగును. అట్లే లోకమున మృత్తువలన జనించి మృత్తుయందే లయమగు ఘటమునుకూర్చి మృత్తే యుపాదానమగుచున్నది. కాన నీ దృష్టాంతమునకు జగత్ప్రభవప్రలయములు బ్రహ్మమువలననే యగుటజేసి బ్రహ్మము జగదుపాదాన కారణ మని నిశ్చయింపబడుచున్నది.

మఱియు శ్రీవ్యాసభగవానులు బ్రహ్మ జగదుపాదాన కారణమనుటయందు "ఆత్మకృతేః పరిణామాత్" అని హేత్వంతరమును కూడ జూపెను. "తదాత్మానం స్వయ మకురుత" ఆ బ్రహ్మమే ఆత్మను స్వయముగ జేసెను. అని దీని యర్థము.ఈశ్రుతియందు "ఆత్మానం" అని ఆత్మకు కర్మత్వము "స్వయ మకురుత" అనియాత్మకు కర్తృత్వము చెప్పబడెను. కార్యముకంటె పూర్వమునందు సిద్ధమై కర్తగనుండిన సత్తునకు కర్మత్వ మెట్లు సంభవించు నను శంకను తొలిగించుటకు "పరిణామాత్" అని సూత్రశేషము చెప్పబడెను. ఘటాదిస్వరూపముగ మృత్తు పరిణమించినటుల పూర్వసిద్ధమగు సద్రూపమైన యాత్మ విశేషాత్మగ పరిణమించుట వలన, శ్రుతియందు "స్వయం" విశేషణమువలనను నిమిత్తాంతరాపేక్ష లేకపోవుట తెలియబడుచున్నది. "పరిణామాత్" అనునది వేరు సూత్రమని యనినను యనవచ్చును. "సచ్చ త్యచ్చాభవత్। నిరుక్తం చానిరుక్తంచ"" ఇత్యాదిశ్రుతులచే బ్రహ్మమునకే వికారరూపముగ పరిణామము చెప్పబడుటవలన జగత్తు బ్రహ్మప్రకృతికము. శ్రీవ్యాసభగవానులు బ్రహ్మ జగత్తున కుపాదాన కారణ మనుటయందు మరియొక హేతువును "యోనిశ్చ హి గీయతే" అను సూత్రముచే జెప్పెను. "కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిమ్" "యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః" అని వేదాన్తములయందు "యోనిః" అనుశబ్దచే బ్రహ్మము చెప్పబడుచున్నది. (ఇట "యోనిః" అనుశబ్దము "పృథివీ యోని రోషధివనస్పతీనాం" అను చోట లోకమున ప్రకృతి

బోధకముగ ప్రసిద్ధము. కాన బ్రహ్మపరముగ పైశ్రుతిద్వయమునందు పఠితమైన యోని శబ్దము ప్రకృతిని బోధించును. అందువలనగూడ బ్రహ్మము జగదుపాదానమే.

లోకమున నీక్షాపూర్వకమగు కర్తృత్వము నిమిత్తకారణమగు కులాలాదులయందే చూడబడుచున్నది. కాని యుపాదానకారణములయందు గానవచ్చుటలేదు. కాన లోకదృష్టాంతము నాశ్రయించి బ్రహ్మమునకు నిమిత్తకారణత్వమే కాని యుపాదానకారణత్వము లేదని యాక్షేపింపదరాదు. బ్రహ్మము అనుమానప్రమాణగమ్యము కాదు. మరేమనిన బ్రహ్మము జగదుపాదాన మనునది శబ్దగమ్యము. కాన శబ్దము ననుసరించియే బ్రహ్మము జగదుపాదాన మనునది నిర్ధారణ చేయవలెను. "యోనిః" ఇత్యాది శబ్దజాలము యీక్షితయగు యీశ్వరుని కుపాదానత్వమును బోధించుచున్నదని యనేకసార్లు చెప్పియేయుంటిమి. అట్లే యీశ్వరునకు ఉపాదాన కారణత్వమును బోధించు శ్రుత్యర్థము ననుసరించు "అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా। యత్త త్సూక్ష్మ మవిజ్ఞేయం, స హ్యన్తరాత్మా భూతానాం క్షేత్రజ్ఞ శ్చేతి కథ్యతే ॥ తస్మా దవ్యక్త ముత్పన్నం త్రిగుణం ద్విజసత్తమ। అవ్యక్తం పురుషే బ్రహ్మ నిర్గుణే సంప్రలీయతే ॥ అతశ్చసంక్షేప మిదం శృణుధ్వం నారాయణ స్సర్వమిదం పురాణః। స సర్గకాలే చ కరోతి సర్వం సంహారకాలే చ తదత్తి భూయః ॥ తస్మాత్కారణాః ప్రభవన్తి సర్వే సమూలం శాశ్వతిక స్స నిత్యః" ఇట్టి స్మృతులన్నియు యీశ్వరున కుపాదానకారణత్వమును బోధించుచున్నవి. కాన నిట్టి స్మృత్యర్థమే గ్రహింపనగును కాని యచేతనమగు ప్రధానము జగత్కారణమను సాంఖ్యసిద్ధాంతము కాని, అణువులే జగదుపాదానము, యీశ్వరుడు కేవల నిమిత్తకారణమను గౌతమాదిసిద్ధాంతములు కాని గ్రహింపరాదు. వేదానురోధిస్మృతులనే గ్రహింపవలయును. వేదవిరుద్ధస్మృతుల బరిహరింపవలయును.

ఘటాదికార్యమునకు సువర్ణ ముపాదానము కాదు. కేయూరాదులకు మృత్తు యుపాదానము కాదు. కాన విలక్షణమైనవాటి కుపాదానోపాదేయభావము లోకమున కన్పట్టనందున అచేతనము, సుఖదుఃఖమోహాత్మకము, ప్రీతిపరితాపవిషాదాదులకు హేతువగు స్వర్గనరకాద్యుచ్చావచరూపము, అశుద్ధము నగునది జగత్తు. చేతనము, ఆనందఘనము, శుద్ధము, బ్రహ్మము కాన జగత్తు బ్రహ్మము అత్యంతవిలక్షణములు. విలక్షణమైన బ్రహ్మము జగత్తున కుపాదానకారణము కానేరదు. మరి జగత్తుతో సజాతీతమైన సాంఖ్యపరికల్పిత ప్రధానమే జగదుపాదానము. అని యొప్పుకొనవలయును. "తదైక్షత బహుస్యాం" ఇత్యాది చేతనకారణ వాదములు యుక్తివిరుద్ధము లగుటవలన చేతనపరములు కాకున్నను ఉపచారమువలన నచేతనప్రధానపరములుగ సమన్వయింపవలయును. లేదా అట్టి వాదము లన్నియు యీశ్వరునికి నిమిత్తకారణత్వప్రదర్శనపరములుగా గాని సమన్వయింపవలయును. అట్లగుచో చేతనకారణవాదములగు "తదైక్షత బహుస్యాం" ఇత్యాదిశ్రుతులగతి యేమనెదవా? వినుము. "తత్తేజ ఐక్షత, తా ఆప ఐక్షన్త, తే హే మే ప్రాణా అహంశ్రేయసే వివద మానా బ్రహ్మ జగ్ముః" "తేహ వాచ మూచు స్త్వంన ఉద్గాయ" అను స్థలమునందును, లోకమున గోదావరీకూలము (వొడ్డు) పడుచుండగ చూచి "కూలం పిపతిషతి" 'కూలము పడుట కిచ్ఛయించుచున్నది'. అను ప్రయోగస్థలమున నచేతనమగు కూలమునకు పతనేచ్ఛ సంభవింపనందున అట్టి ప్రయోగము లౌపచారికము లని యొప్పినట్లు పై యుదాహృతశ్రుతిస్థలములయందు కూడ నచేతనమగు తేజస్సు, యుదకములు, ప్రాణేంద్రియాదు లచేతనములగుటంజేసి చేతనునియందు వలె యీక్షణాదిక మౌపచారిక మనియునా ప్రయోగము లౌపచారికప్రయోగములనినట్లు చేతనకారణవాదములగు "తదైక్షత బహుస్యాం" ఇత్యాదిశ్రుతులు ప్రధానమునం దౌపచారికములు అని శంకింపజనదు.

ఇట పూర్వపక్షిని ప్రశ్నింపవలసియున్నది. (1.) జగత్తునకు బ్రహ్మమునకు యత్కించిద్వైలక్షణ్యా ముండుటచే జగత్తునకు బ్రహ్మ ముపాదానకారణము కాదనెదవా? (2) బహువైలక్షణ్యా ముండుటచేజగత్తునకు బ్రహ్మ ముపాదానకారణము కానెనెదవా? చేతనాయతనమగు శరీరము నుండి చేతనమున కాయతనములు కాని కేశములు (వెంట్రుకలు), చేతనాయతనము కాని గోమయమునుండి చేతనాయతనమగు వృశ్చికములు పుట్టుటవలన యత్కించిద్వైలక్షణ్యముండిన బ్రహ్మమునకు జగదుపాదానత్వము పొసగదు. అను మొదటిపక్షము నిరస్తము. ప్రకృతివికారములగు శరీరకేశములు, గోమయవృశ్చికములు రూపాదిభేదముచే బహువైలక్షణ్యము కలవైనను ప్రకృతివికారభావము కాన్పట్టుటవలన బహువైలక్షణ్యము కల జగత్తునకు బ్రహ్మ ముపాదానకారణము కాదను రెండవపక్షము కూడ పరాస్తము.

మఱియు వేటికి ప్రకృతివికారభావము కలదో వాటికి సర్వాత్మనా సాదృశ్యముండవలెనా? లేక యత్కించిత్సాదృశ్య ముండవలెనా? సర్వాత్మనా సాదృశ్యముండవలె నన్నచో సర్వాత్మనా సాదృశ్యము కలవి రెండును యభిన్నములే యగుటవలన ప్రకృతివికారభావమే సంభవము కాదు. కాన మొదటిది యగు ప్రకృతివికారములకు సర్వాత్మనా సాదృశ్య ముండవలెనను పక్షము నిరస్తము. యత్కించిత్సాదృశ్యము ప్రకృతివికారముల కుండవలయు నను రెండవవికల్పమున శరీరమునకు గల పార్థివత్వము కేశములయం దుండినటుల బ్రహ్మసంబంధమగుసత్తాస్వరూపమైన యత్కించి ద్ధర్మము (స్వభావము) ఆకాశాదులయందను వృత్తమై చూడబడుటవలన జగత్తున కుపాదానకారణము బ్రహ్మమగుటయం దేమియు యనుపపత్తి లేదు.

మఱియు 1 జగత్తునం దీశ్వరునియందుండు నిఖిలస్వభావములు లేవు కాన యీశ్వరుడు జగదుపాదానము కాదనెదవా? 2 లేక యేదో యొకానొక స్వభావమైన లేదు కాన నీశ్వరుడు జగదుపాదానకారణము కాదనెదనా? 3 లేక యీశ్వరునియందుండు చైతన్యము జగత్తునందు లేనందున యీశ్వరుడు జగదుపాదానము కాదనెదవా? ఉపాదానమునందుండు నిఖిలస్వభావములు వికారమునం దుండినచో ప్రకృతివికారభావమే లేక పోయెడిని. కాన ప్రకృతివికారములకు సర్వస్వభావానువర్తనముండవలయునను ప్రథమపక్షము హేయము. ప్రకృతియొక్క యత్కించిత్స్వభావము వికారమున కుండవలె నను ద్వితీయపక్షమున నీశ్వరస్వభావ మగుసత్తాస్వరూపమగు యత్కించి త్స్వభావము వియదాదులయం దుండుటచే బ్రహ్మమునకు జగత్తునకు ప్రకృతివికారభావము సిద్ధించుటచే ద్వితీయపక్షము పరాస్తము. తృతీయపక్షమున నిఖిలప్రపంచ మీశ్వరప్రకృతిక మనెడి వాదిని గూర్చి "యేది చైతన్యము లేనిదో యది యీశ్వరప్రకృతికము కాదు" అను యనుమానప్రమాణమును జూపలెను. ఇట "యథా"అని దృష్టాంత ప్రశ్న జనించును. అట్టిదృష్టాంతము లేదు. ఏలన: జగత్తునందుకదా యీశ్వరాప్రకృతిత్వమును సాధించుచుంటివి. అట్టిజగత్తు పక్షమే కాని సపక్షము కాదు. సపక్షమును దృష్టాంమీయవలెను. అట్టి సపక్షము లేనందున దృష్టాంతము లేమింజేసి, విపక్షములేనందున వ్యతిరేక దృష్టాంతము లేమింజేసి యేదిచైతన్యము లేనిదో అను హేతువు అనుపసంహారిత్వ మను దోషగ్రస్త మగుటచే నాహేతువు అనీశ్వరత్వ ప్రకృతికత్వమును సాధింపనందున తృతీయపక్ష మపాస్తము.

——: ఇటుపైన బ్రహ్మము జగదుపాదానకారణ మనెడి యద్వైతులపై దోషపరంపర ——. చూపబడుచున్నది .——

(1) చేతనము, శుద్ధము, శబ్దాదిహీనము నగు బ్రహ్మము, తద్విపరీతము అచేతనము, అశుద్ధము, స్థూలము సావయవము, పరిచ్ఛిన్నము, శబ్దాదిమత్తు యగు జగత్తున కుపాదానకారణ మగుచో కార్యోత్పత్తికి (జగదుత్పత్తికి)

త్తికి) పూర్వము లేకపోయెడిని. కార్యోత్పత్తికి పూర్వములేకపోవుట మా కిష్టమే యనుట సత్కార్యవాది యగు యద్వైతికి సంభవింపదు.

(2.) మఱియు ప్రలయమునం దీశ్వరునితో యవిభాగమొందు జగత్తు (కార్యము) తన ధర్మములగు యశుద్ధత్వాదిధర్మములచే కారణమగు నీశ్వరుని దూషింపవలసివచ్చును. (అనగా ప్రలయమున కార్య జాతము కారణరూపమున నుండినచో కార్యధర్మములగు యశుద్ధ్యాలు కారణమునందుగూడ యుండవలసివచ్చును.) అట్లగుచో కారణమగు బ్రహ్మమున కశుద్ధ్యాదులు ప్రాప్తించెడిని.

(3.) మఱియు నీ యీశ్వరకారణవాదమున మరియొకటిగూడ సంభవించుచున్నది. అది యేదనిన? ప్రపంచ మంతయు ప్రలయకాలమున బ్రహ్మముతో యవిభాగమును పొందినచో తిరిగి సృష్టికాలమున భోక్త భోక్తగానే, భోగ్యము భోగ్యముగనే జన్మించుటకు నియమకారణము లేనందున భోక్తృభోగ్యాదివిభాగముగ యుత్పత్తి లేకపోయెడిని.

(4) మఱియు నిఖిలభోక్తలు ప్రలయమునందు బ్రహ్మముతో నైక్యమును పొందినచో వాని కర్మలు కూడ బ్రహ్మమునందు లయముపొంది యుండ యట్టి భోక్తలు తిరిగి సృష్టికాలమున జనించుచో (కర్మరూపకారణము లయము పొందినందున యట్టి నియమకారణము లేకున్నను బ్రహ్మముతో నైక్యము పొందిన భోక్తలు జనించుచో) నియతకర్మము లేనట్టియు బ్రహ్మముతో నైక్యమును పొందినట్టి ముక్తులకూడ తిరిగి జనింపవలసివచ్చును.

(5) మఱియు నీజగత్తు ప్రలయమునందు కూడ విభక్తము(వేరు) గనే యుండుననెదవా? అట్లగుచో ప్రలయమే లేకపోయెడిని. అని పరు డద్వైతిని యయిదువిధముల నాక్షేపింప యద్వైతి:—

• సమాధానము •—

సృష్టిసమయమున కార్య మెట్లు కారణస్వరూపముగ నుండునో యట్లే యుత్పత్తికి పూర్వమునందు కూడ నుండెను. అని యూహింపబడుచున్నది.

ప్రలయమునం దీశ్వరునితో, కార్యము యవిభాగమును పొందినచో తన ధర్మములచే నీశ్వరుని దూషించవలసివచ్చును. దూషించదనుటయందు దృష్టాంతము లేదని యద్వైతిపై జెప్పిన దోషమునకు సమాధాన మేమనిన? మృత్ప్రకృతికములు వికారములు అయిన ఘటశరావా విభాగావస్థయం దుచ్చావచమధ్యమ ప్రభేదములు కలవైనను తిరిగి యవి నశించి కారణమగు మృత్తుతో యవిభాగమును పొందినవై కారణమగు మృత్తును కార్యధర్మములగు నుచ్చావచపృథుబృథ్నోదరములచే దూషించుచున్నవా? లేదు. అట్లేప్రలయమునందు జగత్తు బ్రహ్మముతో యవిభాగమును పొందినను కార్యధర్మములచే గారణ మగు బ్రహ్మమును దూషింపదు. అట్లు దూషించుచో కారణమునందు కార్యము కార్యధర్మముచే స్థితినే యొప్పవలసివచ్చును. అట్లుగుచో ప్రలయమే లేకపోవలసివచ్చును.

మఱియు కార్యమునకు కారణానన్యత్వము ప్రలయకాలమునందే కాదు. మూడు కాలములయందు కార్యము కారణానన్యమే (అనగా కారణముకంటె కార్యము వేరుగ లేదనుట.) ఈవిషయమునే "ఆత్మైవేదం సర్వం, సర్వంబ్రహ్మైవేదంపురస్తాత్, సర్వంఖల్విదంబ్రహ్మ" ఇత్యాదిశ్రుతులుబోధించుచున్నవి. కార్యము కారణానన్య మైననుమాయావి తనచే ప్రసరింపజేయబడిన మాయచేమాయయవస్తువగుటవలనమూడు కాలములయందెట్లు సంబంధ ములేనివా డగునో కల్పితమగు గుణముచేగాని, దోషముచేగాని యధిష్ఠానమున కన్యథాత్వములేనందున యట్లే పరమాత్మయు సంసారమాయచే స్పృశింపబడడు.

మఱియు ప్రలయమున భోక్తృభోగ్యము లన్నియు యవిభాగమును పొందినచో తిరిగి సృష్టిసమయమున విభాగముగ నుత్పత్తి లేకపోవుననుయాక్షేపణయు సంభవింపదు. ఏలయన!సుషుప్తిసమాధులయందు స్వాభావిక మగు యవిభాగమును పొందినను మిథ్యాజ్ఞానము పోనందున తిరిగి ప్రబోధావస్థయందు పూర్వమువలె విభాగము సంభవించుచునే యున్నది. అట్లే ప్రలయమునందుకూడ బ్రహ్మముతో యవిభాగమును కార్యజాతము పొంది నను మిథ్యాజ్ఞానము పోనందున తిరిగి యా మిథ్యాజ్ఞానమువలననే భోక్తృభోగ్యవిభాగముగ సృష్టిసంభవించును. కాన పూర్వోక్తమగు భోక్తృభోగ్యవిభాగము సృష్టిసమయమున ప్రాప్తింపకపోయెడిని యనెడి దోషము పరాస్తము. పునరుత్పత్తిని గూర్చి మిథ్యాజ్ఞానము కారణ మని చెప్పుటచే యోగులకు సమ్యగ్జ్ఞానముచే మిథ్యా

గీ॥ మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ! ।
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ ॥౭॥

పదవిభాగము :—

మత్తః— పరతరం— న— అన్యత్— కించిత్— అస్తి— ధనంజయ— మయి— సర్వం— ఇదం— ప్రోతం— సూత్రే— మణిగణాః—ఇవ॥

ప్రతిపదార్థము :— హే ధనంజయ!=ఓయర్జునుడా!; మత్తః=నాకంటె; (పరమేశ్వరునికంటె) పరతరం=శ్రేష్ఠతరమగు; అన్యత్కించిత్=వేరగునట్టియేదోయొకానొక కారణము; నాస్తి=లేదు; సూత్రే=త్రాడునందు; మణిగణాఇవ=మణిసముదాయమువలె; మయి=నాయందు; ఇదం=ఈజగత్తు; ప్రోతం=అనుస్యూతము; ॥౭॥

---

జ్ఞానము పోయిన దగుటచే మిథ్యాజ్ఞాన కారణము లేమింజేసి ముక్తులు తిరిగి పుట్టవలె నను శంకయు తొలగింపబడెను.

మఱియు జగత్తు యచేతనత్వ అశుద్ధాత్వాది ధర్మములచే బ్రహ్మవిలక్షణ మగుటవలన బ్రహ్మప్రకృతికము జగత్తు కానేరదనియు, ప్రధానమే జగత్ప్రకృతి యని యంటివే! శబ్దాదులుగల జగత్తుశబ్దాదులు లేని సాంఖ్యపరికల్పిత ప్రధానముకంటె విలక్షణ మగుటచే ప్రధానముమాత్ర మెట్లు జగత్ప్రకృతి యగును. అను నాక్షేపము సాంఖ్యులకు ప్రాప్తించుచుండ యద్వైతులనే సాంఖ్యులు యాక్షేపించుట యెట్లు పొసగును.

కాన యీశ్వరుడే జగదుపాదాన మనెడి పక్షమే యుక్తియుక్తము. శ్రుతిస్మృతిపురాణేతిహాసతాత్పర్య సిద్ధము. దీనినే ముముక్షువు లంగీకరింపదగినది.

ముఖ్యము సంభవించుచుండ యౌపచారికాశ్రయణ మనుచితమగుటవలన "చేతనకర్తృకమగు యీక్షణాదికము ప్రధానమునం దౌపచారిక మను శంకయు తొలగింపబడెను. "సేయం దేవతైక్షత హన్తాహ మిమాస్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" ఇత్యాదిస్థలములయందు పరమేశ్వరునకు జీవస్వరూపముగ ప్రవేశము శ్రూయమాణ మగుటవలన "మృ దబ్రవీ" దిత్యాదికమగు శ్రుతిచే మృదాద్యభిమానదేవతలే, వాగాద్యభిమానదేవతలే, వదనసంవదనాదులయందు, చేతనోచితవ్యవహారములయందు చెప్పబడుచున్నవి. "కూలం పిపతిషతి" అనుస్థలమున కూలాధిష్ఠానదేవతదే పతనేచ్ఛ యని గ్రహింప నగును. ఈశ్వరునకు జగదుపాదానత్వము "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానురోధాత్" అను సూత్రమున సాధింపబడెను. ఈవిషయ మంతయు సూత్రభాష్యమున స్పష్టము. ॥౬॥

నీలకంఠీయము :— ఈసర్వభూతములు క్షేత్ర,క్షేత్రజ్ఞరూపములగు పరాపరప్రకృతులు యుత్పత్తిలయస్థానములుగ గలవి యని తెలిసికొనుము. పాతంజలులకువలె నీపరాపరప్రకృతులు రెండును యీశ్వరునికంటె వేరా ? అను శంకకు సమాధానముగ వేరుకాగని ప్రతిపాదించుచుండెను. జడాజడరూపము, స్వస్వప్రకృతిసహితము నగు ఈజగత్తున కుత్పత్తిస్థానమును, అట్లే లయస్థానమును నేనే. కాన నారెండు ప్రకృతులుగూడ నాకంటె నతిరిక్తములు కావు.

—• ౭వ అధ్యాయము ౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము :— స్వాప్నికపదార్థములనుగూర్చి స్వప్న ద్రష్టకంటెను, మాయిక (ఐంద్రజాలిక) పదార్థములనుగూర్చి ఐంద్రజాలికునికంటెను., శుక్త్యజ్ఞానకల్పితం బగు రజతమునుగూర్చి శుక్తిశకలావచ్ఛిన్నచైతన్యముకంటె వేరె కారణము లేనటుల నిఖిలదృశ్యాకారముగ బరిణమించు మాయ కధిష్ఠానము, సర్వభాసకము, సద్రూపముచేతను స్ఫురణరూపముచేతను సర్వానుస్యూతము, స్వప్రకాశపరమానం

శాంకరభాష్యమ్:—

యత స్తస్మా న్మత్తః పరమేశ్వరా త్పరతర మన్య త్కారణాన్తరం కించి న్నాస్తి న విద్యతే, అహమేవ జగత్కారణ మిత్యర్థః। హేధనంజయ! యస్మా దేవం తస్మా న్మయి పరమేశ్వరే సర్వాణి భూతాని సర్వ మిదం జగ త్ప్రోత మనుస్యూత మనుగత మనువిద్ధమ్ గ్రథిత మిత్యర్థః। దీర్ఘతన్తుషు పటవ త్సూత్రేచ మణిగణా ఇవ॥ ।౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అక్షరము, పరము అనుటచే ప్రధానముకంటె పురుషుడు పరముగ నున్నటుల పరమేశ్వరుని కంటె పరముగ నేదో యొకటుండవచ్చుననిశంకింపజనదు. పరాపర ప్రకృతిద్వారాఈశ్వరున కు సర్వజగత్కారణత్వ మిదివరకే చెప్పబడిన దగుటవలనపరమేశ్వరునికంటె వేరుగజగత్కారణ మేదియు లేదు. అనగా నీశ్వరుడే సర్వజగత్కారణమని యర్థము. ఈశ్వరునికంటె వేరుగ

దచైతన్యఘనము, పరమార్థసన్మాత్రస్వరూపము నగు నాకంటె వేరుగ పరమార్థసత్యరూప మగు నది యేదియు లేదు. ఓయర్జునా! నాయందు కల్పితమైనది పరమార్థముచే నాకంటె వేఱు కాదు. ఈవిషయమే "తదనన్యత్వ మారంభణశబ్దాదిభ్యః" అను బ్రహ్మసూత్రముచే స్పష్టముగ జెప్పబడెను. (ఈవాక్యముమధుసూదనసరస్వ తులది కాని శ్రీకృష్ణపరమాత్మది కాదు) వ్యవహారదృష్టిచే సద్రూపము, స్ఫురణరూపము నగు నాయందు యీజడప్రపంచమంతయు గ్రథితము. నాసత్తచేతనే సద్రూపమువలె, నాస్ఫురణరూపముచే ప్రకాశించుచున్నది వలె మాయామయమగు వ్యవహారము కొఱకు కల్పింపబడుచున్నది. సర్వము చైతన్యమాత్రగ్రథిత మనుటలో "సూత్రేమణిగణా ఇవ" అనునది దృష్టాంతము. సూత్రమునకు మణిసమూహము గ్రుచ్చబడినటుల నాయందీ జగజ్జాలము గ్రుచ్చబడినది. లేక, "సూత్రే" స్వప్నద్రష్ట, తైజసుడు నగు హిరణ్యగర్భునియందు స్వప్న ప్రోతములగు మణిగణములువలె జగత్తు నాయందు ప్రోతమైనది. (ఇది సర్వాంశయందు దృష్టాంతము) కొందరు "పరమత స్సేతూన్మానసంబన్ధభేదవ్యపదేశేభ్యః" పరమాత్మ సేతూ, న్మాన, సంబంధ, భేదవ్యపదేశములవలన జగత్తుకంటె వేరు. అను పూర్వపక్షసూత్రముచే చెప్పబడిన పూర్వపక్షమునకు సమాధానముగ నీశ్లోకమును వ్యాఖ్యానించిరి. ఓధనంజయ! సర్వజ్ఞుడు, సర్వశక్తులుకల, సర్వకారణరూపమైన నాకంటె ప్రశస్యతరము, సర్వజగత్తునకు సృష్టిసంహారములకు స్వతంత్రకారణము అగునది మఱియొకటి లేదు. కాన సర్వకారణమగు నాయందే యీకార్యజాతమంతయు గ్రథితము, అన్యత్ర గ్రథితము కాదు. "సూత్రేమణిగణా ఇవ" అను దృష్టాంతము సువర్ణమందు కుండలము గ్రుచ్చబడినటుల గ్రథనసూత్రమునందే దృష్టాంతము. కారణత్వమున దృష్టాంతము కాదు. ॥౭॥

శంకరానందీయము:— కొందరు బ్రహ్మముకంటె వేరుగ జగత్కారణమును కల్పించి యట్టి కారణమే జగదాధారమని శ్రుతివిరుద్ధముగ వర్ణించుచుండిరి. అట్టి మతమును నిరసించుచు నిఖిలజగ దాధారము పరమేశ్వరుడ నగు నేనే యని "మత్తః" అను శ్లోకముచే చెప్పుచుండెను.

ప్రకృతి యుపాధిగ కల సత్యజ్ఞానానందరూపమగు పరమేశ్వరుని కంటె భిన్నముగ జగత్తునకు సాంఖ్యపరికల్పితప్రధానము కాని, తార్కికపరికల్పితపరమాణువులు కాని, వేరొక కారణము కాని లేదు. అట్టి కారణము లుండుటయందు ప్రమాణము లేదు. "యతో వా ఇమానిభూతాని జాయన్తే" ఇత్యాదిశ్రుతులే ప్రమాణమనె దవా? "ఈక్షతే ర్నాశబ్దమ్" ఇత్యాద్యధికరణసమూహముజగత్కారణము చేతనమే యని ప్రతిపాదించుట చేతను, ప్రధానాదికము జగత్కారణమని శ్రుతులయందు లేకపోవుట చేతను "య స్సర్వజ్ఞ స్స సర్వవిత్"

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జగత్కారణము లేదనుటయందు హేతువేమనిన? ఓయర్జునా! సూత్రమునందు మణిగణము గ్రుచ్చబడినటుల, తంతువులయందు పటము ఓతప్రోతమువలె నాయం దీనిఖిలప్రపంచ మనుస్యూతము, (ఓతప్రోతము.) అనగా సూత్రములేనిదే మణిగణము మాలాకారమున స్థితిని బొందనటుల నీజగము నాయం దనుస్యూతము కానిదే స్థితిని పొందజాలదు. తంతువులయందు

---

"యస్య జ్ఞానమయం తపః" "ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽన్తర్యా మ్యేష యోని స్సర్వస్య" "ప్రభవాప్యయౌ హి భూతానాం" ఇత్యాదిశ్రుతిప్రసిద్ధమగుటవలన చేతనుడను, సర్వజ్ఞుడను నగు నేనే సర్వజగత్కారణము. మఱియు "కస్మి న్సర్వే సంప్రతిష్ఠితా భవన్తి" (దేనియందు ప్రపంచమంతయు లెస్సగ ప్రతిష్ఠిత) మనుప్రశ్న ననుసరించి (ఉపక్రమించి) శ్రుతిచేతనే రసాతలము మొదలు బ్రహ్మలోకపర్యన్తమగు నిఖిలలోకములు బ్రహ్మమునందు మణులువలె ఓతములు, ప్రోతములు (పడుగు, పేకవలె నున్నవి) యని చెప్పుటవలన జగత్తునకు ప్రధానము కాని, అణువులు కాని యాధారము కాదని చెప్పుటకు, నేనే సర్వాధారమని "మయి-సర్వ మిదం ప్రోతం" అను దానిచే చెప్పుచుండెను.

జగత్కారణము, జగదధిష్ఠానము అగునాయందే చరాచరాత్మకమగు నవ్యాకృతాదిస్థూలాంతనిఖిలజగత్తు తన్తువులయందు పటమువలె, సూత్రమునందు మణిగణమువలె ఓతము (అనుగతము). అనగా నాసత్తనే యనుసరించి సత్తకలదై యుంటున్నది. కాని వేరుగ మాత్రము లేదు.

మణికాధారమగు సూత్రమునకు, ఆ సూత్రమునందు గ్రుచ్చబడిన మణులకు యెట్లు భేద మున్నదో అట్లే నీయందు ప్రోతమైన జగత్తునకు, జగత్తున కాధారమగు నీకును భేద ముండుటన్యాయమని శంకింపజనదు.

స్థూలబుద్ధికలవారలకు సూత్రమునకు, మణులకు భేదము కన్పట్టినను సూక్ష్మబుద్ధికలవారలు యుక్తిచే విచారించినసూత్రమణులకు భేదము కన్పింపదు. అది యెట్లనిన? ఆధారాధేయములగు సూత్రమణిగణములు రెండింటియందుండు ధర్మము భౌతికత్వ మొకటియే కాన నారెండును భౌతికములే. అనగా భౌతికత్వధర్మముచే నొకటియే కాని రెండు కావనుట. అచట రూప వ్యక్తులచే చేయబడు భేద మున్నదనెదవా? అట్టి భేదము మూఢవ్యవహారమునకొఱకు కల్పితమగుటచే నప్రామాణికము. కాన రూపత్వస్వరూప మగు ధర్మవిశిష్టము లన్నియు రూపత్వధర్మపురస్సరముగ నేకమే. అందువలన యంతట యేకత్వము సిద్ధించుచున్నది. కాన వాటి విశేష మబాధక మగుటవల్ల వాటియందు మిథ్యాత్వము సిద్ధించుచున్నది. చిత్రపటమునందు గూడ నంతట యనుగతమగు రూప మొక్కటియే కాన్పించుటవలన భౌతికత్వసామాన్యధర్మము భౌతికము లన్నిటియం దనుగతమగుటవలన నట్టి భౌతికత్వధర్మవిశిష్టములగు భౌతికము లన్నిటికి యేకత్వ ముపపన్నమగుటచే "సర్వ మిదం భౌతికం" (యీసర్వము భౌతికమే) అని యంతట భౌతికప్రత్యయము జనించుచుండ నట్టితరి వ్యక్తివిశేషకల్పితప్రత్యయము జనింపనందున, "అయం సముద్రః" (ఇది సముద్రము) అను ప్రత్యయస్థలమున తరంగఫేనబుద్బుదప్రత్యయములు జనింపనందున ప్రధానము గృహీత మగుచో యప్రధానగ్రహణ మయుక్త మను న్యాయమున వ్యక్తివిశేషకృత మగు భేదము సిద్ధింపదు. యెట్లుభూమియొక టైనను క్షేత్రము, గృహము, అను కల్పనచే భేదవ్యవహారమో అట్లే భౌతికత్వధర్మముచే సూత్రమణిగణ మేక మేయైనను వ్యవహారమునకొఱకు సూత్రాదులయందు సూత్రమని మణిగణమని భేదము కల్పితము. భేదము కల్పితము కాన వాస్తవికము కాదు.

శాంకరభాష్యతత్త్వబోధిని: —

పటము ఓతప్రోతము కానిదే స్థితిని పొందజాలనట్లు యీజగమునకు నేనాధారుడను గానిచో నీజగము స్థితిని పొందజాలదు. ఈచెప్పుటవలన దేలిన యాశయ మేమి? ఆధారము లేనిదే ఆధేయము సంభవింపనందున నన్ను విడచి యీజగమే స్థితి నొందజాలదు. కాన నిఖిల జగమున కాధారుడను, కారణుడను నేనే (పరమేశ్వరుడే). నాకంటె వేరుగ జగదాధారము, జగత్కారణము లేదని యాశయము. ।౭॥

---

కల్పితభేదమే వాస్తవిక మగుచో సూత్రమణిగణములందు భౌతికత్వము లేకపోయెడిని. మఱియు భేద మనునది విచారించినచో నిట్టిది భేదమని నిరూపించుటకు శక్యము కానందున నేకత్వమునే యంగీకరించి తీరవలెను. దృష్టాంతమున సూత్రమణిగణముల కేకత్వ మంగీకరించినట్లు బ్రహ్మజగత్తుల కేకత్వ మంగీకరించితీరవలెను. అట్లుకానిచో "బ్రహ్మైవేదం సర్వం" అనెడి బ్రహ్మజగత్తుల కద్వైతము బోధించెడి శ్రుతులకు విరోధము ప్రాప్తించెడిని. ॥౭॥

భాష్యతర్కదీపిక: — పరాపరప్రకృతిద్వారమున నేనే యీజంగమస్థావరాత్మకమగు జగత్తున కభిన్ననిమిత్తోపాదాన మగుటవలన నాకంటె నితరమగు కారణాంతర మేదియు యీజగత్తునకు లేదు. నేనే యన్నింటికంటె పరుడను, జగత్కారణుడను. పరమేశ్వరునికంటె వేరుగ జగత్కారణము లేదని చెప్పుటవలన "పర మత స్సేతూన్మానసంబంధభేదవ్యపదేశేభ్యః" ఈయాత్మ "ససేతు" సేతువుయొక్కయు, "చతుష్పాత్" నాలుగుపాదములుకలదని యున్మానముయొక్కయు, "సతా సోమ్యతదా సంపన్నో భవతి" అని సత్సంబంధముయొక్కయు, "అథ య ఏషోఽన్తరాదిత్యే య ఏషోఽన్తరక్షిణి" అని భేదములయొక్క వ్యపదేశములవలన బ్రహ్మముకంటె వేరుగ మరియొకటి సిద్ధించుచుండ "మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ" అని చెప్పుట యెట్లుపొసగు ననెదవా?

"పర మత స్సేతూన్మానసంబంధభేదవ్యపదేశేభ్యః" అను సూత్రము పూర్వపక్షసూత్రము. యీసూత్రమువలన పైపూర్వపక్షము ప్రాప్తింప దీనిని ఖండించుటకొఱకు "సామాన్యాత్తు" "బుద్ధ్యర్థః పాదవత్" "స్థానవిశేషా త్ప్రకాశాదివత్" "ఉపపత్తేశ్చ" "తథాఽన్యప్రతిషేధాత్" "అనేన సర్వగతత్వమాయామశబ్దాదిభ్యః" అను సూత్రములను వ్యాసభగవానులు రచయించెను. "సామాన్యాత్తు" అను సూత్రమునందుకల "తు" అను శబ్దమునకు పైపూర్వపక్షవిషయము సంభవింపదని యర్థము. ఎందువలననిన: బ్రహ్మముకంటె వేరుగ మఱియొకటి యుండుటయందు ప్రమాణము లేమింజేసి బ్రహ్మముకంటె భిన్నముగ నేదియు లేదు. ఈచూడబడు నిఖిలప్రపంచముయొక్క జన్మస్థితిలయములు బ్రహ్మమునుండియే యగుచున్నవని "జన్మాద్యస్య యతః" అను సూత్రముచే నిర్ధారణ చేయబడెను. మఱియు కార్యమునకు కారణానన్యత్వము "తదనన్యత్వ మారంభణశబ్దాదిభ్యః" అను సూత్రముచే నిర్ధారింపబడెను. మఱియు "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయం" అను శ్రుతిచే నవధారణమువలనను, ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞవలనను బ్రహ్మముకంటె వేఱగు వస్తువు లేదు. "ఆయ మాత్మా స సేతుః" అను శ్రుతి బ్రహ్మము సేతువని చెప్పుటచే బ్రహ్మవ్యతిరిక్తము కలదని యాక్షేపింపరాదు. సేతుసామాన్యమువలన సేతుశబ్దము బ్రహ్మమునందు ప్రయుక్తము. జగత్తును, జగన్మర్యాదలను ధరించుటయే సేతుసామాన్యము. కావ సేతువు

వంటి సేతువు అని ప్రకృతమైన యాత్మ స్తుతింపబడుచుండెను. "చతుష్పాత్" అని యున్మానవ్యపదేశము వలన బ్రహ్మవ్యతిరిక్తము కలదని శంకింపజనదు. బ్రహ్మప్రతీకము లగు మన ఆకాశములలో అధ్యాత్మ మగు మనస్సునకు వాక్కు, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము అని నాల్గుపాదములు, అధిదైవమగు నాకాశమునకు అగ్ని, వాయువు, సూర్యుడు దిక్కులు అని నాల్గుపాదము లెట్లుపాసననిమిత్తము కల్పితములో యట్లే "బుద్ధ్యర్థః పాదవత్" బ్రహ్మమునకు నాల్గుపాదములు "చతుష్పాత్" అని యుపాసన నిమిత్తము కల్పితములు. లేక కార్షాపణపాదవిభాగము (తులము, అరతులము,) ఎట్లు వ్యవహారముకొఱకు కల్పితమో అట్లే బ్రహ్మమునకు పాదములు "చతుష్పాత్" అని వ్యవహారముకొఱకు కల్పితములు.

సంబంధవ్యపదేశమువలనను, భేదవ్యపదేశమువలనను పరమేశ్వరునికంటె వేరుగ వస్తువున్నదను శంకయు సంభవింపదు. ఆ సంబంధభేదవ్యపదేశములు యొకవస్తువునకే స్థానవిశేషము ననుసరించియుపపన్నములు, బుద్ధ్యాద్యుపాధిస్థానవిశేషసంబంధమువలన స్వప్నజాగరితములయందు విజ్ఞానముయొక్కయు, సుషుప్తియందు బుద్ధ్యాద్యుపశమముండ యే యుపశమము కలదో అది పరమాత్మతో సంబంధమని యుపాధి ననుసరించి పరమాత్మయందు సంబంధ మౌపచారికము. కాని మితత్వము ననుసరించి కాదు. అట్లే భేదవ్యపదేశముకూడ నుపాధిభేదము ననుసరించియే కాని స్వరూపభేదము ననుసరించి కాదు. ఈ విషయమున దృష్టాంతమును "ప్రకాశవత్" అనుదానిచే జెప్పెను. ఒక్కటైన సూర్యప్రకాశకు సూచీపాశాద్యుపాధుల ననుసరించి సంబంధభేద వ్యపదేశములో యట్లే బ్రహ్మమునందుకూడ సంబంధభేదవ్యపదేశములు సంభవించును.

బ్రహ్మమునకు సంబంధాదివ్యపదేశము ముఖ్యమే యను శంకను తొలగించుటకు "ఉపపత్తేశ్చ" అను సూత్రము చెప్పబడెను. సంబంధాదివ్యపదేశ ముపచారమనుటయే యుపపన్నము. కాన ముఖ్యమనరాదు. ఇట్లు పరపక్షమున సేత్వాదివ్యపదేశములను మథించి మరియొక హేతువుచే స్వపక్షము నుపసంహరించుచుండెను. "స ఏవాధస్తా దహ మేవాధస్తా దాత్మైవాధస్తా త్స ఏవోపరిష్టా త్సర్వం. తం పరాదాత్ యోఽన్యత్రాత్మన స్సర్వం వేద బ్రహ్మైవేదం సర్వం నేహ నానాస్తి కించన యస్మాత్పరం నాపర మస్తి కించి దేత ద్బ్రహ్మాఽపూర్వ మనపర మనన్తర మబాహ్యమ్" ఈ మొదలగు బ్రహ్మప్రకరణమందున్న వాక్యములకు మరియొక తీరున యర్థము చెప్పుట పొసగనందున యీవాక్యములన్నియు బ్రహ్మముకంటె వేరుగ మరియొక వస్తువును వారించుచున్నవి. సర్వాన్తరశ్రుతివలన పరమాత్మకు మరియొక యంతరుడు లేడని నిశ్చితమగుచున్నది. ఈసేత్వాది వ్యపదేశనిరాకరణచేతను, బ్రహ్మముకంటె యితరుడు లేడని చెప్పుటచేతను ఆత్మకు సర్వగతత్వము సిద్ధమగుచున్నది. "యావాన్వాఽయ మాకాశ స్తావా నేషోన్త ర్హృదయ ఆకాశః" "ఆకాశవ త్సర్వగతశ్చ నిత్యః" "జ్యాయా న్దివో జ్యాయా నంతరిక్షాత్" "నిత్యః సర్వగత స్థాణుః" ఇత్యాది శ్రుతులు స్మృతులు, న్యాయములు బ్రహ్మమునకు సర్వగతత్వమును బోధించుచున్నవి. ఓయర్జున! దిగ్విజయమున, ఉత్తరగోగ్రహణమునందు భీష్మాదిక్షత్రియపుంగవులను జయించి ధనమును తీసుకువచ్చిన నీకంటె యిట్టి కర్మను చేసినవా డెటులలేడో అట్లే నాకంటె వేరుగ యితరమగు జగత్కారణము లేదని సూచించుటకు "ధనంజయ" అని సంబుద్ధిని ప్రయోగించెను. కాన పరమేశ్వరుడ నగు నాయందు దీజంగమస్థావరాత్మక నిఖిలజగత్తు సూత్రమునందు మణిగణములువలె ప్రోతము. గ్రుచ్చబడినది. ఈచెప్పుచే జగత్స్థితి హేతుత్వము కూడ బ్రహ్మమునకే చెప్పబడెను. ॥౭॥

గీ॥ రసోఽహ మప్సు కౌన్తేయ! ప్రభాఽస్మి శశిసూర్యయోః।
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ ॥౮॥

పదవిభాగము:— రసః–అహం–అప్సు–కౌన్తేయ! –ప్రభా–అస్మి–శశిసూర్యయోః– ప్రణవః–సర్వవేదేషు –శబ్దః–ఖే–పౌరుషం–నృషు॥ ॥౮॥

ప్రతిపదార్థము:— హేకౌన్తేయ!=కున్తీపుత్రుడవగు ఓయర్జునా! అహం=నేను; అప్సు=ఉదకములయందు; రసః=రసస్వరూపుడనై; అస్మి=అయితిని; ఈపదమపకృష్టము; శశిసూర్యయోః= చంద్రసూర్యులయందు; ప్రభా=ప్రకాశస్వరూపుడనై; అస్మి=అయితిని, (అస్మిఅనుపదముత్తరత్రఅనువృత్తము.)సర్వవేదేషు= నిఖిలవేదములయందు; ప్రణవః=ప్రణవస్వరూపుడనై, అస్మి=అయితిని; ఖే=ఆకాశమునందు; శబ్దః=శబ్దస్వరూపుడనై; అస్మి=అయితిని; నృషు=మనుష్యులయందు; పౌరుషం=పురుషకారమై; అస్మి=అయితిని॥ ॥౮॥

శాంకరభాష్యమ్:—

కేనకేన ధర్మేణ విశిష్టే త్వయి సర్వమిదంప్రోత మిత్యుచ్యతే, రసోహ మహాంయస్సారస్స రస స్తస్మిన్రసభూతేమయ్యాపఃప్రోతాఇత్యర్థః,ఏవం సర్వత్ర । యథాహా మప్సు రసఏవం ప్రభాఽస్మిశశి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జలము మొదలగునవి రసాదులయందు ప్రోతములని లోకప్రసిద్ధి యుండ నీయందుప్రోతము లని చెప్పుట యెట్లు పొసగును? నీయందే ప్రోతములగుచో యేయే ధర్మముతోగూడిన నీయందు ప్రోతములనెదవా! ఓయర్జునా! ఉదకములలో సారమగు మధురరసమే నేను. అట్టిమధురరసస్వరూపమగు నాయందే యుదకములు ప్రోతములు. ఇట్లే మున్ముందుకూడ యన్వయింప

—• ౭వ అధ్యాయము ౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అబాదులు రసాదులయందు ప్రోతములని ప్రసిద్ధియుండ నీయందు యానిఖిలజగత్తు యెట్లు ప్రోతమని శంకింపజనదు. రసాదిస్వరూపము నేనే కాన నాయందుప్రోతమని చెప్పుట యసంగతము కాదని “రసోఽహ మప్సు కౌన్తేయ” అనుశ్లోకము మొదలు యయిదు శ్లోకము లచే జెప్పుచుండెను.

మధురరసము తన్మాత్రస్వరూపము నిఖిలజలములకు సారభూతము, కారణభూతము, నిఖిలజలములయందనుగతము అగు మధురరసము నేనే.. ఓయర్జునా! అట్టి మధురరసస్వరూపమైన నాయందు నిఖిలజలములు ప్రోతములు. ఈవిభూతిధ్యానముకొఱ కుపదేశింపబడుచున్నదని యభినివేశమును మాత్రము పొందవలదు.

అట్లే చంద్రసూర్యులయందుగల ప్రకాశయు నేనే యయి యుంటిని. ప్రకాశసామాన్యరూపమైన నాయందే చంద్రసూర్యులు ప్రోతములు.

అట్లే సర్వవేదములయం దనుస్యూతమైన ఓంకారము నేనే. అట్టి ఓంకారస్వరూపమగు నాయందే సర్వవేదములు ప్రోతములు.

అట్లే యాకాశమునం దనుస్యూతమైన పుణ్యశబ్దము నేనే. అట్టి పుణ్యశబ్దస్వరూపమగు నాయందే యాకాశము ప్రోతము.

అట్లే మనుష్యులయం దనుస్యూతమైన పురుషత్వసామాన్యము నేనే. అట్టి పురుషత్వసామాన్యరూపమగు నాయందు నిఖిలపురుషులు ప్రోతములు. ఈ విషయములన్నియు బృహదారణ్యకోపనిషత్ప్రతిపాదితమైన దుందుభ్యాదిదృష్టాంతములచే జూడనగును. ॥౮॥

శాంకరభాష్యమ్:—

సూర్యయోః ప్రణవ ఓంకార స్సర్వవేదేషు తస్మి న్ప్రణవభూతే మయి సర్వే వేదాః ప్రోతాః, తథా ఖ ఆకాశే శబ్ద స్సారభూత స్తస్మి న్మయి ఖం ప్రోతం । తథా పౌరుషం పురుషస్య భావో, యతః పుంబుద్ధిః నృషు తస్మి న్మయి పురుషాః ప్రోతాః । ॥౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దగును. ఎట్లు నేను యుదకముల మధురరసస్వరూపమో యట్లే నేనుచంద్రసూర్యులయందు గల ప్రభాస్వరూపము. కాన యట్టి నాయందు చంద్రసూర్యులుప్రోతములు. అట్లే సర్వవేదములయందోంకారము సారభూతము. అట్టి సారభూతమగు ఓంకారస్వరూపమైన నాయందు సర్వవేదములు ప్రోతములు. అట్లే యాకాశమునందు సారభూతమైనది శబ్దము. అట్టి సారభూతమగు శబ్దస్వరూపమైన నాయందే యాకాశము ప్రోతము. అట్లే పురుషులయందు గల పురుషభావము (పుంబుద్ధి) కలదో యట్టి పుంస్త్వసామాన్యరూపమగు నాయందే తదుపాదాన మగుటచే తత్స్వభావము కలవారగుటవలన పురుషవిశేషములన్నియు ప్రోతములు. ॥౮॥

శంకరానందీయము:— బ్రహ్మజగత్తుల కేకత్వ ముండుటవలననే "యదగ్నే రోహితగ్ం రూపం తేజస స్తద్రూపం య చ్ఛుక్లం తదపాం య త్కృష్ణం త దన్నస్యాపాగా దగ్నే రగ్నిత్వం వాచారంభణం వికారో నామధేయం త్రీణి రూపా ణీత్యేవ సత్యం య దాదిత్యస్య రోహితం రూపం" ఇత్యాది శ్రుత్యుక్తప్రకారముగ రసప్రభాప్రణవాదిరూపముచే కారణస్వరూపముగ నున్న జలాదులకు పరమాత్మాభిన్నత్వసిద్ధికొఱకు అబ్కార్యాదులకు తనకంటె వేఱుగ సత్తాఽభావమును "రసోఽహం" అని మొదలుకొని కొన్ని శ్లోకములచే జెప్పుచుండెను.

ఓ కౌన్తేయ! ఉదకములయందు నేను రసస్వరూపముగ నుంటిని. కాన నుదకయలు తమకు కారణము రసాత్మకమునగు నాయందు ప్రోతములు. అనగా మృత్కార్యమగు ఘటము మృత్స్వరూపముతో మృత్తునం దుండుట ప్రత్యక్షసిద్ధము. అట్లే యుదకములు గూడ నాస్వరూపమై, మదేకసత్తాకలవై నాయం దుంటున్నవి. వేఱుగ లేవని యర్థము.

అట్లే చంద్రసూర్యులలోగూడ నేను ప్రభాస్వరూపమైతిని. చంద్రసూర్యులకు కారణమైన ప్రభాస్వరూపముచే చంద్రసూర్యులయందుంటిని. కాన ప్రభాస్వరూపము, చంద్రసూర్యులకు కారణము నగు నాయందు చంద్రసూర్యులు ప్రోతములు. అనగా చంద్రసూర్యులు మదేకసత్తాకలవారై నాస్వరూపముతో నాయందే యుండిరి. నాకంటె వేఱుగలేరని యర్థము.

ఋగ్యజుస్సామాథర్వణాది నిఖిలవేదములయందు నేను ప్రణవస్వరూపముతో నుంటిని. సర్వవేదకారణము, ప్రణవస్వరూపము నగు నాయందు సర్వవేదములు ప్రోతములు. అనగా సర్వవేదములు మదేకసత్తాకలవై ప్రణవస్వరూపమైన నాయందే యుంటున్నవని యర్థము.

ఆకాశమునందు తత్కారణమగు శబ్దస్వరూపముతోనుంటిని. ఆకాశకారణము, శబ్దాత్మకము నగు నాయందాకాశము ప్రోతము. అందువలన మదేకసత్తాకలదై నాస్వరూపముచేతనే యాకాశము నాయందే యున్నది.

మనుష్యులయందు గల పౌరుషము (పుంలక్షణము) నేనే యయితిని. అనగా నేలక్షణముచే "ఇతడు పురుషుడు" అని తెలియబడునో అట్టి పౌరుషస్వరూపమైన నాయందు పురుషులు ప్రోతములు. మదేకసత్తాకలవారై, మదభిన్నులై నాయందే యుండిరని యర్థము.

గీ॥ పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥ ॥౯॥

పదవిభాగము :— పుణ్యః–గన్ధః– పృథివ్యాం– చ–తేజః– చ– అస్మి– విభావసౌ–జీవనం– సర్వ భూతేషు– తపః– చ– అస్మి– తపస్విషు. ॥౯॥

ప్రతిపదార్థము :— పృథివ్యాం=భూమియందు గల; పుణ్యో గన్ధః=సురభిగంధస్వరూపము; అహం=(ఈపదము పూర్వశ్లోకమునుండి యనువృత్తము) నేను; అస్మి=అయితిని; విభావసౌ–అగ్నియందు గల; తేజః=తేజస్స్వరూపము; అహం=నేను;అస్మి=అయితిని, సర్వభూతేషు=నిఖిలభూతములయందుగల; జీవనంచ= అమృత మనెడి యన్నరసస్వరూపమై; అహం=నేను; అస్మి=అయితిని; తపస్విషు=తపశ్శాలురయందుగల; తపశ్చ= చిత్తైకాగ్ర్యాదితపస్స్వరూపమై; అస్మి=అయితిని; ॥౯॥

శాంకరభాష్యమ్:—

పుణ్య ఇతి । పుణ్య స్సురభిర్గన్ధః పృథివ్యాం చాహం తస్మి న్మయి గన్ధభూతే పృథివీ ప్రోతా । పుణ్యత్వం గన్ధస్య స్వభావత ఏవ, పృథివ్యాం దర్శిత మబాదిషు రసాదేః పుణ్యత్వోపలక్షణార్థం । అపుణ్యత్వం తు గన్ధాదీనా మవిద్యాధర్మాద్యపేక్షం సంసారిణాం భూతవిశేషసంసర్గని

శాంకరభాష్యతత్త్వబోధిని: —

"మయి సర్వ మిదం ప్రోతం" అనుదానినే ప్రకారాంతరమున "పుణ్యః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

పృథివియందు యేసురభిగంధము కలదో యట్టి పుణ్యగంధస్వరూపమయిన నాయందు పృథివి ప్రోతము. పృథివియందు గల గంధమునకు పుణ్యత్వము స్వభావసిద్ధమే (అనగా పృథివికి సురభిగంధము స్వభావసిద్ధమే యని యాశయము.) అట్లే జలాదులయందు గల రసమునకు మాధుర్యము స్వభావసిద్ధమే యని "పుణ్యోగన్ధః" అను దానిచేతనే చెప్పనగును. ఇక గంధాదుల

—• ౭వ అధ్యాయము ౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము :— సర్వపృథివీసామాన్యరూపము, తన్మాత్ర యను పేరుగల యవికృతమగు పృథివియందు అనుస్యూతమైన పుణ్యగంధము నేనే. ఇచటగల చకారము రసాదుల పుణ్యత్వమునుగూడ బోధించును. శబ్దస్పర్శరూపరసగంధములు స్వభావముచేతనే పుణ్యములు, అవికృతములు. అట్టివైనను జీవుల యధర్మమున వాటి కపుణ్యత్వ ముపపాదితము. స్వభావమువలన వాటి కపుణ్యత్వము లేదని తెలియనగును.

అట్లే యగ్నియందుగల సర్వదహనప్రకాశనసామర్థ్యరూపము, ఉష్ణస్పర్శరూపము, సితభాస్వర రూపము, నగు పుణ్యరూపము నేనే యయితిని. "తేజశ్చాస్మి" అనుస్థలమునందుగల చకార మనుక్తసముచ్చాయకము. అనగా ఉష్ణస్పర్శచే నాతురులైనవారల కాప్యాయకమగు (తాపమును పోగొట్టు) వాయువుయందుగల పుణ్యమైన శీతస్పర్శ నేనే అయితి నని యర్థము.

అట్లే సర్వప్రాణులయందుగల ప్రాణధారణరూపమగు యాయువు నేనే యయితిని. అనగా తద్రూపమగు నాయందు సర్వప్రాణులు ప్రోతములని యర్థము. నిత్యము తపోయుక్తులగు వానప్రస్థాదుల యందుగల శీతోష్ణక్షుత్పిపాసాదిద్వంద్వసహనసామర్థ్యరూపమైన యేతపస్సు గలదో యట్టి తపస్సు నేనే యయితిని. అట్టి తపోరూపమగు నాయందు తపస్వులు ప్రోతములు. తపస్సే లేనిచో తపస్వులేయుండరుగాన

శాంకరభాష్యమ్:—

**మిత్త్వం భవతి । తేజో దీప్తి శ్చాస్మి విభావసా వగ్నౌ తథా జీవనం సర్వభూతేషు యేన జీవన్తి సర్వాణి భూతాని త జ్జీవనం । తపశ్చాస్మి తపస్విషు తస్మిం స్తపతి మయి తపస్వినః ప్రోతాః** ॥౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కపుణ్యత్వముకూడ యనుభవసిద్ధ మగుచున్న దనెదవా! గన్ధాదులకు గల యపుణ్యత్వము స్వాభావికము కాదు. మ రేమనిన? జీవుల యజ్ఞానకృతమగు ధర్మాధర్మాదులవలన భూతవిశేషసంసర్గము సంభవించి దానివలన యపుణ్యత్వము గంధాదులకు సంభవించును. పంచభూతములయందు ప్రథమోత్పన్నమగు శబ్దస్పర్శరూపరసగంధములు సిద్ధాదిభోగ్యము లగుటవలన పుణ్యములే. (మంచివే) అట్లైనను గంధాదులు స్వకార్యములగు భూతములతో పరిణమించుచు ప్రాణుల పాపకర్మలవలన నపుణ్యము లగును. అగ్నియందు గల యే దీప్తి కలదో అట్టి దీప్తిస్వరూపమగు నాయం దగ్ని ప్రోతము. అమృతమనెడి యేయన్నరసముచే సర్వభూతములు జీవించుచున్నవో యట్టి యన్నరసస్వరూపమగు నాయందు సర్వభూతములు ప్రోతములు. తపశ్శాలురయందుగల యేచిత్తైకాగ్ర్యాదితపస్సు గలదో యట్టి తపోరూపమగు నాయందు తపశ్శాలురు ప్రోతములు. తపస్వి యనగా తపోవిశిష్టుడు. విశేషణమగు తపస్సే లేనిచో తపోవిశిష్టుడే లేడని యర్థము. ॥౯॥

వారలు నాయందు ప్రోతములు. ఇచట చకారము వల్ల నవాంతరమగు చిత్తైకాగ్ర్యము. బాహ్యమగు జిహ్వోపస్థాదినిగ్రహరూపమగు సర్వతపస్సు గ్రహింపనగును. ॥౯॥

శంకరానందీయము:— మఱియు పృథివియందుగల మనోహరము, శుద్ధము నగు యేగంధము కలదో అట్టి గంధస్వరూపము నేనే అయితిని. గంధమునకు మనోహరత్వశుద్ధత్వములు చెప్పుట ఆకాశాదికారణభూతములగు శబ్దాదుల కుపలక్షణార్థము. పృథివ్యప్తేజోవాయ్వాకాశములకు కారణమైన గంధరసరూపస్పర్శశబ్దములకు వాస్తవమైన యేమనోహారిత్వము, శుద్ధత్వములు కలవోయవి యోగులకు ప్రత్యక్షములు. వాటియందు దుష్టత్వము కార్యద్రవ్యాంతరసంయోగమువలన భోక్తృకర్మానురూపముగ జనించును. కాని స్వభావమువలన శబ్దాదులయందు దుష్టత్వము లేదు. ఏ మనోహరము పుణ్యమునగు గంధము కలదో యట్టి గంధస్వరూపముగ నేను పృథివియం దుంటిని. పృథివీకారణమగు గంధస్వరూపమైన నాయందు పృథివి ప్రోతము. గంధస్వరూపమగు నాయందు గంధమయమగు పృథివి యుంటున్నదని యర్థము.

అగ్నియందుండు తేజస్సు నేనే యైతిని. అనగా నగ్నికి కారణమైన తేజస్స్వరూపముగ నున్న నాయందగ్ని ప్రోతము. నాసత్తచేతనే తేజోమయమై యగ్ని మదభిన్నమైనదై నాస్వరూపముచేతనే నాస్వరూపమునం దుంటున్నదని యర్థము.

సర్వప్రాణులయందు నేను జీవనస్వరూపమై యైతిని. జీవనకరణమగు భుక్తాన్నరసస్వరూపముచే ప్రాణులయందుంటున్నాను. కాన ప్రాణులు స్వకారణమగునట్టి యన్నరసాత్మకమగు నాయందు ప్రోతములు. అనగా నాసత్తచేతనే ప్రాణు లన్నరసమయమై యన్నరసస్వరూపమగు నాయందుంటున్నవి.

గీ॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ! సనాతనమ్ ।
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్ ॥ ॥౧౦॥

పదవిభాగము :— బీజం– మాం– సర్వభూతానాం– విద్ధి– పార్థ– సనాతనం– బుద్ధిః– బుద్ధిమతాం– అస్మి– తేజః– తేజస్వినాం– అహమ్ ॥ ॥౧౦॥

ప్రతిపదార్థము :— హే పార్థ!=ఓయర్జునా; సనాతనం=చిరంతనమైన; మాం=నన్ను; సర్వభూతానాం=నిఖిలభూతములకు; బీజం=ప్రరోహకారణముగ; విద్ధి=తెలిసికొనుము; అహం=నేను; బుద్ధిమతాం=వివేకశక్తికలవారల; బుద్ధిః=వివేకశక్తిస్వరూపమై; అస్మి=అయితిని; అహం=నేను; తేజస్వినాం=ప్రాగల్భ్యముకలవారల; తేజః=ప్రాగల్భ్యస్వరూపమై; అస్మి=అయితిని; ॥౧౦॥

---

తపస్సు అనగా కృచ్ఛ్రచాంద్రాయణాదికము. లేక చిత్తైకాగ్ర్యము, లేక పంచాగ్నిమధ్యయందుండుట. ఇట్టి ధర్మములలో యేదో యొకటి కలవారు తపస్వులనబడుదురు. అట్టి వారలయందుండు తపస్సు నేనైతిని. అనగా తపోరూపమున నుంటిని, కాన తపోరూపమైన నాయందు తపశ్శాలురు ప్రోతములు. తపోమాత్రాత్మకమైనవారలై తపస్స్వరూపమైన నాయందుంటున్నారు. నాకంటె తపస్వులు వేరు కారని యర్థము. తపస్వుల తపస్సు యుదకముల రసమువలె కారణము కాదు. మరేమనిన? తపస్సనునది తపస్వుల ధర్మము. తపస్సుకు కారణత్వము సిద్ధించినపుడు కదా నీకు కారణభావము. తపస్వులకు కారణమాత్రస్వరూపత్వము సిద్ధించునది. అట్టి కారణత్వమే నీకు లేనపుడు తపస్వులయందుండు తపస్స్వరూపము నేనైతిని అని యెటుల చెప్పుచుంటి వని శంకింపజనదు. తపస్సు ధర్మమైనను స్వర్గాదిఫలజనకమగుటచే నద్దానికి కారణత్వము సంభవించును. కాన ధర్మముకలవారల యేధర్మము స్వర్గాదిఫలహేతువగుచున్నదో యట్టి ధర్మము నేనే. అది యెట్లనిన? వ్యవహారహేతువు, ధర్మావిరుద్ధమైన కామము నేనే యని ముందు చెప్పబోవు తీరుననే యని గ్రహింపవగును. కాన యట్టి ధర్మిలగు తపస్వులు ధర్మస్వరూపమైన నాయందు నాస్వరూపముచే నుంటున్నారు. ధర్మమాత్రము నాస్వరూపమని, ధర్మిలు ధర్మస్వరూపమని బోధించుటకే "తపశ్చాస్మి తపస్విషు" అని చెప్పియుండెను. "తపః" అను పదము ధర్మమాత్రమునకుపలక్షణము. ఉపలక్షణమనగ చెప్పదగినవిషయమున కొంత చెప్పుటయే. దీనివలన యితరధర్మములనుగూడ గ్రహింపవలయునని యర్థము. కార్యమాత్రము కారణస్వరూపమగుట ఘటాదులయందు దృష్టము, శ్రుతము. ధర్మి ధర్మమాత్రకారణమగుట, ధర్మమునందు తన్మాత్రముగ నుండుట యెట్లు సంభవించునని శంకింపజనదు. వహ్నికి, తగులపెట్టుట (దాహకత్వము) ధర్మము. అట్టిదాహకత్వము అగ్నియందంతటను ప్రత్యక్షమగుటవలన అట్టి దాహకత్వ మగ్నిని యంతటను వ్యాపించియున్నది. దాహకత్వమును విడచి యగ్నికి పృథక్స్వరూపత్వము లేనందున తదాకారత్వము, తదాత్మనా దాహకత్వరూపధర్మమునం దవస్థానము చూపబడుచున్నవి. అట్లే యంతట చూడనగును. ॥౯॥

## —• ౭వ అధ్యాయము ౧౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సర్వభూతములు తమతమ బీజములయందు ప్రోతములు. నీయందు ప్రోతములు కావను శంకను "బీజం మాం" అను శ్లోకముచే దొలగించుచుండెను.

జంగమస్థావరాత్మకనిఖిలభూతములకు కారణము సనాతనమైనది నిత్యమైనది. అట్టి కారణమునకు బీజాంతరాపేక్ష లేదు. ప్రతివ్యక్తిభిన్నమైన యనిత్యమైన కారణము లేదు, అట్టి జంగమస్థావరాత్మకనిఖిల

శాంకరభాష్యమ్:—

బీజమితి । బీజం ప్రరోహకారణం మాం విద్ధి సర్వభూతానాం హేపార్థ సనాతనం చిరన్తనమ్ । కించ బుద్ధి ర్వివేకశక్తి రన్తఃకరణస్య బుద్ధిమతాం వివేకశక్తిమతా మస్మి తేజః ప్రాగల్భ్యం తద్వతాం తేజస్వినా మహమ్॥ ॥౧౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సర్వభూతములు స్వకారణమునందు ప్రోతములు కాని నీయం దెట్లు సర్వభూతములు ప్రోతము లనెదవా? ఓయర్జునా! సర్వభూతములకు ప్రరోహకారణముగ నన్నే తెలిసికొనుము. నీకు గూడ కారణ ముండకూడదా యని యనెదవా? నేను సనాతనుడను. అనగా చిరంతనుడ నగుటచే నాకు కారణాంతరము సంభవింపదు కాన నేనే సర్వభూతప్రరోహకారణము. చైత

భూతములకు కారణము (బీజము) అవ్యాకృతమే. అట్టి యవ్యాకృతము నాస్వరూపమే యని తెలిసికొనుము. నాకంటె వేరు కాదు. కాన యోపార్థ! సర్వబీజభూతమైన నాయొక్కనియందే సర్వభూతములు ప్రోతము లనుట యుక్తమే.

మఱియు బుద్ధిమంతుల తత్త్వాతత్త్వవివేకసామర్థ్యరూపమైన బుద్ధియు నేనే యైతిని. బుద్ధియే లేనిచో బుద్ధివిశిష్టులే లేకపోయెడిని. కాన బుద్ధిరూపమైన నాయందు బుద్ధిమంతులు ప్రోతములు.

పరాభిభవసామర్థ్యము;: పరులచే తిరస్కరింపబడకపోవుటయనెడి యేసామర్థ్యము తేజశ్శాలురకు కలదో అట్టి తేజస్స్వరూపము నేనే యైతిని. అనగా తేజోరూపమగునాయందు తేజశ్శాలురు ప్రోతములని యర్థము. ॥౧౦॥

శంకరానందీయము;— "ఆకాశా ద్వాయుః । వాయో రగ్నిః" ఇత్యాదిశ్రుతులచే పృథివికి జలము, జలమునకు అగ్ని, అగ్నికివాయువు, వాయువున కాకశము కారణమని శ్రూయమాణమగుచున్నది. కాన తత్తత్కార్యములు తత్తత్కారణములందు ప్రోతము లగుచుండ నీవు దేనికి కారణము కావు. అట్లు యేశ్రుతులు చెప్పుటలేదు. కారణము కాని నీయందు జగత్తు యెట్లు ప్రోత మగు నని శంకింపజనదు. "ఆత్మన ఆకాశ స్సంభూతః" అని నా వలననే ఆకాశ ముత్పన్నమని శ్రుతి బోధించుచున్నది. కాన నీశ్వరరూపమగు నేనే నిఖిలజగదుత్పత్తికి ప్రకృష్టకారణము. అని "బీజం మాం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ఈశ్వరరూపమగు నన్నే యాకాశాదినిఖిలభూతముల యావిర్భావమునకు కారణముగ తెలిసికొనుము. భూతములకు నీవు కారణ మెట్లో యట్లే నీకుహూడ కారణాంతర ముండును. అని శంకింపజనదు. "సా కాష్ఠా సా పరా గతిః," "విశ్వస్మా దింద్ర ఉత్తరః" "న తస్య కశ్చి జ్జనితా" ఇత్యాది శ్రుతులవలన నిఖిలజగత్తునకు నేనే పరమకారణమని, నాకు మరియొక కారణములేదని బోధింపబడుచున్నది. ఈ విషయమునే "సనాతనం" అను పదముచే చెప్పుచుండెను. సనాతనమనగా నన్నిటికంటె పరమప్రాచీనుడు స్వయముగ తనకు కారణాంతరము లేనివాడని యర్థము. కాన "మత్తః పరతరం నాన్యత్" "మయి" సర్వ మిదం ప్రోతం" అని చెప్పబడిన విషయము ధృడమగుచు సిద్ధించుచున్నది.

ఈచెప్పుటచే పరమేశ్వరునకే సర్వకారణత్వము, సర్వమునకు పరమేశ్వరస్వరూపమాత్రత్వము స్థాపించబడెను. అయినను బుద్ధ్యాదుల కాత్మప్రకాశ్యత్వమును బోధించుటకును, అర్థాత్తు బుద్ధిమంతులకు తత్కారణత్వమును, తన్మాత్రత్వమును "బుద్ధి ర్బుద్ధిమతా మస్మి" అనుదానిచే బోధించుచుండెను.

ఆత్మ, అనాత్మ, ధర్మాధర్మాదికము దేనిచే తెలియబడునో యది బుద్ధి యనిపించుకొనును. దానినే ప్రజ్ఞయందురు. నేను అట్టి బుద్ధిమంతులలో గల బుద్ధిరూపమైన కారణము నైతిని. అనగా

గీ॥ బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్ ।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥ ॥౧౧॥

పదవిభాగము :— బలం- బలవతాం- చ- అహం- కామరాగవివర్జితమ్- ధర్మావిరుద్ధః- భూతేషు- కామః- అస్మి- భరతర్షభ- ॥౧౧॥

ప్రతిపదార్థము :— హేభరతర్షభ!=ఓయర్జునా: అహం=నేను; బలవతాం=సామర్థ్యముకలవారల సంబంధమైన; కామరాగవివర్జితం=అసన్నికృష్టవిషయమైనతృష్ణ కామమనంబడును, సన్నికృష్టవిషయమైనరంజన హే రాగమనబడును. అట్టి కామరాగములులేని; బలం=సామర్థ్యస్వరూపము; అస్మి=అయితిని; భూతేషు=ప్రాణుల యందుండు; ధర్మావిరుద్ధః=శాస్త్రార్థావిరుద్ధమైన; కామః=దేహధారణమాత్రమే ప్రయోజనముగాగల యశన పానాది విషయకమగు; కామః=కామస్వరూపమై; అస్మి=అయితిని; ॥౧౧॥

---

శాంకరభాష్యమ్:—

బలమితి । బలం సామర్థ్య మోజో బలవతా మహం తచ్చ బలం కామరాగవివర్జితం కామశ్చ రాగశ్చ కామరాగౌ కామ స్తృష్ణాఽసన్నికృష్టేషు విషయేషు, రాగో రంజనా ప్రాప్తేషు విషయేషు తాభ్యాం వివర్జితం, దేహాదిధారణమాత్రార్థం బల మహ మస్మి నతు యత్సంసారి

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

న్యాభివ్యంజకతత్త్వనిశ్చయసామర్థ్యమే బుద్ధి యనబడును. అట్టి బుద్ధికలవారల బుద్ధిస్వరూపము నేనే. అనగా నట్టి బుద్ధిస్వరూపమగు నాయందు బుద్ధిమంతులు ప్రోతములు. ప్రాగల్భ్యము కలవారల ప్రాగల్భ్యము నాస్వరూపమే. అనగా నట్టి ప్రాగల్భ్యస్వరూపమగు నాయందు ప్రాగల్భ్యము కలవారలు ప్రోతములని యర్థము. ॥౧౦॥

అసన్నికృష్టవిషయములయందైనతృష్ణయే కామ మనబడును. సన్నికృష్టవిషయములయందైన రంజనమేరాగమనబడును. అట్టి కామరాగములతో వివర్జితమైన సామర్థ్యము కలవారల సామర్థ్యమునాస్వరూపమే. కానితృష్ణారాగకారణమగు సంసారుల యే సామర్థ్యము కలదోయది మాత్ర

---

బుద్ధిస్వరూపమగునాయందు బుద్ధిమంతులు ప్రోతములై నాస్వరూపముచే నాయందే యుండిరి.

తేజస్సనగా ప్రాగల్భ్యము. అది చేతనధర్మమగుటవలన నాత్మప్రకాశప్రవృత్తిహేతువు, పరుల కప్రధృష్యము, పరులనభిభవించునది. అట్టి తేజస్సుకలవారల తేజోరూపకారణము నేనైతిని. అట్టి తేజోరూపమగు నాయందు తేజోవంతులు ప్రోతములు. అనగా నాస్వరూపముచే నాయందు తేజోవంతు లుండిరి. ॥౧౦॥

—• ౭వఅధ్యాయము ౧౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము :— ఒకానొక విషయము ప్రాప్తించుటకు తగు కారణము లేకున్నను ఆవిషయము నాకు ప్రాప్తించుగాక యనెడి చిత్తవృత్తి కామ మనబడును. ప్రాప్తించిన యొకానొక విషయమ్మునకు క్షయకారణ మున్నను ఆవిషయము నశింపకుండగ నుండుగాక యను చిత్తవృత్తివిశేషము రంజనాత్మకమై రాగ మనబడును. అట్టి కామరాగములతో నెంతమాత్రము సంబంధములేనిది, అనగా సర్వథా కామరాగములకు కారణముకానట్టియు, రజస్తమోవిరహితమైనట్టియు, స్వధర్మానుష్ఠానముకొఱకు

శాంకరభాష్యమ్:—

ణాం తృష్ణారాగకారణం । కించ ధర్మావిరుద్ధో ధర్మేణ శాస్త్రార్థేనావిరుద్ధో యః ప్రాణిషు భూతేషు కామో యథా దేహధారణమాత్రాద్యర్థోఽశనపానాదివిషయః కామోఽస్మి హే భరతర్షభ! ॥౧౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ము నా స్వరూపము కాదు. కాన నట్టి సామర్థ్యస్వరూపమగు నాయందు సామర్థ్యముకలవారలు ప్రోతములు. శాస్త్రార్థావిరుద్ధమైన ప్రాణులయందుగల దేహధారణమాత్రము ప్రయోజనముగా గల యశనపానాదివిషయకమైన కామస్వరూపము నేను అయితిని. అనగా నట్టి కామస్వరూపమగు నాయం దట్టి కామన కలవారలు ప్రోతములు ॥౧౧॥

---

దేహేంద్రియాదిధారణసామర్థ్యరూపమైన సంసారపరాఙ్ముఖులైనసాత్త్వికబలవంతుల సాత్త్వికబలము నేనైతిని. అట్టి సాత్త్వికబలరూపమైన నాయందు బలవంతులు ప్రోతములు (పడుగువలెనుండిరి.) ఇట నుండు చ శబ్దము "తు" అనుశబ్దముయొక్క యర్థము కలది. దానికి భిన్నక్రమమర్థము. అనగా కామరాగవివర్జితమైన బలమే నాస్వరూపముగ ధ్యానింపదగినది. కామరాగకారణమైన సంసారుల బలము నాస్వరూపముగ ధ్యానింపదగినది కాదని యర్థము. లేక రాగశబ్దమునకు క్రోధ మర్థమనియైన గ్రహింపనగును.

ధర్మశాస్త్రప్రతిషిద్ధమైన లేక ధర్మానుకూలమైన ప్రాణులయందుండు శాస్త్రానుమతజాయాపుత్రవిత్తాదివిషయకమగు నభిలాష నేనే యయితిని. ఓభరతర్షభ! శాస్త్రావిరుద్ధకామరూపుడనగు నాయందు ప్రాణులు ప్రోతములని యర్థము. ॥౧౧॥

శంకరానందీయము:— కామ మనగ సమీపమందున్న విషయములయందపేక్షవలన నుత్కృష్టప్రవృత్తికి హేతువు. రాగమనగ నప్రాప్తవిషయాశాప్రవృత్తిహేతువు. అట్టి కామరాగములతో వర్జితమైనట్టి బలవంతుల "బలం" మానసికబలముకంటెను, ఐంద్రియికబలముకంటె వేరగు శరీరమాత్రము నాశ్రయించియుండు దేహమాత్రయాత్రోపయోగియగు బలము నేనైతిని. దేహశక్తికలవారల బలస్వరూపమైన స్వకారణమగు నాయందు బలవంతులు ప్రోతములై నాస్వరూపముచే నుండిరి.

"కామమయ ఏవాయం పురుషః" ఇత్యాదికముచే నిఖిలపురుషవ్యాపారమునకు కామమే కారణమని చెప్పబడుచున్నది. అనుభవసిద్ధ మగుచున్నది. కామము, రాగము లేనిచో పురుషునకు దేహయాత్ర, స్వధర్మము యెట్లు సంభవించును? అను యాశంకను "ధర్మావిరుద్ధః" అను నుత్తరార్థముచే తొలిగించుచుండెను.

వర్ణాశ్రములయందు శాస్త్రీయధర్మమునకవిరుద్ధమైనట్టియు, తనయాశ్రమధర్మమునకు విరుద్ధము కానట్టియు, తనయాశ్రమధర్మమునకు సాధకమైనట్టి యుత్పత్తిహేతువగు కామము నేనైతిని. వర్ణాశ్రములయందు కామస్వరూపమున నేను యుంటిని. కామస్వరూపము, స్వకారణము అగు నాయందు వర్ణాశ్రములు ప్రోతములై మృత్తుయందు ఘటమువలె నా స్వరూపముచే నుండిరి. స్వరూపముచే నాకంటె వేరు కాదు. ప్రాణులయందుండు బలము, చేష్టాహేతువగు కామము చేతనధర్మమగుటచే నాత్మచే ప్రకాశ్యమని గ్రహింపనగును. ॥౧౧॥

శ్రీధరీయము:— ప్రాప్తింపని వస్తువుయం దభిలాష రాజసము. కామమనబడును. కోరబడిన యర్థము ప్రాప్తించినను తిరిగి యధికముగ నా యర్థము ప్రాప్తింపవలయు నని తామసమగు చిత్తరంజనాత్మక

గీ॥ యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసా శ్చ యే ।
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి ॥ ॥౧౨॥

పదవిభాగము:— యే- చ- ఏవ- సాత్త్వికాః- భావాః- రాజసాః- చ- యే- మత్తః- ఏవ- ఇతి- తాన్- విద్ధి- న- తు- అహం- తేషు- తే- మయి॥ ॥౧౨॥

ప్రతిపదార్థము:— యేచైవ= యే; సాత్త్వికాః=సత్త్వగుణముచే నిర్వర్తింపబడిన; భావాః= పదార్థములు; రాజసాః=రజోగుణముచేనిర్వర్తింపబడిన; భావాః=పదార్థములు; తామసాః=తమోగుణముచే నిర్వర్తింపబడిన పదార్థములు; జాయన్తే=కలుగుచున్నవో; (ఈపదమధ్యాహార్యము) తాన్=ఆపదార్థములను; మత్తఏవ= నావలనజనించినవాటినిగ; విద్ధి= తెలిసికొనుము; తథాపి=(ఈపదమధ్యాహార్యము) అయినను; అహం= నేను; తేషు=వాటియందు; నతు= లేను; అనగాతదధీనుడను కాను; తే=ఆపదార్థములు; మయి= నాయందు; వర్తన్తే= (ఈపదమధ్యాహార్యము) ఉంటున్నవి; అనగా మదధీనములని యర్థము. ॥౧౨॥

---

మగు తృష్ణ రాగ మనబడును. అట్టి కామరాగములచే వివర్జితమైన బలవంతుల బలము నేనైతిని. సాత్త్వికమగు స్వధర్మానుష్ఠానసామర్థ్యము నేనే యని యర్థము. స్వధర్మముతో విరుద్ధము కాని స్వభార్యలయందు పుత్రోత్పత్తి మాత్రమున కుపయోగించు కామము నేనే యయితిని. ॥౧౧॥

భాష్యార్కప్రదీపిక:— కామ మన నప్రాప్తవిషయములయందు తత్ప్రాప్త్యభిలాష. రాగమన సంప్రాప్తవిషయములయందు రంజనాత్మకమైన ప్రేమయొక్క యతిశయము. లేక లక్షణావృత్తిచే క్రోధ మనిగాని యర్థము చెప్పనొప్పును. అట్టి కామరాగములు లేనట్టి దేహధారణమాత్రమే ప్రయోజనముగా గల బలవంతుల సామర్థ్యరూపమైన నాయందు బలవంతులు పోతములు.

అట్లే శాస్త్రవిహితమైన ధర్మమునకు విరుద్ధము కాని దేహధారణనిమిత్తమైన యశనపానాది విషయకమైన కామరూపమైన నాయందు బలవంతులు ప్రోతములు. భరతవంశమునందు జనించిన క్షత్రియులచే సేవింపబడిన యుద్ధస్వరూపమగు ధర్మమునకు సాధకమైనట్టియు, కామరాగవర్జితమైనట్టియు, క్షత్రియధర్మమగు యుద్ధముచే దేహధారణమాత్రము ప్రయోజనముగాగల నావిభూతిరూపమైనబలమను స్వధర్మముచేశత్రువులను జయించి భరతవంశజాతులలో శ్రేష్ఠత్వమును నీవు పొందదగుదువనిసూచించుటకు "భరతర్షభ" అనిసంబోధించెను. ॥౧౧॥

పరమార్థప్రప:— అప్రాప్తమైన వస్తువులయం దభిలాష రాజసము. అట్టి రాజసమగు అభిలాషయే కామ మనబడును. రాగమనగ నభిలషితార్థము ప్రాప్తమైనను తిరిగి దానియం దభిరంజనాత్మకమగు తృష్ణావిశేషము. అది తామసము. ఇట్టి రాజసతామసములగు కామరాగములతో వర్జితమైన బలవంతుల శౌర్యము నేనే యయితిని. లేక "కామరాగవివర్జితం" విషయములయందు యేప్రీతిగలదో యట్టిప్రీతివర్జితమైన పురుషార్థవంతుల స్వధర్మాచరణరూపమైన శౌర్యము నేనే యయితిని. భూతము (ప్రాణు) లయందుండు విధివిధానముగ వివాహముచేసుకొనిన తనభార్యలయందు పుత్రోత్పత్తికిమాత్రమున కుపయోగించు కామ (మదన) రూపము నేను అయితిని. ॥౧౧॥

—• ౭వ అధ్యాయము ౧౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "రసో౽హమప్సు" ఇత్యాదికముచే చెప్పబడిన రసాదిస్వరూపుడను మాత్రమే కాను, మఱియు చిత్తపరిణామమైన యేసాత్త్వికమగు శమదమాదులు, రాజసమగు హర్షదర్పాదులు, తామసమగు శోకమోహాదులు, మొదలైనప్రాణుల యవిద్యాకర్మాదివశమున జనించెడివన్నియు నావలననే జన్మించుచున్నవి. కాన నేనే నిఖిలజగత్తునకు కారణమని "అహం కృత్స్నస్య జగతః ప్రభవః" అని చెప్పిన రీతిని తెలిసికొనుము.

శాంకరభాష్యమ్:—

కించ యేచైవ సాత్త్వికా స్సత్త్వనిర్వృత్తా భావాః పదార్థా రాజసా రజో నిర్వృత్తా స్తామసా స్తమోనిర్వృత్తాశ్చ యే కేచి త్ప్రాణినాం స్వకర్మవశా జ్జాయన్తే భావా స్తా న్మత్తఏవ జాయమానా నిత్యేవం విద్ధి సర్వా న్సమస్తా నేవ । యద్యపి తే మత్తో జాయన్తే, తథాపి న త్వహం తేషు తదధీన స్తద్వశో యథా సంసారిణ స్తే పున ర్మయి మద్వశా మదధీనాః ॥ ॥౧౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని: —

సత్త్వగుణమువలన జనించెడి సాత్త్వికభావములు (అనగా భగవత్సంబంధులగు విగ్రహాదుల దర్శనముచే జనించెడి రోమాంచము (గగ్గురుపాటు) మొదలగుభావములు) రాజసాత్మకమగు విక్షేపాదులు, ప్రియవియోగస్మరణాదులచే జనించెడి తామస మగు మూర్ఛాభ్రమాదులు ఇవన్నియు జీవుల స్వకర్మవశమున నావలననే జనించుచున్న వని తెలిసికొనుము. విచారింప నవన్నియు నావలననే జనించినను వాటిసామర్థ్యముచే నేను వాటి యందు తత్తత్ప్రకారముచే ప్రకటితుడను కాను. మరేమనిన ? అట్టి భావము లన్నియు నాయందే ప్రకటితము లగుచున్నవి. నావలన జనించినను జీవులవలె నేను వాటికి వశుడను

లేక, ఈశ్లోకమున "సాత్త్వికాః, రాజసాః, తామసాః" అని సామాన్యరూపముననే చెప్పబడినవి కాని విశేషరూపమున చెప్పబడనందున సామాన్యముగ నిఖిలజడవర్గము నావలననే జనించుచున్నదని తెలిసికొనుము. అయినను (ప్రపంచమంతయు నావలన జనించినను) కల్పితసర్పవికారదూషితము రజ్జువు కానటుల సంసారివలె వికారగవశమై, వికారదూషితుడను నేను కాను. ఆసాత్త్వికాదిభావములే రజ్జువునందు సర్పాదులు వలె నాయందు కల్పితములై, మదధీనసత్తాస్ఫూర్తి కలవై, మదధీనమైయున్నవి. ౧౨॥

శంకరానందీయము:— "మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ" అను శ్లోకముచే సంగ్రహముగ నేయర్థము చెప్పబడెనో యాయర్థమునే "రసోఽహ మప్సు కౌన్తేయ ప్రభాస్మి శశిసూర్యయోః" అనునది మొదలుకొని "కామోఽస్మి భరతర్షభ!" అనునంతవర కగు గ్రంథముచే రసప్రభాదిస్వరూపముగ పరమేశ్వరునకు కారణత్వమున్ను, చంద్రాదులకు కార్యత్వమును, కారణమైన రసాదిస్వరూపముగు పరమాత్మయందు నిఖిలజగత్తునకు ప్రోతత్వమును, కారణమాత్రస్వరూపత్వమును చెప్పి యాయుపక్రాన్తమైన యర్థము నుపసంహరించుటకొఱకు ప్రస్తుతము సామాన్యరూపముగ సర్వపదార్థములు జగదేకబీజరూపమైన తనవలననే జన్మించినవనియు, తనయందే స్వాత్మస్వరూపముచే యవస్థితిని పొందినవనియు "యే చైవ" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ఈలోకమున సత్త్వగుణప్రధానమగు పదార్థములు దేవతలు, ఋషులు బ్రాహ్మణులు, శర్కర మొదలగునవి. రజోగుణప్రధానమైనవి గంధర్వులు, యక్షులు, క్షత్రియులు, మరీచ్యాదులు (మిర్చి) మొదలగు పదార్థములు. తమోగుణప్రధానమైనవి రాక్షసులు, క్రవ్యాదులు, శూద్రులు,గృంజనాదులుపుట్టుచున్నవి. అట్టిజాతములు, జనిష్యమాణములును అగు సర్వమును ఆయాగుణోపాధికుడ నగు, జగద్బీజమైన నావలననే జన్మించినవాటినిగ దెలిసికొనుము. "నాకంటె వేరగు కారణము లేనందున నితరములవలన జన్మింపవు" అని

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కాను. ఆభావము లన్నియు మదధీనములే. ఇచట నిష్కృష్టాశయ మేమనిన ? ఈగుణములు రసమునిమిత్తము నాచే ప్రకటితములై స్వరసాత్మకగుణసాఫల్యముకొఱకు నాసంబంధముచేతనే స్వయముగ నుద్బుద్ధరసముకలవై సేవను చేయుచున్నవి. కాన యవి నాయందు కలవు. నేను జీవునివలె నుత్పన్నమగు యట్టి భావములయందు రసయుక్తుడనై కానని భావము. అని కొందరు వ్యాఖ్యానించిరి. ఇచట భాష్యతత్త్వమిది. చిదానందాభివ్యంజకమగు భావముల కీశ్వరాత్మత్వము చెప్పుటవలన యితరమగు రాజసతామసభావ

ఏవకారమున కర్థము. అట్టి సాత్త్వికాదిపదార్థములయందు నేను సత్త్వరజస్తమోగుణరూమున కారణస్వరూపముచే నుంటిని. కాన నవియు సాత్త్వికాదిగుణస్వరూపము స్వకారణము అగు నాయందు ప్రోతములై నాస్వరూపముగ నున్నవి. ఎట్లు సత్త్వగుణకార్యమగు శర్కరాదికము మాధుర్యమాత్రమగుచున్నదో, ఎట్లు రజోగుణకార్యమగు మరీచ్యాదికము కటుమాత్రమగుచున్నదో, తమోగుణకార్యమగు గృంజనము మత్తతామాత్రమగుచున్నదో. అట్లే బ్రహ్మకార్యమగు నిఖిలజగత్తు బ్రహ్మమాత్రస్వరూపమే యని తెలిసికొనవలెను.

ఈచెప్పుటవలన "మత్తః పరతరం నాన్యత్" "మయి సర్వ మిదం ప్రోతమ్" అనునవి మొదలుకొని "రాజసా స్తామసాశ్చ యే" అనునంతవరకగు గ్రంథముచే మాయాశబలితబ్రహ్మమునకు మృత్తువలె పరిణామకారణత్వపక్షము నాశ్రయించి కార్యమునకు కారణమాత్రత్వమును మృద్ఘటాదికమునందు సమ్యగ్దృష్టాంతన్యాయముచే "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాదిపూర్వోక్తశ్రుతిబలముచేతను, బ్రహ్మకార్యమగు నిఖిలజగత్తునకు బ్రహ్మమాత్రత్వమునే లెస్సగ నిర్ధారణచేసి విజ్ఞాతవేదాన్తార్థు లగు యతులు ఈనిఖిలజగత్తు, నేను బ్రహ్మమే అని తలచి, వాసనాకృతమగు నామరూపభేదకల్పనను నిశ్శేషముగ విడచి, తనయందును యంతటను బ్రహ్మబుద్ధినే ప్రయత్నపూర్వకముగ సంపాదింపదగును. ఇదియే సమాధి. అంతట బ్రహ్మాకారవృత్తి, బ్రహ్మత్వవాసనయు యెట్లు దృఢమైనదై, నిరన్తరమైనదై, స్వాధీనమగునో అట్లు యుండవలెనని సూచింపబడెను. ఈ విషయమునే "సర్వంఖల్విదం బ్రహ్మ, తజ్జలానీతి శాన్త ఉపాసీత" అను శ్రుతియు బోధించుచున్నది.

ఇట్లు మాయోపాధికము (సచ్ఛబ్దవాచ్యము మాయాశబ్దబ్రహ్మము) నగు బ్రహ్మమునకు "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాది శ్రుతిప్రసిద్ధము, పరిణామలక్షణము నగు జగత్కారణత్వమును చెప్పి, పరిపూర్ణము, సర్వాధారము నగు బ్రహ్మమునకు పరిణామకారణత్వపక్షమున "రసోఽహ మప్సు" అని అబాదులయందు కారణస్వరూపముచే రసాద్యాత్మకముగ నుండుటంబట్టి పరిచ్ఛిన్నత్వము, తద్గుణదోషములు "జలము మధురము". అని తదధీనసత్త్వము, "మధురరసస్తత్త్వే, బ్రహ్మసత్త్వం, మధురరసనాశే బ్రహ్మనాశః" అని వికారిత్వము మొదలగు దోషములు ప్రసక్తమయ్యెడిని. అట్టి దోషముల ప్రసక్తి లేకుండుటకొఱకు, బ్రహ్మమునకు దృశ్యమగు జగత్తుయొక్క సంబంధరాహిత్యముకొఱకును "అస్థూల మన ణ్వహ్రస్వమ్" ఇత్యాది శ్రుతిసిద్ధనిర్విశేష స్వరూపత్వ నిశ్చయముకొఱకు, పూర్వమునందు చెప్పఁబడిన సమాధినిష్ఠచే పరిశుద్ధమైన యంతఃకరణముకల యతులకు నిర్విశేషమగు పరబ్రహ్మమునం దాత్మత్వ బుద్ధి సిద్ధించుటకొఱకు అబాదుల (జలాదుల) యందును రసాదిస్వరూపముచే స్థితిని "నత్వహం తేషు" అను వాక్యముచే నిషేధించుచుండెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—
ములకు పరమేశ్వరాత్మకత్వము లేదని శంకింపజనదు. ప్రాణులు మూడు విధములనుట యందు హేతువులు సాత్త్వికరాజసతామసభావములు. అట్టి భావము లన్నియు ప్రాణులకు స్వకర్మవశమున నావలననే జనించుచున్నవని తెలిసికొనుము. అట్లగుచో తండ్రివలన జనించిన పుత్రుల యధీనముతండ్రియైనటుల నీవలనజనించిన యాభావముల యధీనుడవు నీవును యగుదువా? యని శంకింపజనదు. జీవులుసాత్త్వికాదిభావాధీనులయినటుల నావలన సాత్త్వికాదిభావములు జనించినను నేనుమాత్రి మాభావాధీనుడను కాను. (అనగా నేను

"న త్వహం తేషు" అను వాక్యముచే బ్రహ్మమునకు జగత్కారణత్వము నిషిద్ధమగుచో "యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాది జగదుపాదానకారణత్వప్రతిపాదకశ్రుతులకు "అహం కృత్స్నస్య జగతః ప్రభవః" అని జగదుపాదానకారణత్వబోధకస్మృతులకును యప్రామాణ్యము సంభవించు నని శంకింపజనదు. "యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాదిశ్రుతులు, "అహం కృత్స్నస్య జగతః ప్రభవః" ఇత్యాదిస్మృతులు అద్వైతావధారణతత్పరము లగుటవలన ప్రామాణ్య ముపపన్నము. అది యెట్లనిన? కొందరు ద్వైతులు ప్రకృతియే జగత్కారణమనియు, కొందరు అణువులే జగత్కారణమనియు బ్రహ్మముకంటె వేరుగ జగత్కారణమును కల్పించి శ్రుతిసిద్ధమైన యద్వైతమును తిరస్కరించుచుండిరి. అట్టి తిరస్కారమువలన నద్వైతశ్రుతులకు వ్యాహతి సంభవించెడిని. అట్టి వ్యాహతిని స్వయముగ సహింపనిదై "యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మమునకే జగత్కారణత్వమును, కార్యమునకు కారణానన్యత్వమును యనేకదృష్టాంతములచే చెప్పి యద్వైతమునే నిర్వహించుచున్నవి. కాన సృష్టిప్రతిపాదకశ్రుతులు "వాయుర్వై క్షేపిష్టా దేవతా" అను యర్థవాదవాక్యములకు "వాయవ్యగ్ం శ్వేత మాలభేత" అను విధివాక్యైకవాక్యతాపన్నమై విధేయమైన వాయవ్యపశ్వాలంబనప్రాశస్త్యప్రతీతి జననద్వారమున ప్రామాణ్యము పొసగనటుల యద్వైతశ్రుత్యేకార్థములై "ఏక మేవాద్వితీయం బ్రహ్మ" ఇత్యాద్యద్వైతశ్రుతులతోను, "విజ్ఞాన మేకం" ఇత్యాదిస్మృతులతోను ప్రామాణ్యము కలదు. ఈ విషయమున శంకల కవకాశములేదు.

అట్లగుచో ప్రకృతికి, పరమాణ్వాదులకు జగత్కారణత్వ మంగీకరింపనటుల బ్రహ్మమునకుగూడ జగత్కారణత్వ మంగీకరింపనిచో జగత్తు నిష్కారణముగనే సంభవింపవలసివచ్చు నని శంకింపజనదు. అధిష్ఠానాజ్ఞానలక్షణమగు యీభ్రమయే జగత్కారణము. దానివలననే జగత్తు సంభవించుచుండ జగత్తు నిష్కారణముగ సంభవింపవలసివచ్చు నను శంక యెట్లు సంభవించును! సంభవింపదు. అందువలననే శ్రీకృష్ణపరమాత్మ "నత్వహం తేషు" అని చెప్పెను. "ఏతద్యోనీని" అని చెప్పుటవలన మాయామయము, రజ్జుసర్పమువలె ప్రతీతిమాత్రములైన యీ ఆకాశాదులయందు రసాదిరూపముచే నేను కారణము కాను. మరేమనిన? మాయయే. ఎట్లు మరుభూమియందు జలప్రతీతి (భ్రాంతి) కలుగుచున్నదో యట్లే విశేషములేవియు లేనట్టి నాయందు మాయచేతనే విశేషాకారముగ ఆకాశాదుల ప్రతీతి కలుగుచున్నది. అందువలననే "వికల్పో నహి వస్తు మాయామాత్ర మిదం ద్వైతమ్" "అసత్త్వా దన్యస్య" ఇత్యాదిశ్రుతులచేతను, "యథా స్వప్నప్రపంచోఽయమ్" ఇత్యాదిస్మృతులచేతను, ఈ నిఖిలప్రపంచము మాయాకార్య మగుటవలన ఐన్ద్రజాలికమువలె

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పరమార్థస్వరూపుడనగుటవలనను సాత్త్వికాది భావములు కల్పితము లగుటవలనను తద్గుణదోషములు నాకు సంభవింపవని యర్థము.) సాత్త్వికాదిభావములుగూడ నీవలెనే స్వతంత్రము లగుటవలన వాటికి కల్పితత్వ మెట్లు పొసగు నని శంకింపజనదు. అట్టి సాత్త్వికరాజసతామసస్వభావములు నాయధీనములు. (అనగా అట్టి మూడువిధములగు భావములు యీశ్వరార్థములగుటచే యీశ్వరాధీనములు కాన కల్పితములు) కల్పితములు అధిష్టానమునందుగల సత్తాప్రతీతులచేతనే సత్తాప్రతీతులు కలవి. కాన నధిష్టాన మాత్రమే వాటికి సిద్ధించుచుండుటచే కల్పితములగు స్వభావములకు స్వాతంత్ర్యయము లేదని యర్థము. ॥౧౨॥

మిథ్యయనెడి యుక్తులచేతను, జగత్తు మాయాకార్య మగుటవలన మిథ్య యని నియమముగ జగత్తునకు మిథ్యాత్వము చెప్పబడుచున్నది. జాగ్రత్తునందుండు ప్రపంచము సుషుప్తియందును, స్వప్నమునందును. స్వప్నమునందుండు ప్రపంచము జాగ్రత్తునందును వ్యభిచరించుటవలనను ఆజాగ్రత్స్వప్నప్రపంచములు సుషుప్తియందు లేకుండుటవలనను జగత్తునకు మాయాకార్యత్వము, ప్రతీతిమాత్రత్వము యుక్తమే. కాన మరుజలమువలె ప్రతీతిమాత్రస్వరూపములగు యబాదులయందు పరిపూర్ణము, అప్రమేయము, నిష్కలము, నిష్క్రియము, అసంగము, అమూర్తము, అవికారి యగు బ్రహ్మమునకు అబాదులే యాధారముగ నబాదులయం దవస్థానము సంభవింపదు. అబాదులయందే యుండనపుడుయబాదుయలందుగలగుణదోషపరిచ్ఛిత్త్యాదులు బ్రహ్మమున కూహింటకైన శక్యములు కావు. అది యెట్లనిన భ్రమకల్పితసర్పమునందు రజ్జువునకుస్థితి, సర్పధర్మమగు క్రౌర్యాదులయొక్క సంబంధము, విషముయొక్క సంబంధము, మరియేయితరమైన సర్పసంబంధమగు ధర్మములసంబంధము కల్పించుటకు శక్యము కాదో అట్లే యని గ్రహింప నగును.

పరిపూర్ణము, అసంగము, అపరిచ్ఛిన్నము అగు బ్రహ్మమునకు అబాదులయం దేకదేశమున స్థితి సంభవింపపోవుగాక, అబాదిభూతములకు నీయందు స్థితి సంభవించుగాక యను శంకను "తే మయి" అను వాక్యముచే తొలిగించుచుండెను.

అదృశ్యత్వాదిగుణకము, కూటస్థాసంగచిద్రూపము నగు పరబ్రహ్మమునందు వాస్తవికముగ అబాదిభావములు "నేహ నానాస్తి కించన। నహీదం సర్వం కదాచిత్। నహ్యస్తి ద్వైతసిద్ధిః" ఇత్యాదిశ్రుతులవలనలేవు. కాన త్రికాలములయందు సజాతీయవిజాతీయస్వగతభేదరహితము, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము, అద్వితీయము, ఆనందైకరసము నగు ఒక పరబ్రహ్మమే కలదని "ఏక మేవాద్వితీయం బ్రహ్మ" అను శ్రుతివలన సిద్ధమగుచున్నది. ॥౧౨॥

శ్రీధరీయము:— మఱియు నితరమైన సాత్త్వికమగు శమదమాదులు, రాజసమగు ద్వేషదర్పాదులు, తామసమగు శోకమోహాదులు ప్రాణుల స్వకర్మవశమున జనించును. అవన్నియు మదీయ ప్రకృతిగుణత్రయకార్యమగుటవలన నావలననే జనించినవాటినిగ తెలిసికొనుము. ఇట్లైనను వాటియందు నేను లేను. జీవునివలె నేను తదధీనము కాను. అవన్నియు మదధీనమై నాయందుంటున్నవి. ॥౧౨॥

గీ॥ త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్ ॥ ॥౧౩॥

పదవిభాగము :— త్రిభిః– గుణమయైః– భావైః– ఏభిః– సర్వం– ఇదం– జగత్ – మోహితం– న– అభిజానాతి– మాం– ఏభ్యః– పరం– అవ్యయమ్ ॥౧౩॥

ప్రతిపదార్థము :— ఇదం=ఈపరిదృశ్యమానమగు; సర్వం=సమస్తమగు; జగత్=ప్రాణిజాతము; త్రిభిః=మూడువిధములైన: గుణమయైః=సత్త్వరజస్తమోగుణవికారములైన; (రాగద్వేషమోహాదిప్రకారములగు) ఏభిః=పూర్వోక్తములగు: భావైః=పదార్థములచే; మోహితంసత్=అవివేకమునుపొందింపబడినదియై; మాం=నన్ను; ఏభ్యః=ఈగుణములకంటె; పరం=వ్యతిరిక్తునిగను; అవ్యయం=వ్యయరహితునిగను; నాభిజానాతి=తెలిసికొనలేకున్నది; ॥౧౩॥

శాంకరభాష్యమ్:—

ఏవంభూతమపి పరమేశ్వరం నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావం సర్వభూతాత్మానం నిర్గుణం సంసారదోషబీజప్రదాహకారణం మాం నాభిజానాతి జగ దిత్యనుక్రోశం దర్శయతి భగవాన్ । తచ్చ కిం నిమిత్తం జగతోఽజ్ఞాన మిత్యుచ్యతే— త్రిభి ర్గుణమయై ర్గుణవికారై రాగద్వేషమోహాది

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈశ్వరునకు నిత్యత్వ, శుద్ధత్వాదికము, సర్వస్వాతంత్ర్యము సిద్ధమైయుండ అట్టి ఈశ్వరస్వరూపమగు జగత్తునకు సంసార మెట్లు సంభవించును? అను శంకకు సమాధానముగ జగత్తున కీసంసారము అజ్ఞానమూలక మని యీశ్లోకమున జెప్పుచుండెను. నిత్యశుద్ధ

—• ౭వ అధ్యాయము ౧౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పరమేశ్వరుడ వగు నీవు స్వతన్త్రుడవైయుండ, నిత్యశుద్ధబుద్ధముక్తస్వరూపుడవై యుండ అట్టి నీస్వరూపమగు జగత్తునకు సంసార మెట్లుల ప్రాప్తించును? నిత్యశుద్ధబుద్ధస్వరూపుడనైన నాస్వరూపము తెలిసికొనకపోవుటచే సంసారము జగత్తునకు ప్రాప్తించుచున్నదనెదవా? అట్టి నీ స్వరూపమును తెలిసికొనకపోవుట యెందువలన? అను శంకను "త్రిభిః" అను శ్లోకముచే తొలిగించుచుండెను.

పూర్వమునందు చెప్పబడిన సత్త్వరజస్తమోగుణవికారములైన భావములచేత (భవనధర్మముకలవాటిచేత) నిఖిలప్రాణిజాతము వివేకమునకయోగ్యత్వమును పొందించబడినదై సత్వరజస్తమోవికారములైన భావములకంటె పరుడను వీటికల్పనకధిష్ఠానము, అత్యన్తవిలక్షణము, అవ్యయము, సర్వవిక్రియాశూన్యము, ప్రపంచసంబంధములేనట్టి ఆనందఘనము, స్వప్రకాశము, అవ్యవహితము అగునట్టి నన్ను తెలిసికొనలేకున్నది. అట్టి స్వరూపాపరిచయమువలన సంసారముకలదివలెనున్నది. అవివేకుల దౌర్భాగ్యము నేమందును. అని శ్రీకృష్ణపరమాత్మ యనుక్రోశమును చూపించుచుండెను. ॥౧౩॥

శంకరానందీయము:— పరిపూర్ణుడవు, సచ్చిదానందైకరసస్వరూపుడవు, అద్వితీయుడవు, పరబ్రహ్మస్వరూపుడవు నగు నిన్ను దెలిసికొనిన నిశ్శేషసంసారదుఃఖనివృత్తి యగునుకదా! అట్టి పరమప్రయోజనమునకై లోకము నిన్నే కారణముచే దెలిసికొనలేకుండెను.? అను యాశంకపై యా కారణమును చెప్పుచున్నాడు. "త్రిభిః గుణమయైః" సత్త్వరజస్తమోగుణపరిణామములైన మూడువిధములగు "భావైః" భోగ్య

శాంకరభాష్యమ్:—

ప్రకారై ర్భావైః పదార్థై రేభి ర్యథోక్తైః సర్వ మిదం ప్రాణిజాతం జగ న్మోహిత మవివేకతా మాపాదితం సత్ నాభిజానాతి మామేభ్యో యథోక్తేభ్యో గుణేభ్యః పరం వ్యతిరిక్తం విలక్షణం చావ్యయం వ్యయరహితం జన్మాది సర్వ భావ వికారవర్జిత మిత్యర్థః । ॥౧౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని

బుద్ధముక్తస్వభావుడను, సర్వభూతాత్మస్వరూపుడను, నిర్గుణుడను, సంసారదోషబీజదాహకారణుడను అగు నన్ను యీలోకము తెలిసికొనలేకున్నది! (ఎంతకష్టము! అని శ్రీకృష్ణభగవానులు అనుక్రోశమును జూపుచుండెను.) జగత్తును తెలిసికొనలేకుండుటకు కారణమే మందువా? సత్త్వరజస్తమోరూపము లగు రాగద్వేషమోహాదిప్రకారము లగు పదార్థములచే నీసర్వప్రాణిసమూహము అవివేకమును పొందింపబడినదియై, నన్ను యథోక్తములగు గుణములకంటె వ్యతిరిక్తునిగను (విలక్షణునిగను), వ్యయరహితునిగను, (జన్మాదిసర్వభావవికారవివర్జితునిగను) తెలిసికొనలేకున్నది. ॥౧౩॥

పదార్థములు, అనుభూయమానములు నగు శబ్దాదిషయవిముల చేతను, బంధకములు, తత్ప్రవృత్తి కారణములు నగు రాగద్వేషాదుల చేతను, "మోహితం" (సదసద్వివేకము లేకపోవుట మోహమనబడును. అట్టి) మోహమును పొందినదియై, ("శ్లో॥ ఇంద్రియాభ్యా మజయ్యాభ్యాం ద్వాభ్యామేవ హాతం జగత్ । అహో! ఉపస్థజిహ్వాభ్యాం బ్రహ్మాదిమశకావధి" బ్రహ్మ మొదలుకొని మశకపర్యంతమునగు యీజగత్తు అజేయములగు ఉపస్థము, జిహ్వ యనెడి రెండింద్రియములచేతనే జయింపబడెను. ఎంతఆశ్చర్యము అను న్యాయముచే ననాద్యవిద్యచే విషయభోగలాలసమైన) "ఇదం సర్వం జగత్" జంగమప్రాణిసమూహరూపమగు యీసర్వజగత్తు "ఏభ్యః పరం" ఈసత్త్వాదిగుణములకంటెను, గుణకార్యములగు యాకాశాదిభూతములకంటెను, సర్వదృశ్యములకంటెను "పరం" నిత్యత్వ, నిర్గుణత్వ శుద్ధత్వ, బోధైకరసత్వ, ఆనందఘనత్వాది ధర్మములచే విలక్షణుడను, "అవ్యయం" అవిక్రియుడను, శాశ్వతుడను, పరిపూర్ణుడను, అద్వితీయుడను, "మాం" పరబ్రహ్మ నగు నన్ను "నాభిజానాతి" తెలిసికొనలేకుండెను. (ఒకానొకడు శ్రవణమననములు జేసియు బ్రహ్మమును పరోక్షముగనే తెలిసికొనుచుండెనుగాని, "ఇదియే నేను" అని యాభిముఖ్యముతో స్వరూపముచే దెలిసికొనలేకుండెనని యర్థము.) లేక "గుణమయైః" మనోమయకోశము, విజ్ఞానమయకోశము, జ్ఞానేంద్రియములు ఇవి సత్త్వగుణవికారములు. ప్రాణాదికము, కర్మేంద్రియములు, రజోగుణవికారములు. ఆనందమయకోశము, అన్నమయకోశము, తమోగుణవికారములు. ఈవిధముగ సత్త్వాదిగుణమయములగు మూడువిధములగు భావములచే (ఆత్మకు ఉపాధిగ భావింపబడునవిగాన స్థూలసూక్ష్మకారణదేహములు, భావమునలబడును.) సిద్ధమైన "ఇదం జగత్" ఈసర్వప్రాణిజాతము, మోహితం" ఈ పంచకోశస్వరూపమైన శరీరమే నేను అనెడి ఆవరణాత్మకము, వాసనాత్మకము, త్రిగుణాత్మకము నగు యనాదిప్రవృత్తమైన యవిద్యచే దేహమునందే యాత్మబుద్ధిని పొందింపబడినదియై "ఏభ్యః" స్వయముగ ఈ స్థూలసూక్ష్మకారణదేహములకంటె "పరం" నిత్యత్వ, శుద్ధత్వ, సూక్ష్మత్వ, సర్వాంతరత్వ; కూటస్థత్వ, అసంగత్వ, చిద్రూపత్వ, ఆనందైకరసత్వ, సర్వజ్ఞత్వ; సర్వసాక్షిత్వ, సర్వప్రకాశకత్వాదిధర్మములచే విలక్షణుడను, ఆవరణము లేకపోవుటచే నెల్లప్పుడు అహంస్వరూపముగ ప్రకాశమానుడను, అందునను సుషుప్తియందు ప్రత్యక్షముగ ప్రతీయమానుడను, ఏకరసస్వరూపుడను యగు "మాం" నన్ను ప్రత్యగ్రూపపరబ్రహ్మమునుగ "నాభిజానాతి" తెలిసికొనలేకుండెను.

గీ॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే ॥

పదవిభాగము:— దైవీ- హి- ఏషా- గుణమయీ- మమ- మాయా- దురత్యయా- మాం- ఏవ- యే- ప్రపద్యన్తే- మాయాం- ఏతాం- తరన్తి- తే ॥౧౪॥

ప్రతిపదార్థము:— దైవీ=పరమేశ్వరుడను, విష్ణుస్వరూపుడను అగు నాస్వరూపమైనదియు; గుణమయీ=త్రిగుణాత్మికయు; ఏషా=ఈయుక్తమగు; మమ=నాసంబంధమగు; మాయా=మాయ; దురత్యయా=అతిక్రమించుటకు శక్యముకానిది; మామేవ=మాయావిని, స్వస్వరూపుడనుఅగు నన్నే; యే=ఎవరు; ప్రపద్యంతే=సేవించెదరో(పొందెదరో); తే=వారు; ఏతాం=ఈమాయను; తరంతి=దాటుచుండిరి; ॥౧౪॥

శాంకరభాష్యమ్:—

కథంపున ర్దైవీ మేతాం త్రిగుణాత్మికాం వైష్ణవీం మాయా మతిక్రామన్తీ త్యుచ్యతే:— దైవీ దేవస్య మమేశ్వరస్య విష్ణోః స్వభూతా హి యస్మా దేషా యథోక్తా గుణమయీ మమ మాయా దురత్యయా దుఃఖేనాత్యయోఽతిక్రమణం యస్యా స్సా దురత్య

శాంకరభాష్యతత్త్వబోధిని:—

త్రిగుణాత్మికయు, వైష్ణవియునగు యీమాయ నతిక్రమించుట ఎట్లు? అను యీ శంకపై జెప్పుచున్నాడు. ఈశ్వరుడను, వ్యాపనశీలుడను అగు నాస్వరూపభూతమగు యీ నాసంబంధమగుమాయయతిక్రమించుటకుశక్యముకానిది. అట్లయినమాయావిని, స్వాత్మస్వరూపు

అనగా ఎట్లు దేహేంద్రియాదికముకంటె వేరుగ ఆకలిని, రోగమును, ఆరోగ్యమును, భోజనాదిజన్యమగు సుఖమును తెలిసికొనుచుండిరో యట్లే దేహేంద్రియాదికముకంటె భిన్నునిగ "ఈపరమాత్మస్వరూపమునే నేను" అని నన్ను స్వాత్మనుగ యెవడును సాక్షాత్కరింప జేసుకొనలేకుండె నని యర్థము. ఇదియే మహాదాశ్చర్య మని భగవంతుడు తలచుచుండెను. ॥౧౩॥

——• ౭వఅధ్యాయము ౧౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •——

మధుసూదనసరస్వతీయము:— పూర్వోక్తవిధమున యనాదిసిద్ధమగు మాయయొక్క గుణత్రయముచే కట్టబడిన యీజగత్తునకు స్వాతంత్ర్యము లేమింజేసి ఆమాయను విడచుటకు సామర్థ్య ముండదు గాన యొకప్పుడును మాయ నతిక్రమించుట సంభవముకాదు, మాయ యనాదిప్రవృత్తిమగుటచే వస్తువివేకసామర్థ్యము లేమింజేసి మాయాతిక్రమణ మెట్లు సంభవించునను యీశంకపై భగవదేకశరణు డగుటచే తత్త్వజ్ఞానద్వారమున ముముక్షువు మాయ నతిక్రమించుటయు సంభవమే యని సమాధానమును జెప్పుచున్నాడు.

మాయ "దైవీ" "ఏకోదేవ స్సర్వభూతేషు గూఢః" ఇత్యాదిశ్రుతిప్రతిపాదితమై, స్వయముగ ప్రకాశించునదియు స్వప్రకాశచైతన్యానందరూపము, విభాగరహితము నగు దైవమునందు తదాశ్రయత్వముచేతను, తద్విషయత్వముచేతను కల్పితములైన ఆశ్రయత్వ, విషయత్వములు కలదియై యగును. "ఏషా" ఈమాయ సాక్షిప్రత్యక్ష మగుటచే లేదని చెప్పుటకశక్యయై, (ఇట "హి" అను శబ్దము ప్రసిద్ధిద్యోతకము). భ్రమోపాదాన మగుటచే అర్థాపత్తిప్రమాణసిద్ధము. "గుణమయీ" ఈమాయ సత్త్వరజస్తమోగుణత్రయస్వరూపమై, ముప్పేటనువేయబడిన త్రాడువలె యతిదృఢమై బంధక మగుచున్నది. మఱియు నీమాయ "మమ"

శాంకరభాష్యమ్:—

యా । తత్రైవంసతి సర్వధర్మా న్పరిత్యజ్య మామేవ మాయావినం స్వాత్మభూతం సర్వాత్మనా యే ప్రపద్యంతే తే మాయా మేతాం సర్వభూతమోహినీం తరంత్యతిక్రామంతి సంసారబంధనా న్ముచ్యన్త ఇత్యర్థః ॥౧౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

డను అగు నన్నే యన్నిధర్మములను విడచి, యన్నివిధములచేతను యెవరు సేవించెదరో వారు సర్వభూతములను మోహపెట్టెడి యామాయను అతిక్రమించెదరు. (అనగా సంసారబంధనమునుండి విడువబడుదురు.) ॥౧౪॥

మాయావిని, పరమేశ్వరుడను, సర్వజగత్కారణుడను, సర్వజ్ఞుడను, సర్వశక్తిమంతుడను అగు నాస్వరూపమై నాస్వాధీనమగుటచే జగత్సృష్ట్యాదినిర్వాహకము. "మాయా" తత్త్వప్రతిభాసప్రతిబంధద్వారమున యతత్త్వప్రతిభాసహేతువు, ఆవరణవిక్షేపశక్తిద్వయవతియు, సర్వప్రపంచమునకు ప్రకృతియగు అవిద్య "మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరం" అను శ్రుతిసిద్ధమైనది.

ఇచట ఈప్రక్రియ చూడనగును:— జీవుడు, ఈశ్వరుడు, జగత్తు అను విభాగశూన్యమైన శుద్ధచైతన్యమునందు అనాదియగు యవిద్య సత్త్వప్రధానముగ నధ్యస్తమై స్వచ్ఛమగు దర్పణము ముఖాభాసను ప్రతిబింబమును గ్రహించునటుల చిదాభాసను (చిత్ప్రతిబింబమును) అంతట గ్రహించుచున్నది. ఇట బింబస్థానీయుడగు పరమేశ్వరుడు ఉపాధిదోషానాస్కందితుడు. ప్రతిబింబస్థానీయుడగు జీవుడు ఉపాధిదోషాస్కందితుడు. ఈశ్వరునివలననే జీవుని భోగముకొఱకు ఆకాశాదిక్రమమున శరీరేంద్రియసంఘాతము, జీవభోగ్యమగు నిఖిలప్రపంచము జనించుచున్నదని కల్పన సంభవించుచున్నది. బింబప్రతిబింబముఖములయం దనుగతమైన ముఖస్వరూపమువలె ఈశ్వరునియందు, జీవునియందుననుగతమైన మాయోపాధిచైతన్యము సాక్షియని కల్పింపబడుచున్నది. అట్టి సాక్షిచైతన్యముచేతనే తనయం దధ్యస్తమైన మాయ, మాయాకార్యమగు నిఖిలప్రపంచము ప్రకాశించుచున్నది. కాన సాక్ష్యభిప్రాయముచే "దైవీ" అనియు, బింబభూతమగు యీశ్వరాభిప్రాయముచే "మమ" అని మాయ శ్రీకృష్ణపరమాత్మచే యీశ్లోకమునందు చెప్పబడెను. విచారించుచో యవిద్యయొక్కటియే యగుటవలన నవిద్యాప్రతిబింబభూతుడగు జీవుడు గూడ యొక్కడే యని యనవలయును. అయినను అవిద్యాగతమగు యంతఃకరణసంస్కారము లనేకము లగుటవలన నంతఃకరణోపాధిభేదముచే జీవులయందు నానాత్వము(భేదము) వ్యపదిశ్యమానమగుచున్నది. కనుకనే "మా మేవ యే ప్రపద్యన్తే" అనుచోట "యే" అనియు, "న మాం దుష్కృతినో మూఢాః" అనుచోట "దుష్కృతినోమూఢాః" అనియు, "చతుర్విధా భజన్తే మాం" అనుచోట "చతుర్విధాః" అనియు బహువచన ముపపన్న మగుచున్నది. "మరియు త ద్యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవ త్తథర్షీణాం తథా మనుష్యాణాం" అనుశ్రుతియందు "దేవానాం, ఋషీణాం, మనుష్యాణాం" అని బహువచన ముపపన్నము. మరియు అంతఃకరణోపాధిభేదమును విచారింపనిచో జీవత్వప్రయోజకోపాధి యగు యవిద్యయొక్కటియే యగుటచే జీవుడుగూడ యొక్కడే యని "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" అనుచోట "మాం" అనియు. ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి" అనుచోట "పురుషం" అనియు "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః" అను శ్రుతియందు "దేవః" అనియు, "అనేన జీవేనాత్మనా

నుప్రవిశ్య'' అను శ్రుతియందు "జీవేన'' అనియు, వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ । భాగో జీవః'' అను శ్రుతియందు "జీవః'' అనియు, జీవగతమైన యేకత్వమును బోధించెడి ఏకవచనప్రయోగము లుపపన్నములు. విచారింప దర్పణమునం దచేతనాంశయే ప్రతిబింబించుటచే దర్పణగత చైతన్యప్రతిబింబము తనను కాని, యితరుని కాని తెలిసికొనదు. అయినను అవిద్యాగతచిత్ప్రతిబింబము చిద్రూపమే యగుటవలన తనను పరునిగూడ తెలిసికొనును. ప్రతిబింబపక్షమునందు బింబచైతన్యమునందే ఉపాధిస్థత్వమాత్రమే కల్పిత మగుటవలనను, ఆభాసపక్షముగ జీవుడు అనిర్వచనీయుడైనను జడవిలక్షణుం డగుటవలన తనను, పరుని తెలిసికొనుట సంభవించును.

ఇట్టి ప్రతిబింబభూతు డగు జీవుడు తనకు బింబభూతుడగు యీశ్వరునితోడియైక్యమును యెంతవరకు తెలిసికొనడో అంతవరకు జలగతకమ్పాదికము జలసూర్యునికివలె యుపాధిగతవికారసహస్రము ననుభవించును. ఈవిషయమునే "దురత్యయా'' అనుపదముచే చెప్పుచుండెను. బింబభూతేశ్వరైక్యసాక్షాత్కారము లేనిదే తరించుటకు శక్యముకాదు. కాన మాయ దురత్యయ మనబడును. కనుకనే జీవుడు అంతఃకరణావచ్ఛిన్ను డగుటవలన అంతఃకరణ సంబంధమునే చక్షురాదీన్ద్రియద్వారమున ప్రకాశింపజేయుచు కించిద్జ్ఞుడు అగుచున్నాడు. అందువలననే "జానామి'' (తెలిసికొనుచున్నాను.) "కరోమి'' (చేయుచున్నాను.) "భుంజే'' (భుజించుచుంటిని) అనెడి యనర్థశతములకు నిలయు డగుచున్నాడు. అట్టి యే జీవుడు—అనంతశక్తిసంపన్నుడు, మాయానియన్త, సర్వజ్ఞుడు, సర్వఫలదాత, యెల్లపుడు ఆనందఘనమూర్తి, భక్తానుగ్రహముకొఱకు అనేకఅవతారములను ధరించునట్టి, పరమగురువునగు బింబభూత మగు భగవంతునికి తనచే నాచరింపబడు నిఖిలసత్కర్మలను సమర్పించి యారాధించునో బింబమునం దుంచబడిన యలంకారము ప్రతిబింబమునందు ప్రతిఫలించునటుల బింబభూతపరమేశ్వరునియం దర్పింపబడిన నిఖిలసత్కర్మల ఫలభూతములగు సమస్తపురుషార్థములకు ప్రతిబింబభూతమగునట్టి యీజీవుడే పొందును. ఈ విషయమునే ప్రహ్లాదుడు "నైవాత్మనః ప్రభు రయం నిజలాభపూర్ణో మానం జగాద విదుషః కరుణో వృణీతే । యద్య జ్జనో భగవతే విదధీత మానం తచ్చాత్మనే ప్రతిముఖస్య యథా ముఖశ్రీః'' అని చెప్పెను. అనగా దర్పణమునందు ప్రతిబింబించిన ముఖమునకు (ప్రతిబింబమునకు) తిలకాదికము నపేక్షించినచో బింబభూతమగు ముఖమునందే తిలకాదికము నుంచవలెను. అట్లు బింబభూతముఖమునందుంచిన తిలకాదికమే ప్రతిబింబమునందు ప్రతిఫలించును. కాని మఱియొక తీరున ప్రతిబింబము నలంకరింపవలయు ననిన యింతకంటె మఱి యేయుపాయాంతరము లేదు. అట్లే బింబభూతమగు యీశ్వరునియందు సమర్పింపబడిన పూజాదిఫలమును ప్రతిబింబభూతు డగు జీవుడు పొందును. యింతకంటె జీవునికి పురుషార్థలాభమునందు మఱి యేయుపాయము లేదు. అని దృష్టాంతముయొక్క యర్థము.

నాశరహితు డగు భగవంతుని నిరంతర మారాధించునట్టివాని యంతఃకరణము జ్ఞానప్రతిబంధకపాపరహితమై, జ్ఞానానుకూలపుణ్యముచే వృద్ధిని పొందును. అట్టిసమయమున అతినిర్మలమైన యద్దమునందు ముఖమువలె సర్వకర్మత్యాగ శమదమాది పూర్వక గురూపసదనవేదాన్తవాక్యశ్రవణ మననిధ్యాసములచే సంస్కృతమైనట్టి యంతఃకరణమునందు గురూపదిష్ట "తత్త్వమసీ'' త్యాదివేదాన్తవాక్యము సాధనముగా కలవియై, "అహం బ్రహ్మాస్మి'' అని అనాత్మాకారశూన్యనిరుపాధి చైతన్యాకార సాక్షాత్కారరూపమగు వృత్తి జనించును. అట్టి వృత్తియందు ప్రతిఫలించిన చైతన్యము తత్కాలముననే స్వవిషయాశ్రయమగు యవిద్యను ప్రదీపము తమస్సును (చీకటిని) వలె నిర్మూలించును. ఉపాధినాశమువలన నుపాదేయనాశము సర్వమతసిద్ధము కాన అనంతర మాయవిద్యానాశమువలన యావృత్తితోగూడ నిఖిలకార్యప్రపంచము నశించును.

ఈ విషయమునే శ్రీకృష్ణపరమాత్మ "మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే" అను వాక్యముచే బోధించుచుండెను. "త మేవ ధీరో విజ్ఞాయ" "తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి" ఇత్యాది శ్రుతులయందు వలె ఇచటను "మా మేవ" అనుచోట "ఏవ" అనునది అనుపరక్తతాప్రతిపత్తి నిమిత్తము ప్రయోగింపబడెను. అనగా "మామేవ" సర్వోపాధిరహితము, అఖండము నగు చిదానందసదాత్మను "యే ప్రపద్యన్తే" ఎవరు వేదాన్తవాక్యజన్యము, నిర్వికల్పక సాక్షాత్కారరూపము. నిర్వచనానర్హ శుద్ధచిదాకారత్వ ధర్మవిశిష్టము, సర్వసుకృతఫలభూతము, నిదిధ్యాసనపరిపాకప్రసూతము, సర్వాజ్ఞానతత్కార్యవిరోధి యగు చేతోవృత్తిచే విషయమొనరించుకొనెదరో (తెలిసికొనెదరో) అట్టివారు నిఖిలానర్థకారణము, దురతిక్రమణీయము నగు యీ మాయను యతిక్రమించెదరు. అనగా సర్వోపాధులు నివృత్తిని జెందుటచే సచ్చిదానందఘనరూపముగ నుండెదరు. అని యరము. ఇచట "తరన్తి తే" అని బహువచనప్రయోగము ఆత్మభేదాభిప్రాయముచే కాదు. మరేమనిన దేహేంద్రియాది సంఘాతభేద నిబంధనాత్మభేదభ్రాన్త్యనువాదార్థమని గ్రహింపనగును.

ఈశ్లోకమున నుండు "ప్రపద్యంతే" అనుపదమునకు జ్ఞానార్థకత్వము వర్ణింపబడెను. అంతకన్న ప్రపద్యంతే" అనుపదస్థానమున "ప్రపశ్యన్తి" అని ప్రయోగింప సమంజసముగ నుండ "ప్రపద్యన్తె" అని ప్రయోగించుటయందాశయ మేమనిన? ఎవరు మదేకశరణులై "మామేవ" అనంతసౌందర్యసారసర్వస్వము, నిఖిలకలాకలాపనిలయము, అభినవపంకజశోభాధికచరణకమలయుగలప్రభుడు, అనవరతవేణువాదననిరతబృందావనక్రీడాసక్తమానసుడు, హేలోద్ధృతగోవర్ధనాఖ్యమహీధరుడు, గోపాలుడు, నిషూదితశిశుపాలకంసాదిదుష్టసంఘుడు, అభినవజలదశోభాసర్వస్వహరణచణచరణుడు, పరమానంద ఘనమయమూర్తియు, అతిక్రాన్తప్రపంచుడు నగు భగవన్తుడనైన నన్నే యెల్లపుడు చింతించువారలై రోజులను గడపెదరో అట్టివారు మదీయప్రేమమహానందసముద్రమగ్నమనస్కులగుటచే సమస్తమాయాగుణవికారముచే తిరస్కరింపబడరు. "మరేమనిన మద్విలాసవినోదకుశలులగు వీరలు మదున్మీలనసమర్థులు" అని శంకించునదివలె మాయ వారకాంత క్రోధస్వభావులగు తపోధనులనుండివలె వీరలనుండి తొలగిపోవును. కాన మాయాతరణమును కోరెడివాడు నన్నే యెల్లపుడు చింతింపవలెను అనెడి యభిప్రాయము శ్రీకృష్ణపరమాత్మది. ఇట్టి యభిప్రాయమును ప్రకటించుటకే "ప్రపశ్యన్తి" అని చెప్పక "ప్రపద్యన్తే" అని చెప్పెను. శ్రుతులు, స్మృతులు ఈయర్థమునందే ప్రమాణ మొనరింపవలయును. ॥౧౪॥

శంకరానందీయము :— అనాద్యవిద్యారూపమగు మాయచేనైన యాత్మయందనాత్మత్వభ్రమచేత మోహితులును, సంసారదుఃఖాగ్నిచే సంతప్యమానులు నగు ప్రాణులకు యెట్లు సంసారతరణము సిద్ధించు నను యాశంకపై సంసారతరణోపాయమును వివక్షచేయదలచినవాడై శ్రీకృష్ణపరమాత్మ మొట్టమొదట సంసారతరణవిషయమై గొప్పప్రయత్నము చేయదగుదు. అని బోధించుటకు మాయ దుర్జయ మని "దైవీ" అను శ్లోకముచే చెప్పుచుండెను.

కాలత్రయమునందు యితరాపేక్ష లేకుండగ స్వయముగనే ప్రకాశించు పరమాత్మ "దేవః" అని చెప్పబడును. అట్టి నిర్విశేషపరమాత్మరూపమగు నాయందు ఆకాశమునందు నీలిమవలె మిథ్యాభాసరూపముచే నుండు మాయ "దైవీ" అని యనబడును. లేక "ప్రాజ్ఞే సైషాఽవిద్యా" అను శ్రుతివలన దేవస్వరూపమగు ప్రాజ్ఞునియందుండునది. "దైవీ" అని యనబడును. ప్రాజ్ఞునియందుండు త్రిగుణాత్మికయైన మాయ నాస్వరూపమునకు జలమునకు శైవాలము (నాచు)వలె ఆవరకమైయున్నది. అట్టి మాయ పురుషులకు అతికష్టముచే దాటుటకు శక్యమైనది. అనగా దృష్టాదృష్టవిషయసుఖతత్సాధనసర్వస్వపరిత్యాగపురస్సరము

గను, యమనియమాదులచేతను అట్టి మాయ దాటుటకు శక్యమైనది. కనుకనే "దురత్యయా" దుర్జయము అని చెప్పబడుచున్నది. మాయకు దుర్జయత్వము లోకశాస్త్రప్రసిద్ధమే.

ఇట్లు మాయను జయించుటయం దధికప్రయత్నము చేయవలయు నని చెప్పి మాయాతరణోపాయమును శ్రీకృష్ణపరమాత్మయే "మా మేవ" అను వాక్యముచే జెప్పుచుండెను.

నిష్కామనచేతను, ఈశ్వరార్పణబుద్ధిచేతను యనేకజన్మములయం దాచరింపబడిన పుణ్యకర్మవిశేషములచే పరిశుద్ధమైన యంతఃకరణముకలవారై, వివేకవైరాగ్యములచే సర్వమును సన్న్యసించి బ్రహ్మవేత్తయగు గురునిసన్నిధియందు శ్రద్ధతో తీవ్రమోక్షేచ్ఛచే పొందబడిన తదేకనిష్ఠాద్వారమున శ్రవణమును, మననము నాచరించి షష్ఠాధ్యాయమున చెప్పినరీతిని నిర్గుణము, అదృశ్యత్వాదిలక్షణము కల ఏకరసస్వరూపమగు పరబ్రహ్మమును నిత్యనిరంతరనిర్వికల్పకసమాధినిష్ఠ అనగా క్రియాంతరమున కవకాశమివ్వనినిష్ఠచే యే యతీశ్వరులు విపరీతప్రత్యయరహితముగ సర్వదా తమ యంతఃకరణముచే ననుసంధానము చేయుదురో, అట్టివారే గుర్వాత్మేశ్వరప్రసాదాతిశయమున లెస్సగ జన్మించిన అప్రతిబద్ధపరావరైకత్వ (జీవేశ్వరైకత్వ) విజ్ఞానముచేతనే ఆవరణవిక్షేపాత్మకము, సర్వానర్థకారణము, సత్త్వరజస్తమోగుణాత్మకమునగు మాయను, విపరీతదర్శనరూపమగు మాయాకార్యమును "ఈసర్వము నేను బ్రహ్మస్వరూపమే" అను యప్రతిబద్ధబ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముచే నశింపచేసుకొనుచుండిరి. అనగా నిత్యనిరంతరబ్రహ్మనిష్ఠచే రజోగుణములగు రాగాదులను, తమోగుణములగు విపరీతభావనాదులను. సత్త్వగుణములగు శమాదులను, తత్కార్యములగు ప్రవృత్తి, నివృత్తి, అహంకారమమకారాదులను సర్వము నతిక్రమించి ఈలోకముననే సంసారమునుండి ముక్తులై అఖండము, ఆత్మీయమునగు విదేహముక్తిసుఖమును పొందగలరు. ఇంతియేకాని యెవరు శ్రవణమాత్రముచే తనను కృతార్థునిగ తలచెదరో యట్టివారు సుఖమును పొందరు.

ఈశ్లోకమున "మా మేవ యే ప్రపద్యన్తే" అనుచోట "మాం" అనునది అస్మచ్ఛబ్దము. అస్మచ్ఛబ్దమునకు అస్మచ్ఛబ్దోచ్చారణ చేయువానియందే శక్తి కలదు. అనగా ఎవ రస్మచ్ఛబ్దము నుచ్చరించెదరో వానినే యాశబ్దము బోధించును. ఈ స్థలమున యట్టివాడు దృగ్గోచరుడగు శ్రీకృష్ణుడే. కాన నీరూపము సగుణము. అందువలన "మా మేవ యే ప్రపద్యన్తే" అనువాక్యము సగుణోపాసననే బోధించుటవలన సగుణోపాసనచేతనే మాయను తరించెదరనిమాత్రము భ్రమనొందపలదు. సగుణోపాసనవలన సత్త్వరజస్తమోగుణాత్మకమగు మాయయొక్క తరణము సంభవింపదు. కాన "మామేవ యే ప్రపద్యన్తే" అను స్థలమున నిర్గుణధ్యానమే వివక్షితము. అట్లుకాక సగుణోపాసనే యని యదియే మాయానివర్తకమనినచో అమృతసేవచే అమృతత్వము సిద్ధింపక విషసేవచే నమృతత్వము సిద్ధించు నని చెప్పినటుల హాస్యాస్పదమే యగును. కాన నిర్గుణధ్యానమే యిట వివక్షితము. అట్లు కానిచో గుణవదుపాసనచే సత్త్వాదిగుణముల నతిక్రమించుటయు, భేదదర్శననివృత్తియు సిద్ధింపదు. మరియు భేదదర్శనమే కలుగును. ఈ విషయమునే "తం యథా యథోపాసతే" అను శ్రుతియు బోధించుచున్నది. మరియు "ఏతస్మిన్నుదర మన్తరం కురుతే। అథ తస్య భయం భవతి" అనుశ్రుతి యీషద్భేదదర్శికిగూడ భయప్రాప్తినే బోధించుచున్నది. కాన "మామేవ" అని అస్మచ్ఛబ్దముచే నిర్గుణమే వివక్షితము. అంతియేకాని పిచుమందఫలమును సేవించువానికి రసాలఫలప్రాప్తి సంభవింపనటుల సగుణోపాసన చేయువానికి, నిర్గుణజ్ఞానము సంభవింపదు. ఈ విషయమునే "యథా క్రతు రస్మింల్లోకే పురుషో భవతి:తథేతః ప్రేత్య భవతి। తం యథా యథోపాస్తే తథైవ భవతి। అసన్నేవ స భవతి। అస ద్బ్రహ్మేతి వేద చేత్" ఇత్యాదిశ్రుతులు బోధించుచున్నవి. గీతాశాస్త్రముగూడ నీ విషయమునే "యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజా మ్యహమ్" అని బోధించుచున్నది. మాయ యనగ బ్రహ్మాత్మలకు,

బ్రహ్మజగత్తులకు భేదదర్శనహేతువు. అట్టి మాయకు ప్రవర్తకము- నాకిది యుపాస్యము, నేను దీనిని యుపాసించుచుంటిని. అని అహం మమ ప్రత్యయార్థభేదాశ్రయకము ద్వైతోపాసనము. అట్టి ద్వైతోపాసనమును చేయువానికే మాయానివృత్తి యగుచో తూర్పుదిక్కునకు ప్రయాణముచేయువానికి యుత్తరదిక్కునందుండు కైలాసప్రాప్తి కలుగవలసివచ్చును. కాన నీ శ్లోకమునందుండు "మామేవ" అను అస్మచ్ఛబ్దార్థము నిర్గుణపరబ్రహ్మమే. అట్టి నిర్గుణోపాసన చేయువానికే మాయాతిక్రమణ మని సిద్ధము. ॥౧౪॥

భాష్యార్థదీపిక:— అట్లగుచో జీవులను మోహపెట్టెడి, అనాదిసిద్ధము, త్రిగుణాత్మకము, అగు దైవీమాయను యేయుపాయముచే నతిక్రమించెదరు? అను యాశంకపై "దైవీ" అని చెప్పమొదలిడెను.

మాయ త్రిగుణాత్మకము. పరమేశ్వరుడ నగు నాసంబంధమైనది. అట్లైనను నాకంటె వేరుకాదు. నాస్వరూపమే. దీనినే ప్రకృతియందురు. ఇందుకు "మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్" అను శ్రుతిప్రమాణము. ఇట్టి ప్రకృతియే మాయ యని, యవిద్యయని రెండువిధములు. ఈ విషయమై "మాయా చావిద్యా చ స్వయ మేవ భవతి" అను శ్రుతి ప్రమాణము. ఈ విషయమునే "తమోరజస్సత్త్వ గుణాప్రకృతి ర్ద్వివిధా మతా। సత్త్వశుద్ధ్యశుద్ధిభ్యాం మాయాఽవిద్యే చ తే మతే" సత్త్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతి శుద్ధసత్త్వప్రధానమై మాయ యని, మలినసత్త్వప్రధానమై యవిద్యయను రెండు విధములుగ చెప్పబడుచున్నదని స్మృతియు బోధించుచున్నది. "మాయా బింబో వశీకృత్య తాం స్యా త్సర్వజ్ఞ ఈశ్వరః। అవిద్యావశగ స్త్వన్య స్తద్వైచిత్ర్యా దనేకధా" మాయాబింబము ఈశ్వరుడు. అతను సర్వజ్ఞుడు. మాయను స్వాధీనమొనరించుకొని యుండును. రెండవవాడు అవిద్యాబింబుడై యవిద్యకు లోనై యవిద్యావైచిత్ర్యమున ననేకమై యుండెను, మాయామయప్రకృతి యీశ్వరుని యధిష్ఠానముగ నాశ్రయించి జీవులను మోహపెట్టుచున్నది. ఈ విషయమునే శారీరకభాష్య మీక్రిందివిధమున బోధించుచున్నది.

అవిద్యాత్మకము బీజశక్తి. అట్టి బీజశక్తి "అవ్యక్తం" అను శబ్దముచే చెప్పబడును. అట్టి బీజశక్తి పరమేశ్వరు డాశ్రయముగా కలదై, మాయామయమై మహాసుషుప్తియని యనుపించుకొనును. సంసారులగు జీవులు యే మహాసుషుప్తియందు స్వరూపబోధరహితులై నిద్రించుచుండిరో యా మహాసుషుప్తియే యవ్యక్తమనబడును. ఆ యవ్యక్తము సంసారబీజభూతమగు అవిద్యాస్వరూపముచే మోహపెట్టునది. ఆయవిద్య పరమాత్మవిషయకము, జీవుడాశ్రయముగా కలది. ఇందులకు "వేదాన్తవేద్యమగు వస్తువును నేను యెరుగను." అను అనుభవమే ప్రమాణము.

అవిద్యయనునది యొకటి యున్నచో జీవపరమాత్మవిభాగము, జీవపరమాత్మవిభాగమున్నచో జీవుడాశ్రయముగా కల పరమాత్మ విషయకమగు యవిద్య సంభవించును. కాన అన్యోన్యాశ్రయదోషము సంభవించునని శంకింపజనదు. జీవావిద్యలు బీజాంకురములువలె యనాదులు. అందువలన పైశంక తొలిగింపబడుచున్నది.

బీజాంకురన్యాయమున పై యన్యోన్యాశ్రయదోషమును తొలిగించుచుచో బీజాంకురము లనిత్యము లగుటచేసి జీవులుకూడ యనిత్యులు కావలసివచ్చునని శంకింపజనదు. ఉత్తరోత్తరజీవాభివ్యక్తులకు పూర్వపూర్వభ్రమలు నిమిత్తములని చెప్పిన జీవాభివ్యక్తు లనిత్యములైనను జీవులు నిత్యులే యగుటంజేసి జీవానిత్యత్వదోషము తొలగును.

అవిద్య జీవాశ్రిత మగుచో జీవుడు పూర్వపూర్వభ్రమాశ్రితు డగుచో జీవోత్పత్తి (అభివ్యక్తి) యందు ఆత్మాశ్రయమనెడి దోషము సంభవించునని శంకింపజనదు. జీవునికి ఉత్పత్తియే లేనందున జీవోత్పత్తియందు ఆత్మాశ్రయమనెడి దోషమే సంభవింపదు. మరియు జీవుడు "జీవోఽహం" అను ప్రతీతిచే సిద్ధించును. అట్టి ప్రతీతిబలముచేతనే అవిద్యయు ప్రతీయమానమగుటచే పైదోషము సంభవింపదు.

అట్లగుచో తన భుజముపై నెక్కినవాని భుజముపై తానెక్కినటుల జీవుడు అవిద్యాశ్రయుడు, అవిద్య జీవాశ్రితము. ఇట జీవుడనగ అవిద్యాశ్రయుడు అని చెప్పుట (స్వస్కంధారూఢారోహణమువలె) నుండునని శంకింపజనదు. అనగా స్వాశ్రితాశ్రితత్వము విరుద్ధమని చెప్పుట. జీవుడు అవిద్యయు అమూర్తములు. మూర్తములగు కుండబందరులకు ఒకదానితో నొకటి యుండునటుల యమూర్తములు అధరోత్తరీభావముతో ఒకదానిపై నొకటియుండుట సంభవింపనందున జీవావిద్యలకు అవచ్ఛేద్యావచ్ఛేదకభావమాశ్రయింపవలెను. అట్లగుచో స్వస్కంధారూఢారోహణమువంటివిరోధము ప్రాప్తింపదు. వృక్షాశ్రితమగు శ్యేనసంయోగము శాఖాత్వముచే అవచ్ఛిద్యమగునటుల జీవత్వము అవిద్యావచ్ఛేదకోపాధికమైనది కాన జీవుడు అవిద్యచే అవచ్ఛిద్యుడు. అవిద్య చైతన్యాశ్రితమై జీవత్వముచే అవచ్ఛిన్నము. కాన పైవిరోధ మెంత మాత్రము ప్రాప్తింపనేరదు.

అవిద్యావచ్ఛేదకోపాధికము జీవత్వము. జీవుడు అవిద్యచే అవచ్ఛిన్నుడు అని చెప్పినను అన్యోన్యాశ్రయమను దోషము సంభవించుచున్నదని శంకింపజనదు. ప్రమేయత్వావగాహిప్రమాణము నిరూపకప్రమేయావచ్ఛేద్యము. ప్రమేయ మనగ స్వవిశేషణీభూతప్రమాణావచ్ఛేద్యము. ఇత్యాదిస్థలములయం దన్యోన్యాశ్రయము దోషము కానటుల ప్రకృతస్థలమున గూడ అన్యోన్యాశ్రయము దోషము కాదు.

బ్రహ్మమే సర్వప్రపంచవివర్తాధిష్ఠాన మగుటవలన జీవునకు, అవిద్యకు అధిష్ఠానము బ్రహ్మము. ఈవిషయమే "అధిష్ఠానం వివర్తానా మాశ్రయో బ్రహ్మ శుక్తివత్ । జీవావిద్యాదికానాం స్యా దితి సర్వ మనాకులమ్ ॥ (రజితమునకు ముత్యపుచిప్పవలె జీవావిద్యాదిసర్వవివర్తముల కధిష్ఠానము, ఆశ్రయము బ్రహ్మమే) అని చెప్పబడెను. కనుకనే శ్రీకృష్ణపరమాత్మయు "దైవీ హ్యేషా మమమాయా" అని చెప్పెను. శుక్తిక యెట్లు రజితస్వరూపమున భాసించుచున్నదో అట్లే పరమాత్మయే అనాద్యవిద్యావచ్ఛేదలబ్ధజీవభావభేదమున భాసించుచున్నది. ఆపరమాత్మయే దేహేంద్రియాదులచే యవచ్ఛిద్యమానుడైయజ్ఞానులచే "జారుడు" అని పిలువబడుచుండెను. అట్టి జీవులకే యవిద్య. సర్వోపాధివిహీనుడగు పరమాత్మకు లేదు.

అస్వతంత్రుని మరియొకడు కారాగృహమున ప్రవేశపెట్టును. కాని స్వతంత్రుని యెవరును బంధమున ప్రవేశపెట్టజాలరు. పరమాత్మ యన్ననో సర్వజ్ఞుడు, సర్వశక్తులు కలవాడు, స్వతంత్రుడు. అట్టిపరమాత్మ యెందువలన అకస్మాత్తుగ సంసారి యయ్యెను? అని శంకింపజనదు. జీవు డనాదియగుటచే యిట్టి శంకయే జనింపదు. కాన అవిద్యాత్మయగు జీవునకే అవిద్యాకల్పితసుఖదుఃఖాదిసంభోగము. నిర్మృష్టనిఖిలావిద్యాతద్భాసనుడు అగు పరమాత్మకు అవిద్యాకల్పిత సుఖదుఃఖాదిసంభోగము లేదు. కాన "ఏషా" అనుభవసిద్ధము, అకస్మాత్తుగ అపలాపనమున కనర్హము నగు మాయ "గుణమయీ" సత్త్వరజస్తమోమయము. సాంఖ్యులు గుణత్రయాత్మకమైనప్రధానము నొప్పియదిస్వతంత్రమనిరి. కానిమాయఅట్లు కాదు. మరేమనిన అస్వాతంత్ర్యము. దీనికి స్వాతంత్ర్యములేదని చెప్పుటకు "దైవీ" దేవుని సంబంధమైనది.అనిచెప్పెను. "దేవ స్యేయం దైవీ" దేవుని సంబంధమైనది. అయినను స్వస్వరూపమే. కాన "దైవీ" అనబడును. ఏదేవుని సంబంధమైనది ఇది? ఇది అనగ నెవరు! అను యాశంకపై "మమ, మాయా" అని చెప్పెను. నా సంబంధమైనది. దాని నామము మాయ యనబడును. ఈ మాయ "దురత్యయా" కష్టముతో నతిక్రమించుటకు శక్యమైనది. అట్టి మాయ నతిక్రమించు ఉపాయమేది? అను శంకపై "మా మేవ యే ప్రపద్యన్తే" అని చెప్పబడెను. "ఏవ" అను శబ్దముచే మాయకు వ్యావృత్తి జెప్పబడెను. మాయావ్యావృత్తమైన పరమాత్మను "యే ప్రపద్యన్తే" సర్వాత్మనా ప్రపన్నులెవరగుదురో వారు నా యనుగ్రహమువలన బుద్ధియోగమును పొందినవారలై సర్వభూతమోహకరియు, దురత్యయయు నగు- ఈమాయను అతిక్రమించెదరు. సంసారబంధనమునుండి ముక్తు లగుదురు.

—• ఇచట తెలిసికొనదగు విషయమిది •—

అనాది, అనిర్వాచ్యము, భూతప్రకృతి, చిన్మాత్రసంబంధిని యగునది మాయ. దానియందున్న చిత్ప్రతిబింబము ఈశ్వరుడు. అట్టి మాయాసంబంధమైనవి అవిద్యలు. అట్టి యవిద్యలు ఆవరణవిక్షేపశక్తులు కలవి. అనంతములు. అట్టి పరిచ్ఛిన్నానంతావిద్యాప్రదేశములయందు చిత్ప్రతిబింబములు జీవులు. అని కొందరు చెప్పుచుండిరి.

—• మఱియొక పక్షము •—

"జీవేశా వాభాసేన కరోతి మాయా చావిద్యా చ స్వయమేవ భవతి" అను శ్రుతిసిద్ధమైనవి త్రిగుణాత్మకమైన మూలప్రకృతికి రెండురూపములు కలవు. అవి యేవనిన? రజస్తమోనభిభూతశుద్ధసత్త్వప్రధానమైన మాయ యనునది ఒక రూపము. రజస్తమోభిభూతమలినసత్త్వప్రధానమైన యవిద్య యనునది రెండవ రూపము. అని మాయావిద్యాభేదమును కల్పించి మాయాప్రతిబింబము ఈశ్వరుడు. అవిద్యాప్రతిబింబము జీవుడు అని మరికొందరు చెప్పిరి.

—• 3వ పక్షము •—

మూలప్రకృతి ఒకటే విక్షేపప్రాధాన్యముచే మాయాశబ్దవాచ్యమై యీశ్వరోపాధి యగుచున్నది. ఆవరణప్రధానమై యవిద్యాశబ్దవాచ్యమై జీవోపాధి యగుచున్నది. అని కొందరు చెప్పుచుండిరి.

—• 4వ పక్షము •—

"కార్యోపాధి రయం జీవః కారణోపాధి రీశ్వరః" అను శ్రుతి ననుసరించి అవ్యక్తమందు చిత్ప్రతిబింబము యీశ్వరుడు. అంతఃకరణయందు చిత్ప్రతిబింబము జీవు డని మరికొందరనుడివిరి. ఈచెప్పబడిన నాల్గుపక్షములయందు జీవేశ్వరు లిద్దరు చిత్ప్రతిబింబవిశేషములే. యీప్రతిబింబములకు బింబభూతమైనది బ్రహ్మము (పరమాత్మ). ఆపరమాత్మయే ముక్తులకు పొందదగినది.

—• 5వ పక్షము •—

మరికొందరు జీవుడు, ఈశ్వరుడు, శుద్ధచిత్తు అనెడి త్రైవిధ్యప్రక్రియను విడచి వస్తుతః ఆకాశమొక్కటియేయైనను 1 ఘటాకాశమని, 2 జలాకాశమని, 3 మహాకాశమని, 4 మేఘాకాశమనెడి భేదమువలన నాల్గువిధములైనటుల ఒకటియగు చైతన్యమే 1 కూటస్థుడని, 2 జీవుడని, 3 బ్రహ్మమని, 4 ఈశ్వరుడనెడి భేదముచే నాలుగువిధములుగ కల్పించి ధీవాసనోపరక్తాజ్ఞానోపాధికుడు యీశ్వరుడనియు, అంతఃకరణోపాధికుడు జీవుడనియు జెప్పెదరు.

—• 6వ పక్షము •—

మరికొందరు "విభేదజనకేఽజ్ఞానే నాశమాత్యంతికం గతే। ఆత్మనో బ్రహ్మణో భేదమసన్తం కః కరిష్యతి"(భేదజనకమగు యజ్ఞాన మత్యంతము నశించినదైయుండ జీవపరమాత్మలకు లేనిభేదము నెవడు చేయగలడు) అను స్మృతినవలంబించి ఒకటి యగు యజ్ఞానమే జీవేశ్వరవిభాగమున కుపాధి యని చెప్పి బింబప్రతిబింబభావముచే జీవేశ్వర విభాగ మొనరింపవలయును కాని, ఉపాధిద్వయములేనిదే జీవేశ్వరులకు ప్రతిబింబత్వము సంభవింపనందున ప్రతిబింబభావముచే జీవేశ్వరవిభాగము ప్రాప్తింపదని చెప్పుచుండిరి.అందునను అజ్ఞానగతచిత్ప్రతిబింబము జీవుడు. బింబస్థానీయు డీశ్వరు డనియు నిర్వచించిరి. మరియు అవిద్య యొక్కటియే యగుటవలన నవిద్యాప్రతిబింబమగు జీవు డవిద్యోపాధికుడగుటం జేసి జీవుడును యొక్కడే. అట్టి యేకజీవుని యజ్ఞానముచేతనే నిఖిలప్రపంచము కల్పితము. స్వప్నదర్శనమువలె వానికెంతవర కవిద్య యుండునో అంతవరకు సర్వవ్యవహారము లుండును. జీవు డొక్కడే కాన ఒక జీవుడు బద్ధుడనియు, మరియొకజీవుడు ముక్తుడనియు వ్యవస్థ లేదు. శ్రీశుకుడు ముక్తుడనునదికూడ స్వప్నపురుషాన్తరముక్తివలె కల్పిత మనియు వర్ణించుచుండిరి. ॥౧౪॥

గీ॥ న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః।
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః ॥ ॥౧౫॥

ప ద వి భా గ ము:— న- మాం- దుష్కృతినః- మూఢాః- ప్రపద్యన్తే- నరాధమాః- మాయయా- అపహృతజ్ఞానాః- ఆసురం- భావం- ఆశ్రితాః- ॥౧౫॥

ప్ర తి ప దా ర్థ ము:— దుష్కృతినః=పాపమునాచరించునట్టిన్ని; నరాధమాః= నర=మనుష్యులలో; అధమాః=అధములైన; మూఢాః=మూఢజనులు; మాయయా=మాయచే; అపహృతజ్ఞానాః= అపహృత=అపహరించబడిన; జ్ఞానాః=జ్ఞానముకలవారై; ఆసురం= అసురసంబంధమైన; భావం=హింసానృతాదిస్వరూపభావమును; ఆశ్రితాః=ఆశ్రయించినట్టివారలై; మాం=పరమేశ్వరుడనగునన్ను: నప్రపద్యన్తే=శరణుపొందరు. ॥౧౫॥

---

నీ ల కం ఠీ య ము:— విలాసచే జీవరూపమున గ్రీడించుచున్న నాసంబంధమైన, పిండబ్రహ్మాండరూపముచే వ్యాప్తమైన, చిన్మాత్రసంబంధమైన మాయ "నన్ను నేనెరుగను." అని సాక్షిప్రత్యక్షమగుటచే అపలాపనానర్హము. (లేదనుట కయోగ్యము) ఇంద్రజాలమువలె యనృతప్రపంచప్రకాశకము, సత్త్వరజస్తమోగుణాత్మకము, దాట శక్యము కానిది. ఎవరు సర్వభూతములయందుండిన వాసుదేవుని సేవించెదరో అట్టివారు ఈ మాయను దాటెదరు. అధిష్ఠానజ్ఞానముచేతనే మూలాజ్ఞానముతో గూడిన భ్రమనశించును. మరియొకజ్ఞానముచేగాని, వృత్తినిరోధముచేగాని యట్టి భ్రమ నశింపదు.

ఇచట నిష్కృష్టవిషయమిది. జీవేశ్వరవిభాగశూన్యమైన శుద్ధచిన్మాత్రమునందు కల్పితము మాయాదర్పణము. అట్టి మాయాదర్పణము చిత్ప్రతిబింబరూపమగు జీవుని స్వాధీనమొనరించుకొని బింబచైతన్యము నరికట్టి అయస్కాంతము నరికట్టి లోహశకలమువలె చలించుచున్నది. ఇదియే మాయకు యీశ్వరాధీనత్వము. ఈశ్వరునకు మాయాద్వారమున సర్వస్రష్టృత్వము. ఈవిషయమే "అస్మా న్మాయీ సృజతే విశ్వ మేతత్తస్మిం శ్చాన్యో మాయయా సంనిరుద్ధః" అను శ్రుతిచే బోధింపబడుచున్నది. దర్పణమువలె ఒకమాయయే బింబప్రతిబింబములగు జీవేశ్వరుల కుపాధి యగుచున్నది. బింబప్రతిబింబభావానాక్రాంతమైన జీవేశ్వరోభయానుస్యూతమైన శుద్ధచిన్మాత్రము ముక్తులకు ప్రాప్యము. జీవేశ్వ రు లు పా ధి ప క్ష పా త ద శ యందు అల్పజ్ఞత్వ సర్వజ్ఞత్వ శాశ్యత్వ శాసితృత్వాది భావమును పొందుచున్నవి. ఆబింబప్రతిబింబములే ఉపాధి లేనిసమయమున ఉపాధిప్రచారదర్శులై బోధరూపమగుటచే "జీవసాక్షి ఈశ్వరసాక్షి" అను శబ్దములచే వ్యవహరింపబడుచున్నవి. ఈ వ్యవస్థ యిట్లుండ జీవుడు యీశ్వరారాధనప్రాప్తప్రత్యక్త్వజ్ఞానముచే మాయ నష్టమైపోవ తత్కార్యము యొక్క నాశముచే సాక్షి లేమిఁజేసి సాక్షిత్వమునుగూడ పరిత్యజించి బింబప్రతిబింబానుస్యూతమైన మూడవదగు శుద్ధచైతన్యమును పొందును. ఈ విషయమే "దైవీ మాయా" అని చెప్పబడెను. "మమ మాయా" అని ఒకటి యగు మాయకే జీవేశ్వరసంబంధిత్వము, జీవున కీశ్వరభజనచే మాయాతరణము అని చెప్పబడెను. ॥౧౪॥

—: ౭వ అధ్యాయము ౧౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మ ధు సూ ధ న స ర స్వ తీ య ము:— అట్లగుచో సర్వానర్థమూలమాయోన్మూలనకారకు భగవంతుడవు, వాసుదేవుడవు అగు నిన్ను సర్వులు యెందులకు సేవింపరు? అని యాశంకించి చిరకాలసంచితదురితమనెడి ప్రతిబంధకమువలన సేవింపకుండిరని "నమాం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

"దుష్కృతినః" పాపముతో నిత్యసంబంధముకలవారు. కనుకనే "నరాధమాః" మనుష్యులలో అధములు. అనగా యీలోకమున సాధువులచే నిందింపదగినవారు, మరియు పరలోకమున అనర్థసహస్రములపొందువారలు. ఎందువలన అనర్థహేతువగు దుష్కృతమునే యెల్లపుడాచరించుచుండిరి? "మూఢాః" ఇది ప్రయోజనసాధనము, ఇది యనర్థసాధనము అనెడి వివేకశూన్యులు కాన, ప్రమాణముండ యెందువలన అర్థానర్థసాధన

శాంకరభాష్యమ్:—

యది త్వాం ప్రపన్నా మాయా మేతాం తరన్తి కస్మా త్త్వా మేవ న ప్రతిపద్యన్త ఇత్యుచ్యతే— న మాం పరమేశ్వరం దుష్కృతినః పాపకారిణో మూఢాః ప్రపద్యన్తే నరాధమా నరాణాం మధ్యే అధమా నికృష్టా స్తేచ మాయయాఽపహృతజ్ఞానా స్సంముషితజ్ఞానా ఆసురం భావం హింసానృతాదిలక్షణ మాశ్రితాః ॥౧౫॥

శాంకభాష్యతత్త్వబోధిని:—

నిన్ను శరణుపొందినవారు ఈమాయను తరించువారగుచో యెందువలన నిన్నే శరణు పొందరనెదవా? పాపకర్మల నాచరించెడి మూఢులైన నరాధములు (నరుల మధ్య యధములు) అనగా నికృష్టులు మాయచే దొంగిలించబడినదివలె తిరస్కృతమైన జ్ఞానము (స్వరూపచైతన్యము) కలవారై, అసురసంబంధమైన భావమును (హింసానృతాదిభావమును), ఆశ్రయించినవారై పరమేశ్వరుడ నగు నన్ను శరణుపొందరు. ॥౧౬॥

ములను తెలిసికొనరు! "మాయయాఽపహృతజ్ఞానాః" శరీరేన్ద్రియసంఘాత తాదాత్మ్యభ్రమరూపముగ పరిణమించిన మాయచే ప్రతిబద్ధమైన వివేకసామర్థ్యముకలవారు కాన. కనుకనే అట్టివారు "దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవచ" అని ముందుచెప్పబోవు అసురభావమును, హింసానృతాదిస్వభావము నాశ్రయించినవారు కాన. కనుకనే నాప్రతిపత్త్యయోగ్యులై సర్వేశ్వరుడ నగు నన్ను సేవింపకుండిరి. ఆహా! వారల దౌర్భాగ్య మెంతటిదో కదా! అని భావము. ॥౧౫॥

శంకరానందీయము? — ఓ శ్రీకృష్ణ! నీయుపాసనచే సర్వానర్థకారిణి యగు మాయను తరించునట్లయిన మీమాంసక తార్కికాదిమహాపండితులు యెందువలన నిన్ను ఉపాసింపరు? అను యాశంకను "నమాం" అను శ్లోకముచే దొలిగించుచుండెను. "క్రియత ఇతి కర్మ" జననమరణాది దుఃఖప్రదమగు కామ్యకర్మ. అట్టి దుష్టకర్మ నాచరించు మీమాంసకులు "దుష్కృతినః" దుష్టకర్మకలవారు. వారు పండితులైనను కామాదిరూపమగు మాయచే తిరోభూతమైన (కప్పబడిన) సదసద్వివేకరూపమైన జ్ఞానముకలవారు. కనుకనే "ఆసురం భావ మాశ్రితాః" ఇది నాచే నిప్పుడు పొందబడినది అనెడి యాసురభావము నాశ్రయించినవారై వేదాన్తవాక్యములు కర్తృప్రస్తావకములుగా "ఆమ్నాయస్య క్రియార్థత్వాత్" అను న్యాయముచే కర్మశేషత్వమునే యంగీకరించి యవిశ్వాసముచే వేదాన్తవిచారమునే చేయరు. అట్టి వారలకు నాజ్ఞాన మెటుల ప్రాప్తించును? నాజ్ఞానమే లేనిచో మదుపాసనాప్రసక్తి యెట్లు? కనుకనే మీమాంసకులు నన్ను తెలిసికొనలేకుండిరి.

తార్కికులు, వైశేషికులు పండితులైనను మాయచే నపహరింపబడిన జ్ఞానముకలవారు. అందువలననే మూఢులై జగదుపాదానము అణువులే. ఈశ్వరుడు నిమిత్తకారణమని నన్ను ఉపసర్జనముగ జేసుకొని తమ తమ కభిమతమగు పదార్థజ్ఞానమువలననే ముక్తియని యభినివేశముచే నావిచారజ్ఞానశూన్యులై నన్ను తెలిసికొనుట లేదు. ఇతరులగు చార్వాకజైనబౌద్ధాదులు నరాధములై నన్ను తెలిసికొనుటలేదు. ॥౧౫॥

పరమార్థప్రప:— నాయప్రాప్తికి కారణము మాయయే యని "న మాం" అను శ్లోకముచే జెప్పుచుండెను. మనుష్యులలో యెవరధములో వారు నరాధములు. మనుష్యులు నరాధము లెందుకయిరి? వివేకశూన్యులు కాన. వివేకశూన్యు లెందుకయిరి! పాపశీలురగుటవలన. కనుకనే మాయచే నపహృతమైన జ్ఞానము కలవారై ఆసురభావము నాశ్రయించినవారై శాస్త్రాచార్యోపదేశమువలన జ్ఞానమును పొందినవారైనను తదా

గీ॥ చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినోఽర్జున!
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ! ॥౧౬॥

పదవిభాగము:— చతుర్విధాః- భజన్తే- మాం- జనాః- సుకృతినః- అర్జున!- ఆర్తః-జిజ్ఞాసుః- అర్థార్థీ- జ్ఞానీ- చ- భరతర్షభ! ॥ ॥౧౬॥

ప్రతిపదార్థము:— హేఅర్జున!=ఓయర్జునుడా!; హేభరతర్షభ!=భరతవంశశ్రేష్ఠుడా!; ఆర్తః=వ్యాధ్యాదులచే పీడితుడు; జిజ్ఞాసుః=ఆత్మస్వరూపమును తెలిసికొనవలెనని యిచ్ఛకలవాడు: అర్థార్థీ=ధనకాముడు: జ్ఞానీ=సర్వవ్యాపకుడగు పరమేశ్వరుని తత్త్వమును తెలసినవాడు; అనెడి; చతుర్విధాః=నాలుగువిధములైన: సుకృతినః=పుణ్యకర్మలుకల; జనాః=జనులు; మాం=నన్ను, భజన్తే= సేవించుచున్నారు. ॥౧౬॥

---

వరకమాయచే దంభదర్పాభిమానపారుష్యాద్యభినివేశము కలవారై నన్ను భజింపకుండిరి. ఈవిషయమే "దుస్సంకల్పవికల్పకూలయుగళా, ధైర్యద్రుమోన్మూలినీ, కల్లోలై రభిమానమత్సరముఖైః షడ్భిః పరీతోర్మికా । ఆవర్తైర్మమతాదిభిః పరివృతా, దుఃఖైకధారాన్వితా పూర్ణామోహపయస్వినీవ నిభృతంచేతస్సితిర్మాయినామ్॥మాయావంతుల చేతస్సితి యెట్టిదనిన? దుస్సంకల్పము, వికల్పము అనెడి రెండు కూలములు (ఒడ్లు) కలిగి ధైర్యమనెడి వృక్షమును కూలద్రోయునట్టిదియై, అభిమానము, మత్సరము మొదలగుయారు కల్లోలములచే వ్యాప్తమై మమతాదులనెడి యావర్తములచే పరివృతమై, దుఃఖైకధారతోఁగూడి పూర్ణమై మోహము నదివలె నుండును. ॥౧౫॥

సంగ్రహము:— అట్లగుచో నందరు నిన్ను శరణుపొంది యెందులకు మాయను తరింపరు? అను శంకను "నమాం" అను శ్లోకముచే తొలిగించుచుండెను.

పాపకర్మ నాచరించువారు కనుకనే చిత్తశుద్ధిలేనందున ఆత్మానాత్మవివేకశూన్యులు. కనుకనే నరాధములు. అట్టి దుష్కృతు లగుచుండిరి. మాయచే తిరస్కృతమైన యఖండచిద్రూపబ్రహ్మము కలవారు. ఓయర్జునా! అట్టివారు నన్ను సేవింపరు. ఈ చెప్పుటచే మాయకావరణశక్తి చెప్పబడెను. మరియు విరోచనాద్యసురుల "దేహేంద్రియాది సంఘాతమే లెస్సగ సంతర్పణీయము" అనెడి యభిప్రాయము నాశ్రయించినవారు దుష్కృతులని చెప్పుటచే మాయకు విక్షేపశక్తి చెప్పబడెను. ఇట్లు మాయచే స్వస్వరూపానందమావరింపబడి దేహాత్మభ్రమ పుట్టినవారైయుండ తదభిమానమువలన దేహాదుల పుష్టినిమిత్తము పాపకర్మ నాచరించెదరు. అందుచే మూఢులై నరాధములు నన్ను శరణ పొందరు. సర్వానర్థమూలము మాయయేయని యర్థము. ॥౧౫॥

—• ౭వ అధ్యాయము ౧౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఏవరు ఆసురభావరహితులో, పుణ్యకర్మకలవారలో, వివేకవంతులో వారు పుణ్యకర్మతారతమ్యముచే నాల్గువిధములైనవారై నన్ను సేవించుచుండిరి. వారలు క్రమముగ కామనారహితులై నాయనుగ్రహమువలన మాయను తరించెదరని "చతుర్విధా" అను శ్లోకముచే చెప్పుచుండెను.

పూర్వజన్మమునందు చేయబడిన పుణ్యసంచయముకలవారై యెవరుసఫలజన్మముకలవారో వారలే నన్ను సేవించెదరు. ఇతరులు సేవింపనేరరు. ఓయర్జునా! అట్టివారు కామనాసహితులు ముగ్గురు. ఒకడు కామనారహితుడు. మొత్తము నలుగురు. వారెవరనిన? 1 ఆర్తుడు, అనగా శత్రువ్యాధ్యాదులచే బాధపడుచు అట్టి బాధయొక్క నివృత్తిని కోరువాడు. యెట్లనిన? మఖభంగముచే కుపితుడై దేవేంద్రుడు పాషాణవర్షమును కురి

శాంకరభాష్యమ్:—

యే పున ర్నరోత్తమాః పుణ్యకర్మాణః చతుర్విధా శ్చతుష్ప్రకారా భజన్తే సేవన్తే మాం జనా స్సుకృతినః పుణ్యకర్మాణో హేఽర్జున! । ఆర్త ఆర్తిపరిగృహీత స్తస్కరవ్యాఘ్రరోగాదినాఽభిభూత ఆపన్నో జిజ్ఞాసు ర్భగవత్తత్త్వం జ్ఞాతు మిచ్ఛతి యోఽర్థార్థీ ధనకామో, జ్ఞానీ విష్ణో స్తత్త్వవిచ్చ హేభరతర్షభ! ॥౧౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓయర్జున! ఏనరోత్తములు పుణ్యకర్మ కలవారో ఆనాలుగు విధములైన జనులు నన్ను సేవించెదరు. వారెవరనెదవా? ఓభరతర్షభ! (1) ఆర్తుడు (తస్కరవ్యాఘ్రరోగాదులచే తిరస్కరింపబడి యాపన్నుడైనవాడు). (2) జిజ్ఞాసువు (భగవత్తత్త్వమును తెలిసికొనగోరువాడు). (౩) అర్థార్థి (ధనకాముడు). (4) జ్ఞాని (విష్ణుతత్త్వవేత్త) ఈనలుగురు నన్ను సేవించెదరు. ॥౧౬॥

సించుచుండ గొల్లపల్లెయందు నివసించు గోపగోపికలు ఆర్తులనబడుదురు. జరాసంధ కారాగారవాసులగు రాజులార్తులు. మొసలిచే పట్టుబడిన గజేంద్రుడార్తుడు. 2 జిజ్ఞాసువు. జిజ్ఞాసువనగ ఆత్మజ్ఞానమును కోరెడి ముముక్షువు. వాడెవడనిన ? ముచికుందుడు, మైథిలుడగు జనకుడు. శ్రుతదేవుడు, ఉద్ధవుడు.వీరలు జిజ్ఞాసువులు. 3 అర్థార్థి:— ఇహలోకమునకాని, పరలోకమునకాని యేది భోగోపకరణమో అట్టిదానిని కోరువాడు సుగ్రీవుడు, విభీషణుడు, ఉపమన్యువు ఈలోకమున అర్థార్థులు. ధ్రువుడు పరలోకమున అర్థార్థి. ఈముగ్గురు భగవంతుని సేవించుటచే మాయను తరించిరి. ఆముగ్గిరిలోను జిజ్ఞాసువు జ్ఞానోత్పత్తిచే సాక్షాత్తుగ మాయ నతిక్రమించుచున్నాడు. ఆర్తుడు అర్థార్థియు జిజ్ఞాసుత్వమును పొంది తద్వారా జ్ఞానులై మాయ నతిక్రమించెదరు. ఇదియే యీముగ్గురికి కల విశేషము. ఆర్తునకు, అర్థార్థికి జిజ్ఞాసుత్వము సంభవించుటవలన, జిజ్ఞాసువునకు ఆర్తత్వజ్ఞానోపకరణార్థార్థిత్వము సంభవించుటవలన యిరువురిలోను జిజ్ఞాసువు ఉత్కృష్టుడు. ఈముగ్గురు సకాములు. నాల్గవవాడగు జ్ఞాని, నిష్కాముడు. జ్ఞానమనగ భగవత్తత్త్వజ్ఞానము (సాక్షాత్కారము). అట్టి భగవత్తత్త్వసాక్షాత్కారముచే నిత్యముక్తుడు జ్ఞాని యనబడును. అట్టివాడు మాయ నతిక్రమించినవాడు, నివృత్తసర్వకాముడు. "జ్ఞానీ చ" అనుచోట చకారము ఎవడు నిష్కామప్రేమకలవాడగునో అట్టిభక్తుడుకూడ జ్ఞానులలోనే లెక్కింపదగినవాడని చెప్పుటకు ప్రయోగింపబడెను. ఓయర్జున! భరతర్షభ! నీవు కూడ "నేను జిజ్ఞాసువునా? లేక జ్ఞానినా! ఈయుభయులలో యెట్టి భక్తుడను?"అని శంకింపవలదు. అందు నిష్కామభక్తుడు జ్ఞాని. వారెవరనిన ? సనకాదులు, నారదుడు, ప్రహ్లాదుడు, పృథుచక్రవర్తి, శుకుడు వీరలు నిష్కామ భక్తులు. నిష్కాములు శుద్ధప్రేమభక్తులు. గోపికాదులు, అక్రూరయుధిష్ఠిరాదులు. కంసశిశుపాలాదులన్నచో భయమువలన, ద్వేషమువలన యెల్లప్పుడు భగవచ్చింతాపరులైనను భగవదనురక్తిలేమింజేసి భక్తులుకారు. భగవదనురక్తిరూపమగు భక్తియొక్క స్వరూపము, సాధనము, భగవద్భక్తవిశేషములు నాచే రచింపబడిన భగవద్భక్తిరసాయనమనెడి గ్రంథమున సవిశేషముగ చూపబడెను. కాన నిచట గ్రంథవిస్తరభీతిచే విరమించుచుంటిని. ॥౧౬॥

శంకరానందీయము:— మహాపండితులగు మీమాంసక తార్కిక వైశేషికాదులుకూడ ఇట్టివారగుచో (మూఢులగుచో) నిన్ను ఎవ్వరు సేవించెదరని శంకింపజనదు. ఎవరు పరిశుద్ధాంతఃకరణ కలవారై

శాస్త్రమువలన గురువువలన నాతత్త్వమును విని సర్వేశ్వరుడను, సర్వార్థములనిచ్చెడి నన్నే తెలిసి కొనెదరో వారు నన్ను సేవించుచుండిరి. ఐనను నాభజనపరులగువారలకు భేదము కలదని "చతుర్విధా" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ఈ జన్మమునందుగాని, అనేక జన్మాంతరములయందుగాని "స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" ఇత్యాది శాస్త్రముచేతను, తదర్థజ్ఞానముకల గురువుచేతను, శిక్షితులై యీశ్వరార్పణబుద్ధిచే యోగ్యముగ మంత్రతంత్రాది లోపము లేకుండునటుల అనుష్ఠింపబడిన శ్రౌతస్మార్తాది కర్మలు కలవారైన సుకృతవంతులగు సత్కర్మానుష్ఠానపరులైన వివేకులు ఆర్తాదిభేదముచే నాల్గువిధములై నన్ను సేవించుచుండిరి. ఆ ఆర్తాదిభేదములచే నాల్గువిధములైనవారెవరనిన "ఆర్తః" అను చరణముచే జెప్పుచుండెను. ఆర్తుడనగ ఆధ్యాత్మికాధిభౌతికాద్యుపద్రవములచే పీడితుడై ఆ యుపద్రవముల నివృత్తికొరకు నన్ను సేవించువాడు ఆర్తుడనబడును. నిత్యానిత్యపదార్థవివేకముచే ఆత్మతత్త్వమును తెలుసుకొనుటకు ఇచ్ఛకలవాడై నాయనుగ్రహసిద్ధికొరకు ప్రయత్నించువాడు జిజ్ఞాసు వబడును. ఐహికాముష్మికసుఖతత్సాధనకామియై కామసిద్ధికొరకు నన్ను సేవించువాడు అర్థార్థియనబడును. బ్రహ్మవిత్తై తనకు కలిగిన జ్ఞానమునకు అప్రతిబద్ధత్వసిద్ధికొరకు యత్నించువాడు జ్ఞానియనబడును. ఇట్లు నాల్గువిధములైన వారలలో ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి ఈముగ్గురు ఈశ్వరుడనుపేరుగల సగుణుడనైన నన్ను సేవించెదరు. జ్ఞానియన్నచో నిర్గుణమయిన పరబ్రహ్మమనెడి నన్ను "ఇదమేవాహం" అని స్వాత్మచే అనుసంధానము చేయును. ||౧౬||

పరమార్థప్రపః— "చతుర్విధా" అను శ్లోకముచే భజనసుకృతతారతమ్యముచే నాల్గువిధములగు భగవద్భక్తులను చెప్పుచుండెను. పూర్వజన్మమునందు ఆచరింపబడిన సుకృతసమూహము గలవారు నన్ను సేవించెదరు. ఈ విషయమే— "అనేకజన్మసాహస్రైస్తపోదానసమాధిభిః । నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే" అనేకవేల జన్మములయందాచరింపబడిన తపోదానసమాధులచే నశించిన పాపముకల మనుష్యులకు శ్రీకృష్ణునియందు భక్తి జనించును. అని చెప్పబడెను,

రోగాద్యభిభూతుడైన ఆర్తుడు పూర్వజన్మములందు ఆచరింపబడిన పుణ్యపుంజముకలవాడగుచో నన్ను సేవించును. అట్లు కానివాడు క్షుద్రదేవోపాసనను చేయును. భగవంతుడు మోక్షైకదాత యను ప్రసిద్ధియుండ క్షుద్రఫలము నిమిత్తమై క్షుద్రదేవోపాసన యెట్లు సంభవించు నని శంకింపజనదు. "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్" అని భగవంతునిచే ప్రతిజ్ఞాతమగుటవలన క్షుద్రదేవోపాసనయు సంభవమే. శ్రుతియు "యది క్షితాయు ర్యది వా పరేతో యది మృత్యో రన్తికం నీత ఏవ తమాహరామి నిరృతే రుపస్థా దస్పార్శ్మ యేనం శతశారదాయ" అపమృత్యువుగల గజేంద్రుడు, ఈలోకము నుండి లోకాంతరమును పొందించబడిన నాబంధువులు, యమసమీపమును పొందించబడిన గురుబాలకుడు, ప్రమాదముచే నాకు బుద్ధిపూర్వకముగ యమసమీపమును పొందించబడిన జీవుడు వీరలను యమసమీపమునుండి గ్రుడ్డిబాలునివలె బలాత్కారముచే యీలోకమునకు తీసుకువచ్చెదను. అట్లునీవు తీసుకువచ్చినను తిరిగి వారు మరణించిన నీవేమిచేయుదువు, అని శంకింపజనదు. మృత్యువువల్ల విడిపింపబడిన యీజీవుని నూరుసంవత్సరములవఱకును జీవించుటకొరకు అపమృత్యుపరిహారార్థమై అభయహస్తముచే స్పృశించెదను. ఆర్తుడు ఒకడు, జిజ్ఞాసువు ఒకడు. ఇహాముత్రఫలభోగమును కోరెడి అర్థార్థి యొకడు. ఆత్మజ్ఞానముకల జ్ఞానియొకడు. ఈ నలుగురు నన్ను సేవించెదరు. ఆత్మవేత్త కృతకృత్యుడగుటచే తిరిగి నిన్ను యెటుల సేవించునని శంకింపజనదు. ఏలనీ అనుగ్రహమువలన ఆత్మజ్ఞానమనెడి యుపకారము ప్రాప్తించెనో యట్టివానిని కృతజ్ఞుడు ఎటులమరచును? మరువనే మరువడు. ఈ విషయమే "విస్మర్యతే కృతమివాకథ మ్యార్తబంధో" అనుదానిచే జెప్పబడెను.

గీ॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః ॥ ॥౧౭॥

పదవిభాగము:— తేషాం- జ్ఞానీ- నిత్యయుక్తః- ఏకభక్తిః- విశిష్యతే- ప్రియః- హి- జ్ఞానినః- అత్యర్థం- అహం- స- చ- మమ- ప్రియః- ॥౧౭

ప్రతిపదార్థము:— తేషాం=ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞానియనెడి నలుగురిలోను; జ్ఞానీ=తత్త్వవిత్తు; ఏకభక్తిః=ఒకపరమాత్మయందే భక్తికలవాడై; విశిష్యతే=అధికుడగుచున్నాడు; హి=ఏ కారణము వలన; అహం=నేను; జ్ఞానినః=తత్త్వవిత్తునకు; అత్యర్థం=అత్యంతము; ప్రియః=ఇష్టుడనో; తతః=ఆ కారణము వలన; సచ=ఆజ్ఞానియు; మమ=నాకు; ప్రియః=ఇష్టుడు. ॥౧౭॥

—• ౭వ అధ్యాయము ౧౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః" అనుదానిచే దుష్కృతునికంటె వేరగు సుకృతులు నన్ను సేవించెద రని అర్థాత్ సిద్ధించుచున్నది. అయినను అట్టి పుణ్యపురుషులు నాలుగువిధములు. అని చాతుర్విధ్యమును "చతుర్విధాః" అనుశ్లోకముచే జెప్పెను. అందువలన విశేషమేమియు లేనందున వారలు సుకృతులే అని యనెదవా! ఆనాలుగువిధములవారలకు సుకృతిత్వము నియతమైనను సుకృతాధిక్యముచే నిష్కామత్వేన ప్రేమాధిక్యమువలన జ్ఞాని విశిష్టుడగునని "తేషాం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

నాలుగువిధములగువారలలో తత్త్వజ్ఞానముకలవాడు నివృత్తసర్వకాముడు. కాన సర్వోత్కృష్టుడు. "నిత్యయుక్తః" ప్రత్యగభిన్నమునం దెల్లపుడు విక్షేపకారణములేమిఁజేసి సమాహితచిత్తుడు. కనుకనే "ఏకభక్తిః" అనురక్తివిషయాంతరములేమిఁజేసి ఒకభగవంతునియందే యనురక్తికలవాడు. కాన "ప్రియః" కనుకనే నేను ప్రత్యగభిన్న(పరమాత్మజ్ఞానికి) అత్యంతము నిరుపాధిప్రేమాస్పదుడను. అందువలననే అజ్ఞానియు పరమేశ్వరుడ నగు నాకును "ప్రియః" ప్రియుడు. ఆత్మ అత్యంతము ప్రియమని శ్రుతిలోకసిద్ధమే ॥౧౭॥

శంకరానందీయము:— పరోక్షజ్ఞానికి "ఏకభక్తి ర్విశిష్యతే" "జ్ఞానీ త్వాత్మైవ మే మతం" అని యేకభక్తిత్వము, పరమాత్మాభిన్నత్వము చెప్పుట సంభవింపనందున ఈశ్లోకమునందు కల "జ్ఞానీ" అను పదముచే పరోక్షజ్ఞాని చెప్పబడడు. మరేమనిన ? అపరోక్షజ్ఞానియే చెప్పబడును. అట్లగునో బ్రహ్మవేత్తకూడ పరమేశ్వరప్రసాదాతిశయసిద్ధికొరకు సగుణుడగు యీశ్వరునే యుపాసించునా ? యని శంకింపజనదు. తండ్రికి అప్రయోజకులగు పుత్రులకంటె విద్యావినయశీలవిత్తార్జన కీర్తిప్రతిష్ఠలుకల సత్ పుత్రుని యందే ప్రీత్యతిశయముకలవాడై యుండుట యనుభవసిద్ధము. అట్లే పరమేశ్వరునకు సగుణరూపము కల్పితము. అట్టి కల్పితమగు మిథ్యాభూతమైన సగుణరూపమును భజించు భక్తజనమునందుకంటె యథాభూతస్వరూపానుసంధానపరుడగు బ్రహ్మవేత్తయందే పరమేశ్వరునకు సమగ్రానుగ్రహకిరణము సంభవించును. కాన పూర్వోక్తాశంక సంభవింపదు. మరియు "ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్" అను శ్రుత్యుక్తరీతిని బ్రహ్మవేత్తలకు ధ్యేయమగు బ్రహ్మవస్తువునకు మాయాతత్కార్యలేశసంబంధము శ్రూయమాణ మగుటవలనను, "అథ యోఽన్యాం దేవతా ముపాస్తే" అను శ్రుతిచే సంభిన్నదేవతాంతరమునుపాసించువాడు పశుతుల్యు డని చెప్పబడుటవలనను, "జీవేశా వాభాసేన కరోతి" అనుశ్రుతిచే యీశ్వరునికికూడ మాయాభాసత్వము బోధింపబడుటవలనను, అట్టి యీశ్వరునియం దసత్త్వబుద్ధిచే తద్విలక్షణమగు సచ్చిదానందరసస్వరూపుడైన పరబ్రహ్మమునందే యెల్లపుడు తత్స్వరూపముగ నుండు పరబ్రహ్మస్మృత

శాంకరభాష్యమ్:—

తేషా మితి। తేషాం చతుర్ణాం మధ్యే జ్ఞానీ తత్త్వవి త్తత్త్వవిత్త్వా న్నిత్యయుక్తో భవ త్యేకభక్తి శ్చాన్యస్య భజనీయ స్యాదర్శనా దత స్స ఏకభక్తి ర్విశిష్యతే విశేషమాధిక్య మాపద్య త్యేఽతిరిచ్యత ఇత్యర్థః॥ ప్రియో హి యస్మా దహ మాత్మా జ్ఞానినోఽత స్తస్యాహ మత్యర్థం ప్రియః। ప్రసిద్ధం హి లోక ఆత్మా ప్రియో భవతీతి। తస్మాత్ జ్ఞానినః ఆత్మత్వా ద్వాసుదేవః ప్రియో భవతీత్యర్థః। స చ జ్ఞానీ మమ వాసుదేవ స్యాఽఽత్మైవేతి మమాత్యర్థం ప్రియః ॥ ॥౧౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని: —

ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అను నాలుగు విధములగు భక్తులలో జ్ఞాని తత్త్వవి త్తగుట వలన నిత్యయుక్తు డగును. నిత్యయుక్తుడనగ భగవంతుడగు ఆత్మయందు యెల్లపుడు సమాహితమైన చిత్తము కలవాడగుట. భజింపదగిన విహితమైనదేదియు కానరానందున ఏకభక్తికల వాడు. అనగా అసారమగు సంసారమునందు భగవంతుడే సారము. "సోఽహ మస్మి" నే నట్టి భగవంతుడనైతిని. అని అద్వితీయము, తనకంటె యత్యంత మభిన్నము నగు భగవంతుని యందు భక్తి (స్నేహవిశేషము) కలవాడు ఏకభక్తి యనబడును. అట్టివా డధికుడు. నేనుజ్ఞాని కాత్మను. కాన జ్ఞానికినేను అత్యంతము ప్రియుడను. లోకమున నాత్మ ప్రియమను విషయము ప్రసిద్ధమే. కాన జ్ఞానికి ఆత్మ యగుటవలన వాసుదేవుడు ప్రియుడై యగుచున్నాడు. అజ్ఞానియు వాసుదేవుడనగు నాకును ఆత్మయే కాన జ్ఞానియు నా కత్యంతము ప్రియుడు. ॥౧౭॥

రసపాన మొనరించు బ్రహ్మవేత్తకు సగుణమునందు రుచి సంభవింపనందునను సగుణోపాసన సంభవింపదు. అట్లగుచో బ్రహ్మవేత్తకు ఉపాసనయే యుపపన్నము కాదని శంకింపజనదు. "తమేవ ధీరో విజ్ఞాయ" అను శ్రుతి– జ్ఞానముయొక్క– యప్రతిబద్ధత్వసిద్ధికొరకు బ్రహ్మవేత్తకు ప్రజ్ఞాకరణమును బోధించుటవలన పూర్వోక్త శంక సంభవింపదు. ప్రజ్ఞాకరణ మనగ నంతట బ్రహ్మదర్శనమే యని గ్రహింప నగును. అందువలననే నిర్విశేషపరబ్రహ్మమే బ్రహ్మవేత్త కుపాస్యము. కనుకనే నిర్విశేషబ్రహ్మపరునగుటవలన మహానుభావుడగు బ్రహ్మవేత్తను సగుణపరులగు ఆర్తాదులకంటె విశేషముగ "తేషాం జ్ఞానీ" అనుశ్లోకముచే చెప్పుచుండెను. "నిత్యయుక్తః" క్రియాంతరమున కవకాశము లేకుండునటుల యెల్లప్పుడు బ్రహ్మమునందే సమాహితమైన చిత్తముకలవాడు. లేక– మాయాతత్కార్యసంబంధశూన్యుడగుటవలన నవిక్రియుడు. కనుకనే నాశము లేనివాడు. అట్టి పరమాత్మయందే అంతటను బ్రహ్మము నే చూచు వాడు అ న్యమును తెలిసికొనడని యర్థము. బ్రహ్మమునే చూచువాడగుచో ద్రష్టయని, దృశ్యమని భేదమే సిద్ధించుచున్నదను శంకను తొలగించుటకు "ఏకభక్తిః" అని చెప్పబడెను. స్వవిషయీభూతవస్త్వాకారమును భజించువాడు. ఇచట భక్తి యనగ "ఇది, నేను" అనుద్వైవిధ్యములేని యొక్కటియే యగు యంతఃకరణవృత్తియే. ఆయంతఃకరణవృత్తి తనకు బ్రహ్మమునకు యేకత్వావగాహి, అఖండాకారమైనవృత్తి. యిట్టి వృత్తిరూపమగు భక్తికలవాడు "ఏకభక్తిః" అని యనిపించుకొనును. అనగా జగద్బ్రహ్మలకు, ఆత్మబ్రహ్మలకు నేకత్వము నవగహించు యభేదదర్శననిష్ఠుడు. కనుకనే అట్టిజ్ఞానికి ఆత్మస్వరూపుడ నగుటవలనను,ఆనందస్వరూపుడనగుటవలనను నిర్విశేషపరబ్రహ్మస్వరూపమగు నేనే ప్రియుడను. ఇతరుడు కాడు. ఈవిషయము "తదే తత్ప్రియః పుత్రాత్ప్రియో విత్తా త్ప్రియో ఽన్యస్మా త్సర్వస్మా దన్తరతమం యదయ మాత్మా" ఇత్యాదిశ్రుతిప్రసిద్ధమే యని తెలుపుటకు "ప్రియో హి" అనుచోట "హి" అనుశబ్దము ప్రయోగింప-

గీ॥ ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।
ఆస్థిత స్సహి యుక్తాత్మా మామే వాఽనుత్తమాం గతిమ్ ॥ ।౧౮॥

పదవిభాగము:— ఉదారాః- సర్వే- ఏవ- ఏతే- జ్ఞానీ- తు- ఆత్మా- ఏవ- మే- మతమ్- ఆస్థితః- సః- హి- యుక్తాత్మా- మాం- ఏవ- అనుత్తమాం- గతిమ్ ॥ ॥౧౮॥

ప్రతిపదార్థము:— ఏతే=ఈ; సర్వ ఏవ=ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి అనెడి ముగ్గురు; ఉదారాః=ఉత్కృష్టులే; జ్ఞానీతు=తత్త్వవేత్తయన్ననో; ఆత్మైవ=ఆత్మస్వరూపమే అని; మే=నాయొక్క; మతం=నిశ్చయము; ఆస్థితః=ఆరూఢావస్థను పొందుటకు ప్రవృత్తమైన; సః=ఆజ్ఞాని; హి=ఏకారణమువలన; యుక్తాత్మా=నేను భగవంతుడనగు వాసుదేవుడనే, యితరుడను కాను అని సమాహితమైన చిత్తము కలవాడై; మామేవ= నన్నే; అనుత్తమాం=అత్యుత్తమమైన; గతిం=గతిగ: గన్తుం=పొందుటకు: ప్రవృత్తః=ప్రవర్తించినవాడో; ॥౧౮॥

శాంకరభాష్యమ్:—

న తర్హ్యార్తాదయ స్త్రయో వాసుదేవస్య ప్రియాః । న, కిం తర్హి- ఉదారా ఉత్కృష్టా స్సర్వ ఏవైతే త్రయోఽపి మమ ప్రియా ఏవే త్యర్థః । న హి కశ్చి న్మద్భక్తో మమ వాసుదేవ స్యాప్రియో భవతి జ్ఞానీ త్వత్యర్థం ప్రియో భవతీతి విశేషః । త త్కస్మా దిత్యాహ-

శాంకరభాష్యతత్త్వబోధని:—

ఈశ్వరున కత్యంతము జ్ఞాని ప్రియుడగుచో "అత్యర్థం" అను విశేషణసామర్థ్యము వలన ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి యీముగ్గురు వాసుదేవునకు ప్రియులు కారా! అని శంకింప జనదు. ఆర్తాదులు ముగ్గురు గూడ నుత్కృష్టులు, నాకు ప్రియులే. నా భక్తు డగు నట్టివా డెవడును వాసుదేవున కప్రియుడు కాడు. జ్ఞానియన యత్యంతము ప్రియు డగును.

బడెను. అట్లే "స చ మమ ప్రియః" అజ్ఞానియు చెప్పబడినలక్షములు కలవాడగుటవలన జగదీశ్వరుడ నగు నాకు ప్రియుడు. కాన "తేషాం జ్ఞానీ" అనుస్థలమునందున్న "తేషాం" అను షష్ఠ్యంతశబ్దమును పంచమ్యన్తముగ "తేభ్యః" అని మార్చుకొనవలయును. సగుణపరులగు ఆర్తజిజ్ఞాస్వర్థార్థులకంటె జ్ఞాని నాకు అత్యంతము ప్రియుడని యాశయము. ॥౧౭॥

—: ౭వ అధ్యాయము ౧౮ వశ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— ఆర్తాదులు నీకు ప్రియులు కారా యని శంకింపజనదు. "అత్యర్థం" అనువిశేషణమువలనప్రియులేయని "ఉదారాః" అను శ్లోకముచే జెప్పుచుండెను, ఆర్తాదులుసకాములైనను అందరును పూర్వజన్మార్జితానేకసుకృతరాశి కలవారగుటవలన ఉత్కృష్టులే. అట్లుకానిచో నన్ను సేవింపకపోయెడివారలే. ఆర్తునికి, జిజ్ఞాసువునకు, అర్థార్థికి, మద్విముఖుడగు క్షుద్రదేవతాభక్తునకు బహుళముగ ఉపలంభమువలన వీరలందరు నాకు ప్రియులే యగుచుండిరి. జ్ఞానికాని, అజ్ఞానికాని యెవడైనను భక్తుడు నాకప్రియుడు కాడు. మరేమనిన? యెవనికి నాయందెట్టి ప్రీతి యుండునో నాకును వానియం దట్టి ప్రీతియే యుండును. ఈవిషయము స్వభావసిద్ధమే. అందు సకాములగు ఆర్తజిజ్ఞాస్వర్థార్థులకు కామ్యమానముకూడ ప్రియము. నేను కూడ ప్రియుడనే. జ్ఞానియన్నచో ప్రియమగునది మరియొకటి లేనివాడగుటవలన నేనే వానికి నిరతిశయప్రీతివిషయుడను. కాన అట్టి జ్ఞానికూడ నాకు నిరతిశయప్రీతివిషయుడు. ఇదియే విశేషము. అట్లుకానిచో

శాంకరభాష్యమ్:—

జ్ఞానీ త్వాత్మైవ నాన్యో మత్త ఇతి మే మమ మతం నిశ్చయః। ఆస్థిత ఆరోఢుం ప్రవృత్త స్స జ్ఞానీ హి యస్మా దహమేవ భగవా న్వాసుదేవో నాన్యోఽస్మీత్యేవం యుక్తాత్మా సమాహితచిత్త స్స న్మామేవ పరం బ్రహ్మ గన్తవ్య మనుత్తమాం గతిం గన్తుం ప్రవృత్త ఇత్యర్థః। ॥౧౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎందువలన జ్ఞాని యత్యంతము ప్రియు డనెదవా? "జ్ఞాని యాత్మయే. నాకంటె వేరుకాదు" అని నానిశ్చయము. జ్ఞాని యారూఢావస్థను పొందుటకు ప్రవృత్తుడు కాన "నేను భగవంతు డగు వాసుదేవుడను, యితరుడను కాను" అని సమాహితచిత్తము కలవాడై, అత్యుత్త మమైన గన్తవ్యమైన పరబ్రహ్మ మనెడి యుత్తమమైన గతినిగూర్చి వెళ్ళుటకు ప్రవృత్తుడు కాన జ్ఞాని యత్యంతప్రియుడు. ॥౧౮॥

నాపకృతజ్ఞత లేకపోయెడిని. కృతఘ్నత ప్రాప్తించెడిని. కనుకనే పూర్వశ్లోకమున "అత్యర్థం" అని విశేష ణము చెప్పబడెను. "యదేవ విద్యయా కరోతి శ్రద్ధ యోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి" అనుచోట తరబర్థము వివక్షితమగుటవలన విద్యాదివ్యతిరేకముగ చేయబడిన కర్మ వీర్యవత్తు అగుచున్నది. అట్లే జ్ఞానియగు భక్తుడు నాకత్యంతము ప్రియుడని చెప్పుటవలన జ్ఞానివ్యతిరేకముగ ఎవడుభక్తుడో వాడును ప్రియుడు. అని "అత్యర్థం" అను విశేషణము వివక్షితమగుటవలన సిద్ధించుచునే యున్నది. ఈ విషయమే "యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహం" అని చెప్పబడెను. కాన, నన్ను ఆత్మస్వరూపముగ (తనస్వరూపముగ) తెలిసికొను జ్ఞాని నాస్వరూపమే. నాకంటె వేరుకాడు. మరేమనిన? "వాడునే" నని నానిశ్చయము. ఈశ్లో కమున 'తుశబ్దము సకామభేదదర్శులగు ఆర్తజిజ్ఞాస్వర్థార్థులకంటె నిష్కామత్వ భేదాదర్శిత్వ విశేష ముయొక్క ద్యోతనార్థము. జ్ఞాని యెల్లప్పుడు నాయందు సమాహితచిత్తుడై భగవంతుడను, ఆనందఘనుడను అగు నన్నే ఆత్మస్వరూపముగ సర్వోత్కృష్టమగు పొందదగిన పరమఫలముగ అంగీకరించినవా డగుచున్నాడు. నాకంటె వేరగు ఫలమును తలచడు. ॥౧౮॥

శంకాసమాధానమ్:— జ్ఞానియే ఆర్తాదులకంటె శ్రేష్ఠు డగుచో యితరులగు ఆర్తాదులకు నికృష్టత్వమే ప్రాప్తించుచున్నది. ఆర్తాదులుగూడ నీభక్తులేకదా! వారలకు నికృష్టత్వము ప్రాప్తించుట యుక్తమా యని శంకించజనదు. వారును శ్రేష్ఠులేయని "ఉదారా స్సర్వే" అను శ్లోకముచే జెప్పుచుండెను. జ్ఞానికూడ సర్వాన్తఃపాతియైనను "జ్ఞాని" అని జ్ఞానిని వేరుగ చెప్పుటచే జ్ఞానికంటె రవేగు ఆర్తాదులే యీశ్లోక మునందు గల "సర్వే" అనుశబ్దముచే చెప్పబడుదురు. ఆర్తజిజ్ఞాస్వర్థార్థులందరుమద్భజనవిముఖులగు మీమాంసకాదులకంటె యుత్కృష్టులు. "పరమేశ్వరార్పణబుద్ధిచే కర్మానుష్ఠానము, చిత్తశుద్ధి, "వీడే పరమేశ్వరుడు" అను జ్ఞానము, నన్ను భజించుట," అనున వత్యంతదుర్లభములు. ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థియు పైనిచెప్పిన వాటి నన్నిటినిపొంది నన్నే సేవించుచుండిరి. కాన వీరలుకూడ శ్రేష్ఠులే. జ్ఞానులు, ఆర్తాదులు పరమేశ్వరుని భజించుటచేతను శ్రేష్ఠత్వముచేతను సమానులైయుండ "జ్ఞాని యత్యంతమునాకు ప్రియుడు" అని చెప్పుట సర్వసమునకగు పరమేశ్వరుడవైన నీకు జ్ఞానియందు పక్షపాతము కాదా యనుశంకను "ఆస్థితః" అను చరణముచే తొలగించుచుండెను. జ్ఞాని "యుక్తాత్మా" ప్రత్యగ్వృత్తిచే నెల్లప్పుడు నంతట నాస్వరూపగ్రహణమునందే

గీ॥ బహూనాం జన్మనా మన్తే జ్ఞానవా న్మాం ప్రపద్యతే।
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః ॥ ॥౧౯॥

పదవిభాగము:— బహూనాం- జన్మనాం- అన్తే- జ్ఞానవాన్- మాం- ప్రపద్యతే- వాసుదేవః- సర్వం- ఇతి- సః - మహాత్మా- సుదుర్లభః- ॥౧౯॥

ప్రతిపదార్థము:— బహూనాం=అనేకమైన; జన్మనాం=జ్ఞానార్థ సంస్కారములు కల జన్మములయొక్క; అన్తే అన్తమునందు; జ్ఞానవాన్=పొందబడిన పరిపాకజ్ఞానము కలవాడై; సర్వం=నిఖిలము; వాసుదేవః=వాసుదేవస్వరూపము; ఇతి=ఇట్లు; మాం=వాసుదేవస్వరూపమగు ప్రత్యగాత్మను, ప్రత్యక్షతః (ఈపద మధ్యాహార్యము) ప్రత్యక్షముగ; ప్రపద్యతే=తెలిసికొనుచున్నాడు; సః=అట్టి; మహాత్మా=గొప్ప యంతఃకరణ కలవాడు; సుదుర్లభః=అత్యంతము దుర్లభుడు; ॥౧౯॥

శాంకరభాష్యమ్:—

జ్ఞానీ పున రపి స్తూయతే- బహూనాం జన్మనాం జ్ఞానార్థసంస్కారాశ్రియాణా మన్తే సమాప్తౌ జ్ఞానవా న్ప్రాప్తపరిపాకజ్ఞానో మాం వాసుదేవం ప్రత్యగాత్మానం ప్రత్యక్షతః

శాంకభాష్యతత్త్వబోధిని:—

తిరిగి జ్ఞాని "బహూనాం" అను శ్లోకముచే స్తుతింపబడుచుండెను. జ్ఞానార్థసంస్కారము వాసన యనబడును. ఆయా జన్మములయందు పుణ్యకర్మానుష్ఠానము వలన జనించిన బుద్ధి శుద్ధియే వాసన యనబడును. అట్టివాసనాశ్రియములగు ననేకజన్మముల యంతిమ జన్మము

లగ్నమైన మనస్సుకలవాడై- దేనికంటె వేరుగ నిత్యముగ, మహత్తుగ, సూక్ష్మముగ, అంతరముగ, జ్ఞేయముగ, ఆనందరూపముగ, ప్రాప్యముగ లోకశాస్త్రప్రసిద్ధమైన ప్రమాణాబాధితమైన యుత్తమపదార్థము లేదో అది "అనుత్తమము" అని చెప్పబడును. అట్టి యనుత్తమమగునది యొకజ్ఞానముచేతనే పొందదగినది కాన "గతి" అని యనబడును. అట్టిగతినిపొందును. "అయమేవాహం" (నేనుఇదియే) అనిపరబ్రహ్మస్వరూపము, చిదేకరసము, అద్వితీయము, అగు నన్నే యహమర్థముగ చేసుకొని యంతటను పూర్ణత్వముచే నుండును. అట్టి జ్ఞాని యెన్నడును దేహేంద్రియాదులచే పరిచ్ఛిన్నుడు కాడు. కనుకనే జ్ఞానికేవలముశ్రేష్ఠుడే కాడు. మరేమనిన? "బ్రహ్మైవాహ మస్మి" అని యెల్లపుడు పూర్ణాత్మస్వరూపమున నుండువాడగుటవలన పూర్వోక్తరీతిని పరమేశ్వరస్వరూపడ నగునాయాత్మయే యగుచున్నాడు. అని నానిశ్చయము. కాన సగుణభక్తులందరికంటె జ్ఞాని యత్యంతము నాకు ప్రియుడని విశేషముగ చెప్పబడెను. ॥౧౮॥

—• ౭వ అధ్యాయము ౧౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— కనుకనే క్రమక్రమముగ పుణ్యముయొక్క యభివృద్ధికి హేతువగు యనేకజన్మల యంతమున సర్వసుకృతపరిపాకరూపమైన చరమజన్మమునందు "ఈసర్వము వాసుదేవస్వరూపమే." అను జ్ఞానముకలవాడై నిరుపాధిప్రేమస్వరూపుడనైన నన్ను యెల్లపుడు సమస్తప్రేమ విషయునిగ "సకల మిద మహం చ వాసుదేవః" అను దృష్టిచే నిఖిలప్రేమలు నాయందే పర్యవసాయు లగుటచే నన్నే సేవించును. కాన నిట్టి జ్ఞానపూర్వముగ నాభక్తికలవాడు అత్యంతశుద్ధాంతఃకరణకలవా డగుట వలన "మహాత్మా" జీవన్ముక్తుడు. సర్వోత్కృష్టుడు. వానితో సముడు కాని, అధికుడు కాని యితరు డెవడును లేడు. అందువలన మనుష్యులలో యనేకవేలమందిలో ఒకడైన దుర్లభుడు. కాననట్టివాడు నిరతిశయమగు నాప్రీతికి విషయుడు అని చెప్పుట యుక్తమే. ॥౧౯॥

శాంకరభాష్యమ్:—

ప్రపద్యతే । కథం, వాసుదేవ స్సర్వ మితి । య ఏవం సర్వాత్మానం మాం ప్రతిపద్యతే స మహాత్మా, నతత్సమోఽన్యోఽస్త్యధికో వా । అత స్సుదుర్లభో మనుష్యాణాం సహస్రే ష్విత్యుక్తమ్ । ॥౧౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నందు (అనగా యంతిమజన్మాంతమున) "సర్వము వాసుదేవస్వరూపము" అని వాసుదేవస్వరూపమైన ప్రత్యగాత్మను ప్రత్యక్షముగ తెలిసికొనును. సర్వాత్మయగు నన్ను యెవ డీవిధమున తెలిసికొనునో వాడు మహాత్ముడు. వానితో సమానుడు కాని, అధికుడు కాని లేడు. కనుకనే అట్టివాడు అనేకవేల మనుష్యులలో సుదుర్లభు డని చెప్పబడెను. ॥౧౯॥

శంకరానందీయము:— ఇట్లు జ్ఞానికి జ్ఞానాధికుడగుటచే సర్వోత్తమత్వమును చెప్పి యిపుడు బ్రహ్మనిష్ఠయే ప్రయోజనముగాకల కొన్ని జన్మలచే వినష్టాశేషప్రతిబంధకములు కల సమ్యకర్పిపక్వవిజ్ఞానముచేత "సర్వము బ్రహ్మమే" అను జ్ఞానముకల మహాత్మునకు "సర్వంబ్రహ్మైవ" అని కలిగిన జ్ఞానమునకు ఫలముగ విదేహముక్తిని "బహూనాం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

"తం బుద్ధి సంయోగం" అని చెప్పినరీతిని సమ్యగ్జ్ఞానసిద్ధియే ముఖ్యప్రయోజనముగా గల రెండు మూడు నాల్గుజన్మలలో చివరది యగు జన్మమునందు ప్రాగ్జన్మములయందైన వర్తమానజన్మమునందైన నిశ్శేషముగ నశించిన, విపరీతభావకోటిగల సమాధినిష్ఠచే ("వాసుదేవ స్సర్వమిదం") అనుయప్రతిబద్ధవృత్తిచే "సర్వము వాసుదేవస్వరూపమే" అనెడి జ్ఞానము కలవాడు బ్రహ్మవిత్తు. ఇచట "నామరూపక్రియాజాలవిశేషములచే పృథివ్యప్తేజోవాయ్వాదికత్కార్యభేదముచే పృథక్సత్తకలదిగ ప్రత్యక్షముగ కాన్పించుచున్న నిఖిలజగత్తునకు 'వాసుదేవస్సర్వమిదం'' అని జగద్విలక్షణ వాసుదేవస్వరూపత్వము ఎట్లు సిద్ధించును?" అని శంకింపజనదు. శ్రుతియుక్తులచే విచారింప నామరూపాదులకు, నామరూప విశిష్ట జగత్తునకు బ్రహ్మసత్తకంటె వేరుగ సత్తసిద్ధింపనందున మృత్తునందు ఘటమువలె మరుభూమియందు జలమువలె బ్రహ్మమునందు కల్పితమైన జగత్తునకు సత్త సంభవమగుచుండ నామరూపజాత్యాదులచే యనేకత్వము, బ్రహ్మవిలక్షణత్వము సిద్ధించెడిని. తదభావమువలన నది సిద్ధింపనందున (ఘటమునకు మృత్సత్తావ్యతిరేకముగ ప్రమాణములచే సత్తనిరూపించుటకు శక్యముకాదు.) అటులనే బ్రహ్మసత్తావ్యతిరేకముగ జగత్తునకు సత్తసిద్ధింపనందున "వాసుదేవ స్సర్వ మిదం" అని నిఖిలజగత్తు వాసుదేవాభిన్నమని చెప్పుట సమంజసమే.

పృథుబుధ్నకంబుగ్రీవాద్యాకారముచే ఘటస్వరూపము మృత్తుకంటె వేరుగా ప్రత్యక్షమగుటవలన మృత్తుకంటె వేరగు ఘటమునకు మృత్సత్తకంటె భిన్నమైన సత్త యుక్తమే యని శకింపజనదు. పృథుబుధ్నత్వాద్యాకారరూపముచే మృత్తే జడత్వగంధవత్త్వాది ధర్మములయొక్క అవ్యభిచారమువలన స్థితము. కాన ఘటాద్యాకారంక సంభవింపదు. స్థితిభేదమువలన మృత్తుకంటె ఘటమునందు భేదము సిద్ధించునని శంకింపజనదు. మృత్తునందే స్థితిభేదము కల్పితమగుటలన స్థితిభేదానుగతత్వముచే మృత్తే ప్రత్యక్షమగుటవలన చెప్పబడిన ధర్మమునకు వ్యభిచారమువలన ప్రత్యక్షముచే ఘటమునకు మృత్సత్తాభిన్నసత్త నిరూపించుటకు శక్యకానందునమృద్భిన్నత్వము సిద్ధింపదు. మృదభేదమే ప్రత్యక్షసిద్ధము. మరియు ఘటమునకు మృద్భిన్నత్వము అనుమానప్రమాణముచే సాధింపబడెననిన ప్రత్యక్షప్రమాణముచే సంసిద్ధమైన విషయమునుసాధించుటచే యనుమానప్రమాణము సమర్థమునను కాని ప్రత్యక్షముచేమృదభేదముఘటమునందుప్రత్యక్షసిద్ధమైయుండ మృద్భేదసాధమునం దనుమానప్రమా

గీ॥ కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః ।
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా ॥ ॥౨౦॥

పదవిభాగము:— కామైః- తైః- తైః- హృతజ్ఞానాః- ప్రపద్యన్తే- అన్యదేవతాః- తం- తం- నియమం- ఆస్థాయ- ప్రకృత్యా- నియతాః- స్వయా ॥ ॥౨౦॥

ప్రతిపదార్థము:— తైః,తైః=పుత్రపశుస్వర్గాదివిషయకమైన; కామైః=కోరికలచే; హృతజ్ఞానాః=అపహరింపబడినవివేకముకలవారై; తం,తం=ఆయా; నియమం=నియమమును; ఆస్థాయ=ఆశ్రయించి; స్వయా=తనసంబంధమైన; ప్రకృత్యా=జన్మాంతరార్జితసంస్కారవిశేషముచే; నియతాః=నియమితులై; అన్యదేవతాః=వాసుదేవునికంటె యితరమైన దేవతలను; ప్రపద్యన్తే=సేవించుచుండిరి. ॥౨౦॥

ణము ప్రవర్తింపదు. సాదృశ్యము లేమిఁజేసి యుపమానప్రమాణము ప్రవర్తింపనేరదు. "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్" అను శ్రుతిచే ఘటమునకు మృణ్మాత్రత్వము శ్రూయమాణమగుటవలన మృత్సత్తకంటె వేరుగ సత్తను సంపాదించుట శక్యముకాదు. అట్లే మృత్తునందు ఘటమువలె బ్రహ్మమునందు కల్పితమైన జగత్తునకు కల్పితత్వముభయసాధారణమగుటవలన బ్రహ్మసత్తాతిరిక్తసత్తను సాధించుట శక్యముకాదు. కాన స్వతఃసత్తాశూన్యమైన జగత్తునకు పూర్వోక్తరీతిని పృథక్సత్త బాధితమైయుండ జగత్తు నాశ్రయించియుండిన నామరూపజాత్యాదులు బాధితములగుటవలన స్వకార్యనిర్వాహము సంభవింపనందున జగత్తునకు బ్రహ్మాభిన్నత్వమే సిద్ధించుచున్నది. కాన సర్వము వాసుదేవస్వరూపమే. అందుచే భ్రాన్తిచే ప్రతీతమగు సర్వ మధిష్ఠానానన్యమగుటవలన వాసుదేవానన్యమే. కాన నప్రతిబద్ధమగు ప్రత్యగ్దృష్టిచే "ఈ నిఖిలప్రపంచము, నేను వాసుదేవస్వరూపమే." అను జ్ఞానము కలవాడైన బ్రహ్మవిద్వరిష్ఠుడు ప్రారబ్ధకర్మశేషపరిసమాప్తియైయుండ "తస్య తావదేవచిరం" అను శ్రుత్యుక్తరీతిని యీవిద్వచ్ఛరీరము పతితమైయుండ నిరస్తాశేషవిశేషములు కల కార్యకారణవిలక్షణుండు, అనంతరము, అబాహ్యము, సచ్చిదానందైకరసము, అద్వితీయము, నగు పరబ్రహ్మస్వరూపమైన నన్ను పొందును. ఘటము నష్టమైన ఘటాకాశము మహాకాశరూపమున నున్నటుల యుపాధి నష్టమగుచో పరిచ్ఛిత్తిహేతువు లేమిఁజేసి పూర్ణాత్మస్వరూపముచే నుండును. అనగా విదేహకైవల్యమును పొందునని యర్థము.

ఇట్టి యప్రతిబద్ధవృత్తిచే సర్వమును బ్రహ్మమాత్రముగ జూచు మహాత్ముడైన బ్రహ్మవిద్వరిష్ఠుడు లోకమున శుకాదులవలె "దుర్లభః" ఎవడో యొకానొకడే సంభవించును. కాని ప్రాయశః సంభవింపడు. అని యభిప్రాయము.

లేక సమ్యగ్దర్శనసిద్ధికారణమైన సమాధియే ముఖ్యమైన ప్రయోజనముగా కల యనేకజన్మల యంతమందైన యంతిమజన్మమునందు యాయాజన్మములయం దనుష్ఠితసమాధివిశేషములచే యవిద్యాకామాదిప్రతిబంధసమూహము నిశ్శేషముగ నివర్తించుటచే విశుద్ధవిజ్ఞానముకల జ్ఞాని "సర్వము బ్రహ్మస్వరూపమైన వాసుదేవస్వరూపమే" అను యప్రతిబద్ధాత్మవృత్తిచే సర్వాత్మక మగు పరబ్రహ్మస్వరూపమైననన్ను "ప్రతిపద్యతే" "ఇదమేవాహం" (నేనుఇదియే) యనిస్వస్వరూపముగ తెలిసికొనుచున్నాడు. ఇట్లుసర్వమును, తనను బ్రహ్మస్వరూపముగ నెవడు తెలిసికొనునో అట్టివాడు "మహాత్మ"సర్వదాబ్రహ్మాకారముగ నుండు యంతకరణ కల మహానుభావుడు. అట్టివాడు"సుదుర్లభః" శ్రవణమనననిదిధ్యాసనలుకలయనేకవేలలో ఒకానొకడే యుండునని యర్థము.

—• ౭వ అధ్యాయము ౧౯ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇంతవరకు ; ఆర్తాదిభక్తత్రయముకంటె జ్ఞానియగు భక్తుని యొక్క "తేషాం జ్ఞానీ నిత్యయుక్తః, ఏకభక్తిర్విశిష్యతే" అనుచోట ప్రతిజ్ఞాతమైన యుత్కర్ష వ్యాఖ్యా

గీ॥ యో యో యాం యాం తనుం భక్త శ్శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి ।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తా మేవ విదధా మ్యహమ్ ॥ ॥౨౧॥

పదవిభాగము:— యః- యః- యాం- యాం- తనుం- భక్తః- శ్రద్ధయా- అర్చితుం- ఇచ్ఛతి- తస్య- తస్య- అచలాం- శ్రద్ధాం- తాం- ఏవ- విదధామి-అహమ్ ॥ ॥౨౧॥

ప్రతిపదార్థము :— యో యః=ఏయేకాముకుడు; యాం యాం=ఏయే: తనుం=దేవతా శరీరమును; శ్రద్ధయా=శ్రద్ధతోకూడినవాడై: భక్తః=భక్తుడై, అర్చితుం=పూజించుటకు: ఇచ్ఛతి=ఇచ్ఛయించునో; తస్య,తస్య=అట్టివార్లకు; అహం=నేను; తాం=ఆ; అచలాం=స్థిరమైన; శ్రద్ధాం=శ్రద్ధను; విదధామి=స్థిరముగ జేసెదను. ॥౨౧॥

శంకరానందీయము :— ప్రత్యగ్రూపము, సర్వాత్మకము నగు బ్రహ్మము తనస్వరూపమే యగుచో సర్వులు పరిపూర్ణము, అనన్యాంతరము, అశ్రయలభ్యము నగు యాత్మనే యెందులకు తెలిసికొనరు? తెలిసికొనిన యెందులకు ముక్తిని పొందరు? అను యాశంకపై నాసంబంధమైన మాయచే నపహరింపబడిన వివేకవిజ్ఞానముకలవారై, దేవతాంతరారాధనపరులై నన్ను భజింపరు. నాభజనవలన ప్రాప్తించెడి ఫలమను పొందరు. అని "కామైః" అను శ్లోకము మొదలు నాల్గుశ్లోకములచే జెప్పుచుండెను. "పశ్యతి పుత్రం పశ్యతి పౌత్రం ఏతై రాయుష్కామ అయు రాశాస్తే రాష్ట్రకామః పశుకామః బ్రహ్మవర్చసకామః" ఇత్యాది శ్రుతులచే పట్టబడినట్టి "విష్ణులోకం స గచ్ఛతి; శివేన సహ మోదతే" ఇత్యాదిపురాణములచే చెప్పబడినట్టి పుత్రపౌత్రపశుస్వర్గవిష్ణ్వాదిలోకములు విషయయముగాకల నా మాయాస్వరూపమైన యాయా కామములచే "హృతజ్ఞానాః" నిత్యానిత్యపదార్థవివేచనయందు, నిత్యపదార్థవేదనయందు, నిత్యపదార్థానుసంధానమునందు, అట్టి యనుసంధానఫలసంపాదనయం దశక్తమైన వివేకవిజ్ఞానముకలవారై మీమాంసకులు, తార్కికులు, శైవులు, శాక్తులు వైష్ణవులు, మరియు యితరులగు సర్వులు తమ యంతఃకరణమునందున్న ప్రకృతిచే ఆయా దేవతలయారాధనయందు, భజనమునందు, తత్ఫలసంపాదనయందు ప్రయత్నము కలిగించెడి వాసనచే ప్రేరితులై తత్తచ్ఛాస్త్రోక్తమైనట్టి వైదికము, స్మార్తము, పౌరాణికము, తాంత్రికము నగు కర్మానుష్ఠానము, జపము, హోమము, దానము, స్తోత్రపాఠము మొదలగు విషయములకలిగి యతిక్రమింపరాని ఏనియమములు కలవో ఆయానియమముల నాశ్రయించి పరబ్రహ్మవ్యతిరిక్తమగు సోపాధికమైన బ్రహ్మేంద్రవిష్ణ్వాదిదేవతలను "ప్రపద్యన్తే" వారల యుపాసనచే లభ్యములగు తుచ్ఛములైన యనిత్యములైన ఫలములయందు నిత్యత్వ రమ్యత్వేష్టత్వబుద్ధిచే మోహితులై తత్సిద్ధికొరకు సేవించుచుండిరి. ॥౨౦॥

—• ౭వ అధ్యాయము ౨౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:—

ఆయా క్షుద్రదేవతానుగ్రహమువలన అట్టి క్షుద్రదేవతోపాసకులకు గూడ సర్వేశ్వరుడు, భగవంతుడు నగు వాసుదేవునియందు భక్తి కలుగగలదను శంకపై "యో యో యాం యాం" అని చెప్పుచుండెను.

శాంకరభాష్యమ్: —

ఆత్మైవ సర్వం వాసుదేవ ఇత్యేవ మప్రతిపత్తౌ కారణ ముచ్యతే- కామై స్తై స్తైః పుత్రపశుస్వర్గాదివిషయై ర్హృతజ్ఞానా అపహృతవివేకవిజ్ఞానాః । ప్రపద్యన్తేఽన్యదేవతాః ప్రాప్నువన్తి వాసుదేవా దాత్మనోఽన్యా దేవతా స్తం తం నియమం దేవతారాధనే ప్రసిద్ధో యో యో నియమ స్తం త మాస్థాయాశ్రిత్య ప్రకృత్యా స్వభావేన జన్మాన్తరార్జితసంస్కారవిశేషేణ నియతా నియమితా స్వయాఽఽత్మీయయా ॥౨౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని: —

అట్లగుచో సర్వులకు ప్రత్యగ్భూతమైన భగవద్విషయక మగు పూర్వోక్తజ్ఞాన మేందు లకు కలుగుట లేదని యాశంకించి యాయాశంకాపరిహారార్థముగ "న మాం దుష్కృతినః" అని చెప్పిన హేతువును మనస్సునం దిడుకొని 'సర్వము వాసుదేవస్వరూప మగు యాత్మయే" అని జ్ఞానము కలుగకపోవుటయందు కారణాంతరమును చెప్పుచుండెను, పుత్రపశుస్వర్గాది విషయకమైన యాయా కోరికలచే నపహృతమైన వివేకవిజ్ఞానముకలవారై తమ సంబంధమైన స్వభావముచే (జన్మాంతరార్జితసంస్కారవిశేషముచే) నియమితులై భిన్నదేవతారాధనలయందు ప్రసిద్ధమైన యాయానియమముల నాశ్రయించి వాసుదేవునికంటె వేరగు దేవతల నారా ధించుచుండిరి. ॥౨౦॥

తము. ఇపుడు సకామత్వము, భేదదర్శిత్వము సమానమైనను దేవతాంతరభక్తునికంటె పరమేశ్వరభక్తులగు ఆర్తాదులకు "ఉదారా స్సర్వ ఏవైతే" అనుస్థలమున ప్రతిజ్ఞాతమైన యుత్కర్ష యీయధ్యాయసమాప్తిపర్యం తము శ్రీకృష్ణపరమాత్మచేతనే వ్యాఖ్యానింపబడుచుండెను. ఆయాసము, సకామత్వము, భేదదర్శిత్వము సమానమైనను నాభక్తులు భూమిక్రమముచే సర్వోత్కృష్టమగు మోక్షమనెడి ఫలమును పొందుచున్నారు. క్షుద్రదేవతాభక్తులన్నచో మాటిమాటికి సంసరణమనెడి క్షుద్రఫలమునే పొందుదురు. ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి నన్నే శరణుపొంది అనాయాసముగ సర్వోత్కృష్టమగు మోక్షమనెడి ఫలమును పొందుదురుగాక యని పరమకారుణికుడైన భగవంతుని యభిప్రాయము. పరమపురుషార్థము ఫలముగా కల భగవద్భజనను గూడ యుపేక్షించి క్షుద్రఫలముకల క్షుద్రదేవతోపాసనను చేయుటయందు పూర్వవాసనావిశేషమే అసాధారణ కారణమని "కామైః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

మోహనము, స్తంభనము, ఆకర్షణము, వశీకరణము, మారణము, ఉచ్చాటనము, మొదలగు విషయ ములు భగవత్సేవచే పొందుటకు శక్యము కానందున అభిమతమగు క్షుద్రమైన యాయభిలాషలచే "హృతజ్ఞానాః" భగవంతుని వలన విముఖమొనరింపబడి ఆయా ఫలదాతలుగ నభిమతమైన క్షుద్రదేవతల యాభిముఖ్య మొన రించిన యంతఃకరణకలవారై, వాసుదేవునికంటె భిన్నమగు క్షుద్రదేవతలను జపము, ఉపవాసము, ప్రదక్షి ణములు, నమస్కారాదికమును (తత్తద్దేవతారాధనమునందు ప్రసిద్ధమైన నియమములను) ఆశ్రయించి ఆయా క్షుద్రఫలప్రాప్తిచ్ఛచే క్షుద్రదేవతల మధ్యయందుకూడ కొందరు యేదో యొక్కొక్క దేవతనే- తన సంబంధమైన పూర్వాభ్యాసవాసనచే వశీకృతులై సేవించెదరు. ॥౨౦॥

శాంకరభాష్యమ్:—

తేషాం చ కామినాం- యో యః కామీ యాం యాం దేవతాతనుం శ్రద్ధయా సంయుక్తో భక్తశ్చ స న్నర్చితు మిచ్ఛతి తస్య తస్య కామినోఽచలాం స్థిరాం శ్రద్ధాం తామేవ విదధామి స్థిరీకరోమి యయైవ పూర్వం ప్రవృత్తస్స్వభావతో యో యాం దేవతాతనుం శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతీతి ॥ ॥౨౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆయాదేవతాప్రసాద (అనుగ్రహము)వలన కాముకులకుగూడ సర్వేశ్వరుడు, సర్వాత్మకుడు నగు వాసుదేవునియందు క్రమముగ భక్తి జనింపగలదని శంకింపజనదు. ఏయేకామి యేయేదేవతాశరీరమును శ్రద్ధతోగూడినవాడై భక్తుడై పూజించుట కిచ్ఛయించునో ఆయాకామికి పూర్వమునం దెట్టిదీరున పూర్వసంస్కారమువలన యేయే దేవతాశరీరమును శ్రద్ధచే పూజించుట కిచ్ఛయించునో స్థిరమైన యాశ్రద్ధనే స్థిరముగ జేసెదను. ॥౨౧॥

వారలలో యేయే కామి యేయే దేవతామూర్తిని జన్మాంతరవాసనాబలముచే ప్రాదుర్భవించిన భక్తితోగూడినవాడై పూజించుటకు ప్రవర్తించునో ఆకామి కాదేవతాతనువును గూర్చియే పూర్వవాసనావశమున ప్రాప్తమైన స్థిరమైన భక్తినే అంతర్యామిరూపమున నున్న నేనే చేయగలను. ఇంతియే కాని నా విషయమైన భక్తిని వానివానికి చేయను.

ఇచట "తామేవ శ్రద్ధాం" అని "తాం అను పదమును "శ్రద్ధాం" అనుపదమునకు విశేషణ మొనరించిన ఆశ్రద్ధనే అను యర్థము సంభవించును. కాని పూర్వచరణమునందుగల "యాంయాం" అను యచ్ఛబ్దానన్వయము ప్రాప్తించును. అందుచే పూర్వమునందు "యాం" అను యచ్ఛబ్దముచే దేవతాతనువు చెప్పబడుటచే "తాం" అను శబ్దముచే ఆయాదేవతాతనువునుగూర్చి శ్రద్ధను చేయగల నని యన్వయించిన అనన్వయదోషము ప్రాప్తింప దని "తాంప్రతి" అనిప్రతిశబ్దమధ్యాహృతము. ॥౨౧॥

శంకరానందీయము:— ఆభక్తులలో శైవుడు కాని, వైష్ణవుడు కాని, శాక్తుడు కాని, కర్మి కాని,మరియొకడు కాని యేయేయుపాసకుడు "యాం యాం తనుం" కామితార్థము నిచ్చునట్టి యేయే దేవతాస్వరూపమును అనగా శివుని కాని, విష్ణువుని కాని, ఇంద్రుని కాని, మరియొక దేవతాస్వరూపమును కాని యేశ్రద్ధచే ఆరాధించుట కిచ్ఛయించునో, ఆయాభక్తున కాయా దేవతాస్వరూపమునందే అనగా శివాదులయందే స్థిరమైన యాశ్రద్ధనే (భక్తినే) అంతర్యామినైన నేనే యిచ్చెదను.

ఇచట యభిప్రాయమేమనిన? అంకురమందుండు జలము- అంకురము మెప్పలము కాని, మెచుమందము కాని, ఆమ్రము కాని యేదైనను తనతన వాసనానురూపముగ యెట్లు పరిణమించునో ఆ అంకురమునందుండు జలము ఆయాబీజమున కాయాశక్తి నొసంగును. అట్లే జీవుడుకూడ తన కర్మానురూపవాసనచేనెట్లుప్రవర్తించుట కిచ్ఛయించునో అట్లే బుద్ధిస్థుడగు యాత్మ స్వసన్నిధిమాత్రముచే అబుద్ధికిఅప్రవృత్త్యనురూపమగు శక్తిని సమకూర్చును. ఇంతియే కాని సారథి యశ్వమును ప్రేరణ చేయునటుల జీవుని బుద్ధిస్థమగు యాత్మ ప్రేరణ చేయదు. అమూర్తము, అవికారి యగు ఆత్మకు క్రియ సంభవింపనందున ప్రేరణచేయదని యాశయము. ॥౨౧॥

గీ॥ స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే ।
లభతే చ తతః కామా న్మయైవ విహితా న్హి తాన్ ॥ ॥౨౨॥

పదవిభాగము :— సః– తయా– శ్రద్ధయా– యుక్తః– తస్యాః– రాధనం– ఈహతే– లభతే– చ– తతః– కామాన్– మయా– ఏవ– విహితాన్– హి– తాన్ ॥ ॥౨౨॥

ప్రతిపదార్థము :— సః=ఆకామి; తయా=నాచేవిహితమైనఆ; శ్రద్ధయా=శ్రద్ధతో; యుక్తః=కూడుకొనినవాడై; తస్యాః=ఆయాదేవతాశరీరముయొక్క; రాధనం=ఆరాధనను; ఈహతే=చేయుచున్నాడో; తతః=ఆఆరాధితదేవతాశరీరమువలన; మయైవ=సర్వజ్ఞుడనగునా (పరమేశ్వరుని)చేతనే; విహితాన్=నిర్మితములైన; తాన్=ఆకామములను; హి=ఏకారణమువలన; లభతేచ=పొందుచున్నాడో; ॥౨౨॥

శాంకరభాష్యమ్:—

స తయేతి । స తయా మద్విహితయా శ్రద్ధయా యుక్తస్సం స్తస్యా దేవతాతన్వా రాధన మారాధన మీహతే చేష్టతే లభతే చ తత స్తస్యా ఆరాధితాయా దేవతాతన్వాః కామా నీప్సితా న్మయైవ పరమేశ్వరేణ సర్వజ్ఞేన కర్మఫలవిభాగజ్ఞతయా విహితా న్నిర్మితాంస్తాన్హి యస్మా త్తే భగవతా విహితా కామా స్తస్మా త్తా నవశ్యం లభత ఇత్యర్థః । హితానితి పదచ్ఛేదే హితత్వం కామానా ముపచరితం కల్ప్యం, న హి కామాహితాః కస్యచిత్ ॥౨౨॥

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

ఆకామి నాచే జేయబడిన శ్రద్ధతో గూడినవాడై యాదేవతావిగ్రహముయొక్క యారాధనమును జేయుచున్నాడు. ఆయారాధింపబడిన దేవతాశరీరమునుండి- సర్వజ్ఞుడను కర్మఫలవిభాగమును తెలిసినవాడను యగు నాచే (ఆరాధితదేవతాప్రసాదమువలన కలిగెడి ఫలప్రాప్తివిషయమై సర్వజ్ఞుడు, కనుకనే కర్మఫలవిభాగజ్ఞుడు నగు యీశ్వరుడు తత్తద్దేవతాధిష్ఠాతయై ఫలప్రదాత యగును.) విహితములైన యీప్సితములను పొందుచున్నాడు. ఇట "హి-తాన్" అను పదచ్ఛేదనముచే, ఆకామములు భగవద్విహితములుకనుకనే వాటినికామి యవశ్యము పొందుచున్నాడు అను యర్థము లభించుచున్నది. "హితాన్" అని యేకపదముగా జేసిన కామములకు హితత్వమును కల్పింపవలసివచ్చును. కామములు యెవనికిని హితములు కావు. కాన వాటిని వ్యస్తపదములుగనే గ్రహింపనగును. ॥౨౨॥

—: ౭వ అధ్యాయము ౨౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు: —

మధుసూదనసరస్వతీయము:— అట్టి కామి నాచే విహితమైన స్థిరమగు శ్రద్ధతో గూడినవాడై దేవతల పూజలను చేయుచుండును. ఆఙ్ అను ఉపసర్గలేకున్నను "రాధనం" అను శబ్దము పూజార్థకము ("ఆఙ్" అను ఉపసర్గ యుండినచో ఆకారము వినబడెడిని.) అనంతరమున నాదేవతాతనుసమీపమువలన పూర్వసంకల్పితములు సర్వకర్మఫలదాతను, సర్వజ్ఞుడను, ఆయాదేవతాంతర్యామినియునగు నాచేతనే నిర్మితములు, మనఃప్రియములు, అనగా అహితములైనను హితవుగ ప్రతీయమానములునగు యీప్సితములను పొందును. ఈశ్లోకమునకల "హి" అనునది ప్రసిద్ధిని బోధించును. ॥౨౨॥

శంకరానందీయము:— ఇట్లు దేవతాంతరభక్తులకు తత్తద్దేవతలయందుదృఢశ్రద్ధాభక్తి నావలననే ప్రాప్తించుచున్నదని చెప్పి దేవతాంతరములయందు శ్రద్ధాభక్తికలవారలకు ఫలసిద్ధికూడ తత్తద్దేవతాద్వారమున నావలననే యని "స తయా" అనుశ్లోకముచే జెప్పుచుండెను.

గీ॥ అన్తవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసామ్ ।
దేవా న్దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి ॥ ॥౨౩॥

పదవిభాగము:— అన్తవత్– తు– ఫలం– తేషాం– తత్– భవతి– అల్పమేధసాం– దేవాన్– దేవయజః– యాన్తి– మద్భక్తాః– యాన్తి– మాం– అపి ॥ ॥౨౩॥

ప్రతిపదార్థము:— అల్పమేధసాం=అల్పప్రజ్ఞులగు; తేషాం=ఆ కామనాసహితులకు; తత్=ఆ; ఫలంతు=ఫలమైతే; అంతవత్=వినాశముకలదియై; భవతి=యగుచున్నది; ॥౨౩॥

శాంకరభాష్యమ్:—

యస్మా ద న్తవత్సాధనవ్యాపారా అవివేకినః కామినశ్చ తే౽తః–అ న్తవ ద్వినాశి తు ఫలం తేషాం త ద్భవత్యల్పమేధసా మల్పప్రజ్ఞానాం, దేవాన్ దేవయజో యాన్తి దేవాన్యజ న్తీతి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అవివేకులగు కాములు నశ్వరసాధనవ్యాపారములు కలవారుగాన యల్పప్రజ్ఞులగు ఆ కామనాసహితుల కర్మఫలము నశ్వరమే యగుచున్నది. దేవతలనుగూర్చి యాగము చేయువారలు దేవతలను పొందుచుండిరి. నాభక్తులన్ననో నన్నే పొందుచుండిరి. కామనా

అట్టి భక్తుడుగూడ చెప్పినరీతిని నాచే సంభావితమైన శ్రద్ధతో గూడినవాడై తనయభీష్టదేవతారాధనను (తత్తద్దేవతావిషయకమగు మంత్రజపహోమాదిస్వరూపమగు కర్మను) చేయుచుండును. అనంతరమున తత్తద్దేవతాంతర్యామియగు నాచేతనే తత్తద్దేవతాద్వారమున యిప్పింపబడిన కామితార్థములను పొందును. "ఏష ఏవ సాధు కర్మ కారయతి" "ఏకో బహూనాం యో విదధాతి కామాన్" అను శ్రుతులుకూడ నాకే ఆయా కర్మకారయితృత్వమును, తత్తత్కర్మఫలదాతృత్వమును బోధించుచున్నవి. మరియు తత్తద్దేవతల కనాత్మత్వము, అనీశ్వరత్వము, అస్వాయత్తత్వము సూచింపబడెను. మరియు చేతనుడు, ఈశ్వరుడు, సర్వార్థముల నిచ్చువాడు, ఆత్మభూతుడు, అనాయాసలభ్యుడునగు ఈశ్వరరూపుడనగు నన్ను విడచి మూఢులుపైనిచెప్పబడినలక్షణములు కల దేవతాంతరమును సేవించుచుండిరనియు సూచితము. ॥౨౨॥

—• ౭వ అధ్యాయము ౨౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— విచారింప సర్వదేవతలు సర్వాత్మయగు నాయొక్క తనువులే (శరీరములే) కాన దేవతాంతరారాధనగూడ నాయారాధనమే. అంతటను ఫలమునిచ్చువాడను అంతర్యామియు నేనే. అయినను సాక్షాత్తు నాభక్తులకు, దేవతాంతరభక్తులకు వస్తువివేకావివేకకృతమైన ఫలవైషమ్యము సంభవించునని "అంతవత్తు" అనుశ్లోకముచే జెప్పుచుండెను.

మందమైన ప్రజ్ఞకలవారగుటచే వస్తువివేకాసమర్థులైన ఆ యా దేవతాంతరభక్తులకు ఆ యా దేవతాంతరారాధనవలన జనించెడిఫలము నాచే విహితమైనను అంతవత్తె (నశించునదే.) సాక్షాత్తునాభక్తులగు వివేకులకు సంభవించెడి అనంతఫలమువలె వారలకు ప్రాప్తించెడి ఫల మనన్తము కాదు. నాకంటె వేరగు దేవతల నారాధించువారలు అంతవత్తులగు దేవతాంతరులయారాధనాసక్తులుగాన నట్టి అంతవత్తులగు దేవతాంతరములనే పొందెదరు. మద్భక్తులగు ఆర్తజిజ్ఞాస్వర్థార్థులగు ముగ్గురు సకాములైనను మొట్టమొదట నాయనుగ్రహమువలన యభీష్టములను పొందుదురు. ఇట "అపి" అను శబ్దప్రయోగమువలన అభీష్టములను పొందినపిదప మదుపాసనాపరిపాకమువలన అనంతము, అనందఘనము నగు నీశ్వరరూపమగు నన్ను పొందుదురు. కాన, నాభక్తులు, అన్యదేవతాభక్తులు సకాములగుటలో సమానమైనను మహదంతరము కలదు. కాన "ఉదారా స్సర్వ ఏవైతే" అని లెస్సగ జెప్పబడెను. ॥౨౩॥

శాంకరభాష్యమ్:—

దేవయజ స్తే దేవా న్యాంతి। మద్భక్తా యాన్తి మా మపి। ఏవం సమానే ప్యాయాసే మామేవ న ప్రపద్య న్తేఽనన్తఫలాయాఽహో ఖలు కష్టం వర్తత ఇత్యనుక్రోశం దర్శయతి భగవాన్। ॥౨౩॥

శాంకభాష్యతత్త్వబోధిని:—

సహితముగ గర్మ చేయు వారలకునూ, నాభక్తులకును యాయాసము సమానమే యైనను, యనంతఫలదుడనైన నన్ను భజింపకుండిరి. ఎంతకష్టము! అని శ్రీకృష్ణపరమాత్మ యను క్రోశమును జూపుచుండెను. ॥౨౩॥

శంకరానందీయము:— "కామ ఏష క్రోధ ఏషః" అనుస్థలమున కాముడు దుష్పూరుడని, పాతకియని, వైరియని పూర్వమునందే చెప్పబడెను. కాన కాముడే సర్వానర్థబీజమని కోరికకలవానిచే చేయబడిన కర్మ, తత్ఫలమున్ను నశించున వగుటచే పురుషార్థకరములు కావని "అంతవత్తు" అనుశ్లోకముచే జెప్పుచుండెను.

"అల్పమేధసాం" సగసద్వివేచనము, అసత్పరిత్యాగము, సదా దానముచేయుట మొదలగు క్రియల కనర్హమైన (మందమైన) వివేకబుద్ధికల కాములకు ఉపవాసనియమాయాసబహ్వర్థసాధ్యమగు యజ్ఞదానాదిక్రియలచే ప్రసన్నమైన దేవతలవలన ప్రాప్తించు ఫలము "అంతవదేవ" నశించునదే "తు" అనునీశ్లోకమున కలశబ్దము నిశ్చయార్థమును బోధించును. సేవ మహద్విషయమగుచో తత్ఫలము గూడ గొప్పదే యగును. తద్విపరీతమగుచో ఫలముగూడ విపరీతమే యగును. "మహత్సేవా ద్వారమాహుర్విముక్తేః" (గొప్పవారలసేవ విముక్తికి ద్వారముగ జెప్పుదురు.) అను ప్రసిద్ధికలదు. ఈవిషయము రాజభటసేవాదులయందుచూడబడుచున్నది. కాన కాములచే సేవింపబడు దేవతాంతరులు సగుణు లగుటవలన అనిత్యులు, పరిచ్ఛిన్నులు, సోపాధికులు, అనీశ్వరులు, అల్పవిభూతులు కలవారు. అట్టివారలసేవ భటసేవవలె అనిత్యమగు స్వల్పఫలమునే యొసగును. కాన కాముకుల ఫలము "యో వా ఏత దక్షరం గార్గ్యవిదిత్వా ఽస్మి ల్లోకే జుహోతి యజతే తపః స్తప్యతే అన్తవ దేవాస్య త ద్భవతి" అను శ్రుత్యుక్తరీతిని నశించునదియే యగును. మోక్షమువలె నిత్యము కాదు. అనిత్యోపాసనచే నిత్యమగు మహత్ఫలము సిద్ధింపదు. కాన ఆయాశాస్త్రోక్తవిధిచే బ్రహ్మాదులను, ఇంద్రాదులను సేవించువారు ఆదేవతలనే పొందుదురు. "కర్మణా పితృలోకో విద్యయా దేవలోకః" "దేవో భూత్వా దేవా నప్యేతి" అను శ్రుత్యుక్తరీతిని తత్తత్సారూప్యమును పొంది తత్తద్దేవతాలోకమును పొందుచున్నారు. ఈ చెప్పుటవలన సగుణోపాసకులకు దేహాయాసక్లేశము, అర్థవ్యయక్లేశము, అల్పఫలత్వక్లేశము సంభవించుచున్నవి. "అహో! వారల కెంత కష్టము" అని యూహింపనగును.

ఇట్లు సగుణోపాసకులకు ఉపాసనాఫలమును జెప్పి "వాసుదేవ స్సర్వమితి జ్ఞానవా న్మాం ప్రపద్యతే" అని చెప్పిన విషయమును పుణ్యాత్ములైన శ్రోతలగు వివేకులకు తన యుపాసనయందే శ్రద్ధ కలుగు గాకయని తిరిగి జెప్పుచుండెను. 'మద్భక్తాః" అనుదానిచేత అపిశబ్దమువలన నన్నే పొందుదుగని యర్థము.

నాభక్తులగు యెవరు సదసద్వివేక వైరాగ్యశమదమసంన్యాసాద్యుత్తమసాధనసంపత్తిచేతను, బ్రహ్మవిద్వర్య ప్రసత్తిచేతను శ్రవణమననములచే ఆత్మస్వరూపమగు నన్ను పరబ్రహ్మనుగ దెలిసికొని యెల్లపుడు ఐకాత్మికమగు భక్తిచే సేవించెదరో వారు నాభక్తులు. యతులన్నచో పరబ్రహ్మస్వరూపమగు నన్నే పొందెదరు. ఈవిషయమునే "సంప్రాప్యైన మృషయో జ్ఞానతృప్తాః కృతాత్మానో వీతరాగాః ప్రశాన్తాః। తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా యుక్తాత్మాన స్సర్వమేవావిశన్తి" అను శ్రుత్యనుసారము నిత్యనిరతిశయానందము

గీ॥ అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మా మబుద్ధయః ।
పరం భావ మజానన్తో మమాఽవ్యయ మనుత్తమమ్ ॥ ॥౨౪॥

ప ద వి భా గ ము :— అవ్యక్తం- వ్యక్తిం- ఆపన్నం- మన్యన్తే- మాం- అబుద్ధయః- పరం- భావం- అజానంతః- మమ- అవ్యయం- అనుత్తమం ॥ ॥౨౪॥

ప్ర తి ప దా ర్థ ము :— అబుద్ధయః=అవివేకులు; మమ=నాయొక్క; అవ్యయం=నాశములేనిదియు; అనుత్తమం=నిరతిశయమైనదియునగు; పరంభావం=పరమాత్మస్వరూపమును; అజానంతః=తెలిసికొననివారై; మాం=నన్ను; అవ్యక్తం=అప్రకటితుడనై; వ్యక్తిం=ప్రకటనను; ఆపన్నం=పొందినవానినిగ, మన్యంతే=తలచుచుండిరి; ॥౨౪॥

---

శాంకరభాష్యమ్:—

కిం నిమిత్తం మా మేవ న ప్రపద్యంత ఇత్యుచ్యతే— అవ్యక్త మప్రకాశం వ్యక్తి మాపన్నం ప్రకాశం గత మిదానీం మన్యంతే మాం నిత్యప్రసిద్ధ మీశ్వరమపి సంత మబుద్ధయోఽవివేకినః పరం భావం పరమాత్మస్వరూప మజానంతోఽవివేకినో మమావ్యయం వ్యయరహిత మనుత్తమం నిరతిశయం మదీయం భావ మజానంతో మన్యంత ఇత్యర్థః ॥ ॥౨౪॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని: —

అవివేకులు న న్నేకారణముచే తెలిసికొనలేకుండిరి? అను ప్రశ్నకు సమాధానమును జెప్పుచున్నాడు. అవివేకులు నాశరహితము, నిరతిశయము నగు నాస్వరూపమును (పరమాత్మ

---

పునరావృత్తివర్జితము నగు విదేహకైవల్యమును పొందుచున్నారు. "తేషాం జ్ఞానీ నిత్యయుక్తః" ఏక భక్తిర్విశిష్యతే" అనియు, "యో మద్భక్త స్సమే ప్రియః" అనియు జ్ఞాని గూడ భక్తుడేయని చెప్పుటవలన ఈ శ్లోకమున "మద్భక్తాః" అని జ్ఞానులే చెప్పబడుచుండిరి. ఇతరులు చెప్పబడుటలేదు. పూర్వమునందు "జ్ఞానవాన్మాం ప్రపద్యతే" అని తన భక్తుడగు జ్ఞానికే తన ప్రాప్తిని చెప్పుటవలన దేవతాంతరభక్తునకు "వాసుదేవ స్సర్వమిదం" అను జ్ఞానము సంభవింపనందునను, "సర్వారంభపరిత్యాగే" అని సర్వకర్మ పరిత్యాగము సంభవింపనందునను "తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరం" అని స్వస్వరూపమును తత్త్వము వలన తెలిసికొనినవానికే విదేహముక్తిని చెప్పగలడు.. కాన నిచట భక్తులగు బ్రహ్మవేత్తలే "మద్భక్తాః" అను పదముచే చెప్పదగుదురని తెలిసికొననగును. ॥౨౩॥

## —: ౭వ అధ్యాయము ౨౪ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మ ధు సూ ద న స ర స్వ తీ య ము:— ఇట్లు భగవద్భజనము సర్వోత్తమఫలము కలదైనను జీవులు తరచుగ నెందులకు భగవద్విముఖు లగుచుండిరి? అను శంకను తొలిగించుటకు హేతువును శ్రీకృష్ణపరమాత్మ "అవ్యక్తం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

"అవ్యక్తం" దేహగ్రహణకు పూర్వమునందు కార్యాసమర్థముగ నున్న వానిగను, వసుదేవగృహమునందు భౌతికదేహముతోగూడి కార్యక్షమత్వమును పొందిన జీవునిగను యీశ్వరుడనైనను నన్ను వివేకశూన్యులు తలచుచుండిరి. లేక "అవ్యక్తం" సర్వకారణమైన నన్ను మత్స్యకూర్మాద్యనేకావతారరూపమున కార్యరూపత్వమును పొందినవానినిగ వివేకశూన్యులు తలచుచుండిరి.

జీవులు నిన్ను యెందులకు తెలిసికొనరు! అను శంకను తొలగించుటకు హేతువుగ "అబుద్ధయః" అని చెప్పెను. దానినే యుత్తరార్థముచే వివరించుచుండెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

స్వరూపమును) తెలియనివారై పూర్వమున అప్రకటితస్వరూపమున నుండి, వర్తమానకాలమున ప్రకటీభావమును పొందినవానినిగ నన్ను తలచుచుండిరి. ॥౨౪॥

సర్వకారణరూపమగు సోపాధికమైన నా స్వరూపమును తెలిసికొననివారై, అట్లే నిరుపాధికమైన, సర్వోత్కృష్టమైన, అనతిశయాద్వితీయపరమానందఘనమైన, నాస్వరూపమును తెలిసికొననివారై జీవానుకారి కార్యములు చూపట్టుటవలన నన్ను సామాన్య జీవునిగ దలచుచుండిరి. అందువలన నీశ్వరునిగ నభిమతుడగు నన్ను విడచిప్రసిద్ధమగు దేవతాంతరమునే భజించుచుండిరి. దానివలన భిన్నఫలమునే పొందుచుండిరి. అందుచే అంతవత్తగు ఫలమునే పొందుచుండిరి. ముందుగూడ నీవిషయమే "అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్" అనుదానిచే చెప్పబడగలదు. ॥౨౪॥

శంకరానందీయము:— పూర్వమునందు చెప్పబడిన కణాదగౌతమాదులు మహాపండితులు, యావన్మంది భక్తులు. అట్టివారలు శాస్త్రార్థమును లెస్సగ విచారించి ప్రత్యగ్రూపము, నిర్విశేషము, అవినాభూతము, ఆత్మస్వరూపము నగు నిన్నే యుపాసించి (ధ్యానించి) విదేహముక్తిని యేలవలన పొందుటలేదు? అను యాశంకపై అవిద్యాలేశాక్రోపహిత చిత్తములుకలవారగుటవలన మద్విషయకమైన సమ్యక్ జ్ఞానము వారలకు కలుగుటలేదు. అట్టి సమ్యక్ జ్ఞానము లేనిందుచేసి నన్ను వారలు పొందుటలేదని బోధించుటకు "అవ్యక్తం" అని చెప్పుచుండెను.

"అబుద్ధయః, ఆత్మానాత్మస్వరూప వివేచనచే తత్త్వనిశ్చయమునందు సమర్థమైన బుద్ధి నాయనుగ్రహము వలన కలుగును. అట్టి బుద్ధిలేని స్వల్పబుద్ధులు కల మూఢులు పండితులైనను సదసద్వివేకశూన్యులై అవ్యక్తము మొదలుకొని స్థూలపర్యంతమగు ద్రుశ్యము నశించినను స్వయముగ నాశరహితము, కనుకనే "అనుత్తమం" "సా కాష్ఠా సా పరా గతిః" అను శ్రుత్యుక్త రీతిని ఉత్తమోత్తమము, అంతట పరిపూర్ణము, చేతనముగుట చేతను, సర్వప్రకాశమగుటచేతను, సర్వాధారమగుటచేతను, సర్వద్రష్ట యగుటచేతను బుద్ధ్యాదులకంటె వేరగు "పరంభావం" తత్త్వమును తెలిసికొనినవారై "అవ్యక్తం" న వ్యజ్యతే కేనాపి ప్రమాణేనేత్యవ్యక్తః" యేప్రమాణమునకు గోచరము కానట్టి, లేక వ్యక్తమనగ దేహేంద్రియాదివికారములు. అట్టి బంధరహితుడగుట వలన అవ్యక్తమనబడెడి, అహమర్థమైన యాత్మస్వరూపమగు నన్ను "వ్యక్తి మాపన్నం" వ్యక్తియనగ దేహము. అట్టి దేహాత్మగ నున్నవానినిగ తలచుచుండిరి. "త్వా మాత్మానం పరం మత్వా పరమాత్మాన మేవచ। ఆత్మాపున స్సహి మృగ్యః అహోఽజ్ఞజనతాజ్ఞతా" (తనయాత్మస్వరూపముగను, పరమాత్మస్వరూపముగను తెలిసికొని తిరిగి ఆత్మ వెలుపల రోయుటనో వెతకదగినది అని అనుచుండిరి. యెంత ఆశ్చర్యము! అజ్ఞానుల యజ్ఞత్వము) అనిచెప్పినరీతిని నాయందు దేహమును, దేహమునందు నన్నును అధ్యసించి రెంటిని యేకముగఁ జేసి "దేహమే నేను" అని దేహమునే యాత్మగ తెలిసికొనుచుండిరి. ఇట్లనాత్మ నాత్మగ తెలిసికొను వారలకు జ్ఞానమెటుల ప్రాప్తించును? ఎటుల ముక్తి లభించును? అని యాశయము. ॥౨౪॥

పరమార్థప్రప:— ప్రయాస సమానమైనను పరమాత్మను భజించుటచే గొప్పఫలము ప్రాప్తించుచుండ సర్వులు యితరదేవతాభజనము విడచి పరమేశ్వరుడ వగు నిన్నే యెందులకు సేవింపరు? అను యాశంకపై "అవ్యక్తం" అని చెప్పుచుండెను.

ప్రపంచాతీతమైననన్ను మత్స్య కూర్మాది దేహధారిగ, వ్యక్తిని పొందినట్టివానిగ అల్పబుద్ధులు కలవారు తలంచుచుండిరి. ఎందువలన అట్లుతలంచుచుండిరి? నాయొక్క తాత్త్వికస్వరూపమును యెరుగనివారై యట్లు

గీ॥ నాఽహం ప్రకాశ స్సర్వస్య యోగమాయాసమావృతః ।
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్ ॥ ॥౨౫॥

పదవిభాగము :— న- అహం- ప్రకాశః- సర్వస్య- యోగమాయాసమావృతః- మూఢః- అయం- న- అభిజానాతి- లోకః- మాం- అజం- అవ్యయమ్ ॥ ॥౨౫॥

ప్రతిపదార్థము :— యోగమాయాసమావృతః=గుణత్రయసంయోజనరూపమగు మాయచే; సమావృతః=ఆవరింపబడినవాడనై; అహం=నేను; సర్వస్య=అందరికిని; ప్రకాశః=తెలియబడినవాడనై; న=కాకుండిని: అయం=ఈ; మూఢః=మోహావిష్టమైన; లోకః=జనము; మాం=నన్ను; అజం=పుట్టుకలేనివానినిగను; అవ్యయం=నాశరహితునిగను; నాభిజానాతి=తెలిసికొనలేకుండెను. ॥౨౫॥

శాంకరభాష్యమ్:—

తదీయమజ్ఞానం కిం నిమిత్త మిత్యుచ్యతే— నాహం ప్రకాశ స్సర్వస్య లోకస్య కేషాంచిదేవ మద్భక్తానాం ప్రకాశోఽహ మిత్యభిప్రాయః । యోగమాయాసమావృతో యోగో గుణానాం యుక్తిర్ఘటనం సైవ మాయా యోగమాయా తయా యోగమాయయా సమావృత సంఛన్న ఇత్యర్థః । అత ఏవ మూఢో లోకోయం నాభిజానాతి మా మజ మవ్యయమ్ ॥౨౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆపరమాత్మను అవివేకులు తెలిసికొనలేకపోవుటలో గారణమును జెప్పుచుండెను — గుణములయొక్క కలయికయే యోగ మనబడును. అట్టి యోగమనెడి మాయచే గప్పబడిన

సేవించుచుండిరి. నీతాత్త్వికస్వరూప మెట్టిది? అవ్యక్తము. అత్యుత్తమము, జగద్రక్షణార్థమావిర్భూతము, శుద్ధసత్త్వస్వరూపము, ఉత్కృష్టఫలదాత. అట్టి నాస్వరూపమును తెలిసికొనక తాత్కాలికఫలము నొసంగెడి మరియొక దేవత నుపాసించుచుండిరి. అట్టివారలకు అంతవత్తగు ఫలమే ప్రాప్తించును. ॥౨౪॥

—• ౭వ అధ్యాయము ౨౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— జన్మకాలమునందు గూడ సర్వయోగిధ్యేయమగు శ్రీవైకుంఠస్థమైన యీశ్వరరూప మావిర్భవించియుండ నపుడు శ్రీవత్సకౌస్తుభవనమాలా కిరీటకుండలాది దివ్యోపకరణశాలియు, కంబుకమలకౌమోదకీచక్రధారియు, చతుర్భుజములు కలవాడును, శ్రీమద్వైనతేయవాహనుడును, నిఖిలసురలోక సంపాదిత రాజరాజేశ్వరాభిషేకాది మహావైభవముకలవాడును, సర్వసురాసురజేతయు, వివిధదివ్యలీలావిలాసశీలుడును, సర్వావతారశిరోమణియు నగు సాక్షాద్వైకుంఠనాయకుడు నిఖిలలోకదుఃఖనిస్తారముకొరకు భూమియం దవతరించియుండ విరించిప్రపంచాసంభవనిరతిశయసౌందర్యసారసర్వస్వమూర్తియు, బాలలీలావినోదశాలియు, తరణికిరణోజ్జ్వలద్దివ్యపీతాంబరుడును, నిరుపమశ్యామసుందరుడును, కరదీకృతపారిజాతార్థపరాజితపురందరుడును, బాణయుద్ధవిజితశశాంకశేఖరుడును, సమస్తసురాసురవిజయినరకప్రభృతిదైతేయుప్రకరప్రాణపర్యన్తసర్వస్వహారియు, శ్రీదామాదిపరమరంగమహావైభవకారియు, షోడశసహస్రగోపికానుకూల దివ్యరూపధారణాపరిమేయగుణగరిమకలవాడును, మహామహిమకలవాడును, నారదమార్కండేయాది మహామునిగణ స్తుతుడును నగు శ్రీకృష్ణుని (నీ)యం దవివేకికి గూడ యెట్లు మనుష్యబుద్ధియు, జీవబుద్ధియు కల్గుచున్నది? అను యీశంకను తొలగింపదలచి శ్రీకృష్ణపరమాత్మ "నాహం" అని జెప్పుచుండెను.

నేను సర్వలోకమునకు నాస్వరూపముచే గోచరుడను (ప్రకటితుడను) కాను. మరేమనిన నాభక్తులగు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నేను అందరికిని తెలియబడుటలేదు. ఇక నేమన నాభక్తులకు కొలది మందికే తెలియబడుచుంటిని. కనుకనే మోహావిష్టమగు ఈలోకము నన్ను చావు పుట్టుకలు లేనివానిగ తెలిసికొనలేకున్నది. ॥౨౫॥

కొందరికే గోచరుడ నగుదును. అని యభిప్రాయము. ఎందులకు నీవు సర్వులకు గోచరుడవు కావు అనెదవా? యోగమాయాసమావృతుడను అగుటవలన అందరకు గోచరుడను కాను. యోగ మనగ నాసంకల్పము, నాసంకల్పవశవర్తిని మాయ. అట్టిమాయచే నభక్తుడగు జనుడు నన్నుస్వరూపముచే తెలిసికొనలేడు. అనగా నాసంకల్పము ననుసరించి యుండు మాయచే సమ్యగావృతుడై జ్ఞాన మనెడి కారణ మున్నను జ్ఞానవిషయత్వాయోగ్యుడై చేయబడును. అందువలన "పరం భావ మజానన్తః" అనిచెప్పబడెను, అందు నాసంకల్పమే కారణమని చెప్పినట్లేయగును. అందువలన నామాయచే మూఢుడావృతజ్ఞానము కలవాడైన చతుర్విధభక్తవిలక్షణలోకము జ్ఞానకారణముండినను నన్ను అజునిగను, అనాద్యనన్తునిగను, పరమేశ్వరునిగను తెలిసికొనుట లేదు, మరియు విపరీతదృష్టిచే మనుష్యునిగనే తలచుచున్నది. మాయ విద్యమానమగు వస్తుస్వరూపమును ఆవరించును. లేని వస్తువును చూపును. ఈవిషయము లౌకికమాయయందుకూడ ప్రసిద్ధమే॥ ॥౨౫॥

శంకరానందీయము:— సర్వావస్థలయందు సర్వప్రకాశకమై ప్రతీయమానము, పరిపూర్ణము, ప్రత్యక్షము నగు ఆత్మతత్త్వమును యీజనుడు యెటుల తెలిసికొన డనుయాశంకను తొలగించుటకు "నాహం" అని చెప్పుచుండెను.

ప్రత్యక్షరూపమగు పరమాత్మయగు నేను సర్వప్రకాశకుడనైనను, సర్వగతుడనైనను ఆత్మేశ్వర ప్రసాదశూన్యుడై, బ్రహ్మవిద్వర్యుని యనుగ్రహము లేనట్టి వానికి తెలియబడను. నేను అనావృతస్వరూపుడనైనను అట్టి నన్ను బ్రహ్మవేత్తలకంటె యితరులు తెలిసికొనలేరు. లోకమున కాత్మస్వరూపాజ్ఞానమునందు కారణమును "యోగమాయాసమావృతః" అనుదానిచే జెప్పుచుండెను.

తనయందుండుటచే పురుషుని జననమరణదుఃఖప్రవాహముచే కూర్చునది కాన మాయ "యోగా" అని యనిపించుకొనును. అట్టి తమోరూపమగు యోగమాయచే సమావృతుడు, సూర్యప్రకాశకమగు చక్షురింద్రియము కాచపటలముచే నావృతమైయుండ "నేను గ్రుడ్డివాడను" అను అధ్యాసచే పురుషుడెట్లంధుడగుచుండునో అట్లే యాత్మప్రకాశమగు జ్ఞానచక్షుస్సుఆవరణాత్మకమగు మాయచే యావృతమై యుండ నధ్యాసచే యీలోకమజ్ఞమగుచున్నదని జెప్పబడుచున్నది. కనుక యోగమాయాసమావృతమైన విపరీతభావమును పొందిన యీలోకము సూర్యుని యంధుడువలె ఆత్మభూతము, పురస్థము (యెదురుగనున్నట్టి) దేహేంద్రియాదులకంటె భిన్నముగ స్పష్టముగ ప్రతీయమానము, నజము, నవ్యయము, ఆత్మస్వరూపము నగునన్ను "సాక్షాదయమహం" ఇది నేనే యని తన యాత్మస్వరూపముగ తెలిసికొనటలేదు. ఈశ్లోకమున "అజం" యని యాత్మకు కాలత్రయమునం దప్రతిహతనిత్యత్వబోధనిమిత్తమని చెప్పబడెను. "అజామేకాం" అను శ్రుతిచే మాయకూడ యట్టిదే యన్నచో తన్నివృత్తినిమిత్తము "అవ్యయం" అని విశేషణము చెప్పబడెను. "తేబ్రహ్మలోకేతు పరాన్తకాలే" అనిప్రకృతికికూడ లయము శ్రూయమాణమగుచున్నది. అట్లే విద్వదనుభవము. బ్రహ్మమట్టిది కాదు. త్రికాలాబాధ్యనిత్యత్వము కల దని స్పష్టపరుపబడెను. ॥౨౫॥

పరమార్థప్రప:— దేవతాంతరోపాసకులకు ఆత్మతత్త్వాజ్ఞానమునందు హేతువును "నాహం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

నేను సర్వలోకమున కంతర్యామినై యున్నను పరతత్త్వప్రకాశకుడను కాను. మరియు నాభక్తులకే పరతత్త్వప్రకాశకుడ నగుదును. కాన యీలోకము యోగమాయాసమావృతమై మూఢమగుచున్నది. అందువలన నన్ను అజునిగను, అవ్యయునిగను తెలిసికొనలేకున్నది.

లేక, సర్వలోకముయొక్క జ్ఞానస్వరూపమగు ప్రకాశాత్మకమైన నేను అచింత్యైశ్వర్యరూపమగు యోగమాయచే సమావృతుడను. శరావమునందుండు కలుషోదకముచే ప్రతిబింబప్రకాశమే ఆవరింపబడును కాని బింబభూతసూర్యుడావరింపబడనటుల యోగమాయ స్వాశ్రయమును మోహపెట్టదు. అట్లే నన్ను యోగమాయ వ్యామోహపెట్టదు. కనుకనే మూఢలోకము అంతట నిట్టితీరుగనున్నవానినిగ నన్ను తెలిసికొనుట లేదు. కాన దేవతాంతరోపాసకుల కంతవత్తగు ఫలమే ప్రాప్తించును. నాభక్తుడన్నచో నన్ను అజునిగను, అనాదిగను, అవ్యయునిగను తెలిసికొనుచున్నాడు. కాన నశింపని ఫలమును పొందుచున్నాడు. ఈవిషయమే టిప్పణియందు శ్లో॥ "చిత్సంవిత్సుఖరూప ఆత్మని కథం మాయావృతత్వం భవే న్మార్తాండ స్తమసా వ్రియేత కిమహో కిం తీక్షణం పశ్యతామ్ । అజ్ఞానేన విధీయతే జలముచేవార్క స్త దుక్తం ద్విధా విక్షేపావరణాభిధం మునివరై ర్మోహస్య శక్తిద్వయమ్" చిద్రూపము, సంవిద్రూపము, సుఖరూపము నగు యాత్మయందు మాయావృతత్వమెట్లు సంభవించును? సంభవింపదు. సూర్యుడు చీకటిచే నావరింపబడునా! ఆవరింపబడడు. ఎంతఆశ్చర్యము!– మరేమనిన చూచువారల నేత్రేంద్రియములనే చీకటి యావరించును. మేఘముచే సూర్యుడావరింపబడె నని యజ్ఞానముచే చెప్పబడును. ఈవిషయమునే మునివరులు మోహమునకు రెండువిధములుగ విక్షేపావరణలనెడి శక్తులు కలవని చెప్పిరి. ఈవిషయమునే ఋక్శాఖీయశ్రుతియు బోధించుచున్నది. "అజస్య నాభా వధ్యేక మర్పితం యస్మిన్విశ్వాని భువనాని తస్థుః। న తం విథాథ య ఇమా జజానా న్యద్యుష్మాక మన్తరం బభూవ నీహారేణప్రావృతా జల్ప్యచాసుతృప ఉక్థశాస శ్చరన్తి" జన్మరహితుడగు మహాభూతాత్మకమైన విరాట్టుయొక్క మధ్యయందు హిరణ్యగర్భ డనెడి లింగదేహము న్యస్తమువలె నున్నది. ఆలింగదేహమునందు భూర్భువస్సువరాదినిఖిలభువనములు సూత్రమునందు మణిగణములవలె నుండినవి. ఓ "నారాః" మనుజులారా! మీరావిశ్వకర్మయగు ఈశ్వరుని తెలిసికొన లేదు. ఆయొకడే యీసర్వమును సూక్ష్మశరీరముచే ప్రవేశించి పుట్టించెను. అట్లగుచో "నేనుదేవదత్తుడను, యజ్ఞదత్తుడను" అని ఆకారముచే మేము తెలిసికొనుటలేదేయని శంకింపజనదు. జీవునిపారమార్థికరూపమగు విశ్వకర్మయైన పరమేశ్వరునియొక్క తత్త్వ మహంప్రత్యయగమ్యము కాదు. అహంప్రత్యయగమ్యమగుమీకు అహంప్రత్యయగమ్యముకంటె వేరు, సర్వవేదాన్తవేద్యము ఈశ్వరతత్త్వము కలదు. జీవరూపమువలె దానినికూడ యొందులకు తెలిసికొనజాల మందురా? మీరు నీహార (మంచు) సదృశమగు యజ్ఞానముచే యాచ్ఛాదితులు కాన నట్టి తత్త్వమును తెలిసికొనజాలరు. మంచు దృష్టి కావరక మగుటచే నత్యంతాసత్తు కాదు. మంచుచే నావరింపబడినపుడు కాష్ఠపాషాణాద్యవాన్తరభేదమును తెలిసికొనుట కశక్యముకదా. అట్లే యజ్ఞానముగూడ యీశ్వరతత్త్వావరకమగుటవలన నత్యంత మసత్తుకాదు. బోధ (జ్ఞానమాత్ర) నివర్త్యమగుటవలన సత్తుకాదు. మరేమగును? సదసద్విలక్షణ మజ్ఞానమనిపించుకొనును. ఇట్టి యజ్ఞానముచే సర్వజీవులు ఆవృతులు. కేవల మజ్ఞానముచే నావృత్తులే కారు. మరేమనిన? "జల్ప్యాః" నేను మనుష్యుడను, నేను దేహము ఇత్యాద్యనృతజల్పనపరులుగూడ యగుచున్నారు. మరియు "అసుతృపః" ఏదో యొక యుపాయముచే ప్రాణములను సంతుష్టి పరచుచుండిరి. అనగా ఉదరంభరులగుచుండిరి. పరమేశ్వర తత్త్వమును విచారించువారలు కారు. మరియు ఇహలోకభోగమాత్రతృప్తులే కారు. మరేమనిన? "ఉక్థశాసః" నానావిధ యజ్ఞములయందు స్వర్గాదిఫలములను తెలుపుచు పృథివియందు సంచరించుచుండిరి. ॥ ౨౫ ॥

గీ॥ వేదాఽహం సమతీతాని వర్తమానాని చార్జున! ।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ ॥౨౬॥

పదవిభాగము:— వేద– అహం– సమతీతాని– వర్తమానాని– చ– అర్జున!– భవిష్యాణి– చ– భూతాని– మాం– తు– వేద– న– కశ్చన ॥ ॥౨౬॥

ప్రతిపదార్థము:— హేఅర్జున=ఓఅర్జునుడా!; అహం=నేను; సమతీతాని=అతిక్రమించిన; భూతాని=భూతములను; వర్తమానాని చ=వర్తమానకాలమునం దుండెడి; భూతాని చ=భూతములను; భవిష్యాణి చ=భవిష్యత్కాలికములైన, భూతాని చ=భూతములను; వేద=ఎరుగుదును; మాం తు=నన్నైతే; కశ్చన ఎవడును; న వేద=ఎరుగడు: ॥౨౬॥

---

శాంకరభాష్యమ్:—

యయా యోగమాయయా సమావృతం మాం లోకో నాభిజానాతి నాసౌ యోగమాయా మదీయాసతీ మమేశ్వరస్య మాయావినో జ్ఞానం ప్రతిబధ్నాతి, యథాఽన్యస్యాపి మాయావినో మాయా జ్ఞానం తద్వ ద్యత ఏవ మతః— అహం తు వేద జానే సమతీతాని

---

శాంకరభాష్యతత్త్వబోధని:—

ఏ యోగమాయచే సమావృతమైన నన్నీ లోకము తెలిసికొనలేకుండెనో ఆయోగమాయ నాసంబంధమైనదియై మాయావిని, పరమేశ్వరుడను అగు నాయొక్క జ్ఞానమును ప్రతిబంధించుట లేదు. ఎట్లన– లోకమున మాయావిసంబంధిని యగు మాయ ఇతరులను

---

## —• ౭వ అధ్యాయము ౨౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసర్వతీయము:— స్వాధీనమగు మాయచే సర్వవ్యామోహకుడ నగుటవలన, అప్రతిబద్ధజ్ఞానము కలవాడ నగుటవలన నేనతీతాదికము నెరుగుదునని "వేదాహం" అనుదానిచే జెప్పుచుండెను.

నేను అప్రతిబద్ధ సర్వవిజ్ఞానము కలవాడనై మాయచే సర్వలోకములను మోహపెట్టువాడనైననుపూర్వ కాలమునందే వినష్టమైనట్టియు,వర్తమాన కాలికములైనట్టియు,,భవిష్యత్కాలికములైనట్టియు, ఇట్లే కాలత్రయమునందుండు స్థావరజంగమాత్మకమగు నిఖిలభూతములను యెరుగుదును. నాయనుగ్రహమునకు పాత్రుడైన నాభక్తుని విడచి యితరు డెవడును జ్ఞానప్రతిబంధ ముండుటవలన నామాయచేమోహితుడై మాయావినివలె సర్వదర్శియగు నన్ను యెరుగడు. కాన నాతత్త్వమును తెలిసికొనలేకపోవుటవలననే జీవులు తరచుగ నన్ను సేవింపకుండిరి. అని యభిప్రాయము. ॥౨౬॥

శంకరానందీయము:— "నాహం ప్రకాశ స్సర్వస్య" అనిచెప్పి తానుగూడ లోకమువలె యవిద్యావృతుడగుచో నిఖిలజగత్తున కాంధ్యము ప్రసక్తమయ్యెడిని. అందువలన నేనవిద్యావృతుడను కాను. అని "వేదాహం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

భోక్తయొక్క భోగార్థము నావలననే సంభవించుటచే మనోబుద్ధ్యాదులు, వాటిపరివర్తనములు భూతములనబడును. అతీతములైన యా భూతములను, వర్తమానభూతములను, రాబోవు భూతములను జాగ్రదాద్యవస్థలయందాభూతములకు సత్తను, స్ఫూర్తిని, ప్రవర్తనశక్తిని యిచ్చువాడనై సర్వదా ప్రకాశించువాడనైన ప్రత్యగ్రూపమగు నేను దేహేంద్రియాదుల ప్రవృత్తిని, నివృత్తిని,అవస్థాభేదముచే సత్తను, అసత్తను సాక్షాత్తు యెరుగుదును.

శాంకరభాష్యమ్:—

సమతిక్రాంతాని భూతాని వర్తమానాని చార్జున! భవిష్యాణి చ భూతాని వేదాఽహం మాం తు వేద న కశ్చన మద్భక్తం మచ్ఛరణ మేకం ముక్త్వా మత్తత్త్వవేదనాభావా దేవ న మాం భజతే ॥ ॥౨౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మోహపెట్టి, తన జ్ఞానమునకుప్రతిబంధకము కాదు కదా! కనుకనే నేను భూతభవిష్యద్వర్తమానకాలికము లగు సర్వభూతముల నెరుగుదును. నన్నైన్నతే ఎవడును తెలిసికొనలేకుండెను. అనగా మదేకశరణుడు, మద్భక్తుడునగువా డొక్కడు దక్క ఇతరుడు మత్తత్త్వజ్ఞానము లేనివా డగుటచే నన్ను పొందలేకుండెను. ॥౨౬॥

ప్రాణులు మాయావృతు లగుచో జ్ఞానాభావము, ప్రవృత్త్యభావము, నాకును వేదనాభావము ప్రాప్తించెడిని. ఇది యిష్టాపత్తియే యని యనరాదు. ప్రత్యక్షవిరోధము ప్రాప్తించును. ప్రాణులు యిష్టమును, అనిష్టమును గుర్తెరిగి ప్రవర్తించుచుండిరి. ఇది సర్వప్రత్యక్షము. కాన ప్రాణిప్రవృత్తిచే "జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే" అను శ్రుతిచేతను, ఆత్మస్వరూప మగు నాకవిద్యావరణము లేదని సిద్ధమగుచున్నది. కనుకనే నేను సర్వావస్థలయందు సర్వదా సర్వమును యెరుగుదును. దేహేంద్రియాదులుగాని, ప్రాణముగాని, మనస్సుగాని, బుద్ధిగాని, మరియేయితరముగాని దృశ్యము, అనిత్యము, జడము యగుటవలన నన్ను యెరుగవు. (తెలిసికొనవు) "అహం విజానామి వివిక్తరూపో నచాస్తి వేత్తా మమ చిత్సదాఽహం" (నేను వివిక్తరూపుడనై (సర్వమును) తెలిసికొనుచున్నాను. నన్ను తెలిసికొనువాడు లేడు. నేను యెల్లపుడు చిన్మాత్రుడను) అను శ్రుతియు యీవిషయమున ప్రమాణము. కాన "అజత్వ. అవ్యయత్వ, అనుత్తమత్వాది విశేషణములు నాకు సార్థకము లగును.

లేక, సర్వప్రకాశకుడ నగుటచే సర్వావస్థలయందు అహమర్థముగ దేదీప్యమానము, బుద్ధ్యాదిసర్వపదార్థములను, తద్ధర్మములను, తత్కార్యములను తెలిసికొనునట్టి నన్ను యేపండితుడును తెలిసికొనలేడని యర్థము.

లేక, ప్రత్యగభిన్నమగు పరమాత్మస్వరూపమైన నేను భూతభవిష్యద్వర్తమానకాలికమైన సర్వప్రాణిజాతమును యెరుగుదును. ప్రత్యగ్రూపము, ఆత్మభూతము, అహమర్థము నగు నన్ను యెవడును యెరుగడు. వినడు, తలపడు, తెలిసికొనడు. సేవింపడు యని యర్థము. ॥౨౬॥

శ్రీధరీయము:— ఇంతకుపూర్వము సర్వోత్తమమగు నాస్వరూపమును యెరుగనివారలై రని జెప్పబడెను. ఇపుడు తన యీసర్వోత్తమత్వమును, అనావృతజ్ఞానశక్తిని చూపించుచు యితరుల కజ్ఞానమునే "వేదాహం" యను శ్లోకముచే జెప్పుచుండెను.

భూతభవిష్యద్వర్తమానకాలములయందుండు స్థావరజంగమాత్మకనిఖిలభూతములను నేను మాయాశ్రయుడనగుటవలన, మాయస్వాశ్రయమును మోహపెట్టనిదగుటవలనను యెరుగుదును. నా మాయచే మోహితుడగుటవలన నన్ను యెవడును తెలిసికొనలేడు. ఈవిషయము లోకమున ప్రసిద్ధమే. ఒకానొక మాయావియగు ఐన్ద్రజాలికుడు తన మాయచే పరులను మోహపెట్టునుగాని తన నాశ్రయించిన మాయచే తాను మోహపెట్టబడడు. ॥౨౬॥

గీ॥ ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత ! ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరన్తప ॥ ॥౨౭॥

పదవిభాగము :— ఇచ్ఛాద్వేషసముత్థేన- ద్వన్ద్వమోహేన- భారత- సర్వభూతాని- సమ్మోహం- సర్గే- యాంతి- పరన్తప ॥ ॥౨౭॥

ప్రతిపదార్థము :— హేభారత=ఓభరతవంశసంభూతుడవగు యర్జునా!; ఇచ్ఛాద్వేషసముత్థేన=ఇచ్ఛాద్వేషములచే సుత్థితమైన; ద్వన్ద్వమోహేన=ద్వన్ద్వనిమిత్తమైన మోహముచే; సర్వభూతాని=సమస్తభూతములు; సర్గే=ఉత్పత్తికాలమునందే; సంమోహం=మోహమును; యాన్తి=పొందుచున్నవి. ॥౨౭॥

శాంకరభాష్యమ్:—

కేన పున ర్మత్తత్త్వవేదనప్రతిబంధేన ప్రతిబద్ధాని సంతి జాయమానాని సర్వభూతాని మాం న విదంతి త్యపేక్షాయా మిద మాహ— ఇచ్ఛాద్వేషసముత్థే నేచ్ఛా చ ద్వేష శ్చేచ్ఛాద్వేషౌ తాభ్యాం సముత్తిష్ఠతీ తీచ్ఛాద్వేషసముత్థ స్తేనేచ్ఛాద్వేషసముత్థేన । కేనేతి విశేషాపేక్షాయా మిద మాహ— ద్వంద్వమోహేన ద్వంద్వనిమిత్తో మోహో ద్వంద్వమోహ స్తే వేచ్ఛాద్వేషౌ శీతోష్ణవత్పరస్పరవిరుద్ధౌ సుఖదుఃఖతద్ధేతువిషయౌ యథాకాలం సర్వభూతై స్సంబధ్యమానౌ ద్వంద్వశబ్దే నాభిధీయేతే । తత్ర యదేచ్ఛాద్వేషౌ సుఖదుఃఖతద్ధేతుసంప్రాప్త్యా లబ్ధాత్మకౌ భవత స్తదా తౌ సర్వభూతానాం ప్రజ్ఞాయాః స్వవశాపాదనద్వారేణపరమార్థాత్మతత్త్వవిషయ జ్ఞానోత్పత్తిప్రతిబంధకారణం మోహం జనయతః । న హీచ్ఛాద్వేషదోషవశీకృతచిత్తస్య యథాభూతార్థవిషయజ్ఞాన ముత్పద్యతే, బహిరపి కిము వక్తవ్యం తాభ్యా మావిష్టబుద్ధేః సంమూ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"నాతత్త్వమును తెలిసుకొనుటకు ప్రతిబంధకమగు దేనిచే ప్రతిబంధింపబడి జాయమానములగు సర్వభూతములు నన్ను తెలిసికొనలేకున్నవి?" అను యాశంకకు సమాధానముగ జెప్పుచున్నాడు- ఇచ్ఛ, ద్వేషము అను నీరెంటిచే నుత్పన్నమైన యాద్వన్ద్వనిమిత్తకమైనది ద్వన్ద్వమోహమనబడును. ఇచ్ఛాద్వేషములే శీతోష్ణములువలెపరస్పరవిరుద్ధములై, సుఖదుఃఖములు, తద్ధేతువులు విషయములుగా కలవియై ప్రాప్తకాలమునందుసర్వభూతములతోసంబంధించినవియై ద్వన్ద్వశబ్దవాచ్యము లగుచున్నవి. ఏసమయమున ఇచ్ఛాద్వేషములు సుఖదుఃఖములయొక్కయు, తద్ధేతువులయొక్కయు సంప్రాప్తిచే లబ్ధసత్తాకములగుచున్నవో యాసమయమున యాఇచ్ఛాద్వేషములు సర్వభూతములయొక్క ప్రజ్ఞను స్వవశ మొనరించుకొని, తద్ద్వారమున బరమార్థతత్త్వము విషయముగాగల జ్ఞానముయొక్క యుత్పత్తికి ప్రతిబంధకారణమై మోహ

— : ౭వ అధ్యాయము ౨౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— భగవత్తత్త్వవిజ్ఞానము పుట్టకపోవుటయందు హేతువుగ యోగమాయను చెప్పి దేహేంద్రియసంఘాతాభిమానాతిశయపూర్వకముగ భోగాభినివేశరూపమగు హేత్వంతరమును "ఇచ్ఛాద్వేషసముత్థేన" అను శ్లోకముచే జెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

ర్థస్య ప్రత్యగాత్మని బహుప్రతిబంధే జ్ఞానం నోత్పద్యత ఇతి। అత స్తేనేచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత భరతాన్వయజ! సర్వభూతాని సంమోహితాని సంతి సంమోహం సంమూఢతాం సర్గే జన్మ న్యుత్పత్తికాల ఇత్యేత ద్యాంతి గచ్ఛంతి హేపరంతప। మోహవశా న్యేవ సర్వభూతాని జాయమానాని జాయంత ఇత్యభిప్రాయః। యత ఏవ మత స్తేన ద్వంద్వమోహేన ప్రతిబద్ధప్రజ్ఞానాని సర్వభూతాని సంమోహితాని మామాత్మభూతం న జానం త్యత ఏవాఽఽత్మభావేన మాం న భజంతే॥ ॥౨౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మును కలుగజేయుచున్నవి. ఇచ్ఛాద్వేషవశీకృతచిత్తునకు జరిగినది జరిగినట్లుగ బాహిరమగు విషయవిజ్ఞానమే కలుగుటలేదు. ఇక నాయిచ్ఛాద్వేషావిష్టచిత్తుడగు మూఢునకు బహుప్రతిబంధకములుండ బత్యగాత్మవిషయకమగు జ్ఞానము కలుగదని యేమిచెప్పవలెను. అట్టిజ్ఞానము కలుగదనుట. కాన ఓభరతవంశోద్భవుడవగు యర్జునా! ఓపరంతపా! సర్వభూతములు ఉత్పత్తి కాలమునందే సంమోహమును పొందుచున్నవి పుట్టుటకు సర్వభూతములు మోహవశము లయియే పుట్టుచున్న వని యభిప్రాయము. ఇట్లగుటచే ద్వన్ద్వమోహముచే ప్రతిబద్ధప్రజ్ఞాన ములు కలవియైన సర్వభూతములు సంమోహితములై యాత్మస్వరూపుడనైన నన్ను దెలిసి కొనలేకున్నవి. కనుకనే యవి యాత్మభావముతో నన్ను సేవించుటలేదు ॥౨౭॥

అనుకూలము నందు యిచ్ఛ, ప్రతికూలమునందు ద్వేషము జనించును కాన అనుకూలప్రతికూలములు విష యములుగాగల యిచ్ఛాద్వేషములచే జనించునదియు, శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వనిమిత్తమునగు మోహముచే "నేను సుఖిని, దుఃఖిని" అను నది మొదలగు విపర్యయముచే (భ్రమ జ్ఞానముచే) సర్వభూతములు వివేకాయోగ్యత్వ మును "సర్గే" స్థూలదేహోత్పత్తియం దుండ పొందుచున్నవి.

"హేభారత!, హేపరన్తప!" యనుసంబోధనద్వయమునకు "కులమహిమచేతను, స్వరూపశక్తిచేతను నిన్ను ద్వన్ద్వమోహమనెడి శత్రువు తిరస్కరించుటకు సమర్థుడు కాడనిభావము. ఇచ్ఛాద్వేషరహితముగ నేభూతమును లేదు. ఇచ్ఛాద్వేషావిష్టునకు బహిర్విషయకమగు జ్ఞానమే సంభవింపదు. ఇక ఆత్మవిషయకమైన జ్ఞానముసంభవింపదని చెప్పనవసరమే లేదు. కాన రాగద్వేషవ్యాకులాంతఃకరణకలవి యగుటవలన సర్వభూతములు— పరమేశ్వరుడను, ఆత్మభూతము నగు నన్ను తెలిసికొనలేవు. సేవింపదగిన నన్ను సేవింపకున్నవి. ॥౨౭॥

సంగతానందీయము:— పూర్వమునందు "కామై స్తైస్తై ర్హృత జ్ఞానాః" అను దానిచే కామమునకు జ్ఞానప్రతిబంధకత్వము చెప్పబడెను. అయినను కామాదులకు జ్ఞానప్రతిబంధకత్వము ప్రవృత్తి దశయందా! లేక ప్రవృత్తికి పూర్వమునందా? యను యాశంకయందు పురుషుడు ప్రాచీన పాపకర్మవశమున కామరాగాదికృత మోహావిష్టుడై పుట్టునని "ఇచ్ఛా ద్వేష సముత్థేన" అను శ్లోకముచే జెప్పుచుండెను.

అనుకూలమైనదానియందు ప్రీతి "ఇచ్ఛ" యనబడును. ప్రతికూలమైనదానియం దప్రీతి "ద్వేషమన" బడును. అట్టి యిచ్ఛాద్వేషములచే జనించిన సుఖదుఃఖాదిద్వంద్వములయందు, తత్సాధనములయందు విప రీతబుద్ధి యనెడి మోహముచే (మోహమనగ విచిత్తత. యనగా అవివేకభావము) సర్వప్రాణులు ఉత్పత్తి

గీ॥ యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।
తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥ ॥౨౮॥

పదవిభాగము:— యేషాం- తు- అంతగతం- పాపం- జనానాం- పుణ్యకర్మణాం- తే- ద్వన్ద్వమోహనిర్ముక్తాః- భజన్తే- మాం-దృఢవ్రతాః ॥ ॥౨౮॥

ప్రతిపదార్థము:— పుణ్యకర్మణాం= పుణ్యకర్ములుగల; యేషాం= ఏ; జనానాం=జనముయొక్క; పాపం= పాపము; అన్తగతం=నష్టప్రాయమగునో; తే= వారు; ద్వన్ద్వమోహనిర్ముక్తాః= యిచ్ఛాద్వేషరూపమగుద్వన్ద్వముచేనైనమోహముచే; నిర్ముక్తాః విడువబడినవారై; మాం= పరమాత్మస్వరూపమగునన్ను; దృఢవ్రతాః=దృఢవ్రతముకలవారై; భజన్తే= సేవించుచుండిరి. ॥౨౮॥

---

కాలమునందే మూఢభావమును ప్రాచీనకర్మదోషముచే పొందుచుండిరి. కాన జన్మాంతరీయ మహాపాప సంభావితమోహదోషముచేతనే ద్వంద్వమోహవిమూఢులై మోక్షసాధనమగు వేదాన్తమునందు, వేదాన్త విచారమునందు, వేదాన్తవిచారజన్య జ్ఞాననిష్ఠయందు యెట్టి దశలోనైనను ప్రవర్తింపరు. ప్రవర్తించిన వారలకైన తద్జ్ఞాన ముదయింపదు. ఈవిషయమునే "జ్ఞానం నోత్పద్యతే పుంసాం పాపోపహతచేతసాం" పాపోపహతచేతస్కులగు పురుషులకు జ్ఞానము కలుగదు. అను స్మృతియు బోధించుచున్నది. మరియు బంధసాధనమగు కామ్యకర్మయగు దేవతోపాసనాదులయందు శ్రద్ధచేతను, భక్తిచేతను, మోక్షసాధనత్వబుద్ధిచేతను నియమముగ ప్రవర్తించుచుండిరి. అట్టి యుపాసనాదులలో యేది చిత్తశోధకమో దానియందు ప్రవర్తింపరు. మరియు యేదికర్మమాలిన్యకారణమో జన్మాదిదుఃఖబీజమో దానియందే ప్రవర్తించుచుండిరి. ఇట్లు స్థూలమైన బాహ్యమునే వివేచనచేసి తెలిసికొనుటలేదు. అంతరము, అతిసూక్ష్మమునగు ఆత్మతత్త్వమును తెలిసికొనరని మరేమి చెప్పవలెను! ద్వన్ద్వమోహవిమూఢులకుయే యుక్తాయుక్తార్థాపరిజ్ఞానము కలదో అదిపూర్వజన్మార్జితపాపకార్యమని తెలిసికొనవలయును. ॥౨౭॥

నీలకంఠీయము— "మూఢలోకము యేకారణముచే సర్వభూతములను తెలిసికొనుటలేదు?" అనుయాశంకపై జెప్పుచున్నాడు. "ఇచ్ఛాద్వేషసముత్థేన" రాగద్వేషములచే సుత్థితమైన "ద్వంద్వమోహేన" శోభనాఽశోభన, సత్యాఽసత్య, నిత్యానిత్య, ఆత్మానాత్మలవిషయమై విపర్యయజ్ఞానముచే (అశోభనమునందైన శోభనబుద్ధియు, శోభనమునందైన యశోభనబుద్ధియు, విపర్యయబుద్ధియబడును. ఈ మొదలగు విపర్యయబుద్ధిచే "హేభారత" భరతాన్వయసంభూతుడవగు నోయర్జునా! "సర్వభూతాని" సమస్తభూతములు "స్వర్గే" సృష్టివిషయమై "మోహం" అవివేకమును, "యాంతి" పొందుచున్నవి. ఇటభావమిది- ఎవడు సృష్టికి యుపాదానకారణమును, స్వరూపమును తత్త్వము ననుసరించి (యథాస్థితిగ) తెలిసికొనునో అట్టి బ్రహ్మవిత్తు సర్వజ్ఞుడగుటచే నతీతాఽనాగతాదికమును తెలిసికొనును. కాని సృష్టివిషయమై యందరకును (బ్రహ్మవిద్వ్యతిరిక్తులకు) అశోభనమగు స్త్రీమొదలగువాటివిషయమై శోభనాధ్యాసయు, అసత్యమగు ప్రపంచమునందు సత్యత్వాధ్యాసయు, సత్యమగు ఆత్మయందు దసత్యత్వాధ్యాసయు, అనిత్యమగు స్వర్గాదికమునందు నిత్యత్వాధ్యాసయు, అనాత్మయగు దేహాదికమునం దాత్మాధ్యాసయు కలుగుటవలన మోహము కలుగుచున్నది. కాన యిట్టి విపర్యయముచే సృష్టిజ్ఞానము ప్రతిబద్ధమైనది. దానిచే ప్రాకృతులమగు మనబోట్లకు సర్వజ్ఞత్వము కలుగుట లేదు. ॥౨౭॥

—• ౭వ అధ్యాయము ౨౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సర్వభూతములు సంమోహమును పొందుచో "చతుర్విధా భజన్తే మాం" యని యెట్లు జెప్పబడెను? సుకృతాతిశయముచే నశించిన పాపము కల

శాంకరభాష్యమ్:—

కే పున రనేన ద్వంద్వమోహేన నిర్ముక్తాః సన్త స్త్వాం విదిత్వా యథాశాస్త్ర మాత్మభావేన భజంత ఇత్యపేక్షిత మర్థం దర్శయితు ముచ్యతే— యేషాం తు పున రంతగతం సమాప్తప్రాయం క్షీణం పాపం జనానాం పుణ్యకర్మణాం పుణ్యం కర్మ యేషాం సత్త్వశుద్ధికారణం విద్యతే తే పుణ్యకర్మాణ స్తేషాం పుణ్యకర్మణాం తే ద్వంద్వమోహనిర్ముక్తా యథోక్తేన ద్వంద్వమోహేన నిర్ముక్తా భజంతే మాం పరమాత్మానం దృఢవ్రతాః ఏవమేవ పరమార్థతత్త్వం నాన్యథేత్యేవం నిశ్చితవిజ్ఞానా దృఢవ్రతా ఉచ్యంతే ॥ ॥౨౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ద్వన్ద్వమోహనిర్ముక్తులై యెట్టివారు, నిన్ను యథాశాస్త్రముగ నాత్మభావముచే భజించెదరు. అను యాక్షేపితార్థమును జూపుటకై జెప్పుచున్నాడు- సత్త్వశుద్ధికారణమైన పుణ్యకర్మలుగల ఏజనులయొక్క పాపము నష్టప్రాయమగునో వారు ద్వన్ద్వమోహవినిర్ముక్తులై దృఢవ్రతులై (ఈవిధముగ నున్నచో పరమార్థతత్త్వము లభించునుగాని మరియొకవిధమున లభింపదు. అను నిశ్చితవిజ్ఞానము కలవారై) నన్ను సేవించెదరు. ॥౨౮॥

వారగుటచే యా నాలుగువిధములైనవారలు నన్ను సేవింతురు. అని "యేషాం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

అనేక జన్మములయందు పుణ్యాచరణశీలురు, పుణ్యకర్మములుకల, సఫలజన్మకల, ఇతరలోకవిలక్షులగు యేజనులకు అయాపుణ్యకర్మలచే జ్ఞానప్రతిబంధకమగు పాపమునశించునో వారు పాపము లేనందున పాపమువలన ప్రాప్తించెడి ద్వంద్వమోహముచే రాగద్వేషాదినిబంధనవిపర్యాసచే స్వతః వినిర్ముక్తులై, అవిచాల్యసంకల్పముకలవారై "అన్నివిధముల భగవంతుడే భజింపదగినవాడు భగవంతుడిట్టివాడు" అని ప్రమాణజనితాప్రామాణ్యశంకాశూన్యవిజ్ఞానముకలవారై, అనన్యశరణులై పరమాత్మస్వరూపమగు నన్ను సేవించెదరు; ఇట్టి వారలే "చతుర్విధా భజన్తే మాం" అనుచోట సుకృతిశబ్దముచే జెప్పబడిరి. కాన "సర్వభూతాని సంమోహం యాన్తి" యనునది ఉత్సర్గ (సామాన్య) వాక్యము. "వారలమధ్య యెవరు సుకృతులో వారలు సంమోహశూన్యులై నన్ను సేవించెదరు." అనునది అపవాదవాక్యము. కాన విరోధము లేదు. ఈఉత్సర్గశాస్త్రమే "త్రిభి ర్గుణమయై ర్భావైః" అనుచోట జెప్పబడెను. కాన సత్త్వశోధకపుణ్యకర్మ సంచయము సర్వదా ప్రయత్నింపదగినదని భావము. ॥౨౮॥

శంకరానందీయము:— అట్లగుచో నేయుపాయముచే ద్వన్ద్వమోహము నివర్తించును? ఎవరు ద్వన్ద్వమోహ వినిర్ముక్తులై యాత్మస్వరూపమగు నిన్ను తెలిసికొనెదరు? అను యాశంకలను "యేషాం" అను దానిచే తొలిగించుచుండెను.

అతిశ్రద్ధచేతను, భక్తిచేతను యీశ్వరప్రీతికొరకు నియమపూర్వకముగ ననేక జన్మలయందాచరింపబడినట్టి, సర్వకామ వినిర్ముక్తమైనట్టి, చెప్పబడిన లక్షణములుకల యజ్ఞదాన తపోరూపమైన వైదికమగు పుణ్యకర్మ కలసత్కర్మైకనిష్ఠులగు యేజనుల ప్రాగ్భవీయపాపము "ధర్మేణ పాప మపనుదతి" అను శ్రుత్యుక్తరీతిని యజ్ఞాదిపుణ్యకర్మలచే నిశ్శేషముగ వినష్టమో అట్టి వారు పుణ్యకర్మలచేతను, యీశ్వరోపాస్తిచేతను

గీ॥ జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే ।
తే బ్రహ్మ త ద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥ ॥౨౯॥

పదవిభాగము :— జరామరణమోక్షాయ- మాం- ఆశ్రిత్య- యతంతి- యే- తే- బ్రహ్మ- తత్- విదుః- కృత్స్నం- అధ్యాత్మం- కర్మ- చ- అఖిలమ్ ॥ ॥౨౯॥

ప్రతిపదార్థము : యే= ఎవరు; జరామరణమోక్షాయ= జరామరణవిముక్తికొరకై; మాం=నన్ను; ఆశ్రిత్య= ఆశ్రయించి; యతంతి= ప్రయత్నించెదరో; తే= వారు; తద్బ్రహ్మ= ఆపరబ్రహ్మమును; విదుః= తెలిసికొనెదరు; కృత్స్నం= సమస్తమగు; అధ్యాత్మం= ప్రత్యగాత్మవిషయమగువస్తువును; విదుః= తెలిసికొనెదరు; అఖిలం= సమస్తమగు; కర్మ చ= కర్మను; విదుః= తెలిసికొనెదరు. ॥౨౯॥

ప్రతిబంధము తొలగింపబడి చిత్తప్రసాదమహిమచే ద్వంద్వమోహనిర్ముక్తులై సర్వకర్మత్యాగ సంన్యాసమనెడి ముఖ్యసాధనముచే శ్రుత్యాచార్యప్రసాదముచే లబ్ధమైన ప్రత్యక్తత్త్వవిజ్ఞానముచే దృఢవ్రతులై అనగా "సర్వమిద మహం బ్రహ్మైవ" అని యప్రతిహతమైన బుద్ధినిశ్చయ విశేషరూపమైన వ్రతముకలవారై, శ్రుతిస్మృతియుక్తికోటులచే నిర్ణీతార్థమునందు సనిశ్చయులై, నిష్కలము, నిష్క్రియము, నిర్విశేషము, నిరాకారము, నిరంజనము, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము, ఆనందైకరసము, ప్రత్యగభిన్నము, పరబ్రహ్మము, అద్వితీయము నగు నన్ను భజించుచుండిరి. అనగా నిత్యనిరంతరైకనిష్ఠచే అనుసంధానము చేయుచుండిరి. యితరులు వైషయిక సుఖభ్రాంతిచే భజింపకుండిరి. ॥౨౮॥

—: ౭వ అధ్యాయము ౨౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— ఇవు డర్జునుని యొక్క ప్రశ్నను ఉత్థాపనచేయుటకు సూత్రీభూతములైన "జరామరణమోక్షాయ" అనునదిమొదలుకొని రెండు శ్లోకములు జెప్పబడుచుండెను. ఈరెండు శ్లోకములకే వ్యాఖ్యాస్థానీయము యెనిమిదవ యధ్యాయము కాగలదు.

ఎవరు సంసారదుఃఖముచే నిర్విణ్ణులై జరామరణాదివివిధదుస్సహసంసారదుఃఖనిరాసక్తులై దానికి ప్రధానహేతువగు సగుణరూపమైన భగవంతు నాశ్రయించి (భగవంతునికంటె యితరమైన సర్వమునందు వైముఖ్యముతో శరణుపొంది) ఫలపరిత్యాగపూర్వకముగ విహితకర్మలను పరమేశ్వరార్పణముగ చేయుచుండిరో అట్టివారు క్రమముగ పరిశుద్ధమైన యంతఃకరణకలవారై జగత్కారణము, మాయాధిష్ఠానము, నిర్గుణము, తత్పదలక్ష్యము, శుద్ధమునగు పరబ్రహ్మమునుగ నన్ను తెలిసికొనుచున్నారు. అట్లే ఉపాధిచే నవచ్ఛిన్నమైన శరీరము ననుసరించి ప్రకాశించుచున్న కృత్స్నమగు త్వంపదలక్ష్యమును తెలిసికొనుచున్నారు. తత్త్వంపదలక్ష్యార్థజ్ఞానమునకు సాధనమైన గురూపసదన, శ్రవణ, మననాద్యాత్మకమగు కర్మను నిరవశేషముగ ఫలావ్యభిచారిగ తెలిసికొనుచున్నారు. ॥౨౯॥

శంకరానందీయము:— "మద్భక్తా యాన్తి మాం" అనుచోట నీభక్తులే నిన్ను పొందెదరనెదవు. అందరును నిన్ను యెందుకు పొందరను శంకపై మాయాతత్కార్యదోషముచే సంవృతులై మూఢులై నన్ను తెలిసికొనరు. నన్ను సేవింపరు. అదువలననే నన్ను పొందరు. ఎవరు ప్రాచీనపుణ్యాతిశయముచే సర్వపాపములు నివృత్తమైయుండ సమ్యగుదిత-చిత్తప్రసాదముచే ద్వంద్వమోహమునుండి విముక్తులై నిరంతరసమాధినిష్ఠచే నన్ను భజించెదరో. అట్టి నాభక్తులే నన్ను పొందెదరు. అని చెప్పబడిన విదేహముక్తియే వీరల సమాధినిష్ఠాసంపన్నసమ్యగ్జ్ఞానమునకు ఫలమని తెలిసికొనవలయును. "జరామరణమోక్షాయ" అనిచెప్పబోవునది కాదు. "జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతన్తియే। తే బ్రహ్మ తద్విదుః" అని జరామరణమోక్షముకొరకు

శాంకరభాష్యమ్:—

తే కిమర్థం భజంత ఇత్యుచ్యతే— జరామరణమోక్షాయ జరామరణమోక్షార్థం మాం పరమేశ్వర మాశ్రిత్య మత్సమాహితచిత్తాస్సంతో యతంతి ప్రయతంతే యే తే యద్బ్రహ్మ పరం తద్విదుః కృత్స్నం సమస్త మధ్యాత్మం ప్రత్యగాత్మవిషయం వస్తు తద్విదుః కర్మ చాఖిలం సమస్తం విదుః ॥ ॥౨౯॥

శాంకరభాష్యతత్త్వబోధని:-

ద్వంద్వమోహవినిర్ముక్తులగు దృఢవ్రతులు యెందునిమిత్తమై సేవించుచుండిరనెదవా? చెప్పెద వినుము. జరామరణములను విడచుటకై పరమేశ్వరుడనగు నన్నాశ్రయించి (మత్సమాహితచిత్తులై) యెవరు ప్రయత్నించెదరో వారు యేది పరబ్రహ్మమో దానిని తెలిసికొనుచుండిరి. సమస్తమగు ప్రత్యగాత్మవిషయమైన అవస్తువును తెలిసికొనుచుండిరి. సమస్తమగు కర్మను తెలిసికొనుచుండిరి. ॥౨౯॥

ప్రయత్నించువారలకు జరామరణమోక్షసాధనము, సర్వమును బ్రహ్మమాత్రస్వరూపముగ తెలిసికొనుటయే. కాన "తేషాం జ్ఞానీ నిత్యయుక్తః" అనునది మొదలుకొని యింతపర్యంతము "న తస్య ప్రాణా ఉత్క్రామన్తి। బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి। బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" ఇత్యాది శ్రుత్యైకప్రమాణముకల నిర్విశేషబ్రహ్మైకనిష్ఠులకు ఈలోకముననే విదేహముక్తిని చెప్పి, యిప్పుడు మందప్రజ్ఞులకు "సర్వం బ్రహ్మైవ" అని బ్రహ్మబుద్ధికరణరూపమగు సగుణోపాసనను సంక్షేపముగ "జరామరణమోక్షాయ" అనుదానిచే నుపదేశించుచుండెను.

జన్మమృత్యుప్రవాహము నిశ్శేషముగ నివర్తించుటకొఱకు సర్వకారణము, సర్వాత్మకమునగు పరమేశ్వరుడనగు నన్నాశ్రయించి భ్రమకల్పితమగు నామరూపాద్యాత్మక నిఖిలప్రపంచముయొక్క యగ్రహద్వారమున సర్వదా పరమాత్మస్వరూపానుసంధానపరులై యే ముముక్షువులు ప్రయత్నించెదరో అనగా "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాది శ్రుత్యర్థమునే యథార్థముగ జేసుకొని యంతట బ్రహ్మప్రత్యయావృత్తిని యెవరొనరించెదరో వారు నిరన్తరబ్రహ్మప్రత్యయావృత్తిమహిమచే బ్రహ్మాదిస్తంబపర్యంత సర్వోపాధులయందాత్మగ నున్న ప్రత్యగ్రూపవస్తువును, సుఖదుఃఖాద్యనుభూతికారణమైన సమస్తకర్మను బ్రహ్మమునుగనే తెలిసికొనుచున్నారు. అనగా బ్రహ్మదృష్టిచే నధ్యాత్మమును, కర్మను, సర్వమును బ్రహ్మమాత్రస్వరూపముగ తెలిసికొనుచున్నారు. అని యర్థము. ఎట్లనిన? ఉదకముకంటె వేరుగ గనుపించుచున్న తరంగబుద్బుదాదులు ద్రవత్వ శీతత్వ శుక్లత్వాది జలధర్మములచే లోపల వెలుపల వ్యాప్తమగుటచే పృథగ్రూపాది సంభావితసత్త లేనందున జలముకంటె వేరు కావు. జలమాత్రస్వరూపములే యగుచున్నవి. తరంగాదులయందుండు క్రియగూడ తరంగస్వరూపమే యగుటవలన తరంగస్వరూపమగు యుదకస్వరూపమే యగుటంబట్టి తరంగాదులు, వాటి క్రియలు యుదకస్వరూపములే. అట్లే బ్రహ్మముకంటె వేరుగ నున్నటుల ప్రతీయమానమగు అధ్యాత్మాదివస్తువులు బ్రహ్మధర్మము లగు సత్త్వచిత్త్వాదులచే వెలుపల, లోపల వ్యాప్తమగుటవలన నధ్యాత్మాదివస్తువులకు స్వతః సత్త లేమింజేసి బ్రహ్మముకంటె వేరు కావు. బ్రహ్మమాత్రస్వరూపములే యగుచున్నవి. అధ్యాత్మాశ్రితక్రియలుగూడ యధ్యాత్మాభిన్నము లగుటచే నధ్యాత్మస్వరూపబ్రహ్మాభిన్నములగుటంజేసి అధ్యాత్మములు, సర్వకర్మలు బ్రహ్మమాత్రములే యని తెలిసికొనుట యుక్తమే యనిసిద్ధము. ॥౨౯॥

గీ॥ సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదు ర్యుక్తచేతసః ॥ ॥३०॥

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి
శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే, శ్రీకృ
ష్ణార్జునసంవాదే జ్ఞానవిజ్ఞానయోగోనామ సప్తమోఽధ్యాయః ॥

పదవిభాగము :— సాధిభూతాధిదైవం- మాం- సాధియజ్ఞం- చ- యే- విదుః- ప్రయాణ కాలే- అపి- చ- మాం- తే- విదుః- యుక్తచేతసః ॥ ॥३०॥

ప్రతిపదార్థము :— యే=ఎవరు; మాం=నన్నును; సాధిభూతాధిదైవం=అధిభూతముతోటి, అధిదైవముతోటి; సహితముగ; సాధియజ్ఞంచ=అధియజ్ఞముతోటి;సహితముగ; విదుః=తెలిసికొనెదరో; తే=వారు; ప్రయాణకాలేపిచ=మరణకాలమునందునను; యుక్తచేతసః=సమాహితచిత్తులై; మాం=నన్ను; విదుః=తెలిసికొనెదరు. ॥३०॥

---

—: ७వ అధ్యాయము ३०వ శ్లోకవ్యాఖ్యాశేషములు. —

మధుసూదనసరస్వతీయము:— ఇట్టి నాభక్తులకు మృత్యుకాలమున కరణములు స్వాధీనము తప్పుటచే నన్ను విస్మరించెద రని శంకింప జనదు. ఎందువలననిన? కారణమును "సాధిభూతాధిదైవం" అను దానిచే జెప్పుచుండెను.

అధిభూతముతోను, అధిదైవముతోను, అధియజ్ఞముతోను కూడిన నన్ను యెవరు చింతించెదరో (ధ్యానించెదరో) అట్టివారు యెల్లప్పుడు నాయందు సమాహితచేతస్కులై తత్సంస్కారపటుత్వమువలన ప్రాణోత్క్రమణకాలమునందుగూడ కరణ (ఇంద్రియ) సమూహ మత్యన్తవ్యగ్రతను పొందియున్నను అప్రయత్నముగనే నాయనుగ్రహముచే సర్వాత్మ యగు నన్ను తెలిసికొనుచున్నారు. వారలకు మరణకాలమందుగూడ మదాకారమైన చిత్తవృత్తి పూర్వమునందు సంపాదింపబడిన సంస్కారపాటవమువలన సంభవించును. కాన నాభక్తులు నాభక్తియోగమువలన కృతార్థులే యగుదు రని యాశయము. అధిభూతాధిదైవాధియజ్ఞశబ్దములను యెనిమిదవ యధ్యాయమునం దర్జునుని ప్రశ్నపూర్వకముగ శ్రీకృష్ణపరమాత్మయే వ్యాఖ్యానించును. కాన నీయధ్యాయమునం దుత్తమాధికారినిగూర్చి జ్ఞేయము, మధ్యమాధికారినిగూర్చి ధ్యేయము, లక్షణచేతను, ముఖ్యవృత్తిచేతను తత్పద ప్రతిపాద్యమగు బ్రహ్మము నిరూపింపబడెను. ॥३०॥

ఇట్లు శ్రీమధుసూదనసర్వతీవిరచిత శ్రీమద్భగవద్గీతాసప్తమాధ్యాయగూఢార్థదీపికకు
"తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ బులుసు అప్పన్నశాస్త్రి
విరచిత తాత్పర్యబోధిని సమాప్తము.

శంకరానందీయము:— సర్వమునందు బ్రహ్మమాత్రత్వదర్శనపరు లుపాసకులు. కేవలమువారు అధ్యాత్మమునకు, తత్కర్మలకు బ్రహ్మమాత్రత్వమును తెలిసికొనినవారు కారు. మరేమనిన అధిభూతాదులకుగూడ బ్రహ్మమాత్రత్వమును తెలిసికొనినవారని "సాధిభూతాధిదైవం" అనుదానిచే జెప్పుచుండెను.

నిఖిలకార్యము అధిభూతము. హిరణ్యగర్భుడు, అగ్న్యాదికము అధిదైవము. వాటితోగూడ నుండునది సాధిభూతాధిదైవమనబడును. అధిభూతాధిదైవరూపముగ నున్నట్టిన్ని, "అధియజ్ఞః" యజ్ఞాధిదేవతతో కూడియున్నది అధియజ్ఞమనబడును. అధియజ్ఞస్వరూపమునయున్న సర్వాత్మకమగు పరబ్రహ్మమును యెవరు తెలిసికొనెదరో. అధ్యాత్మాధిభూతాధిదైవాకారముగ సర్వాత్మస్వరూపముచే ప్రతీయమానమైన పరబ్రహ్మమును యెవరు నిత్యనిరంతరసమాధినిష్ఠచే సంభావితాప్రతిబద్ధవృత్తిచే "బ్రహ్మైవేదం సర్వం" అని సర్వమును బ్రహ్మమునుగ దెలిలిసికొనెదరో, యెట్టివారు నాయందే (బ్రహ్మమునందే) సమాహితచిత్తముకలవారై మరణసమయమునందున్ను దేహేన్ద్రియప్రాణమనోబుద్ధ్యాదులు వ్యాకులమైన కాలమునందుగూడ విపరీత

శాంకరభాష్యమ్:—

సాధీతి । సాధిభూతాధిదైవ మధిభూతం చాధిదైవం చాధిభూతాధిదైవం సహాధిభూతాధిదైవేన సాధిభూతాధిదైవం చ మాం యే విదు స్సాధియజ్ఞం చ సహాధియజ్ఞేన సాధియజ్ఞం యే విదుః ప్రయాణకాలేఽపి చ మరణకాలేపిచ మాం తే విదు ర్యుక్తచేతస స్సమాహితచిత్తా ఇతి ॥30॥

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీగోవిందభగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛఙ్కర భగవతః కృతౌ శ్రీభగవద్గీతాభాష్యే జ్ఞానవిజ్ఞానయోగో నామ సప్తమోఽధ్యాయః ॥ ౭ ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎవరు అధిభూత, అధియజ్ఞ, అధిదైవములతోగూడ నన్ను తెలిసికొనెదరో వారు మరణకాలమునందుగూడ సమాహితచిత్తులై నన్ను తెలిసికొందురు. ॥30॥

ఇట్లు నూరువేల సంఖ్యకలిగి, వ్యాసప్రోక్తము, సంహితారూపము నగు
మహాభారతమునం దంతర్గతమైన భీష్మపర్వమునందున్న యుపనిష
ద్రూపము, బ్రహ్మవిద్యారూపము, యోగశాస్త్రము నగు
భగవద్గీతయందున్న శ్రీకృష్ణార్జునసంవాదమునందుగల
జ్ఞానవిజ్ఞాన యోగమను పేరి సప్తమాధ్యాయ
మునకు గౌతమసగోత్రుడగు "తర్క రత్న,
న్యాయవేదాన్తవిద్యాపారీణ" బులుసు
అప్పన్నశాస్త్రిచేరచింపబడిన ఆనంద
గిరీయవ్యాఖ్యానుసృతశ్రీభగవద్గీ
తాశాంకర భాష్యతత్త్వబో
ధిని సమాప్తము, హరిః
ఓం తత్సత్. శ్రీ శ్రీ శ్రీ

భావన లేకపోవుటచే సర్వాత్మనగు నన్నే తెలిసికొనుచున్నారు. నాకంటె వేరగు దేహేంద్రియాదికమును గాని, ఆత్మనుగాని, వేదనక్రియనుగాని, ప్రాణిజాతమును కాని, దేవతాంతరమును కాని, వినరు, తెలిసికొనరు, స్మరింపరు. ॥30॥

ఇట్లు శ్రీశంకరానంద సరస్వతీవిరచిత శ్రీభగవద్గీతా సప్తమాధ్యాయ గీతాతాత్పర్య
బోధినికి "తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ"
బులుసు అప్పన్న శాస్త్రిచే రచియింపబడిన
తాత్పర్యబోధిని సమాప్తము.

శ్రీ ధ రీ య ము :— ఇట్టి వారలకు యోగభ్రంశాశంకగూడ లేదని "సాధిభూతాధిదైవం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

అధిభూతాధిశబ్దముల కర్థమును శ్రీకృష్ణపరమాత్మయే అష్టమాధ్యాయమునందు స్వయముగ జెప్పగలడు. అధిభూతముతోను, అధిదైవముతోను, అధియజ్ఞముతోను సహితమైన నన్ను యెవరు తెలిసికొనెదరో అట్టి యుక్తచేతస్కులు మరణసమయమునందున్ను నన్ను తెలిసికొనుచున్నారు. అపుడుగూడ వ్యాకులులై నన్ను మరవరు. కాన నాభక్తులకు యోగభ్రంశాశంకలేదు. ॥30॥

ఇట్లు శ్రీధరస్వామికృత సప్తమాధ్యాయ సుబోధినికి "తర్కరత్న,
న్యాయవేదాన్త విద్యాపారీణ" బులుసు అప్పన్నశాస్త్రి
విరచిత తాత్పర్యబోధిని స మా ప్త ము.

స దా నం దీ య ము :—

శ్లో॥ యో మాయావీ మహేశః ప్రకటితమహిమా, వేదసిద్ధాన్తగీతో
యో భక్తార్థం స్వరూపం సురనరవనజం స్వేచ్ఛయాఽఽధత్త ఈశః,
యస్యాంఘ్రిద్వన్ద్వ మాద్యం జనిమృతిజలధిం సన్తర స్త్వాశ్రితా యే
తం శ్రీకృష్ణం హృదిస్థం సతత మిహ ముదా సంశ్రయేఽహం సుభక్త్యా ॥

ఏ మాయావియగు మహేశుడు ప్రకటీకృతమహిమకలవాడై, వేదసిద్ధాన్తగీతుడో ఏఈశ్వరుడు భక్తుల నిమిత్తము తన స్వరూపమును స్వేచ్ఛచే సురనరవనజరూపముగ ధరించుచుండునో, ఎవరు యెవనిస్తుతింపదగిన యంఘ్రిద్వయము నాశ్రయించి జననమరణరూపమగు సంసారసముద్రమును దాటుచుండిరో, హృదయము నందుండిన యట్టి శ్రీకృష్ణపరమాత్మను యోగ్యమైన భక్తిపూర్వకముగ సంతోషముచే నే నాశ్రయించు చుంటిని.

శ్లో॥ మాయా యస్యాతిగూఢా ప్రచురగుణయుతా సర్వసంసారహేతు
ర్నో తర్తుం తై స్సు శక్యా హరిపదశరణం యే ప్రపన్నా న భక్త్యా,
యత్పాదామ్భోరుహాన్తర్భ్రమర ఇవ జన స్సంప్రవిశ్యాతిరత్యా
మగ్న స్తత్రైవ నిత్యం త మిహ మురరిపుం కృష్ణ మీశం ప్రపద్యే ॥

ఎవని మాయ యతిగూఢమైనదై విస్తృతమైన సత్త్వరజస్తమోగుణములతో గూడినదై, సంసారహేతువై యెవరు భక్తిచే శ్రీహరిపదారవిందమును శరణనుపొందరో యట్టివారలచే తరించుటకు శక్యముకాదో ఎవని పాదాంభోరుహమధ్యమున భ్రమరమువలె యతిప్రీతిచే ప్రవేశించి యచటనే నిత్యము మగ్నుడైన జనుడు పూర్వోక్తమాయను దాటునో యట్టి మురరిపువగు శ్రీకృష్ణపరమాత్మను నేను శరణ పొందుచుంటిని. ॥30॥

ఇట్లు శ్రీసదానందసరస్వతీయతివిరచిత సప్తమాధ్యాయ భావప్రకాశకు
"తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ" బులుసు
అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
స మా ప్త ము.

భా ష్యో త్క ర్ష దీ పి క :— మరణకాలమున నీభక్తులకు నిన్ను మరచుట సంభవింపవచ్చును. అందువలన వారలకుసంసారమునుండి మోక్షమెటుల ప్రాప్తించు నను యాశంకను "సాధిభూతాధిదైవం" అనుశ్లోకముచే దొలిగించుచుండెను.

"అధిభూతం చాధిదైవం చ తయోః స్సమాహారః అధిభూతాధిదైవం" అని సమాహారద్వంద్వసమాసము. "తేన సహ వర్తత ఇతి సాధిభూతాధిదైవం" అని విగ్రహము. అధిభూతాధిదైవములతోటి, అధియజ్ఞముతోటి కూడిన నన్ను యెవరు తెలిసికొనెదరో అట్టి యుక్తచేతస్కులు మరణకాలమునందుగూడ నన్ను తెలిసికొనుచున్నారు. కాన వారలకు మోక్షప్రాప్తియందు సందేహ మేమియు లేదు. సాధిభూతాదిపదము లుత్తరాధ్యాయమునందు స్పష్టపడగలవు. ఈసప్తమాధ్యాయముచే యుత్తమాధికారినిగూర్చి జ్ఞేయమగు బ్రహ్మమును నిరూపింపదలచిన శ్రీకృష్ణపరమాత్మచే తజ్జ్ఞాననిమిత్తము మధ్యమాధికారినిగూర్చి తత్పదవాచ్యమును ప్రతిపాదన చేయుచు తత్పదవాచ్యము, తల్లక్ష్యము చూపబడెను. ||30||

ఇట్లు శ్రీధనపతిసూరివిరచిత భాష్యోత్కర్షదీపికకు "తర్కరత్న,
న్యాయవేదాంతవిద్యాపారీణ" బులుసు అప్పన్నశాస్త్రి
విరచిత తాత్పర్యబోధిని సమాప్తము.

పరమార్థప్రప:— ఇట్టివారలకు యోగభ్రంశాశంక లేదని "సాధిభూతాధిదైవం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

అధిభూతాధిదైవములతో గూడియుండిన నన్ను యెవరు తెలిసికొనుచున్నారో, వారు నిర్యాణసమయమునందుగూడ పరమేశ్వరస్మరణకలవారై నన్ను తెలిసికొనుచున్నారు. నన్ను తెలిసికొని శరీరమును విడచుచున్నారు. దేహాంతవేదనలచే వ్యాకులులు కారు. నాయనుగ్రహమువలన సావధానులై శరీరమును విడచెదరు. ||30||

—: అధ్యాయతాత్పర్యము :—

శ్లో॥ చిత్సంవిదూప్రపతోఽన్తర్హృదయ మనుగతో భాసతే ప్రత్యగాత్మా,
బాహ్యం భూమ్యాదిభూతే ష్వతిశయితగుణై స్సంప్రవిష్టో విభాతి।
వేదేష్వోంకారరూప స్సవితరి మహసా వీర్యవత్యూర్జితేన,
ప్రోక్త స్తం వేత్తి యోఽసౌ మమ తను రితి త త్సప్తమే నోక్త మాసీత్ ॥ ||30||

ప్రత్యగాత్మ అంతర్హృదయమును చిత్సంవిద్రూపముచే అనుగతుడై ప్రకాశించుచుండెను. భూమ్యాదిభూతములయం దతిశయితగుణములచే ప్రవిష్టుడై యెవడు ప్రకాశించుచుండెనో వేదములయం దోంకారరూపుడై సూర్యునియందు వీర్యవత్యూర్జితమహస్సుచేతను పొందబడెనో అట్టి వానినిగ వీడు నాశరీరమని యెవడు తెలిసికొనుచున్నాడో అట్టివాడు సప్తమాధ్యాయముచే జెప్పబడెను. ||30||

ఇట్లు పరమార్థప్రపకు బులుసు అప్పన్నశాస్త్రి విరచిత
తాత్పర్యబోధిని సమాప్తము.

నీలకంఠీయము:— ఈవిధముగ తత్పదార్థజ్ఞానమును సద్యోముక్తిహేతువుగ జెప్పి క్రమముక్తిఫలకములగు తత్ప్రతీకోపాసనములను విపులముగ జెప్పుటకై సంక్షేపముగ నిట సూత్రించుచుండెను.:— ఎవరు అధిభూత, అధిదైవ, అధియజ్ఞములతో గూడ నన్ను పాసించెదరో అట్టి సమాహిత-చిత్తులు సర్వజనవ్యామోహకమగు మరణకాలమందుగూడ నన్ను తెలిసికొందురు. అనగా నట్టివారిజ్ఞానము మరణకాలమునందుగూడ నపహరింపబడదుగాన భగవంతునియందు నిరంతరము దృఢముగు భావనజేయనగునని భావము, అధిభూతాదికము ముందు శ్రీకృష్ణభగవానులే వివరించునుగాన ఇట జెప్పుటలేదు. ||30||

ఇట్లు శ్రీభగవద్గీతా పంచమాధ్యాయ నీలకంఠవ్యాఖ్యకు బులుసు
అప్పన్నశాస్త్రి తనూభవుడును, శ్రీ సత్యాంబాగర్భ
శుక్తిముక్తా ఫలాయమానుడును, గౌతమస గోత్రు
డు నగు బులుసు వెంకటశాస్త్రి విరచిత
తాత్పర్యబోధిని
సమాప్తము.

శుభమస్తు.

# శ్రీభగవద్గీతా

# శాంకరభాష్యతత్త్వబోధిని

## శ్రీ భగవద్గీతా శాంకర భాష్యమ్

అష్టమోఽధ్యాయః ।

తారకబ్రహ్మయోగః ।

అర్జున ఉవాచ:—

గీ॥ కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ! ।
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కిముచ్యతే ॥౧॥
అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన ।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥౨॥

పదవిభాగము:— అర్జునః–ఉవాచ; కిం–తత్–బ్రహ్మ–కిం–అధ్యాత్మం–కిం–కర్మ–పురుషోత్తమ–అధిభూతం–చ–కిం–ప్రోక్తం–అధిదైవం–కిం–ఉచ్యతే ॥౧॥ అధియజ్ఞః–కథం–కః–అత్ర–దేహే–అస్మిన్–మధుసూదన–ప్రయాణ కాలే–చ–కథం–జ్ఞేయః–అసి–నియతాత్మభిః ॥ ॥౨॥

ప్రతిపదార్థము:— అర్జునః=అర్జునుడు; ఉవాచ=పలికెను: (ప్రశ్నించెను) తత్=ఆ; బ్రహ్మ=బ్రహ్మము; కిం=ఏది?; అధ్యాత్మం=అధ్యాత్మము; కిం=ఏది?; హేపురుషోత్తమ=ఓపురుషోత్తముడా!; కర్మ=కర్మము; కిం?=ఏది?; అధిభూతం చ=అధిభూతమున్ను; కిం=ఏది?; ప్రోక్తం=చెప్పబడినది; అధిదైవం=అధిదైవము; కిం=ఏది; ఉచ్యతే=చెప్పబడుచున్నది: హేమధుసూదన=ఓశ్రీకృష్ణపరమాత్మ; అస్మిన్=ఈ; దేహే=దేహమునందు; అధియజ్ఞః=అధియజ్ఞము; కః=ఏది; అత్ర=ఈదేహమునందు: కథం=యెట్లున్నది?: నియతాత్మభిః=సమాహితచిత్తుల చేత; ప్రయాణకాలే చ=ప్రయాణకాలమునందున్ను; (మరణకాలమునందున్ను) త్వం=(పరమాత్మ స్వరూపుడవు) నీవు; కథం=యెటుల; జ్ఞేయః=తెలిసికొనదగినవాడవు; అసి=అయితివి. ॥౧, ౨॥

---

—• ౭వ అధ్యాయము ౧వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వాధ్యాయాన్తమున "తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్" అను మొదలగు సార్ధశ్లోకముచే నేడు పదార్థములు జ్ఞేయములుగ శ్రీకృష్ణపరమాత్మచే సూత్రితములైనవి. అట్టి ఏడుపదార్థములను వివరించుటకై యీయష్టమధ్యాయమును ప్రారంభించుచుండెను. అందు సూత్రితములగు ఏడుపదార్థములను తెలిసికొన నిచ్ఛకలవాడై యర్జునుడు అదిలో "కిం త ద్బ్రహ్మ" అనునది మొదలు రెండుశ్లోకములచే బ్రశ్నించుచుండెను.

శాంకరభాష్యమ్:—

తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మిత్యాదినా భగవతార్జునస్య ప్రశ్నబీజా న్యుపదిష్టా న్యత స్తత్ప్రశ్నార్థమ్ ॥ ॥౧, ౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సప్తమాధ్యాయాంతమున 'యేషాం త్వంతగతం పాపం' ఇత్యాదికముచే యే బ్రహ్మాదుల యనుసంధానము చెప్పబడెనో, ప్రాణప్రయాణకాలమున యే భగవత్స్మరణము జూపబడెనో ఈ రెంటిని తెలిసికొననిచ్ఛగలవాడై ప్రశ్నించుచుండె నని ప్రశ్నసముదాయమును 'తే బ్రహ్మ' అను భాష్యమునం దవతరింపజేయుచుండెను.

ప్రశ్నబీజము లనగ ప్రశ్నవిషయ మగు బ్రహ్మాదు లని యర్థము. బ్రహ్మశబ్దము సోపాధికనిరుపాధికములను బోధించున దగుటచే 'తే బ్రహ్మ తద్విదుః' అను స్థలమున గల బ్రహ్మశబ్దము సోపాధికబ్రహ్మపరమా? నిరుపాధికబ్రహ్మపరమా? (1), 'కృత్స్న మధ్యాత్మం' అను స్థలమునందు గల అధ్యాత్మశబ్దముచే 'ఆత్మానం దేహ మధికృత్య తస్మి న్నధిష్ఠానే తిష్ఠతి' అను వ్యుత్పత్తి నాశ్రయించి శరీరము నధిష్ఠానముగ జేసుకొని యుండు యింద్రియసముదాయము

జ్ఞేయముగా జెప్పబడిన యాబ్రహ్మము సోపాధికమా? లేక నిరుపాధికమా? ఇట్లే యాత్మనుగాని దేహమును గాని యుద్దేశించి యాయధిష్ఠానమునందుండునది "అధ్యాత్మం" అని చెప్పబడును. అట్టియధ్యాత్మము శ్రోత్రాదీంద్రియసమూహరూపమా? లేక ప్రత్యక్చైతన్యరూపమా? అట్లే "కర్మ చాఽఖిలం" అనుస్థలమున కర్మ మనగా యజ్ఞరూపమా? లేకమరొకటియా? ఏమన "విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపి చ" అను శ్రుతియందు ద్వైవిధ్యము శ్రూయమాణ మగుటచే పైప్రశ్న ముపపన్నము. ఇట "పురుషోత్తమ" అను సంభోధనముచే —"నీవును, నేనును సమానులమే గాన నీవు నన్నెందులకు ప్రశ్నించుచుంటివి" అను శంకను తొలగించుచు "సర్వపురుషులకంటె యుత్తముడవు. సర్వజ్ఞుడవు నగు నీకు దెలియని దేమియు నుండదు" అనుయభిప్రాయమును సూచించెను. "అధిభూతం" పృథివ్యాదిభూతజాతము నుద్దేశించుకొని చేయబడిన యొకింత కార్యము అధిభూతశబ్దముచే చెప్పబడునా? లేక సమస్త కార్యజాతము చెప్పబడునా? "అధిదైవం కి ముచ్యతే" అధిదైవమనగ దేవతావిషయమగు అనుధ్యానమా? లేక సర్వదైవతస్వరూపములగు ఆదిత్యాదిమండలములయం దనుస్యూతమైన చైతన్యమా? ॥౧॥

శంకరానందీయము:— సప్తమాధ్యాయాన్తమున యద్రష్టృత్వాదిగుణములు కలదియు, నిర్విశేషము, ప్రమాణాగోచరము నగు పరబ్రహ్మమును స్వయముగ తెలిసికొనుటకసమర్థులగు మందప్రజ్ఞుల భేదదర్శనమునకు హేతువగు బాహ్యవాసనా పుంజము నిరవశేషముగ నివర్తించిన చిత్తనైర్మల్యము సిద్ధించును. అందువలన నిర్విశేషజ్ఞానయోగ్యుడగుటచే సిద్ధిని పొందును గాన సగుణబ్రహ్మోపాసనము నుపక్రమించి "తే బ్రహ్మ తద్విదుః" అను మొదలగుదానిచే నధ్యాత్మాఽధిభూతాధిదైవాధియజ్ఞాదులయెడ బ్రహ్మాభిన్నత్వదర్శనరూపమగు యుపాసనమును సూచించి, ప్రస్తుతము బ్రహ్మాదులస్వరూపమును వివేచనముతో జూపుటకును, ప్రయాణకాలమున ముముక్షువు చేయతగినదియు, ధ్యానింపదగినదియు, పొందదగినదియు నగు వస్తువును ప్రతిపాదించుటకును, పునరావృత్తిసహితమగు స్థానముయొక్కయు, పునరావృత్తిరహితస్థానముయొక్కయు స్వరూపమును బోధించుటకును, కర్మములయొక్కయు నుపాసకులయొక్కయు పొందదగిన మార్గమును

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వివక్షితమా? ప్రత్యగ్భూతమగు బ్రహ్మమే వివక్షితమా? (2), 'విజ్ఞానం యజ్ఞం తనుతే। కర్మాణి తనుతేఽపి చ' అను శ్రుతియందు కర్మకు ద్వైవిధ్యము నిర్ధారితము. అందువలన 'కర్మ చాఽఖిలం' అను స్థలమునందు గల కర్మశబ్దముచే యెట్టి కర్మ గ్రహింపబడెను? అని 'కిం కర్మ' అనుదానిచే మూడవప్రశ్న జేయబడెను. 'పురుషోత్తమ' అను సంబుద్ధిచే కార్యకారణవిలక్షణుడవగు నీకు తెలియని దేదియు లేదని సూచింపబడెను. 'సాధిభూతాధిదైవం' అను స్థలమునందు గల అధిభూతశబ్దముచే పృథివ్యాదిభూతములయం దుండు యేదో యొకానొకటి గ్రహింపవలయునా? లేక నిఖిలకార్యములు గ్రహింపనగునా? అని 'అధిభూతం చ కిం ప్రోక్తం' అనుదానిచే ప్రశ్నించెను. (4), అధిదైవశబ్దముచే దైవవిషయ మను ధ్యానమా? ఆదిత్యాదిమండలముల యందుండు చైతన్యము వివక్షితమా? (5), అని 'అధిదైవం కి ముచ్యతే' అనుదానిచే ప్రశ్నించెను. 'సాధియజ్ఞం చ' అను స్థలమునందు గల అధియజ్ఞశబ్దముచే యజ్ఞము నధిగతమైన విజ్ఞానాత్మ వివక్షితమా? పరదేవత వివక్షితమా? అని ప్రశ్నాంతరమును 'అధియజ్ఞః' అనుదానిచే ప్రకటన చేయుచుండెను "అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన" అనునంతవరకు యొకటియే ప్రశ్న. "కథం, కః" అను శబ్దద్వయముచే ప్రశ్నద్వయమని భ్రమ జెందవలదు. అధియజ్ఞుడు బ్రహ్మము ధ్యానింపదగిన వాడా? తాత్పర్యముగ చింతింపదగినవాడా? అత్యంతాభేదముగ చింతింపదగిన వాడా? అని 'కథం' అను శబ్దమున కర్థము. సర్వాధా (అన్ని విధముల) ఆ యధియజ్ఞుడు యీదేహమునందే యుండెనా! శరీరమునకు వెలుపల యుండెనా? దేహమునందే యున్నచో అతడు బుద్ధ్యాదిమా? తద్వ్యతిరిక్తమా? అను జిజ్ఞాసచే 'కోఽత్ర' అనుదానిచే ప్రశ్నించుచుండెను. (6),సమాహితచిత్తులకు ప్రాణప్రయాణకాలమందుగూడ భగవదనుసంధానము సిద్ధించు నని చెప్పబడెను. అది యుక్తము కాదు ఎందువలననిన! ప్రాణోత్క్రమణకాలమునందు ఇంద్రియసమూహవ్యగ్రతచే చిత్తసమాధానముసంభవింపదు అను యభిప్రాయముచే "ప్రయాణకాలే చ కథం జ్ఞేయోసి' అను దానిచే ప్రశ్నించెను. మొత్తము యేడుప్రశ్న లుయర్జునునిచే చేయబడెను ॥౧॥౨॥

జాపుటకును యీ యష్టమాధ్యాయము నారంభించుచుండెను. అందు తొలుత "తే బ్రహ్మ" మొదలగు దానిచే నిర్దిష్టములైన బ్రహ్మాదిపదములు అనేకార్థకములగుటవలన తగు యర్థమును తెలియనివాడై దానిని తెలిసికొను యిచ్ఛతో నర్జునుడు "కిం త ద్బ్రహ్మ" అను శ్లోకము మొదలుకొని యిట్లు ప్రశ్నించెను. "కిం త ద్బ్రహ్మ" పర అపరములు రెండును బ్రహ్మశబ్దవాచ్యములుగాన యిట బ్రహ్మశబ్దముచే వివక్షితమైనది పరబ్రహ్మమా? లేక, యపరబ్రహ్మమా! "ఆత్మానం దేహ మధి తిష్ఠతీత్యధ్యాత్మం" ఆత్మయన దేహము. దానిని యాశ్రయముగా జేసుకొని యుండుట యనునది ప్రాణేంద్రియాదులకు, ప్రత్యక్చైతన్యమునకునుగూడ సంభవించును. కాన యిట యధ్యాత్మ మన ప్రాణమా? లేక శ్రోత్రాదికమా? లేక యాత్మయా! 'కిం కర్మ' కర్మగూడ శ్రౌత, స్మార్త, లౌకికరూపముగ మూడు విధములు. ఇట కర్మశబ్దముచే నేది వివక్షితము? "అధిభూతం చ కిం" కార్యకారణభేదముచేతను, పృథివ్యాదిభేదముచేతను, భూతము లనేకవిధములు. గాన

గీ॥ అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే ।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥ ॥3॥

పదవిభాగము:— అక్షరం-బ్రహ్మ-పరమం-స్వభావః-అధ్యాత్మం-ఉచ్యతే, భూతభావోద్భవకరః-విసర్గః- కర్మసంజ్ఞితః ॥ ॥3॥

ప్రతిపదార్థము:— అక్షరం=నాశరహితమైన; పరమం=పరబ్రహ్మము; బ్రహ్మ= "తేబ్రహ్మ తద్విదుః" అను స్థలమునందుండు బ్రహ్మశబ్దముచే చెప్పబడు బ్రహ్మము; (1). స్వభావః=బ్రహ్మకు ప్రతిదేహమునందు ప్రత్యగాత్మ భావము; అధ్యాత్మం=అధ్యాత్మమని ఉచ్యతే= చెప్పబడుచున్నది. (2). భూతభావోద్భవకరః=భూతానాం + భావః భూతభావః. తస్య + ఉద్భవః భూతభావోద్భవః. తం + కరోతీతి భూతభావోద్భవకరః= పంచభూతవస్తూత్పత్తికరమగు; విసర్గః= దేవతోద్దేశముచే చరుపురోడాశాదిద్రవ్యముయొక్క పరిత్యాగము; కర్మసంజ్ఞితః=కర్మశబ్దముచే చెప్పబడును. ॥3॥

---

వానిలో నధిభూత మననేది? "అధిదైవం కి ముచ్యతే" ఇట అధిదైవశబ్దముచే నగ్న్యాదిసర్వదేవతలు చెప్పబడుదురా? లేక యాదేవతలకు సంబంధించిన యొకానొక క్రియావిశేషము చెప్పబడునా? ॥౧॥

—: ౮వ అధ్యాయము ౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— అధియజ్ఞమన యజ్ఞాధిష్ఠాత యగు దేవతాస్వరూపమా! లేక, పరబ్రహ్మమా? ఆయధిజ్ఞశబ్దవాచ్యము తాదాత్మ్యభావముతో జింతింపదగినదా? లేక యత్యంతాభేదరూపముగ జింతంపదగినదా? ఆది యీదేహాంతర్వర్తియా? లేక యీదేహమునకు బహిఃప్రదేశవర్తియా? దేహాంతర్వర్తియేయగుచో బుద్ధ్యాదిరూపమా? లేక తద్వ్యతిరిక్తమా?(ఇటఅధియజ్ఞః కథం కోఽత్ర దేహేస్మిన్" అనునంతవరకు సప్రకారమగు నొకేప్రశ్నముగ గ్రహింపవలెను.) పరమ కారుణికుడు. సర్వోపద్రవనివారకుడునగుపరమేశ్వరుడు అనాయాసముగనే నాసందేహమును నివర్తింప జేయగలడని సూచించుటకిట "మధుసూదన" అనిసంబోధించెను. ప్రయాణకాలమున (ప్రాణాత్యయకాలమున) సర్వేంద్రియములకు వ్యగ్రత్వ మేర్పడు స్థితిలో చిత్తసమాధాన మేర్పడదుగాన యట్టిసమయమున సమాహితచిత్తులైనవారలు నిన్ను తెలిసికొందురు! ఈ సందేహరూపమగు సర్వవిషయమునుగూర్చి సర్వజ్ఞుడవు, పరమ కారుణికుడవు నగు నీవు శరణాగతుడ నగు నాకు జెప్పుమని యభిప్రాయము. ॥౨॥

శంకరానందీయము:— "విజ్ఞానం యజ్ఞం తనుతే" అనియు "యజ్ఞో వై విష్ణుః" అనియునున్న శ్రుతులచొప్పున, ఇట యధియజ్ఞమన విజ్ఞానాత్మయా? లేక విష్ణువా? లేక యితరమగు మరొకటియా? ఆఅధిదైవము యీదేహమున సాకారముగ నుండెనా? లేక నిరాకారముగ నుండెనా? బుద్ధ్యాదులలో నొకడా! లేక భిన్నుడా? మరియు నంతకాలమున సమాహితచిత్తులగువారు నిన్నెట్లు తెలిసికొనెదరు? అనగా సగుణరూపునిగనా? లేక నిర్గుణరూపునిగనా? లేక మరొక విధముగనా! ఎట్లు తెలిసి కొందురు? అంతయు సవివరముగ జెప్పుమని యభిప్రాయము. ॥౨॥

—: ౮వ అధ్యాయము ౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— పైవిధముగ నున్న యర్జునుని ఏడు ప్రశ్నములకు మూడుశ్లోకములచే శ్రీకృష్ణభగవానుడు సమాధానమును క్రమముగ జెప్పుచుండెను. ప్రశ్నక్రమము ననుసరించి నిశ్చయించుచో ప్రశ్నించువానికి అనాయాసముగ నిశ్చయసిద్ధిరూపమగు యభీష్టము సిద్ధించునను యభిప్రాయముతో శ్రీకృష్ణభగవాను లీశ్లోకమున ప్రశ్నత్రయమును, నాల్గవశ్లోకమున ప్రశ్నత్రయమును, ఐదవశ్లోకమున యొకప్రశ్నమును సమా

శాంకరభాష్యమ్:—

ఏషాం ప్రశ్నానాం– యథాక్రమం నిర్ణయాయ న క్షరతీ త్యక్షరం పర ఆత్మా "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి" ఇతి శ్రుతేః । ఓంకారస్య చోమిత్యేకాక్షరం బ్రహ్మేతి పరేణ విశేషణా దగ్రహణమ్ । పరమ మితి చ నిరతిశయే బ్రహ్మ ణ్యక్షర ఉపపన్నతరం విశేషణమ్ । తస్యైవ పరస్య బ్రహ్మణః ప్రతిదేహం ప్రత్యగాత్మభావ స్స్వభావః । స్వభావో

శాంకరభాష్యతత్త్వబోధిని: —

వ్యాఖ్యాతమైన ప్రశ్నసప్తకమునకు క్రమముగ సమాధానము చెప్పుచో ప్రశ్నించువాని యభీష్టము సిద్ధించు నను యూహతో నీశ్లోకము మొదలుకొని శ్రీకృష్ణభగవానులు చెప్పుచుండెను. "అక్షరం" నశించునది కాదుగాన పరమాత్మ అక్షర మని చెప్పబడును. "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి" అను శ్రుత్యనుసారము ద్యావాపృథివ్యాదినిరంకుశప్రశాసనము పరబ్రహ్మముకంటె నితరునియందు సంభవింపదుగాన పరబ్రహ్మమే యక్షర మనబడును.

ధావప్రదానరూపముగ నిర్ధారణచేసెను. నిరుపాధికబ్రహ్మమే యిట బ్రహ్మశబ్దముచే వివక్షితముగాని, సోపాధికబ్రహ్మము కాదని ప్రథమప్రశ్నమునకు సమాధానము నీశ్లోకమున జెప్పుచుండెను. "అక్షరం" నశించునది కాదుగానయక్షర మనబడును. మరియు సర్వమును వ్యాపించునదిగాన యక్షరమనబడును. "ఏత ద్వైతత దక్షరం గార్గి బ్రాహ్మణా అభివద న్త్యస్థూలమనణు" అనుశ్రుతితో నుపక్రమించి, "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః, నాన్యదతోఽస్తి ద్రష్టృ" అను శ్రుతితో మధ్యభాగమున పరామర్శించి, "ఏతస్మిన్ను ఖల్వక్షరే గార్గ్యాకాశఓతశ్చ ప్రోతశ్చ" అను శ్రుతితో నుపసంహరించెను. పైవిధముగ శ్రుత్యుక్తరీతిని సర్వోపాధిశూన్యము, సర్వమును శాసించునదియు, అవ్యాకృతాకాశాన్తమగు సమస్తప్రపంచమును ధరించునదియు, ఈ శరీరేంద్రియసంఘాతరూపమగు దేహమునందు విజ్ఞాతృరూపమునగు నిరుపాధికచైతన్య మీస్థలమున బ్రహ్మశబ్దముచే వివక్షితము. ఈ విషయమునే "పరమం" అను పదముచే వివరించుచుండెను. 'పరమం' స్వప్రకాశపరమానందరూపము. సర్వమును శాసించుట, సమస్తజడవర్గధారణము అను లింగము ఆ నిరుపాధికచైతన్యమునందే యుపపన్న మగుటవలనను "అక్షర మంబరాన్తధృతేః" అనున్యాయమువలనను, ఇట యక్షర మన నిరుపాధికచైతన్యమే అని గ్రహింపనగును. అట్లుగాక, శ్రుతిలింగాధికరణన్యాయమూలకమగు "రూఢి ర్యోగ మపహరతి" అను న్యాయముచే నెట్లు రథకారశబ్దముచే జాతివిశేషమును గ్రహించుచుంటిమో అట్లే ఇట యక్షరశబ్దముచే బ్రణవరూపమగు యక్షరమునే గ్రహింపవలెననుట తగదు. ఏమన:- ప్రణవమునందు సమస్తప్రపంచప్రశాసన, ధారణరూపమగు లింగము సంభవింపదు. మరియు "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అని బ్రహ్మమునకు అక్షరము విశేషణమగుటవలనను, ఇట అక్షరశబ్దార్థము బ్రహ్మమే కాని, ప్రణవము కాదు. "వర్షాసు రథకార ఆధీతే" అను స్థలమున జాతి విశేషమును గ్రహించుటలో నిట్టి లింగాసంభవ మేమియు లేదు. అనన్యథాసిద్ధమైన హేతువుచే శ్రుతికి బాధ "ఆకాశ స్తల్లింగాత్" అను చోట వివరింపబడెను. ఇచట విశేషమిది– అనన్యథాసిద్ధమగు లింగముచే శ్రుతికి బాధ సంభవింప నెచట యోగము (అవయవార్థము. అనగా శక్తిచే నర్థము.) సంభవించునో అచట ముఖ్యమగుటవలన యోగమే (అవయవశక్తియే) గ్రహింపనగును. యెట్లనిన! "ఆజ్యైస్స్తువతే, పృష్ఠైః స్తువతే" అను స్థలమునందువలె ప్రస్తుతము "అక్షరం" అనుచోట "న క్షరతీత్యక్షరం" అని యవయవార్థమును స్వీకరించి

శాంకరభాష్యమ్:—

ఽధ్యాత్మ ముచ్యతే। ఆత్మానం దేహ మధికృత్య ప్రత్యగాత్మతయా ప్రవృత్తం పరమార్థ బ్రహ్మావసానం వస్తు స్వభావోఽధ్యాత్మ ముచ్యతేఽధ్యాత్మశబ్దే నాభిధీయతే। భూతభావోద్భవకరో భూతానాం భావో భూతభావ స్తస్యోద్భవో భూతభావోద్భవ స్తం కరోతీతి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"రూఢి ర్యోగ మపహరతి" అను న్యాయముచే వర్ణసముదాయరూపమగు ఓంకారమును అక్షరశబ్దముచే నేల జెప్పరాదు? అని శంకింపవలదు. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అను స్థలమున యోంకారము పరముతో విశేషణమగుటచే గ్రహించుట యయుక్తము మరియు "పరమం" అను విశేషణము నిరతిశయపరబ్రహ్మరూపముగ అక్షరమునందే యుపపన్నతరము. ఇంతవరకు "కింతద్బ్రహ" అను ప్రథమప్రశ్నమునకు సమాధానము.

నశింపనిది బ్రహ్మము అని గ్రహింపనగును. ఎచట యోగము (అవయవశక్తి) కూడ సంభవింపదో యచట ఆకాశప్రాణాదిశబ్దములయందువలె గౌణీవృత్తిని గ్రహింపవలయును. "ఆ సమన్తాత్ కాశత ఇత్యాకాశః" అని యంతట ప్రకాశించున దాకాశమని ఆకాశశబ్దమువద్ద యోగము సంభవించుననెదవా? "స ఏవ గృహ్యతామితి పంచపాదీకృతః" అట్టి యోగమునే (అవయవార్థమునే) గ్రహింతురుగాక.యని పంచపాదికాకారులు జెప్పియే యుండిరి.

ఇంతవరకు "కిం త ద్బ్రహ్మ" అను ప్రశ్నకు "అక్షరం బ్రహ్మ పరమం" అని సమాధానము చెప్పబడెను. ఇపుడు "కి మధ్యాత్మం" అనుప్రశ్నకు సమాధానముగ "స్వభావోఽధ్యాత్మముచ్యతే" అని చెప్పుచుండెను.

ఏ అక్షరము బ్రహ్మ మని చెప్పబడెనో ఆబ్రహ్మముయొక్క స్వభావము "స్వః భావః స్వభావః" కర్మధారయసమాసమే యిచట చెప్పవలయును. "స్వస్య భావః స్వభావః" అని షష్ఠీతత్పురుష చెప్పవలదు. షష్ఠీతత్పురుషయందు పూర్వపద ముత్తరపదార్థమునందు లాక్షణికము, లక్షణావృత్తి లేని కర్మధారయవిగ్రహమే యాశ్రయింపవలయునని "నిషాదస్థపతిం యాజయేత్" అనుస్థలమున "నిషాదానాం స్థపతిః నిషాదస్థపతిః" అని విగ్రహమా ? "నిషాద శ్చాసౌ స్థపతిశ్చ నిషాదస్థపతిః" అని విగ్రహమా ? యని వికల్పించి షష్ఠీతత్పురుషలాక్షణిక మగుటచే కర్మధారయమునే యాశ్రయింపవలయునని మీమాంసయందు నిర్ణయింపబడెను. కాన "స్వభావః" అనుపదమునకు బ్రహ్మసంబంధి అని యర్థము జెప్పవలదు. మరేమనిన బ్రహ్మస్వరూపమే యని యర్థము స్వభావపదమునకు జెప్పనొప్పును. బ్రహ్మస్వరూపమే అధ్యాత్మము. అనగా "ఆత్మానం దేహ మధికృత్య భోక్తృతయా వర్తమానం అధ్యాత్మం" అని జెప్పబడును. శరీరము ననుసరించి భోక్తగ ప్రవర్తించు బ్రహ్మస్వరూపమే అధ్యాత్మ మనబడును. కరణగ్రామమాత్రము కాదు.

ఈ శ్లోకమునందు గల కర్మ శబ్దముచే యాగదానహోమాత్మకమగు వైదికకర్మయే వివక్షిత మని మూడవ ప్రశ్నకు సమాధానమును "భూతభావోద్భవకరః," అను ద్వితీయచరణముచే జెప్పుచుండెను.

ఉత్పత్తిధర్మము కల నిఖిలమైన జంగమస్థావరాత్మకమైన భూతముల యుత్పత్తిని, వృద్ధిని చేయునట్టి తత్తచ్ఛాస్త్ర విహితయజ్ఞ దాన హోమాత్మకత్యాగము కర్మశబ్దముచే చెప్పబడును. అందు దేవతోద్దేశముచే ద్రవ్యత్యాగము నిలుచుండి చేయు హోమము వషట్కారప్రయోగాంతము యాగ మనబడును.

శాంకరభాష్యమ్:—

భూతభావోద్భవకరో భూతవస్తూత్పత్తికర ఇత్యర్థః। విసర్గో విసర్జనం దేవతోద్దేశేన చరుపురోడాశాదే ర్ద్రవ్యస్య పరిత్యాగః స ఏష విసర్గలక్షణో యజ్ఞః కర్మసంజ్ఞితః కర్మశబ్దిత ఇత్యేతత్ । ఏతస్మాద్ధి బీజభూతా ద్వృష్ట్యాది క్రమేణ స్థావరజంగమాని భూతాన్యుద్భవంతి ॥౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అట్టి పరబ్రహ్మముయొక్క ప్రతిదేహమునం దగు ప్రత్యగాత్మభావమే స్వభావమనబడును. "స్వభావోఽధ్యాత్మ ముచ్యతే" ఆత్మ యన దేహము. అట్టి దేహమును అధికృత్య ప్రత్యగాత్మస్వరూపముతో ప్రవృత్త మగు పరమార్థబ్రహ్మావసానమగు స్వభావము అధ్యాత్మ మనబడును. అనగా, అధ్యాత్మ శబ్దముచే జెప్పబడును. ఇంతవరకు "కిమధ్యాత్మం" అను ద్వితీయ ప్రశ్నమునకు సమాధానము.

దేవతోద్దేశముచే ద్రవ్యత్యాగమే కూర్చునిచేయునది స్వాహాకారప్రయోగాంతము ఉత్తరపరిషేచనాంతము హోమమనబడును. పరస్వత్వాపత్తిపర్యంతము స్వస్వత్వత్యాగము దాన మనబడును, యజ్ఞదానహోమముల యందు మూటియందు త్యాగాంశమనుగతము. ఇట్టి కర్మకు భూతభావోద్భవకరత్వము "అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్య గాదిత్య ముపతిష్ఠతే। ఆదిత్యా జ్జాయతే వృష్టిః వృష్టే రన్నం తతః ప్రజాః" (అగ్నియందుంచబడిన యాహుతి సూర్యుని పొందును. సూర్యుని వలన వర్షము జనించును. వర్షమువలన యన్నము సంభవించును. అట్టి యన్నము వలన రేతస్సు జనించును. రేతోరూపమున పరిణమించిన యన్నము వలన ప్రజలు జనించెదరు). అను స్మృతి బోధించుచున్నది. "తేవా ఏతే ఆహుతీ హుతే ఉత్క్రామతః" ఇత్యాది శ్రుతియు పైవిషయమునే బోధించుచున్నది. ॥౩॥

శంకరానందీయము:— "కిం తద్బ్రహ్మ" ఇత్యాదికముచే చేయబడిన సప్తప్రశ్నలకు క్రమముగ ప్రష్టకు అర్థావబోధసౌకర్యమునిమిత్తము స్వాభిమతార్థమును శ్రీకృష్ణపరమాత్మ "అక్షరం" అను శ్లోకము మొదలుకొని చెప్పుచుండెను.

"అక్షరం" "అజో నిత్య శ్శాశ్వతః" అను శ్రుత్యుక్త రీతిని జ్ఞానాజ్ఞానముల చేతను, కాలము చేతను అన్యము చేతను నశింపనిది కాన యక్షరమ నబడును. లేక, అగ్ని అయఃపిండమును వ్యాపించినటుల అవ్యాకృతమును, తత్కార్యము సర్వమునువెలుపల లోపల వ్యాపించునదిగాన అక్షరమని చెప్పబడును. అదియేదనిన? సత్యజ్ఞానాది స్వరూపమైన పరబ్రహ్మము. అదియే "ఏతద్వైతదక్షరం గార్గి" అను శ్రుతిప్రతిపాదితము.

"ఓమిత్యేకాక్షరం" "సంయుక్త మేతత్ క్షర మక్షరంచ" అను శ్రుతిచే ప్రణవమునకు, అవ్యక్తమునకు అక్షరత్వము బోధింపబడుచుండ బ్రహ్మమునకే అక్షరత్వ మెటులసంభవమని శంకింపజనదు. అక్షరమగు బ్రహ్మమునకు వాచకమగుటవలన ప్రణవమునకు అక్షరత్వము. ప్రణవము నిత్యమగుటచే అక్షరత్వము కాదు. "తస్యప్రకృతిలీనస్య" అని ప్రణవమునకు నాశమే శ్రూయమాణము. క్షరాపేక్షచే నవ్యక్తమునకక్షరత్వము నిత్యమగుటచే నక్షరత్వము కాదు. "క్షరం ప్రధాన మమృతాక్షరం హర" అను శ్రుతి యవ్యక్తమునకు క్షరత్వమునే బోధించుచున్నది. కాన పరబ్రహ్మమునకే అక్షరత్వము, బ్రహ్మముకంటె వేరగునదేదియు అక్షరమైనది లేదు. బ్రహ్మమునకు సర్వశ్రైలక్షణ్యనిర్వాహార్థము "పరమం" అను విశేషణమీయబడెను. కాన "పరమం" అను విశేషణము వ్యర్థమని శంకింపనవసరములేదు. క్షరము అక్షరము

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"భూత సంజ్ఞితః" భూతములయొక్క భావము (వస్తుసద్భావము అదియు వస్తురూపమేయగును.) దానియొక్కయుత్పత్తిని జేయునది భూతభావోద్భవకరము అని చెప్పబడును. భూతవస్తూత్పత్తికరము అని పర్యవసితార్థము. అట్టి విసర్గము-దేవతోద్దేశముచే చేయబడు చరు పురోడాశాది ద్రవ్యపరిత్యాగము కర్మశబ్దముచే జెప్పబడును. ఇట్టి బీజభూతమగు విసర్గరూపయజ్ఞముచే వృష్ట్యాదిక్రమమున స్థావరజంగమాత్మకభూతజాతముత్పన్నమగుచున్నది. ॥3॥

పదార్థత్వరూపధర్మపురస్సరముగ నుభయ మేకమైయుండ "పరమం" అను విశేషణము బ్రహ్మమునకు నిరవయవత్వ, నిష్క్రియత్వ, నిత్యత్వ, నిఃసంగత్వ, నిత్యశుద్ధత్వ, నిరతిశయత్వ అతిసూక్ష్మత్వ, సద్ఘనత్వ, చిద్ఘనత్వ, ఆనందఘనత్వ, సర్వవ్యాపకత్వ, సర్వప్రకాశకత్వ, సర్వాధారత్వాది ధర్మములచే సర్వోత్తమత్వాపాదకమగును. బ్రహ్మమునకు సర్వోత్తమత్వమునే "మహతోఽవ్యక్తముత్తమం అవ్యక్తాత్తు పరఃపురుషః" అనుశ్రుతియు బోధించుచున్నది. ఇట్టి విశేషణవిశిష్టమగు అక్షరము పూర్వమునందు చెప్పబడిన బ్రహ్మశబ్దమునకు అర్థము. ఇట్లు బ్రహ్మపదముయొక్క యర్థమును చెప్పి "స్వభావః" అనుదానిచే "అధ్యాత్మం" అనుపదమున కర్థమును చెప్పుచుండెను. "ఆత్మానం దేహం, బుద్ధ్యన్తం బ్రహ్మాండం రవిరివ ప్రకాశయితుం అధిష్ఠాయ తిష్ఠతీత్యధ్యాత్మం" దేహమును, బుద్ధ్యన్తబ్రహ్మాండమును సూర్యుడువలె ప్రకాశింపజేయుటకు అధిష్ఠించియుండువాడు కాన "అధ్యాత్మం" అని చెప్పబడును. అది బ్రహ్మముయొక్క స్వభావము (స్వరూపమే) - స్వభావమనగ అధ్యాత్మమే. ప్రత్యక్త్వము "స్వయమేవ వసతీతి స్వభావః" పరబ్రహ్మము స్వయముగనే ప్రతిశరీరమునందు ప్రత్యగ్రూపముచే అహమర్థమైనను ఆత్మ జ్ఞాత యగుచున్నది. ఎట్లు ఘటాదుల యందుండా కాశము మహాకాశస్వభావమో అట్లే బ్రహ్మాదిస్తంబపర్యంత శరీరముల యందహమర్థముగ విద్యమానమైన చైతన్యము బ్రహ్మచైతన్యమే. అందువలననే "తత్త్వమసి" ఇత్యాదివాక్యములకు వాటికైక్యప్రతిపాదనయందు ప్రవృత్తి కాన పరబ్రహ్మముయొక్క స్వభావమే అధ్యాత్మమనబడును. శ్రోత్రేంద్రియాదు లధ్యాత్మములు కావు.

"భూతభావోద్భవకరః" ఇచట ఉద్భవశబ్దము ఉపలక్షకము. అనగా వక్ష్యమాణార్థమున ఏకదేశకథనము. వక్ష్యమాణార్థములగు జరామరణములను గ్రహించును. జంగమస్థావరాత్మకమగు భూతములనెడి భావముల యుత్పత్తిని, జరామరణములను చేయునది అనియర్థము. విసర్గమన దేవతోద్దేశముగ ద్రవ్యత్యాగము. (యజ్ఞము) ఆయజ్ఞము శ్రౌతస్మార్తాగ్ని స్వరూపము. అట్టి యజ్ఞము వృష్ట్యాదిద్వారమున సర్వప్రాణి జన్మకారణము. అట్టిదే కర్మ అని పేరుగలది. చలనమాత్రము కర్మ కాదు. ॥3॥

భాష్యార్క దీపిక:— క్రమముగ జేయబడిన ప్రశ్నలకు క్రమముగ సమాధానము జెప్పినచో ప్రశ్నకర్త యభిమతము, సుఖముగ ప్రశ్నోత్తరదానము సిద్ధించునను యభిప్రాయము కలవాడై శ్రీకృష్ణపరమాత్మ యర్జున కృతప్రశ్నలకు క్రమముగ నిర్ణయము లొసగుచు చెప్పుచుండెను. అందు "తే బ్రహ్మ తద్విదుః కృత్స్నం" అను స్థలమున నిర్గుణబ్రహ్మవివక్షితమని ప్రథమప్రశ్న కుత్తరముమ "అక్షరం బ్రహ్మ పరమం" అనుదానిచే చెప్పుచుండెను.

"కింతద్బ్రహ్మ" అని యేది చెప్పబడెనో అది అక్షరము. "అక్షరం" అనగా "న క్షరతీ త్యక్ష

రం'' వినాశరహితము. "అశ్నుతే= వ్యాప్నోతి సర్వ మితి వ్యుత్పత్త్యావాఽక్షరం'' అంతట వ్యాపించునది. "అక్షరం'' అను శబ్దము రూఢిచే ఓంకారమును బోధించును. కాన నిచట "అక్షరం'' అను శబ్దమువలన ఓంకారబోధ కలుగునను భ్రమను "పరమం'' అను విశేషణముచే నివారించుచుండెను, నిరతిశయపరత్వము పృథివ్యాద్యాకాశాంత వికారసముదాయముయొక్క ధారణవలన పరమాత్మకే సంభవించును. ఈ విషయమే "అక్షర మంబరాంతధృతేః'' "కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చ'' ఇతి "సహోవా చైత ద్వైత దక్షరం గార్గి బ్రాహ్మణా అభివ దన్త్య స్థూల మనణు'' ఇది ఈ శ్రుతివాక్యమునందుండు అక్షరశబ్దముచే ఓంకారరూపవర్ణము చెప్పబడునా? లేక పరమేశ్వరుడు చెప్పబడునా? అని సంశయము.

ఇట్లు సంశయముప్రాప్తింప "అక్షరసమామ్నాయః'' ఇత్యాది స్థలములయందు అక్షరశబ్దమువర్ణమునందు ప్రసిద్ధముగుటవలన ప్రసిద్ధినతిక్రమించుట యయుక్తముగుటవలన "ఓంకారఏవేదగ్ంసర్వం'' ఇత్యాది శ్రుత్యంతర స్థలములయందు వర్ణముకూడ నుపాస్యముగ సర్వాత్మత్వావధారణవలన యీశ్రుతియందుగల అక్షరశబ్దముచే వర్ణమేచెప్పబడునని పూర్వపక్షము ప్రాప్తింప "అక్షరమంబరాంతధృతేః'' అనుసిద్ధాంత సూత్రము చెప్పబడెను. అనగా పరమాత్మయే యీశ్రుతియందుగల యక్షరశబ్దముచే చెప్పబడును. ఎందువలననెనగా "అంబరాంతధృతేః'' పృథివ్యాద్యాకాశాంతధారణవలన – అనిహేతువు చెప్పబడెను. కాలత్రయప్రవిభక్త పృథివ్యాదిసమస్తవికారజాతమునను "ఆకాశమేవ తదోతంచ ప్రోతంచ'' అని ఆకాశ ప్రతిష్ఠత్వమునుచెప్పి "కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చ'' ఆకాశముదేనియందోతము, ప్రోతము ? అను ప్రశ్నకు సమాధానముగ నీయక్షరము చెప్పబడెను. అట్లే "ఏతస్మిన్ ఖల్వక్షరేగార్గ్యాకాశ ఓతశ్చ ప్రోతశ్చ'' ఓగార్గి యక్షరమునందే ఆకాశము ఓతము, ప్రోతము అని యుపసంహరింబడెను. ఈ యంబరాంతధృతి బ్రహ్మముకంటె వేరగు మరియొకదానికి సంభవింపదు. "ఓంకార ఏవేదం సర్వం'' అని ఓంకారమే సర్వమని చెప్పుట ఓంకారము బ్రహ్మప్రతిపత్తికి సాధనమగుగుటవలన ఓంకారస్తుతినిమిత్తమని గ్రహింపనగును. కాన "న క్షర త్యశ్నుతే వా'' అని నిత్యత్వవ్యాప్తిమత్త్వములచే అక్షరమనగ పరబ్రహ్మమేయని గ్రహింపనగును. "పరమం'' అను విశేషణముచే- "అక్షరం'' అనుదానిచే జీవుడుగాని, ప్రధానముగాని గ్రహింపనగునని భ్రమ తొలగింపబడెను.

"కిం కర్మ'' అను మూడవప్రశ్నకు సమాధానమును "భూతభావోద్భవకరః'' అను దానిచే చెప్పుచుండెను. "భావశ్చ ఉద్భవశ్చ భావోద్భవౌ భూతానాం భావోద్భవౌ భూతభావోద్భవౌ, తౌ కరో తీతి భూతభావోద్భవకరః'' అను విగ్రహము నాశ్రయించి భూతముల యుత్పత్తిని, వృద్ధిని చేయునట్టి విసర్గము కర్మశబ్దముచే చెప్పబడును. విసర్గమనగ దేవతోద్దేశముగ చరుపురోడాశాది ద్రవ్యత్యాగము. అది యజ్ఞాదిరూపము వేదవిహితము. అట్టి విసర్గమే కర్మయను శబ్దముచే నాచే చెప్పబడెను, ఈ విషయమునే "అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే। ఆదిత్యా జ్జాయతే వృష్టిః వృష్టే రన్నం తతః ప్రజాః'' అను స్మృతియు బోధించుచున్నది.

పరమార్థప్రపః:— అధ్యాత్మస్వరూపమును "స్వభావః'' అనుదానిచే చెప్పుచుండెను. "స్వస్యైవ బ్రహ్మణ ఏవాంశతో జీవరూపేణ భవనం స్వభావః'' బ్రహ్మముయొక్క యంశవలన జీవరూపముగ నగుటయే స్వభావ మనబడును. ఆ స్వభావమే దేహము ననుసరించి భోక్తగ వర్తమానమై "అధ్యాత్మం'' అని చెప్పబడుచున్నది. లేక "ఇన్దతి జానా తీన్ద్రో౽న్తరాత్మా త మధి కృత్య వర్తత ఇతీన్ద్రియ మధ్యాత్మ మిత్యధ్యాత్మవిదః'' తెలిసికొనునది యంతరాత్మ, దానిని యనుసరించి యుండునది యింద్రియము. అదియే యధ్యాత్మ మనబడునని యధ్యాత్మవేత్తలు చెప్పెదరు. ॥3॥

గీ॥ అధిభూతం క్షరో భావః పురుష శ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోఽహ మేవాత్ర దేహే దేహభృతాం వర! ॥౪॥

పదవిభాగము:— అధిభూతం— క్షరః— భావః— పురుషః— చ— అధిదైవతం— అధియజ్ఞః— అహం— ఏవ— అత్ర— దేహే— దేహభృతాం— వర! ॥౪॥

ప్రతిపదార్థము:— క్షరః=నశించెడిస్వభావముగల; భావః=సమస్తముగుజనిమద్వస్తువు; అధిభూతం=అధిభూతము; పురుషశ్చ=హిరణ్యగర్భుడు; అధిదైవతం=అధిదైవతము; అత్ర=ఈ; దేహే=దేహమునందు; అహమేవ=నేనే; అధియజ్ఞః=అధియజ్ఞము. ॥౪॥

శాంకరభాష్యమ్:—

అధిభూత మితి । ప్రాణిజాత మధికృత్య భవతీతి । కోఽసౌ క్షరః క్షరతీతి క్షరో వినాశీ యత్కించి జ్జనిమ ద్వస్త్వి వ్యర్థః । పురుషః పూర్ణ మనేన సర్వమితి పురి శయనా ద్వా పురుష ఆదిత్యాన్తర్గతో హిరణ్యగర్భ స్సర్వప్రాణికరణానా మనుగ్రాహక స్సోఽధిదైవతమ్ । అధియజ్ఞ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈశ్లోకముచే నర్జునుని ప్రశ్నలలో మూడు ప్రశ్నలకు సమాధానము చెప్పుచుండెను. అందు "అధిభూత మన నేమి?" అను ప్రశ్నకు ప్రథమమున సమాధాన మొసగుచుండెను. ప్రాణిజాతము ననుసరించియుండునది అధిభూత మనబడును. అది యేది యనిన? నశించునట్టి పుట్టువుగల వస్తువు. "అధిదైవ మన నేమి?" అను ప్రశ్నకు సమాధానమును

—• ౮వ అధ్యాయము ౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మొదటి మూడుప్రశ్నలకు సమాధానమును చెప్పి, యిపుడు తరువాయి మూడుప్రశ్నలకు "అధిభూతం" అను శ్లోకముచే సమాధానమును చెప్పుచుండెను.

నశించునది "క్షరః" అనబడును. అట్టిది పుట్టుకకల వస్తువు. అట్టి ప్రాణిజాతము ననుసరించి యుండునది అధి భూతమనబడును. వ్యష్టి సర్వకరణానుగ్రాహకుడు, సమష్టిలింగాత్మ, అగు హిరణ్యగర్భుడు పురుషుడు. "ఆత్మైవేద మగ్ర ఆసీ త్పురుషవిధః" ఇత్యుపక్రమ్య "స యత్ పూర్వోఽస్మా త్సర్వస్మా త్సర్వా న్ పాప్మన ఔష త్తస్మాత్పురుషః" ఇత్యాదిశ్రుతిచే అట్టిపురుషుడు చెప్పబడుచున్నాడు. శ్లోకమునందుగల చకారముచే "స వై శరీరీ ప్రథమః స వై పురుష ఉచ్యతే । ఆదికర్తా స భూతానాం బ్రహ్మాగ్రే సమవర్తత" ఇత్యాది స్మృతిచే గూడ నట్టిపురుషుడు చెప్పబడునని బోధితము. ఆదిత్యాదిదేవతల ననుసరించి చక్షురాదికరణముల ననుగ్రహించునది గాన నట్టిపురుషుడు అధిదైవత మనబడును.

అట్లే "యజ్ఞో వై విష్ణుః" అను శ్రుతివలన సర్వయజ్ఞాధిష్ఠాతయు, సర్వయజ్ఞఫలదాతయు, సర్వయజ్ఞాభిమానియు, నగు విష్ణువే అధి యజ్ఞమనబడును. అట్టి యధియజ్ఞస్వరూపమగు విష్ణువును నేనే (వాసుదేవుడే). నాకంటె వేరగు వాడెవడును లేడు. కనుకనే పరబ్రహ్మముయొక్క సకాశమునుండి యత్యంతాభేదము చేతనే తెలిసికొనదగిన వాడనని "కథం" అని వ్యాఖ్యానింపబడెను. ఆపరబ్రహ్మమే ఈమనుష్యదేహమునందు బుద్ధ్యాది వ్యతిరిక్తుడై విష్ణురూపమగుటవలన యజ్ఞరూపముతోనుండెను. ఈచెప్పుటచే నాతడు యీదేహమునందుండెనా ? దేహముకంటె వెలుపలనుండెనా ? దేహమునందే యుండినచో అది బుద్ధ్యాదికమా ? తద్వ్యతిరిక్తమా ? అనుసందేహము తొలిగింపబడెను. యజ్ఞము మనుష్యదేహముచే చేయదగినదగుటవలన యజ్ఞమునకు మనుష్యదేహమునందుండుట సంభవమే. ఈవిషయమును "పురుషో వై యజ్ఞః పురు

శాంకరభాష్యమ్:—

స్సర్వయజ్ఞాభిమానినీ దేవతా విష్ణ్వాఖ్యా "యజ్ఞో వై విష్ణుః" ఇతి శ్రుతేః। సహి విష్ణురహమేవాత్రాస్మిన్దేహే యో యజ్ఞ స్తస్యాహ మధియజ్ఞో యజ్ఞోహి దేహనిర్వర్త్యత్వేన దేహసమవాయీతి దేహాధికరణో భవతి దేహభృతాం వర! ॥౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"పురుష శ్చాధిదైవతం" అనునది సమాధానము. దీనిచే సర్వము నిండియుండునది కాన "పురుషః" అని చెప్పబడుచున్నది. లేక, "పురి శయనా త్పురుషః" ఆదిత్యాన్త వైరాజదేహము నధిష్ఠించి ఆదిత్యమండలాదుల యంతరవస్థితుడైన వ్యష్టికరణానుగ్రాహకుడైన లింగాత్మ

ష స్తేన యజ్ఞో యదేనం పురుషస్తేన తనుతే" అను శ్రుతి బోధించుచున్నది. "దేహభృతాంవర!" అని యర్జునుని సంబోధించుటచే ప్రతిక్షణము నాసంభాషణవలన నీవు యీబోధకుయోగ్యుడవు, కృతకృత్యుడవు అయితివి అని శ్రీకృష్ణపరమాత్మ యర్జునుని ప్రోత్సహించుచుండెను. అర్జునునకు సర్వప్రాణిశ్రేష్ఠత్వము భగవదనుగ్రహాతిశయభాజనమగుటవలన ప్రసిద్ధమే. ॥౪॥

శంకరానందీయము:— నశించు ప్రతిపదార్థము 'అధిభూత' మనబడును. ఈవిషయమున కారణము కార్యము అనెడి భేదను వివక్షితము కాదు, మరేమనిన స్వస్వకర్మ ననుసరించి ఆయా పుట్టు వస్తువులెల్ల అధిభూత మనంబడునని అర్థము. 'పురుషః' దీనిచే సర్వకార్యజాతము పూర్ణము గాన 'పురుషః' అని చెప్పబడుచుండును. లేదా శరీరమునందు శయనించు నదగుటవలన 'పురుషః' అని చెప్పబడుచున్నది. అట్టి 'హిరణ్యగర్భ స్సమవర్త తాగ్రే భూతస్య' అను శ్రుత్యుక్తపురుషుడే అధిదైవ మనంబడును. అతడు సమష్టివ్యష్టి సర్వశరీరాభిమాని, సర్వప్రాణకరణములకు శక్తిప్రదాత, కాన అధిదైవ మనంబడును. క్రియాంతరము మాత్రము లేదు. 'పురుష శ్చాధిదైవతమ్' అను చోట చ కారముచే శ్రోత్రాదిచతుర్దశ కరణప్రవర్తక దిగ్వాతార్కాదుల గ్రహింపనగును. 'అధియజ్ఞః' చేయబడు శ్రౌతస్మార్తక్రియాత్మకమైన పూర్వోక్తం బగు విసర్గమే యజ్ఞమనంబడును. దాని ననుసరించియుండు నేనే అధియజ్ఞమనంబడుదును. సర్వప్రాణుల యొక్క కర్మ తత్ఫల విభాగమును, తత్పరిపాకమును, ప్రవృత్తిని నివృత్తిని చేయువాడనై యీసమస్తప్రాణిజాతములయొక్క దేహమునందు నేనే నియంతనైయుంటిని. యని అర్థము "స్వభావం పచతి విశ్వయోనిః పచ్యాంశ్చ సర్వా న్పరిణామయే ద్యః। ఏషోంత ర్యా మ్యేష యోనిః ఏష ఏవ సాధు కర్మ కారయతి" అను శ్రుతులును పైవిషయమునే బోధించుచున్నవి. "పృథివ్యాం తిష్ఠన్" ఇత్యాది శ్రుతులయందు నిరాకారత్వముచే నియమ్యాభిన్నత్వము. స్వరూపముచే భిన్నత్వము తదగోచరత్వము పృథివ్యాది నియంతయగు నాకు శ్రుతిచేతనే చెప్పబడుచుండెను. కాన నాకు సహకారత్వము కాని, వికారిత్వాదికము కాని లేదు. ఇటులనే ఈదేహమునందుంటిని అని భావము. ఇట్లు అధ్యాత్మకర్మ అధిభూత అధిదై వాధియజ్ఞస్వరూపముచే సర్వస్వరూపముగ నుండియున్న పరబ్రహ్మము నిశ్శేషముగ విడిచిపెట్టబడిన విపరీతప్రత్యయముచే సర్వము బ్రహ్మమే అనెడి ఏకవృత్తిచే జరామరణమోక్షకామునిచేతను నిత్యము ఉపాసింపదగినది–అని ప్రశ్న ప్రతివచనములకు తాత్పర్యార్థము ॥౪॥

పరమార్థప్రపా:— నశ్వరమగు దేహాదిపదార్థము భూతమనబడును. ప్రాణిని (జీవుని) అనుసరించియుండునది అధిభూత మనబడును. లేక ద్రష్టవ్యశ్రోతవ్యాదికముగానిది యధిభూతమనబడును. "త దేతన్మండలం తపతి య శ్చాస్మి న్మండలే పురుషః" అను శ్రుతిప్రసిద్ధమైన సూర్యమండలమధ్యవర్తియగు వైరాజపురుషుడు స్వస్వాంశభూతసర్వదేవతల కధిపతి– అధిదైవ మనబడును. ఈ దేహమునం దంతర్యామిగ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పురుషుడనబడును. అతడాదిత్యమండలాంతర్గతుడు సర్వప్రాణికరణానుగ్రాహకుడగు హిరణ్యగర్భుడధిదైవ మనబడును. "అధియజ్ఞు డెవడు?" అను ప్రశ్నకు సమాధానమును చెప్పుచుండెను. సర్వయజ్ఞాభిమాని యగు విష్ణువు అనెడి దేవతయే "యజ్ఞో వై విష్ణుః"

నుండిన నేనే అధియజ్ఞమనబడుదును. అధియజ్ఞస్వరూపుడనగు నేనే యజ్ఞాదికర్మప్రవర్తకుడను, యజ్ఞాదికర్మల ఫలము నిచ్చువాడను. అట్లగుచో అధ్యాత్మ, అధియజ్ఞముల కేమిభేదము కలదని శంకింపజనదు. అంతర్యామి కసంగత్వాదిగుణముల చేతను, తాదాత్మ్యము చేతను జీవవైలక్షణ్యము కలదని "ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే। తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యోఽభిచాకశీతి" (రావణ భాష్యం) లౌకికపక్షద్వయదృష్టాంతముచే జీవపరమాత్మ లీశ్రుతిచే స్తుతింపబడుచుండిరి. ఎట్లనిన? లోకమునందు శోభనగమనముగల రెండు పక్షులు సమానమైన సంబంధము కలవై, సమానమైన స్ఫురణకలవై సమానమగు దేహాకారవృక్షము నాశ్రయించియుండును. ఆ రెంటిలో నొకటి స్వాదుతరమైన ఫలము ననుభవించును. మరియొకటి యట్టి ఫలము ననుభవింపక చూచుచుండును. అట్లే సువర్ణస్థానీయమగు క్షేత్రజ్ఞపరమాత్మలు సమానసంబంధము కలవారలు. ఆ పరమాత్మయే జీవాత్మకు స్వరూపము. (తాదాత్మ్య) పరస్పరమైకాత్మ్యముకనుకనే "సఖాయా" ఎవని కేస్ఫురణమో యితరునకు కూడ యట్టి స్ఫురణమే కలదు. ఒకస్వరూపమైన ప్రకాశకలవారు. అని శ్రుతి బోధించుచున్నది. అధియజ్ఞస్వరూపము, అంతకాలమున స్వరూపప్రాప్తి అను విషయమును ఈ ప్రశ్నద్వయము బహుశ్రుతిసమ్మతము. ఈవిషయమును తిరిగి వ్యాఖ్యానింపగలడు. అందు ఘోరాంగిరసప్రతిపాదితమైన అధియజ్ఞమును, అంతకాలప్రాప్తిని యుపదేశించుటకు "అధియజ్ఞోఽహం" అని చెప్పుచుండెను.

'భో దేహభృతాం వర! ఓదేహధారులలో శ్రేష్ఠుడా! ఈదేహమునందు శారీరయాగము ననుసరించి యుండువాడధియజ్ఞుడు, అంతర్యాగముకల పురుషునకంతర్యామిగ నుండి, తత్ప్రవర్తకుడను, తత్ఫలసంపాదకుడను అగు వాడను నేనే యని యర్థము. ఈవిషయము టిప్పణులయందు 'అధ్యాత్మాదిత్రయాభిజ్ఞో వ్యవహారం కరోతి యః। శారీరం స చ యజ్ఞోఽస్య తం యజ్ఞం పురుషం విదుః ॥౧॥ సంస్కృతాన్నస్య యా గ్రాసా నేవం సత్పురుషాఽశ్నుతే। తా ఏ వాహుతయః ప్రోక్తా జాఠరే జాతవేదసి' అధ్యాత్మాధిభూతాధిదైవములను తెలిసిన వాడై యెవడు వ్యవహారమును చేయునో అట్టివానికిది శారీరయజ్ఞ మనబడును. దానినే యజ్ఞరూపమైన పురుషునిగ తెలిసికొనుచున్నారు. వైశ్వదేవముచే సంస్కృతమైన యన్నమునుండి యే కబళములను అధ్యాత్మాధిభూతాధిదైవములను తెలిసిన పురుషుడు భక్షించినచో ఆగ్రాసములు జాతరాగ్నియందుంచు ఆహుతులని చెప్పబడుచున్నవి. 'పిపాసితోఽంభః పిబతి సోమపాన మథాస్య తత్। యజ్ఞస్యోపసద శ్చేష్టా మృతి శ్చావభృథోఽస్య చ ॥౩॥ దప్పికతో గూడినవాడై యుదకపానము నొనరించిన యది యీపురుషునకు సోమపానమని చెప్పబడుచున్నది. అట్టి పురుషుని చేష్ట ఉపసదమనియు, మరణము అవభృథమనియు చెప్పబడుచున్నది. ఛాందోగ్యోపనిషత్తునందు గూడ 'స య దశిశిషతి యత్పిపాసతి యన్న రమతే తా అస్య దీక్షాః। అథ య దశ్నాతి యత్పిబతి య ద్రమతే యదుపసదై రేత్యథ యద్ధసతి య జ్జక్షతి యన్మైథునం చరతి స్తుతశస్త్రై రేవ త దేత్యథ య త్తపో దాన మార్జవ మహింసా సత్యవచన మితి తా అస్య దక్షిణా స్తస్మా దాహుః సోష్య త్యసోష్టేతి పునరుత్పాదన మేవాస్య త న్మరణమేవావభృథ స్తద్ధైతద్ఘోర అంగిరసః కృష్ణాయ దేవకీపుత్రా యోక్త్వోవాచాపిపాస ఏవ బభూవ సోఽన్తవేలాయామేత త్త్రయం ప్రతిపద్యేతాక్షిత మస్యచ్యుత మసి ప్రాణసంశిత మసీతి। తత్రైతే ద్వే ఋచౌ భవతః। ఆదిత్ప్రత్నస్య రేతస ఉద్వయం తమసస్పరి జ్యోతిః పశ్యన్త ఉత్తరం"

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అను శ్రుత్యుక్తప్రకారము అధియజ్ఞ మనబడును. ఆవిష్ణువును నేనే. ఓదేహధారులలో శ్రేష్ఠుడా! యజ్ఞ మనునది దేహముచే నాచరింపబడి, దేహసమవాయియై దేహాధికరణకమై యగును. అట్టి యజ్ఞము ననుసరించి యీదేహమునందుండు నేనే అధియజ్ఞ మనబడుదును. ॥4॥

శరీరసంబంధమైనయజ్ఞమును సంపాదించెడియే పురుషుడు తనను యజ్ఞమునుగా తలచునో అట్టివాడు ఆకలిచే కృశించినవాడై భుజించుటకు యిచ్ఛయించునో, అట్లే దాహముచే పీడితుడై ఉదకమును పానముచేయుటకు యిచ్ఛయించునో, కనుకనే క్షుత్పిపాసాజనితదుఃఖము ననుభవించునో అట్టి యజ్ఞపురుషున కవి దీక్ష యనబడును. ఎందుకనిన? దీక్షయందు అశనాపిపాసలచే క్లేశమే అనుభవింపబడును. కాన నది దీక్షయే. యజ్ఞమన్ననో, దీక్షోపసదస్తుతశస్త్రదక్షిణాదులచే సంపాదింపబడును. అందు దీక్ష అనునది వ్రతవిశేషము. ఆయజ్ఞపురుషుడు "ఓం" అని దేనిని భక్షించునో, అట్లే యేజలమును పానము చేయునో, అట్లే అన్నపానాదులచే సుఖము ననుభవించునో ఇవన్నియు ఉపసదము లనబడును. అట్టి ఉపసదములతో కూడినవాడై యజ్ఞపురుషుడుండును. ఉపసదమనగా యజ్ఞమువలన జనించిన సుఖానుభవము. యజ్ఞపురుషుడు వినోదకథలచే మందహాసముతోగూడిన ముఖోపక్రమమును చేయునో, అట్లే క్రీడించునో, అట్లే ఋతుకాలమున భార్యానుగమనము చేయునో ఇవన్నియు స్తుతశస్త్రములు. (స్తోత్రములు పదురెండు, శస్త్రములు పదురెండు) అని శ్రుతి బోధించుచున్నది. స్తుతమనగ ఉద్గాతయను ఋత్విక్కుయొక్క స్తావకవాక్య సందర్భము. అట్లే హోతృపాఠ్యమానఋక్సందర్భము శస్త్రమనంబడును.) ఋక్శాఖీయ బ్రాహ్మణమందు "అథాను స్తుతశస్త్రయో రేషై కాహికం ప్రాతస్సవనం త్రైస్తుతశస్త్రై రేతి ప్రవర్తతే" అని చెప్పబడెను. తపస్సు, దానము, ఆర్జవము, అహింస, సత్యవచనము యివన్నియు దక్షిణలు. యజ్ఞపురుషస్వరూప మిట్టిదిగాన,! ఈయజ్ఞపురుషునకు చరమదేహోత్పత్తిని, శ్రుత్యంతరము "సోష్యత్యసోష్ట" అనునది బోధించుచున్నది. అట్టియజ్ఞపురుషునియొక్క ఆదేహాతిక్రమానంతరము తన్మాత దుఃఖింపగలదు. ప్రసవింపగలదు. అట్లే ప్రసవించెను. అని! ఉపక్రమము మాత్రము చూపబడెను. ఈవిషయము పూర్వమునందే చెప్పబడెను.

'తస్య హైతస్య హృదయస్య పంచ దేవతాః సుషయస్తథా పంచబ్రహ్మ పురుషాన్వే వేద తస్య కులే వీరో జాయతే ప్రతిపద్యతే స్వర్గంలోకం' ఈశ్రుతియందు గల వీరశబ్దముచే షడ్రిపుజయశీలుడు చెప్పబడెను. హృదయమునకు ఐదు రంధ్రములు గలవు. ఒక్కొక్క రంధ్రమువద్ద ఒక్కొక్కదేవత కలదు. వారైదుగురుబ్రహ్మపురుషులు. వారిని తెలిసికొను వాని కులమునందు అరిషడ్వర్గమును జయించు స్వభావముకల పుత్రుడు జనించును. పంచబ్రహ్మపురుషులను తెలిసికొనినవాడు స్వర్గలోకమును పొందును. అట్లే బృహదారణ్యకమునందు కూడ "తస్మాత్పుత్రమనుశిష్టం లోక్యమాహుస్త్వం బ్రహ్మత్వం యజ్ఞస్త్వంలోకః" తండ్రిచే ప్రశ్నింపబడి కుమారుడు నేను బ్రహ్మను, నేను యజ్ఞము, నేను లోకము అని సమాధానము చెప్పెను. ఇదియే చరమదేహోత్పన్నమగు యజ్ఞపురుషునియొక్క పరీక్ష. ఈతీరున పునరుత్పాదనమే యజ్ఞపురుషునియొక్కజన్మ. అతని దేహపరిత్యాగమే అవభృథము. (యజ్ఞాంతస్నానము.) ఈచెప్పబడిన విషయమును ఘోరాంగిరసుడు దేవకీపుత్రుడగు భగవత్స్వరూపమైన శ్రీకృష్ణునికొరకు చెప్పి తిరిగి ఇట్లుచెప్పదొడగెను. "ఆయజ్ఞపురుషుడు రసాదిసకలవిషయేచ్ఛారహితు డాయెను. అనంతరము ప్రాణలయసమయమునందు భగవదుపదిష్టమైన "అక్షితమసి, అచ్యుతమసి, ప్రాణశంసితమసి" అను యజుర్మంత్రత్రయమును పొందెను. అనగా ఓజీవుడా నీవు "అక్షితం" అపరిచ్ఛిన్నము అఖండైకరసమైతివి. అట్లే "అచ్యుతం"

గీ॥ అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥ ॥౫॥

పదవిభాగము :— అన్తకాలే- చ- మాం- ఏవ- స్మరన్- ముక్త్వా- కలేబరం- యః- ప్రయాతి- సః- మద్భావం- యాతి- న- అస్తి- అత్ర- సంశయః ॥౫॥

ప్రతిపదార్థము :— యః=ఎవడు; అన్తకాలేచ=మరణకాలమునందు; మామేవ=పరమేశ్వరునే; స్మరన్=స్మరించుచు; కలేబరం=శరీరమును; ముక్త్వా=విడచి; ప్రయాతి=వెళ్ళునో; సః=అట్టివాడు; మద్భావం=వైష్ణవతత్త్వమును; యాతి=పొందుచున్నాడు; అత్ర=ఈవిషయమై; సంశయః=సంశయము; నాస్తి=లేదు; ॥౫॥

శాంకరభాష్యమ్:—

అంతకాల ఇతి । అంతకాలే చ మరణకాలే మామేవ పరమేశ్వరం విష్ణుం స్మరన్ముక్త్వా పరిత్యజ్య కలేబరం శరీరం యః ప్రయాతి గచ్ఛతి స మద్భావం వైష్ణవం తత్త్వం యాతి నాస్తి న విద్యతేఽత్రాస్మిన్నర్థే సంశయో యాతి వా నవేతి ॥ ॥౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎవడు మరణకాలమునందు సర్వవ్యాపకమగు పరమేశ్వరునే స్మరించుచు శరీరమును విడచి బయలుదేరునో అట్టివాడు పరమేశ్వరతత్త్వమును పొందుచున్నాడు. ఈ విషయమై సంశయము లేదు. తప్పక పరమేశ్వరతత్త్వమును పొందును. ॥౫॥

అప్రచ్యుతస్వభావముకలవాడవైతివి. అట్లే శ్వాసవాయువుచేతను సూక్ష్మీకృతుడవై లుప్తప్రాణాపానాదులు కలవాడవైతివి. ఇట్టుల నీవు 'తత్త్వమసి' మహావాక్యసందర్భము అని తెలిసికొనుము. ఈవిషయము నారాయణోపనిషత్తునందు "తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా యజమానః శ్రద్ధా పత్నీ శరీర మిధ్మ మురో వేది ర్లోమాని బర్హి ర్వేద శ్శిఖా హృదయం యూపః కామ ఆజ్యం మన్యుః పశు స్తపోఽగ్ని ర్దమ శ్శమయితా దక్షిణా వాగ్ఘోతా ప్రాణ ఉద్గాతా చక్షు రధ్వర్యు ర్మనో బ్రహ్మా శ్రోత్ర మగ్నీ ద్యావ ద్ధ్రియతే సా దీక్షా యదశ్నాతి తద్ధవి ర్య త్పిబతి తదస్య సోమపానం య ద్రమతే త దుపసదః" ఇట్టి విద్వాంసునియొక్క యజ్ఞమున కాత్మయజమానుడు. శ్రద్ధయే పత్ని. శరీరమే యిధ్మము. వక్షస్థలమే వేది. లోమములే బర్హిస్సు. శిఖయే వేదము. హృదయమే యూపము. కామమే ఆజ్యము. మన్యువే (కోపమే) పశువు. తపస్సే అగ్ని. దమమే శమయిత. వాక్కే దక్షిణ. ప్రాణమే హోత. ఉద్గాత చక్షుస్సు. మనస్సు ఆధ్వర్యము. శ్రోత్రము బ్రహ్మ. ఎంతవరకు కన్నులనుధరించునో అంతపర్యంతము దీక్ష. దేనిని భక్షించునో అది హవిస్సు. దేనిని పానముచేయునో అది యితనికి సోమపానము. దేనితో క్రీడించునో అది యుపసదము. అని స్పష్టముగ జెప్పబడెను. ॥౪॥

—• ౮వ అధ్యాయము ౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము :— ఇపుడు "ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః" ప్రాణప్రయాణకాలమునందు నియతమైన యంతఃకరణకలవారిచే నీవెట్లు తెలిసికొనదగుదువు ? అను సప్తమప్రశ్నకు "అన్తకాలే" అను శ్లోకముచే సమాధానమును చెప్పుచుండెను.

భగవంతుడను, వాసుదేవుడను, అధియజ్ఞస్వరూపుడను అగు నన్నే సగుణునిగనో, అక్షరపరబ్రహ్మ స్వరూపమును, నిర్గుణునిగనో యెల్లప్పుడు ధ్యానించుచు (అధ్యాత్మాదికమును మాత్రము స్మరింపరాదు) యట్టి స్మరణజన్యసంస్కారపాటవమువలన నిఖిలేంద్రియవ్యగ్రతకల యంత కాలమునందు కూడనన్ను స్మరించుచు శరీరమునం దహంమమాభిమానమును విడచి ప్రాణవియోగ కాలమునం దెవడు బయలువెడలునో అట్టి యుపాసకుడు సగుణధ్యానతత్పరు డగునో "అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్లః" ఇత్యాదికముచే చెప్పబోవునట్టి పితృయానమార్గముకంటె నుత్కృష్టమైన దేవయానమార్గముచే హిరణ్యగర్భలోకమునుపొంది యచట హిరణ్య గర్భునితో శ్రవణాదులనుపొంది హిరణ్యగర్భలోకమున భోగముల ననుభవించి అట్టి భోగాన్తమున నిర్గుణ బ్రహ్మభావమును పొందుచున్నాడు. అన్త కాలమున నిర్గుణబ్రహ్మస్మరణమేకలవాడగునో "కళేబరమును విడిచివెళ్ళును" అని యజ్ఞానివృష్టిచే చెప్పబడెను. "న తస్య ప్రాణా ఉత్క్రామ న్త్యత్రైవ సమవలీయన్తే" అను శ్రుత్యుక్తప్రకారము ప్రాణప్రయాణ కాలమున నిర్గుణబ్రహ్మస్మరణ కలవానికి ప్రాణోత్క్రమణమే లేకపోవుటచే గమనము లేనందున వాడు సాక్షాత్తు నాస్వరూపమునే "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" అను శ్రుత్యుక్త రీతిని పొందును. ఈవిషయమై దేహమే యాత్మయా? దేహవ్యతిరిక్తాత్మ కలదా? అదియున్నను పరమేశ్వర భావప్రాప్తి సంభవమా? యని సందేహము లేదు. అనగా ఆత్మ దేహాతిరిక్తమా కాదా? యని కాని, దేహాతి రిక్తమైనను యీశ్వరునికంటె వేరా! కాదా యని కాని సందేహము లేదు. "ఛిద్యన్తే సర్వసంశయాః" ఆత్మ జ్ఞానికి సర్వసంశయములు తొలగునని శ్రుతియే బోధించుచున్నది. ఈశ్లోకమున "కలేబరం ముక్త్వా యాతి" అని చెప్పుటచే నాత్మ దేహముకంటె వేరనియు, "మద్భావం యాతి" అనుటవలన జీవున కీశ్వరాభిన్న త్వము చెప్పబడెను. ||౫||

శంకరానందీయము:— "సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః । ప్రయా ణకాలేఽపి చ మాం తే విదుః" సాధిభూతాధిదైవాధియజ్ఞరూపబ్రహ్మోపాసకులకు అంత కాలమునందుగూడ స్మరణరూపమైన యేబ్రహ్మవేదనము పూర్వమునం దుపక్రాంతమో ఆ బ్రహ్మవేదనమునే ఫలసహితముగ విస్తారముగ "అన్తకాలే" అనుదానిచే జెప్పుచుండెను.

"మామేవ స్మరన్" అని యేకవచనము బహువచనమున కుపలక్షణము. ఉపలక్షణమనగ వక్తావ్యా ర్థమునం దేకదేశకథనము. అనగా చెప్పిన దింకను కలదని యర్థము. అదేదనిన? ఎవడధ్యాత్మాధిదైవాది ప్రత్యయ రహితముగ పూర్వోక్తలక్షణములుకల పరబ్రహ్మమును జరామరణమోక్షముకొఱకు విచ్ఛిత్తిలేని యోగధారణనిష్ఠచే నెల్లప్పు డనుసంధానము చేయునో అట్టి బ్రహ్మవిత్తు అన్త కాలమునందుగూడ నట్టి యేకవృ త్తి చేతనే "బ్రహ్మైవాహం" అని నన్ను స్మరించువాడై, తనకు బ్రహ్మత్వమునే భావించువాడై, అధ్యా త్మాదికమును స్మరింపడు. (అధ్యాత్మాదికమునే స్మరించుచో తిరిగి సంసారహేతువగు "అహం మమేదం" అను వ్యామోహము సంభవించెడిని.) అందువలన సర్వాత్మనా పరబ్రహ్మయగు నన్నే ధ్యానించుచు శరీర మును విడచి బ్రహ్మభావమును అనగా నన్నే పొందుచున్నాడు. ఈవిషయమై సందేహము లేదు. ఏమన! మరణకాలమున పరబ్రహ్మమునే ధ్యానించి శరీరమును విడచు బ్రహ్మవేత్తకు బ్రహ్మభావాపత్తి - పరోక్షమగుట వలన కలదా! లేదా! యని యీవిషయమై సంశయము నీచేకాని, యితరులచేకాని చేయతగినది కాదు. ఎందు వలననిన "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అను శ్రుతిచే యీవిషయమే (బ్రహ్మవేత్తకు బ్రహ్మభావాపత్తియే) నిర్ధారితము. కాన సందేహింపవలదు. కాన బ్రహ్మవేత్త యగు యతి యెల్లప్పుడు బ్రహ్మానుసంధానమునే చేయుచు అంతకాలమునందు తనను బ్రహ్మముగ భావనచేయువాడై బ్రహ్మమే యగును. "పున ర్భవ మిన్ద్రియై ర్మనసి సంపద్యమానై ర్యచ్చిత్త స్తేనైష ప్రాణ ఆయాతి । ప్రాణ స్తేజసా యుక్త స్సహా

త్మనా యథాసంకల్పితం లోకం నయతి” అను శ్రుతివలన బ్రహ్మవేత్తయు అంతకాలమున బ్రహ్మస్వరూపముతో నుండవలయును. దృశ్యస్వరూపమున నుండరాదు. దృశ్యస్వరూపమున నుండినచో భావిశరీరవిషయకస్మృతి సంభవించును. అట్టి స్మృత్యనుసారము ఆయా శరీరప్రాప్తియు నగును.

బ్రహ్మవేత్తకు జ్ఞానాగ్నిచే కర్మసమూహము దగ్ధమగుటఁ జేసి శరీరారంభకకర్మయే లేనందున భావిశరీరస్మృతి, అట్టి శరీరప్రాప్తి యెట్లు సంభవించు నని శంకింపజనదు. కర్మగతి విచిత్రమగుటవలన తెలిసికొనుట కశక్యము. అట్లగుచో నట్టి విచిత్రకర్మానుగతిచే బ్రహ్మానుసంధానముకూడ నిరుద్ధము కావచ్చునని శంకింపజనదు. పూర్వమునందు చేయబడిన చిరస్థిరనిత్యనిరన్తరాభ్యస్తయోగబలముచే ప్రాణప్రయాణకాలమున ప్రాణవేదనను గుర్తెరుగనటుల కర్మయు, కర్మజ్ఞానము యరికట్టబడును. యోగబలముచేతనే యరికట్టబడిన విపరీతభావముకలవాడై బ్రహ్మమునే ధ్యానించును. బ్రహ్మమునే పొందును. కనుకనే “అన్తకాలే చ మామేవ” అని చెప్పబడెను.

ఈశ్లోకమునందు గల చకార ఏవకారములచే బ్రహ్మవేత్త యంతకాలమునందుకూడ విషయాంతరభావనారహితుడై బ్రహ్మాత్మనా యుండవలెనని శ్రీకృష్ణపరమాత్మ నియమించుచుండెను. ఈయర్థమునే మున్ముందు స్పష్టపరుపగలము. అట్లగుచో “తీర్థే శ్వపచగృహే వా” ఇత్యాది వచనములచే తీర్థ (పుణ్యక్షేత్రము)నందు కాని, శ్వపచగృహమునందు కాని బ్రహ్మవేత్త నివసించినను అతని కాసంబంధ ముండదను వచనమునకు గతి యేమి ? యని ప్రశ్నింపరాదు. బ్రహ్మవేత్తకు పుణ్యాపుణ్యక్షేత్రతీర్థనివాసవిచారము చేయదగినది కాదు. బ్రహ్మవేత్తకు బ్రహ్మజ్ఞానముచేతనే విముక్తి సంభవించును. క్షేత్రనివాసముచే కాదని తెలిసికొనుటయే గతి. పుణ్యక్షేత్రమునందుగూడ నిష్ఠారాహిత్యముచేతనే విస్మృతిని పొంది యంతకాలమునందు జడభరతుడు మృగ మయ్యెను. కాన బ్రహ్మవేత్త యగు యతి పూర్వమునందు, అంతకాలమునందు బ్రహ్మనిష్ఠతోడనే యుండవలయును. ||5||

భాష్యార్థదీపిక :— “ప్రయాణకాలే చ” అను దానిచే చేయబడిన సప్తమప్రశ్నకు “అన్తకాలే” అను శ్లోకముచే సమాధానమును చెప్పుచుండెను.

ప్రాణోత్క్రమణకాలమునందుకూడ సర్వవ్యాపకమగు పరమేశ్వరునే స్మరించువాడై శరీరమును విడచి యెవడు శరీరమునుండి బయలువెడలునో అట్టివాడు “మద్భావం” వైష్ణవతత్త్వమును (నిర్గుణపరబ్రహ్మమును) పొందుచున్నాడు. సగుణబ్రహ్మమును చింతన చేయువా డగుచో బ్రహ్మ (హిరణ్యగర్భ) లోకప్రాప్తిద్వారమున క్రమముగ వైష్ణవతత్త్వమును పొందును. నిర్గుణబ్రహ్మజ్ఞానము కలవాడగుచో సద్యఃకాలముననే ముక్తుడగును. (వైష్ణవతత్త్వమును) పొందును. ఇచట “మామేవ” అను విశేషణమువలన అధ్యాత్మాదివిశిష్టముగ స్మరణ కాదని స్పష్టపరుపబడెను. అట్లగుచో చిత్తవిక్షేమువలన ప్రధాననిర్గుణబ్రహ్మస్మరణము సంభవము కాకపోయెడిని. నిర్గుణబ్రహ్మవేత్తపక్షమున “న తస్య ప్రాణా ఉత్క్రామన్త్యత్రైవ సమవలీయన్తే” అను శ్రుత్యుక్తరీతిని ప్రాణోత్క్రమణమే సంభవింపనందున “కలేబరం ముక్త్వా” అని లోక (అజ్ఞాని) దృష్ట్యభిప్రాయముచే చెప్పబడెను. నాస్వరూపమును పొందుదురా? పొందరా? అను సందేహము లేదు. పరమేశ్వరస్వరూపమును బ్రహ్మవేత్త పొందు ననుటయందు “స ఏతా న్బ్రహ్మ గమయత్యేష దేవపథో బ్రహ్మపథో ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తన్తే” (అమానవపురుషుడు యీసగుణోపాసకులను హిరణ్యగర్భలోకమును పొందించును. ఇదియే దేవయానము. ఇదియే బ్రహ్మపథము. ఈ మార్గముచే బ్రహ్మలోకమును పొందినవారు యీమానవకల్పమును తిరిగి పొందరు. ఇచట “ఇమం” అను విశేషణముచే యీకల్పమునందు పునరావృత్తి లేదని చెప్పుటవలన కల్పాంతరమున పునరా

గీ॥ యం యం వాఽపి స్మరన్భావం త్యజ త్యన్తే కలేబరమ్ ।
తం త మేవైతి కౌన్తేయ! సదా తద్భావభావితః ॥ ॥౬॥

పదవిభాగము :— యం- యం- వా- అపి- స్మరన్- భావం- త్యజతి- అన్తే- కలేబరం- తం- తం- ఏవ- ఏతి- కౌన్తేయ- సదా- తద్భావభావితః ॥౬॥

ప్రతిపదార్థము :— యంయం=ఏయే; భావం=దేవతావిశేషమును; అన్తే=మరణకాలమునందు; స్మరన్=స్మరించుచు; కలేబరం=శరీరమును; త్యజతి=విడచునో; హేకౌన్తేయ=ఓకుంతీపుత్రుడవగుయర్జునా!; సదా=ఎల్లపుడు; తద్భావభావితః; తత్=ఆదేవతావిశేషమునందే; భావ=భావన; (వాసన) భావితః=యేపురుషునిచేసంపాదితమోఅట్టిపురుషుడు; తంతమేవ=ఆయాదేవతావిశేషమునే; ఏతి=పొందుచున్నాడు; ॥౬॥

---

వృత్తి కలదని శంకింపజనదు. పంచాగ్నివిద్యోపాసకులవిషయమై "ఇమం" అను విశేషణమువలన ప్రాప్తమైన కల్పాంతర పునరావృత్తి కాని, సగుణబ్రహ్మోపాసకులకు కాదు. సగుణబ్రహ్మోపాసకులన్నచో హిరణ్యగర్భలోకమును పొంది హిరణ్యగర్భునివలన శ్రవణాదుల నొనరించి హిరణ్యగర్భునితో వైష్ణవతత్త్వమును (పరమేశ్వరరూపమును) పొందుదురు. అనియే యాశయము) "బ్రహ్మవి దాప్నోతి పరమ్। బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" ఇత్యాది శ్రుతులు ప్రమాణము.

కొందరు "నాస్త్యత్ర సంశయః" అను వాక్యమునకు— ఆత్మ దేహవ్యతిరిక్తమా? కాదా? దేహవ్యతిరిక్తమైనను యీశ్వరునికంటె భిన్నమా! అభిన్నమా? అను సందేహము లేదు. ఎందువలననిన "ఛిద్యన్తే సర్వ సంశయాః" అను శ్రుతి సర్వసంశయములు తొలగునని బోధించుటవలన యని యర్థమును చెప్పుచుండిరి. మరియు "కలేబరం ముక్త్వా ప్రయాతి" అని చెప్పుటవలన దేహభిన్న మాత్మ యనియు, "మద్భావంయాతి" అని చెప్పుటవలన నీశ్వరాభిన్నత్వము జీవునకు చెప్పబడెను. అని చెప్పుచుండిరి.

ఇచట చెప్పదగినవిషయ మొకటికలదు, "ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః" (నియతాత్మలు కలవారిచే ప్రాణప్రయాణకాలమున నీవెట్లు తెలిసికొనదగినవాడవు) అని యర్జునుని ప్రశ్న. ఈప్రశ్న చేయువానికి దేహవ్యతిరిక్తమైనదే యాత్మ యని నిశ్చయమే యుండును. అట్టి వానికి ప్రతివచన మిచ్చు శ్రీకృష్ణపరమాత్మ దేహాతిరిక్తమగు నాత్మ కలదా? లేదా? యను సంశయనిరాకరణమునిమిత్తము "నాస్త్యత్ర సంశయః" అని చెప్పెననుట అకాండమునందు (అసమయమునందు) తాండవము చేయుటే యగును. మరియు ఆత్మ దేహాదులకంటె భిన్నమని, యిదివరలోనే యనేకసార్లు చెప్పుటవలన ఆత్మ దేహాతిరిక్తమా? కాదా? యను సంశయమే సంభవింపనందున అట్టి సంశయమును తొలగించుచుండెనని చెప్పుట యప్రసక్తప్రతిషేధ మగును. మరియు యుక్తులచే నిరూపితమైన యర్థమువిషయమై తిరిగి జనించిన సంశయము యొక్క నివృత్తి అర్థికార్థముచే సంభవింపదు. ॥౫॥

—• ౮ వ అధ్యాయము ౬ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మరణకాలమున భగవంతుని ధ్యానించువానికి భగవత్ప్రాప్తి నియతమైన దని చెప్పుటకు, యేదో మరియొకదానిని కాలమునందు ధ్యానించుచు దేహమును విడుచు వానికి దాని ప్రాప్తి యవశ్యము సంభవించునని "యం యం వాఽపి" అను శ్లోకముచే జెప్పుచుండెను.

కేవలము నన్నే స్మరించుచు నాస్వరూపమునే పొందునను నియమము లేదు. మరేమనిన? ఏయే దేవతా విశేషమునుగాని (చకారవశమున) మరియొకటియగు యేదో యొకదానినైన ప్రాణవియోగకాలమున స్మరిం

శాంకరభాష్యమ్:—

న మద్విషయ ఏవాయం నియమః కిం తర్హి — యం యం వాఽపి యం యం భావం దేవతావిశేషం స్మరం శ్చింతయం స్త్యజతి పరిత్యజత్యంతే ప్రాణవియోగకాలే కలేబరం తం త మేవ స్మృతం భావమేవై తి నాన్యం కౌంతేయ సదా సర్వదా తద్భావభావిత స్తస్మి న్భావ స్తద్భావ స్స భావితః స్మర్యమాణతయాఽభ్యస్తో యేన స తద్భావభావిత స్సన్ ॥ ॥౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అంతకాలమున భగవంతుని ధ్యానించువానికి భగవత్ప్రాప్తి సంభవించునని చెప్పి యుంటివి. ఈనియమము ఒకనావిషయమే కాదు. మరేమనిన? మరణకాలమున యేదేవతావిశేషమును స్మరించుచు శరీరమును విడచునో ఓయర్జునా! యెల్లపు డేదేవతావిషయక భావనయే పురుషునిచే సంపాదింపబడునో అనగా స్మర్యమాణముగ యేదేవతావిశేషమభ్యస్తమో ఆపురుషు డాయాదేవతావిశేషమునే పొందుచున్నాడు. ॥౬॥

చుచు కళేబరమును యెవడు విడచునో వాడు ఆస్మర్యమాణభావమునే పొందును. మరియొకదానిని పొందడు. "హేకౌన్తేయ" అని సంబోధనచే మేనత్తకొమరుడగుటచేనైనన్నే హాతిశయమును సూచించుచుండెను. కనుకనే యవశ్యానుగ్రాహ్యత్వము, అవశ్యానుగ్రాహ్యుడుకనుకనే ప్రతారణ శంకాశూన్యత్వము సూచింపబడెను. అన్తకాలమున స్మరణోద్యమము సంభవింపకున్నను పూర్వాభ్యాసజనితవాసనయే స్మృతి హేతువని చెప్పుచుండెను. ఎల్లప్రుడు తద్భావభావితుడై అనగా దేవతావిశేషమునందు భావన (వాసన) తద్భావ మనబడును. అట్టి వాసన యెవనిచే భావితమో (సంపాదితమో) వాడు తద్భావభావితు డనబడును. దేవతావిశేషచింతనచే వాసితచిత్తముకలవాడై యా యా దేవతావిశేషమును పొందును. ॥౬॥

శంకరానందీయము:— "పుణ్యేన పుణ్యం లోకం" అను న్యాయముచే దేవతల నారాధించువారలకు, విష్ణువునారాధించువారలకు, శివునియారాధించువారలకు ఆరాధన మాత్రముచేతనే ఆయా దేవతాస్వరూపత్వ మెట్లు సిద్ధించుచున్నదో అట్లే బ్రహ్మవేత్తకుకూడ నిరన్తరశ్రవణాదులచేతనే బ్రహ్మభావాపత్తి సిద్ధించుచుండ యంతకాలమున ప్రాణవేదన ప్రచురమైయుండ యట్టికాలమున "మామేవ" అని నియమముగ బ్రహ్మవేత్తకు నీధ్యాన మవశ్యకర్తవ్యమని యీ నిర్బంధనమెందుల కని శంకింపజనదు. విష్ణ్వాదిభక్తులకుకూడ నిత్యము, అంతకాలమునందున్నూ విష్ణ్వాదిధ్యానమునే చేయువారలకే విష్ణ్వాదిస్వరూపాపత్తి ప్రాప్తించును. ఇతరకాలములయందు నియమముగ విష్ణ్వాదులను భజించువారలకు విష్ణ్వాదిలోకప్రాప్తియే. ఈనియమము బ్రహ్మవేత్తకే కాదు, సర్వసాధారణము. అని "యం యం వాఽపి" అను శ్లోకముచే చెప్పుచుండెను.

భక్తుడు కాని, అన్యుడు కాని "తద్భావభావితః" శివాదులయొక్క కాని, అభీష్టవస్తువుయొక్క కాని, శత్రువుయొక్క కాని, యితరునియొక్క కాని స్వరూపము "భావితః" భక్తిచే కాని, ప్రీతిచే కాని, మోహముచే కాని, ద్వేషముచే కాని, భయముచే కాని యెల్లప్పుడు బుద్ధివిషయముగ నెవనిచే చేయబడునో యట్టివాడు తద్భావభావితుడనబడును. ఎల్లప్పుడు తత్స్వరూపమునే భావనచేయువాడై అన్తకాలమునందే యేభావనమును శివుని కాని, విష్ణువుని కాని, యితరమైన ప్రియమైనదానిని కాని పూర్వసంస్కారముచే స్మరించువాడై శరీరమును యెవడు విడచునో వాడు తనచే చింతితస్వరూపమునే పూర్వకాలీనోత్తరకాలీన ధ్యానశక్తి మహిమచే

గీ॥ తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్యచ ।
మయ్యర్పితమనోబుద్ధి ర్మా మే వైష్య స్యసంశయః ॥ ॥౭॥

పదవిభాగము:— తస్మాత్- సర్వేషు- కాలేషు- మాం- అనుస్మర- యుధ్య- చ- మయి- అర్పితమనోబుద్ధిః- మాం- ఏవ- ఏష్యసి- అసంశయః ॥౭॥

ప్రతిపదార్థము:— తస్మాత్=దేహాంతరప్రాప్తియందన్త్యస్మరణహేతువగుటవలన; సర్వేషు కాలేషు=సర్వకాలములయందు; మాం=నన్ను; అనుస్మర=స్మరింపుము; యుధ్య చ=స్వధర్మమగు యుద్ధమును చేయుము; మయి=నాయందు; అర్పితమనోబుద్ధిః; అర్పిత=ఉంచబడిన; మనోబుద్ధిః=మనోబుద్ధులు కలవాడవై; మామేవ=నన్నే; ఏష్యసి=పొందగలవు; అసంశయః=సంశయములేదు; ॥౭॥

---

శాంకరభాష్యమ్:—

యస్మా దేవ మంత్యా భావనా దేహాంతరప్రాప్తౌ కారణమ్— తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యథాశాస్త్రం యుధ్య చ యుద్ధం చ స్వధర్మం కురు మయి వాసుదేవేఽర్పితే మనోబుద్ధీ యస్య తవ స త్వం మయ్యర్పితమనోబుద్ధి స్స న్మా మేవ యథాస్మృత మేష్య స్యాగమిష్య స్యసంశయో న సంశయోఽత్ర విద్యతే ॥ ॥౭॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇట్టి యన్త్యభావన దేహాంతరప్రాప్తియందు హేతువగుటవలన సర్వకాలములయందు శాస్త్రమునందు చెప్పిన రీతి నతిక్రమింపక శాస్త్రోక్తవిధి ననుసరించి నన్ను స్మరింపుము. స్వధర్మమగు యుద్ధమును చేయుము. వాసుదేవుని యందర్పితమైన మనోబుద్ధులు కల

---

ధ్యేయస్వరూపమునే పొందుచున్నాడు. కేవలారాధనమాత్రపుణ్యకర్మచే యా యా స్వరూపమును పొందడు. బ్రాహ్మణుడిందునికూర్చి యాగమొనరించి యింద్రత్వమును పొందడు. అట్లే శ్రవణమాత్రముచే బ్రహ్మవిత్తు బ్రహ్మభావమును పొందడు. ఈవిషయమునే "నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన" అను శ్రుతియు బోధించుచున్నది. మరేమనిన! యెల్లప్పుడు "తద్భావ భావితః" (తస్య బ్రహ్మణః భావః స్వరూపం యేన భావితః స తద్భావ భావితః) అని విగ్రహము. యెవనిచే బ్రహ్మస్వరూపము స్వాత్మచే యనుభవమొనరించబడెనో యట్టివాడు తద్భావభావితుడనబడును. లేక, బ్రహ్మస్వరూపము యెవనిచే భావితమో అనగా నిత్యనిరంతరసమాధినిష్ఠచే సంభావితసమ్యగ్జ్ఞానముచే నెవనిచే పొందించబడెనో యట్టివాడు తద్భావభావితుడనబడును. అట్టివాడే బ్రహ్మభావమును పొందుచున్నాడు. ఈవిషయమునే "యమే వైష వృణుతే తేన లభ్యః" అను శ్రుతియు బోధించుచున్నది. కాన నిత్యనిరంతర ధ్యానముచేతనే ధ్యాతకు భ్రమరకీటన్యాయముచే ధ్యేయస్వరూపాపత్తి లభించును. కాన బ్రహ్మవేత్తలగు విదేహముక్తిని కోరు యతీశ్వరులకు (పరమహంస పరివ్రాజకులకు) బ్రహ్మమే యనుసంధానమొనరింపతగినది. ఎన్నడును బాహ్యమను సంధేయము కాదని సిద్ధమగుచున్నది. ॥౬॥

—• ౮వ అధ్యాయము ౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మరణకాలమున పరవశుడైనవానికి దేహాన్తరప్రాప్తియందు కారణము పూర్వస్మరణసంజనితమైన యంత్యమగు భావనయే. కాన నావిషయకమైన యంత్యభావనయొక్క పుట్టుటకొఱకు సర్వకాలములయందు మరణకాలమునకు పూర్వమునందే యాదరముచే సగుణుడగు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వాడవై నన్నే పొందగలవు. ఈవిషయమై సంశయ మెంతమాత్రము లేదు. ఈశ్లోకమున భగవదనుసంధానము చేయదగినదని చెప్పి స్వధర్మమగు యుద్ధమును చేయు మని చెప్పుట వలన కర్మజ్ఞానసముచ్చయము భగవదభిప్రేతమే యని శంకింపజనదు. మనోబుద్ధిగోచరమైన నిఖిలవిషయజాతము బ్రహ్మమే యని భావన చేయుచు "యుధ్యస్వ" యుద్ధము చేయుము అని చెప్పు శ్రీకృష్ణపరమాత్మచే బ్రహ్మాతిరిక్తమైన క్రియాదికలాపమున కభావమును చెప్పుటవలన నిచట కర్మజ్ఞానసముచ్చయము వివక్షితము కాదు. అనియే యర్థము. ||౭||

నీశ్వరుని స్మరింపుము. అంతఃకరణపరిశుద్ధి లేమింజేసి యెల్లపుడు స్మరించుట కశక్తుడ వగుచో అంతఃకరణపరిశుద్ధికొఱకు స్వధర్మమగు యుద్ధాదికమును చేయుము. ఇట్లు నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానముచే పాపము క్షీణింప భగవంతుడను, వాసుదేవుడను అగు నాయం దర్పింపబడిన మనోబుద్ధులు కలవాడవై యెల్లపుడు మచ్చింతనపరుడవై నన్నే పొందగలవు. ఈవిషయమై సందేహము లేదు. ఈసగుణబ్రహ్మచింతనము సగుణబ్రహ్మోపాసకుల కంత్యభావనాసాపేక్షకలన ఉపాసకులకు చెప్పబడెను. నిర్గుణబ్రహ్మజ్ఞానుల కన్ననో జ్ఞానసమకాలమునందే అజ్ఞాననివృత్తిరూపమైన ముక్తి సిద్ధమగుటవలన వారల కంత్యభావనాపేక్ష లేదు. ||౭||

శంకరానందీయము:— బ్రహ్మవేత్తలగు యతులకు ధ్యానమున కవశ్యకర్తవ్యత్వసిద్ధికొఱకు చెప్పిన యర్థమునే యర్జునుని విషయముగ జేసుకొని "తస్మాత్" అను శ్లోకముచే తిరిగి దృఢపరచుచుండెను.

చరమకాలీనదృశ్యభావన యవిద్యామూలక మగుటచే శరీరారంభహేతువు. కాన నీవు సర్వకాలములయందు ఆహారవిహార శయ్యాసనాదులయందు, సర్వావస్థలయందు సర్వాత్మకమగు బ్రహ్మమునందే యర్పించబడిన మనోబుద్ధులు కలవాడవై (ఇచట "మయి" అనునది విషయసప్తమి.) బుద్ధియనగ అహంవృత్తి, ఇదంవృత్తి, మనస్సు వాటికి విషయముగ నన్నే చేసుకొని నాస్వరూపముగ స్థాపితమైన మనోబుద్ధులు కలవాడవై అహమర్థము ఇదమర్థము అగు నన్ను స్మరింపుము. యేవృత్తిచే నన్ను స్మరించునో అనగా విషయముగ చేసుకొనునో దాని ననుసరించియే అనుగతమైన సజాతీయవృత్తిచే నన్ననుసంధానము చేయుము. మధ్యమధ్య భిన్నవృత్త్యనుసంధానము చేయకుము. అట్లగుచో బ్రహ్మవాసన నశింపదు. బ్రహ్మవాసనే లేనిచో సంసారము నివర్తింపదు. అందువలన పుంఖానుపుంఖముగ యవిచ్ఛిన్నసద్వృత్తిచే "సర్వమిద మహం చ బ్రహ్మైవ" అని యెల్లపుడు నన్ననుసంధానముచేయుము. ఇట్లు యెల్లపు డనుసంధానమొనరించినవాడ వగుచో పరబ్రహ్మమునే పొందగలవు. పూర్ణానందైకరసస్వరూపముతో నవస్థానరూపమగు బ్రహ్మభావమును పొందగలవు. తిరిగి శరీరమును పొందవు. నాకట్టి బ్రహ్మభావము ప్రాప్తించునా? ప్రాప్తింపదా? యని సంశయ మీవిషయమై చేయవలదు. నావాక్యమును నమ్ముము. విజాతీయప్రత్యయరహితముగ సర్వదా "సర్వం బ్రహ్మైవ" అని తెలుసుకొను నాకు జీవితసిద్ధి యెట్లను శంకను తొలగించుటకు "యుధ్యచ" అని చెప్పుచుండెను.

నీవు క్షత్రియుడవు కదా. క్షత్రియజీవసాధనమగు యుద్ధమునుకూడ చేయుము. బ్రహ్మానుసంధానము, యుద్ధక్రియ ప్రత్యయభేదముచేతను, సాధనభేదముచేతను, స్థితిభేదముచేతను పరస్పరవిరుద్ధము లగుటవలన బ్రహ్మానుసంధాన యుద్ధక్రియలకు యేక కాలమునందు యేకపురుషానుష్ఠేయత్వము సంభవింపనందున యారెంటిని యొక్కసారి చేయుటకు యెట్లు శక్యమగును. అని శంకింపజనదు. "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః" అని పూర్వోక్తరీతిచే కర్త, కరణము, కార్యం, "భోక్త, భోజ్యము, భోజనము సర్వము బ్రహ్మమే" అని సర్వత్రబ్రహ్మదృష్టిచే శరీరస్థితిమాత్రప్రయోజక మగు కర్మ చేయదగును. అతిరిక్తకర్మ చేయరాదు! విద్వాంసుడు కూడ నతిరిక్తకర్మను చేయుచో అతిప్రవృత్తిచే వాసనావృద్ధియగును. వాసనావృద్ధిచే తిరిగి జన్మమరణాది సంసారము ప్రాప్తించును. అందువలన బ్రహ్మవేత్తకు సర్వదా అంతకాలమునందు కూడ బ్రహ్మానుసంధానమే చేయతగినది. ||౭||

భా ష్యో త్క ర్ష దీ పి క:— ఎల్లపు డభ్యస్తమైన భావన ప్రాణప్రయాణకాలమునందు గూడ నుద్బుద్ధమై స్వవిషయమును పొందించునదై యగుచున్నది. అందువలన సర్వకాలములయందు ఆదరముతోడ నైరన్తర్యముగ నన్ను సగుణముగకాని, నిర్గుణముగకాని శాస్త్రదృష్టి నతిక్రమింపకుండగ స్మరింపుము. క్షత్రియధర్మమగు యుద్ధమును చేయుము. "న చలతి నిజవర్ణధర్మతో య స్సమమతి రాత్మసుహృ ద్విపక్షపక్షే । న హరతి న చ హన్తి కించి దుచ్చైః స్సితమనసం త మవేహి విష్ణుభక్తమ్" అని విష్ణుపురాణమున తన వర్ణధర్మమునుండి చలింపకుండుట విష్ణుభక్తలక్షణముగ జెప్పబడెను. శ్రీకృష్ణపరమాత్మ చేగూడ "యుధ్యచ" (యుద్ధము చేయుము.) అని చెప్పబడెను. ఈ చెప్పుటచే యుపాసనకు కర్మకు సముచ్చయము చెప్పబడెను. నాయందర్పితమైన మనోబుద్ధులుకల నీవు నన్నుగూర్చియే రాగలవు. ఈవిషయమై సందేహములేదు. ॥౭॥.

ప ర మా ర్థ ప్ర పః—

ఓ శ్రీకృష్ణ! మరణకాలమునందు వివశుడైనవానకి స్మరణప్రయత్న మెట్లు సంభవించును? అను శంకను "తస్మాత్" అను శ్లోకముచే తొలిగించుచుండెను.

నిరన్తరము తద్భావముచే (స్మరణరూపపదార్థముచే) వాసితమైన చిత్తము కలవాడవగుటవలన సుఖదుఃఖ భోగసమయములందు యెల్లపుడు నన్ను స్మరింపుము. (స్మరణారూఢునిగఁ జేయుము) అట్టినిరంతరానుసంధాన సంస్కారముచే మరణకాలమునందు కూడ స్వయముగనే స్మరణముసంభవించును. చిత్తశుద్ధిలేనిదే స్మరణము సంభవింపదు. కాన యుద్ధరూప మగు స్వధర్మాచరణమును చేయుము. ఇట్లే మరణకాలమునందుకూడ నాయం దర్పిత మనోబుద్ధులు కలవాడవైన నిశ్చయముగ నన్నే పొందగలవు. దేహాంతకాలమునందు మదాకారసంకల్పము (నిశ్చయముగ) నాయందే సంభవించును. ఇట్లు చేయుచో భక్తపక్షపాతిని యగు నన్నే పొందగలవు. ఇచట "మామేవ" అను ఏవకారమున యితరులను పొందవని యర్థము. కాన నేనే అంతర్యామిస్వరూపమున నుండి స్మరణయందు ప్రవర్తింపజేయుదును. మరియు దేహావసానదుఃఖమును విస్మరింపజేసి నాయభిముఖముగ నాకర్షించెదను. అని యర్థము. ఈవిషయమే "స్పర్శాశ్మాప్యశ్మసారం నయతి కనకతాం చాన్తికం చుంబికాశ్మా సూతేఽగ్నిం సూర్యకాన్తో ద్రవతి తదపర శ్చంద్రసూర్యాభిముఖ్యాత్ । హన్త్యన్నం సన్నిధానా ద్విషమతిగహనో హ్యస్తి వస్తుప్రభావో జీవానాం ముక్తి రేవం భవతి భగవతః కిఁ పున ర్భావనాతః" స్పర్శాశ్మ (పరశువేది) తనను తాకిన యినుమును సువర్ణముగ జేయును. చుంబికాశ్మ (సూదంటురాయి) యనుమ నాకర్షించును. సూర్యకాంతమణి సూర్యున కభిముఖముగ నుంచిన నగ్నిని పుట్టించును. చంద్రకాంతమణి చంద్రుని యాభిముఖ్యమువలన ద్రవించును. విషము తన సన్నిధానమాత్రముచేతనే యన్నమును తినినవానిని నశింపజేయును. వస్తుప్రభావ మెట్లున్నదో తెలిసికొనుటకు శక్యముకాదు. ఇట్లే జీవులకు భగవంతుని భావన చేయుటవలన ముక్తి సంభవించుచున్నది. అని బోధించుచున్నది. ॥౭॥

నీ ల కం ఠీ య ము:— అంతకాలమున నన్ను జేరుటకై సర్వకాలములయందు నన్ను స్మరించుము. ఇట "యుధ్యచ" అని చకారమువలన కర్మకు, ఉపాసనకు సముచ్చయము సూచింపబడుచున్నది. ఒకేయధికారి జ్ఞానకర్మసముచ్చయము నంగీకరించి యట్లాచరింపజూచుచో జ్ఞానయోగమున యకర్తృత్వప్రత్యయము, కర్మయోగమున కర్తృత్వప్రత్యయము యావశ్యకములుగాన నవి పరస్పరవిరుద్ధములై పరస్పరప్రతిబంధకములగును. కాన జ్ఞానకర్మసముచ్చయము పొసగదు. పైవిధముగ గాక కర్మ, ఉపాసనలకు సముచ్చయము నంగీకరించి, యొకే యధికారి యాచరించినచో కర్తృత్వప్రత్యయ మారెంటికి యావశ్యకమేగాన యట్టి విరోధము ప్రాప్తింపనేరదు. (శిష్టము గతార్థము.) ॥౭॥

గీ॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥ ॥౮॥

పదవిభాగము:— అభ్యాసయోగయుక్తేన- చేతసా- నాన్యగామినా- పరమం- పురుషం- దివ్యం- యాతి- పార్థ!:—అనుచింతయన్॥ ॥౮॥

ప్రతిపదార్థము:— హేపార్థ:= ఓయర్జునా; నాన్యగామినా=విషయాంతరమునందు ప్రవేశించు స్వభావము లేనట్టి; అభ్యాసయోగయుక్తేన=విజాతీయప్రత్యయశూన్యమైన యేకవస్తువిషయకతుల్యప్రత్యయావృత్తి రూపమగు యోగముతోకూడిన; చేతసా=చిత్తముచే; అనుచింతయన్=శాస్త్రాచార్యోపదేశము ననుసరించి చింతించువాడు; దివ్యం=సూర్యమండలమందుండిన, పరమం=నిరతిశయమైన, పురుషం=పురుషుని, యాతి= పొందుచున్నాడు. ॥౮॥

శాంకరభాష్యమ్:—

కించ— అభ్యాసయోగయుక్తేన మయి చిత్తసమర్పణవిషయభూత ఏకస్మిం స్తుల్యప్రత్యయావృత్తిలక్షణో విలక్షణప్రత్యయానంతరితోఽభ్యాస స్సచాభ్యాసో యోగ స్తేన యుక్తం తత్రైవ వ్యాపృతం యోగిన శ్చేత స్తేన చేతసా నాన్యగామినా నాన్యత్ర విషయాం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్వశ్లోకమునందు చెప్పబడిన యర్థము ననుష్ఠానముజేయువాడు అంతకాలమున భగవంతునే పొందునని "కించ" అనుదానిచే చెప్పబడెను. చిత్తసమర్పణమునకు విషయభూతుడగు నా యందే విజాతీయప్రత్యయశూన్యమైన సజాతీయప్రత్యయముల యావృత్తిరూపమగు

—• ౮ అధ్యాయము ౮వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు యర్జునునిచే చేయబడిన యేడుప్రశ్నలకు సమాధానమును చెప్పి ప్రాణప్రయాణకాలమున భగవదనుస్మరణమునకు భగవత్ప్రాప్తిరూపఫలమును వివరించుటకు "అభ్యాసయోగయుక్తేన" అను శ్లోకమును ప్రారంభించెను.

అభ్యాసమనగ విజాతీయప్రత్యయము మధ్య మధ్య లేకుండగ నాయందే సజాతీయప్రత్యయప్రవాహము. ఈ యభ్యాసము పూర్వమున షష్ఠాధ్యాయమున వ్యాఖ్యానింపబడెను. అభ్యాస మనెడి యోగము (సమాధి) తో గూడినట్టియు, అనగా నట్టి సమాధియందే వ్యాపృతమైనట్టియు, ఆత్మాకారవృత్తుల కంటె యితరమగు వృత్తులతో శూన్యమైనట్టియు, అభ్యాసపాటవముచే విషయాంతరమునందు నిరోధప్రయత్నము లేకున్నను ప్రవేశించు స్వభావము లేనట్టి మనస్సుచే నిరతిశయము, పూర్ణము, ద్యోతనాత్మకమునగు యాదిత్యుని యందుండిన "యశ్చాసా వాదిత్యే" అను శ్రుతిబోధితమైన బ్రహ్మమును ఓయిర్జున! శాస్త్రాచార్యోపదేశము ననుసరించి ధ్యానించువాడు బొందును. ॥౮॥

శంకరానందీయము:— ఆత్మజ్ఞానముచే దగ్ధమైన నిఖిలకర్మలుకల బ్రహ్మవేత్తకు కర్మయే లేమింజేసి భావిశరీరస్మృతి, అట్టి శరీరప్రాప్తి యెట్లు సంభవించు ననెదవా? కర్మగతి విచిత్రమగుటవలన బ్రహ్మతత్త్వము తెలిసికొనుటకు శక్యముకానిది. మరియు అట్టి కర్మగతిచే బ్రహ్మానుసంధానము కూడ నిరుద్ధము

శాంకరభాష్యమ్:—

తరే గంతుం శీల మస్యేతి నాన్యగామి తేన నాన్యగామినా పరమం నిరతిశయం పురుషం దివ్యం దివి సూర్యమండలే భవం యాతి గచ్ఛతి హేపార్థ! అనుచింతయ న్శాస్త్రాచార్యోపదేశ మను ధ్యాయ న్నిత్యేతత్ ॥ ॥౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యభ్యాసముతోగూడిన, విషయాంతరమునందు ప్రవేశింపని చిత్తముచే శాస్త్రాచార్యోపదేశము ననుసరించి సూర్యమండలమధ్యవర్తి యగు నిరతిశయపురుషుని ధ్యానించుచు యాపురుషునే పొందును. ॥౮

కావలసివచ్చును. అని శకింపజనదు. మద్యపాయి మద్యరసయోగముచే ప్రారబ్ధకృతమైన బాహ్యమైనదానిని దేనినితలవక మద్యరసయోగముచే ప్రాప్తమైన కార్యమునే యెట్లు చేయునో, అట్లే ప్రాక్కాలీనమైన అభ్యాస యోగబలముచే యోగి బ్రహ్మస్వరూపమునందు లీనమైన యంతఃకరణకలవాడగుటచే స్వయముగ ప్రాణవేద నను స్మరింపనటుల కర్మను, కర్మకార్యమును తలవడు. అభ్యాసయోగబలముచే బ్రహ్మమునే ధ్యానించును. బ్రహ్మమునే పొందునను యాశయముతో "అభ్యాస యోగయుక్తేన" అని చెప్పుచుండెను.

"అభ్యాసయోగయుక్తేన" తీవ్రమోక్షేచ్ఛచేతను, అతివైరాగ్యముచేతను బ్రహ్మైక్యపరముగ చిరకాలము నిత్యనిరంతరము క్రియమాణమైన విజాతీయప్రత్యయానంతరిత సార్వకాలికసజాతీయ ప్రత్యయావృత్తియే యభ్యాసము (సమాధి) అని యనిపించుకొనును. ఇట్టి యభ్యాసముచే ప్రాప్తమైన నిర్వికల్పకసమాధియే యోగమనబడును. అట్టి యోగముచే బ్రహ్మాకారత్వమును పొందినట్టియు, అందువలననే "నాన్యగామినా" భావికర్మను, కార్యమును, ప్రాణేంద్రియాదివిక్షేపమును, యితరమును కాని మననచేయుటకు శక్తి లేని దగుటచే "నాన్యగామి" అని చెప్పబడును. అట్టి మనస్సుచే చెప్పబడినరీతిని స్వరూపమునే ధ్యానించు బ్రహ్మవేత్త నిరతిశయమహత్త్వసంపన్నమైన ప్రకాశైకరూపమైన పురుషుని పొందుచున్నాడు. ॥౮॥

పరమార్థప్రపః— సంతతస్మరణకు అభ్యాస మంతరంగసాధనము. అని "అభ్యాసయోగ యుక్తేన" అను దానిచే చెప్పుచుండెను.

స్త్రీపుత్రవిత్తాదులనుండి మనస్సును మరలించుట యభ్యాస మనబడును. పరమేశ్వరునియందు మనస్సును లగ్నము చేయుట యోగ మనబడును. అట్టి అభ్యాస, యోగములతో సమాహితమైనట్టియు, పదార్థాంతరములయందు పరాఙ్ముఖమైనట్టి చిత్తముచే ద్యోతనాత్మకమగు పరమేశ్వరుని చింతించువాడు పరమాత్మనుపొందుచున్నాడు. ॥౮॥

నీలకంఠీయము:— "తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః" అని యభ్యాసము సూత్రిత మయ్యెను. ధ్యేయమగు వస్తువునందు చిత్తమును స్థిరముగా జేయుటకై జేయు ప్రయత్నము యభ్యాస మనబడును. (విజాతీయ ప్రత్యయములచే అంతరితములు కాని సజాతీయప్రత్యయములను ప్రవాహరూపముగా జేయుట అభ్యాస మనబడును.) అందు భావింపదగు విషయము సిద్ధమనియు, యసిద్ధ మనియు రెండువిధములు. విష్ణుప్రతిమాదికము, విరాడ్రూపాదికము సిద్ధవిషయ మనబడును. మానసపరికల్పితమగు ప్రతిమాదికము అసిద్ధవిషయ మనబడును. ఆయసిద్ధవిషయమున మనస్సునకు ప్రతిమాకారతాసంపాదనమునందును, యామానసపరికల్పితప్రతిమయందు స్థైర్యసంపాదనమునందును ద్విగుణీకృతమగు యత్నము చేయవలసియుండును. సిద్ధవిషయమునం దన్ననో- చిత్తస్థిరీకరణమునకై యొకే ప్రయత్నము జేయదగును. అట్టి యభ్యాసయోగయుక్తము, అనన్యగామియు నగు మనస్సుచే పరమపురుషుని స్మరించుచున్నవాడు యాపరమాత్మనే పొందును. ॥౮॥

గీ॥ కవిం పురాణ మనుశాసితార, మణోరణీయాంస మనుస్మరే ద్యః।
సర్వస్య ధాతార మచిన్త్యరూప, మాదిత్యవర్ణం తమసః పరస్తాత్॥ ॥౯॥

పదవిభాగము:—కవిం- పురాణం- అనుశాసితారం- అణోః- అణీయాంసం-అనుస్మరేత్-యః- సర్వస్య- ధాతారం- అచిన్త్యరూపం- ఆదిత్యవర్ణం- తమసః- పరస్తాత్॥ ॥౯॥

ప్రతిపదార్థము:—కవిం=సర్వజ్ఞుడైనట్టియు; పురాణం=చిరంతనుడైనయు; సర్వస్య=నిఖిలజగత్తునకు; అనుశాసితారం=అనుశాసకుడైనట్టియు; అణోః=సూక్ష్మమైనదానికంటె; అణీయాంసం=సూక్ష్మతరమైనట్టియు; సర్వస్య=నిఖిలకర్మఫలములను; ధాతారం=విచిత్రముగ ప్రాణులకొఱకువిభాగముచేసియిచ్చునట్టియు; అచిన్త్యరూపం=యెవనిచేతనుయూహించుటకుశక్యముకానిరూపముకలిగినట్టియు; ఆదిత్య=సూర్యునియొక్క వలె; వర్ణం=నిత్యచైతన్యప్రకాశకల; తమసః=అజ్ఞానాంధకారముకంటె; పరస్తాత్=పరుడైనఆపరమాత్మను; యః=ఎవడు=అనుస్మరేత్=స్మరించునో; ॥౯॥

శాంకరభాష్యమ్:—

కిం విశిష్టం చ పురుషం యాతీ త్యుచ్యతే— కవిం క్రాంతదర్శినం సర్వజ్ఞం పురాణం చిరంతన మనుశాసితారం సర్వస్య జగతః ప్రశాసితార మణో స్సూక్ష్మా దప్యణీయాంసం సూక్ష్మ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్వశ్లోకమునందు పరమపురుషుని ధ్యానించువాడు పరమపురుషుని పొందుననిచెప్పబడెను. ఆపురుషు డెట్టివాడనిన "కవిం"క్రాన్తదర్శి. అనగా అతీతనిఖిలవస్తుదర్శనశీలుడు. దీనివలన తేలిన యాశయ మేమి? సర్వజ్ఞుడు. మరియు "పురాణం" ఆదిమత్తగు నిఖిల జగత్తునకు కారణ మగు

—♦ ౮వ అధ్యాయము ౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— తిరిగి ధ్యానింపదగిన, పొందదగిన పురుషుని విశేషముగ "కవిం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

"కవిం" క్రాంతదర్శియు,(అనగా అతీతానాగతవర్తమాననిఖిలవస్తుదర్శియగుటచే సర్వజ్ఞుడు.) సర్వ కారణుడగుటవలన యనాదియు, సర్వజగన్నియన్తయు, సూక్ష్మమగు ఆకాశమునకుకూడ యుపాదాన మగుటవలన ఆకాశముకంటె సూక్ష్మతరుడును, సర్వకర్మఫలములను ప్రాణులకొఱకు విచిత్రముగ "ఫల మత ఉపపత్తేః" అను న్యాయమున విభజింపువాడును, అపరిమితమహిమకలవాడగుటచే నూహించుటకుగూడ శక్యము కాని రూపముకలవాడును, సూర్యునిప్రకాశవలె సకలజగదవభాసకప్రకాశకలవాడును, కనుకనే అజ్ఞానరూపమగు మోహాన్ధకారతమనస్సునకు అతీతుడును, (అనగా ప్రకాశరూపుడగుటచే తమోవిరోధి యని భావము) యగు పరమేశ్వరుని యెవడైనను స్మరించునో అట్టివాడు పైని పేర్కొనబడిన లక్షణములుగల పరమపురుషుని పొందునని పూర్వశ్లోకముతో నన్వయము. ॥౯॥

"య ఏవ మేతాగ్ం ల్లోకా నాత్మన్యేవ ప్రతిష్ఠితాన్ వేదాత్మైవ భవతి" (ఎవ డీలోకముల నాత్మయందే ప్రతిష్ఠితములుగ దెలిసికొనునో వాడాత్మయే యగుచున్నాడు.) అను శ్రుత్యుక్తరీతిని సర్వాత్మయగు పరమాత్మయొక్క యుపాసనమును చెప్పి, అట్టి యుపాసకునకే "యోఽయం విజ్ఞానఘన ఉత్క్రామన్ కేన కతరద్వావస్థాన ముత్సృజ్యోత్క్రామత్" (ఈవిజ్ఞానఘనుడు ఉత్క్రమించువాడై దేనిచే యేస్థానమును విడచి యుత్క్రమించును.) అని యుత్క్రమణము నుపక్రమించి, శరీరమునుండి యుత్క్రమణప్రకారమునే వర్ణిం

శాంకరభాష్యమ్:—

తర మనుస్మరే దనుచింతయే ద్యః కశ్చి త్సర్వస్య కర్మఫలజాతస్య ధాతారం విచిత్రతయా ప్రాణిభ్యో విభక్తారం విభజ్య దాతార మచింత్యరూపం నాస్య రూపం నియతం విద్యమాన మపి కేనచి చ్చింతయితుం శక్యత ఇ త్యచింత్యరూప స్త మాదిత్యవర్ణ మాదిత్యస్యేవ నిత్యచైతన్యప్రకాశో

శాంకరభాష్యతత్త్వబోధిని:—

టవలన అనాదియు, "అనుశాసితారం" సర్వజగత్తును శాసించునట్టియు, సూక్ష్మమగుయాకాశమునకుకూడ నుపాదానకారణమగుటవలన సూక్ష్మతరము, కర్మఫలసముదాయమును ప్రాణుల కొరకు విచిత్రముగ విభజించి యిచ్చునట్టియు, (పరమపురుషునికినియతరూపమున్నను దానిని యెవరు నూహించుటకు శక్యముకాదు,) అట్టి రూపము కలిగినట్టియు, సూర్యునియొక్కవలె నిత్య

చుటకు, "అపునర్భవాయ కోశం భినత్తి। కోశం భిత్త్వా శీర్షకపాలం భిత్త్వా అక్షరం భినత్తి। మృత్యు ర్వై పరే దేవే ఏకీభవతి" (మోక్షము కొఱకు హృత్పుండరీకమును భేదించును. కోశమును భేదించి శీర్షకపాలమును భేదించును. శీర్షకపాలమును భేదించి అక్షరమును (ఓంకారమును) భేదించును. (ఇదియే మృత్యువు.) పరమాత్మయం దేకీభవించును.) అని ఉత్క్రాంతులకు పరదేవతాప్రాప్తి చెప్పబడెను. అట్లే యిచటను "సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః" అని శ్రీకృష్ణపరమాత్మచే సర్వాత్మకమగు పరమాత్మస్వరూపమైన తనయుపాసనను చెప్పి, ఆత్మతత్త్వోపాసకునకు ఉపాసనాపరిపాకదశయందు, అంతకాలమునందును "మామేవ" అని ఉత్క్రమణము, ఉత్క్రమణకాలమునందు విద్వాంసునకు కర్తవ్యమైన కార్యమును సూచించి యిపుడు ఉత్క్రాంతుడైన ఉపాసకునకు పొందదగిన పరతత్త్వమును వెనుక సన్నిహితశ్లోకముచే నిర్దిష్టమైనదానినే విశేషములతో "కవిం" అను శ్లోకముచే ప్రతిపాదించుచుండెను.

అతీతానాగతవర్తమానసర్వప్రాణులను, తద్ధర్మములను, తత్కర్మలను, చిత్రవిచిత్రమగు ప్రాణికర్మ ఫలములను అవ్యవధానముగ తెలిసికొనువాడు కాన "కవి" యనబడును. (సర్వజ్ఞుడును.) అందువలననే సర్వ ప్రాణుల బుద్ధికోశమునందుండి యాయా ప్రాణికర్మల ననుసరించి నియమించునట్టియు, సర్వప్రాణి జాతమునకు అనేకకోటికల్పార్జితమైన ప్రాణికృతకర్మలకు ఫలమును యిచ్చునట్టియు, అతిసూక్ష్మమగు నాకాశ మునకుకూడ కారణమగుటవలన నతిసూక్ష్మమైనట్టియు, కనుకనే సర్వకారణమగుటవలన ననాదియైనట్టియు, అతిసూక్ష్మమగుటవల (1) అనాది యగుటవలన (2) అప్రమేయమగుటవలన వాఙ్మనస్సులకుగోచరుడు కాన ట్టియు, సూర్యునిప్రకాశవలె నిత్యమైన చైతన్యప్రకాశ కలిగినట్టియు, మోహాత్మకమగు యజ్ఞానముకంటె తత్కార్యముకంటె వెలుపల యున్నట్టి (అనగా అజ్ఞానతత్కార్యసంబంధములేనట్టి) పరమాత్మరూపమగు నన్ను యెవడు స్మరించునో (అనగా అనేకజన్మార్జిత పుణ్యపుంజపరిపాకసమాసాదిత పరమేశ్వరప్రసాదసంపన్నుడై పూర్వమునం దభ్యస్తయోగబలముచే అంతకాలమునందు యెవడు నన్ను స్మరించునో) అట్టివాడు పరమపురుషుని పొందునని యుత్తరశ్లోకముతో నన్వయింపవలెను. ॥౯॥

భాష్యోత్కర్షదీపిక:— పురుషుని యెట్టివానిగ స్మరించును? అనుశంకపై "కవిం" అను శ్లోకమును చెప్పుచుండెను.

"కవిం" క్రాంతదర్శియు, కనుకనే యతీతాదివస్తుజ్ఞానముకలవాడగుటచే సర్వజ్ఞుడును, "పురాణం" కార్య కారణరూపమగు సర్వమునకు హేతువగుటచేతను అనాదియగుటచేతను చిరంతనుడును, "అనుశాసితారం"

శాంకరభాష్యమ్:—

వర్ణో యస్య త మాదిత్యవర్ణం తమసః పరస్తా దజ్ఞానలక్షణా న్మోహాంధకారా త్పరం త మను చింతయ న్యాతీతి పూర్వే ణైవ సంబంధః ॥ ॥౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చైతన్యప్రకాశముకల వర్ణముకలిగినట్టియు, అజ్ఞానస్వరూపమగు మోహాంధకారముకంటె పరుడైన యాపరమపురుషుని యెవడు స్మరించునో వాడు పరమాత్మను పొందు నని పూర్వశ్లోకముతో నన్వయింపనగును. ॥౯॥

అంతర్యామిరూపమున సర్వమును నియమించువాడును, "అణోరణీయాంసం" సూక్ష్మాకాశముకంటెను సూక్ష్మమునగు పరమపురుషుని స్మరించువాడు నగువాడెవడైనను పరమపురుషుని పొందును. ఇట్లనుటచే "విశిష్టజాత్యాదికము కలవాడే పూర్వోక్తవిధముగ చింతించిన పరమపురుషప్రాప్తి యగునుగాని, అస్మరించువాడు విశిష్టజాత్యాది సంపన్నుడు కానిచో బరమపురుషప్రాప్తి కానేరదను శంక తొలిగింపబడెను. "సర్వస్య ధాతారం" సమస్తమగు కర్మఫలమును కర్మవైచిత్ర్యము ననుసరించి విభజించి సర్వప్రాణులకు నిచ్చువాడును, (అనగా సర్వాధ్యక్షుడగు నాపరమేశ్వరుడు దేవ, గంధర్వ, యక్ష, రక్షః, పితృ, పిశాచ, భూత, జరాయుజ, అండజ, ఉద్భిజ్జాదిరూపము, ద్యు, వియత్, పృథివీ, ఆదిత్య, చంద్ర, గ్రహ, నక్షత్రాదివిచిత్రము, వివిధప్రాణ్యుపభోగార్హస్థానసంధానముతో గూడినదియు, అతినిపుణులగు శిల్పులు మనస్సుచే నూహించుటకు కూడ శక్యముకానిదియు నగు ఈజగత్తుయొక్క సృష్టి, స్థితి, సంహారములను జేయుచు దేశకాలవిభాగజ్ఞుడగుటచే స్వస్వకర్మానురూపమగు కర్మఫలమును కర్మకారులకు యిచ్చువాడు అని యర్థము.)

"ఈచెప్పిన యచింత్యప్రభావము కర్మకే యుండుటచేతను, సర్వులు కర్మను ఫలహేతువని యంగీకరించుటచేతను కర్మనుండియే యాయాఫలములు ప్రాప్తించుచున్నవని యంగీకరింపదగును. ఇట్లగుచో ఫలప్రదాతగ వేరే యీశ్వరుని కల్పించుట వ్యర్థము కాదా?" అని శంకింపవలదు. ప్రత్యక్షముగ నశించునదియు, కనుకనే యభావరూపము నగు కర్మనుండి భావరూపమగు ఫలము ప్రాప్తింపనేరదు గాన, కర్మఫలదాత ఈశ్వరుడే యనదగును.

"కర్మ తాను నశించు కాలమునందే స్వానురూపమగు ఫలమును సంపాదించియే నశించుచున్నది. ఆఫలము సిద్ధమైయున్నను, తత్ఫలభోక్త యయోగ్యుడగుటచేగాని, లేక కర్మాంతరప్రతిబంధముచేగాని యాఫలమును భోక్త యనుభవింపకుండెను. భోక్తకు యోగ్యతాప్రాప్తిచేగాని, లేక ప్రతిబంధాపగమానంతరముగాని ఫలభోక్త యాఫలము ననుభవించుచుండెను. కాన ఫలహేతువుగ కర్మనే యంగీకరించిన జాలును. అట్లగుటచే ఈశ్వరుని యధికముగ గల్పించుట వ్యర్థము కాదా?" అని శంకింపవలదు. అధికారులు "స్వర్గము నన్ను పొందుగాక" యని కోరుకొనరు. ఇంకేమన, "మాకు స్వర్గము భోగ్యమగు గాక" యనియే కోరుకొందురు. కాన ఎట్టిదానిని యధికారి కోరుకొనునో యట్టిదియే ఫలమగుటచేతను, భోగ్యమునకే ఫలత్వ ముపపన్నమగును.

భోక్తృసంబంధమునకు పూర్వము భోగ్యత్వమే సిద్ధించనందున ఫలత్వమే యుపపన్నము గాదు. ఏదియున్న కాలమున సుఖముగాని, దుఃఖముగాని తనచే ననుభవింపబడునో దానికే ఫలత్వము లోకమున ప్రసిద్ధము. మరియు, స్వర్గనరకములు తీవ్రతమ: సుఖదుఃఖరూపములు అని తద్విషయకానుభవముండ భోగాపర

నామచే వ్యవహరింపదగును. కాన యనుభవయోగ్యములై యనుభూయమానములు కాని సుఖదుఃఖములు యననుభూయమానశశశృంగమువలె లేనివే యగును. కనుక ఫలప్రదాతగ నీశ్వరు నంగీకరింపవలెను.

"కర్మజన్యమగు యపూర్వము ఫలోత్పత్తిపర్యంతముండునుగాన యపూర్వమువలన గర్మఫలము పుట్టుచున్న" దనెదవా? అట్లు కాదు. కాష్ఠలోష్టాదిసమమగు యచేతనమునకు చేతనప్రవృత్తి లేనిదే ఫలోత్పత్తికై ప్రవృత్తియే సంభవింపదు. గాన చేతనుడగు ఈశ్వరుడే ఫలప్రదాతయని యంగీకరింపవలెను.

"అట్టి చేతనుడుండుటలో ప్రమాణములేదు గాన, ప్రసిద్ధమగు ఫలోత్పత్తి మరొక విధమున సంభవింపదు గాన యన్యథానుపపత్తిరూపార్థాపత్తిప్రమాణముచే నపూర్వమే కర్మఫలమునకు కారణ" మనెదవా? అట్లును కాదు. కర్మఫలప్రదాత యీశ్వరుడు అని యంగీకరించినచో నన్యథానుపపత్తిరూపమగు అర్థాపత్తియు నీశ్వరసిద్ధిచే క్షీణించుచున్నది. మరియు, "స వా ఏష మహా నజ ఆత్మాఽన్నాదో వసుధానః" అను శ్రుతిచేగూడ ఈశ్వరుడే కర్మఫలప్రదాత యని నిశ్చయింపబడుచున్నది.

"విధిశ్రుతికి విషయభావము నొప్పుటచే యాగము స్వర్గమున కుత్పాదకమని తెలియబడుటవలన "స్వర్గకామో యజేత" అను మొదలగు శ్రుతులు ధర్మమునకు ఫలదాతృత్వమును బోధించుచున్నవి. అట్లు కానిచో ననుష్ఠానాత్మకమగు యాగము ఆపద్యమానమయ్యెడిని. దానిని యుపదేశించుట వ్యర్థమయ్యెడిని. శ్రుతిప్రామాణ్యమునుబట్టి శ్రుతమగు కర్మఫలసంబంధ మెట్లుపపన్నమగునో యట్లు కల్పింపవలసి యున్నది. కాన నశించెడి స్వభావముకల కర్మకొంత యపూర్వమును యుత్పత్తిచేయక కాలాంతరీయమగు ఫలము నిచ్చుటకై సమర్థము కాదు. గాన కర్మకు యొకానొక సూక్ష్మమగు ఉత్తరావస్థ కాని, ఫలముయొక్క పూర్వావస్థగాని, యపూర్వమనుపేర గలదని యూహింపదగును. ఈవిషయ ముపపన్నము గూడ నగును.

పైన జెప్పిన విధముగ నీశ్వరుడు ఫలము నిచ్చుననుట యుపపన్నము గాదు. ఏలన? వైచిత్ర్యరహితమగు కారణము (ఈశ్వరుని) వలన విచిత్ర (జగత్) కార్యోత్పత్తి యనుపపన్నమగుటవలనను, ఈశ్వరునికి వైషమ్యనైర్ఘృణ్యప్రసక్తిని బట్టియు, అనుష్ఠానవైయర్థ్యమువలనను యీశ్వరుడు ఫలప్రదాత యనుట పొసగదు. కాన ధర్మమునకే కర్మఫలప్రదత్వము సిద్ధించుచున్న"దని శంకింపజనదు. "ఏష హ్యేవ సాధు కర్మ కారయతి తం య మేభ్యో లోకేభ్య ఉన్నినీషతే। ఏష హ్యేవాఽసాధు కర్మ కారయతి తం య మేభ్యో లోకేభ్య అధోనినీషతే" ఈమొదలగు శ్రుతులయందు ధర్మాధర్మములకు కారయిత యగుటచే నీశ్వరుడు హేతువనియు, ఫలదాతయనియు వ్యపదేశింపబడుచున్నది.

విచిత్రకార్యానుత్పత్త్యాదిదోషములుగూడ కృతప్రయత్నాపేక్షము లగుటచే నీశ్వరునియందు ప్రసక్తములు గావు. "స్వర్గకామో యజేత" యను శ్రుతినిగూడ నీశ్వరకారణత్వవాదిశ్రుత్యనురోధముగ వ్యాఖ్యానింపదగును. అందులకై ఈవ్యాససూత్రములను జూడుడు. "ఫల మత ఉపపత్తేః, శ్రుతత్వాచ్చ, ధర్మం జైమినిః, అత ఏవ పూర్వం తు బాదరాయణో హేతువ్యపదేశాత్" "ఫల మత ఉపపత్తేః" కర్మలచేనారాధింపబడిన ఈశ్వరునివలన ఫలము ఉపపత్తివలన సభవించును. "శ్రుతత్వాచ్చ" కేవలము యుపపత్తిననుసరించియే ఈశ్వరుని ఫలహేతువుగ కల్పింపము. ఇంకేమన; శ్రుత్యుదితమగుటచేగూడ నీశ్వరుని ఫలహేతువుగ దలచెదము. ఆశ్రుతి యేది యన; "స వా ఏషః" మొదలగునది. సిద్ధాంతముతో మొదలిడి పూర్వపక్షమును గ్రహించుచుండెను- "ధర్మం జైమినిః" జైమిన్యాచార్యుడు ధర్మమును ఫలహేతువుగ తలచుచుండెను. "అత ఏవ పూర్వంతు బాదరాయణో హేతువ్యపదేశాత్" ఆ కారణమువలనను, శ్రుత్యుపపత్తివలనను ఈశ్వరునే ఫలప్ర

దాతగ బాదరాయణాచార్యులు తలచెను. "కేవలకర్మవలనగాని, యపూర్వమువలననేగాని కర్మఫలము కలుగు నను పక్షమునూత్రస్థ "తు" శబ్దముచే వ్యావర్తింపబడును. అచేతనములగు మృత్పిండాదులు చేతనకుంభకారాద్య నధిష్ఠితములై కుంభాద్యుత్పాదనమునకై సమర్థములు కానేరవు. ఈవిషయములోకదృష్టమేకదా! దృష్టమననుస రించియే దేనినైన(కల్పించుట)నిర్ణయించుట యుక్తమగును. కాన చేతనాధిష్ఠితముగానికర్మవలనగాని, అట్టి యపూర్వమువలనగాని కర్మఫలోత్పత్తి యనుపపన్న మగును.

"కర్మాదికము అచేతన మగుటవలన చేతనాధిష్ఠితము. "మృదాదికమువలె" అను యనుమానముచే సిద్ధమైన కర్మాదికమునకు జీవచైతన్యాధిష్ఠితత్వము కర్మఫలోత్పత్తికై సాధనమగు" నని శంకింప దగదు. కర్మస్వరూప, సామాన్య, నియోగాది విశేషవిజ్ఞానరహితమగు చైతన్యమాత్రజీవుడు ఫలోత్పత్తియెడ నుపయో గింపడు. ఏమన: ఫలసిద్ధికి పూర్వక్షణమున శుభకర్మవలన సుఖము, అశుభకర్మవలన దుఃఖము, జ్యోతిష్టోమము వలన స్వర్గము కలుగునని సాక్షాత్కారవదధిష్ఠితత్వమును యెట్లూహించుచుంటిమో యట్లే చైతన్యాధిష్ఠితత్వ మూహింపబడుచున్నది కాని యది సిద్ధమైన సాధనము కానందున దానివలన ఫలోత్పత్తి కానేరదు.

మరియు, దేవపూజారూపమగు యాగము ఆయాగోద్దిష్టదేవతను యనుగ్రహింపజేయకుండ ఫలము నిచ్చు నని చెప్పుటయు ననుభవవిరుద్ధము. ఏమన: రాజసేవారూపమగు యారాధనము ఆరాజును అనుగ్రహింప జేసియే ఫలదానసమర్థ మగుచున్నది. ఈవిషయము లోకమున దృష్టముకదా! కాన దృష్టానుగుణ్యమునకై- యాగా దులచేతను, దాన, పరిచార, ప్రణామ, అంజలిబంధ, స్తోత్రరూపములు, అత్యంతశ్రద్ధాగర్భితములు నగు భక్తి పరిచర్యలచేతను ఈశ్వరప్రసాదము సంపాదింపబడుచున్నది. అట్టి స్థాయియగు ఈశ్వరప్రసాదమువలననే- ఫలోత్పత్తి యుపపన్నమగుచుండ యందుకై యపూర్వము నొప్పుట వ్యర్థమగును.

ఇట్లే యశుభకర్మము ఈశ్వరవిరోధజనకమని శ్రుతిస్మృతిప్రసిద్ధము. అట్టి స్థాయియగు ఈశ్వరవిరో ధమువలన యనిష్టఫలోత్పత్తియగును. రాజు మంచినిచేయువానినియనుగ్రహించి, చెడుచేయువానిని నిగ్రహించి, వారలవిషయమై రాగద్వేషముల నెట్లు చేయడో యట్లే యీశ్వరుడుగూడ శుభకర్మచేయువానిని యనుగ్ర హించి యశుభకర్మ జేయువానిని నిగ్రహించి వారియెడ రాగద్వేషములులేక, వైషమ్యనైర్ఘృణ్య రహితుడై యుండును.

"ప్రధానప్రయోగము (ప్రధానకర్మాచరణము) చే నీశ్వరుడు ప్రసన్నుడగునుకదా! అప్పుడు అంగా నుష్ఠానములో నేమి ప్రయోజనము?" అని శంకింపవలదు. పరమాపూర్వము కర్తవ్యమైనపుడు ఉత్పత్త్యపూర్వ ములు, అంగాపూర్వములు యెట్లుపయుక్తములో యట్లే ప్రధానారాధనము కర్తవ్యమైయుండ యంగారా ధన యుపయుక్తమగును. స్వామ్యారాధనమువలె తదమాత్య, ప్రణయిజనారాధనముగూడ నుపయుక్తమే యగును. కనుక దృష్టావిరోధముచే నీశ్వరారాధనమువలన ఫలోత్పత్తి యగును కాని, కర్మవలనగాని, లేక యపూర్వమువలనగాని ఫలోత్పత్తి గానేరదని నిష్కృష్టాంశము.

"అచిన్త్యరూపం "సూ॥ అరూపవదేవ హి తత్ప్రధానత్వాత్, ప్రకాశవచ్చావైయర్థ్యాత్, ఆహ చ తన్మాత్రమ్" అను సూత్రోక్తరీతిని వస్తుతః పరమేశ్వరునకు రూపమేదియు లేదు. యెట్లన! "అరూపవదేవ హి= పరబ్రహ్మము రూపాదిరహిత మనియే నిర్ధారణ చేయదగును. కారణమేమన:— తత్ప్రధానత్వాత్= "అస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘ మశబ్ద మరూప మవ్యయం తదేత ద్బ్రహ్మాపూర్వ మనపర మబాహ్య మయ మాత్మా బ్రహ్మ సర్వానుభూః" అను నీమొదలగు శ్రుత్యుక్తవాక్యములు నిరాకారబ్రహ్మమే ప్రధానముగా (విషయముగా) కలవియగుటచే బరబ్రహ్మము రూపరహితము. కాగ నిట్టి యథాశ్రుతమగు నిరాకారబ్రహ్మమే

గీ॥ ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ।
భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్స తం పరం పురుష ముపైతి దివ్యమ్॥ ॥౧౦॥

పదవిభాగము:—ప్రయాణకాలే- మనసా- అచలేన- భక్త్యా- యుక్తః- యోగబలేన- చ- ఏవ- భ్రువోః- మధ్యే- ప్రాణం- ఆవేశ్య- సమ్యక్- సః- తం- పరం- పురుషం- ఉపైతి- దివ్యమ్॥ ॥౧౦॥

ప్రతిపదార్థము:—ప్రయాణకాలే=మరణకాలమునందు; అచలేన=చలింపనట్టి; మనసా=మనస్సుతో; భక్త్యా=భక్తితో; యుక్తః=కూడుకొనినవాడై; యోగబలేనచైవ=యోగబలముతో; యుక్తః=కూడినవాడై; భ్రువోః=కనుబొమ్మలయొక్క; మధ్యే=మధ్యభాగమునందు; సమ్యక్=లెస్సగా; ప్రాణం=ప్రాణమును; ఆవేశ్య=స్థాపనచేసి; సః=ఆయోగి; దివ్యం=ప్రకాశాత్మకమైన; పరం పురుషం=పరమపురుషుని;ఉపైతి=పొందుచున్నాడు; ॥౧౦॥

---

తెలిసికొనదగినది. బ్రహ్మము నిరాకార మగుచో సాకారప్రతిపాదకశ్రుతుల గతి యేమి యను శంకను తొలగించుటకు "ప్రకాశవ చ్చావైయర్థ్యాత్" అను సూత్రము చెప్పబడెను. ఎట్లు సూర్యప్రకాశ ఆకాశమును వ్యాపించి యుండినదై, అంగుల్యాద్యుపాధిసంబంధమున ఋజువక్రాదిభావమును పొందినదై సూర్యుని యందు ఋజువక్రాదిభావ ముండునటుల కాన్పించుచున్నదో యట్లే బ్రహ్మముకూడ పృథివ్యాద్యుపాధిసంబంధమువలన తదాకారము కలవాడువలె తోచుచుండెను. బ్రహ్మమునకు పృథివ్యాలంబన మగు ఆకారవిశేషోపదేశము ఉపాసనార్థ మగుటవలన విరోధము లేదు. కాన సాకార బ్రహ్మ బోధకములగు శ్రుతులకు వైయర్థ్యము లేదు. "చైతన్యమాత్రం విలక్షణరూపాంతర రహితం నిర్విశేషం బ్రహ్మ స యథా సైన్ధవఘనోఽనన్తరోఽబాహ్యః కృత్స్నో రసఘన ఏవైవం వా అరే అయ మాత్మాఽనన్తరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ" ఎట్లు సైంధవఘనము (ఉప్పుగడ్డ) లోపల, వెలుపల లవణరసమే కలదై రసాంతరము లేనిదై యెల్లపుడగుచున్నదో అట్లే బ్రహ్మమునకు యెల్లపుడు చైతన్యమే స్వరూపము. చైతన్యము కంటె వేరగు స్వరూపము లోపలగాని, వెలుపల కాని లేదు. అని శ్రుతి బోధించుచున్నది. ఇతరమేమియు లేదని బ్రహ్మమునకు నిర్విశేషత్వమునే "అథాత ఆదేశో నేతి నేతి" "అన్యదేవ తద్విదితా దథో అవిదితా దధి। యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" ఇత్యాది శ్రుతులు బోధించుచున్నవి. దాల్భ్యునిచే ప్రశ్నింపబడి యేమియు పలుకకయే బ్రహ్మమును చెప్పెనని "సహోవాచాధీహి భోః। స హ తూష్ణీం బభూవ తంహ ద్వితీయే వా తృతీయే వా వచన మువాచ। బ్రూమః ఖలు త్వం తు న విజానా స్యుపశాన్తోఽయ మాత్మా" అను శ్రుతి బోధించుచున్నది. మరియు "జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి య జ్జ్ఞాత్వాఽమృత మశ్నుతే" "మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద। సర్వభూతగుణై ర్యుక్తం నైవం మాం జ్ఞాతు మర్హసి" ఇత్యాది స్మృతులుగూడ పరనిషేధపూర్వకముగనే బ్రహ్మమును బోధించుచున్నవి. తేలిన యాశయమేమి? పరమాత్మయందు వాస్తవిక మగు రూపాదికమేదియు లేదు. ఉపాసనార్థము పరమేశ్వరునియందు రూపము కాల్పనికమే. కాన పరమేశ్వరుడచింత్యరూపుడనియాశయము. సూర్యుని యొక్క రూపమువలె నిత్యచైతన్యస్వప్రకాశరూపుడు, అజ్ఞానస్వరూపమైన మోహాంధకారముకంటె "పరస్తాత్" ఉపరిభాగమునం దుండినవాడు. అనగా అజ్ఞానముకంటె పరుడు. పరమార్థముగ మూలాజ్ఞాన తత్కార్యాసంస్పృష్టు డని యాశయము. ॥౯॥

శాంకరభాష్యమ్:—

కించ ప్రయాణకాలే మరణకాలే మనసాఽచలేన చలనవర్జితేన భక్త్యా యుక్తో భజనం భక్తిస్తయా యుక్తో యోగబలేన చైవ యోగస్య బలం యోగబలం తేన సమాధిజసంస్కారప్రచయజనితచిత్తస్థైర్యలక్షణం యోగబలం తేన చ యుక్త ఇత్యర్థః। పూర్వం హృదయపుండరీకే వశీకృత్య చిత్తం తత ఊర్ధ్వగామిన్యా నాడ్యా భూమిజయక్రమేణ భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య స్థాపయిత్వా సమ్యగప్రమత్తస్సంత్స ఏవం బుద్ధిమాన్యోగీ కవిం పురాణ మిత్యాది లక్షణం తం పరం పురుష ముపైతి ప్రతిపద్యతే దివ్యం ద్యోతనాత్మకమ్ ॥ ॥౧౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చెప్పబోవు కారణమువలన ఫలవత్తగుటం జేసి భగవదనుస్మరణము కర్తవ్యము. మరియు మరణకాలమునందు నిశ్చలమగు మనస్సుతోను, భక్తితోను యోగబలము(సమాధిజనిత సంస్కారప్రచయ జనిత చిత్తస్థైర్యము)తోను కూడినవాడై, మొట్టమొదట హృదయపుండరీకమునందు చిత్తమును స్వాధీన మొనరించుకొని ఊర్ధ్వగామి యగు సుషుమ్నా నాడీద్వారమున భూమిజయక్రమమున భ్రూమధ్యమందు ప్రాణమును లెస్సగ స్థాపించి అప్రమత్తుడైన బుద్ధిమంతుడగు యోగి

—• ౮వ అధ్యాయము ౧౦వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఎట్టి సమయమున భగవదనుస్మరణయందు ప్రయత్నవిశేషము కోరబడుచున్నది. అను యాశంకపై "ప్రయాణకాలే" అని చెప్పుచుండెను.

మరణకాలమునందు ఏకాగ్రమనస్సుచే అపరమపుషుని స్మరించుచు పరమేశ్వరవిషయకమైన భక్తితో (పరమప్రేమతో) కూడినవాడై,సమాధిజనితసంస్కారసమూహముతోడను, సమాధివ్యుత్థానవిరోధిసంస్కారముతోడనుకూడినవాడై, మొట్టమొదట ప్రాణమును హృదయపుండరీకమునందు స్వాధీన మొనర్చుకొని అటనుండి యూర్ధ్వగామియగు సుషుమ్నా నాడిచేగురూపదిష్టమార్గమున భ్రూమధ్యయందు అనగా ఆజ్ఞాచక్రమునందు ప్రాణమును స్థాపనచేసి యప్రమత్తుడై బ్రహ్మరంధ్రమునుండి యుత్క్రాంతుడైన యుపాసకుడు "కవిం పురాణమనుశాసితారం" ఇత్యాది లక్షణయుక్తుడైన ద్యోతనాత్మకమగు పరమపురుషుని పొందుచున్నాడు. ॥౧౦॥

శంకరానందీయము:— "కవిం పురాణం" ఇత్యాది లక్షణసంపన్నమైన పరమాత్మ నుపాసించు యోగి యేసాధనసంపత్తిచే నెల్లపుడు స్వయముగ నాత్మస్వరూపమును పొందును? అను యాశంకపై "ప్రయాణకాలే" అని చెప్ప మొదలిడెను.

తీవ్రవైరాగ్యమోక్షేచ్ఛలచే ననన్యవృత్తిచే నిత్యము నిరంతరము "కవిం పురాణం" ఇత్యాది విశేషణసంపన్నమైన పరమాత్మను యనుసంధానముచేయు యోగి మరణకాలము ప్రాప్తింప చిరకాలనిత్యనిరంతరసజాతీయప్రత్యయావృత్త్యభ్యాసాతిశయపాటవమున విషయాంతరసంపర్కవర్జితమైనదియు, ముక్తికి పరమసాధనమునగు మనస్సుతోటి, భక్తితోటి, (వృత్తికి స్వవిషయాకారతాపత్తియేభక్తి.) యోగమనగ సమాధి. అట్టి యోగముచే సంభావితమైన చిత్తముయొక్క లక్ష్యైకాకారతాపత్తి స్థైర్యమనెడి బలము. యిదియే యుత్తమ సాధనము.) ఇట్టి యోగబలముతోటి కూడినవాడై "శతం చైకా చ హృదయస్య నాడ్య స్తాసాం మూర్ధానమభినిస్సృతైకా। తయోర్ధ్వ మాయన్నమృతత్వ మేతి" హృదయపుండరీకము ననుసరించి నూటయొక్క నా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కవియు, చిరంతనుడు, ఆదిత్యాదిలక్షణుడు ద్యోతనుడునగు పరమపురుషుని పొందుచున్నాడు. ఇడాపింగళనాడులు దక్షిణోత్తరనాడులు. అవి హృదయపుండరీకమునుండి బయలువెడలినవి. వాటిని నిరోధించి హృదయమునుండియూర్ధ్వముగ బయలువెడలి సుషుమ్నానాడీద్వారా హృదయము నందుండిన ప్రాణమును కంఠావలంబితస్తనసదృశమాంసఖండమును పొందించి ఆమార్గముచేతనే భ్రూమధ్యయందుంచి ప్రమాదములేనివాడై బ్రహ్మరంధ్రమునుండి నిష్క్రమించి పరమపురుషుని పొందుచున్నాడు. (భూమ్యాది పంచభూతములను స్వాధీనమొనరించుకొనుటయే భూమి జయము.) ॥౧౦॥

---

డులు బయలు వెడలెను. అందు సుషుమ్నానాడి వేణుదండముద్వారా మూర్ధన్యప్రదేశము నాక్రమించును. అట్టి సుషుమ్నానాడీద్వారా మరణసమయమున జీవుడూర్ధ్వముగ బయలువెడలి యమృతత్వమును పొందుచున్నాడు. అను శ్రుత్యుక్తరీతిచే మొట్టమొదట కుంభకముచే ప్రాణాపానములను హృదయమునం దేకముగ జేసి ఇడాపింగళ లను నాడులను స్తంభింపజేసి అనంతరమున ఊర్ధ్వగామి యగు సుషుమ్నానాడిచే ప్రాణమును భ్రూమధ్యమునందు లంబికాంతము లెస్సగ తీసుకువచ్చి బ్రహ్మకపాలమును ఛేదించి, శ్రుత్యుక్తరీతిని పృథివిని ఛేదించి, ఉదకములను ఛేదించి, తేజస్సును ఛేదించి, వాయువును ఛేదించి, ఆకాశమును ఛేదించి, మనస్సును ఛేదించి, భూతాదిని ఛేదించి, మహత్తత్త్వమును ఛేదించి, అవ్యక్తమును ఛేదించి, అక్షరమునుఛేదించి, మృత్యువునుఛేదించి "కవిం పురాణం" అనుదానిచే చెప్పబడిన లక్షణములు కల స్వప్రకాశైకస్వభావముకల పరమపురుషుని పొందుచున్నాడు.

"అన్తకాలే చ మామేవ" అనుదానిచే మరణకాలమునందుగూడ బ్రహ్మానుసంధానము చేయవలయుననియు, "సదా తద్భావభావితః" అని మరణకాలమునకు పూర్వమునందుగూడ యెల్లపుడు బ్రహ్మానుసంధానము చేయవలయుననియు విధింపబడెను. "తస్మాత్సర్వేషు కాలేషు" అనుదానిచేతను, "అభ్యాసయోగయుక్తేన" అనుదానిచేతను పైవిషయమే అనగా మరణకాలమునందు, మరణపూర్వకాలమునందు యెల్లపుడు బ్రహ్మానుసంధానమే చేయవలయునని విధింపబడెను. ఈ యుపదేశము బ్రహ్మవేత్తలకు, సగుణోపాసకులకు సమానమే యని తెలియనగును. ఉభయులీయుపదేశమును ప్రయత్నపూర్వకముగ నాచరింపదగినది. "కవిం పురాణం" అనుదానిచే చెప్పబడిన విషయము ఉపాసకునకేకాని బ్రహ్మవేత్తకు కాదని గ్రహింపనగును. ॥౧౦॥

నీలకంఠీయము:— ఉపాసనాఫలమును జెప్పుచుండెను. ప్రాణప్రయాణకాలమున వృత్త్యంతరరహితమైన మనస్సుతో భగవానుడగు వాసుదేవునియందు ఆరాధ్యతాబుద్ధితో గూడినవాడై, మనఃప్రాణేంద్రియక్రియానిరోధరూపమైన (హృదయపుండరీకమున మనఃప్రాణేంద్రియనిరోధరూపమైన) యోగము యొక్క బలముతో గూడినవాడై, (భూమిజయక్రమమున మూలాధారముమొదలుకొని బ్రహ్మరంధ్రమువరకునున్న స్థానములయందు ఆరోహావరోహణక్రమముగ సంచరింపజేయబడిన వాయువు కలవాడై) యంతకాలమున భ్రూమధ్యమందున్న ఆజ్ఞాచక్రమునందు ప్రాణవాయువును నిలిపి, (సుషుమ్నానాడిచే మూలాధారస్థానమునుండి ప్రాణవాయువును ఊర్ధ్వముఖముగ తీసికొనివచ్చి) భ్రూమధ్యమున లెస్సగ స్థాపించి యోగి— "కవిం పురాణం" అనుదానిచే జెప్పబడిన లక్షణములు కలిగినట్టియు, సమస్తభూతములకు జనయితయు, నారాయణాదిశబ్దప్రతిపాద్యుడు నగు హిరణ్యగర్భుని పొందును. (అనగా ఆలోకమును పొందునని యర్థము.)

గీ॥ యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి య ద్యతయో వీతరాగాః ।
య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ ॥౧౧॥

పదవిభాగము:— యత్- అక్షరం- వేదవిదః- వదన్తి- విశంతి- యత్- యతయః- వీతరాగాః- యత్- ఇచ్ఛంతః- బ్రహ్మచర్యం- చరంతి- తత్- తే- పదం- సంగ్రహేణ- ప్రవక్ష్యే ॥౧౧॥

ప్రతిపదార్థము:— యత్=ఏబ్రహ్మపదార్థమును; అక్షరం=నశింపనిదానినిగ; వేదవిదః=వేదార్థజ్ఞులు; వదంతి=చెప్పుచుండిరో; విశంతి=ప్రవేశించుచుండిరో; (పొందుచుండిరో) యత్=ఏబ్రహ్మపదార్థమును; యతయః=ప్రయత్నశీలురగు సంన్యాసులు; వీతరాగాః=విగతరాగులై; (సమ్యగ్దర్శనము ప్రాప్తింప) యత్=ఏబ్రహ్మమును; విశన్తి=ప్రవేశించుచుండిరో; యత్=ఏబ్రహ్మమును; ఇచ్ఛంతః=తెలిసికొనుటకిచ్ఛగించినవారై; బ్రహ్మచర్యం= బ్రహ్మచర్యమును; (గురుసన్నిధానమున) చరన్తి=చేయుచుండిరో; తత్=అట్టి బ్రహ్మపదార్థమును; తే=నీకొరకు; సంగ్రహేణ=సంక్షేపముగా; ప్రవక్ష్యే=చెప్పెదను; ॥౧౧॥

శాంకరభాష్యమ్:—

యోగమార్గానుగమనేనైవ బ్రహ్మవిద్యా మంతరేణాపి బ్రహ్మ ప్రాప్యత ఇత్యేవం ప్రాప్త ఇద ముచ్యతే—పునరపి వక్ష్యమాణే నోపాయేన ప్రతిపిపిత్సితస్య బ్రహ్మణో వేదవిద్వదనాదివిశేషణవిశేష్యస్యాభిధానం కరోతి భగవాన్—య దక్షరం న క్షరతీ త్యక్షర మవినాశి వేద

శాంకరభాష్యతత్త్వబోధిని:—

బ్రహ్మవిద్యనువిడచి యోగమార్గము ననుసరించుటచేతనే బ్రహ్మమునుపొందవచ్చు ననెదవా? అట్లు కాదు. అని తెలుపుటకు శ్రీకృష్ణపరమాత్మ వేదవిద్వదనాదివిశేషణవిశేష్యమగు బ్రహ్మమునకు అభిధానమును (శబ్దమును) చేయుచుండెను. (చెప్పుచుండెను) లేక యేదో యొ

పౌరాణికులకువలె వైదికులమతమున బ్రహ్మ, విష్ణు, రుద్రలోకములు యొకదానిపై నొకటి కలదను కల్పన లేదు. ఇంకేమన; అన్నిలోకములును, హిరణ్యగర్భలోకాపరనామము గల సత్యలోకమునందే యంతర్భవించుచున్నవి. "పరా హి సోపాసనకర్మ్రణి ర్హిరణ్యగర్భప్రాప్త్యంతా" (ఉపాసనాసహితమగు కర్మయొక్క బలము హిరణ్యగర్భప్రాప్తి యంతముగాకలది.) యని బృహదారణ్యకతద్భాష్యములయందు స్పష్టపరుపబడెను. యోగి- మూలాధారచక్రమునుండి సుషుమ్నానాడీద్వారమున, భ్రూమధ్యభాగమున ఆజ్ఞాచక్రమున ప్రాణవాయువును స్థాపించినచో నితరమగు సర్వమును మరచి దివ్యపురుషునే స్మరించుట యను ప్రయోజనము సిద్ధించును. భ్రూమధ్యమునుండి వాయువును పైకితీసుకువెళ్ళుచున్న సమయమున మనస్సు మూర్ఛావస్థనొందును. గాన ఆయవస్థయందు అంతిమప్రత్యయము కలుగదు కాన, భ్రూమధ్యభాగమునందే యాయంతిమప్రత్యయమును సంపాదింపదగును. కాన, యర్చిరాదిమార్గపర్వద్వారమున స్థానవిశేషప్రాపకుడగు యమానవపురుషుని ప్రాప్యస్థానము స్మరింపదగును. తద్వాసనావాసితమగుమనస్సు-యోగిచే నూర్ధ్వగతనాడీద్వారమున ప్రాణముయుక్షిప్తమై ధనుర్ముక్తబాణమువలె బ్రహ్మాండకర్పరమును భేదించుకొని పయనించినచో-లబ్ధవృత్తికలదియై పూర్వసంస్కారప్రాబల్యముచేతను, యోగమాహాత్మ్యమువలనను దివ్యచిహ్నసంకలితము, అర్చిరాదిపర్వదేవతాభిపూజ్యమునగు యుత్తరోత్తరస్థానమును గూర్చి నీయమానమై, యమానవపురుషునితో కలిసికొనినవాడై వీనిచే నభిలషితమైన స్థానమును పొందించబడినదియై యుండ ఆయోగి అట్టియాత్మను జూచును. ఈవిషయమే "భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య" అనుదానిచే జెప్పబడెను. ॥౧౦॥

శాంకరభాష్యమ్:—

విదో వేదార్థజ్ఞా వదంతి "తద్వా ఏత దక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి" ఇతి శ్రుతేః । సర్వ విశేషనివర్తకత్వే నాభివదం త్యస్థూల మనణ్విత్యాది । కించ విశంతి ప్రవిశంతి సమ్యగ్దర్శనప్రాప్తౌ సత్యాం య ద్యతయో యతనశీలా స్సంన్యాసినో వీతరాగా విగతో రాగో యేభ్య స్తే వీత

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కానొక మంత్రాదులచే ధ్యానకాలమున భగవదనుస్మరణము ప్రాప్తింప అట్టి బ్రహ్మమును అభిధానముచే (శబ్దముచే) నియమనము చేయుటకొరకై స్మర్తవ్యముగ ప్రకృతపరమపురుషునకు వేదవృద్ధప్రసిద్ధిచే ప్రామాణికత్వమును శ్రీకృష్ణపరమాత్మ "యదక్షరం" అనుదానిచే చెప్పుచుండెను.

వేదార్థమును తెలిసినవారు యే బ్రహ్మమును నాశములేనిదానినిగ జెప్పుచుండిరో, ప్రత్యగ్బ్రహ్మము శబ్దమున కవిషయముకదా! అట్టిబ్రహ్మమును వేదార్థమును తెలిసినవారెట్లు

—• ౮వ అధ్యాయము ౧౧వ శ్లో. వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇపుడు ధ్యానకాలమున యేదో యొకయభిధానము (వాచకము) చే భగవదనుస్మరణము చేయదగియుండ "సర్వే వేదా యత్పద మామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి । య దిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ బ్రవీ మ్యో మి త్యేతత్" ఇత్యాదిశ్రుతిప్రతిపాదితమగుటచే ప్రధానమైనది ఓంకారమే. పరమేశ్వరాభిధానమైన యట్టి ఓంకారముచేతనే భగవదనుస్మరణము (ధ్యానము) చేయ నగును. ఇతరమంత్రాదులచే చేయరాదు. అని నియమించుటకు "యదక్షరం" అను దానిచే నుపక్రమించుచుండెను.

నాశరహితమగు యే ఓంకారమును బ్రహ్మముగ బ్రహ్మ (వేద) వేత్తలు "ఏతద్వైతదక్షరం గార్గి బ్రాహ్మణా అభివద న్త్యస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘం" ఇత్యాదివచనములచే సర్వవిశేషనివర్తనపురస్సరముగ చెప్పుచుండిరో— ఇట్టిది ఓంకార మని ప్రమాణకుశలుల (వేదవేత్తల) చేతనే తెలిసికొనబడలేదు. మరేమన? ముక్తులచేగూడ ముక్తప్రాప్యముగ ననుభూతమని "విశన్తి" అనుదానిచే చెప్పుచుండెను. యతనశీలురగు సంన్యాసులుగూడ వీతరాగులై సమ్యగ్దర్శనముచే స్వస్వరూపముగ నేయక్షరమును ప్రవేశించుచుండిరో,— కేవలము సిద్ధులచేతనే యనుభూతము కాదు. మరేమనిన! సాధకుల సర్వప్రయాసలు తదర్థమే యని "య దిచ్ఛన్తః" అనుదానిచే చెప్పుచుండెను:— ఏయక్షరస్వరూపమును తెలిసికొనవలె నని యిచ్ఛచే నైష్ఠికబ్రహ్మచారులుగూడ గురుకులవాసాదితపస్సును యావజ్జీవమాచరించుచుండిరో,— తెలియదగిన యట్టి యక్షరమును నీకొఱకు సంగ్రహముగ (ఎట్లు నీవు సులభముగ తెలిసికొనెదవో యట్లు) చెప్పెదను. కాన నాయక్షరమును నేనెట్లు తెలిసికొందు నని వ్యాకులుడవు కాకు మని యభిప్రాయము. ఇచట పరబ్రహ్మమునకు వాచకరూపముచే ప్రతిమవలెను, ప్రతీకరూపముచేతను "యః పున రేతం త్రిమాత్రే ణో మిత్యనేనైవాక్షరేణ పరం పురుష మభిధ్యాయీత స తదధిగచ్ఛతి" ఇత్యాదివచనములచే మందమధ్యమబుద్ధికలవారలకు క్రమముక్తిఫలకమైన యుపాసన చెప్పబడెను. ఆ యుపాసనమే యిట భగవంతునిచే వివక్షితము. కాన యోగధారణాసహితమైన ఓంకారోపాసనము, తత్ఫలము, స్వస్వరూపము, దానివలన అపునరావృత్తి, తన్మార్గము అను నీవిషయము లన్నియు, యీయధ్యాయసమాప్తివరకు చెప్పబడుచుండెను. ||౧౧||

శాంకరభాష్యమ్:—

రాగాః । యచ్చాక్షర మిచ్ఛంతో జ్ఞాతు మితి వాక్యశేషః । బ్రహ్మచర్యం గురౌ చరంతి తత్తే పదం త దక్షరాఖ్యం పదం పదనీయం తే తుభ్యం సంగ్రహేణ సంగ్రహ స్సంక్షేప స్తేన సంక్షేపేణ ప్రవక్ష్యే కథయిష్యామి ॥ ॥౧౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చెప్పెదరనెదవా? బ్రహ్మమునకు గల శబ్దావిషయత్వమును విడువకయే వేదార్థజ్ఞులు బ్రహ్మమును చెప్పుచుండిరి. ఈవిషయమునే "తద్వా ఏత దక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్తి" అను శ్రుతి బోధించుచున్నది. అది యెట్లనిన: బ్రహ్మమునకు యేవిశేషములు లేవు. అస్థూలము, అనణువు. సర్వవిశేషనివర్తకముగ బ్రహ్మమును చెప్పుచుండిరి. ఈచెప్పబడిన బ్రహ్మము కేవలము విద్వదనుభవసిద్ధమే కాదు. మరేమనిన? ముక్తప్రాప్యముగ ముక్తులకుకూడ సిద్ధమే.

శంకరానందీయము:— ముముక్షువు లగు యతులకు యే నిర్విశేషపరబ్రహ్మము సద్గురువువలన తెలిసికొనదగినదో, అట్టి నిర్విశేషపరబ్రహ్మమును– ముముక్షువులగు యతులుతీవ్రమోక్షేచ్ఛచే ప్రవర్తించుటకై సిద్ధికొరకు "యదక్షరం" అను శ్లోకముచే స్తుతించుచుండెను.

నిఖిలవేదములు తమతమ యుపనిషన్ముఖమున బ్రహ్మమునే ప్రతిపాదించుచున్నవి. ఆయుపనిషద్వాక్యము లేవనిన? "ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్" "సర్వం తత్ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానం బ్రహ్మ" "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" "సత్యం చానృతంచ సత్య మభవత్" "స య శ్చాయం పురుషః" "ఈశా వాస్య మిదగ్ం సర్వం" "అహం బ్రహ్మాస్మి" "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" "ఐతదాత్మ్య మిదగ్ం సర్వం" "తత్త్వమసి" 'సర్వం హ్యేత ద్బ్రహ్మ' "అయ మాత్మా బ్రహ్మ" అనునవి మొదలైనవి. కాన సర్వవేదములకు తాత్పర్యవిషయభూతమైన యర్థము పరబ్రహ్మమే యగుచున్నది. కాన వేదార్థమగు నిరుక్తలక్షణములుకల పరబ్రహ్మమును సాక్షాత్తు తనస్వరూపముగ యెవరు తెలిసికొనుచున్నారో వారు వేదవిదులు. (బ్రహ్మవిదులు.) అట్టి యాజ్ఞవల్క్యాదులందరు జ్ఞానాజ్ఞానాదినాశ తత్సాధనములచే నశింపనది– కాన "అక్షరం" అని చెప్పబడుచున్నది. ఆయక్షరము (నశింపనిది) నిత్యము, కూటస్థము, అసంగము, చిదేకరసము, అద్వితీయము నగు పరబ్రహ్మమే. 'ఏతద్వైత దక్షరం గార్గి బ్రాహ్మణా అభివద న్త్యస్థూల మన ణ్వహ్రస్వమ్" ఇత్యాదిశ్రుత్యుక్తరీతిచే అశేషవిశేషాపవాదపురస్సరముగ నిష్కలము, నిష్క్రియము, శాంతము, అనంతరమునగు పరబ్రహ్మమును నిశ్శేషముగ నశించిన రాగాదిదోషములుకల సమ్యజ్ఞానసంపన్నులగు యతులు శిష్యులకొఱ కుపదేశించుచుండిరో, "సంప్రాప్యైన మృషయో జ్ఞానతృప్తాః"అను శ్రుత్యుక్త ప్రకారము జ్ఞాను లేపరబ్రహ్మమును పొందుచుండిరో, ఏపరబ్రహ్మమును గురువువలన తెలిసికొను యిచ్ఛకలవారై బ్రాహ్మణులు "భూయ ఏవ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంవత్సరం సంవత్స్యథ" అను శ్రుత్యుక్తరీతిని గురుసన్నిధియందు బ్రహ్మచర్యము నాచరించుచుండిరో, (బ్రహ్మచర్యమనగ దృష్టాదృష్టసర్వవిషయసుఖవైముఖ్యముతో ఆహారాదినియమపురస్సరముగ స్వధర్మము తోడను, శ్రద్ధతోడను, భక్తితోడను సద్గురుసన్నిధియందు వేదాన్తశ్రవణమే) "పద్యతే ప్రాప్యత ఇతి పదం" జ్ఞానముచే పొందబడు– అట్టి పరబ్రహ్మమును నీకొఱకు "పర స్తస్మాత్తు భావోఽన్యః" అను శ్లోకముచే సంక్షేపముగ చెప్పగలను. ॥౧౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అని "విశన్తి" అనుద్వితీయపాదముచే చెప్పుచుండెను. సమ్యగ్దర్శనము ప్రాప్తింప వీతరాగులు, యతనశీలురు నగు సంన్యాసులు యేబ్రహ్మమును పొందుచుండిరో. జ్ఞానార్థము బ్రహ్మచర్యవిధానమువలనగూడ బ్రహ్మము జ్ఞేయము, ప్రసిద్ధ మని మూడవపాదముచే "యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి" అనుదానిచే చెప్పుచుండెను. ఏబ్రహ్మమును తెలిసికొనుటకు కోరికగలవారై గురుసన్నిధియందు చరించుచుండిరో, అట్టి నాశరహితమైన పరమపురుష రూపమగు స్థానమును నీకొరకు సంక్షేపముగా చెప్పెదను. ॥౧౧॥

భాష్యార్థదీపిక:— ఇపుడు యేదో యొక మంత్రముచే ధ్యానకాలమునందు భగవదనుస్మరణము చేయవచ్చు నను శంకను "స యో హ వై తద్భగవ న్మనుష్యే ష్వాప్రాయణాం త మోంకార మభిధ్యాయీత కతమం వా వ స తేన లోకం జయతి తస్మై స హోవాచ ఏత ద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః" ఓ భగవంతుడవగు పిప్పలాద! మనుష్యులలో నెవడు మరణపర్యంతము ఆఓంకారమును ధ్యానించునో వాడాధ్యానముచే యేలోకమును జయించును! (పొందును) అనిశిష్యుడగుసత్యకాముడు ప్రశ్నింప ఆతనిగూర్చి గురువగు పిప్పలాదు డిట్లు సమాధానమును చెప్పెను— ఓ సత్యకాముడా! ఓంకారము పరాపరబ్రహ్మస్వరూపము అని యుపక్రమించి "యః పునరేతం త్రిమాత్రే ణోమిత్యేతేనైవాక్షరేణ పరం పురుషమభిధ్యాయీత" ఎవడు అకార ఉకార మకారరూపమగు ఓంకారముచే పరమపురుషుని ధ్యానించునో. అనియు, "ప్రణవో ధను శ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే । అప్రమత్తేన వేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్" ఓంకారము ధనుస్సు. జీవుడు బాణము. బ్రహ్మము లక్ష్యము. జీవు డనుశరమును ప్రణవమను ధనుస్సునందు సంధించి బ్రహ్మమను లక్ష్యమును ప్రమాదరహితుడై కొట్టవలయును. శరము లక్ష్యమునందు ప్రవేశించి లక్ష్యస్వరూపమైనటుల బ్రహ్మస్వరూపుడగును. కఠోపనిషత్తునందు "అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మాత్" ధర్మాధర్మభిన్నుడు అని యుపక్రమించి "సర్వే వేదా యత్పద మామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి । య దిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ బ్రవీ మ్యో మిత్యేతత్" నిఖిలవేదములు యేపదమును చెప్పుచున్నవో, నిఖిలతపస్సులు దేనిని చెప్పుచున్నవో, దేనిని కోరి బ్రహ్మచర్యము నాచరించుచుండిరో ఓనచికేతస్కుడా? అట్టి పదమును సంగ్రహముగ నీకొఱకు చెప్పెద వినుము. ఆపదము "ఓమ్" అనునదే. ఇత్యాదివచనములచే పరబ్రహ్మమునకు వాచకరూపమున, ప్రతిమవలె ప్రతీకరూపమున పరబ్రహ్మసాధనముగ మందమధ్యమబుద్ధులకొరకు వివక్షితమైన ఓంకారోపాసనకు యేకాలాంతరముక్తిఫలము చెప్పబడెనో అదియే యిచటను ఓంకారముచేతనే భగవంతుడు స్మరింపదగినవాడు. అను యాశయముచే "యదక్షరం" అని చెప్ప మొదలిడెను.

వేదమున కర్థము తెలిసినవారు దేనిని నశించనిదానినిగ "త ద్వా ఏత దక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్తి" అను శ్రుతివలన "అస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘ మశబ్ద మరూప మవ్యయం" ఇత్యాది శ్రుతులచే సర్వవిశేషనివృత్తముగను చెప్పుచుండిరో, కేవలమట్లు చెప్పుటయే కాదు. మరేమనిన? సమ్యగ్దర్శనప్రాప్తియందు నశించిన రాగాదులుగల యతనశీలురగు సంన్యాసులు సమ్యగ్దర్శనము ప్రాప్తించినపిదప దేనిని ప్రవేశించుచుండిరో, దేనిని తెలిసికొన కోరిక కలవారై గురుసన్నిధియందు బ్రహ్మచర్యమును "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి" అను శ్రుతిచొప్పున నాచరించుచుండిరో అట్టి పదమును నీకొఱకు సంగ్రహముగ చెప్పగలను. ॥౧౧॥

గీ॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్ ॥ ॥౧౨॥

పదవిభాగము:— సర్వద్వారాణి- సంయమ్య- మనః- హృది- నిరుధ్య- చ- మూర్ధ్ని- ఆధాయ- ఆత్మనః- ప్రాణం- ఆస్థితః- యోగధారణామ్ ॥౧౨॥

ప్రతిపదార్థము:— సర్వద్వారాణి=ఉపలబ్ధి (ప్రత్యక్ష) సాధనములగు నిఖిలద్వారములను; (త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములను) సంయమ్య=నియమన మొనరించి; (అనగా తత్తద్విషయములయందు ప్రవేశింపకుండగ జేసి) మనః=మనస్సును; హృది=హృదయమందు; నిరుధ్యచ=నిరోధించి, (అరికట్టి) అనగా ప్రచారము లేనిదానిగ జేసి; ఆత్మనః=తనయొక్క; ప్రాణం=ప్రాణమును; మూర్ధ్ని=మూర్ధన్యప్రదేశమునందు; ఆధాయ=ప్రతిష్ఠించి; యోగధారణాం=యోగముయొక్క ధారణను; ధారయితుం=ధరింప జేయుటకు; (ఈపదమధ్యాహార్యము) ఆస్థితః=ప్రవృత్తుడై;... ॥౧౨॥

శాంకరభాష్యమ్:—

"స యో హ వై తద్భగవ న్మనుష్యేషు ప్రాయణాంత మోంకార మభిధ్యాయీత కతమం వావ స తేన లోకం జయతీతి । తస్మై స హోవాచ, ఏత ద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ య దోంకారః" ఇ త్యుపక్రమ్య "యః పున రేతం త్రిమాత్రే ణో మిత్యేతే నైవా క్షరేణ పరం పురుష మభిధ్యాయీత" ఇత్యాదినా వచనేన "అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మాత్" ఇతి చోపక్రమ్య "సర్వే వేదా యత్పద మామనంతి తపాంసి సర్వాణి చ య ద్వదంతి । య

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"స యో హ వై తద్భగవ న్మనుష్యేషు ప్రాయణాన్త మోంకార మభిధ్యాయీత కతమం వా వ స తేన లోకం జయతీతి తస్మై స హోవాచ, ఏత ద్వై సత్యకామ-పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః" అభిధ్యానఫలమును తెలిసికొనదలచిన సత్యకాముని చే "భగవన్" అని పిప్పలాదుడు సంబోధింపబడి యభిముఖముగ చేసుకొనబడెను. ఈశ్రుతి యందు గల "హవై" అను రెండునిపాతలు ప్రసిద్ధార్థమును ద్యోతన చేయుచు అభిధ్యానము ఫలము కలవగుటచే కర్తవ్యముగ తెలుపుచున్నవి. మనుష్యులలో అధికృతుడగు యెవడు

—• ౮వ అధ్యాయము ౧౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయమ్:— పూర్వశ్లోకమునందు "ప్రవక్ష్యే" అని ప్రతిజ్ఞాతమైన యర్థమును యుపకరణములతోగూడ "సర్వద్వారాణి" అను శ్లోకము మొదలుకొని రెండుశ్లోకములచే చెప్పుచుండెను.

సర్వేంద్రియద్వారములను స్వవిషయములనుండి మరలించి (అనగా విషయదోషదర్శనాభ్యాసముచే విషయవైముఖ్యమును పొందించబడిన శ్రోత్రాదీంద్రియములచే శబ్దాదివిషయగ్రహణమును చేయనివాడై,) అట్లు బాహ్యేంద్రియములను నిరోధించినను మనస్సునకు ప్రచారము సంభవించు నను శంకను తొలిగించుటకు "మనో హృది నిరుధ్యచ" అని చెప్పెను. షష్ఠాధ్యాయమునందు వ్యాఖ్యానింపబడిన అభ్యాసవైరాగ్యములచే

శాంకరభాష్యమ్:—

దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి త త్తే పదం సంగ్రహేణ బ్రవీ మ్యో మిత్యేతత్" ఇత్యాదిభి శ్చ వచనైః పరస్య బ్రహ్మణో వాచకరూపేణ ప్రతిమావ త్ప్రతీకరూపేణ చ పరబ్రహ్మప్రతి పత్తిసాధనత్వేన మందమధ్యమబుద్ధీనాం వివక్షిత స్యోంకార స్యోపాసనం కాలాంతరే ముక్తిఫల ముక్తం యత్త దేవేహాపి "కవిం పురాణ మనుశాసితారం" "యదక్షరం వేదవిదో వదంతి" ఇతి చోపన్యస్తస్య పరస్య బ్రహ్మణః పూర్వోక్తరూపేణ ప్రతిపత్త్యుపాయభూత స్యోంకారస్య కా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రసిద్ధమగు యభిధ్యాన మెట్లు సిద్ధించునో అట్లు సర్వవేదసారభూతమైన ఓంకారమును అభి ముఖ్యముచే ధ్యానింపవలెను. (ఆభిముఖ్యముచే ధ్యానించుటయే అభిధ్యానము) ఆయభి ధ్యానము "ఆప్రాయణాత్" అనున్యాయముచే మరణాంత మనుష్ఠేయము. ఇట్లనుష్ఠానము చేయువాడు ప్రకృతాభిధ్యానముచే జయింపదగిన లోకము లనేకము లుండ యేలోకమును జయించు నని ప్రశ్నించిన సత్యకామునికొఱకు ఆచార్యుడగు పిప్పలాదుడు సమాధాన మును చెప్పెను. అందు మొట్టమొదట అభిధ్యేయమగు ఓంకారమును పరాపరబ్రహ్మ స్వరూపముగ చెప్పి గొప్పదానినిగ "ఏతద్వై" ఇత్యాదివాక్యముచే చేయుచుండెను. ఓసత్య కాముడా! ఓంకారము పరాపరబ్రహ్మస్వరూపము. అని యుపక్రమించి యెవడు అకార, ఉకార, మకారాత్మకమగు ఓంకారముచే పరబ్రహ్మమును ధ్యానించునో వాడు యభి ధ్యానానుగుణముగ పరబ్రహ్మమును పొందును. అనుమొదలగువానిచే ఓంకారోపాసన చెప్పబడెను. ఇది ప్రశ్నోపనిషద్వాక్యము. దీనివలె కఠవల్లియందు గూడ "అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మాత్" నచికేతస్కుడు ధర్మాధర్మవిలక్షణమైనదానిని చెప్పుమను ప్రశ్నతో యుపక్రమింపబడి మృత్యువుచే 'సర్వే వేదా య త్పద మామనన్తి తపాంసి సర్వాణి చ య ద్వదన్తి। య దిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ బ్రవీ మ్యో మిత్యే తత్' సర్వవేదములు వ్యవధానావ్యవధానములచే యేపదమును చెప్పుచున్నవో, నిఖిల తపస్సులు దేనిని చెప్పుచున్నవో, దేనిని కోరి బ్రహ్మచర్యము నాచరించుచుండిరో, ఆపద మును నికొఱకు సంగ్రహముగ చెప్పెదను. అది ఓంకారమే యని చెప్పబడెను. కాన పైనుద హరింపబడిన కఠవల్లీస్థవాక్యములచే పరబ్రహ్మవాచకముగకాని, ప్రతిమాదులవలె ప్రతీక

హృదయదేశమునందు మనస్సునకు నిర్వృత్తికత్వమును పొందించి అనగా లోనకూడ విషయచింతనను చేయుని వాడై, ఇట్లు లోపల వెలుపల నిఖిలోపలబ్ధిద్వారములను లెస్సగ నిరోధించి క్రియాద్వార మగు ప్రాణమును కూడ సర్వమునుండి నిగ్రహించి భూమిజయక్రమముచే భ్రూమధ్యయందు, తదుపరిభాగమునందు గురూప దిష్టమార్గముచే ప్రాణమును యుంచి యాత్మవిషయసమాధిరూపమగు ధారణను ఆశ్రయించిన వాడై, (ఉత్తరశ్లోక ముతో సంబంధము.) ఇచట'ఆత్మనః' అనిచెప్పుటచే దేవతాంతరవిషయకసమాధి కాదని స్పష్టపరచబడెను. ॥౧౨॥

శాంకరభాష్యమ్:—

లాంతరముక్తిఫల ముపాసనం యోగధారణాసహితం వక్తవ్యం ప్రసక్తానుప్రసక్తం చ యత్కించి దిత్యేవ మర్థ ఉత్తరో గ్రంథ ఆరభ్యతే— సర్వద్వారాణి సర్వాణి చ తాని ద్వారాణి చ సర్వద్వారా ణ్యుపలబ్ధౌ తాని సర్వాణి సంయమ్య సంయమనం కృత్వా మనో హృది హృదయ పుండరీకే నిరుధ్య నిరోధం కృత్వా నిష్ప్రచార మాపాద్య తత్ర వశీకృతేన మనసా హృదయా దూర్ధ్వగామిన్యా నాడ్యోర్ధ్వ మారుహ్య మూర్ధ న్యాధా యాత్మనః ప్రాణ మాస్థితః ప్రవృత్తో యోగధారణాం ధారయితుమ్ ॥ ॥౧౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

రూపముగకాని మందమధ్యమబుద్ధులు కలవారలకు పరబ్రహ్మజ్ఞానసాధనముగ వివక్షితమైన యే ఓంకారోపాసనము ముక్తిఫలము కలదిగ చెప్పబడెనో ఆఓంకారోపాసనమే యీభగవద్గీత యందుగూడ 'కవిం పురాణం, యదక్షరం' ఇత్యాదికముచే చెప్పబడెను. అట్టి పూర్వమునందు చెప్పబడిన పరబ్రహ్మప్రతిపత్త్యుపాయభూతమైన ఓంకారముయొక్క కాలాంతరముక్తిఫల మగు యుపాసనము యోగధారణాసహితముగ చెప్పదగినది. మరియు ప్రసక్తానుప్రసక్త మగు నితరము చెప్పదగిన దని యుత్తరగ్రంథ మారంభింపబడుచున్నది.

ఉపలబ్ధి (జ్ఞాన) సాధనమైన సర్వద్వారములను (సర్వేంద్రియములను) నియమనము జేసి, మనస్సును హృదయపుండరీకమునం దరికట్టి (మనస్సును విషయములయందు ప్రవేశింపకుండగ జేసి) హృదయపుండరీకమునందు వశీకృతమైన మనస్సుచే హృదయపుండరీకమునుండి యూర్ధ్వముగ బయలుదేరిన సుషుమ్నానాడీద్వారమున తన ప్రాణమును కంఠ భ్రూమధ్యలలాటక్రమమున మూర్ధన్యప్రదేశమునందు స్థాపించి యోగధారణను అధిష్ఠించి బ్రహ్మమును బ్రహ్మవాచకమగు ఓంకారము నుచ్చరించుచు ఓంకారార్థమగు నన్ను స్మరించుచు పరమగతిని (మోక్షమును) పొందునని యుత్తరగ్రంథముతో సంబంధము. ॥౧౨॥

శంకరానందీయము:— "సతం పరం పురుష ముపైతి దివ్యం" అని యోగిప్రాప్యవస్తు వర్ణనప్రసంగమువలన జ్ఞానిప్రాప్యవస్తువుయొక్క వర్ణనముకూడ సంప్రాప్తమైనది. కాన జ్ఞానిప్రాప్యవస్తువర్ణన ముకూడ కొంచెమొనరించి ప్రకృతమైన యోగిప్రయాణమును "సర్వద్వారాణి" అనుదానిచే జెప్పుచుండెను. నాశికారంధ్రనే, త్రరంధ్ర, శ్రోత్రరంధ్ర, ముఖ, అధోబిల, లింగరంధ్రములుఇవి వాయునిర్గమనద్వారములు. ఇట్టి సర్వ ద్వారములనుయోగబలముచేనరికట్టివెలుపల, లోపలవ్యాపించుస్వభావముకల మనస్సునుహృదయమందు నిరోధించి, సర్వాంగములయందు సంచరించు ప్రాణవాయువును హృదయస్థానమును పొందించి, యీప్రాణవాయువును సుషుమ్నానాడియందు ప్రవేశపెట్టి, విశుద్ధచక్రమును, అనాహతచక్రమును, అజ్ఞాచక్రమును :అతిక్రమించి ప్రాణమును బ్రహ్మరంధ్రమునందు, ద్వాదశాంతమునందు, షోడశాంతమునందు నిలిపి యోగప్రక్రియతో నుత్క్రమణగతిని పొందినవాడై యోగి(ఉత్తరశ్లోకముతో సంబంధను.) ॥౧౨॥

గీ॥ ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజ న్దేహం స యాతి పరమాం గతిమ్ ॥ ॥౧౩॥

పదవిభాగము:— ఓమ్- ఇతి- ఏకాక్షరం- బ్రహ్మ- వ్యాహరన్- మాం- అనుస్మరన్- యః- ప్రయాతి- త్యజన్- దేహం- సః- యాతి- పరమాం-గతిమ్ ॥౧౩॥

ప్రతిపదార్థము:— బ్రహ్మణః=పరబ్రహ్మవాచకమగు; ఓమితి='ఓమ్' అనెడి, ఏకాక్షరం=ఒక యక్షరమును; వ్యాహరన్=ఉచ్చరించుచు; మాం=ఓంకారార్థమగు బ్రహ్మమును; అనుస్మరన్=స్మరించుచున్నవాడై; దేహం=శరీరమును; త్యజన్=విడుచుచు; యః=ఏయోగి; ప్రయాతి=మరణించునో; సః=వాడు; పరమాం=ఉత్కృష్టమైన; గతిమ్=గతిని; యాతి=పొందుచున్నాడు. ॥౧౩॥

---

## —• ౮ అధ్యాయము ౧౩వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఓంకారము బ్రహ్మవాచక మగుటవలనకాని, ప్రతిమవలె బ్రహ్మప్రతీకమగుటవలనకాని బ్రహ్మమనబడుచున్నది. అట్టి "ఓం" అను ఏకాక్షరమును ఉచ్చరించుచు ("ఓమితి" వ్యాహరన్" అని ఇంతమాత్రమే సరిపడుచుండ "ఏకాక్షరం" అనికూడ చెప్పుట అనాయాసముగ నుచ్చరింపదగిన దని చెప్పుటచే తాత్పర్య మని గ్రహింపనగును.) లేక "ఓమ్" అని యుచ్చరించుచు "ఏకాక్షరం" "ఏకం" అద్వితీయము, "అక్షరం" నాశరహితము, సర్వవ్యాపకము, బ్రహ్మము. "ఓమ్" అను పదముయొక్క యర్థమగు నన్ను "స్మరన్" స్మరించుచు, అనగా ప్రణవమును జపించుచు ప్రణవాభిధేయ మగు నన్ను స్మరించుచు మూర్ధన్యమగు సుషుమ్నానాడీద్వారమున దేహమును త్యజించుచు నెవడు బయలువెడలునో అట్టివాడు దేవయానమార్గముచే బ్రహ్మలోకమును పొంది బ్రహ్మలోకమున భోగముల ననుభవించి అనంతరమున యుత్కృష్టమగు నాస్వరూపమైన గతిని పొందుచున్నాడు. ఈవిషయమున పతంజలి "తీవ్రసంవేగానా మాసన్నః" సమాధిలాభము అనిచెప్పి "ఈశ్వరప్రణిధానాద్వా" అని చెప్పెను. ప్రణిధానశబ్దార్థము షష్ఠాధ్యాయమున వ్యాఖ్యాతము. "తస్య వాచకః ప్రణవః" ప్రణవము యీశ్వరవాచకము. "తజ్జప స్తదర్థభావనం" ప్రణవజపము ప్రణవార్థభావనము. "సమాధిసిద్ధి రీశ్వరప్రణిధానాత్" ఈశ్వరప్రణిధానమువలన సమాధిసిద్ధి అని చెప్పెను. ఇచట యన్ననో సాక్షాత్తు ఓంకారోపాసనవలన పరమగతిలాభ మని చెప్పబడెను. కాన విరోధపరిహారముకొఱకు "ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్" బ్రహ్మస్వరూపమగు ఓం అను యేకాక్షరము నుచ్చరించుచు "మా మనుస్మరన్" ఆత్మవిషయకయోగధారణను పొందినవాడై అని వ్యాఖ్యానింపదగును. విచిత్రఫలత్వోపపత్తివలనగాని విరోధము లేదు. ॥౧౩॥

శంకరానందీయము:— "ఏకం చ తదక్షరం చ ఏకాక్షరం" "ఓం" అనునది యొకటియే యక్షరము. ఇది బ్రహ్మవాచక మగుటచే బ్రహ్మ మనబడును. అట్టి ప్రణవము అకార, ఉకార, మకారాత్మకమైన త్రిమాత్రలు కలది. అట్టి ప్రణవమును దీర్ఘఘంటానాదమువలె వాక్కుచే ప్రస్ఫుటముగ నుచ్చరించుచు "కవిం పురాణం" అనుదానిచే చెప్పబడిన ఓంకారార్థ మగు పరమేశ్వరుని మనస్సుచే ధ్యానించుచు శీర్షకపాలమును భేదించుకొని స్థూలదేహము నీలోకమున విడచి యెవడు సూక్ష్మదేహముతో పూర్వోక్తక్రమమున ధూమ్యాదికమును భేదించి బయలువెడలునో ఆయోగి విదేహముక్తిని పొందుచున్నాడు. ॥౧౩॥

శాంకరభాష్యమ్:—

తత్రైవ చ ధారయన్— ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ బ్రహ్మణోఽభిధానభూత మోంకారం వ్యాహర న్నుచ్చారయం స్తదర్థభూతం మా మీశ్వర మనుస్మర న్ననుచింతయ న్యః ప్రయాతి మ్రియతే స త్యజ న్పరిత్యజ న్దేహం శరీరం త్యజ న్దేహ మితి ప్రయాణవిశేషణార్థం దేహత్యాగేన ప్రయాణ మాత్మనో న స్వరూపనాశేనేత్యర్థః । స ఏవం త్యజ న్యాతి గచ్ఛతి పరమాం ప్రకృష్టాం గతిమ్ ॥ ॥౧౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యథోక్తయోగధారణ నిమిత్తమై ప్రవర్తించినవాడు మూర్ధన్యప్రదేశమునందు ప్రాణమును ధారణచేసినవాడై పరబ్రహ్మవాచకమగు "ఓమ్" అనెడి యేకాక్షరము నుచ్చరించుచు, యెవడు దేహమును త్యజించుచు మరణించునో వా డుత్కృష్టగతిని పొందును. ఇచట "త్యజ న్దేహం" అనునది ప్రయాణవిశేషణము. దానివలన దేలిన యాశయమేమి? ఆత్మకు దేహత్యాగముచేతనే ప్రయాణము. ఇంతియేకాని స్వరూపనాశముచేత కాదని యర్థము. ॥౧౩॥

౧౧, ౧౨, ౧౩ శ్లోకములకు నీలంకణీయము:— ప్రతీకముగా జింతింపదగు ప్రణవమును వాచ్యవాచకాఽభేదవివక్షతో స్తుతించుచుండెను.— "యదక్షరం వేదవిదో వదన్తి" పరబ్రహ్మవాచకమగు యే ఓంకారమును వేదాధ్యయనారంభమున వేదవేత్త లుచ్చరించుచుండిరో, ఏఓంకారమును యతీశ్వరులు బ్రహ్మప్రతీకముగ నాశ్రయించుచుండిరో, ఏఓంకారమును కోరినవారై బ్రహ్మచర్యమును జేయుచుండిరో, అట్టి అకార, ఉకార, మకారాత్మకమైన పదమును నీకొఱకు సంగ్రహముగ జెప్పుచుంటిని. (ఇది పరబ్రహ్మవాచకప్రణవపరమైన యర్థము.)

లేక, ఓంకారవాచ్యమగు యేపరబ్రహ్మమును "ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివద న్త్యస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘం" అను శ్రుత్యుక్తలక్షణములు కలదానినిగ యుపనిషద్వేత్తలు చెప్పుచుండిరో, ఏపరబ్రహ్మమును కోరినవారై యతీశ్వరులు- నదులు, సముద్రమును జేరువిధముగ పొందుచుండిరో, ఏపరబ్రహ్మమును కోరినవారై గురూపసదనాత్మకమగు బ్రహ్మచర్యమును జేయుచుండిరో, అట్టి పొందదగిన విష్ణుస్థానమును సంగ్రహముగ నీకొరకై చెప్పుచున్నాను. (ఇది ఓంకారవాచ్యపరబ్రహ్మపరమగు యర్థము.) వాచ్యవాచకములగు, పరబ్రహ్మ, ప్రణవముల యభేదము శ్రుతిచ్ఛాయచే గమ్యమాన మగుచున్నది- ఎట్లనః- అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాత్" అను శ్రుతిచే బరబ్రహ్మమును ప్రకృతముగ జేసుకొని, "సర్వే వేదా యత్పద మామనన్తి తపాంసి సర్వాణి చ య ద్వదన్తి । య దిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి త త్తే పదం సంగ్రహేణ బ్రవీ మ్యో మిత్యేతత్" అని యోంకారముతోనే యుపసంహరించుటవలన యోంకారమును ప్రతీకముగ కల్పించి తద్ద్వారమున శుద్ధశబలాన్యతర బ్రహ్మము తెలిసికొనదగు నని చెప్పబడెను. ఇట్లే శ్రుత్యంతరమున "ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః" అని యుపక్రమించి, "తస్మా దేవం విద్వా నేతేనైవాయతనే నైకతర మన్వేతి" అని చూపబడెను. ॥౧౧॥

గీ॥ అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః॥ ॥౧౪॥

పదవిభాగము:— అనన్యచేతాః- సతతం-యః- మాం- స్మరతి- నిత్యశః- తస్య- అహం- సులభః- పార్థ- నిత్యయుక్తస్య- యోగినః॥ ॥౧౪॥

ప్రతిపదార్థము:— అనన్యచేతాః=ఇతరవిషయములందు చిత్తములేని; యః=ఏయోగి; సతతం=ఎల్లప్పుడు; నిత్యశః=నిత్యము; మాం=పరమేశ్వరుడనగునన్ను; స్మరతి=స్మరించునో; హే పార్థ=ఓయర్జున; నిత్యయుక్తస్య=యెల్లప్పుడు సమాహితుడగు; తస్య=అట్టి; యోగినః=యోగికి; అహం=నేను; సులభః=సుఖముగ లభ్యుడను. ॥౧౪॥

శాంకరభాష్యమ్:—

కించ— అనన్యచేతా నాన్యవిషయే చేతో యస్య సోఽయ మనన్యచేతా యోగీ సతతం సర్వదా యో మాం పరమేశ్వరం స్మరతి నిత్యశః। సతత మితి నైరంతర్య ముచ్యతే। నిత్యశ ఇతి దీర్ఘకాలత్వ ముచ్యతే। షణ్మాసం సంవత్సరం వా కిం తర్హి యావజ్జీవం నైరం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రాణవాయునిరోధమునం దసమర్థులకు పైనిచెప్పిన రీతిని స్వేచ్ఛాప్రయుక్తమైన యుత్క్రమణము సంభవింపనందున వారలకు పరమగతి దుర్లభము కావలసివచ్చునే! యనెదవా? అట్లు కాదు. ఎవడు విషయాంతరములయందు చిత్తమును పోనీయక నిరంతరము నిత్యము (దీర్ఘ కాలము) పరమేశ్వరుని స్మరించునో (అనగా ఆరుమాసములు కాదు, సంవత్సరము కాదు. మరేమనిని యావజ్జీవము నిరంతరము యెవడు నన్ను స్మరించునో యని యర్థము) అట్టి సదా సమాహితు

భ్రూమధ్యమునందు ప్రాణము నెట్లుంచవలెనో చెప్పుచున్నాడు.- "సర్వద్వారాణి" శబ్దాదివిషయ గ్రహణద్వారములగు యింద్రియములను నిగ్రహించి, అట్లే మనస్సును హృదయమునందు నిరోధించి, వానికి కంచుకరూపమైన ప్రాణమును సుషుమ్నానాడీద్వారమున భ్రూమధ్యమునందుంచి, యోగశాస్త్రోక్తమగు ధారణను ఆచరించుచున్నవాడై (ముందుశ్లోకముతో నన్వయము.) ॥౧౨॥

ఓంకారరూపమగు యొకే అక్షరమును వర్ణమును, బ్రహ్మము నుచ్చరించు చున్నవాడై, బ్రహ్మభూతుడనగు నన్ను స్మరించుచున్నవాడై, (లోకమున యెవడైన నొకానొకడు దేవదత్తుని స్మరించుచు అతనిని పిలచుచున్నచో సన్నిహితుడైన యాదేవదత్తు డభిముఖుడగుచున్నాడు. ఇట్లే పరబ్రహ్మవాచకమగు యోంకారోచ్చారణముచేతను, స్మరణముచేతను, స్వభావతః సర్వవ్యాపకమైన పరబ్రహ్మము సాధకునకు సన్నిహితమగును. కాన అట్టి సమయమున) యెవడు దేహమును విడుచుచు యూర్ధ్వనాడీద్వారమున యుత్క్రమించునో అట్టివాడు సన్నికృష్టబ్రహ్మరూపాపత్తిరూపమగు యుత్కృష్టగతిని పొందుచున్నాడు. "ఏషాస్య పరమా గతి రేషాస్య పరమా సంప దేషోఽస్య పరమ ఆనందః" అను శ్రుతిచొప్పున బ్రహ్మలోకప్రాప్తిద్వారమున నన్నే పొందు నని యాశయము. ॥౧౧, ౧౨, ౧౩॥

—• ౮వ అధ్యాయము ౧౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఏవ మీవిధమున ప్రాణవాయునిరోధచాతుర్యముచే భ్రూమధ్యయందు ప్రాణమును నిలిపి బ్రహ్మరంధ్రమును పొందిన సుషుమ్నానాడీద్వారా స్వేచ్ఛగా దేహమును

శాంకరభాష్యమ్:—

తత్యేన యో మాం స్మరతీ త్యర్థః। తస్య యోగినోఽహం సులభః సుఖేన లభ్యః పార్థ! నిత్య యుక్తస్య సదా సమాహితస్య యోగినః। యత ఏవ మతోఽనన్యచేతాః స న్మయి సదా సమాహితో భవేత్ ॥ ॥౧౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

...నిత్తు డగు యోగికి యోయర్జునా! నేను సుఖముగ లభ్యుడను. కాన ననన్యచేతస్కుడై నాయందు సదా సమాహితుడు కావలెను. ఈచెప్పుటవలన దేలిన యాశయ మేమి? ప్రాణమును జయించినవాడు స్వేచ్ఛగా దేహమును పరిత్యజించును. ఇతరుడు కర్మక్షయముచే దేహమును త్యజించును. ఇదియే విశేష మని భావము. ॥౧౪॥

విడచుటకు సమర్థుడు కాక కర్మక్షయముచేతనే పరవశుడై దేహమును విడచునో అట్టివాని కేగతి ప్రాప్తించునో దానిని "అనన్యచేతాః" అనుదానిచే చెప్పుచుండెను.

నాకంటె వేరగు విషయమునందు ప్రవర్తింపని చిత్తముకలవాడై యెల్లపుడు యావజ్జీవము ఎవడు నన్ను స్మరించునో, స్వవశమైగాని, పరవశమైగాని దేహమును విడచునట్టి యట్టి సతతసమాహితచిత్తుడగు యోగికి నేను సుఖముగ లభ్యుడను. ఇతరుల కతిదుర్లభుడ నైనను పైన పేర్కొనబడినవాని కతిసులభుడ నని యాశయము. కాన ఓయర్జునా! నేను నీకతిసులభుడను. భయము నొందవద్దని యభిప్రాయము.

ఈశ్లోకమున "అనన్యచేతాః" అని చెప్పుటచే అత్యాదరము, 'సతతం' అని చెప్పుటచే నైరంతర్యము, 'నిత్యశః' అని చెప్పుటచే దీర్ఘకాలత్వము స్మరణకు చెప్పబడెను. ఈచెప్పుటచే 'స తు దీర్ఘకాల నైరన్తర్య సంస్కారాసేవితో దృఢభూమిః' అని పాతంజలిమత మనుసరింపబడెను. పైసూత్రమున 'సః' అని యభ్యాస చెప్పబడినను యది స్మరణపర్యవసాయియే. యీచెప్పుటవలన సుషుమ్నానాడీద్వారమున ప్రాణోత్క్రమణ మగుగాక. అట్లు ప్రాణోత్క్రమణము కాకుండుగాక. యావజ్జీవము ప్రతిక్షణము విక్షేపాంతరము లేకుండగ చేయు:భగవదనుచింతనమే పరమగతికి కారణము అని ఫలితాశయము. ॥౧౪॥

శంకరానందీయము:— ఇట్లు పరబ్రహ్మోపాసకుల కుత్కృష్టగతిని చెప్పి యిపుడు శ్రవణాదులచే తెలియబడిన యాత్మతత్త్వముగల యే యతి తీవ్రమోక్షేచ్ఛచే జనించిన వైరాగ్యవేగముచే నిత్యము నిరంతరము పరబ్రహ్మము ననుసంధానముచేయునో (స్మరించునో) అట్టి యతికి నేను సులభుడ నని తన సౌలభ్యమును 'అనన్యచేతాః' అను శ్లోకముచే చెప్పుచుండెను.

బ్రహ్మాతిరిక్తవిషయమునందు బ్రవేశింపని చిత్తముకలవాడై బ్రహ్మమునందే సమాహితమైన చిత్తము కలవాడై, యే బ్రహ్మవేత్త యావజ్జీవము విరామము లేకుండగ యెల్లపుడు 'బ్రహ్మైవాహం' అని పరబ్రహ్మమునే స్మరించునో, అట్టి నిత్యయుక్తునకు అనగా నెల్లపుడు నన్నే స్మరించుచున్న బ్రహ్మనిష్ఠ గల యతికి నేను అప్రయత్నముగ పొందదగినవాడను. కాన యోగాభ్యాసనిరతునకువలె యీబ్రహ్మనిష్ఠునకు ప్రాణాయామాభ్యాసక్లేశము కాని, ఇంద్రియనిగ్రహశ్రమ కాని మనోనిరోధాయాసము కాని, సుషుమ్నానాడిచే ఊర్ధ్వగమనదుఃఖము కాని, శీర్షకపాల భూమ్యాద్యావరణభేదవ్యథ కాని కొంచెమైనను

గీ॥ మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్ ।
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః ॥ ॥౧౫॥

పదవిభాగము:—మాం-ఉపేత్య-పునర్జన్మ-దుఃఖాలయం-అశాశ్వతమ్-న-అప్నువన్తి-మహాత్మానః-సంసిద్ధిం-పరమాం-గతాః॥ ॥౧౫॥

ప్రతిపదార్థము:— మహాత్మానః=గొప్పయంతఃకరణముకలయతులు; పరమాం=గొప్పదైన; సంసిద్ధిం=సిద్ధిని; గతాః=పొందినవారై; మాం=నన్ను; ఉపేత్య=పొంది; దుఃఖాలయం=ఆధ్యాత్మికాదిదుఃఖముల కాలయమైన; అశాశ్వతం=అవస్థితి లేని స్వరూపముగల; పునర్జన్మ=పునర్జన్మమును; నాప్నువన్తి=పొందరు. ॥౧౫॥

శాంకరభాష్యమ్:—

తవ సౌలభ్యేన కిం స్యా దిత్యుచ్యతే శృణు త న్మమ సౌలభ్యేన యద్భవతి— మా ముపేత్య మా మీశ్వర ముపేత్య మద్భావ మాపద్య పునర్జన్మ పున రుత్పత్తిం న ప్రాప్నువంతి । కిం విశిష్టం పునర్జన్మ న ప్రాప్నువంతి తద్విశేషణ మాహ- దుఃఖాలయం దుఃఖానా మాధ్యాత్మికాదీనా మాలయ మాశ్రయ మాలీయంతే యస్మి న్దుఃఖా నీతి దుఃఖాలయం జన్మ । న కేవలం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నిన్ను పొందినవారు నీయందే యుండెదరా? లేక చంద్రలోకమునుండి వలె పునరావృత్తిని పొందెదరా? అను అనుప్రశ్నపై జెప్పుచున్నాడు. నాయొక్క సౌలభ్యముచ్చేనేమి ప్రాప్తించునో చెప్పెద వినుము. పరమేశ్వరుని పొంది పరమసంసిద్ధిని (మోక్షమును)

లేదు. మరేమనిన యిచటనే యుండగ ప్రారబ్ధపరిక్షయమైయుండ స్వతః ప్రాణేంద్రియమనోబుద్ధ్యాదులకు సుషుప్తియందువలె బ్రహ్మమునందు విలయముప్రాప్తింపఅప్రయత్నముగనే జీవుడు సుషుప్తియందు ప్రాజ్ఞుని పొందినటుల బ్రహ్మవేత్త నిర్విశేషము, నిష్క్రియము, శాంతము, అనంతము, కారణరహితము కార్యరహితము (అనగా కార్యకారణవిలక్షణము,) అబాహ్యము, ఆనందఘనము నగు పరబ్రహ్మమును పొందుచున్నాడు. కాన బ్రహ్మవిత్తగు బ్రహ్మనిష్ఠుడైన యతికి నాప్రాప్తి సులభముగుటవలన 'నేను సులభుడను' అని చెప్పబడెను. సులభుడనగ సుఖప్రాప్యు డని యర్థము. కాన ఓయర్జునా! నీవు అనన్యమనస్కుడవై యెల్లపుడు నన్ను స్మరింపు మని యర్థము. ॥౧౪॥

—• ౮వ అధ్యాయము ౧౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— భగవంతుని పొందినవారు తిరిగి మనుష్యదేహాదిసంబంధరూపమగు సంసారమును పొందెదరా? పొందరా? అని సందేహము ప్రాప్తింప తిరిగి సంసారమును పొందరని 'మాముపేత్య' అను శ్లోకముచే జెప్పుచుండెను.

రజస్తమోరహితాంతఃకరణముకల శుద్ధసత్వప్రధానులైన, జనించిన సమ్యగ్దర్శనముకల, మహాత్ములు నాలోకమగు వైకుంఠమునుజేరి యచట భోగముల నన్నిటిని యనుభవించిన పిదప సర్వోత్కృష్టమగు ముక్తిని పొందినవారై దుఃఖములకు స్థానమైనట్టి, (గర్భవాస యోనిద్వారనిర్గమనాద్యనేకదుఃఖస్థానము,)

శాంకరభాష్యమ్:—

దుఃఖాలయ మశాశ్వత మనవస్థితస్వరూపం చ నాఽఽప్నువం తీదృశం పునర్జన్మ మహాత్మానో యతయ స్సంసిద్ధిం మోక్షాఖ్యాం పరమాం ప్రకృష్టాం గతాః ప్రాప్తాః । యే పున ర్మాం న ప్రాప్నువంతి తే పునరావర్తంతే ॥ ॥౧౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పొందిన మహాత్ములగుయతులు ఆధ్యాత్మికాదిదుఃఖముల కాశ్రయము, అనవస్థితరూపము నగు పునర్జన్మమును పొందరు. ఎవరు నన్ను పొందరో వారు పునరావృత్తిని పొందెదరు. ॥౧౫॥

అస్థిరము, దృష్టనష్టప్రాయము నగు మనుష్యాదిదేహసంబంధమును పొందరు. ఈశ్లోకమున "మాం ప్రాప్య సిద్ధిం గతాః" అని చెప్పుటచే నుపాసకులకు క్రమముక్తి ప్రదర్శింపబడెను. ॥౧౫॥

శంకరానందీయము:— సర్వకర్మసంన్యాసి, ఏకాకి, మౌని, భిక్షాన్నజీవి యగు యేయతి యేదోయొక చోట కూర్చుని "ఈనిఖిలజగత్తు, నేను బ్రహ్మమే" అని యధ్యాత్మదృష్టిచే నెల్లప్పుడు సర్వమును బ్రహ్మముగానే చూచునో అట్టి బ్రహ్మనిష్ఠుడగు యతికి "నేను సులభుడను" అని బ్రహ్మప్రాప్తి సులభత్వమును చెప్పి, యిపుడు తనను పొందినవారలకు ఫలమును "మా ముపేత్య" అను శ్లోకముచే చెప్పుచుండెను.

సచ్చిదానందైకరసమగు పరబ్రహ్మమును పొంది (అనగా పరబ్రహ్మైకరసత్వమును పొంది దానివలననే అత్యుత్తమమైన కేవలానందస్వరూపమైన పరమాత్మస్వరూపముగ స్థితిరూపమగు విదేహముక్తిని పొంది) న మహానుభావులగు యతులు. లేక "మహాత్మానః" నిత్యనిరంతరబ్రహ్మనిష్ఠచే నిశ్శేషముగ నశించిన రజస్తమోగుణ తత్కార్యములుకల దగుటవలన నతిస్వచ్ఛతరమగుటచే నుత్కృష్టమైన శుద్ధసత్త్వస్వభావాపన్నమైన యంతఃకరణము కలవారు మహాత్ములనబడుదురు. సుప్రసన్నాంతఃకరణముకలవారు కనుకనే "పరమాం" అత్యుత్తమఫలప్రదానోన్ముఖమైన "సంసిద్ధిం" సుఖానుభూతియందు కాని, దుఃఖానుభూతియందు కాని వృత్తికి బ్రహ్మస్వరూపమున నుండుటయే సంసిద్ధియనబడును. అట్టి బహుజన్మాభ్యస్తమైనట్టి సర్వావస్థలయందు అప్రతిబద్ధమైన అఖండాకారవృత్తిరూపమగు సంసిద్ధిని పొందిన బ్రహ్మనిష్ఠులు కార్యకారణభావశూన్యము, మాయాతత్కార్యలేశసంబంధశూన్యము, సద్ఘనము, చిద్ఘనము, ఆనందఘనమునగు పరబ్రహ్మమును (పరమాత్మభావమును) పొంది ఘటాకాశము మహాకాశత్వమునువలె స్వయముగ బ్రహ్మైకత్వమును పొంది "అశాశ్వతం" శాశ్వతము బ్రహ్మభావము. తద్విలక్షణమగుటవలన యశాశ్వతము (నశ్వరము.) అందునను "దుఃఖాలయం" ఆధ్యాత్మికాదిదుఃఖాశ్రయము జన్మము. ఈశ్లోకమున "జన్మ" అనుపదముచే జన్మరూపమగు వికారము గల శరీరము గ్రహింపవలయును. విదేహముక్తిని పొందిన బ్రహ్మవేత్తలు తిరిగి అనిత్యము, దుఃఖభూయిష్ఠము అయిన దేవదేహమును కాని, ప్రాజాపత్యదేహమును కాని, గంధర్వదేహమును కాని, మనుష్యదేహమును కాని మరియే యితరదేహమును కాని పొందరు. శరీరము ప్రాప్తించుటకు అవిద్య, కామము, కర్మలు కారణము. అవన్నియు సమ్యజ్జ్ఞానమహాగ్నిజ్వాలలచే భస్మీభూతమగుటవలన ముక్తులు తిరిగి దుఃఖాలయ మగు శరీరమును పొందరు. ఈవిషయమునే "న చ పునరావర్తతే నచపునరావర్తతే" అను శ్రుతి బోధించుచున్నది. ఈశ్రుతియందు "నచ పునరావర్తతే" అనువాక్యము రెండుసార్లు చెప్పుట యభ్యాస మనబడును. యీయభ్యాసము సంశయమున్నను పొంగొట్టుచున్నది. ॥౧౫॥

గీ॥ ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున ।
మా ముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ॥ ॥౧౬॥

పదవిభాగము:— ఆబ్రహ్మభువనాత్- లోకాః- పునరావర్తినః- అర్జున! -మాం- ఉపేత్య- తు- కౌన్తేయ- పునర్జన్మ- న- విద్యతే॥ ॥౧౬॥

ప్రతిపదార్థము:— హేఅర్జున!=ఓయర్జునుడా; ఆబ్రహ్మభువనాత్=బ్రహ్మలోకము మొదలుకొని; లోకాః=లోకములు; పునరావర్తినః=పునరావర్తనస్వభావము కలవి; హేకౌన్తేయ=ఓకుంతీపుత్రుడా! మాం= నన్ను; ఉపేత్యతు=పొందినచో; పునర్జన్మ=తిరిగి జన్మము; న విద్యతే=లేదు. ॥౧౬॥

శాంకరభాష్యమ్:—

కిం పున స్త్వత్తోఽన్య త్ప్రాప్తాః పునరావర్తంత ఇత్యుచ్యతె— ఆబ్రహ్మభువనా ద్భవంతి యస్మి న్భూతా నీతి భువనం బ్రహ్మభువనం బ్రహ్మలోక ఇత్యర్థః । ఆబ్రహ్మభువనా త్సహ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"అపా మసోమ మమృతా అభూమ" అనుశ్రుతి చెప్పున కర్మలవలన స్వర్గాములను పొందినవారలకుకూడ బ్రహ్మమును పొందినవారలతో సమానముగ ననావృత్తి బోధింపబడుచుండ నీకంటె నితరమును పొందినవారలు పునరావృత్తి కలవారగుదురని చెప్పుట యెట్లు సమంజసమగును?" అని శంకింపజనదు.

—• ౮వ అధ్యాయము ౧౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పరమేశ్వరుని పొందిన సమ్యగ్దర్శులకు పునరావృత్తి లేదని చెప్పుటవలన భగవద్విముఖులగు సమ్యగ్దర్శనములేనివారలకు పునరావృత్తి అర్థాత్తు సిద్ధమే యని "ఆబ్రహ్మభువనాత్" అనుశ్లోకముచే జెప్పుచుండెను.

"ఆబ్రహ్మభువనాత్- భవన్త్యత్రభూతానీతి భువనం "ఆబ్రహ్మభువనాత్" అనుచోటనుండు ఆకార మభివిధ్యర్థకము. అనగా బ్రహ్మలోకముతోగూడ యన్నిలోకములు భగవద్విముఖులగు సమ్యగ్దర్శనములేనివారలకు భోగభూములు, పునరావర్తనస్వభావములు కలవి. (కొన్ని పుస్తకములలో "ఆబ్రహ్మభవనాత్" అని పాఠము కలదు. ఈపాఠమునందు భవన మనగ నివాసస్థాన మని యర్థము. వాసస్థానము లోక మగును కాన పూర్వమునందు చెప్పిన యర్థమునే గ్రహింపనగును.) లోకాంతరములను పొందినవారలకు వలె నిన్ను పొందినవారలకుగూడ పునరావృత్తి సంభవించునా? అని యనెదవా? నన్ను పొందినవారలకు పునరావృత్తి సంభవింప దని "మా ముపేత్య" అనుదానిచే చెప్పుచుండెను. "తు" అనునది లోకాంతరవైలక్షణ్యద్యోతనార్థము. లేక అవధారణార్థకమునైన గ్రహింపనగును. "హే కౌన్తేయ!" ఓకుంతీపుత్రుడా! (ఈచెప్పుటవలన తల్లిననుసరించిగూడ ప్రసిద్ధమహానుభావు డని గ్రహింపనగును. ఈశ్వరునినొకనినే పొందిన ముక్తులకు పునరావృత్తి లేదు. (ఈశ్లోకమున "అర్జున!" అనియు 'కౌన్తేయ' అనియు సంబోధనద్వయముచే స్వరూపముచేతను, కారణముచేతను జ్ఞానసంపత్తికివలయు శుద్ధి సూచితము.)

ఇచట నీవ్యవస్థ చేయనగును- ఎవరు క్రమముక్తి ఫలముగాగల యుపాసనలచే బ్రహ్మలోకమును పొందెదరో, బ్రహ్మలోకమున జనించిన సమ్యగ్దర్శనము కల యట్టి సగుణోపాసకులకు హిరణ్యగర్భునితో

శాంకరభాష్యమ్:—

బ్రహ్మభువనేన లోకాః సర్వే పునరావర్తినః పునరావర్తనస్వభావాః హేఽర్జున! మా మేక ముపేత్య తు కౌన్తేయ! పునర్జన్మ పున రుత్పత్తి ర్న విద్యతే ॥ ॥16॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పైనుదహరింపబడిన శ్రుతి యర్థవాదవాక్యము. అదికర్ముల కాపేక్షి కామృతత్వమునే బోధించును. కానఓయర్జునా! బ్రహ్మలోకముతోగూడ భూరాదినిఖిలలోకములు పునరావర్తనస్వభావము కలవి. ఈచెప్పుటచే భూలోక, భువర్లోక, సువర్లోక,మహర్లోకచతుష్టయమును పొందినవారు పునరావృత్తికలవారు. జనోలోక, తపోలోక, సత్యలోకము లనెడి లోకత్రియమును పొందినవారలకు పునరావృత్తి లేదను శంక తొలగింపబడెను.

గూడ మోక్షము ప్రాప్తించును. క్రమముక్తిరూపఫలము గల యుపాసనలు లేనివారలుగూడ పంచాగ్నివిద్యాదులచే బ్రహ్మలోకమును పొందెదరు. అట్టివారలకు పునర్జన్మ మవశ్యంభావి. కనుకనే క్రమముక్త్యభిప్రాయముచే "బ్రహ్మలోక మభిసంపద్యతే నచ పునరావర్తతే" "అనావృత్తి శ్శబ్దాత్" అనుశ్రుతిసూత్రము లుపపన్నములు. అట్లు కాక 'ఆబ్రహ్మభువనాత్' అనుగీతావాక్యమువలన బ్రహ్మలోకమును పొందినవార లందరు పునరావృత్తిని పొందెద రనినచో బ్రహ్మలోకమును పొందినవారలకు పునరావృత్తి లేదని బోధించు పైశ్రుతిసూత్రములకు విరోధము ప్రాప్తించును. బ్రహ్మలోకమును పొందిన క్రమముక్తిఫలము కల యుపాసకులకు పునరావృత్తి లేదనియు, బ్రహ్మలోకమును పొందిన పంచాగ్నివిద్యోపాసకులకు పునరావృత్తి కలదనియు వ్యవస్థ కల్పించినచో పైశ్రుతిసూత్రములకు, ప్రస్తుతగీతావాక్యమునకు విరోధము ప్రాప్తింపదు. పంచాగ్న్యాదివిద్యలుకలవారల నుద్దేశించి శ్రుత్యంతరమున "తేషా మిహ పునరావృత్తిః" "ఇమం మానవ మావర్తం నావర్తన్తే" అనుస్థలములయందు "ఇహ" ఇమం" అనుటచే ప్రస్తుతకల్పమునందు పునరావృత్తి లేకున్నను రాబోవు కల్పమునందు పునరావృత్తి కలదని స్పష్టపరుపబడెను. ॥16॥

శంకరానందీయము:— ఇట్లు బ్రహ్మభావమును పొందిన బ్రహ్మవేత్తలకు పునరావృత్తి లేకపోవుటను చెప్పి, తదితరులగు శ్రుతిశూన్యులకు, లేక శ్రవణమొనరించినను సమ్యగ్దర్శులు కాక స్వేతరప్రాప్తి కలవారలకు పునరావృత్తి కలదని సూచించుచు, చెప్పిన యర్థమునే తిరిగి దృఢము చేయుచు బ్రహ్మవేత్తలకు ముక్తి సిద్ధించుటయందు సంశయము తొలగుటకై యతులకు సమ్యగ్దర్శనసిద్ధియందు ప్రయత్నమును సూచించుటకును "ఆబ్రహ్మభువనాత్" అని చెప్ప మొదలిడెను.

"సహస్రయుగపర్యన్తం" అని కాలనిర్ణయము శ్రూయమాణ మగుటవలన ఈశ్లోకమునందుండు బ్రహ్మశబ్దముచే చతుర్ముఖబ్రహ్మము చెప్పబడును.

భూతము లిచట పుట్టుచున్నవి, లేక కలవు కాన "భువనం" అనబడుచున్నది. బ్రహ్మయొక్క భువనము కాన బ్రహ్మభువన మనబడును. అదిసత్యలోకము. సత్యలోకము మొదలుకొని సర్వలోకములు పునరావృత్తులు. అనగా పుణ్యావశమున సత్యాదిలోకములను పొందినవారలను అయాలోకములు పునరావృత్తులునుగ జేయును. (పుణ్యము నశింప యాయా లోకములను పొందినవారలను తిరిగి జన్మాదులు కలవారలనుగ జేయును.) కాన, సత్యాదిలోకములను పొందినవారలకు పునరావృత్తి తప్పక ప్రాప్తించును. ఈవిషయమునే "యావత్సంపాత ముషిత్వా" "నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వేమం లోకం హీనతరం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓకుంతీపుత్రా! నన్ను పొందినవారలకు పునర్జన్మము లేదు. (ఎవనికి వంశప్రయుక్తమైన శుద్ధి స్వాభావికమో అట్టివానికే నాచే చెప్పబడిన యర్థమునందు బుద్ధి జనించు నని తలచి "అర్జున:, కౌన్తేయ:, అనిసంబోధనద్వయము ప్రయోగింపబడెను) ॥౧౬॥

వా విశన్తి" అను శ్రుతులు బోధించుచున్నవి. "న విద్యతే అకం దుఃఖం యత్ర" అను వ్యుత్పత్తి నాశ్రయించిన యేలోకమున దుఃఖములేదో ఆలోకము నాకమనబడును. అట్టిలోకము సత్యలోకమే. ఇతరలోకములు కొన్నిటియందు రాక్షసులవలనను, కొన్ని లోకములయందు ప్రలయాగ్నివలనను దుఃఖమే ప్రాప్తించుటవలన నాలోకములు నాకశబ్దముచే జెప్పబడవు. అందువలన "నాకస్య పృష్ఠే" అను శ్రుతియందు గల నాకశబ్దమునకు సత్యలోకమే యర్థము. అట్టి సత్యలోకమున తల్లోకమును పొందినవారు సుకృతఫలము ననుభవించినపిదప యాసుకృతము నశింప యీలోకమును కాని, యింతకన్న హీనతరమైన లోకమును కాని పొందెదరు. అని శ్రుతి బోధించుటచే సత్యలోకమును పొందినవారలకుకూడ పునరావృత్తి ప్రామాణికమైనదే. పైశ్రుతిబలముననే బ్రహ్మభావమును పొందినవారలకుకూడ పునరావృత్తి కలదని యెందులకు చెప్పరాదని శంకింపజనదు. "తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ" బ్రహ్మసాక్షాత్కారము గలిగిన నట్టివానికి చేయబోవు పాపముయొక్క సంబంధముండదు. పూర్వపాపము నశించును. "ఏవ మసంశ్లేషః పాతే తు" అశ్లేషముబోవు పుణ్యసంబంధముండదు. పూర్వపుణ్యము నశించును. అనగా బ్రహ్మవేత్తకు పుణ్యపాపసంబంధముండదని యర్థము. మరియు "యథేషీకాతూల మగ్నౌ ప్రోతం ప్రదూయేతైవ హాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే" "తస్యైవ స్యా త్పదవిత్తం విదిత్వా న లిప్యతే కర్మణా పాపకేన" "సర్వం పాప్మానం తరతి" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మవేత్తకు నిఖిలపాపప్రదాహమును, కర్మలయొక్క లేపము లేకపోవుటను బోధించుచున్నవి. కాన "కర్మణా జాయతే జన్తుః కర్మణైవ ప్రలీయతే" "ప్రాప్యాన్తం కర్మణ స్తస్య యత్కించేహ కరోత్యయమ్ । తస్మా ల్లోకా త్పున రేత్యస్మై లోకాయ కర్మణే" ఇత్యాదిశ్రుతిస్మృత్యుక్తప్రకారము పుణ్యకర్మవిశేషమున నుత్తమలోకములను పొందినవారు ఆయాలోకమున పుణ్యకర్మఫలానుభవముచే నాపుణ్యము నశింప శేషకర్మానుభూతికొఱకు పునరావృత్తిని పొందెదరు. జ్ఞానాగ్నిదగ్ధనిఖిలకర్మలుకల బ్రహ్మవేత్తలు శేషకర్మ లేమింజేసి పునరావృత్తులు కానేరరు. మరియు బ్రహ్మవేత్తలకు "న చ పున రావర్తతే" అను మొదలగు శ్రుతులు పునరావృత్తిని నిషేధించుటవలనను బ్రహ్మవిద్వరిష్ఠులకు పునరావృత్తి లేదు. మరియు యీగీతావాక్యమే "మా ముపేత్య తు" అని 'తు' అను శబ్దముచే బ్రహ్మప్రాప్తి కలవారలకు పునరావృత్తి లేదని బోధించుచున్నది. "హే కౌన్తేయ" శుద్ధకులోత్పన్నుడ వగు నో యర్జునా! సత్యజ్ఞానాలక్షణము, సదానందైకరసము నగు పరమాత్మను పొంది పూర్ణాత్మస్వరూపముతో నుండు బ్రహ్మవిత్తమునకు పునర్జన్మరూపమగు పునరావృత్తి లేదు. లేక "విద సత్తాయాం" అని విదధాతువు ప్రాప్తి అర్థముకలదికూడ యగుటవలన విద్వాంసుడు నన్ను పొంది తిరిగి పునర్జన్మను పొందడు. అనికూడ వ్యాఖ్యానింపదగును. ॥౧౬॥

పరమార్థప్రపః:— అవాంతరసిద్ధిచే శాశ్వతము, (చిరకాలస్థాయి) సుఖమునిచ్చునదియునగు దేహము నపేక్షించు వారలకు పునరావృత్తి కల దని "ఆబ్రహ్మభువనాత్" అను శ్లోకముచే జెప్పుచుండెను.

బ్రహ్మలోకము, దాని ననుసరించియుండు మహర్లోకాదులు పునరావృత్తు లగుచున్నవి. "తపస్వినో దానశీలా వీతరాగా స్తితిక్షవః । త్రిలోక్యా ఉపరిస్థానం లభన్తే శోకవర్జితమ్" తపశ్శీలురు, దానరతులు, వీతరాగులు, ద్వంద్వసహిష్ణులు ముల్లోకములకంటె యుపరిభాగమునందుండు శోకవర్జితమైన స్థానమును

గీ॥ సహస్రయుగపర్యన్త మహ ర్య ద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహోరాత్రవిదో జనాః ॥ ॥౧౭॥

పదవిభాగము:— సహస్రయుగపర్యన్తం- అహః- యత్- బ్రహ్మణః- విదుః- రాత్రిం- యుగసహస్రాన్తాం- అహోరాత్రవిదః- జనాః॥ ॥౧౭॥

ప్రతిపదార్థము:— అహోరాత్రవిదః= కాలసంఖ్యావేత్తలగు; తేజనాః= ఆజనులు; సహస్రయుగపర్యన్తం= కృతత్రేతాద్వాపరకలియుగములు వెయ్యి అవసానముగా కలదిగ; బ్రహ్మణః= హిరణ్యగర్భుని యొక్క; అహః= పగటిని; విదుః= తెలిసికొనుచున్నారు: రాత్రిం= రాత్రిని; యుగసహస్రాన్తాం= కృత త్రేతాద్వాపర కలియుగములు వెయ్యి అవసానముగా కలదానినిగ; విదుః= తెలిసికొనుచున్నారు. ॥౧౭॥

---

పొందెదరు. అను పురాణవచనము బ్రహ్మలోకగతులకు పునరావృత్తి లేదని బోధించుచుండ "బ్రహ్మలోకమును పొందినవారుగూడ పునరావృత్తులు" అని చెప్పుట యెట్లు సమంజస మగునని శంకింపజనదు. సుఖముగ చిరకాలజీవన మపేక్షించి సామవేదోక్తమైన బృహద్రథంతర, వైరూప, వైరాజ, శాక్వర, రైవత, సౌందస, కాలేయాద్యష్టసామాత్మకమైన ఆసందిని స్తోమలతోగూడిన మహతీబుక్కు నుపాసించి సామ్రాజ్య, భౌజ్య, స్వారాజ్య, వైరాజ్యాదిక్రమముచే సత్యలోకము నెవరు పొందెదరో ఆట్టివారుగూడ ఆయువు, అహోరాత్రములు, నిద్ర, జాగరాదిలౌకికవ్యవహారములు కలవారగుటవలన పునరావృత్తులే. ఈవిషయమునే "యోవా ఏత దక్షర మవిదిత్వా గార్గ్యస్మిం ల్లోకే జుహోతి దదాతి తపస్య త్యపి బహూని వర్షసహస్రా ణ్యన్తవా నేవాస్య స లోకో భవతి" ఈవిషయమును వాచక్నవి అను గర్గకన్యను గూర్చి యాజ్ఞ్యవల్క్యుడు చెప్పుచుండెను. భోగార్గి ఓగర్గకన్యా! వాచక్నవి! ఏపురుషుడు యీ యనుభూయమానము అక్షరము నగు పరబ్రహ్మమును తెలిసికొనక, యీలోకమున హోమమును చేయునో, తులాభారముచే దానమును చేయునో, కృచ్ఛ్రచాంద్రాయణాదులచే తపస్సును చేయునో, ఏలోకప్రాప్తి కొఱకు ఇట్టి యుపాయములు కలవో ఆట్టిలోకము ఈపురుషునిచే ననేకవేలసంవత్సరము లనుభవింపబడినను అట్టిపురుషునకు "అంతవా నేవ" పునరావృత్తికొఱకే యగును. పైవిషయమునే బుక్శాఖీయమైన "అథాత ఇంద్రో మహాభిషేక స్తే దేవా అబ్రువ న్స ప్రజాపతికా అయంవై దేవానాం" అను బ్రాహ్మణముగూడ బోధించుచున్నది. మరియు ఆపస్తంబీయసంహితయందుగూడ పైవిషయమే "సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృ త్తే శిరో గాయత్రం చక్షుః" అనునవి మొదలుగాగల మంత్రములు బోధించుచున్నవి. గ్రంథవిస్తరభీతిచే నిచట వ్రాయుట మానుచుంటిని. శతశ్లోకీవ్యాఖ్యయందు మాచే సవిస్తరముగ చెప్పబడెను. ఎవరు సముత్పన్నతత్త్వజ్ఞానులై నాస్వరూపమును పొంది విస్మృతసకలవ్యవహారములుకలవారై సంసరణబీజభూతమైన జీవత్వమును విడచి బ్రహ్మరూపు లగుదురో అట్టివారలకు పునర్జన్మ లేదు. ఈవిషయమే "మా మపేత్య" అను యుత్తరార్థముచే చెప్పబడెను. ॥౧౬॥

— ౮ వ అధ్యాయము ౧౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు .—

మధుసూదనసరస్వతీయము:— కాలపరిఛిన్నము లగుటవలన బ్రహ్మలోకాదిసర్వలోకములు పునరావృత్తు లని "సహస్రయుగపర్యన్తం" అనునదిమొదలుకొని చెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

బ్రహ్మలోకసహితా లోకాః కస్మా త్పునరావర్తినః కాలపరిచ్ఛిన్నత్వా త్కథమ్— సహస్రయుగపర్యన్తం సహస్రం యుగాని పర్యన్తః పర్యవసానం యస్యాహ్న స్త దహః సహస్రయుగపర్యన్తం బ్రహ్మణః ప్రజాపతే ర్విరాజో విదుః, రాత్రి మపి యుగసహస్రాన్తా మహఃపరిమాణా మేవ। కే విదు రిత్యాహ - తేఽహోరాత్రవిదః కాలసంఖ్యావిదో జనా ఇత్యర్థః। యత ఏవం కాలపరిచ్ఛిన్నా స్తేఽతః పునరావర్తినో లోకాః ॥౧౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

బ్రహ్మలోకముతో సహా నిఖిలలోకములు యేకారణముచే పునరావర్తనస్వభావముకల వని ప్రశ్నించెదవా? ఆలోకము లన్నియు కాలపరిచ్ఛిన్నము లగుటవలన పునరావర్తనస్వభావము కలవి. అది ఎట్లనిన? కాలసంఖ్యావేత్తలగు ప్రసిద్ధజనులు హిరణ్యగర్భునియొక్క పగలు కృతత్రేతాద్వాపర కలియుగములు వెయ్యి అవసానముగా కలది. అనగా కృతత్రేతాద్వాపరకలియుగములు నాలుగు వెయ్యిసార్లుగడచిన (నాలుగువేలయుగములు.) పగలని తెలుసికొనుచున్నారు.

మనుష్యపరిమాణముచే "సహస్రయుగపర్యన్తం- సహస్రం యుగాని చతుర్యుగాని పర్యన్తః అవసానం యస్య తత్" నాల్గువేల యుగములు పరిమాణముగా గలది బ్రహ్మముయొక్క పగలు. ఈవిషయమునే 'చతుర్యుగసహస్రం తు బ్రహ్మణో దిన ముచ్యతే' అను పౌరాణికవచనముగూడ బోధించుచున్నది. అట్లే నాలుగు వేలయుగములు బ్రహ్మయొక్క రాత్రి యని యెవరు తెలిసికొనుచున్నారో అట్టి యోగులు అహోరాత్రవేత్తలు. ఎవరు చంద్రార్కగతిచేతనే తెలిసికొనుచున్నారో అట్టివారలు స్వల్పదర్శులగుటచే బ్రహ్మయొక్క అహోరాత్రములను తెలిసికొనువారు కారు. ॥౧౭॥

శంకరానందీయము:— బ్రహ్మమును పొందినవారలకు అపునరావృత్తిని చెప్పి, యిపుడు సత్యాదిలోకములయందు నిత్యత్వనిత్యసుఖత్వానావృత్తిత్వబుద్ధిచే పుణ్యకర్మల నాచరించి, ఊర్ధ్వలోకము లనుగూర్చివెళ్ళి అచట పుణ్యఫల మనుభవించి తిరిగి భూలోకమునకరిగి తిరిగి యజ్ఞాదుల నాచరించుచు, మరణించుచు సర్వప్రాణులు యెల్లపుడు దుఃఖమునే యనుభవించుచుండిరి. ప్రరోచన వాక్యములచే మోహవ్యా మానులై అంధపరంపరవలె ఎవ డేమార్గము ననుసరించునో ఆమార్గము నే యితరులుగూడ యనుసరించుచుండిరి. ఈవిషయమున నెవడును స్వభావమును (యాథార్థ్యమును) విచారింపకుండెను. తాపమును పొందకుండెను. ఇట్టి గమనాగమనములకు, దుఃఖమునకు కర్మ హేతువని యాకర్మయెడ నెవడును వైరాగ్యమును పొందకుండెను. ఎంత ఆశ్చర్యము! అజ్ఞత్వ మెంత కష్టమైనది! అని అజ్ఞునకు సదసద్వివేకము, వైరాగ్యము, అసత్త్యాగము, సదుపాదానమందు ప్రవృత్తి సిద్ధించుటకొఱకు కాలపరిచ్ఛిన్నమైన సత్యాదిలోకములకు బ్రహ్మ (హిరణ్యగర్భుని) యొక్క దివారాత్రులచే ఆవిర్భావతిరోభావములను, నిఖిలప్రాణుల యుత్పత్తిప్రళయములను "సహస్రయుగపర్యన్తం" అను శ్లోకము మొదలుకొని మూడుశ్లోకములచే జెప్పుచుండెను.

"దైవికానాం యుగానాం చ సహస్రపరిసంఖ్యయా। బ్రాహ్మ మేక మహ ర్జ్ఞేయం తావతీ రాత్రిరేవ చ" అను వాక్యానుసారము హిరణ్యగర్భుని యహోరాత్రముల కాలపరిమాణ మింత యని తెలిసికొను మన్వాదులు హిరణ్యగర్భుని పగలు వెయ్యి దివ్యయుగములని చెప్పుచుండిరి. అట్లే హిరణ్యగర్భుని రాత్రి-

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అట్లే హిరణ్యగర్భుని రాత్రిని నాలుగు వేల యుగములు పరిమాణము కలదిగ తెలిసికొనుచున్నారు. ఈచెప్పబడిన అహోరాత్రావయవమాసర్త్వయన సంవత్సరావయవ శతసంఖ్యాయువుతో గూడినవాడు హిరణ్యగర్భు డగుటవలన తదన్తర్వర్తులగు లోకములుగూడ యథాయోగ్యకాలపరిచ్ఛిన్నము లగుటచే నిఖిలలోకములు పునరావర్తనస్వభావము కలవి యని యర్థము. ॥౧౬॥

పరిమాణము కూడ వెయ్యి దివ్యయుగములని చెప్పుచుండిరి. కాన సత్యలోకము నిత్యమని యంగీకరించిన వారలకు సత్యలోకప్రతీతి వెయ్యిదివ్యయుగముల పర్యంతమే. అందువలన సత్యలోకమే యనిత్యమైయుండ దానికంటె తక్కువయగు భూరాదిలోకము లనిత్యములనియు, అల్పసుఖము కలవనియు నేమి చెప్పవలయును? ॥౧౬॥

పరమార్థప్రప:— సత్యలోకవ్యవహారమును "సహస్ర" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ఛాందోగ్యమునందు "సహస్రయుగ పర్యన్త మహ ర్బ్రహ్మం య దుచ్యతే" అని చెప్పబడెను. దీని కర్థమేమనిన? కృతత్రేతాద్వాపరకలులు అను పేరుగల నాలుగుయుగములు నాలుగు చరణములు. ఈనాలుగుయుగములు కలసి యొక మహాయుగము. ఇట్టి మహాయుగములు వేయి హిరణ్యగర్భునకొక పగలు. అట్లే అట్టి మహాయుగములు వేయి హిరణ్యగర్భునకొక రాత్రియగును. దివారాత్రులనునవి సూర్యదర్శనాదర్శనములచే సంభవించును. సత్యలోకము సర్వలోకములకంటె పైనుండుటచే నచట నివసించువారలు వెయ్యి మహాయుగముల పర్యంతము సూర్యుని చూచెదరు. కాన సత్యలోకనివాసులకు ఆవెయ్యిమహాయుగములుపగలు. అట్లే సత్యలోకనివాసులకు వెయ్యిమహాయుగముల పర్యంతము సూర్యుడు కనుపింపనందున నావెయ్యిమహాయుగములు రాత్రి. అట్టి రాత్రియం దాలోకనివాసులకు సుషుప్తి. ఈవిషయమే "యదతిమారగతో ద్రుహిణః క్షితే స్వతత మాప్రలయం రవిమీక్షతే। భవతి తావదయం శయితశ్చ తద్యుగసహస్రయుగంద్యునిశం విధేః" అని యీశ్లోకముచే చెప్పబడెను. ఇట్లే మేరుశిరస్సునందుండు దేవతలకు సౌరవర్ష (సంవత్సర) పరిమిత మహోరాత్రము. పితృదేవతలకు చాంద్రమానపరిమిత మహోరాత్రము. అట్లే లంకాయమకోటిసిద్ధపురస్థితులకు నిత్యము ముప్పది ఘటికలు పగలు. అట్లే ముప్పదిఘటికలు రాత్రి. ఇట్లే పైనుదహరింపబడిన లోకములయందు నిత్యను చరకాలము లేనందున దినరాత్రులు సమముగ నుండును. ఇతరదేశములయందు చరకాలమువలన దినరాత్రులకు హ్రాసవృద్ధులు కలుగుచుండును. ఈచెప్పుటవలన తేలిన యాశయమేమి? దేశభేదము ననుసరించి ప్రతిదేశమున అహోరాత్రవ్యవస్థ భిన్నమైన దని తేలినది. ఇట్లు పితృదేవసత్యలోకములయందు ఆయాలోకములయందుండు వారలయొక్క అహోరాత్రపరిభాషచే మాసవర్షాదికల్పన కాన బ్రహ్మయొక్క సంవత్సరపరిభాషచే బ్రహ్మకు నూరుసంవత్సరము లాయువు. బ్రహ్మసంబంధమగు నూరు-సంవత్సరములు ఒక మహాకల్ప మనబడును. ఈవిషయనంతను మనమునందిడుకొని "ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినః" అని శ్రీకృష్ణపరమాత్మ చెప్పెను. అహోరాత్రవిదులగు వారీవిషయమును చెప్పుచుండిరి. అహోరాత్రవిదులనగ మహాకల్పమును, అవాంతరకల్పమును, మనుయుగచరణశకవర్షాయనఋతుమాసపక్షాహోరాత్రయామనాడీవినాడీప్రాణత్రుట్యాది కాలావయవాభిజ్ఞులగుటచే గోలజ్ఞులు అహోరాత్రవిదు లనబడుదురు. ॥౧౭॥

౮అ శ్లో తారకబ్రహ్మయోగము 507

గీ॥ అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే ॥ ॥౧౮॥

ప ద వి భా గ ము:— అవ్యక్తాత్– వ్యక్తయః– సర్వాః– ప్రభవన్తి– అహరాగమే– రాత్ర్యాగమే– ప్రలీయన్తే– తత్ర– ఏవ– అవ్యక్త సంజ్ఞకే॥ ॥౧౮॥

ప్ర తి ప దా ర్థ ము:— అహరాగమే= హిరణ్యగర్భునకు పగలు ప్రాప్తింప; అవ్యక్తాత్= హిరణ్యగర్భుని స్వాపావస్థనుండి; సర్వాః= సమస్తమైన; వ్యక్తయః= స్థావరజంగమములు; ప్రభవన్తి= అభివ్యక్తిని పొందుచున్నవి. రాత్ర్యాగమే= హిరణ్యగర్భునిస్వాపకాలమునందు; అవ్యక్తసంజ్ఞకే= అవ్యక్తమను పేరుగల; తత్రైవ= ఆస్వాపావస్థయందే; ప్రలీయన్తే— లయమును పొందుచున్నవి. ॥౧౮॥

శాంకరభాష్యమ్:—

ప్రజాపతే రహని య ద్భవతి రాత్రౌ చ త దుచ్యతే— అవ్యక్తా దవ్యక్తం ప్రజాపతే స్స్వాపావస్థా, తస్మా దవ్యక్తా ద్వ్యక్తయో వ్యజ్యంత ఇతి వ్యక్తయః స్థావరజంగమలక్షణా స్సర్వాః ప్రభవ న్త్యభివ్యజ్యంతేఽహ్న ఆగమోఽహ రాగమ స్తస్మి న్నహరాగమే కాలే బ్రహ్మణః ప్రబోధకాలే తథా రాత్ర్యాగమే బ్రహ్మణః స్వాపకాలే ప్రలీయంతే సర్వా వ్యక్తయ స్తత్రైవ పూర్వోక్తేఽవ్యక్త సంజ్ఞకే ॥ ॥౧౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

హిరణ్యగర్భుని పగటియందేమి జరుగును? రాత్రియందేమిజరుగుననెదవా? అవ్యక్త మనగ ప్రజాపతి స్వాపావస్థ. హిరణ్యగర్భునికి పగలు (ప్రబోధకాలము) ప్రాప్తింప అతని స్వాపావస్థనుండి నిఖిలస్థావరజంగమములు అభివ్యక్తిని పొందుచున్నవి. హిరణ్య

—• ౮ అధ్యాయము ౧౮వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మ ధు సూ ద న స ర స్వ తీ య ము:— నాలుగువేల యుగములు బ్రహ్మకు పగలు. నాలుగువేల యుగములు రాత్రి. వీటిని కలిపిన యెనిమిదివేల యుగములు బ్రహ్మకు దినరాత్రు లగును. అట్టి దినరాత్రుల పరిగణనచే మాసవ్యవస్థయు, సంవత్సరవ్యవస్థయు నగుచున్నది. అట్టి నూరుసంవత్సరములు బ్రహ్మకు పరమాయువు. కాన బ్రహ్మ కాలసంభిన్నుడగుటచే ననిత్యుడు. అందుచే బ్రహ్మలోకమునుండి పునరావృత్తి యుక్తమే. ఎవరంతకంటె యర్వాచీనులో ఆక్రిందిలోకములయందుడువారలో వారలు అయాలోకసిద్ధాహోరాత్రపరిచ్ఛిన్ను లగుటవలన ఆయాలోకములనుండి పునరావృత్తికలవారనిచెప్ప నవసరమే లేదు. అని "అవ్యక్తాత్" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ఈశ్లోకము సృష్టిప్రలయములనే చెప్పుట కుపక్రమింపబడినదగుటవలన దైనందినసృష్టిప్రలయములందాకాశాదులున్నవిగాన ఈశ్లోకమునందుండు "అవ్యక్తాత్" అనుశబ్దమునకు 'అవ్యాకృతావస్థనుండి' యని యర్థము చెప్పవలెను. అందునను హిరణ్యగర్భుని స్వాపావస్థ యని యర్థము చెప్పవలెను. అనగా స్వాపావస్థను పొందిన ప్రజాపతి యని యర్థము. అట్టి ప్రజాపతినుండి ప్రజాపతియొక్క— ప్రబోధసమయమున శరీరవిషయాదిభోగభూములు వ్యవహారక్షమములై యభివ్యక్తము లగుచున్నవి. హిరణ్యగర్భునకు రాత్రి ప్రాప్తింప (అనగా హిరణ్యగర్భుని స్వాపకాలమున) శరీరవిషయాదిభోగము లన్నియు స్వాపావస్థను పొందిన కారణరూపమగు హిరణ్యగర్భునియందే తిరోభావమును పొందుచున్నవి. ॥౧౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—
గర్భుని స్వాపకాలమునం దవ్యక్తమునందే లయమును పొందుచున్నవి. అభివ్యక్తిని పొందుచున్నవని చెప్పుటవలన యసత్కార్యవాదప్రసక్తి తొలిగింపబడెను. అనగా స్వాపావస్థనుపొందిన బ్రహ్మమునందే లయ మని యాశయము. ॥౧౮॥

శంకరానందీయము:— సత్యాది లోకముల కనిత్యత్వమును చెప్పి, వాటిని పొందిన ప్రాణుల కతిదుఃఖమే యని "అవ్యక్తాత్" అను శ్లోకముచే జెప్పుచుండెను.

కార్యరూపమును విడచి యన్యరూపముతో వ్యక్తము కాని దవ్యక్త మనబడును. అది యవిద్యాత్మకమగు బ్రహ్మయొక్క సుషుప్తము. బుద్ధ్యాదులువలె సుషుప్తము వ్యక్తము కాదు. కాన సుషుప్త మవ్యక్త మనబడును. మూలకారణ మగు నవ్యక్తముతో గూడిన బ్రహ్మము సుషుప్తాఖ్యమైనను యవ్యక్తమై అవ్యక్తత్వావిశేషమువలన సర్వోత్పత్తిప్రలయకారణము. హిరణ్యగర్భునికి పగలు ప్రాప్తింప నైని పేర్కొనబడిన లక్షణముగల యవ్యక్తమునుండి స్థావరజంగమాత్మకమైన ప్రాణికోటులు బీజమునుండియంకురమువలె జనించుచున్నవి. అట్లే బ్రహ్మకు రాత్రి ప్రాప్తింప అవ్యక్త మనెడి పేరుగల బ్రహ్మముయొక్క సుషుప్తమునందు వ్రీహ్యాదులు బీజమునందువలె లయమును పొందుచున్నవి. అదర్శనమును పొందుచున్నవి. ఈచెప్పుటచే ప్రజాపతియొక్క యహోరాత్రములయందు సర్వప్రాణులకు, జననమరణదుఃఖ మపరిహార్య మని సూచింపబడెను. ॥౧౮॥

భాష్యోత్కర్ష దీపిక:— హిరణ్యగర్భుని యహోరాత్రములయం దేమి యగునో దానిని "అవ్యక్తాత్" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ఇచట అవ్యక్తశబ్దముచే మూలప్రకృతి యగు నవ్యక్తమును గ్రహింపరాదు. దైనందినసృష్టిప్రలయములు ప్రస్తుత ములగుటవలన దైనందినసృష్టిప్రళయముల యందాకాశాదుల సృష్టివినాశములు చెప్పబడినందున అవ్యక్త మనగ హిరణ్యగర్భుని స్వాపావస్థ యని యర్థము. అట్టి యవ్యక్తమునందుండియే ప్రజాపతికి పగలు ప్రాప్తింప యభివ్యక్తములై చరాచరరూప నిఖిలప్రాణు లావిర్భవించుచున్నవి కాని పూర్వములేక నేక్రొత్తగపుట్టుటలేదు. లయమును పొందుట లేదు. అను నియమానురోధమువలనను, యుక్తియుక్త మగుటవలనను సత్కార్యవాదమే యుపపన్నము. అసత్కార్యవాదము యుక్తియుక్తము కాదు. సత్కార్యవాదమునే యంగీకరించినచో కారణవ్యాపారముకంటె పూర్వమునందే కార్య ముండి కారణవ్యాపారముచే సాధింపబడునా? అట్లు సిద్ధమైన కార్యమును సాధించుట యెట్లని శంకింపజనదు. కారణవ్యాపారమునకు పూర్వమే కార్యము సిద్ధమైనను వ్యక్తము కానందున కారణవ్యాపారముచే అవిర్భావమును పొందును. (వ్యక్తమగును.) అని సత్కార్యవాదుల మగు మేము చెప్పెదము.

మృత్పిండధ్వంసానంతరమే ఘటాద్యుత్పత్తి గోచరించుచున్నదికదాయని అట్టిఘటాద్యుత్పత్తియెడ ప్రధ్వంసాభావము కారణమని చెప్పుటతగదు. మరేమన భావరూపమగు మృదాదుల యవయవములే కారణము. అట్లు కానిచో అభావము సర్వత్ర సులభమగుటచే కారణవ్యాపారమువలన సర్వత్ర సర్వదా కార్యోత్పత్తి ప్రసక్తమయ్యెడిని. అసత్కార్యవాదమునం దన్ననో యసత్తగు కార్యమునకు సత్త్వముచేగూర్చుట యెవనికిని శక్యము కాదు. లక్షశిల్పు లేకీభవించినను, ఇసుకనుండి తైలమును, కుడ్యము నుండి యంకురమును పుట్టింపజాలరు. ఇకనేమన ఉపాదానకారణము కార్యముతో సంబద్ధమై కార్యమునకు

జనకమగును కార్యమే యసత్తగుచో నసత్తగు కార్యమునకు కారణముతో సంబంధము సంభవము కాదు. కార్యకారణములకు సంబంధమే లేకపోయెడిని. కారణముతో కార్య మసంబద్ధమయియే యెందులకు జనించదని శంకింప జనదు. అట్లగుచో అసంబద్ధత్వావిశేషముచే నిఖిలకార్యజాతము సర్వకారణములవలనను జనింపవలసివచ్చును. కారణ మసంబద్ధమయియే ఏకారణ మే కార్యమును పుట్టించుటకు శక్తమో ఆకారణ మా కార్యమును పుట్టించును. అట్టి శక్తి కార్యము జనించిన పిదప కార్యదర్శనమువలన నూహింపవచ్చును. కాన నవ్యవస్థ సంభవింపదని శంకింపజనదు. ఆశక్తి కారణనిష్ఠమా? శక్యమగు కార్యనిష్ఠమా? కారణనిష్ఠమగుచో అవ్యవస్థ యట్లే యుండును. కార్యమాత్రనిష్ఠ మనెదవా అసత్కార్యవాదివగు నీమతమున కార్యోత్పత్తికి పూర్వమునందు కార్యమే లేనందున శక్తి కార్యమాత్రనిష్ఠమై కార్యమును పుట్టించు ననుటయు పొసగదు.

ఏతాదృశ శక్తివిశేషమే యత్కించిత్కార్యమును పుట్టించును. సర్వకార్యములను పుట్టింప దనెదవా? అట్లగుచో ఆశక్తివిశేషము కార్యసంబద్ధమై కార్యమును పుట్టించునా? కార్యాసంబద్ధమై కార్యమును పుట్టించునా? కార్యసంబద్ధమయియే కార్యమును పుట్టించు ననెదవా? అసత్తగు కార్యముతో శక్తివిశేషమునకు సంబంధమే సంభవింపనందున ప్రథమపక్షము నిరస్తము. కార్యాసంబద్ధమయియే శక్తివిశేషము కార్యమును పుట్టించునను ద్వితీయపక్షమునం దవ్యవస్థ యట్లే యుండును. కాన యెట్లు చూచినను యసత్కార్యవాదము పొసగనందున సత్కార్యవాదమే యవశ్య మంగీకరింపవలయును. ఈవిషయ మన్యత్ర విస్తారముగ జెప్పబడెను.

బ్రహ్మయొక్క ప్రబోధకాలమునందు – బ్రహ్మస్వాపావస్థారూపమగు నవ్యక్తమునుండి జంగమస్థావరాత్మక నిఖిలప్రాణులు జనించుచున్నవి. (ఆవిర్భవించుచున్నవి.) అట్లే బ్రహ్మయొక్క స్వాపకాలము నందు నిఖిలజంగమస్థావరాత్మకప్రాణులు అవ్యక్తమను పేరుగల బ్రహ్మయొక్క స్వాపావస్థయందు లయమొందుచున్నవి.

పరమార్థప్రపః— ఈయుపక్రమమంతయు నెందులకో దానిని "అవ్యక్తాత్" అనుశ్లోకము మొదలుకొని రెండు శ్లోకములచే జెప్పుచుండెను. కార్యమున కవ్యక్తరూపము కారణాత్మకమైనది. అట్టి యవ్యక్తాత్మక కారణమునుండి నిఖిలనానారూప కార్యాత్మకవ్యక్తులు (స్వరూపములు) బహ్మయొక్క జాగ్రదవస్థోపలక్షితదినారంభమునందు ప్రాదుర్భవించును.

అట్లే బ్రహ్మముయొక్క సుషుప్త్యుపలక్షితరాత్రి ప్రాప్తింప నవ్యక్తసంజ్ఞికమైన కారణరూపమునందే విలీనమగును. ఏకార్యమునకైన స్వకారణమునందు లయము ప్రసిద్ధము. ఈవిషయమునందు శాతపథశ్రుతులు పూర్వమునందు చూపబడెను. ఇపుడు ఋక్శాఖీయశ్రుతుల నుదహరించెదను. "ఋతం చ సత్యం చాభీద్ధా త్తపసోఽధ్యజాయత । తతో రాత్ర్యజాయత తత స్సముద్రో అర్ణవః । సముద్రా దర్ణవా దధి సంవత్సరోఽజాయత । అహోరాత్రాణి విదధ ద్విశస్య మిషతో వశీ । సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్ । దివంచ పృథివీం చాంతరిక్ష మథో స్వః" ఋత మనగ సత్యసంకల్పము. సత్య మనగ యథార్థభాషణము. "స తపోఽతప్యత । స తప స్తప్త్వా" అను శ్రుత్యుక్తరీతిని బ్రహ్మముయొక్క తపస్సు ఆలోచనాత్మక మగుటంజేసి సృష్టినిమిత్తమైన ఆలోచనతో గూడిన "అభీద్ధాత్" అంతటప్రకాశమానమైన పరమేశ్వరునుండి జగత్తును సృష్టింపవలయునను సంకల్పము, అనంతరమున "బహు స్యాం ప్రజాయేయ" అని బహురూపములుగ నేను పుట్టగల నని సత్యప్రతిజ్ఞ జనించెను. అనంతరమున రాత్రిశబ్దోపలక్షితమైన కాలము జనించెను. ఈకాలము సృష్టికి నిమిత్తభూతము. అనంతరమున "సముద్రః, సముద్రయతి వ్యాప్నోతీతి సముద్రః" సర్వత్ర వ్యాపించు ఆకాశము, దిక్కు మొదలగు పదార్థములు

గీ॥ భూతగ్రామ స్స ఏవాయం భూత్వాభూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమేఽవశః పార్థ! ప్రభవ త్యహరాగమే ॥ ॥౧౯॥

పదవిభాగము:— భూతగ్రామః— సః— ఏవ— అయం— భూత్వా— భూత్వా— ప్రలీయతే— రాత్ర్యాగమే— అవశః— పార్థ! —ప్రభవతి— అహరాగమే॥ ॥౧౯॥

ప్రతిపదార్థము:— హేపార్థ!=ఓయర్జునా!; సఏవాయం=పూర్వకల్పమునందుండిన యీ;భూతగ్రామః=జంగమస్థావరాత్మకమైన భూతసముదాయము; అవశః=అవశమై; (అస్వతంత్రమై) అహరాగమే=హిరణ్యగర్భునకు పగలు ప్రాప్తించియుండ; భూత్వా భూత్వా=తిరిగి తిరిగి; ప్రభవతి=పుట్టుచున్నది; రాత్ర్యాగమే=హిరణ్యగర్భునకు రాత్రి ప్రాప్తించియుండ; ప్రలీయతే=లయమును పొందుచున్నది. ॥౧౯॥

---

జనించెను. దానివలన అర్ణవము (సముద్రము) జనించెను. అనంతరమున సృష్ట్యాదియం దహోరాత్ర నిమిత్తభూతుడు, సమయోపాధియు నగు సంవత్సరాత్మక ప్రజాపతి పూర్వోక్తప్రకార రూపకాలమునుండి జనించెను. ఆసంవత్సరమే షోడశకలాత్మకమైన ప్రజాపతి యనబడును. అనంతరము స్రష్టయగు ధాత ప్రాచీన దినాదియం దెట్లు కల్పించెనో యట్లే యీదినాదియందుగూడ నహోరాత్రములను కల్పించెను. వేటిని కల్పించెనెదవా? అహోరాత్రములను, అహోరాత్రములకు కారణమైన సూర్యచంద్రులను, ద్యులోకమును, పృథివిని, అంతరిక్షమును, ఆకాశమును స్వర్లోకమును కల్పించెను. ఎట్టివాడై వీటిని కల్పించెనెదవా! "మిషతో వశీ" జాగరాదియందు చూచుచున్న సర్వలోకమునకు వశవర్తియై కల్పించెను. అనగా స్వయముగానే యథాపూర్వముగ చూపించెనని యర్థము. ఈచెప్పుటచే దృశ్యప్రపంచమునకు కాల్పనికత్వము చెప్పబడెను. అట్లే "నవో నవో భవతి జాయమానోఽహ్నాం కేతు రుషసా మేత్యగ్రమ్" పగళ్ళకు కేతువగు సూర్యుడు ప్రాతఃకాలములకు అగ్రమగు ఉదయాచల మస్తకమును పొంది "నవో నవో భవతి" నవీనుడయి పుట్టుచున్నాడు. అట్లే కఠోపనిషత్తునందు గూడ "అథైష శ్లోకో భవతి యత శ్చోదేతి సూర్యో ఽస్తం యతశ్చ గచ్ఛతి ప్రాణా ద్వా ఏష ఉదేతి ప్రాణేఽస్తమేతి తం దేవా శ్చక్రిరే ధర్మగ్ం స ఏవాద్య స ఉశ్చ" ఈశ్రుతికి పూర్వమునందుగల శ్రుతియందు చక్షురాదిక మాత్మానుభవము చేతనే యుపయోగపడునా? లేక యసత్తును విషయ మొనరించుకొనునా? అను దానియం దుపపత్తిని శ్రుతియే చూపుచున్నది. అట్లు విషయమై వేదోపజీవ్యము, ప్రసిద్ధము నగు "సూర్యః" అను మంత్రము కలదని చెప్పుచుండెను. సూర్యుడు దేనియం దస్తమించుచుండెనో దేని నుండి నుదయించుచుండెనో యదియే వస్తువని విచారించినచో యీసూర్యుడు ముఖ్యప్రాణమగు సూత్రాత్మ నుండి యుదయించుచుండెను. ఆముఖ్యప్రాణమగు సూత్రాత్మయందే లయమును పొందుచుండెను. ఇది యిట్లుండ "దేవాః" పదార్థములను ప్రకాశింపజేయునవి యింద్రియములు. కాన "దేవాః" అనగా యింద్రియములని యర్థము. చక్షురాదీంద్రియములు ఉదయాస్తమయరూపమగు ధర్మము నైసర్గికమని తలంచిరి. ఆసూర్యుడే యిపుడుదయించెను. రేపుగూడ నుదయింపగలడు. దీనివలన దేలిన యాశయమేమి! ప్రతిపగలు అనుభవింపబడుచున్న సూర్యోదయాస్తమయములు పారమార్థికములు కావు. మరేమనిన యాపేక్షికములే. నేత్రగతమైన ఉదయాస్తమయములు సూర్యునియందు కల్పింపబడుచున్నవి. వాస్తవికముగ సూర్యునియందు లేవు. సూర్యుడు నేనుదయించితిని అస్తమించితిని అని యెరుగడు. ఈవిషయమే విచార్యమాణే "తరణా విహాయని" అని చెప్పబడెను. విషయమిట్లుండ ఉదితానుదితహోమవ్యవస్థగూడ నాపేక్షికమే యని గ్రహింపనగును. ॥౧౮॥

శాంకరభాష్యమ్:—

అకృతాభ్యాగమకృతవిప్రణాశదోషపరిహారార్థం బన్ధమోక్షశాస్త్రప్రవృత్తిసాఫల్యప్రదర్శనార్థ మవిద్యాదిక్లేశమూలకర్మాశయవశా చ్చావశో భూతగ్రామో భూత్వా భూత్వా ప్రలీయత ఇత్యత స్సంసారే వైరాగ్యప్రదర్శనార్థం చేద మాహ— భూతగ్రామో భూతసముదాయః

శాంకరభాష్యతత్త్వబోధిని:—

హిరణ్యగర్భునకు పగలు ప్రాప్తింప, స్థావరజంగమాత్మక మగు భూతగ్రామము పుట్టును. ఆభూతగ్రామమే హిరణ్యగర్భునకు రాత్రి ప్రాప్తింప లయమును పొందును. హిరణ్యగర్భునకుపగలుప్రాప్తింపమరియొకభూతగ్రామముపుట్టునన్నచో ప్రత్యవాంతరకల్పమునందు జనించు భూతగ్రామము పూర్వకల్పమునందు లయమునుపొందినదానికంటె వేరగును. అట్లగుచోకృతప్రణాశము; అకృతాభ్యాగమము మొదలగుదోషములుప్రాప్తించును. దానబంధమోక్షశాస్త్రానర్థక్య దోషము ప్రాప్తించు నని కృతహాన్యకృతాభ్యాగమదోషపరిహారమునిమిత్తము, బంధమోక్ష

—• ౮వ అధ్యాయము ౧౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు సంసారము శీఘ్రముగ నశించునదియైనను నివృత్తిలేనిది. క్లేశకర్మాదులచే నవశుడగుటచేత తిరిగి తిరిగి ప్రాదుర్భావమువలనను, ప్రాదుర్భూతమైన సంసారమునకు క్లేశాదివశము చేతనే తిరోభావమువలనను, సంసారమునందు తిరుగువారలకు అస్వాతన్త్ర్యమువలనను, అవశులకే జన్మమరణాదిదుఃఖప్రబంధసంబంధమువలనను, "ఈసంసారముతో నింతమాత్రము చాలు" అని వైరాగ్యము జనించుటకొఱకు సమానానామరూపములుకలవారగుటచే తిరిగి తిరిగి ప్రాదుర్భావమువలన కృతనాశాకృతాభ్యాగమదోపరిహారార్థము "భూతగ్రామః" అని చెప్పుచుండెను.

ఓయర్జునా! స్థావరజంగమాత్మకమగు యేభూతగ్రామము పూర్వకల్పమునందు కలదో ఆభూతగ్రామమే యీకల్పమునందును జన్మించుచున్నది. ఇంతియే కాని ప్రతికల్పమునందు వేరువేరుగ నూతనమగు భూతగ్రామము జనించుటలేదు. ఈవిషయముననే "సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్ । దివం చ పృథివీం చాంతరిక్ష మథో స్వః" అను శ్రుతియు, "సనామరూపత్వా దావృత్తా వప్యవిరోధో దర్శనాత్స్మృతేశ్చ" అను బ్రహ్మసూత్రము బోధించుచున్నవి. తేలిన యాశయ మేమనః— బ్రహ్మయొక్క పగలు ప్రారంభమున పూర్వకల్పీయభూతగ్రామమే అవిద్యాకామకర్మాదపరతంత్రమై జనించుచున్నది. బ్రహ్మకు రాత్రి ప్రాప్తించినవెంటనే యవ్యక్త మను పేరుగల బ్రహ్మయొక్క స్వాపావస్థయందు లయమును పొందుచున్నది. పూర్వకల్పీయమైన భూతగ్రామమే నశించుచున్నది; జనించుచున్నది. అని చెప్పుటచే కృతహానాకృతాభ్యాగమప్రసక్తిరూపదోషము నిరస్తము. ॥౧౯॥

శంకరానందీయము:— తరంగబుద్బుదాదులవలె యేయే ప్రాణు లెపుడెపుడు పుట్టి యేమే దుఃఖము ననుభవించుచుండిరో, ఆయా దుఃఖ మాయాసమయములలో వారలకే సంభవించును. వారలకంటె వేరగునట్టి నవీనులకుగాని, కాలాంతరజనితులకుగాని, జనిష్యమాణులకుగాని ప్రాప్తింపదు. ఆసెదవా! ఈవిషయమున నిన్ను ప్రశ్నింపవలసియున్నది.

నీయభిప్రాయానుసారము పూర్వమునందు, లేక ఇపుడు నూతనముగ జనించినవానికి సుఖదుఃఖాది

శాంకరభాష్యమ్:—

స్థావరజంగమలక్షణో యః పూర్వస్మిన్ కల్పే ఆసీ త్స ఏవాయం నాన్యో భూత్వా భూత్వాఽహరాగమే, ప్రలీయతే పునః పునా రాత్ర్యాగమేఽహ్నః క్షయేఽవశోఽస్వతంత్ర ఏవ పార్థ ప్రభవతి జాయతే అవశ ఏవాఽహరాగమే ॥ ॥౧౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శాస్త్రప్రవృత్తిసాఫల్యప్రదర్శనార్థము, అవిద్యా, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము మొదలగు క్లేశములకు కారణమైన కర్మాశయమునుండి భూతగ్రామ మవశమై (అస్వతంత్రమై) తిరిగి తిరిగి పుట్టి పుట్టి లయించుచున్నది. కాన సంసారమునందు వైరాగ్య ప్రదర్శనార్థము "భూత గ్రామః" అని చెప్ప మొదలిడెను.

పూర్వకల్పమునం దేభూతగ్రామ ముండెనో ఆస్థావరజంగమాత్మక భూతగ్రామమే హిరణ్యగర్భునకు పగలు ప్రాప్తింప అస్వతంత్రమై తిరిగి తిరిగి పుట్టి హిరణ్యగర్భునకు రాత్రి ప్రాప్తింప యస్వతంత్రమై తిరిగి తిరిగి లయమును పొందుచున్నది. ఈచెప్పుటవలన ప్రత్యవాంతర కల్పములయందు ఆప్రాణివర్గమే యభివ్యక్తమగును. అవియే లయించును. కాన కృతహాన్య కృతాభ్యాగమదోషప్రసక్తి లేదు. బంధమోక్షశాస్త్రమునకు సార్థక్యము ప్రాప్తించును. ॥౧౯॥

వైచిత్ర్యము ప్రత్యక్షముగ గన్పట్టుచున్నది. అది (1) కాలస్వభావమా? (2) ప్రాణిస్వభావమా? (3) దేశ స్వభావమా? (4) ద్రవ్యస్వభావమా? (5) అధునికకర్మస్వభావమా?

(1) ప్రత్యక్షముగ ననుభూయమానమైన సుఖదుఃఖాదివైచిత్ర్యము కాలస్వభావ మను ప్రథమపక్షమున శీతావాతాతపాదు లందరకు ఒకేకాలమున ప్రాప్తించునటుల ఒకే కాలస్వభావమువలన నందరికి యొక తీరుననే యవి సంభవింపవలసివచ్చును. అట్లు సంభవించుటలేదు. కాన ప్రథమపక్షము సంభవింపదు.

(2) ప్రాణిస్వభావ మను రెండవపక్షమున ఆయాప్రాణులకు శ్యామత్వరక్తత్వములువలె ప్రాణిస్వభావ మగు సుఖదుఃఖవైచిత్ర్య మొకవిధమైనదే యావజ్జీవ ముండవలసివచ్చును. కాన ప్రాణిస్వభావ మను రెండవపక్షము సంభవింపదు.

(3) దేశస్వభావ మను మూడవపక్షమున దేశ మొకటియే యగుటంజేసి యందరకు సర్వదా యొకే విధమగు సుఖదుఃఖాదికము ప్రాప్తింపవలసివచ్చును. కాన దేశస్వభావ మను మూడవపక్షము నిరస్తము.

(4) ద్రవ్యస్వభావ మను నాల్గవపక్షమున ఒకేమహానదిలోనిజలమును పానముచేయు నరపశుమృగఖగాదులకు యెల్లపుడు దుఃఖవైచిత్ర్యము ప్రాప్తింపవలసివచ్చును కాన ద్రవ్యస్వభావ మనెడి నాల్గవపక్షము హేయము.

(5) అధునికకర్మస్వభావ మను పంచమపక్షమున అకర్మి యగు బాలునకు సుఖాదులులేకపోవలెనుగదా. కాన పంచమపక్షము నిరస్తము.

అట్లగుచో ప్రాచీనకర్మవశముననే సుఖదుఃఖాదివైచిత్ర్య మనుభూయమానమగుచున్న దనెదవా? ప్రాక్కాలమున నసత్కార్యవాదివగు నీకు ప్రాచీనకర్మయే సంభవింపనందున యట్లు చెప్పుట నీ మతమున యెట్లు పొసగును? (పొసగదనియే భావము.) నీవు ప్రత్యక్షవాదివికదా! ప్రత్యక్షముగ నుపలభ్య

గీ॥ పర స్తస్మాత్తు భావోఽన్యో వ్యక్తోఽవ్యక్తా త్సనాతనః ।
యః స్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ ॥౨౦॥

పదవిభాగము:— పరః- తస్మాత్- తు- భావః- అన్యః- అవ్యక్తాత్- సనాతనః- యః- సః- సర్వేషు- భూతేషు- నశ్యత్సు- న- వినశ్యతి॥ ॥౨౦॥

ప్రతిపదార్థము:— భావః=అక్షర మనెడి పరబ్రహ్మము; తస్మాత్=భూతగ్రామబీజమైన; అవ్యక్తాత్=అవిద్యాస్వరూపమగు నవ్యక్తముకంటె; పరః=భిన్నమైనది; అన్యః=విలక్షణము; అవ్యక్తః= ఇంద్రియాగోచారము నగు; యః=ఏ; భావః=అక్షర మనెడి పరబ్రహ్మము; సనాతనః=చిరంతనమో; సః=ఆఅక్షరాఖ్యపరబ్రహ్మము; సర్వేషు=సమస్తమైన; భూతేషు=భూతములు; నశ్యత్సు=నశించుచున్నను; న వినశ్యతి=నశించునది కాదు. ॥౨౦॥

---

మానమైన యీసుఖదుఃఖాదివైచిత్ర్యమునకు గతిని చెప్పుమని ప్రశ్నింప పత్యక్షవాది- "అట్లగుచో సుఖదుఃఖాదివైచిత్ర్యమువలన జీవాదులకు యీజన్మమునకు పూర్వమునందుగూడ స్థితి నంగీకరించెద" నని గత్యంతరము లేక యవశ్యమంగీకరింపవలెను. అట్లాతనినంగీకరింపజేయుటకును, కర్మమోక్షశాస్త్రములయందు ముముక్షువునకు ప్రవృత్తి సిద్ధించుటకును, జీవునికివలె కర్మలకు, తత్కృతసంసారమునకు ననాదిత్వమును బోధించుటకును "భూతగ్రామః" అని చెప్పమొదలిడెను.

పూర్వముకల్పములయం దేభూతసముదాయము కలదో (ప్రాణివర్గము జనించెనో) ఆప్రాణిసముదాయమే అవశమై, అస్వతంత్రమై, స్వయముగ నవిద్యచే అస్మితాభినివేశపూర్వకముగ రాగద్వేషములచే జేయబడిన పుణ్యాపుణ్యకర్మాధీనమై ఆయాకర్మఫలానుభూతికొఱకు ప్రతికల్పమున జనించిజనించి ఆయాకర్మఫలముల ననుభవించి యనుభవించి తిరిగి హిరణ్యగర్భునకు పగలు ప్రాప్తింపగనే జనించుచున్నది. హిరణ్యగర్భునకు రాత్రి ప్రాప్తింపగనే లయమును పొందుచున్నది. ఇట్లు ఘటీయంత్రమువలె పుణ్యపాపకర్మవేగముచే తిరిగితిరిగి జనించుచున్నది. నశించుచున్నది. ఆధ్యాత్మికాది దుఃఖములచే వ్యథను పొందుచున్నది. తపించుచున్నది. ఎపుడును జన్మమరణప్రవాహపారమును పొందుటలేదు. ॥౧౯॥

పరమార్థప్రపః:— "బహిర్ముఖం పశ్యతి దృశ్యజాల మన్తర్ముఖం పశ్యతి చిత్స్వరూపమ్ । మధ్యే తయోస్స్వప్నమయా హి సృష్టి రనాది రేవం మనసస్స్వభావః" మనస్సు బహిర్ముఖమైనపుడు దృశ్యసముదాయమును చూచుచున్నది. అంతర్ముఖమైనపుడు చిత్స్వరూపమును చూచుచున్నది. ఆరెంటిమధ్యయందు స్వప్నమయమైనది సృష్టి. ఇట్లు సృష్టి యనాది యని అకులాగమమునందు చెప్పబడెను. "అనిర్మితాః కేనచిదీశ్వరేణ స్వప్నాః పదార్థాః ప్రభవన్త్యకస్మాత్ । తస్మిన్క్షణే తజ్జనితో జనస్య సత్యానుభూత్యా సుఖదుఃఖభోగః" ఏయీశ్వరునిచేతను స్వప్నపదార్థములు నిర్మింపబడకయే యకస్మాత్తు పుట్టుచున్నవి. ఆస్వప్నకాలమునందే యాస్వప్నపదార్థములయందు సత్యత్వానుభూతిచే యాస్వప్నపదార్థములవలన సుఖదుఃఖభోగము కలుగుచున్నది. ॥౧౯॥

—• ౮వ అధ్యాయము ౨౦వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు అవశుల కుత్పత్తివినాశములు చెప్పుటచే "ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున" అను చరణము వ్యాఖ్యానింపబడెను. యిపుడు "మా ముపేత్య తు

శాంకరభాష్యమ్:—

యదుపన్యస్త మక్షరం తస్య ప్రాప్త్యుపాయో నిర్దిష్ట ఓ మిత్యేకాక్షరం బ్రహ్మే త్యాదినా ఽథేదానీ మక్షరస్యైవ స్వరూపనిర్దిదిక్ష యేదముచ్యతేఽ నేన యోగమార్గేణేదం గంతవ్యమితిఽ పరో వ్యతిరిక్తో భిన్నః । కుతఃతస్మాత్పూర్వోక్తాత్ । తుశబ్దోఽక్షరస్య వివక్షిత స్యాఽవ్యక్తా ద్వైలక్షణ్యా విశేషణార్థః । భావోఽక్షరాఖ్యం పరం బ్రహ్మ । వ్యతిరిక్తత్వే సత్యపి సాలక్షణ్యా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ" ఇత్యాదికముచే నేయక్షర బ్రహ్మము నుపన్యసించి తత్ప్రాప్త్యుపాయము నిర్దేశింపబడెనో ఆయక్షరముయొక్క స్వరూపమును నిర్దేశించుతలంపుతో చెప్పబడుచుండెను. అక్షరమనెడి పరబ్రహ్మము- పూర్వమునందు చెప్పబడినదియు, భూతసముదాయబీజము, యవిద్యారూపము, యనృతమునగు యవ్యక్తముకంటె భిన్నము. యవ్యక్తసాలక్షణ్యముండు నను

కౌన్తేయ పునర్జన్మ న విద్యతే" అను యుత్తరార్థమును "పరస్తస్మాత్" అను శ్లోకము మొదలు రెండు శ్లోకములచే వాఖ్యానించుచుండెను.

పరబ్రహ్మము చరాచరస్థూలప్రపంచమునకు కారణమైన హిరణ్యగర్భ డనెడి యవ్యక్తముకంటెవేరు, లేక శ్రేష్ఠము. హిరణ్యగర్భునకు కారణము. హిరణ్యగర్భునికంటె వేరైనను హిరణ్యగర్భలక్షణములతో సమానమైన లక్షణములు కలదా యనిన యట్లునుకాదు. "న తస్య ప్రతిమా అస్తి" అను శ్రుత్యుక్తప్రకారము అత్యంతవిలక్షణము, రూపాదులు లేమింజేసి చక్షురాంద్రియాగోచరము, కల్పితమైన సర్వకార్యములయందు సద్రూపముచే ననుగతము, కనుకనే సనాతనము నిత్యమునగునది భావము. అది హిరణ్యగర్భునివలె సర్వభూతములు నశించుచుండ నశింపదు. సర్వభూతములు జన్మించుచుండ జన్మింపదు. హిరణ్యగర్భ డన్ననో భూతములయం దభిమానము కలవాడగుటవలన భూతోత్పత్తివినాశములచే నుత్పత్తివినాశములు కలవాడు. భూతములయం దభిమానము లేమింజేసి యకార్యమగు భావమునకు (పరమేశ్వరునకు) ఉత్పత్తివినాశములు లేవు. ఇట "తు" అను శబ్దముచే హేయము, అనిత్యమునగు నవ్యక్తముకంటె యుపాదేయత్వరూపవైలక్షణ్యము నిత్యమైన యవ్యక్తమునకు సూచింపబడెను. ||౨౦||

శంకరానందీయము:— ఇట్లు విషయసుఖమోహగ్రహగ్రస్తులకు దుఃఖపరంపర ప్రాప్తించును. కాన వివేకులు యెట్లు నాప్రాప్తి సంభవించునో యట్లు ప్రయత్నింపవలయునని సూచించుచు పరమేశ్వరునకు అవ్యక్తతత్కార్యలేశసంబంధరాహిత్యమును, నిత్యత్వమును తనను పొందినవారలకు సంసారదుఃఖము, పునరావృత్తి లేదని జ్ఞాపనచేయుటకు 'పరః' అని చెప్పుచుండెను. సర్వవ్యక్తులయొక్క యుత్పత్తిప్రళయములకు హేతువైన యవ్యక్తముకంటె భిన్నము, విలక్షణము, అక్షరమునగు పరమాత్మ యీ కారణరూపమగు యవ్యక్తముకంటెవేరు. పరమాత్మ సర్వప్రమాణములలో నేప్రమాణముచేతనైన తెలిసికొనుటకు శక్యము కానందునయవ్యక్తమనబడును. అప్రమేయము.

మూలప్రకృతి, భావరూపమగు యాత్మయు యవ్యక్తములే యగుచో యవ్యక్తమగు మూలప్రకృతికి, భావమగు నాత్మకు ప్రకృతివైలక్షణ్య మెటుల పొసగు నని శంకింపజనదు. "పరః" "అవ్యక్తాత్తు పరః పురుషః" అను శ్రుతివలన నవ్యక్తముకంటె ప్రకృష్టు డని యర్థము. అట్టి భావము సనాతనము, అనాది, నిత్యము నని యర్థము. భావమునకు నిత్యత్వ మనగ జన్మాదివికృయల కాశ్రయము కాకపోవుటయే.

శాంకరభాష్యమ్:—

ప్రసంగో౽స్తీతి తద్వినివృత్త్యర్థ మాహ— అన్య ఇతి । అన్యో విలక్షణః స చావ్యక్తో౽నింద్రియ గోచరః । పర స్తస్మా దిత్యుక్తం, కస్మాత్ పునః పరః పూర్వోక్తా ద్భూతగ్రామ బీజభూతా దవిద్యాలక్షణా దవ్యక్తాత్ । సనాతన శ్చిరంతనః । యః సభావః సర్వేషు భూతేషు బ్రహ్మాదిషు నశ్యత్సు న వినశ్యతి ॥ ॥౨౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యతిప్రసక్తిని తొలగించుటకై "అన్యః" అని చెప్పబడెను. అనగా నవ్యక్తముకంటె విలక్షణమైనది. మరియు నింద్రియాగోచరము. మరియు జిరంతనము. గాన యీయక్షరపరబ్రహ్మము బ్రహ్మాదిస్తంబపర్యంతనిఖిలభూతములు నశించుచున్నను నశించునది కాదు. ॥౨౦॥

అవ్యక్తమిట్టిది కాదు. సచ్ఛబ్దవాచ్యము, అవిద్యాశబలము బ్రహ్మము. "బ్రహ్మణో౽వ్యక్తం" అను శ్రుతిచే బ్రహ్మమునుండి యవ్యక్తము జనించుటచే ప్రథమవికారత్వము శ్రూయమాణమగుటవలన నవ్యక్తమునకు వికారిత్వము, అపరత్వములవలన నక్షరసామ్య మనుపపన్నము. అక్షరమునకు చెప్పబడిన నిత్యత్వమునే "యః" అను యుత్తరార్థముచే స్పష్టపరచుచుండెను. సనాతనము, నవ్యక్తము, అక్షరము నగు పరమాత్మ-యవ్యక్తమహదాదిభూతములు కాలమువలన కాని, జ్ఞానమువలన కాని నశించు స్వభావమును పొందినను స్వతః కాని, పరతః కాని యెపుడును నాశనమును పొందదు. ॥౨౦॥

పరమార్థప్రపా:— సర్వకారణము, సకలవ్యవహారాతీతము నగు పరమేశ్వరునకు శాశ్వతత్వమును "పరః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

కార్యకారణసంఘాతరూపమగు యవ్యక్తముకంటె నుత్కృష్టము. అవ్యక్తమునకు కారణము,- (అవ్యక్తముకంటెభిన్నము) తద్విలక్షణము, చక్షురాద్యగోచరము, అనాదియు నగు చాలక మగు యేభావము కలదో యది "యో౽వశిష్యతేసో౽స్మ్యహం"— అను స్మృత్యుక్తరీతిని సర్వభూతములు నశించినను నశింపదు. ఈవిషయమే "ఇన్ద్రియేభ్యః పరం మనో మనస స్సత్త్వ ముత్తమమ్ । సత్త్వా దధి మహా నాత్మా మహతో౽వ్యక్త ముత్తమమ్ ॥ అవ్యక్తా త్పరః పురుషో వ్యాపకో లింగఏవ చ । యజ్జ్ఞాత్వా ముచ్యతే జన్తు రమృతత్వం చ గచ్ఛతి" ఇంద్రియములకంటె మన స్సుత్కృష్టము. మనసుకంటె సత్త్వ ముత్తమము. సత్త్వముకంటె మహత్తత్త్వ ముత్కృష్టము. దానికంటె నవ్యక్తముత్తమము. దానికంటె పురుషుడు పరుడు, వ్యాపకుడు నగును. ఏపురుషుని తెలిసికొనిన జీవుడు ముక్తు డగుచుండెనో, అమృతత్వమును పొందుచున్నాడో, ఆపురుషు డవ్యక్తముకంటె పరుడు. అని అథర్వణవల్లులయందు చెప్పబడెను. ఋక్శాఖయందుగూడ "అవశ్య మస్య మహతో మహాత్వ మమర్త్యస్య మర్త్యాసు విక్షు । నానాహనూ బిభృతే సంభరేతే అపిన్వతీ వశ్యతీ భూర్యత్త" ఈయాత్మయొక్క వ్యాపకత్వమును చూచితిని. మరణధర్మముకల ప్రజలయందు సనాతనమైనది యాత్మ ఈశ్రుతియందు "యేన" (అను పదమధ్యాహార్యము.) ఏవ్యాపకత్వముచే ప్రాణుల యుత్తరాధరహనుములు ఓష్ఠములను భరణము నిమిత్తము భరించుచున్నవో దంతములచే పరిపూర్ణమై జిహ్వచే గ్రాసమును స్వీకరించి దంతములచే చూర్ణము చేసి విస్తారమగునటుల భక్షించుటచే అచేతననానాదేహములయందు రక్షణాదికర్మ తదంతర్గత మగు యొక పురుషునిచే చేయబడుచున్నదో ఆపురుషుడు వ్యాపకుడని చెప్పబడెను. ॥౨౦॥

గీ॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్త మాహుః పరమాం గతిమ్ ।
యం ప్రాప్య న నివర్తన్తే త ద్ధామ పరమం మమ ॥ ॥౨౧॥

పదవిభాగము:— అవ్యక్తః– అక్షరః– ఇతి– ఉక్తః– తం– ఆహుః– పరమాం– గతిమ్– యం– ప్రాప్య– న– నివర్తన్తే– తత్– ధామ– పరమం– మమ ॥ ॥౨౧॥

ప్రతిపదార్థము:— అవ్యక్తః=ఏయవ్యక్తము; అక్షరః=అక్షరము; ఇతి=అని; ఉక్తః=చెప్పబడెనో; తం=ఆయక్షరసంజ్ఞకల యవ్యక్తమగు భావమును; పరమాం=ఉత్కృష్టమైన; గతిం=గతినిగ; ఆహుః=చెప్పుచున్నారు. యం=ఏభావమును; ప్రాప్య=పొంది; న నివర్తన్తే=(సంసారముకొరకు) తిరిగి; రారో; తత్=అట్టి; మమ=నాయొక్క; తద్ధామ=ఆస్థానము; పరమమ్=ఉత్కృష్టమైనది; ॥౨౧॥

శాంకరభాష్యమ్:—

అవ్యక్త ఇతి యోఽసావవ్యక్తోఽక్షర ఇత్యుక్తః తమేవాక్షరసంజ్ఞక మవ్యక్తం భావమాహుః పరమాం ప్రకృష్టాంగతిమ్ । యం భావం ప్రాప్య గత్వా ననివర్తంతే సంసారాయ తద్ధామ స్థానం పరమం ప్రకృష్టం మమ విష్ణోః పరమం పద మిత్యర్థః ॥ ॥౨౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈ యవ్యక్తమే యక్షర మని "యేనాక్షరం పురుషం వేద సత్యమ్" అను శ్రుతిచేచెప్పబడెను. ఈయక్షర మను పేరుగల యవ్యక్త (ఇంద్రియాగోచర) మగు భావమునే యుత్కృష్ట మగు గతినిగ "పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః" ఇత్యాదిశ్రుతులు బోధించు చున్నవి. ఏయవ్యక్తరూపము, అక్షరసంజ్ఞికము నగు భావమును పొంది తిరిగి సంసారముకొఱకు నివర్తింపమో, ఆ నాయొక్క (విష్ణువుయొక్క) స్థాన ముత్కృష్టమైనది. ఈవిషయమును "తద్విష్ణోః పరమం పదం" అను శ్రుతి బోధించుచున్నది. ॥౨౧॥

—• ౮వ అధ్యాయము ౨౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— యోగీతాశాస్త్రమునందు ఏభావ మవ్యక్తమనియు, అక్షరమనియు జెప్పబడెనో, "పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః" ఇత్యాది శ్రుతులయందుగూడ చెప్పబడెనో దానినే యుత్పత్తి వినాశశూన్య స్వప్రకాశ పరమానన్ద రూపమైన పురుషార్థవిశ్రాంతిగ జెప్పుచుండిరి. ఏభావమును పొంది తిరిగి సంసారముకొఱకు ఆవృత్తిని పొందరో ఆధామమయే విష్ణువగునాయొక్క స్వరూపము. సర్వోత్కృష్టమైనది. (ఇట "మమధామ" అని "రాహోఃశిరః" అను స్థలమునందువలె భేదకల్పనచే షష్ఠి ప్రయోగింపబడెను. కాన నేనే పరమగతి యని యర్థము.) ॥౨౧॥

శంకరానందీయము:— ఇట్లు అక్షరమునకు సత్త్వమును చెప్పి యేది సనాతనము, అక్షరము, అవ్యక్తము నగు భావ మని ప్రతిపాదితమో, ఆయక్షరమే పరమాత్మ యనియు,దానిని పొందినవారల కపునరావృత్తిని "అవ్యక్తం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ఏది పరత్వ, సనాతనత్వావినాశిత్వాదిధర్మములచే నవిద్య యను యవ్యక్తముకంటె వేరై యవ్యక్తమై యక్షరమని చెప్పబడునో ఆయక్షరమునే "మహతః పర మవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః। పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః" ఇత్యాదిశ్రుతులు నిత్యనిరతిశయాద్వితీయాఖండచిదానందైకరసస్వరూప

గీ॥ పురుష స్స పరః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా।
యస్యాన్తస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్॥ ॥౨౨॥

పదవిభాగము:— పురుషః– సః– పరః– పార్థ!— భక్త్యా– లభ్యః– తు– అనన్యయా– యస్య– అన్తస్థాని– భూతాని– యేన– సర్వం– ఇదం– తతమ్॥ ॥౨౨॥

ప్రతిపదార్థము:— భూతాని=జంగమస్థావరాత్మక నిఖిలభూతములు; యస్య=ఎవనియొక్క; అంతస్థాని=లోపల నున్నవో; యేన=ఎవనిచే; ఇదం=ఈ; సర్వం=నిఖిలప్రపంచకము; తతం=వ్యాప్తమైనదో; పరః=నిరతిశయుడైన; సః=ఆ; పురుషః=పరిపూర్ణుడగు పరమాత్మ; అనన్యయా=అన్యము విషయము కానట్టి (కేవలాత్మవిషయకమైనట్టి;) భక్త్యా=జ్ఞానస్వరూపమగు భక్తిచే; లభ్యః=పొందదగినవాడు. ॥౨౨॥

---

శాంకరభాష్యమ్:—

తల్లబ్ధే రుపాయ ఉచ్యతే— పురుషః పురి శయనాత్ పూర్ణత్వా ద్వా స పరః పార్థ పరో నిరతిశయో యస్మా త్పురుషాన్న పరం కించిత్స భక్త్యా లభ్యస్తు జ్ఞానలక్షణయా అనన్యయా ఆత్మ

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అవ్యక్తాతిరిక్తము, అవ్యక్తవిలక్షణమునగు పరమపురుషునియొక్క ప్రాప్తియందుపాయ మీశ్లోకమునందు చెప్పబడుచుండెను.

ఏపురుషుని కంటె పరమేదియు లేదో అట్టి నిరతిశయమగు పురుషుడు (హృదయ పుండరీకమునందు శయనించువాడు కాన, లేక పూర్ణుడగుట వలన కాని పురుషు డనబడును.) ఆత్మ విషయకమగు జ్ఞానస్వరూపమైన భక్తిచే లభ్యుడు.

---

మగుటవలన యొకజ్ఞానముచేతనే పొందదగిన యుత్కృష్టమైన పరమతత్త్వముగ చెప్పుచున్నవి. కాన అక్షరుడే నిత్యశుద్ధబుద్ధముక్తసత్యపరమానందము, అద్వితీయము నగు పరబ్రహ్మము. అక్షరమే చెప్పబడిన లక్షణములుకల పరబ్రహ్మమగుగాక, అతనితో నీకుగాని; నాకుగాని ప్రయోజనమేమి యనెదవా? ఆపరమాత్మను పొందినవారలకు పునరావృత్తి లేదు. అక్షరమే పరమాత్మ అను జ్ఞానసిద్ధికొఱకు నీవంటి నేర్పరులు ప్రయత్నింపవలెనని సూచించుటకై తనయాథాత్మ్యమును బోధించుటకు "యం" అని చెప్పుచుండెను.

బహుజన్మసంచిత పుణ్యపుంజపరిపాక సంప్రాప్తచిత్తప్రసాద, మత్ప్రసాదపాత్రీభూతులు, శమదమాద్యుత్తమసాధనసంపన్నులు, ధన్యులునగు సంన్యాసులు సంతతసమాధినిష్ఠులై, సంపాదితసంసిద్ధికలవారై యేయక్షరమైన పరబ్రహ్మమును పొంది తిరిగి దేహవంతులు కారో, ఆయక్షరపరబ్రహ్మమే మాయోపాధికుడనగు యీశ్వరుడనైన నాకు అప్రాకృతము, అబాధితము, అనాది, అనంతమునగు ప్రకాశాత్మకమైన నిజ స్వరూపము. ॥౨౧॥

— ౮వ అధ్యాయము ౨౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు —

మధుసూదనసరస్వతీయము:— "అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః। తస్యాహం సులభః" అని పూర్వమునందు చెప్పబడిన భగవత్ప్రాప్త్యుపాయమైన భక్తియోగమునే 'పురుషః' అను శ్లోకముచే జెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

విషయయా। యస్య పురుషస్య అంతస్థ్సానే మధ్యస్థానే కార్యభూతాని భూతాని కార్యం హి కారణస్యాంతర్వర్తి భవతి। యేన పురుషేణ సర్వ మిదం జగ త్తతం వ్యాప్త మాకాశేనేవ ఘటాది॥ ॥౨౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓయర్జునా! కార్యమనునది కారణాంతర్వర్తి యగును. కాన నే మహాపురుష కార్యమగు నిఖిలభూతము లేమహాపురుషుని యొక్క మధ్యస్థములో, ఘటాదిక మాకాశము చేతను వలె యే మహాపురుషునిచే నిఖిలజగత్తు వ్యాప్తమో ॥౨౨॥

ఓయర్జునా! నేనే నిరతిశయమగు పరమాత్మను. పరమాత్మ విషయముగాగల ప్రేమరూపమైన భక్తిచే లభ్యుడను. ఇతరోపాయములచే లభ్యుడను కాను. కార్యము కారణాన్తర్వర్తి యగుటవలన కార్యకారణము లగు సర్వభూతములు కారణమగు పురుషుని యంతర్వర్తులు. కనుకనే "యస్మాత్పరం నాపర మస్తి కించి ద్యస్మా న్నాణీయో న జ్యాయోఽస్తి కశ్చిత్। వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠ త్యేక స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వం। యచ్చ కించి జ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా। అన్త ర్బహిశ్చ త త్సర్వం వ్యాప్య నారాయణ స్థితః। స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్యయమ్" ఇత్యాదిశ్రుతులు ఆపురుషునిచేతనే యీ కార్యజాతమంతయు అంతర్బహిర్వ్యాప్తమని బోధించుచున్నవి. ॥౨౨॥

శంకరానందీయము:— "పర స్తస్మాత్తు" అను శ్లోకము మొదలుకొని రెండుశ్లోకములచే పరబ్రహ్మస్వరూప మగు తన స్వరూపమును, పరబ్రహ్మప్రాప్తిని పొందినవారల కపునరావృత్తిని చెప్పి యిపుడు నియతమగు యేసాధనముచే పరబ్రహ్మమును పొందగలము. అను యాశంక కల పరిశుద్ధాంతఃకరణ కల మోక్షైక కాములకు పరబ్రహ్మప్రాప్తియందు పరమసాధనమును "పురుషః" అను శ్లోకముచే జెప్పు చుండెను.

"పరః" "అవ్యక్తా త్తు పరః పురుషః" అను శ్రుత్యుక్తరీతిని సర్వోత్తముడు "పురుషః" వెలుపల లోపల అంతటను ఏకరసముకలవాడగుటచే పూర్ణుడగుటవలన పురుషు డనబడును. అట్టి నాశరహితమగు పరమాత్మ "అనన్యయా, న విద్యతే అన్యః పరమాత్మాతిరిక్తో విషయో యస్యాః సా అనన్యా, తయా" అంతటను బ్రహ్మమాత్రమునుగ గ్రహించునట్టియు, అహమిదంప్రత్యయవినిర్ముక్తము నగు "భక్త్యా" ఆచార్యప్రసాదలభ్యము, సమాధినిష్ఠము నగు "సర్వ మిద మహం చ బ్రహ్మైవ" అను శ్రుతిసిద్ధమైన జ్ఞానము చేతనే పరమాత్మ పొందదగినవాడు. కర్మచేతను కాని, యోగముచేతను కాని, సాంఖ్యముచేతను కాని పొంద శక్యమైనవాడు కాడు.

పరబ్రహ్మ మతిసూక్ష్మము, అతీంద్రియముకదా! అట్టి పరబ్రహ్మను ముముక్షువు "ఈపరబ్రహ్మ మే నేను" అని తెలిసికొనుటకు యెట్లు సమర్థుడగును? అను శంకను "యస్య" అను యుత్తరార్ధముచే దొలిగించు చుండెను.

దర్పణమునందు నగరమువలె నిర్విశేషము, పరిపూర్ణము, అద్వితీయము నగు బ్రహ్మయొక్క అంతర్దేశమునందు ఆభాసరూపముచే యీనిఖిలభూతము లున్నవి. విచారింప దర్పణమునందు నగరమున్నదివలె కనుపించుచున్నది. అయినను సన్నిహితదృష్టిచే లెస్సగ జూచినచో యట నగరము స్వయముగ స్వరూపముతో లేదు.

అట్లే బ్రహ్మయందుగూడ జగత్తు కలదివలె భాసించుచున్నది. అధిష్ఠానగ్రాహియగు జ్ఞానదృష్టిచే పరిశీలింపబడినచో యొక బ్రహ్మమే కలదు. దానియందు జగత్తులేదు.

దర్పణమందు నగరము లేదని చెప్పుట సత్యమే. అయినను దర్పణము స్వచ్ఛమైన దగుటవలన దానియందు "దర్పణే నగర మస్తి" అను ప్రతీతివలన దర్పణమున కెదురుగ నగరము కలదని యొప్పుకొనవలయును. అట్లే బ్రహ్మమునందు స్వరూపముచే జగత్తు లేకున్నను బ్రహ్మమునందు జగత్తునకు ప్రతీతి కలుగుటవలన బ్రహ్మముకంటె వేరగు స్థలమున జగత్తు కల దనెదవా? అట్లును కాదు. అద్వితీయమగు బ్రహ్మమునందు జగత్తును కల్పించు మలినాత్మ డగు పురుషునియొక్క బుద్ధియందు జగత్తు కలదు. స్వనేత్రస్థమైన పచ్ఛదనమును శంఖాదులయందును, తన బుద్ధియందుండు జగత్తును స్వప్నమునందును యెట్లు కల్పించునో యట్లే మూఢుడు తన బుద్ధియందున్న వాసనామయమగు ప్రపంచమును నిష్ప్రపంచమైన బ్రహ్మమునందు కల్పించుచున్నాడు; చూచుచున్నాడు. స్వప్నమునందు బుద్ధిస్థమైన వాసనామయమగు జగత్తుకంటె వేరుగ స్వరూపముచే జగత్తులేదు. అట్టి జగత్తు సత్య మన్నచో ప్రబోధావస్థయందు దానికి బాధ లేకపోయెడిని. అట్లే బ్రహ్మమునందుకూడ యీనామరూపాత్మకజగత్తు పురుషాంతఃకరణవాసనాకల్పితమే కాని, వాస్తవికముగ లేదు. ఇట్టి జగత్తు సత్యమే యన్నచో "నాస్తి" అని నిషేధము సంభవింపక పోయెడిని. "అథాత ఆదేశో నేతి నేత్యాత్మాగృహ్యో న హి గృహ్యతే" అను శ్రుతి యారోపితమైన జగత్తును నిషేధించియే బ్రహ్మమును బోధించుచున్నది. కాన వాసనచే ప్రతీయమానమైన నిఖిలనామరూపాత్మకజగత్తు మిథ్యయే యని యధిష్ఠానసందర్శన జన్యవిజ్ఞానముచే "ఇది జగత్తు కాదు బ్రహ్మమే" అని అధిష్ఠానమాత్రత్వావశేషముగ నిషేధించి దర్పణమువలె తన్నిషేధావధిభూతమైన వస్త్వంతరశూన్యమైన చిదేకరసమగు పరబ్రహ్మ మిదియే నేను అని సద్గురువుయొక్క యనుగ్రహము కల బుద్ధిమంతునిచే శుద్ధాత్మస్వరూపముగ తెలిసికొనుటకు శక్యమైనది. యను యభిప్రాయముచే "యస్యాంతస్థాని భూతాని" అని చెప్పబడెను.

ఇట్లు తెలిసికొనుటకు శక్తిలేని యతికి "యేన" అను దానిచే యుపాయాంతరమును చెప్పుచుండెను. 'సపర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణం' 'తస్య భాసా సర్వ మిదం విభాతి' అను శ్రుతులచే జెప్పబడిన రీతిని యీపరిదృశ్యమానమైన జడాత్మకనిఖిలజగత్తు వెలుపల లోపల అంతటను ప్రకాశరూపమగు బ్రహ్మముచే ప్రకాశింపబడుచున్నది. అగ్నివ్యాప్తమైన అయఃపిండమునందు ప్రకాశ్యము ప్రకాశవ్యతిరిక్తముగ లేనటుల బ్రహ్మదర్శనమువలన బ్రహ్మప్రకాశితమైన యీనిఖిలజగత్తు బ్రహ్మమే అని సర్వమునకు బ్రహ్మమాత్రత్వవిజ్ఞానముచే తనకుగూడ బ్రహ్మమాత్రత్వమును తెలిసికొనుట శక్యమే యని యర్థము ॥౨౨॥

భాష్యోత్కర్ష దీపిక:— పరమేశ్వరప్రాప్తికి నియత (అవ్యభిచారి) మగు సాధనమును "పురుషః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

సర్వోత్తము డగు పరమపురుషుడు, ఇతరవిషయవ్యాపృతము కాని కేవలపరమాత్మవిషయకమైన జ్ఞానస్వరూపమగు నుత్తమభక్తిచే లభ్యుడు.

ఈవిషయమే "సర్వభూతేషు యఃపశ్యే ద్భగవద్భావ మాత్మనః । భూతాని భగవ త్యాత్మ న్యేష భాగవతోత్తమః" ఎవడు తన భగవద్భావమును సర్వభూతములయందు జూచునో సర్వభూతములను భగవత్స్వరూపమగు తనయందు జూచునో, వాడు భాగవతోత్తముడు. "ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సు చ । ప్రేమమైత్రీదయోపేక్షా యః కరోతి స మధ్యమః" ఎవడీశ్వరునియందు ప్రేమను, ఈశ్వరాధీనులయందు మైత్రిని, బాలిశులయందు దయను, శత్రువులయం దుపేక్షను

గీ॥ యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥ ।౨౩॥

ప ద వి భా గ ము:— యత్ర- కాలే- తు- అనావృత్తిం- ఆవృత్తిం- చ- ఏవ- యోగినః- ప్రయాతాః- యాన్తి- తం- కాలం- వక్ష్యామి- భరతర్షభ॥ ॥౨౩॥

ప్ర తి ప దా ర్థ ము:— హేభరతర్షభ=ఓ భరతవంశ శ్రేష్ఠుడవగు యర్జునా!; యోగినః=ప్రణవావేశితబ్రహ్మ బుద్ధికలవారు, కర్ములు; యత్ర=ఏ కాలమునందు; ప్రయాతాః=మృతులైనవారై; అనావృత్తిం=అపునరావృత్తిని; ఆవృత్తిం=పునరావృత్తిని; యాన్తి=పొందుచున్నారో; తం=ఆ; కాలం=కాలమును; వక్ష్యామి= చెప్పగలను. ॥౨౩॥

---

చేయునో వాడు మధ్యముడు. "అర్చాయా మేవ హరయే పూజాం యః శ్రద్ధయేహతే । న తద్భక్తేషు చాన్యేషు స భక్తః ప్రాకృత స్స్మృతః" ప్రతికృతియందు (విగ్రహాదులయందు) శ్రద్ధచే పరమేశ్వరుని కొఱకు పూజను యెవడు చేయుచు, పరమేశ్వర భక్తులనుకాని, యితరులనుకాని, పూజింపడో వాడు ప్రాకృతు డనుపించుకొను నని చెప్పబడెను. "వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః" సర్వము వాసుదేవ స్వరూపమే యని భావించు మహానుభావుడు దుర్లభుడు. "యో వై అన్యాం దేవతా ముపాస్తే అహ మన్యోఽసా వన్య ఇతి నస వేద" ఎవడు "నేను వేరు దేవత వేరు" అని యితరదేవత నుపాసించునో వాడాత్మతత్త్వము నెరిగినవాడు కాడు. కాన నేనాపరమపురుషుడనే. పరమాత్మ స్వరూపాత్మకంటె వేరుగ నేదియు లేదు. అనెడి యనన్యభక్తిచే బరమాత్మ పొందుటకు శక్యము.

పరమాత్మ యెల్లపుడు పొందబడిన వాడేకదా! భక్తిచే పొందబడునని చెప్పుట యెట్లు పొసగునని శంకింపజనదు. పొందుట అనునది అలబ్ధలాభమనియు, లబ్ధలాభమనియు రెండు విధములు. అందు మొదటిది అలబ్ధమగు గ్రామాదికమును రాజసేవాదులచే పొందుట. రెండవది కంఠమునందుండిన గ్రైవేయమును (కంఠాభరణమును) మరచియుండి నాకంఠాభరణ మెచట నున్నదో యని విచారించు పురుషుడు ఆప్తునిచే నీకంఠమునందే యున్నదని బోధింప వాని ననుసరించి తన కంఠమునందు కంఠాభరణమును చూచుకొని యది ప్రాప్తించినటుల సంతసించును. ఇదియే లబ్ధలాభ మనబడును. ఆరెంటిలో బ్రహ్మప్రాప్తి లబ్ధలాభ మనబడును. బ్రహ్మప్రాప్తి లబ్ధమైనను అజ్ఞానమువలన బ్రహ్మ మప్రాప్త మని తలచును. ఆప్తోపదేశమువలన జనించిన జ్ఞానస్వరూపమగు ముఖ్యభక్తిచే బ్రహ్మము ప్రాప్తమని తలచును. కాన పై శంకకవకాశములేదు. ఏపరమపురుషునియొక్క మధ్యయందు సర్వకార్యజాతము స్థితమో అనగా నిఖిలభూతములు యేయధిష్ఠానమునందు (కల్పితములో కల్పిత మధిష్ఠానము యొక్క లోపల నుండును. వ్యతిరిక్తముగనుండదు.) ఏపురుషునిచే యీజగత్తంతయు సత్తాస్ఫూర్తులచే వ్యాప్తమో, అట్టి పరమాత్మప్రాప్తి జ్ఞానస్వరూపమైన ముఖ్యభక్తిచే లభ్యము. నీవుకూడ మత్ప్రాప్తికి యవ్యభిచారిసాధనమైన భక్తిని ప్రయత్నముతో సంపాదింపుము "నేను కుంతీపుత్రుడను; నాకు భక్తిలేకుండగనే యీశ్వరలాభము కాగలదు" అని నమ్మకమును పొందకుము. అని ధ్వనించుటకు "పార్థ" అని సంబోధన చేయబడెను. లేక మద్విషయమైన యనన్యభక్తి నీకనాయాస లభ్యమని సూచించుటకు "పార్థ" అని సంబోధింపబడెను. ॥౨౨॥

——• ౮వ॥అధ్యాయము ౨౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •——

మ ధు సూ ద న స ర స్వ తీ య ము:— సగుణబ్రహ్మోపాసకులు బ్రహ్మలోకమునుపొంది తిరిగి యీలోకమును పొందరు. క్రమముగ హిరణ్యగర్భునితో ముక్తులగుదురు. హిరణ్యగర్భలోకభోగప్రాప్తికి

శాంకరభాష్యమ్:—

ప్రకృతానాం యోగినాం ప్రణవావశేషితబ్రహ్మబుద్ధీనాం కాలాంతరముక్తిభాజాం బ్రహ్మప్రతిపత్తయ ఉత్తరో మార్గో వక్తవ్య ఇతి యత్ర కాల ఇత్యాది వివక్షితార్థసమర్పణార్థ ముచ్యతే । ఆవృత్తిమార్గోపన్యాస ఇతరమార్గస్తుత్యర్థః । యత్ర కాలే ప్రయాతా ఇతి వ్యవహితేన సంబంధః । యత్ర యస్మిన్కాలే త్వనావృత్తి మపునర్జన్మాఽఽవృత్తిం తద్విపరీతాం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కాలాంతరమునందు ముక్తిని పొందునట్టి ప్రకృతమైనట్టి ప్రణవావేశిత బ్రహ్మబుద్ధిగల యోగులకు బ్రహ్మమును పొందుటకొరకు దేవయాన మార్గము చెప్పదగియున్నదని దేవయాన మార్గ సమర్పణార్థము "యత్రకాలే" ఇత్యాదికమును చెప్పుచుండెను. ఇచట పునరావృత్తికల పితృయానమార్గముకూడ దేవయానమార్గస్తుతినిమిత్త ముపన్యసింప బడుచుండెను.

పూర్వమునందు సమ్యగ్దర్శనము లేని సగుణబ్రహ్మోపాసకులకు మార్గాపేక్ష కలదు. ఈమార్గాపేక్ష సమ్యగ్దర్శనము కలవారలకు లేదు. కాన సమ్యగ్దర్శనములేని సగుణబ్రహ్మోపాసకులకు బ్రహ్మలోకప్రాప్తికొఱకు "యత్రకాలే" అని దేవయానమార్గ ముపదేశింపబడుచుండెను. ఇచటనే పితృయానమార్గముకూడ దేవయానమార్గస్తుతినిమిత్త ముపదేశింపబడుచుండెను.

ప్రాణోత్క్రమణానంతరము కాలాభిమానిదేవతోపలక్షితమార్గమునందు బయలుదేరిన ధ్యాయులు, (సగుణబ్రహ్మోపాసకులు,) కర్మలు అనావృత్తిని, ఆవృత్తిని పొందుచున్నారో, (అనగా దేవయానమార్గమునందు బయలు దేరిన సగుణబ్రహ్మోపాసకులు అనావృత్తిని పొందుచున్నారు.) విచారింప "ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినః" అను స్థలమున దేవయాన మార్గమున బయలుదేరి బ్రహ్మలోకమును పొందినవారలకు కూడ పునరావృత్తికలదని చెప్పబడెను. అయినను పితృయానమార్గమున బయలుదేరినవారలు నియమముగ పునరావృత్తి కలవారలే యగుదురు. ఒకడైనను క్రమముక్తిని పొందడు. దేవయానమార్గమునందు వెళ్లిన ప్రతీకోపాసకులు తటిల్లోకపర్యంతము వెళ్లినపిదప అమానవపురుషుడు యీప్రతీకోపాసకులగు పంచాగ్నివిద్యోపాసకులను హిరణ్యాగర్భునిపర్యంతము తీసుకొని వెళ్లినను వీరలు మోక్షమును కోరెడివారలు కానందున హిరణ్యాగర్భలోకమున భోగముల ననుభవించినపిమ్మట పునరావృత్తి కలవా రగుదురు. అయినను దహరాద్యుపాసకులు క్రమముగ భోగాంతమున ముక్తిని పొందెదరు. కాన బ్రహ్మలోకమును పొందిన యావన్మంది పునరావృత్తి కలవారు కారు. కనుకనే పితృయానమార్గము నియమముగ యావృత్తియే ఫలముగా కలదగుటచే నికృష్టమైనది. ఈదేవయానమార్గ మన్ననో అనావృత్తి ఫలముగా కలదగుటవలన నతిప్రశస్తము. అని దేవయానమార్గమునకు స్తుతి సమంజసమే. కొందరి కావృత్తియున్నను కొందరి కనావృత్తిఫలము సంభవించుటచే స్తుతిదేవయానమార్గమునకు యుక్తమే. ఆదేవయానమును, పితృయానమును, కాలాభిమానిదేవతోపలక్షితమార్గమును ఓయర్జున! చెప్పగలను (వినుము.)

ఇట కాలశబ్దమునకు ముఖ్యార్థమునే గ్రహించినచో "అగ్నిః, జ్యోతిః, ధూమః" ఇత్యాదిశబ్దములకు అనుపపత్తిసంభవించును. మరియు గతిస్మృతిశబ్దముల కనుపపత్తి ప్రాప్తించును. కాన నొక కాలపదమునందే లక్షణావృత్తి యాశ్రయింపబడెను. మార్గద్వయమునందు కాలాభిమానిదేవతలు విస్తారముగ నుండుటవలన నైపలక్షణావృత్తియంగీకార్యమే. ॥౨౩

శాంకరభాష్యమ్:—

చైవ। యోగిన ఇతి యోగినః కర్మిణ శ్చోచ్యంతే। కర్మిణ స్తు గుణతః 'కర్మయోగేన యోగినాం' ఇతి విశేషణా ద్యోగినః। యత్ర కాలే ప్రయాతా మృతా యోగినోఽనావృత్తిం యాంతి, యత్ర కాలే చ ప్రయాతా ఆవృత్తిం యాన్తి, తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥ ౨౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"యత్రకాలే" అను దానికి ఉత్తరార్ధమున నున్న "ప్రయాతాః" అను దానితో సంబంధము. ప్రణవావేశితబ్రహ్మబుద్ధికల యోగులు యేకాలమునందుమృతులై యపునరావృత్తినిపొందుచున్నారో, కర్మనిష్ఠాపరు లేకాలమునందు మృతులై పునరావృత్తిని పొందుచున్నారో

శంకరానందీయము:— "పురుష స్స పరః పార్థ" అని పరబ్రహ్మమునకు జ్ఞానైకప్రాప్యత్వమును, చెప్పబడిన లక్షణములుకల జ్ఞానముచే బ్రహ్మభావమును పొందిన యతులకు "యం ప్రాప్య న నివర్తన్తే" అని యపునరావృత్తిస్వరూపమగు విదేహముక్తిని, తత్ఫలమును చెప్పి యిపుడు చెప్పినరీతిని బ్రహ్మమును తెలిసికొనుట కశక్తులగు అపరిశుద్ధాంతఃకరణముకల ముముక్షువులకు చిత్తశుద్ధికొఱకై "ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః" అని పరాపరబ్రహ్మముల యుపాస్తియందు ప్రణవమునకు ప్రతీకత్వమును సూచించి, అందు "యః పున రేతం త్రిమాత్రేణోమిత్యేతేనైవాక్షరేణ పరం పురుష మభిధ్యాయీత" ఎవడు మూడుమాత్రలు కల (అకార, ఉకార, మకారాత్మకమగు) "ఓమ్" అను యక్షరముచే యీపరబ్రహ్మమును ధ్యానించునో అను శ్రుత్యుక్తరీతిని ప్లుతస్వరముచే నుచ్చరింపబడు ప్రణవమునందు పరబ్రహ్మబుద్ధిని చేసి యాప్రణవమునే బ్రహ్మమని యెవరు ధ్యానించెదరో అట్టి ప్రణవావేశితబుద్ధులుకలవారలకు, యితరులకును "తప శ్శ్రద్ధే యే హ్యుపవసన్త్యరణ్యే" ఇత్యాదిశ్రుత్యుక్తసగుణోపాసకులకు, క్రమముగ విదేహముక్తిని పొందదలచిన సంన్యాసయోగవంతులకు ప్రాణప్రయాణకాలము ప్రాప్తింపవారలకేమిగతి? అను యాశంకజనింప "తద్య ఇత్థం విదు ర్యే చేమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే తేఽర్చిష మభిసంభవం త్యర్చిషోఽహ రహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్యమాణపక్షా ద్యాన్షడుదఙ్ఙేతిమాసాం స్తా న్మాసేభ్య స్సంవత్సరం సంవత్సరా దాదిత్య మాదిత్యా చ్చంద్రమసం చన్ద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవ స్స ఏతా న్బ్రహ్మ గమయ త్యేష దేవయానః పన్థాః" ఎవరు పైన చెప్పినవిధమున తెలిసికొనెదరో, ఎవరు అరణ్యమునందుండి శ్రద్ధయే తపస్సని యుపాసించెదరో వారు మరణకాలమున అర్చిస్సును (తేజస్సును) పొందెదరు. అర్చిస్సునుండి అహస్సును, అహస్సునుండి శుక్లపక్షమును, శుక్లపక్షమునుండి ఆరు ఉత్తరాయణమాసములను, ఉత్తరాయణమాసములనుండి సంవత్సరమును, సంవత్సరమునుండి ఆదిత్యుని, ఆదిత్యునుండి చంద్రుని, చంద్రునుండి విద్యుత్తును పొందెదరు. విద్యుల్లోకమునుండి బ్రహ్మపురుషుడగు యమానవపురుషుడు పైనచెప్పబడిన సగుణోపాసకులను హిరణ్యగర్భలోకమును పొందించును. ఇదియే దేవయానమార్గము. (అర్చిరాదులు అనుస్థలమున తదభిమానిదేవతలను గ్రహింపనగును. వారలే ఆతివాహికు లనబడుదురు.) "అథ య ఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్త మిత్యుపాసతే తే ధూమ మభిసంభవన్తి ధూమా ద్రాత్రిం రాత్రే రపరపక్ష మపరపక్షా ద్యాన్షడ్దక్షిణేతి మాంసాం స్తా న్నైతే సంవత్సర మభిప్రాప్నువన్తి మాసేభ్యః పితృలోకం పితృలోకా దాకాశ మాకాశా చ్చంద్రమస మేష సోమో రాజా తద్దేవానా మన్నం తం దేవా భక్షయన్తి తస్మి న్యావత్సంపాత ముషిత్వాఽథైత మధ్వానం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓ యర్జునా! ఆకాలమును (నీకొఱకు) చెప్పెద ఇచటి యోగిశబ్దముచే కర్మయోగమువలన కర్మ్ములుకూడ యోగులన బడుదురు ॥౨౩॥

పున ర్నివర్తన్తే" ఎవరు ఇష్టాపూర్తములను దత్త మని యుపాసించెదరో వారు మరణకాలమున ధూమమును పొందెదరు. (ఇటగూడ ధూమాద్యధిష్ఠానదేవతలనే గ్రహింపనగును) ధూమమునుండి రాత్రిని, రాత్రినుండి కృష్ణపక్షమును, కృష్ణపక్షమునుండి దక్షిణాయనషణ్మాసములను, దక్షిణాయనషణ్మాసములనుండి సంవత్సరమును పొందెదరు. మాసములనుండి పితృలోకమును, పితృలోకమునుండి యాకాశమును, ఆకాశమునుండి చంద్రుని పొందెదరు. ఈసోముడు రాజు కాన నతడు దేవతల కన్నము. అందువలన చంద్రమండలమును పొందినవారలను దేవతలు భక్షించెదరు. ఆచంద్రమండలమునందు యావత్సంపాతము (తాను చెప్పినట్టి చంద్రమండలమం దనుభవింపదగిన ఫలమునిచ్చు కర్మ క్షయించుపర్యంతము) యుండి యీమార్గమునుండి పునర్జన్మకొరకీలోకమున కేగెదరు. (ఇదియే పునరావృత్తికల పిత్రుయానము) అని మొదట చెప్పబడిన శ్రుత్యుక్తదేవయానమార్గముచే బ్రహ్మలోకప్రాప్తి పునరావృత్తిలేని దని బోధించుటకు దేవయానమార్గము, తద్వ్యావృత్తికొఱకు కర్మ్ములకు కర్మఫల మిట్టిదని సూచించుటకు పితృయానము అని మార్గద్వయము కలదని అందొకమార్గముచే వెళ్ళినవారల కపునరావృత్తిని, రెండవమార్గముచే వెళ్ళినవారలకు పునరావృత్తిని "యత్ర" అను శ్లోకముచే జెప్పుచుండెను.

"యోగినః" అనుస్థలమున "యోగినః, యోగినః" అని జస్సునందు సరూపముల కేకశేష చేసినచో "యోగినః" అని రూపము సిద్ధించును. అందొక "యోగినః" అను పదముచే సంన్యాసులు, రెండవ "యోగినః" అనుపదముచే కర్మ్ములు చెప్పబడుదురు. కర్మ్ములకు యోగిపదవాచ్యత్వ మెటుల సంభవించు ననెదవా? కర్మఫలసంన్యాసయోగమువలన గౌణవృత్తిచే కర్మ్ములకుగూడ యోగిత్వము సంభవించు నని గ్రహింపనగును. రెండువిధములగు యోగులు యేకాలమునందు మృతులైనవారై స్వయముగ అనావృత్తిని, ఆవృత్తిని పొందుచున్నారో ఆకాలమును చెప్పెద వినుము. ॥౨౩॥

భాష్యార్థదీపిక:— బ్రతికియుండగనే ఆత్మసాక్షాత్కారముకలవారలకు "న తస్య ప్రాణా ఉత్క్రామన్తి అత్రైవ సమవలీయన్తే" ఇత్యాదిశ్రుతిచే గత్యుత్క్రాంతినిషేధమువలన చెప్పబోవు మార్గోపదేశము వారలనిమిత్త ముపయోగింపదు. అయినను ప్రాణావాశితబుద్ధులుకల ప్రకృతమైన క్రముక్తిని పొందెడి సగుణోపాసకులకు యేక్రమముచే బ్రహ్మప్రాప్తి యగునను యాశంకపై దేవయాన మార్గము నిరూపింపవలసియుండ ఉత్తర(దేవయాన)మార్గముచే వెళ్లినవారు పునరావృత్తిని పొందరు. పితృయానమార్గముచే వెళ్ళువారు పునరావృత్తిని పొందెదరు. అని వక్తవ్యస్తుతినిమిత్తము పితృయానమార్గోపదేశముచేయబడెను.

ఏకాలమునందు మృతులై యుపాసకులు అపునరావృత్తిని పొందుచుండిరో, కర్మయోగులు పునరావృత్తిని పొందుచుండిరో ఆకాలమును చెప్పెద. కర్మ్మికి అనుష్ఠానయోగమువలన యోగిత్వము సంభవమే యని 'కర్మయోగేన యోగినాం' అని చెప్పబడెను. "యోగినః" అనుదానిచే ప్రక్రాంతమైన "ఓమిత్యేకాక్షరం" ఇత్యాదికముచే చెప్పబడినవారలే గ్రహింపదగినవారు. యీచెప్పుటచే దేవయానమార్గముచే బ్రహ్మలోకమును పొందిన పంచాగ్నివిద్యోపాసకులకు పునరావృత్తి యున్నను క్షతి లేదు. కర్మయోగులనగ యుపాసనాసముచ్చితకర్మయోగులు గ్రాహ్యులు. ॥౨౩॥

గీ॥ అగ్ని ర్జ్యోతి రహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ ॥౨౪॥

పదవిభాగము:— అగ్నిః- జ్యోతిః- అహః- శుక్లః- షణ్మాసాః- ఉత్తరాయణమ్- తత్ర- ప్రయాతాః- గచ్ఛన్తి- బ్రహ్మ- బ్రహ్మవిదః- జనాః ॥ ॥౨౪॥

ప్రతిపదార్థము:— యత్ర (ఈ పద మనువృత్తము) ఏమార్గమునందు; అగ్నిః=అగ్న్యధిష్ఠాన దేవత; జ్యోతిః=జ్యోరధిష్ఠానదేవత; అహః= అహరధిష్ఠానదేవత; శుక్లః=శుక్లపక్షాధిష్ఠానదేవత; షణ్మాసాః= ఆరుమాసములస్వరూపమగు; ఉత్తరాయణం=ఉత్తరాయణాధిష్ఠానదేవత; సన్తి=కలరో; (ఈపదమధ్యాహార్యము) బ్రహ్మవిదః=హిరణ్యగర్భోపాసకులగు; జనాః=జనులు; తత్ర=ఆమార్గమునందు; ప్రయాతాః=మృతులై; (బయిలుదేరి) బ్రహ్మ=బ్రహ్మమును; క్రమేణ=క్రమముగ; (ఈపదమధ్యాహార్యము) గచ్ఛన్తి=పొందు చున్నారు. ॥౨౪॥

శాంకరభాష్యమ్:—

తం కాల మాహ— అగ్నిః కాలాభిమానినీ దేవతా। తథా జ్యోతి ర్దేవతైవ కాలాభిమానినీ । అథవాఽగ్నిజ్యోతిషీ యథాశ్రుతే ఏవ దేవతే । భూయసాం తు నిర్దేశో యత్ర కాలే తం కాల మి త్యామ్రవణవత్ । తథాఽహ ర్దేవతాఽహః శుక్లః శుక్లపక్షదేవతా। షణ్మాసా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్వశ్లోకమున ప్రతిజ్ఞాతమైన యాకాలమును "అగ్నిర్జ్యోతిః" అను శ్లోకముచే చెప్పుచుండెను. ఏకాలమునందు కాలాభిమానిదేవత, జ్యోతిరధిష్ఠానదేవత, అహరధిష్ఠానదేవత, శుక్లపక్షాధిష్ఠాన దేవత, ఉత్తరాయణాధిష్ఠానదేవత కలరో, ఆమార్గమునందు బ్రహ్మవేత్తలు (ఓంకారమునందు బ్రహ్మదృష్టిని నిలిపి యుపాసించు జనులు) మృతులై క్రమముగ పరబ్రహ్మమును పొందెదరు. క్రమముగ పొందుటెందుల కనిన సద్యోముక్తిని పొందెడి జ్ఞాననిష్ఠాపరులకు గతికాని, ఆగతికాని యెచటను లేదు. "న తస్య ప్రాణా ఉత్క్రామన్తి" అను శ్రుత్యుక్తరీతి ప్రాణోత్క్రమణమే

—• ౮వ అధ్యాయము ౨౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఉపాసకులకు దేవయానమార్గమును "అగ్నిః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

"అగ్ని ర్జ్యోతిః" అని అర్చిరభిమానియగు దేవత లక్షణచే చెప్పదగును. "అహః" అనుదానిచే అహరభిమానిదేవతను గ్రహింపవలయును. "శుక్లః" అనుదానిచే శుక్లపక్షాభిమానిదేవతను గ్రహింపవలయును. "షణ్మాసా ఉత్తరాయణం" అనుదానిచే ఉత్తరాయణరూపషణ్మాసాధిష్ఠానదేవతను గ్రహింపనగును. ఇట దేవతలనే గ్రహింపవలయునని "ఆతివాహికా స్తల్లింగాత్" అను బ్రహ్మసూత్రము బోధించుచున్నది. ఈచెప్పుట యితరశ్రుతిప్రతిపాదితదేవతల కుపలక్షణము. (ఉపలక్షణమనగ వక్తవ్యార్థమున నేకదేశమును చెప్పుట.) "తేఽర్చి రభిసంభవ న్త్యర్చిషోఽహ రహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్యమాణపక్షా ద్యా న్షడుదఙ్ఙేతి మాసాం స్తా న్మాసేభ్య స్సంవత్సరం సంవత్సరా దాదిత్య మాదిత్యా చ్చంద్రమసం చంద్రమసో

శాంకరభాష్యమ్:—

ఉత్తరాయణం తథాఽపి దేవతైవ మార్గభూతేతి స్థితోఽన్యత్ర న్యాయః । తత్ర తస్మిన్మార్గే ప్రయాతా మృతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో బ్రహ్మోపాసనపరా జనాః । క్రమేణేతి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లేదు. వారలు బ్రహ్మమునందే సంలీనమై ప్రాణములుకలవారై నబ్రహ్మస్వరూపమే యగుదురు. ఇక హిరణ్యగర్భోపాసకులకు ప్రాణోత్క్రమణము కలదు. వారలాయుపాసనాబలమువలన సుషుమ్నా నాడీద్వారమున బ్రహ్మరంధ్రమును భేదించుకొని దేవయానమార్గమున బయలువెడలి

విద్యుతం తత్పురుషోఽమానవః స ఏనా న్బ్రహ్మ గమయ త్యేష దేవపథో బ్రహ్మపథో ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తన్తే” ఇచట శ్రుత్యంతరానుసరణమువలన సంవత్సరానంతరమున దేవలోకదేవతయు, అనంతరమున వాయుదేవతయు, అనంతరమున ఆదిత్యుడు అని భాష్యమున నిర్ణయింపబడెను. అట్లే విద్యుత్తుయొక్క యనంతరమున వరుణేంద్రప్రజాపతులను యిమడ్చవలెను. దీనిచే మార్గపరిసమాప్తి యగును. అందు అర్చిస్సుయొక్క యధిష్ఠానదేవత, అహరధిష్ఠానదేవత, శుక్లపక్షాధిష్ఠానదేవత, ఉత్తరాయణ దేవతలు యీగీతావచనమునందు చెప్పబడెను. ఇక సంవత్సరము, దేవలోకము, వాయువు, ఆదిత్యుడు, చంద్రుడు, విద్యుత్తు, వరుణుడు, ఇంద్రుడు, ప్రజాపతి వీరలీగీతయందు చెప్పబడకున్నను దేవయానమార్గమునందు వీరిని గ్రహింపనగును. యీయానమునబయలుదేరినవారు హిరణ్యగర్భుని పొందెదరు. “కార్యంబాదరి రస్య గత్యుపపత్తేః” అను బ్రహ్మసూత్రము యీ కార్యబ్రహ్మప్రాప్తినే బోధించుచున్నది. క్రమముక్తి ఫలమగుటవల నిరుపాధికబ్రహ్మప్రాప్తి హిరణ్యగర్భద్వారమున ప్రాప్తించును. కాన సగుణోపాసకులు హిరణ్యగర్భుని పొందుచున్నారు. ఇచట దేవయానమార్గముచే బ్రహ్మలోకమును పొందినవారు “ఇమం మానవ మావర్తం నావర్తన్తే” ఈమనుకల్పమును పొందరు. అని శ్రుతియందు “ఇమం” అను విశేషణమువలన కల్పాంతరమునందు బహ్మలోకగతులగు కొందఱు పునరావృత్తి కలవారగుదురని తోచుచున్నది. ॥౨౪॥

శంకరానందీయము:— “యోగినః” అని ఉభయవిధ యోగులలో ఏకత్ర మృతులకు అపునరావృత్తి, అన్యత్రమృతులకు పునరావృత్తి అని యనియమముగ పరలోకప్రాప్తియైయుండ నుభయవిధ యోగులకు “స యథా కామో భవతి తత్క్రతు ర్భవతి యత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే యత్కర్మ కురుతే త దభిసంపద్యతే” వాడెట్టి కామనకలవాడగునో అట్టి కామనానుగుణమైన సంకల్పము కలవాడగును. ఎట్టిసంకల్పము కలవాడగునో తదనుగుణమగు కర్మను చేయును. ఎట్టి కర్మనాచరించునో అట్టి కర్మఫలమునే పొందును. ఇత్యాది శ్రుతిబలమునను, “క్రియాభేదా త్ఫలభేదః” క్రియాభేదమువలన ఫలభేదము ప్రాప్తించునను న్యాయమువలనను నియతమైన అయనవిభాగమును “అగ్నిః” అనుదానిచే చెప్పుచుండెను.

“తేఽర్చిష మభిసంభవ న్త్యర్చిషోఽహః” అను శ్రుతియందు అగ్న్యనంతరమున అహస్సు చెప్పబడుచుండెను. కాని జ్యోతిస్సు చెప్పబడలేదు. శ్రుతికి విరుద్ధముగ నీగీతయందు “అగ్ని ర్జ్యోతిః” అని యెట్లుచెప్పె నని శంకింపజనదు. “అర్చిః” అను శబ్దము అగ్నిజ్యోతిస్సుల కుభయమునకు సాధారణము. శ్రుతిచే ‘అర్చిః’ అని చెప్పబడెను. ఉభయసాధారణమైన ఆఅర్చిశ్శబ్దముయొక్క యర్థమునే యీగీతయందు విభజించి ‘అగ్ని ర్జ్యోతిః’ అని చూపెను. కాన శ్రుతివిరోధ మీగీతావాక్యమునకు ప్రాప్తింపదు. ‘అగ్నిః’ అనగా ఉత్తరాయణకాలాభిమానిదేవత., “జ్యోతిః” అనగా నిదియు కాలాభిమానిదేవతయే. ‘అహః’

శాంకరభాష్యమ్:—

వాక్యశేషః। న హి సద్యోముక్తిభాజాం సమ్యగ్దర్శననిష్ఠానాం గతి రాగతి ర్వా క్వచి దస్తి "న తస్య ప్రాణా ఉత్క్రామంతి" ఇతి శ్రుతేః బ్రహ్మసంలీనప్రాణా ఏవ తే బ్రహ్మమయా బ్రహ్మభూతా ఏవ తే। క్రమేణ తు గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ ॥౨౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సత్యలోకమును పొంది హిరణ్యగర్భుని యుపదేశమువలన జ్ఞాననిష్ఠాపరులై హిరణ్యగర్భునితో గూడ బ్రహ్మమును పొందుదు రని "క్రమముగా" అని చెప్పబడెను. ఒక ఉద్యానవనమున ఇతరవృక్షములు స్వల్పముగను, మామిడిచెట్లు హెచ్చుగ నున్నపుడావనమును ఆమ్రవణమని

అనగా అహరభిమానిదేవత 'శుక్లః' అనగా శుక్లపక్షాభిమానిదేవత. 'షణ్మాసాః' అనగా షణ్మాసాభిమానిదేవత. ఇది సంవత్సరాద్యభిమానిదేవతల కుపలక్షణము. (ఉపలక్షణమనగ వక్తవ్యార్థములో నేకదేశమును చెప్పుట.) అనగా నిచట సాక్షాత్తు సంవత్సరాద్యధిష్ఠానదేవతలు చెప్పబడకున్నను సంవత్సరాద్యధిష్ఠానదేవతలను గూడ గ్రహింపవలయు నని యర్థము. ఏయుత్తరాయణకాలమునం దగ్న్యాదిదేవతలు కాలాభిమానులై యుండెదరో అట్టి యుత్తరాయణకాలమునందు మృతులైన బ్రహ్మవిదులు (బ్రహ్మమును యుపాస్యముగ యెవరు తెలిసికొనెదరో వారు బ్రహ్మవిదు లనబడుదురు.) అనగా యోగులు చెప్పబడిన క్రమము ననుసరించి బ్రహ్మమును పొందెదరు. పైన చెప్పబడిన మార్గమును విడచి సాక్షాత్తు బ్రహ్మమును పొందరు. 'స తేజసి సూర్యే సంపన్నః' అని చెప్పి, అనంతరమున 'పరాత్పరం పురుష మీక్షతే' అని బ్రహ్మప్రాప్తి కంతరాలమును శ్రుతి బోధించుటచే సాక్షాత్తు బ్రహ్మమును పొందడు. శ్రుతియందున్న 'సూర్యే' అనునది అగ్న్యాదుల కుపలక్షణము. 'బ్రహ్మవిదః' అని అవిశేషశ్రవణమువలన యోగులకు (బ్రహ్మవేత్తలకు) గూడ క్రమముక్తియే యని శంకింపజనదు. 'న తస్య ప్రాణా ఉత్క్రామన్తి' అనుశ్రుతి బ్రహ్మవేత్తలకు ప్రాణోత్క్రమణమే లేదని బోధించుటవలన బ్రహ్మవేత్తలకుగూడ క్రమముక్తి యెందులకు ప్రాప్తింపదు. అనుశంక కేయవకాశమును లేదు. బ్రహ్మవేత్త బ్రహ్మస్వరూపుడై బ్రహ్మమునుపొందుచున్నాడు. అని "బ్రహ్మైవ స న్బ్రహ్మాప్యేతి" అను శ్రుతి బ్రహ్మవేత్తకు బ్రహ్మప్రాప్తి కంతరాలాభావమును బోధించుచున్నది. అట్టి యంతరాలమునే యంగీకరించినచో "అత్ర బ్రహ్మ సమశ్నుతే" అను శ్రుతికి విరోధమే ప్రాప్తించును. ఇచట యుత్తరాయణమునందు కాలాభిమానులగు యగ్న్యాదిదేవతల యుపన్యాసము-దక్షిణాయనమునందు రాత్ర్యాదులయందు మృతులైనవారైనను ఉపాసకుల కర్చిరాదిమార్గము ద్వారముననే బ్రహ్మప్రాప్తి సంభవించునని నియమార్థ మని గ్రహింపనగును. మరియు బ్రహ్మలోకమునుగూర్చి బయలు దేరినవారలకు ఆయాలోకములయందు విశ్రాంతినిమిత్తము, తత్తల్లోకములయందు సుఖానుభూతినిమిత్తము కాలాభిమానులుగ యగ్న్యాదిదేవతోపన్యాస మని గ్రహింపనగును. ఇట్లే పితృయానమార్గమునందు గూడ చూడనగును. ॥౨౪॥

భాష్యోత్కర్ష దీపిక:— "తం కాలం వక్ష్యామి" అను ప్రతిజ్ఞానురోధముగ "అగ్నిః" అను శ్లోకము మొదలుకొని చెప్పుచుండెను. "అగ్నిః" అనగ కాలాభిమానిదేవత. ఇట్లే "జ్యోతిః" అనునదానిచే కాలాభిమానివదేవతయే గ్రహింపనగును. లేక "అగ్నిః" అనుదానిచే నగ్నిదేవతను, "జ్యోతిః" అనుదానిచే జ్యోతిర్దేవతను గ్రహింపనగును. అట్లగుచో "యత్ర కాలే...తం కాలం వక్ష్యామి" ఆ కాలమును చెప్పగల

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—
చెప్పినటుల ఈదేవయానమార్గమునందు "అహః, శుక్లః, షణ్మాసాః" అని కాలవాచకములు హెచ్చుగా నుండుటచే "తం కాలం" అని చెప్పబడెను. ॥౨౪॥

---

ననుట యెట్లు సమంజస మగు నని శంకింపజనదు. దేవయానపితృయానమార్గద్వయమునందు విస్తారముగ కాలాభిమానదేవతలే చెప్పదగియుండ కాలశబ్దముచే కాలాభిమానిదేవతల కుపలక్ష్యత్వమును వివక్షచేసి దానినను సరించి కాలశబ్దనిర్దేశము చేయబడెను. అఛత్రులు (గొడుగులేనివారు) కూడవెళ్లుచుండ వెళ్ళువారలలో ఛత్రులధికముగ నుండుటంజేసి "ఛత్రిణో గచ్ఛన్తి" ఛత్రధారులు వెళ్ళుచుండిరి. అని ప్రయోగించినటుల కాలశబ్దప్రయోగ ముపపన్నమే. వృక్షాంతరము లున్నను హెచ్చుగ చూతవృక్షము లుండుటంజేసి యావనమును చూతవన మనునట్లు కాలశబ్దప్రయోగము కాలాభిమానిదేవతలు మార్గద్వయమునందు విస్తారముగ నుండుటచే యుపపన్నమే. ఈచెప్పుటచే కాలాభిమానిదేవతోపలక్షితమైన మార్గమును చెప్పెదను. కాలశబ్దము ముఖ్యార్థకమే యగుచో అగ్నిర్జ్యోతిర్ధూమశబ్దములకు అనుపపత్తియు, గతిస్మృతిశబ్దములకు నుపపత్తియు సంభవించు నను శంక తొలిగింపబడెను. ఇచట:- ఈయుపదేశము యేమార్గమునందు జనులు బయలుదేరి సుఖముగ వెళ్లెదరో యామార్గమును చెప్పెదనని ప్రతిజ్ఞ జేసి "మొట్టమొదట పర్వతము, అనంతరమున మర్రిచెట్టు, అటుపిమ్మట నది" అని యుపదేశించినట్లు చేసిన యుపదేశమా? లేక, యేమార్గమునందు సుఖముగ నగరమును, గ్రామమును పొందెదరో దానిని చెప్పెదనని ప్రతిజ్ఞ జేసి "మొట్టమొదట వృషభయానము, అనంతరమున అశ్వయానము, అటుపిమ్మట నరయానము, తరువాత పదయానము" అని యుపదేశించినట్లు చేసిన యుపదేశమా? ప్రథమపక్షమున "ఆతివాహికా స్తల్లింగాత్" అను సూత్రవిరోధము ప్రాప్తించును. రెండవపక్షమునందు పైన చెప్పిన విధమున అగ్న్యాదిశబ్దము లుపపన్నములగుచుండ వాటికి లక్షణావృత్తిని స్వీకరించుట వ్యర్థము. శ్రుతియందు "ఆతివాహికా స్తల్లింగాత్" అను న్యాయముచే అర్చిరాదుల కాతివాహికత్వ స్థాపనమువలన నగ్న్యాదుల నాతివాహికులుగ గ్రహించుట యావశ్యకమగుటచే "తం కాలం వక్ష్యామి" అను ప్రతిజ్ఞావాక్యమునందును కాలాభిమానిదేవతలనే చెప్పెద నను యర్థమే మంచిది. గమనాధికరణమగు పృథివీదేశమునందు "ఈమార్గమునందే వీరు వెళ్ళుచుండిరి." అని చెప్పినట్లు యోగి గమనాధికరణరూపములగు కాలాభిమాను లగు అగ్న్యాదిదేవతలయందుగూడ కాలశబ్దము ప్రయోగించుట సమంజసమే. కాన చెప్పబోవు గతిస్మృతిశబ్దములకు అనుపపత్తి లేదు. లేదా, భాష్యమునందుగూడ కాలశబ్దముచే కాలాభిమానిదేవతోపలక్షితమైన మార్గమును చెప్పగలను. అని వ్యాఖ్యానించి, యెట్లనో యవిరోధము సంపాదింపదగినది. ఇది శ్రుత్యుక్తము లగు యితరదేవతల కుపలక్షణార్థమని గ్రహింపనగును. ఈవిషయమే "తేఽర్చిష మభిసంభవ న్త్యర్చిషోఽహ రహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్యమాణపక్షా ద్యాన్ షడుదఙ్ఙేతి మాసాం స్తా న్మాసేభ్య స్సంవత్సరం సంవత్సరా రాదిత్య మాదిత్యా చ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవః స ఏనా న్బ్రహ్మ గమయ త్యేష బ్రహ్మపథో దేవపథ ఇమం మానవ మావర్తం నావర్తన్తే" అను యీశ్రుతియందుగూడ శ్రుత్యంతరానుసారముగ సంవత్సరమునుండి దేవలోకమును, దేవలోకమునుండి వాయువును, వాయువునుండి యాదిత్యుని అనియు, విద్యుత్తు అనంతరము విద్యుత్తునుండి వరుణుని, వరుణునుండి యింద్రుని, ఇంద్రునుండి ప్రజాపతిని అని తెలియనగును. మృతులైన సగుణోపాసకులు యీదేవయానమార్గమున బయలుదేరి క్రమముగ బ్రహ్మమును పొందుచున్నారు. ఇట "బ్రహ్మవిదః" అను పదముచే హిరణ్యగర్భోపాసకులే గ్రహింపనగుదురు. సద్యోముక్తిని పొందెడి సమ్యగ్దర్శననిష్ఠులను గ్రహింప

గీ॥ ధూమో రాత్రి స్తథా కృష్ణ షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే ॥ ॥౨౫॥

పదవిభాగము:— ధూమః– రాత్రిః – తథా – కృష్ణః – షణ్మాసాః – దక్షిణాయనమ్ । తత్ర– చాన్ద్రమసం– జ్యోతిః– యోగీ– ప్రాప్య– నివర్తతే ॥ ॥౨౫॥

ప్రతిపదార్థము:— ధూమః=ధూమాభిమానిదేవత; రాత్రిః=రాత్ర్యభిమానిదేవత, షణ్మాసాః= ఆరుమాసములస్వరూపమగు; దక్షిణాయనం=దక్షిణాయనాధిష్ఠానదేవతలు; సంతి=పితృయానమార్గమునందుకలరు. తత్ర=ఆపితృయానమార్గమునందు; ప్రయాతః=మృతుడై బయలుదేరిన; యోగీ=ఇష్టాపూర్తాదికర్మల నాచరించిన యోగి; చాంద్రమసం=చంద్రలోకమున ప్రాప్తించిన; జ్యోతిః=ఫలమును; ప్రాప్య=పొంది; నివర్తతే=తిరిగి జన్మముకొఱకీలోకమునకు వచ్చును. ॥౨౫॥

---

దగదు. ఏలనన, "నతస్యప్రాణాఉత్క్రామన్తి" ఇత్యాదిశ్రుత్యుక్తరీతినిసద్యోముక్తినిబొందెడిసమ్యగ్దర్శననిష్ఠులకు గతిని,అగతినినిషేధించి, బ్రహ్మమునందే లెస్సగ విలీనమైన ప్రాణములు కలవారగుటను, బ్రహ్మభూతత్వమును చెప్పుటవలన దేవయానమార్గమునందు బయలుదేరిన బ్రహ్మవిదులనగ సగుణోపాసకులేయని గ్రహింపనగును. ఈవిషయమే శ్రీవ్యాసభగవానులు "కార్యం బాదరి రస్య గత్యుపపత్తేః" అను సూత్రమునసుడిరెను. ఈయధికరణమునందు యిట్లు విచారింపబడెను. "బ్రహ్మ గమయతి" అనుచోట నుండు బ్రహ్మశబ్దము పరాపరబ్రహ్మ సాధారణమగుటవలనను, గతిశ్రుతివలనను "స ఏనా న్బ్రహ్మ గమయతి" అను స్థలమున అయమానవపురుషుడు యీసగుణోపాసకులను కార్యరూపమగు అపరబ్రహ్మ (హిరణ్యగర్భ) నుగూర్చి తీసుకవెళ్ళునా? లేక, అవికృతము, పరము నగు ముఖ్యబ్రహ్మమును పొందించునా? యని సందేహము ప్రాప్తింప "గత్యుపపత్తివలన యీసగుణోపాసకులను కార్యబ్రహ్మమును గూర్చియే పొందించునని" బాదరితలచెను. ఈకార్యబ్రహ్మకు గంతవ్యత్వము ప్రదేశము కలవాడగుటవలన యదియుపపన్నమగును. సర్వగతుడగుటవలనను, గంతలకు ప్రత్యగాత్మయగుటవలనను పరమాత్మకు గంతృత్వము కాని, గంతవ్యత్వము కాని, గతి కాని సంభవింపవు. ॥౨౪॥

—• ౮వ అధ్యాయము ౨౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— దేవయానమార్గస్తుతి నిమిత్తము పితృయానమార్గమును "ధూమో రాత్రిః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ఇచటగూడ "ధూమః" అనుదానిచే ధూమాభిమానిదేవతను గ్రహింపవలయును. ఇట్లే "రాత్రిః" రాత్ర్యభిమానిదేవత, "కృష్ణః" అనగా కృష్ణపక్షాభిమానిదేవత, "షణ్మాసా దక్షిణాయనం" దక్షిణాయనాభిమానిదేవత లక్షణచే జెప్పబడును. ఈచెప్పుటయు శ్రుత్యుక్తమగు యితరమగు దేవతల కుపలక్షణము. అనగా నిచట శ్రుత్యుక్తమైన యితరదేవతలను గ్రహింపవలయునని యర్థము. ఈవిషయమై "తే ధూమమభిసంభవన్తి ధూమా ద్రాత్రిం రాత్రే రపరపక్ష మపరపక్షా ద్యాన్ షడ్దక్షిణేతి మాసాం స్తా న్నైతే సంవత్సర మభిప్రాప్నువన్తి మాసేభ్యః పితృలోకం పితృలోకా దాకాశ మాకాశా చ్చంద్రమస మేష సోమో రాజా తద్దేవానా మన్నం తద్దేవా భక్షయన్తి తస్మి న్యావత్సంపాత ముషిత్వాఽథైత మేవాధ్వానం పున ర్నివర్తన్తే" కావునచే కర్మానుష్ఠానపరులు ధూమాభిమానిదేవతను పొంది దానినుండి రాత్ర్యభిమాని

శాంకరభాష్యమ్:—

ధూమ ఇతి । ధూమో రాత్రి ర్ధూమాభిమానినీ రాత్ర్యభిమానినీ చ దేవతా । తథా కృష్ణః కృష్ణపక్షదేవతా । షణ్మాసా దక్షిణా యన మితి చ పూర్వవ ద్దేవతైవ । తత్ర చన్ద్రమసి భవం చాన్ద్రమసం జ్యోతిః ఫల మిష్టాదికారీ యోగీ కర్మీ ప్రాప్య భుక్త్వా తత్క్ష యా న్నివర్తతే ॥ ॥౨౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పితృయానమార్గమునందు ధూమాభిమానిదేవత, రాత్ర్యభిమానిదేవత, కృష్ణపక్షాభిమానిదేవత, షణ్మాసస్వరూపదక్షిణాయనాధిష్ఠానదేవత- వీరు అతివాహికులు. ఈ యాతివాహికులచే యజ్ఞయాగాద్యనుష్ఠాయి యగు యోగి మృతుడై, పితృయానద్వారమున చంద్రలోకమును పొందింపబడి, యట తనచే నాచరింపబడిన ఇష్టాపూర్తాదికర్మఫలము ననుభవించి, తిరిగి జన్మముకొరకు భూలోకమును పొందును. ॥౨౫॥

దేవతను, దానినుండి కృష్ణపక్షాభిమానిదేవతను, దానినుండి దక్షిణాయనాధిష్ఠానదేవతను, దానినుండి సంవత్సరాధిష్ఠానదేవతను, పొందుచున్నారు. దక్షిణాయనమాసాధిష్ఠానదేవతలనుండి పితృలోకమును, పితృలోకమునుండి యాకాశమును ఆకాశమునుండి చంద్రుని పొందుదురు. ఈచంద్రుడు సోమరాజు. ఈసోముడు దేవతలకు అన్నము. అట్టి అన్నమును దేవతలుభక్షించెదరు. అట్టి సోమలోకమున తాను చేసుకొనిన సుకృతము నశించువరకు నుండి యనంతరము తిరిగి యీమార్గమునుగూర్చి వచ్చును. "ధూమో రాత్రిః" అను శ్లోకమునందు ధూమ, రాత్రి, కృష్ణపక్ష, దక్షిణాయనదేవతలు చెప్పబడెను. పితృలోకము, ఆకాశము, చంద్రుడు చెప్పబడలేదు. ఈచెప్పబడని పితృలోకాదు లనీశ్లోకమునందుగూడ గ్రహింపనగును. "మార్గమునందు బయలు దేరిన యిష్టాపూర్తదత్తము లాచరించిన కర్మయోగులు చాంద్రమసజ్యోతీరూపఫలమును పొంది, తానాచరించిన కర్మ యుండువరకచటనుండి, కర్మ నశించిన వెంటనే యీలోకమునకు మరలెదరు. కాన నీపితృయానమార్గము పునరావృత్తి కలది. దీనికంటె పునరావృత్తి లేనిదిగాన దేవయానమార్గము శ్రేష్ఠమైనది. ॥౨౫॥

శంకరానందీయము:— కర్ములు తమచే నాచరింపబడిన ఇష్టాపూర్తాదికర్మఫలము ఆరోహణావరోహణద్వారమున ప్రాప్తించు దుఃఖమునిచ్చునదిగా విని వివేకవైరాగ్యములచే బ్రహ్మజ్ఞాన సంపాదనపరులగుదురుగాక అని బోధించుటకు దక్షిణాయనమృతులకు ఫలమును "ధూమః" అను శ్లోకముచే జెప్పుచుండెను. "ధూమః" ధూమాభిమానిదేవత. "రాత్రిః" రాత్ర్యభిమానిదేవత. "కృష్ణః" కృష్ణపక్షాభిమానిదేవత. "షణ్మాసా దక్షిణాయనం" దక్షిణాయనషణ్మాసాభిమానిదేవత. ఈదేవతలు ఏదక్షిణాయనమునందు కాలాభిమానిదేవతలో అట్టి దక్షిణాయనమునందు మృతుడగు కర్మయోగి చంద్రలోకమును పొంది యచట చంద్రుని వలన ప్రాప్తమైన, ఇష్టాపూర్తాదిపుణ్యకర్మలవలన జనించెడి ఫలము ననుభవించి, "కృతాత్యయే అనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేత మనేవం చ" ఇష్టాపూర్తాదుల నాచరించిన కర్మి తన సుకృతకర్మవలన చంద్రలోకమున కేగి యచట తనచే నాచరింపబడిన కర్మఫలముననుభవింప, యాకర్మ ఫలానుభవము వలన నశింప, అనుశయముకలవాడై యీలోకమునుండి యేక్రమమున చంద్రలోకమున కేగెనో దానికి వ్యుత్క్రమముగ తిరిగి భూలోకమున కేగును. ఇచట అనుశయ మనగ స్వర్గార్థ మాచరితమైన కర్మశేష మని కొందరు చెప్పెదరు. అట్లుచెప్పిరచో యీకర్మయోగులు చంద్రలోకమున స్వకృతకర్మఫల మనుభవించి

తిరిగి భూలోకమునకు వచ్చునపుడు పుణ్యకర్మ లగుచో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య జన్మములను, పాపకర్మ లగుచో శ్వసూకరాది జన్మములను పొందెదరని బోధించు "రమణీయచరణాః రమణీయాం యోని మాపద్యేరన్ బ్రాహ్మణయోనిం వా క్షత్రియయోనిం వా వైశ్యయోనిం వా" "కపూయచరణాః కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం వా సూకరయోనిం వా చండాలయోనిం వా" అనుశ్రుతులకు విరోధము వాటిల్లును కాన స్వర్గార్థ మాచరితమైనకర్మల ఫలమును స్వర్గమునందే యనుభవించి, యాయనుభవముచే నాకర్మలు నశింప, కాలాంతరమునందు దేహాంతరముచే నాచరించబడిన సుకృతదుష్కృతకర్మజాలములో నుత్కృటకర్మ పుణ్యకర్మ యగుచో రమణీయచరణులై, పాపకర్మ యుత్కృటమగుచో కపూయచరణులై భూలోకమున కేగెదరు. ఆకర్మకే అనుశయమని పేరు. అని వ్యాససూత్రానుసారము పుణ్యకర్మఫలభోగానంతరము శేషకర్మానుభవముకొఱకు వెళ్లిన మార్గముననే తిరిగి యీమానవలోకమునుగూర్చి వచ్చెదరు. తిరిగి మానవజన్మను పొందినచో ఇష్టాపూర్తాదుల నాచరించి మరల చంద్రలోకమును పొందెదరు. ఇట్టి యాతాయాతదుఃఖ మనంతము. అహో! అవివేకులకు ఎంతకష్టము! అని సూచించబడెను. ||౨౫||

పరమార్థప్రప:— "ధూమః" అను శ్లోకముచే పితృయానమును చెప్పుచుండెను. దేవయానమార్గమునకు విపరీతమైన ధూమయానమార్గమునందు రాత్రి, కృష్ణపక్ష దక్షిణాయనాభిమానిదేవతలచే పితృలోకమును పొంది (ఇష్టాపూర్తాదికర్మయోగి ఆరోహణమార్గముచే చాంద్రమసజ్యోతిస్సును పొంది) తిరిగి అవరోహణమార్గముచే పునరావృత్తు డగుచున్నాడు. ఈవిషయమునే "అథ యే యజ్ఞేన దానేన తపసా లోకం యజన్తి తే ధూమ మభిసంభవన్తి ధూమా ద్రాత్రిం రాత్రే రపక్షీయమాణపక్షా ద్యాన్ షణ్మాసాన్ దక్షిణాదిత్యఏతి మాసేభ్యః పితృలోకం పితృలోకా చ్చంద్రం తే చంద్రం ప్రాప్యాన్నంభవన్తి తాంస్తత్ర దేవా యథా సోమం రాజాన మాప్యాయస్వాపక్షీయస్వే త్యేవ మేనాం స్తత్ర భక్షయన్తి తేషాం యదా తత్పర్యవై త్యథేమ మేవాకాశ మభినిష్పద్యన్త ఆకాశా ద్వాయుం వాయో ర్వృష్టిం వృష్టేః పృథివీం తే పృథివీం ప్రాప్యాన్నం భవన్తి త ఏవ మేవానుపరివర్తన్తేఽథ య ఏతౌ పన్థానౌ న విదు స్తే కీటాః పతంగా యదిదం దన్దశూకమ్" ఎవరు యజ్ఞముచేతను, దానముచేతను, తపస్సుచేతను లోకమును యాగము చేసెదరో వారుధూమాభిమానిదేవతను, దానినుండిరాత్ర్యభిమానిదేవతను, దానినుండికృష్ణపక్షాభిమానిదేవతను, దక్షిణాయనాధిష్ఠానదేవతనుపొందుచున్నారు. మాసాధిష్ఠానదేవతిలనుండిపితృలోకమును, దానినుండిచంద్రునిపొందిఅన్నస్వరూపమగుదురు. అట్టి అన్నస్వరూపమైన వారలను దేవతలు— సోముడను రాజును "ఆప్యాయస్వ, అపక్షీయస్వ" అనుమంత్రములచే భక్షించినటుల వీరలను "ఆప్యాయస్వ, అపక్షీయస్వ" అను మంత్రములచే భక్షించెదరు. వారలకు యెపు డవరోహణక్రమముచే యాచంద్రలోకమునుండి నిష్క్రమణము ప్రాప్తించునో అపుడు చంద్రలోకమునుండి ఆకాశమును పొందెదరు. ఆకాశమునుండి వాయువును, వాయువునుండి వృష్టిని, వృష్టినుండి పృథివిని పొంది యన్న మగుచున్నారు. వారలిట్లు అనువర్తించుచుండిరి. ఇట్లు యీమార్గద్వయ జ్ఞానము లేనివారు కీటయోనిని కాని, దానికంటెయధమమైన యోనిని కాని పొందుచున్నారు. అని వైశ్రుతి బోధించుచున్నది. తైత్తిరీయకమునందుగూడ "ప్రజానన్తః ప్రతిగృణ్హన్తి పూర్వే ప్రాణ మంగేభ్యః పరియాచరన్తమ్ । సువర్గం యాహి పథిభి ర్దేవయానై రోషధీషు ప్రతితిష్ఠ శరీరైః" పూర్వముయోగులు తత్త్వజ్ఞానముకలవారై శరీరములనుండి బయలుదేరి వెళ్ళుచున్న ప్రాణమును స్వాధీనమొనరించుకొనుచుండిరి. అనగా స్వేచ్ఛచే దేహమును విడచుచుండిరి. ఓచిత్తమా! నీవు అర్చిరాదిమార్గములచే సత్యలోకమునుగూర్చి వెళ్ళుము. లేదా, అట్లు సత్యలోకమును పొందుటకు సమర్థురాలవు కానిచో కర్మచే పితృలోకమును పొందు యిచ్ఛగలదానవై పితృయానముచే తిరిగి శరీరములచే నవరోహణ

గీ॥ శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే।
ఏకయా యా త్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః॥ ॥౨౬॥

పదవిభాగము:— శుక్లకృష్ణే- గతీ- హి- ఏతే- జగతః- శాశ్వతే- మతే । ఏకయా- యాతి- అనావృత్తిం- అన్యయా- ఆవర్తతే- పునః ॥ ॥౨౬॥

ప్రతిపదార్థము:— ఏతే=ఈ; శుక్లకృష్ణే=దేవయానపితృయానము లనెడి; గతీ హి=మార్గము లైతే; జగతః=జ్ఞానకర్మాధికారులకు; శాశ్వతే=నిత్యములై; మతే=సమ్మతములు. ఏకయా=దేవయానమార్గముచే; అనావృత్తిం=అపునరావృత్తిని; యాతి=పొందుచున్నాడు; అన్యయా=పితృయానమార్గముచే; పునః=తిరిగి జన్మము కొఱకు; ఆవర్తతే=మరలి వచ్చుచున్నాడు. ॥౨౬॥

శాంకరభాష్యమ్:—

శుక్లేతి । శుక్లకృష్ణే శుక్లా చ కృష్ణా చ శుక్లకృష్ణే । జ్ఞానప్రకాశకత్వా చ్ఛుక్లా, తదభావా త్కృష్ణా । ఏతే శుక్లకృష్ణే హి గతీ జగత ఇత్యధికృతానాం జ్ఞానకర్మణో ర్న జగత స్సర్వస్యైవేతే గతీ సంభవతః । శాశ్వతే నిత్యే సంసారస్య నిత్యత్వా న్మతే అభిప్రేతే । తత్రైకయా శుక్లయా యా త్యనావృత్తి మన్య యేతరయాఽఽవర్తతే పున ర్భూయః ॥౨౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జ్ఞానకర్మాధికారులకు దేవయానపితృయానము లనెడి ప్రసిద్ధమైన రెండు మార్గములు సంసారము నిత్య మగుటవలన నిత్యములై, జ్ఞాన,కర్మాధికారులకు సమ్మతములు. అట్లు చెప్పుట వలన కర్మాధికారము కాని, జ్ఞానాధికారము కాని, లేనివారలకీ మార్గద్వయప్రాప్తి లేదనిసూచింప బడెను. ఈమార్గద్వయము నిత్యమనిచెప్పుటవలన దక్షిణాయనమృతు లగు జ్ఞానులకుగూడ పిత్రు

మార్గమును పొంది ఓషధులయందుండుము. అనగా అన్నస్వరూపముగ బరిణమించుము. ఉభయమార్గ పరిభ్రష్టముమాత్రము కాకుము అని చెప్పబడెను.

మరియు ఋక్శాఖలయందుగూడ "ద్వే సృతీ అశృణవం పితౄణా మహం దేవానా ముత మర్త్యానామ్ । తాభ్యా మిదం విశ్వ మేజ త్సమేతి యదన్తరా పితరం మాతరం చ" పితరలకు, దేవతలకు, మనుష్యులకు దేవయానపితృయానము లనెడి రెండు మార్గములను వినియుంటిని. పాలకమగుటచే ద్యులోకము పితృరూపము. అట్లే ధరించున దగుటచే పృథివి మాతృస్వరూపము. ద్యావాపృథివులయొక్క మధ్య భాగమే యీవిశ్వము. అగ్నిచే సంస్కృతమై యీపితృలోకమునుగూర్చి వెళ్ళువాడై పైన చెప్పబడిన దేవయానపితృయానమార్గములద్వారా వెళ్లుచున్నాడని చెప్పబడెను. ॥౨౫॥

—• ౮వ అధ్యాయము ౨౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "అగ్నిర్జ్యోతిః" అను శ్లోకముచే జెప్పబడిన దేవయాన మార్గమును, "ధూమః" అను శ్లోకముచే జెప్పబడిన పితృయానమార్గమును "శుక్లకృష్ణే" అను శ్లోకముచే నుపసంహరించుచుండెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—
యానమార్గమేయనుయాశంకతొలగింపబడెను. జ్ఞానాధికారిదేవయానమార్గమున బ్రహ్మలోకము పొంది, యనావృత్తిని పొందుచున్నాడు. కర్మాధికారి పితృయానమార్గముచే చంద్రలోకమును పొంది యట కర్మఫలభోగానంతరము తిరిగి జన్మముకొరకు కీలోకమునకు వచ్చును. ॥౨౬॥

జ్ఞానప్రకాశకమగుటవలన అర్చిరాదిమార్గము శుక్లమని చెప్పబడును, జ్ఞానవిహీన మగుటచే పితృయానము తమోమయమగుటవలన కృష్ణమనబడును. ఇట్టి దేవయానపితృయానమార్గములు ప్రసిద్ధములే. ఈరెండు మార్గములు సగుణవిద్యాధికారికి, కర్మాధికారికి ప్రసిద్ధములు. మరియు శాస్త్రజ్ఞులందరికనిగూడ ప్రసిద్ధములే. సంసార మనాది యగుటవలన యీరెండుమార్గము లనాదులుగ సమమ్మతములు. ఈరెండుమార్గములలో దేవయానమార్గముచే వెళ్ళువారల కనావృత్తి (తిరిగి సంసారసముద్రక్లేశములు ప్రాప్తింపవు.) పితృయానమార్గముచే వెళ్ళువారలు పునరావృత్తిని (తిరిగి సంసారమును) పొందెదరు. ॥౨౬॥

శంకరానందీయము:— గృహస్థులకు యీదుఃఖము కాదాచిత్కము అను శంకపై "శుక్లకృష్ణే" అను శ్లోకముచే సమాధానమును చెప్పుచుండెను.

జ్ఞానప్రకాశ దేవతాధిష్ఠిత మగుటవలనను, విద్యచే పొందదగినదగుటవలనను, ప్రకాశలోకములు హెచ్చుగ నుండుటవలనను, బ్రహ్మప్రాప్తికి హేతువగుటచే నుత్కృష్టమైనదగుటవలనను దేవయానమార్గము శుక్లమనబడును. అనతిప్రకాశదేవతాధిష్ఠితమగుటవలనను, ధూమప్రచుర మగుటవలనను, తిరిగి సంసారహేతువగుటచే నికృష్టమగుటవలనను పితృయానమార్గము "కృష్ణః" అని యనబడును. ఈదేవయాన పితృయాన మార్గములు నిర్మల, మలినస్వభావములు కలవి. ఈరెండు మార్గములు జ్ఞాన, కర్మాధికారులకు మోక్షార్థము, కర్మఫలానుభవముకొఱకు "కర్మణా: పితృలోకో విద్యయా దేవలోకః" కర్మచే పితృలోకము, విద్యచే బ్రహ్మలోకము ప్రాప్తించు నను శ్రుతిప్రసిద్ధములు. ఇట "జగతః" అని ప్రాణిసాధారణవాచక జగచ్ఛబ్ద ముండ నిఖిలజీవులకు యీరెండు మార్గములు ప్రసిద్ధములు. అని చెప్పవలసియుండ జ్ఞానకర్మాధికారులకు ప్రసిద్ధములని చెప్పుట యసమంజస మని శంకింపజనదు. కేవల ప్రాకృతజనులకు జ్ఞానకర్మలయం దధికారము లేనందున జ్ఞానకర్మాధికారులకే యీరెండు మార్గములు చెప్పబడెను. అందుచే జగచ్ఛబ్దము సర్వప్రాణిసాధారణమైనను విశేషమునందు తాత్పర్యము కలదగుటవలన జ్ఞానకర్మాధికారులనే యీజగచ్ఛబ్దముచే గ్రహింపవలయును. జీవు లనాదు లగుటవలనను, నిత్యు లగుటవలనను, వారల కెంతకాలము సంసార మనువృత్తమో యంతకాలము స్వర్గసిద్ధికొఱకు, మోక్షసిద్ధికొఱకు యీరెండు మార్గములు నిత్యములై యగుచున్నవి. ఇట్లీరెండు మార్గములకు నిత్యత్వమును చెప్పి, యీరెండు మార్గములకు నియతఫలమును "ఏకయా" అను యుత్తరార్థముచే జెప్పుచుండెను.

ఈరెండు మార్గములలో నొకటి యగు దేవయానమార్గమును పొందిన విద్వాంసుడు "న చ పునరావర్తతే" అను శ్రుతిప్రసిద్ధమైన అపునరావృత్తిరూపమోక్షమును పొందుచున్నాడు. కర్మల నాచరించువాడు పితృయానమార్గముచే పితృలోకమును పొంది యట కర్మఫలము ననుభవించి "ప్రాప్యాన్తం కర్మణ స్తస్య యత్కించేహ కరో త్యయమ్। తస్మా ల్లోకా త్పున రే త్యస్మై లోకాయ కర్మణే" అను శ్రుత్యుక్తప్రకారము పునరావృత్తికలవా డగును. అనగా తిరిగి జన్మాదిసంసారమును పొందునని యర్థము. ॥౨౬॥

గీ॥ నైతే సృతీ పార్థ! జానన్యోగీ ముహ్యతి కశ్చన ।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున! ॥ ॥౨౭॥

పదవిభాగము:— న- ఏతే- సృతీ- పార్థ- జానన్- యోగీ- ముహ్యతి- కశ్చన - తస్మాత్- సర్వేషు- కాలేషు- యోగయుక్తః- భవ- అర్జున ॥ ॥౨౭॥

ప్రతిపదార్థము:— హేపార్థ!= ఓకుంతీపుత్రుడా!; కశ్చన=ఏ; యోగీ=యోగియు, ఏతే=ఈ; సృతీ=దేవయాన,పితృయానమార్గములను; జానన్=తెలిసికొనినవాడై; న ముహ్యతి= మోహమును పొందదు; తస్మాత్=ఆ కారణమువలన; హే అర్జున= ఓయర్జునుడా; త్వం= (ఈపద మధ్యాహార్యము) నీవును; సర్వేషు కాలేషు=సర్వ కాలములయందు; యోగయుక్తః=సమాహితచిత్తుడవై; భవ=అగుము. ॥౨౭॥

శాంకరభాష్యమ్:—

నైతే ఇతి । నైతే యథోక్తే సృతీ మార్గౌ పార్థ జానన్సంసారాయైకాఽన్యా మోక్షాయ చేతి యోగీ న ముహ్యతి కశ్చన కశ్చిదపి । తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తస్సమాహితో భవార్జున! ॥౨౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓకుంతీపుత్రుడా! ఈ దేవయానపితృయానమార్గములను తెలిసికొనినవాడగుచో (అనగా పితృయానమార్గము సంసారముకొరకు, దేవయానమార్గము మోక్షముకొఱకు సమర్థమగునని తెలిసికొనిన) యే యోగియు మోహమును పొందదు. కాన నోయర్జున! నీవుగూడ సర్వకాలములయందు యోగయుక్తుడ (సమాహితచిత్తుడ) వగుము. ॥౨౭॥

—• ౮వ అధ్యాయము ౨౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— గతి ద్వుపాస్యత్వముకొరకు గతివిజ్ఞానమును "నైతే" అను శ్లోకముచే స్తుతించుచుండెను.

ఓయర్జునా! దేవయానమార్గము క్రమముక్తికి సాధనమనియు, పితృయానమార్గము తిరిగి సంసారహేతువనియు తెలిసికొనిన ధ్యాననిష్ఠుడగు యోగి ధూమాదిమార్గప్రాపకమైన కేవలకర్మను కర్తవ్యముగ తలపడు. కాన యోగము (ధ్యాననిష్ఠ) పునరావృత్తి లేనిదగుటవలన సర్వకాలములయందు సమాహితచిత్తుడవై యగుము. అట్లు సమాహితచిత్తుడవగుచో అపునరావృత్తిరూపమోక్షము ప్రాప్తించును. ॥౨౭॥

శంకరానందీయము:— దేవయానమార్గముచే నగు గతికి ఫలము మోక్షము. పితృయానమార్గముచే నగుగతికి ఫలము బంధము. ఈరెండు మార్గముల స్వరూపమును, ఫలమును, కారణమును తెలిసికొనిన విద్వాంసు డీవిషయమున ప్రమాదమును పొందదని సూచించుటకు "నైతే" అను శ్లోకమును చెప్పుచుండెను.

ఈ చెప్పబడిన ఉత్తరాయణ, దక్షిణాయనమార్గములను (దేవయానపితృయానమార్గములను) శ్రుతిస్మృతియుక్తులచే బంధమోక్షకారణములుగ తెలిసికొనిన యేయోగియు (అనగా మోక్షేచ్ఛచే యోగనిష్ఠయందు ప్రవృత్తుడైన ముముక్షువగు హంసకాని, పరమహంసకాని) మోహమును పొందడు. ప్రమాదముచేతనైనను మోక్షమార్గవిరోధిమార్గ స్మరణమును చేయడు. యోగనిష్ఠయందు ప్రవర్తించినవాడు ప్రమత్తుడు కాగూడదని యర్థము. ఈదేవయానపితృయానమార్గములకు బంధ

గీ॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు య త్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।
అత్యేతి త త్సర్వ మిదం విదిత్వా యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్ ॥౨౮॥

హరిః ఓమ్ తత్స దితి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం, సంహితాయాం, వైయ్యాసిక్యాం భీష్మపర్వణి, శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జునసంవాదే తారకబ్రహ్మయోగో నామ
అష్టమాధ్యాయః ॥౮॥

పదవిభాగము:— వేదేషు- యజ్ఞేషు- తపస్సు- చ- ఏవ- దానేషు- యత్- పుణ్యఫలం- ప్రదిష్టమ్- అత్యేతి- తత్- సర్వం- ఇదం- విదిత్వా- యోగీ- పరం- స్థానం- ఉపైతి- చ- ఆద్యమ్ ॥౨౮॥

ప్రతిపదార్థము:— వేదేషు= లెస్సగ నధ్యయన మొనరింపబడిన వేదములయందును; యజ్ఞేషు= లెస్సగ ననుష్ఠింపబడిన యజ్ఞములయందును; తపస్సు చైవ= లెస్సగ నాచరింపబడిన తపస్సులయందును; శాస్త్రేణ=(ఈపద మధ్యాహార్యము) శాస్త్రముచే: యత్=ఏ; పుణ్యఫలం=పుణ్యముయొక్క ఫలము; ప్రదిష్టం= చెప్పబడెనో; తత్=అ; సర్వపుణ్యఫలమును; యోగీ=యోగి; ఇదం=ఈ యేడుప్రశ్నలద్వారమున జెప్పబడినదానిని; విదిత్వా= తెలిసికొని; (అనుష్ఠించి) పరం=ఉత్కృష్టమైన; ఆద్యం= కారణమైన;బ్రహ్మస్వరూపమైన; స్థానం=స్థానమును; ఉపైతి=పొందుచున్నాడు. ॥౨౮॥

శాంకరభాష్యమ్:—

శృణు యోగస్య మాహాత్మ్యమ్— వేదేషు సమ్య గధీతేషు, యజ్ఞేషు చ సాద్గుణ్యే నానుష్ఠితేషు, తపస్సు చ సుతప్తేషు, దానేషు చ సమ్యగ్దత్తేషు, య దేతేషు పుణ్యఫలంపుణ్యస్య

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యోగముయొక్క మాహాత్మ్యమును వినుము. లెస్సగ నధ్యయనము చేయబడిన నిఖిలవేదములయందును, లెస్సగ ననుష్ఠింపబడిన నిఖిలకర్మలయందును, లెస్సగ నాచరింపబడిన నిఖిలదానములయందును యేపుణ్యఫలము శాస్త్రముచే జెప్పబడెనో, ఆపుణ్యఫలము నంతను

మోక్షహేతుత్వము ప్రసిద్ధమగుటవలన ఓయర్జునా! నీవు ముముక్షువగుచో సర్వకాలములయందును, ఆహార శయనాశనాదులయందుగూడ యెల్లపుడు బ్రహ్మానుసంధానమునే చేయుము. యెపుడును బాహ్యవిషయముల యనుసంధానమును చేయకుము. ॥౨౭॥

—• ౮వ అధ్యాయము ౨౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— తిరిగి శ్రద్ధావృద్ధినిమిత్తమైన యోగమును "వేదేషు" అను శ్లోకముచే స్తుతించుచుచుండెను.

దర్భలు చేతబట్టి, పవిత్రమును ధరియించి తూర్పుదిక్కున కభిముఖుడై కూర్చుండిన గురువుయెడ శుశ్రూషాపరుడై యధ్యయన మొనరింపబడిన నిఖిలవేదములయందు, అంగోపాంగసహితముగ శ్రద్ధాపూర్వకముగ ననుష్ఠింపబడిన నిఖిలయజ్ఞములయందు, మనోబుద్ధ్యాదుల నేకాగ్రతను పొందించి శ్రద్ధచే నాచరించిన శాస్త్రోక్తతపస్సులయందు, దేశమునందు, కాలమునందు సత్పాత్రయందు శ్రద్ధాపూర్వకముగ నర్పింపబడిన తులాపురుషాదిదానములయందు యే పుణ్య(ధర్మ)ఫలము స్వర్గస్వారాజ్యాదికము శాస్త్రముచే జెప్పబడెనో

శాంకరభాష్యమ్:—

ఫలం పుణ్యఫలం ప్రదిష్టం శాస్త్రేణాత్యేత్యతీత్య గచ్ఛతి తత్సర్వం ఫలజాత మిదం విదిత్వా సప్తప్రశ్ననిర్ణయద్వారేణోక్తం సమ్యగవధార్యానుష్ఠాయ యోగీ పరం ప్రకృష్ట మైశ్వరం స్థాన ముపైతి ప్రతిపద్యతే, ఆద్య మాదౌ భవం కారణం బ్రహ్మేత్యర్థః ॥౨౮॥

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిందభగవత్పూజ్యపాదశిష్యశ్రీమదాచార్య శ్రీశఙ్కరభగవతః కృతౌ శ్రీభగవద్గీతాభాష్యే బ్రహ్మాక్షరనిర్దేశో నామాఽష్టమోఽధ్యాయః ॥౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యోగియీయేడుప్రశ్నలనిర్ణయద్వారమున చెప్పబడినదానిని తెలిసికొనియనుష్ఠించిన యుత్కృష్ట మైన కారణాత్మక మగు బ్రహ్మస్వరూపమైన స్థానమును పొందుచున్నాడు. ॥౨౮॥

ఇట్లు నూరువేల సంఖ్య కలిగి, వ్యాసప్రోక్తము, సంహితారూపము నగు మహాభారతమునం దంతర్గతమైన భీష్మపర్వమునందున్న యుపనిషద్రూపము, బ్రహ్మవిద్యారూపము, యోగశాస్త్రము నగు భగవద్గీతలయందున్న శ్రీకృష్ణార్జునసంవాదమునందుగల తారకబ్రహ్మయోగ మనుపేరి అష్టమాధ్యాయమునకు గౌతమసగోత్రుడగు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ" బులుసు అప్పన్నశాస్త్రిచే రచియింపబడిన, ఆనందగిరీయవ్యాఖ్యానుసృత శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని

సమాప్తము.

హరిః ఓమ్ తత్సత్.

అనగా పైని చెప్పబడిన వేదాధ్యయనమువలన, నిఖిలవేదోక్తకర్మల నాచరించుటవలన, కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతాచరణవలన తులాపురుషదానాదు లాచరించుటవల యేఫలము ప్రాప్తించునని శాస్త్ర(వేద)మునందు చెప్పబడెనో అట్టి ఫలమును పూర్వమునందు "కింత ద్బ్రహ్మ" ఇత్యాదికముచే జేయబడిన యేడుప్రశ్నలద్వారా నిరూపించబడినదానిని అనుష్ఠానపర్యంతము నిశ్చయించుకొని అనుష్ఠాన మొనరించిన యోగి (ధ్యాననిష్ఠుడు) అతిక్రమించుచున్నాడు. కేవలమట్టి ఫలము నతిక్రమించుటయే కాదు. సర్వోత్కృష్టము, సర్వకారణమునగు నీశ్వరస్థానమును పొందుచున్నాడు. అనగా సర్వకారణమగు బ్రహ్మమునే పొందుచున్నాడు. ఈయష్టమాధ్యాయముచే ధ్యేయముగ తత్పదార్థము వ్యాఖ్యాతము ॥౨౮॥

ఇట్లు శ్రీ మధుసూదనసరస్వతీవిరచిత
శ్రీ మద్భగవద్గీతాఽష్టమాధ్యాయ
గూఢార్థదీపికకు "తర్కరత్న,
న్యాయవేదాన్తవిద్యాపారీణ"
బులుసు అప్పన్నశాస్త్రి
విరచితతాత్పర్యబోధిని
సమాప్తము.

శంకరానందీయము:— యోగులచేతను, కర్మలచేతను పొందదగిన మార్గద్వయము దేవయానమార్గము, పితృయానమార్గము. ఆమార్గముల ననుసరించి వెళ్ళుయోగులకు, కర్మయోగులకు ఫలమును లెస్సగ చెప్పి, యిపుడు సగుణబ్రహ్మోపాసకునకు అర్చిరాదిలోకమునందు (దేవయానమార్గమునందు) పొందదగిన సుఖమును, బ్రహ్మప్రాప్తిని "వేదేషు" అను శ్లోకముచే విస్పష్టముచేయుచుండెను.

అంగములతోగూడ, లక్షణముతోగూడ ఋగాదివేదములు లెస్సగ నధ్యయనము చేసిన యేఫలము ప్రాప్తించునో, ఆధానముమొదలుకొని యశ్వమేధాంతక్రతువులను సాద్గుణ్యముగ సాంగోపాంగముగ లెస్సగ ననుష్ఠించిన యేఫలము ప్రాప్తించునో, కృచ్ఛ్రచాంద్రాయణాదులు వైకల్యములేకుండగ లెస్సగ నాచరించిన యేఫలము ప్రాప్తించునో, దేశకాలపాత్రాదిసంపత్తిపూర్వకముగ కన్యాదానము, గోదానము, మొదలగుదానము లాచరించిన యేఫలము ప్రాప్తించునో (అనగా పైనచెప్పబడిన వేదాధ్యయన, యజ్ఞానుష్ఠాన, చాంద్రాయణాదితపోనిష్ఠా, కన్యాదానాదులవలన నూర్ధ్వలోకములయందు భోక్తవ్యముగ యేసుఖము శాస్త్రమునందు చెప్పబడెనో) ఆనిఖిలసుఖములను "అక్షరం బ్రహ్మ పరమం" ఇత్యాదికముచే నిరూపింపబడిన అధ్యాత్మ, కర్మ, అధిభూత, అధిదైవ, అధియజ్ఞాదిభేదనిర్ముక్తమగు బ్రహ్మమును కాని, ప్రణవాలంబనపురస్సరముగ బ్రహ్మమును కాని తెలిసికొని శ్రద్ధాభక్తులచే ప్రణవమాలంబనముగ బ్రహ్మము నుపాసించిన సగుణబ్రహ్మోపాసకు డగు యోగి – స్వయముగ అగ్న్యాదిబ్రహ్మలోకపర్యంతమైన లోకములయందు బ్రహ్మలోకగమనకాలమున ప్రతిలోకమునందు తత్తల్లోకాధిష్ఠానదేవతలగు యగ్న్యాదులచే లెస్సగ పూజింపబడి, పూర్వమునందు జెప్పబడిన వేదాధ్యయనాదులవలన ప్రాప్తించు సుఖముకంటె నుత్కృష్టమైన సుఖమును పొందుచున్నాడు. బ్రహ్మోపాసన కింతియే ఫలము కాదు. మరేమనిన? సర్వాధిష్ఠానము, సర్వకారణము నగు పరబ్రహ్మమును పొందుచున్నాడు. అనగా మోక్షమును గూడ పొందును. ||౨౮||

ఇట్లు శ్రీశంకరానందసరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా ఽష్టమాధ్యాయవాక్య
తాత్పర్యబోధినికి "తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణ" బులుసు
అప్పన్నశాస్త్రిచే రచియింపఁబడిన తాత్పర్యబోధిని
సమాప్తము.

---

శ్రీధరీయము:— అధ్యాయార్థమును, "కింతద్బ్రహ్మ" అనునది మొదలుకొని చేయబడిన యెనిమిదిప్రశ్నల యర్థనిర్ణయమును ఫలముతోగూడ "వేదేషు" అనుశ్లోకముచే నుపసంహరించుచుండెను.

వేదాధ్యయనాదులచేతను, యజ్ఞాదుల: యనుష్ఠానముచేతను, కాయశోషణాదితపస్సుచేతను, సత్పాత్రార్పణాదిదానములచేతను శాస్త్రములయం దేఫలము చెప్పబడెనో దానికంటె నధికఫలమును, యోగైశ్వర్యమును పొందుచున్నాడు. అనగా ఈయష్టప్రశ్నార్థనిర్ణయముచే జెప్పబడిన తత్త్వము తెలిసికొని యోగి జ్ఞానియై యుత్కృష్టము, జగన్మూలము, నగు విష్ణువుయొక్క పరమపదము బొందుచున్నాడు. ||౨౮||

శ్లో|| అష్టమేఽష్టవిశిష్టేఽష్ట సంపృష్టార్థాష్టనిర్ణయైః ।
అక్లిష్ట మిష్టధాప్రాప్తి స్స్పష్టితాష్టమవర్త్మనా ॥

అష్టమాధ్యాయమునందలి యర్జునునిచే చేయబడిన ప్రశ్నల నెనిమిదింటికి నెనిమిది నిర్ణయములచే నెనిమిది విషయములు గల యష్టమాధ్యాయము నందలి యెనిమిది యగు మార్గములచే నిష్టప్రాప్తి క్లిష్టత లేకుండగ స్పష్టపరుపబడెను.

ఇట్లు శ్రీధరవిరచిత శ్రీభగవద్గీతా ఽష్టమాధ్యాయటీకకు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ" బులుసు అప్పన్నశాస్త్రివిరచిత తాత్పర్యబోధిని సమాప్తము.

సదానందీయము:— యో వేదాన్తేఽక్షరాత్మా బహుసుకృతవతాం ధ్యేయ ఆనంద కన్దః, ప్రేమ్ణా లభ్యో య ఆరా చ్చర మచర మిదం కల్పితం యత్ర ధామ్ని। యం ప్రాప్యా వృత్తిశూన్యో నివసతి పరమే స్వే మహి మ్న్యాత్మనిష్ఠ, స్తం శ్రీ కృష్ణం ముకున్దం స్మితమధుర ముఖం సర్వదా సంశ్రయేఽహమ్ ॥

తా॥ అనేకజన్మలయం దాచరింపబడిన పుణ్యపుంజము కలవారలకు ధ్యేయమైన ఏఆనందకందరూప మగు అక్షరాత్మ వేదాంతమునందు చెప్పబడెనో, ఎవడు ప్రేమచే లభ్యుడో, ఏధామయం దీజంగ మస్థావరాత్మకప్రపంచము కల్పితమో, ఏస్వరూపమును పొంది పునరావృత్తిశూన్యుడై, ఆత్మనిష్ఠుడై యుత్కృష్ట మగు తన మహిమయందే నివసించునో అట్టి చిరునవ్వుచే మధురమైన ముఖముకల ముకుందు డగు శ్రీకృష్ణపరమాత్మను నేను యెల్లపు డాశ్రయించుచుంటిని. ॥౨౮॥

ఇట్లు సదానందవిద్వత్కృత శ్రీభగవద్గీతా ఽష్టమాధ్యాయప్రకాశకు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ" బులుసు అప్పన్నశాస్త్రివిరచితతాత్పర్యబోధిని సమాప్తము.

భాష్యోత్కర్ష దీపిక;— శ్రద్ధ వృద్ధిపొందుటకు యోగమాహాత్మ్యమును "వేదేషు" అను శ్లోకముచే జెప్పుచుండెను.

పవిత్రపాణియై ప్రాఙ్ముఖుడై, గుర్వాజ్ఞానువర్తియై బ్రహ్మచర్యమును పాలించువాడై యెవడు లెస్సగ వేదాధ్యయనమొనరించునో, అట్టివానిచే నధీతమైన వేదములయందు, శ్రద్ధాపూర్వకముగ అంగోపాంగ సహితముగ సాద్గుణ్యముచే ననుష్ఠింపబడిన యజ్ఞములయందు, శ్రద్ధాపూర్వకముగ మనోబుద్ధ్యాద్యైకాగ్ర్య పూర్వకముగ సుతప్తమైన తపస్సులయందు, శ్రద్ధాపూర్వముగ పుణ్యకాలమునందు పుణ్యదేశమునందు సత్పాత్రుల కొఱ గీయబడిన కన్యాదాన, గోదాన, భూదాన, సరస్వతీదానాదులయందు జెప్పబడిన యేఫలము కలదో ఆనిఖిలఫలమును తత్త్వమును తెలిసికొనినవా డతిక్రమించుచున్నాడు. అనగా నంతకన్న యెక్కువ ఫలమును పొందుచున్నాడు. అట్టి ధ్యానయోగి సర్వకారణమైన పారమైశ్వరస్థానమును (బ్రహ్మమును) పొందుచున్నాడు. ఈయష్టమాధ్యాయముచే నేడుప్రశ్నలకు సమాధానమును చెప్పి యుండ ధ్యేయమగు బ్రహ్మమును ప్రతిపాదించి కర్మయోగమార్గముకంటె నుత్కృష్టముగ ధ్యానయోగమార్గమును బోధించి శ్రీకృష్ణపరమాత్మ తత్పదార్థమును వ్యాఖ్యానించెను. ॥౨౮॥

ఇట్లు ధనపతిసూరివిరచిత శ్రీభగవద్గీతాఽష్టమాధ్యాయ భాష్యోత్కర్షదీపికకు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ" బులుసు అప్పన్నశాస్త్రి విరచితతాత్పర్యబోధిని సమాప్తము.

పరమార్థప్రపః— గృహ్ణాత్యాత్మప్రకాశా న్నిజవిషయ మతోఽధ్యాత్మ మతేన్ద్రియం స్యాత్, సూర్యాద్యం తత్ప్రవృత్తిం ప్రజనయతి తత శ్చాధిదైవం తదుక్తమ్ । రూపాద్యం చాధిభూతం తదనుగత మనుధ్యేయ మాత్మస్వరూపం, తేనాన్తే తస్య తిష్ఠా మ్యహ మభిముఖ మిత్యష్టమే స్పష్ట మాహ ‖౨౮‖

ఇంద్రియము ఆత్మప్రకాశముచే స్వీయవిషయములను గ్రహించునది గాన యధ్యాత్మ మనబడును. సూర్యాదికము ఇంద్రియములకు ప్రవృత్తిజనకము గాన యధిదైవ మనబడును. రూపాద్యనుగతమై యాత్మస్వరూప మనుధ్యేయ మగుటవలన రూపాదికము అధిభూత మనబడును. వీటికన్నిటికి యతీతుడనైననన్ను పైవిధముగ తెలిసికొనినవానికి సులభుడనై నేనుందు నని యీయష్టమాధ్యాయమున జెప్పబడెను.

ఇట్లు దైవజ్ఞపండితవిరచిత శ్రీభగవద్గీతాఽష్టమాధ్యాయపరమార్థప్రపకు
"తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ" బులుసు అప్పన్నశాస్త్రి
విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

నీలకంఠీయము:— శ్రద్ధాభివృద్ధికై యోగమును స్తుతించుచుండెను— సమ్యగధీతములగు వేదములు, సమ్యగనుష్ఠితములగు యజ్ఞములు, సుతప్తములగుతపస్సులు వీటియందుకలిపి ఏఫలముశాస్త్రములయందు నిర్దిష్టమో, ఆఫల మంతయు నీపూర్వోక్తమగు ఉపాసనము దెలిసికొని యనుష్ఠించిన యోగి యతిక్రమించి (కార్యబ్రహ్మలోకమును పొంది) క్రమముగ నిర్విశేషబ్రహ్మమును పొందును. ఈయధ్యాయమున ధ్యేయరూపమైన తత్పదార్థము నిరూపింబడెను. ముందధ్యాయమునజ్ఞేయబ్రహ్మము నిరూపింపగలదు.

ఇట్లు శ్రీనీలకంఠాచార్య విరచిత శ్రీభగవద్గీతా ఽష్టమాధ్యాయ ప్రకాశకకు
బులుసు వెంకటశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

హరిః ఓం తత్స ద్బ్రహ్మార్పణ మస్తు.
అష్టమాధ్యాయము సమాప్తము.

శుభమస్తు.

# శ్రీభగవద్గీతా

# శాంకరభాష్యతత్త్వబోధిని

## నవమోఽధ్యాయః.

### రాజవిద్యా రాజగుహ్యయోగః.

శ్రీభగవానువాచ:—

గీ॥ ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥౧॥

పదవిభాగము:— ఇదం- తు- తే- గుహ్యతమం- ప్రవక్ష్యామి- అనసూయవే- జ్ఞానం- విజ్ఞానసహితం- యత్- జ్ఞాత్వా- మోక్ష్యసే- అశుభాత్ ॥ ॥౧॥

ప్రతిపదార్థము:— యత్=విజ్ఞానమును; జ్ఞాత్వా=పొంది; అశుభాత్=సంసారబంధనము నుండి; మోక్ష్యసే=విడువబడెదవో: గుహ్యతమం=అత్యంతరహస్యమైన; విజ్ఞానసహితం=అనుభవయుక్తమైన; ఇదం తు=ఈ; జ్ఞానం=సమ్యగ్జ్ఞానమును; అనసూయవే=అసూయారహితుడవైన: తే=నీకొరకు; ప్రవక్ష్యామి=ప్రకర్షగ చెప్పగలను । ॥౧॥

శాంకరభాష్యమ్:—

అష్టమే నాడీద్వారేణ ధారణాయోగ స్సగుణ ఉక్తః । తస్య చ ఫల మగ్న్యర్చి రాదిక్రమేణ కాలాన్తరే బ్రహ్మప్రాప్తిలక్షణ మేవానావృత్తిరూపం నిర్దిష్టమ్ । తత్రాఽనేనైవ ప్రకారేణ మోక్షప్రాప్తిఫల మధిగమ్యతే నాన్యథేతి తదాశంకావివృత్సయా— ఇదం బ్రహ్మ

శాంకరభాష్యతత్త్వబోధని:—

అష్టమాధ్యాయమునందు - సుషుమ్నానాడీద్వారమున సర్వద్వారసంయమనరూపగుణ విశిష్టమైన ధారణాయోగము చెప్పబడెను: అట్టిధారణాయోగమునకు అగ్న్యర్చిరాదిక్రమ

—• ౯వ అధ్యాయము ౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము;— ఎనిమిదవ యధ్యాయమునందు మూర్ధన్యనాడీ (సుషుమ్నా నాడీ) ద్వారమున హృదయ, కంఠ, భ్రూమధ్యాదిధారణతో గూడిన, సర్వేంద్రియద్వారసంయమ (నిరోధ) ముతో గూడిన, యోగముచే స్వేచ్ఛగ నుత్క్రాంతప్రాణముకలవాడు అర్చరాదిమార్గద్వారా బ్రహ్మలో

శాంకరభాష్యమ్:—

జ్ఞానం వక్ష్యమాణ ముక్తం చ పూర్వే ష్వధ్యాయేషు తద్బుద్ధౌ సన్నిధీకృ త్యేద మిత్యాహ। తుశబ్దో విశేషనిర్ధారణార్థః। ఇద మేవ సమ్యగ్జ్ఞానం సాక్షా న్మోక్షప్రాప్తిసాధనం "వాసుదేవ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ముచే కాలాంతరమునందు బ్రహ్మప్రాప్తిస్వరూపమైన యనావృత్తిరూపఫలము నిర్దిష్టమైనది. (చెప్పబడెను.) అందు యీవిధముగనే మోక్షప్రాప్తిఫలము పొందబడును. మరియొక విధమున పొందబడ దను యాశంకను తొలిగించుయిచ్ఛచే "ఇదం" అనుశ్లోకము జెప్పుచుండెను.

కమును పొందును. అట్లు బ్రహ్మలోకమును పొందిన వాని కాలోకమునందే సమ్యగ్జ్ఞానము జనించిన, దానిచే కల్పాంతమునందు పరబ్రహ్మప్రాప్తిరూపమగు: క్రమముక్తి సంభవించు నని వ్యాఖ్యానింపబడెను. అందు ముక్తిని పొందవలయు ననిన ముక్తికి యిదే మార్గమా? ఇంకొక మార్గము లేదా? అను సాశంకపై "అనన్యచేతా స్సతతం యో మాం భజతి నిత్యశః। తస్యాహం సులభః" అను నిత్యాదికముచే భగవత్తత్త్వవిజ్ఞానముచే సాక్షాత్తు మోక్షము ప్రాప్తించు నని చెప్పబడెను. అందునను అనన్యభక్తి మోక్షమున కసాధారణకారణ మని "పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా" అనుదానిచే జెప్పబడెను. అందు పూర్వమునందు చెప్పబడిన యోగధారణపూర్వకమగు ప్రాణోత్క్రమణము, తద్ద్వారమన అర్చిరాదిమార్గగమనము, కాలవిలంబము, మొదలగు క్లేశములు లేకుండగనే సాక్షాత్తు మోక్షప్రాప్తికొఱకు భగవత్తత్త్వమును, భగవద్భక్తిని విస్తారముగ తెలుపుటకై తొమ్మిదవదియగు నీయధ్యాయమును ప్రారంభించుచుండెను. అష్టమాధ్యాయమునందు ధ్యేయబ్రహ్మనిరూపణద్వారమున బ్రహ్మధ్యాననిష్ఠునకు గతిని చెప్పెను. తొమ్మిదవదియగు నీయధ్యాయమునందు జ్ఞేయబ్రహ్మనిరూపణద్వారమున జ్ఞాననిష్ఠునకు గతి చెప్పబడుచుండెను. అందు చెప్పబోవు జ్ఞానస్తునిమిత్తము "ఇదం తు తే" అను శ్లోకముమొదలు మూడుశ్లోకములను చెప్పుచుండెను.

"ఇదం" పూర్వమునందనేకవిధములుగ చెప్పబడినట్టియు, మున్ముందు చెప్పబోవునట్టియు, ప్రస్తుతము చెప్పబడుచున్నట్టియు, శబ్దప్రమాణకమైన బ్రహ్మతత్త్వవిషయకమైన జ్ఞానమును నీకొఱకు చెప్పగలను. ఈశ్లోకమునందు గల "తు" అనుశబ్దము పూర్వాధ్యాయోక్తధ్యానముకంటె జ్ఞానమునకు వైలక్షణ్యమును చెప్పును. అనగా సమ్యగ్జ్ఞానమే సాక్షాత్తు మోక్షప్రాప్తిసాధనము. ధ్యాన మజ్ఞాననివర్తకము కానందున సాక్షాత్తు మోక్షసాధనము కాదు. ధ్యాన మనునది యంతఃకరణశుద్ధిద్వారమున బ్రహ్మతత్త్వజ్ఞానమును సంపాదించి క్రమముగ మోక్షమును కలుగజేయు నని యిదివరకే చెప్పబడెను.

ఎట్టి జ్ఞానము గోపనీయతమము? అనిన విజ్ఞానసహితమైన బ్రహ్మానుభవపర్యంత మగు జ్ఞానము గోపనీయతమము. అట్టి జ్ఞాన మతిరహస్యమైనను శిష్యగుణాధిక్యమువలన ననసూయారహితుడ వగు నీకొఱకు నేను చెప్పెద. అసూయ యనగ గుణములయందు దోషదృష్టిని యావిష్కరించుటే ఫలముగా కలది. సర్వదా ఆత్మైశ్వర్యఖ్యాపనద్వారమున తనను నా యెదుట ప్రశంశించుకొను చో నదియే యసూయ యనబడును. ఈచెప్పుటచే యర్జునున కార్జవసంయమములు కలవని శిష్యగుణములు వ్యాఖ్యానింపబడెను.

శాంకరభాష్యమ్:—

స్సర్వమితి' 'ఆత్మైవేదం సర్వమ్' 'ఏకమేవాద్వితీయం' ఇత్యాదిశ్రుతిస్మృతిభ్యః। నాన్యత్। 'అథ యేన్యథాతో విదు రన్యరాజాన స్తే క్షయ్యలోకా భవన్తి' ఇత్యాదిశ్రుతిభ్యశ్చ। తే తుభ్యం గుహ్యా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చెప్పబోవునట్టియు, పూర్వాధ్యాయములయందు చెప్పినట్టియు, బ్రహ్మజ్ఞానము బుద్ధియందుసమీపించునట్లు చేసుకొని "ఇదం" అని చెప్పెను. గీతయందుండు "తు" అను శబ్దము విశేషనిర్ధారణార్థము. ఈసమ్యగ్జ్ఞానమే సాక్షాత్తు మోక్షప్రాప్తిసాధనము. అది యేదనిన "వాసుదేవ స్సర్వ మిదం" ఈసిఖిలప్రపంచము వాసుదేవస్వరూపము. "ఆత్మై

జ్ఞాన మెట్టిదనిన? ఏజ్ఞానమును పొంది సర్వదుఃఖములకు కారణమైన యశుభరూపమగు సంసార బంధనమునుండి తత్క్షణమే ముక్తుడ వగుదువో అట్టిది జ్ఞానము. ॥౧॥

శంకరానందీయము:— మందబుద్ధికలవానికి చిత్తశుద్ధినిమిత్తము యోగమార్గముచే బ్రహ్మ ప్రాప్తినిమిత్తము అధ్యాత్మాదిభేదరహితము, అక్షరశబ్దవాచ్యము నగు బ్రహ్మము నుపాస్యముగ నుప దేశించి, అట్టి యక్షరబ్రహ్మోపాసకుడగు యోగికి అర్చిరాదిమార్గద్వారమున గమనమును, బ్రహ్మ ప్రాప్తిని అష్టమాధ్యాయమునందు చెప్పి, యిపుడు ముముక్షువులకు యీమార్గముచేతనే మోక్ష ప్రాప్తియా? ఇంకొకవిధము లేదా? యను నాశంకను తొలగించుటకు శుద్ధబుద్ధులుకల యధికారుల కీలోకమునందే మోక్షము సిద్ధించుటకొరకు సాక్షాత్తు మోక్షకారణమగు పరబ్రహ్మవిషయకమైన జ్ఞానమును, విజ్ఞానమును, బ్రహ్మస్వరూపమును, పరబ్రహ్మమగు తనకు ప్రకృతికర్తృకము అగు సృష్ట్యా దులయందు సాక్షిత్వాసంగత్వోదాసీనత్వాదిధర్మములను, ఉపాసనాభేదములను, పరబ్రహ్మమునకు గల సార్వాత్మ్యమును, మరియు గొన్ని యితరవిషయములను ప్రతిపాదించుటకు నవమాధ్యాయమ నారంభించుచుండెను. అందు మొట్టమొదట ప్రశ్నింపకున్నను భక్తులయెడ దయావిష్టచిత్తముకల వాడగుటచే స్వయముగనే జ్ఞానమును, విజ్ఞానమును, తన్మాహాత్మ్యమును చెప్పుటకు శ్రీకృష్ణపరమాత్మ "ఇదం" అని చెప్పుచుండెను.

"పర స్తస్మా త్తు భావోఽన్యః, పురుష స్స పరః పార్థ!" అని యీవెనుకటి యష్టమాధ్యాయము నందు నిరూపింపబడిన నిర్విశేషబ్రహ్మము సన్నిహితమగుటవలన తద్విషయకముగ భక్తానుగ్రహేచ్ఛా వేగమున బుద్ధ్యారూఢ మగుటచే "ఇదం" అని ఇదముచే ప్రత్యక్షముగ జ్ఞానము నిర్దేశింపబడెను. బ్రహ్మ జ్ఞానము యమనియమాదిక్లేశరహితమగుటవలనను, సాక్షాత్తు మోక్షైకసాధనమగుటవలనను సగుణజ్ఞానముకంటె విశేషముకలదని ద్యోతనచేయుటకు "తు" అను శబ్దము ప్రయోగింపబడెను. సగుణజ్ఞానము జ్ఞాతృజ్ఞేయాది భేదమునే సంపాదించి, యనర్థముకొఱకే యగుచున్నది. పురుషార్థముకొఱకు సమర్థము కాదు. "యోఽన్య థాతో విదు రన్య రాజాన స్తే క్షయ్య లోకా భవన్తి" అని బ్రహ్మకు తమకు భేదమునే తెలిసికొనెడి యవి ద్వాంసులకు యీశ్వరాధీనత్వమును, జన్మాదిబంధమును శ్రుతి బోధించుచున్నది. ఈజ్ఞాన మనునది "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" అను శ్రుత్యనుసారము బ్రహ్మప్రాప్తికొఱకు సమర్థమగుచున్నది. కాన బంధకార ణమగు సగుణజ్ఞానముకంటె బ్రహ్మజ్ఞానము తాను జనించిన యుత్తరక్షణమునందే మోక్షహేతువగుటవలన యుత్కృష్టమైనది. "తు" అను శబ్దముచే ఈచెప్పబడిన యుత్కృష్టత్వమునే "విజ్ఞానసహితం" అనుదానిచే స్పష్టపరచుచుచుండెను. విజ్ఞానమనగ అపరోక్షానుభవము. "బ్రహ్మై వేదం సర్వం" "అహం బ్రహ్మాస్మి" ఇత్యాది శ్రుత్యుక్తరీతిచే సర్వజగత్తు, తాను బ్రహ్మమాత్రస్వరూపమేయని తెలిసికొనుటయే అపరోక్షానుభవము.

శాంకరభాష్యమ్:—

తమం గోప్యతమం ప్రవక్ష్యామి కథయిష్యా మ్యనసూయవేఽసూయారహితాయ । కిం తత్, జ్ఞానమ్, కిం విశిష్టం విజ్ఞానసహిత మనుభవయుక్తమ్ । యజ్జ్ఞానం జ్ఞాత్వా ప్రాప్య మోక్ష్యసేఽశుభా త్సంసారబన్ధనాత్ ॥ ॥౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వేదం సర్వం” ఈసర్వ మాత్మస్వరూపమే “ఏక మేవాద్వితీయం బ్రహ్మ” బ్రహ్మము సజాతీయవిజాతీయస్వగతభేదశూన్యము ఇత్యాది శ్రుతిస్మృతిప్రసిద్ధమైనది. “అథ యోఽన్యథాఽతో విదు రన్యరాజాన స్తే క్షయ్యలోకా భవన్తి” అథ శబ్దమున కవిద్యాప్రకరణో పక్రమ మర్థము అద్వైతముకంటె భిన్నముగ తత్త్వము నెవరు తెలిసికొనెదరో, ద్వైతము

సముద్రతీరమునందుండి పాతాళలోకమున సూర్యగ్రహణ మని తెలిసికొనునటుల మాత్రము కాదు. పైని చెప్పిన విజ్ఞానసహితమైన జ్ఞానము సాక్షాత్తు మోక్షకారణము. కనుకనే బ్రహ్మజ్ఞానము “గుహ్యతమం” కార్యసిద్ధి, అష్టైశ్వర్యసిద్ధి మొదలగు యోగచర్యలకు మంత్రతంత్రౌషధీరూపమగు యేరహస్యములు కలవో యట్టి గుహ్య (రహస్య) ములకంటె యీజ్ఞానమనునది పరమరహస్యము, కనుకనే దుర్గుణములు కలవానికి ఈజ్ఞానము నీయరాదు. పరిశుద్ధాంతఃకరణునికే చెప్పదగినదని సూచించుటకు “అనసూయవే” అని చెప్పబడెను. అసూయ యనగ పరగుణములయందు దోషములను ప్రకటించుటయే. ఇది కామ, క్రోధ, లోభ, మోహేర్ష్యాదుల కుపలక్షణము. అనగా అసూయ, కామము, క్రోధము, లోభము, మోహము, ఈర్ష్యాదులు మొదలగు దుర్గుణములు లేనట్టివాడు అనసూయువని చెప్పబడును. అట్టి, సద్గుణములు కల శిష్యుడవగు నీకొఱకు యీజ్ఞానమును లెస్సగ నుపదేశించెదను. ఇట్టి జ్ఞానమువలన నాకేమి ప్రయోజనము సంభవించును. అను శంకను “యజ్జ్ఞాత్వా” అనుదానిచే తొలగించుచుండెను. తీవ్రమోక్షేచ్ఛావైరాగ్య శమదమాద్యుత్తమసాధనసంపన్నుడవై నాచే చెప్పబోవునట్టియు చెప్పబడిన విశేషములతో గూడినదియు నగు బ్రహ్మాత్మైకత్వవిషయక మగు జ్ఞానమును పొంది, దీనిచే తెలియబడిన యాత్మస్వరూపము కలవాడవై, అనాద్యవిద్యాసంభావిత సంసారదుఃఖప్రవాహమునుండి ముక్తుడవు కాగలవు, ముక్తుడవై అఖండానందైకరస బ్రహ్మస్వరూపముతో సుఖముగ నుండగలవు. ॥౧॥

శ్రీధరీయము:— “రమేశః ప్రాప్యతే శుద్ధభక్త్యేతి స్థిత మష్టమే । నవమే తు తదైశ్వర్య మత్యాశ్చర్యం ప్రపంచ్యతే” ॥ ఇట్లు సప్తమాష్టమాధ్యాయములందు తన సంబంధమైన పారమేశ్వరతత్త్వము భక్తిచేతనే సులభమైనది కాని, మరియొకవిధమున లభ్యము కాదని చెప్పి, ఇపుడు అచింత్యమగు తన సంబంధమైన ఐశ్వర్యమును, భక్తియొక్క యసాధారణప్రభావమును విస్తారముగ జెప్పదలచినవాడై “ఇదం తు” అనునది మొదలుకొని శ్రీకృష్ణపరమాత్మ చెప్ప మొదలిడెను.

“విశేషేణ జ్ఞాయతే అనేనేతి విజ్ఞానం” దీనిచే విశేషముగ తెలియపడును గాన విజ్ఞాన మనబడును. అది యుపాసనము. అట్టి యుపాసనతో గూడిన యీశ్వరవిషయకమైన యీజ్ఞానమును మాటి మాటికి తన మాహాత్మ్యమునే యుపదేశించుచుండె నని పరమకారుణికుడనైన నాయందు దోషదృష్టి లేని నీకొఱకు చెప్పగలను. “తు” శబ్దము విశేషవాచకము. అట్టి జ్ఞానమును “గుహ్యతమం” ఇత్యాదికముచే చెప్పుచుండెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—
దుర్నిరూపమగుటచే కల్పితమగుటవలన తజ్జ్ఞానము రజ్జుసర్పాదిజ్ఞానతుల్యమగుటంబట్టి క్షేమ ప్రాప్తిహేతువు కానందున నట్టివారు నశించులోకములు కలవారే యగుచుండిరి. అను శ్రుతులవలన భేదజ్ఞానము మోక్షప్రాప్తికి సాధనము కాదు. అట్టి యద్వైతజ్ఞానము గోప్యతమము మరియు యనుభవయుక్తము. ఏజ్ఞానమును తెలిసికొని సంసారబంధనము నుండి విముక్తుడ నగుదువో అట్టిజ్ఞానము నసూయారహితుడవగు నీకొఱకు చెప్పగలను. ॥౧॥

ధర్మజ్ఞానము గుహ్య మనబడును. ఆత్మ దేహాదివ్యతిరిక్త మను జ్ఞానము గుహ్యతర మనబడును. అతిరహస్య మగుటవలన పరమాత్మజ్ఞానము గుహ్యతమ మనబడును. దేనిని తెలిసికొని తత్కాలమునందే అశుభమగు సంసారమునుండి విముక్తుడ వగుదువో దానిని చెప్పెదనని పూర్వముతో నన్వయము. ॥౧॥

భాష్యోత్కర్షదీపిక:— అష్టమాధ్యాయమునందు దేవయానమార్గముచే బ్రహ్మలోకమును పొందినవారు అపునరావృత్తిరూపమగు మోక్షమును పొందుదు రని చెప్పబడెను. మోక్షప్రాప్తికి సాధనము దేవయానమార్గమేనా? మరియొకటిలేదా? అను శంకను తొలిగించుచు, శ్రీకృష్ణపరమాత్మ "ఇదం" అని చెప్ప మొదలిడెను.

పూర్వోక్తాధ్యాయములందు చెప్పబడినదియు, ముందు చెప్పబోవునట్టియు నగు బ్రహ్మజ్ఞానమును బుద్ధియందు సన్నిహిత మొనరించుకొని "ఇదం" అని చెప్పబడెను. "తు" అను శబ్దము ధ్యానము కంటె జ్ఞానమునకు వైలక్షణ్యద్యోతకము. విజ్ఞానముతో గూడిన జ్ఞానము సాక్షాత్తు మోక్షసాధన మగుట వలన "ఇదం తు తే జ్ఞానం వక్ష్యామి" అని యోజన చేయవలెను. అజ్ఞానము ప్రత్యగభిన్నపరమాత్మ జ్ఞానము. "వాసుదేవ స్సర్వం, ఆత్మైవేదం సర్వం, అహం బ్రహ్మాస్మి, సర్వం ఖల్విదం బ్రహ్మ, ఏకమేవాద్వితీయం, నేహ నానాస్తి కించన, మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" ఇత్యాదిశ్రుతిస్మృత్యుక్తము. అట్టి జ్ఞానము అనుభవముతోగూడినది, గుహ్యతమము.

ఇచట నిష్కృష్టార్థ మిది-ధర్మజ్ఞానము గుహ్యము, ఉపాస్యజ్ఞానము గుహ్యతరము, అఖండార్థ జ్ఞానము గుహ్యతమము. అనగా అతిగోప్య మని యర్థము.

గుహ్యతమమైన దెందులకు చెప్పెద వను శంకను తొలిగించుటకై "అనసూయవే" అని చెప్పబడెను. గుణములయందు దోషావిష్కరణ మసూయ యనబడును. "సాక్షాత్తు మోక్షసాధన మగు పరమాత్మజ్ఞానము ఆయాలోకములయందలి విషయభోగములకు విరోధి" యని పరమపురుషార్థసాధన మగు తత్త్వజ్ఞానమునందు కలుగు దోషదృష్టి యసూయ యని తాత్పర్యము. నీవు అట్టి యసూయ లేనివాడవు కాన గుహ్యతమమైనను జ్ఞానమును నీకొరకు చెప్పెదను. కాన పూర్వోక్తాశంక కవకాశము లేదు. లేక, సర్వదా యీశ్రీకృష్ణుడు నాయెదుట తనయైశ్వర్యముయొక్క ఖ్యాపనచే దనను ప్రశంసించుకొను చున్నాడు. అని యనుకొనుట యసూయ యనబడును. అట్టి యసూయ లేనివాడవు కాన నీకొఱకు విజ్ఞానసహితమగు జ్ఞానము నుపదేశించెదను. అనిరైన యాశయము. చెప్పబడిన విశేషణములతోగూడిన జ్ఞానమును తెలిసికొనిన (పొందిన) సంసారబంధనమునుండి ముక్తుడ వగుదు వని యర్థము ॥౧॥

పరమార్థప్రప:— పూర్వాధ్యాయమునందు "భూతగ్రామ స్స ఏవాయం" ఇత్యాదివాక్యము లచే దృశ్యప్రపంచజాతమునకు నశ్వరత్వగర్భితమగు మిథ్యాత్వమును చెప్పి. యిపు డాయుపపత్తిచేతనే, దృఢ పరచుటకు, అట్లే యోగవైభవమువలన తనకు సత్యత్వమును చూపుటకు నవమాధ్యాయమును జెప్పుట మొద లిడెను. అందు మొట్టమొదట చెప్పబోవు విషయ మతిరహస్య మగుటచే దుర్లభత్వమును "ఇదం తు" అను శ్లోకము మొదలుకొని మూడు శ్లోకములచే జెప్పుచుండెను. ॥౧॥

గీ॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ ॥ ॥౨॥

పదవిభాగము:— రాజవిద్యా- రాజగుహ్యం- పవిత్రం-ఇదం- ఉత్తమం- ప్రత్యక్షావగమం- ధర్మ్యం-సుసుఖం- కర్తుం- అవ్యయం ॥ ॥౨॥

ప్రతిపదార్థము:— ఇదం=ఈబ్రహ్మజ్ఞానము; రాజవిద్యా=విద్యల కెల్ల రాజు; రాజగుహ్యం=రహస్యముల కెల్ల రాజు; పావనం=శుద్ధి కారణము; ఉత్తమం=ఉత్కృష్టమైనది; ప్రత్యక్షావగమం=ప్రత్యక్షమే ప్రమాణముగా కలది, లేక దృష్టఫలకము; ధర్మ్యం=ధర్మమునుండితొలగనిది; (ధర్మసంబద్ధము) కర్తుం=చేయుటకు; (సంపాదించుటకు) సుసుఖం=అతిసుఖకరమైనది; అవ్యయం=నాశరహితము. ॥౨॥

---

నీలకంఠీయము:— పూర్వాధ్యాయమున "కిం త ద్బ్రహ్మ" యనునది మొదలుకొని యేడు ప్రశ్నములు "అక్షరం పరమం బ్రహ్మ" అను మొదలగు గ్రంథముచే సంక్షేపముగ వ్యాఖ్యాతమైనవి. అసప్తప్రశ్న సమాధానజనిత జ్ఞానమునకు వేర్వేరు ప్రయోజనము లేవి? యను శంక జనింప, కర్మవేత్తకు అధిభౌతికము, ధూమాదిమార్గప్రాప్యము నగు స్థానము ప్రాప్తించునని నిరూపించుటచే ప్రాప్యప్రాపకాదివిభాగము జూపబడెను. దానిచే గర్మ, అధిభూతము నను నీరెండును వ్యాఖ్యాతములైనవి. అట్లే మహోపాసకునకు, నంతర్యామ్యుపాసకునకు నర్చిరాదిమార్గద్వారమున క్రమముక్తి లభించు నని చెప్పబడెను. దానిచే నధిదైవాధియజ్ఞములు నిరూపింపబడెను. "అంతకాలే కథం జ్ఞేయోసి" అను ప్రశ్నమునకు "ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ" అనుదానిచే సమాధానము జెప్పెను. ఈవిధముగ ధ్యేయబ్రహ్మవిద్య సాంగముగ నిరూపింపబడెను. ఇక జ్ఞేయబ్రహ్మవిషయకము, ప్రథమమున జేయబడినదియునగు "కిం త ద్బ్రహ్మ కి మధ్యాత్మం" అను ప్రశ్నద్వయము మిగిలియున్నది. ఈప్రశ్నద్వయవివరమునకై యీనవమాధ్యాయము నారంభించుచుండెను. కేవల మర్చిరాదిమార్గప్రాప్య మగు కాలాంతరభావి యగు ముక్తియే కాదు. ఇక నేమనః- ఇక్కడనే సద్యఃకాలముననే కలుగుముక్తికూడ నున్నదని విశేషము జెప్పుటకై శ్రీకృష్ణభగవానులు జెప్పుచుండెను- "ఇదం" ధ్యేయబ్రహ్మవిలక్షణమైన జ్ఞేయబ్రహ్మరూపము, నతిరహస్యమునగు జ్ఞప్తిమాత్రస్వరూపమును అనుభవసహితముగా నసూయారహితుడవైననీకై జెప్పెదను. ఏజ్ఞానము దెలిసికొనిన నీవు సంసారమునుండి ముక్తుడవగుదువో యట్టి జ్ఞానమును నీకుపదేశించెదను. సప్తమాధ్యాయాదియందు "జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః" అని యేది ప్రతిజ్ఞాతమో, దేనిని తెలిసికొనుటకై శాఖాచంద్రమసన్యాయమున నుపలక్షణీభూతమైన జగత్కారణమగు బ్రహ్మ మచటనే నిరూపింపబడెనో, దేనిని దెలిసికొనుటయం దధికారసంపాదనార్థమై సగుణోపాసనము జెప్పబడెనో అట్టి సర్వశేషీభూతమైన బ్రహ్మ మిట జెప్పదగియున్నదిగాన తదనుసారమే యిట ప్రతిజ్ఞ చేయబడెను. .౧॥

—• ౯వ అధ్యాయము ౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— తిరిగి యర్జునుని యభిముఖముగ జేసుకొనుట కాజ్ఞానమునే "రాజవిద్యా" అను దానిచే స్తుతి జేయుచుండెను.

విద్యాంతర మవిద్యైకదేశనాశకముగాన నీబ్రహ్మవిద్య సర్వావిద్యానాశక మగుటవలనను, విద్యల కెల్ల రాజనబడును. అనేకజన్మార్జితసుకృతపరిపాకసాధ్య మగుటవలనను, అనేకుల కజ్ఞాత మగుటవలనను యీజ్ఞానము గుప్తముల (రహస్యముల) కెల్ల రాజనబడును. "పవిత్ర మిద ముత్తమం" ప్రాయశ్చిత్తములచే నేదో

శాంకరభాష్యమ్:—

తచ్చ — రాజవిద్యా విద్యానాం రాజా దీప్త్యతిశయత్వాత్ । దీప్యతే హ్యయ మతిశయేన బ్రహ్మవిద్యా సర్వవిద్యానామ్ । తథా రాజగుహ్యం గుహ్యానాం రాజా । పవిత్రం పావన మిద ముత్తమం సర్వేషాం పావనానాం శుద్ధికారణ మిదం బ్రహ్మజ్ఞాన ముత్కృష్టతమమ్ । అనేకజన్మసహస్రసంచిత మపి ధర్మాధర్మాది సమూలం కర్మ క్షణమాత్రా ద్భస్మీ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈబ్రహ్మజ్ఞానము దీప్త్యతిశయమువలన విద్యల కెల్ల రాజు. సర్వవిద్యలలో నెల్ల యీబ్రహ్మవిద్య యతిశయముచే బ్రకాశించునది. రహస్యముల కెల్లరాజు. పవిత్రింపజేయువాటికి శుద్ధికారణ మీబ్రహ్మజ్ఞానము. కనుక నే యుత్కృష్టతమము. అనేకజన్మసహస్రసంచితమైన ధర్మాధర్మాత్మకమగు కర్మను సమూలముగ క్షణమాత్రమున భస్మముగ జేయును. కానసట్టి బ్రహ్మజ్ఞానముయొక్క పావనత్వమేమి చెప్పవలయును? మరియు సుఖాదులువలె ప్రత్య

యొకానొక పాపమే నివర్తించి స్వకారణమునందు సూక్ష్మరూపముతో నుండును. అట్లుండిన పాపమునే పురుషు డప్పుడప్పుడు వృద్ధిపరచుచుండుటవలన సూక్ష్మసంస్కారరూపముచే స్థితి పాపమున కంగీకరింపవలెను. ఈజ్ఞానము అనేకజన్మసహస్రసంచితమైన స్థూలసూక్ష్మావస్థితమైన సర్వపాపములకు, వాటికి కారణమైన యజ్ఞానమునకుగూడ తత్కాలముననే నాశకమగును. కాన యాత్మజ్ఞానము సర్వోత్తమము, పవిత్రము నగుచున్నది. అతీంద్రియమగు ధర్మమునందువలె, యీజ్ఞానము స్వరూపమునను, ఫలమువలనను, ప్రత్యక్షమగుటవలన దీని విషయమై యెవడును సందేహింపడు. అని "ప్రత్యక్షావగమం" అను పదముచే జెప్పుచుండెను. "అవగమ్యతేఽనేనేత్యవగమః, మానం" దేనిచే దెలియబడునో యది అవగమ మనబడును. ప్రమాణమని యర్థము. "అవగమ్యతే ప్రాప్యత ఇతి అవగమః" పొందబడునట్టి ఫల మవగమ మనబడును. దీనియందు ప్రత్యక్షము ప్రమాణము. అని స్వరూపముచే సాక్షిప్రత్యక్షత్వము దీనికి ఫలము. ప్రత్యక్షరూపమగు అవగమము నాచే నిది తెలియబడెను. దీనివలన నాయజ్ఞానము నష్టము. అను సార్వలౌకికమైన సౌఖ్యానుభవమును ఫలమునుబట్టికలుగును. ఇట్లు ఆత్మజ్ఞానము లోకానుభవసిద్ధమైనను "ధర్మ్యం" అనేకజన్మసంచితనిష్కామధర్మఫలము. అట్లగుచో దుస్సంపాదమనెదవా? కాదు. "సుసుఖం కర్తుం" గురూపదర్శితవిచారసహకృతమైన వేదాంతవాక్యముచే సుఖముగ నొందుటకు శక్యమైనది. బ్రహ్మజ్ఞానము ప్రమాణవస్తుపరతంత్రమగుటవలన దేశకాలాదివ్యవధానము నపేక్షింపదు. ఆయాససాధ్యమగు కర్మలకే మహాఫలమును కల్పించుటవలన నీయాత్మజ్ఞాన మనాయాససాధ్యమగుచో నల్పఫలజనకమే యగునా? యని యనెదవా? అట్లును కాదు. "అవ్యయం" ఈయాత్మజ్ఞాన మనాయాససాధ్యమైనను, దీనికి ఫలము బట్టి నాశములేదు. అనగా అక్షయమైన ఫలము కలది. ఎంత గొప్ప కర్మలైనను నశించు ఫలము కలవే. ఈవిషయమునే "యోవా ఏత దక్షరం గార్గ్యవిదిత్వాఽస్మిన్ లోకే జుహోతి యజతే తప స్తప్యతే బహూని వర్షసహస్రా ణ్యన్తవ దేవాస్య తద్భవతి" అను శ్రుతియు (ఓ-గార్గి! ఈనాశరహితమైన యాత్మను తెలిసికొనక యెవడు యీలోకమునందు హోమము చేయునో, యాగము చేయునో, అనేకవర్షసహస్రములు తపస్సు నాచరించునో వానికవన్నియు అన్తవత్తులే యగుచున్న) వని బోధించుచున్నది. కాన సర్వోత్కృష్టమగుటవలన ఆత్మజ్ఞానము శ్రద్ధేయము.  ॥౨॥

శాంకరభాష్యమ్:—

కరోతి యతోఽతః కిం తస్య పావనత్వం వక్తవ్యమ్ । కిం చ ప్రత్యక్షావగమం ప్రత్యక్షేణ సుఖాదేరివావగమో యస్య తత్ప్రత్యక్షావగమమ్ । అనేకగుణవతోఽపి ధర్మవిరుద్ధత్వం దృష్టం న తథాఽఽత్మజ్ఞానం ధర్మవిరోధి కిం తు ధర్మ్యం ధర్మాదనపేతమ్ । ఏవమపి స్యాద్దుష్పం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

క్షముచే నవగమము కలది. అనగా ప్రత్యక్షమే ప్రమాణముగ కలది. లేక దృష్టఫలము కలది. అనేకగుణములు కలదిగూడ ధర్మవిరుద్ధమగును. కాని యీబ్రహ్మజ్ఞానము ధర్మవిరోధి కాదు. మరేమనిన? ధర్మమునుండియనపేతము. అట్లైనను దుఃఖసంపాద్యమని శంకింపజనదు. ఎట్లు

శంకరానందీయము;— చెప్పబడిన జ్ఞానమును గ్రహింపజేయు నిచ్ఛచే జ్ఞానముయొక్క మాహాత్మ్యమును "రాజవిద్యా" అను దానిచే జెప్పుచుండెను.

"రాజవిద్యా" విద్యలనగ జ్ఞానములు. అవి సకలవేదశాస్త్రాధ్యయనము వలన జనించి, ఇహలోక, పరలోకసాధనము లగును. ఆవిద్యలన్నియు పురుషునకు సంసారవర్ధకములే యగుచున్నవి. సంసారనివర్తకములు కావు. బ్రహ్మవిద్య యన్ననో తాను జనించినంతమాత్రముచేతనే విద్వాంసుని బ్రహ్మత్వమును పొందించి కారణముతోగూడ సంసారమును– ప్రబోధము స్వాప్నికసంసారమును, స్వాప్నికదుఃఖమును నివర్తింపజేయునటుల– నివర్తింపజేయును. అందువలన బ్రహ్మవిద్య యన్నివిద్యలకు రాజనబడును.

లేక, శాస్త్రజన్యమగు నిఖిలవిద్యలు లెస్సగ నహంకారమును వృద్ధిపొందించి ఆత్మతత్త్వమును తిరోహిత మొనరించును. ఈబ్రహ్మవిద్యయన్ననో 'స ఆత్మా తత్త్వమసి" అను వాక్యశ్రవణమాత్రముచే జనించి యనాత్మయందహంకారమును నశింపజేసి సర్వసంసారధర్మనిర్ముక్తమైన యాత్మతత్త్వమును ప్రకాశింపజేయును. కాన రాజవిద్య యనబడును. "రాజగుహ్యం చ" సంవరణీయము (గోప్యము) లగు మంత్రతంత్రదివ్యౌషధులు, బహుమూల్యములగు రత్నాదులు, అట్టి వాటికి "రాజా" అతిరహస్యమగుటచే గోపనీయమగుటవలన రాజగుహ్య మనబడును. లేక, రాజువలె సంవరణీయ మగుటవలన బ్రహ్మవిద్య రాజగుహ్యమనబడును. మరియు "పవిత్రం, పునాతీతి పవిత్రం" పవిత్రము చేయునదిగాన పవిత్ర మనబడును. అందును యీబ్రహ్మజ్ఞానము "అనుత్తమం పవిత్రం" సూర్యానలానిలాదిదేవతలను, ఋగ్యజుస్సామాథర్వణవేదములను, గంగాదిసరిత్తులను, నిఖిలప్రాయశ్చిత్తములను సేవించువారలకు అవన్నియు నరకదుఃఖకారణమగు తాత్కాలిక పాపమునే నశింప జేయును. కాని పుణ్యమును మాత్రము నశింపజేయజాలవు. ఈబ్రహ్మవిద్య యన్ననో "తదావిద్వాన్పుణ్యపాపే విధూయ" అను శ్రుత్యుక్తప్రకారము బహుజన్మమరణతద్దుఃఖప్రవాహకారణములైన శతకోటిబ్రహ్మకల్పార్జితమైన పాపరాశిని, పుణ్యరాశిని మహాపర్వతము నగ్నివలె, గాఢాంధకారమును సూర్యుడువలె సమూలముగ నిర్మూలించి బ్రహ్మవేత్తను కర్మరహితునిగ జేయును. కాన బ్రహ్మజ్ఞానమే బ్రహ్మవిష్ణుశివాదులకు, సూర్యాదులకు పావకమగుటవలన నుత్కృష్టతమమగు శుద్ధికరమైన వస్తువు.

జ్ఞానమునకీమాహాత్మ్యము శాస్త్రముచేతనే తెలిసికొనదగినదా? ప్రమాణాంతరగమ్యమా? కాలాంతరగమ్యమా? ఎట్లు సూర్యునకు కార్యముతోగూడ గాఢాంధకార విధ్వంసకత్వము కేవల శాస్త్రైకగమ్యమే కాక ప్రత్యక్షావగమ్యముగూడ నగునో యట్లే జ్ఞానమాహాత్మ్యము ప్రత్యక్షావగమ మగుచున్నదని "ప్రత్యక్షావగమం" అనుపదముచే జెప్పుచుండెను. "అవగమ్యతేఽనేనేత్యవగమః ప్రమాణం" దేనిచే తెలియబ

శాంకరభాష్యమ్:—

పాద్య మిత్యత ఆహ-సుసుఖం కర్తుం యథా రత్నవివేకవిజ్ఞానమ్ । తతాఽల్పాయాసానాం కర్మణాం సుఖసంపాద్యానా మల్పఫలత్వం దుష్కరాణాం చ మహాఫలత్వం దృష్ట మితీదం తు సుఖసంపాద్యత్వా త్ఫలక్షయా ద్వ్యేతీతి ప్రాప్త మత ఆహావ్యయం నాస్య ఫలతః కర్మవ ద్వ్యయోఽస్తీ త్యవ్యయ మతః శ్రద్ధేయ మాత్మజ్ఞానమ్ ॥ ॥౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

రత్నవివేకవిజ్ఞానము సుకరమో యట్లే బ్రహ్మజ్ఞానము సుఖముగ సంపాదించుటకు శక్యమైనది. అల్పాయాసముతో సుఖసంపాద్యములగు కర్మల కల్పఫలము, దుష్కరమగు కర్మలకు మహాఫలము లోకసిద్ధము. అట్లే యీబ్రహ్మజ్ఞానము సుఖసంపాద్యమగుటవలనను ఫలక్షయమువలనను నశించు ఫలము కలదని శంక ప్రాప్తింప "అవ్యయం" అని చెప్పబడెను. కర్మవలె యీబ్రహ్మజ్ఞానమునకు ఫలమునుబట్టి నాశము లేదు. (నశించు ఫలముకలది కాదు). కాన నమ్మదగినది. ॥౨॥

డునో యది అవగమ మనబడును. అది ప్రమాణము. "ప్రత్యక్షం అవగమః యస్య తత్ ప్రత్యక్షావగమం" అను విగ్రహముచే ప్రత్యక్షము ప్రమాణముగా కలది జ్ఞానమాహాత్మ్యము. అది విద్వత్ప్రత్యక్షము. లేక, "అవగమ్యతేఽ సుభూయత ఇ త్యవగమః ఫలం ప్రత్యక్షోఽవగమః యస్య తత్ 'ప్రత్యక్షావగమం' భోజనాది సుఖమువలె తత్కాలమునందే జ్ఞానఫలము ప్రత్యక్షము. ధర్మాదిఫలమువలె పరోక్షము కాదు. మరియు "ధర్మ్యం" ముముక్షువునకు ధర్మమువలె తగినది కాన ధర్మ్యమనబడును. బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సంన్యాసాశ్రములకెల్ల స్వధర్మానుకూలమైనది జ్ఞానము. (ధర్మవిరుద్ధము కానిది.) అని యర్థము. విచారింప గృహస్థునకు చయనసర్వతోముఖాది క్రతువులు ధర్మములు. అయినను అట్టి క్రతువులు శ్రమసాధ్యములు. జ్ఞానమన్ననో శ్రమసాధ్యము కాదని "సుసుఖం" అను పదముచే బోధించుచుండెను. అత్యంతము దేహేంద్రియాదిశ్రమము లేకుండగనే తత్త్వజ్ఞాని యనుగ్రహమువలన రత్నాదిజ్ఞానమువలె బ్రహ్మజ్ఞానముగూడ బుద్ధి నధిష్ఠించునదిగ చేయుట సుఖము. అనగా శుద్ధాత్ముల కనాయాసముగ సంపాదించుటకు శక్యమైనది.

కటికండూయనమువలె జ్ఞాన మల్పక్రియాసాధ్యమగుచో ఫలముగూడ స్వల్పమే కావలసివచ్చును. క్రియాభూయస్త్వముండిన ఫలము గొప్పది ప్రాప్తించును. క్రియ స్వల్పమగుచో ఫలముగూడ స్వల్పమే ప్రాప్తించును. ఈ విషయము సర్వప్రసిద్ధమే కదా! యని శంకింపజనదు. చంద్రదర్శనక్రియ స్వల్పమైననుచంద్రుని జూచువానికి కలుగు యాహ్లాదసుఖమునకు మహత్త్వము కన్నట్టునటుల, బ్రహ్మజ్ఞాన మల్పక్రియాసాధ్యమైనను ఫలము గొప్పదని "అవ్యయం" అను పదముచే బోధించుచుండెను. ఫలమునుబట్టి నాశములేనిది కాన యవ్యయ మనబడును. బ్రహ్మజ్ఞానము నాశములేని ఫలముకలది. ఈవిషయమునే "న హ్యధ్రువైః ప్రాప్యతే హి ధ్రువం తత్" అను శ్రుతి బోధించుచున్నది. అనగా జ్ఞానమశ్రమసాధ్యమైనను నిత్యమోక్షఫలజనక మని యర్థము. జ్ఞానమువలన మోక్షము జనించుటయందు బాధక ప్రమాణము లేనందున నవ్యయమని చెప్పబడెను. ॥౨॥

భాష్యతత్కర్షదీపిక:— "రాజవిద్యా" అను శ్లోకముచే బ్రహ్మజ్ఞానమును స్తుతించుచుండెను.

బ్రహ్మవిద్యకలవాని నతిశయముగ పూజించుట వలనను, బ్రహ్మవిద్య యతిశయముగ దేదీప్యమానమగుటవలనను బ్రహ్మవిద్య విద్యలకెల్ల రాజు. "తస్మా దాత్మజ్ఞ మర్చయే ద్భూతికామః" అను శ్రుతి-భూతికాము డాత్మజ్ఞానిని పూజింపవలయుననిబోధించుచున్నది. మరియు "నిరపేక్షం మునిం శాన్తం నిర్వైరం సమదర్శనమ్ । అనువ్రజా మ్యహం నిత్యం పూయేయే త్యంఘ్రిరేణుభిః" దేనియందును కోరికలేనట్టియు, శాన్తుడైనట్టియు, మననశీలుడైనట్టియు, నిర్వైరుడైనట్టి బ్రహ్మజ్ఞానిని- యితని పాదరేణువులచే నేను బవిత్రుడను కాగలనని నిత్యము అనుసంధించి వెళ్లెదనని శ్రీకృష్ణభగవానుడు చెప్పెను.

గోప్యములగు నన్నిటిలో నుత్కర్షకల దగుటవలన నట్టివాటికి రాజు. ఈబ్రహ్మజ్ఞానము పవిత్రకరములన్నిటికి పవిత్రకర మగుటవలన నుత్తమపవిత్రము. ప్రాయశ్చిత్తాదికము యత్కించిత్పాపమునే నశింపజేయును. ఈబ్రహ్మజ్ఞాన మన్ననో ధర్మాధర్మరూపమగునట్టి యనేక జన్మార్జితసంచితము నంతను సమూలముగ నశింపజేయును. ఆగామికర్మసంబంధము లేకుండగ జేయును. ఈవిషయమునే వ్యాసభగవానులు "ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్" "ఇతరస్యాప్యేవ మసంశ్లేషః పాతే తు" అను సూత్రద్వయముచే జెప్పెను. ఈబ్రహ్మజ్ఞానముయొక్క లేశముతోనైన సమానమగు పవిత్రవస్తువును నిరూపింపనందున దీనియొక్క పరమపావనత్వ మిట్టిదని యేమి చెప్పవలెను? సర్వోత్కృష్టత్వపావనత్వములు కలవని యాశయము.

ఈబ్రహ్మజ్ఞానము శాస్త్రైకవేద్యమగు ధర్మము వలె పరోక్షమే కాదు. మరేమనిన? "ప్రత్యక్షావగమం" "ప్రత్యక్షేణ సుఖాదేరివ అవగమో యస్య" సుఖాదులయొక్కవలె దేనియొక్క యవగమము ప్రత్యక్షప్రమాణజన్యమో యని భాష్యమునందు చెప్పబడెను. "ప్రత్యక్షోఽవగమో మాన మస్మిన్" దీనివిషయమై ప్రత్యక్షము ప్రమాణమని కాని, లేక "అవగమ్యత ఇత్యవగమః ఫలం ప్రత్యక్షోఽవగమోఽస్యేతి" దీనికి ప్రత్యక్షము ఫలము. అనగా జ్ఞానమునకు దృష్టఫలత్వము కలదని కొందఱు వర్ణించిరి. ప్రథమపక్షమునందు "అవగమ్యతేఽనేనేత్యవగమఃమానం" అను విగ్రహమునందు ప్రత్యక్షము దీనియందు ప్రమాణమని యర్థము పర్యవసితము. అనగా స్వరూపమునుబట్టి సాక్షిప్రత్యక్షత్వము చెప్పబడెను. ద్వితీయపక్షమున- ఫలమునుబట్టి సాక్షిప్రత్యక్షత్వము చెప్పబడెను. అది యెట్లనిన: నాచే యిది తెలియబడెను కాన దీనివిషయమై నాయజ్ఞానము నష్టమను సాక్ష్యనుభవము సార్వజనీనమని యర్థము. ప్రత్యక్షమనగ ప్రత్యక్షాత్మవస్తువు. అదియే దీనిచే యాథాత్మ్యముగ తెలియబడును. కాన జ్ఞానము ప్రత్యక్షావగమ మని కొందఱు నుడివెదరు. ఈమూడు పక్షములు భాష్యమున కుపలక్షణమని గ్రహింపనగును.

మాంసభక్షణాదిక మనేకగుణములు కలదైనను ధర్మవిరుద్ధముగాన గ్రాహ్యము కానటుల ఆత్మజ్ఞానమనేకగుణములు కలదైనను ధర్మవిరుద్ధ మగుటచే త్యాజ్యమే యని శంకింపజనదు. ఈఆత్మజ్ఞానము 'ధర్మ్యం' అనేకజన్మార్జిత సుకృతసాధ్యమగుటవలన ధర్మ్యము. అనగా ధర్మానపేతము. ధర్మబద్ధమేయని యర్థము. కాన మాంసభక్షణముధర్మవిరుద్ధ మగుటచే త్యాజ్యమైనటుల యాత్మజ్ఞానము త్యాజ్యము కాదని యభిప్రాయము. ఆత్మజ్ఞానమిట్టిదైనను దుస్సంపాద్యమే యను శంకను "సుసుఖం కర్తుం" అను పదములచే తొలిగించుచుండెను. గురూపదిష్టమగు వేదాంతవాక్యములచే యజ్ఞానము తొలగ, సుఖముగనే సంపాదించుటకు శక్యమైనది. ఆత్మజ్ఞాన సంపాదనవిషయమై దేశకాలబుద్ధ్యాద్యపేక్ష లేదు. కాన సుసంపాద్యమే యని భావము. లోకమున నేది యధికఫలకమో యది బహ్వాయాససాధ్యకర్మసాధ్యము. ఏది యల్పఫలమో యది యల్పాయాస

గీ॥ అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ॥ ॥3॥

పదవిభాగము:— అశ్రద్దధానాః- పురుషాః- ధర్మస్య- అస్య- పరంతప- అప్రాప్య- మాం-నివర్తన్తే- మృత్యుసంసారవర్త్మని. ॥ ॥3॥

ప్రతిపదార్థము:— హేపరంతప=ఓశత్రువులనుతపింపజేయుయర్జునా!; అస్య=ఈ; ధర్మస్య=ఆత్మజ్ఞానముయొక్క; స్వరూపే=స్వరూపమునందు; (ఈపదమధ్యాహార్యము) తత్ఫలేచ=తత్ఫలమునందు; (ఈపదమధ్యాహార్యము) అశ్రద్దధానాః=శ్రద్ధారహితులు; మాం=నన్ను; అప్రాప్య=పొందక; మృత్యుసంసారవర్త్మని=మృత్యుయుక్తమైన సంసారముయొక్క మార్గమునందు; (నరకతిర్యగాదిప్రాప్తిమార్గమునందు) ఆవర్తన్తే=నిశ్చయముగ ప్రవేశించుచుండిరి. ॥3॥

సాధ్యకర్మఫలముగ లోకమునందు ప్రత్యక్షసిద్ధమే. అట్లే యాత్మజ్ఞాన మల్పాయాససాధ్యమగుచో ఫలము గూడ నల్పమే యగుననెదవా? అల్పాయాససాధ్యమగు రత్నవివేకజ్ఞానమునకు మహాఫలము దృష్టము. అట్లే జ్ఞాన మల్పాయాస సాధ్యమైనను దీనివలన మహాఫలము ప్రాప్తించునని "అవ్యయం" అను పదముచే స్పష్ట పరచుచుండెను. లోకమునకువలె యీజ్ఞానమునకు ఫలమునుబట్టి నాశము లేదు కాన నవ్యయమనబడును. కాన శ్రద్ధతో జ్ఞానము సంపాదనీయమని యర్థము. ॥౨॥

నీలకంఠీయము:— ఈశ్లోకమున జ్ఞానమునే స్తుతించుచుండెను. విద్యలకెల్ల రాజు గాన "రాజవిద్య" యనబడును. గోప్యములకెల్ల రాజు గాన 'రాజగుహ్య' మనబడును. మరియు నిది 'పవిత్రం' ఉత్తర, పూర్వాఘముల నాశ, అశ్లేషములకు హేతువగుటవలన పవిత్రమైనది. "ఉత్తమం" ప్రాయశ్చిత్తాదుల యపేక్ష లేనిదిగాన శ్రేష్ఠమైనది. "ప్రత్యక్షావగమం" ప్రత్యగాత్మ నిత్యాపరోక్ష మగుటచే ప్రత్యక్షమనబడును. అయ్యది యాథాత్మ్యముతోనీజ్ఞానముచే తెలియబడును గాన నీజ్ఞానము ప్రత్యక్షావగమ మనబడును. లేక, సుఖాదులువలె ప్రత్యక్షముగా తెలియబడునదని యర్థము. ఈపక్షమున "విజ్ఞానసహితం" అను విశేషణము శ్లోకాంతరస్థ మగుటచే పౌనరుక్త్యదోషము లేదని తెలియనగును. అట్లగుచో నీజ్ఞానము అపూర్వము కాదు కాన నిష్ఫలము కాదా? యని శంకింపదగదు. "ధర్మ్యం" ధర్మానపేతమైనది. క్షణకాలమైనను బ్రహ్మాకారవృత్తి యున్నచో గలుగు ఫలమును "క్షణ మేకం క్రతుశతస్య చతుస్సప్తత్యా యత్ఫలం త దవాప్నోతి" అను శ్రుతి (బ్రహ్మాకారవృత్తి యొక క్షణ మున్నచో డెబ్బదినాలుగువందల క్రతువుల నాచరించిన ఫలము కలుగును.) అని చెప్పుచున్నది. అట్లగుచో నీజ్ఞానము దుస్సాధ్యమనెదవా? అట్లును గాదు. "సుసుఖంకర్తుం" సంపాదించుటకు (అవిష్కరించుటకు) అనాయాససాధ్యము. అట్లని శీఘ్రవినాశఫలకమును గాదు. "అవ్యయం" ఈజ్ఞానము వస్తుమాత్రవిషయకముగాన ననంతఫలకము. కనుకనే కర్మఫలమువలె నశించునది కాదు. ॥౨॥

## —• ౯వ అధ్యాయము ౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నీవు చెప్పిన విధమున బ్రహ్మజ్ఞానము సుకరమై సర్వోత్కృష్టమగుచో నందరు దీనియందు యేందులకు ప్రవర్తింపకుండిరి? అందరును దీనియందే ప్రవర్తించినచో సంసారి యెవడును లేకుండునుకదా! యని యాశంకించుకొని, శ్రీకృష్ణపరమాత్మ "అశ్రద్దధానాః" అని చెప్ప మొదలిడెను.

శాంకరభాష్యమ్:—

యే పునః — అశ్రద్దధానాః శ్రద్ధావిరహితా ఆత్మజ్ఞానస్య ధర్మస్యాస్య స్వరూపే తత్ఫలే చ నాస్తికాః పాపకారిణోఽసురాణాముపనిషదం దేహమాత్రాత్మదర్శనమేవ ప్రతిపన్నా అసుతృపః పురుషాః పరంతప ఽప్రాప్య మాం పరమేశ్వరం మత్ప్రాప్తౌ నైవాశంకేతి మత్ప్రాప్తిమార్గసాధనభేదభక్తిమాత్రమప్యప్రాప్యేత్యర్థః । నివర్తన్తే నిశ్చయేనాఽఽవర్తన్తే క్వ మృత్యుసంసారవర్త్మని మృత్యుయుక్తస్సంసారో మృత్యుసంసారస్తస్య వర్త్మ నరకతిర్యగాదిప్రాప్తిమార్గస్తస్మిన్నేవ వర్తంత ఇత్యర్థః ॥ ॥3॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శత్రువులను తపింపజేయు ఓయర్జునా! యెవరీయాత్మజ్ఞానముయొక్క స్వరూపమునందు, తత్ఫలమునందు శ్రద్ధారహితులో అట్టి నాస్తికులు, పాపకారులు, అసురలదర్శనము (దేహమాత్రాత్మదర్శనము) నాశ్రయించినవారు, అసుతృపులునగుపురుషులు నన్ను పొందక, మత్ప్రాప్తియుమార్గసాధనవిశేషమైన భక్తిమాత్రమునుగూడ పొందకయే మృత్యుయుక్తసంసారముయొక్క (నరకతిర్యగాదిప్రాప్తి) మార్గమునందేనిశ్చయముగ నుండుచుండిరి. అని యర్థము ॥3॥

ఆత్మజ్ఞానమనెడి ధర్మముయొక్క స్వరూపము, తత్సాధనము, తత్ఫలము శాస్త్రప్రతిపాదితమైనను, "అశ్రద్దధానాః" వేదవిరోధికుత్సితదర్శనదూషితమైన యంతఃకరణ కలవారగుటచే ప్రామాణ్యనిశ్చయము లేక, అసురసంపద నధిష్ఠించి స్వీయమతికల్పితోపాయముచే వేరొకవిధముగ ప్రయత్నించువారు— శాస్త్రవిహితమైన యుపాయము లేమింజేసి నన్ను పొందక మత్ప్రాప్తిసాధనమునైన పొందక, మృత్యుయుక్తమైన సంసారమునందు నిశ్చయముగ స్థిరపడుచుండిరి. (అనగా నెల్లపుడు జననమరణసంబంధముచే నారకి, తిర్యగాదియోనులయందే తిరుగుచుండిరని యర్థము.) ॥3॥

శంకరానందీయము:— ఇట్లు జ్ఞానమనాయాససాధ్యమనియు, అవ్యయఫలజనకమనియు చెప్పి, నిశ్శేషముగ సంసారదుఃఖధ్వాంతవిధ్వంసనకారణమైన జ్ఞానము సూర్యునివలె యప్రయాసలభ్యమైయున్నను, ముక్తిమార్గమును వదలి, కామనచే కర్మోపాసనయందు ప్రవృత్తులైన పురుషులను జూచి దుఃఖించువాడువలె, దయచే నీవిషయమును "అశ్రద్దధానాః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

పూర్వమునందు చెప్పబడిన గుణత్రయవిశిష్టమై "ధర్మస్య ధ్రియన్తే అనేనేతి ధర్మః" అజ్ఞానముచే జననమరణప్రవాహమునందు పడు పురుషులు దీనిచే ధరింపబడుదురు. గాన జ్ఞానము ధర్మమనబడును. మోక్షహేతువగు నట్టి జ్ఞానముయొక్క స్వరూపమునందును, తత్ఫలమునందును (మోక్షమునందును) శ్రద్ధలేనివారలైన (శ్రద్ధ యనగ కృతిహేతువు, ఫలప్రాప్త్యవసానమునగు ఆస్తావిశేషము. అట్టి ఆస్థాశూన్యులైన) దుర్విదగ్ధులగు పురుషులు మత్కర్మచే మోక్షమునందును, మోక్షసాధనమగు జ్ఞానమునందును శ్రద్ధాభక్తియత్నములు లేనివారై, ఆనందైకరసము, హస్తగతమునగు మోక్షమనెడి ఫలమును విడచి మృత్యుభూయిష్ఠము, నానాయోనులయందు, నరకములయందు మాటిమాటికి పతనస్వరూపమునగు సంసారమార్గమునందే యుండెదరు. మాటి మాటికి పుట్టెదరు. మరణించెదరు. అహా! ఎంతకష్టము. అపారదుఃఖకారణము దౌర్విదగ్ధ్యము.

ఈచెప్పుటచే మహత్త్వవిశిష్టమైన యాత్మజ్ఞానరూపమగు ధర్మమునందేయతులు శ్రద్ధకలవారలై, నిష్ఠకలవారలై ప్రయత్నమును చేయుదురో అట్టివారు ముక్తులగుదురని సూచింపబడెను. ॥3॥

గీ॥ మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా ।
మత్థ్సాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః ॥ ॥౪॥

పదవిభాగము:— మయా– తతం– ఇదం– సర్వం– జగత్– అవ్యక్తమూర్తినా– మత్థ్సాని– సర్వభూతాని– న– చ– అహం– తేషు– అవస్థితః ॥ ॥౩॥

ప్రతిపదార్థము:— అవ్యక్తమూర్తినా=వ్యక్తముకాని స్వరూపముకల, మయా=నాసంబంధమైన పరభావముచే; ఇదం=ఈ; సర్వం=నిఖిలమైన; జగత్=జగత్తు; తతం=వ్యాప్తమైనది; సర్వభూతాని=బ్రహ్మాదిస్తంబపర్యంతమైన నిఖిలభూతములు; మత్థ్సాని=అవ్యక్తమూర్తినగునాయం దున్నవి. అహం చ=నేనైతే; తేషు=ఆభూతములయందు; నావస్థితః=లేను. ॥౪॥

---

శాంకరభాష్యమ్:—

స్తుత్వాఽర్జున మభిముఖీకృ త్యాహ— మయా మమ యః పరో భావ స్తేన తతం వ్యాప్తం సర్వ మిదం జగ దవ్యక్తమూర్తినా న వ్యక్తా మూర్తిః స్వరూపం యస్య మమ సోఽహ మవ్యక్తమూర్తి స్తేన మయాఽవ్యక్తమూర్తినా కరణాగోచరస్వరూపే ణేత్యర్థః । తస్మి న్మ య్య వ్యక్తమూర్తౌ స్థితాని మత్థ్సాని సర్వభూతాని బ్రహ్మాదీని స్తమ్బపర్యన్తాని । న హి నిరాత్మకం

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇతరమును నిందించుటచేతను, జ్ఞాననిష్ఠనుస్తుతించుటచేతను, యర్జునుని యభిముఖముగ జేసుకొని చెప్ప మొదలిడెను. కరణములకు గోచరముకాని స్వరూపము కల నాయొక్క పరభావముచే నీనిఖిలజగత్తు వ్యాప్తమైనది. బ్రహ్మాదిస్తంబ (తృణ) పర్యంతనిఖిలభూతములు కరణాగోచరమగు నాపరభావమునం దున్నవి. భూతములు పరమేశ్వరునియం దున్నచో

---

—• ౯వ అధ్యాయము ౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు చెప్పదగినదిగా ప్రతిజ్ఞాతమైన జ్ఞానమును విధినిషేధద్వారమున స్తుతించి, దానిచే నభిముఖుడైన యర్జునుని గూర్చి "మయా తత" మ్మను రెండు శ్లోకములచే జెప్పుచుండెను. భూతభౌతికము, తత్కారణము నగు నిఖిలదృశ్యప్రపంచము మద్విషయికాజ్ఞానకల్పితము. అధిష్ఠానము, పరమార్థసద్రూపము, స్ఫురణరూపము నగు నాచే, రజ్జుఖండముచే రజ్జ్వజ్ఞానకల్పితమగు సర్పధారవలె వ్యాప్తము. వాసుదేవుడవగు పరిచ్ఛిన్నుడవైన నీచేత నెట్లీనిఖిలజగత్తు వ్యాప్తమైనది. ప్రత్యక్షవిరోధము కాదా? యని శంకింపజనదు. సర్వేంద్రియాగోచర మైన, స్వప్రకాశాద్వయచైతన్య సదానందమూర్తి నాకు కలదు. అట్టి స్వరూపముచే నీనిఖిలజగత్తు వ్యాప్తమైనది. ఈదృశ్యమగు వాసుదేవదేహముచే వ్యాప్తము కాదు. కాన "ప్రత్యక్షవిరోధము సంభవింపదు. కనుకనే, సద్రూపముచే నాయం దుండిన జంగమస్థావరాత్మకమగు నిఖిలప్రపంచము స్ఫురణకలదిగా కనుపించుచున్నది. పరమార్థతః నేనాకల్పితము లగు భూతములకును, అకల్పితుడ నగు నాకును సంబంధము సంభవింపనందున, నేనాకల్పితభూతములయందు లేనివాడను. (కనుకనే భగవద్భాష్యకారులచే– "యత్ర యదధ్యస్తం తత్కృతేన గుణేన దోషేణ వా అణుమాత్రేణాపి స న సంబధ్యతే" దేనియం దేదధ్యస్తమో యధ్యస్తకృతమైన గుణముచేతగాని, దోషమాత్రముచేగాని యణుమాత్రమైనను ఆయధిష్ఠానమునకు సంబంధ ముండదని చెప్పబడెను. ॥౪॥

శాంకరభాష్యమ్:—

కించి ద్భూతం వ్యవహారా యావకల్పతేఽతో మత్స్థాని మయాఽఽత్మనాఽఽత్మవత్త్వేన స్థితా న్యతో మయి స్థితా నీ త్యుచ్యంతె । తేషాం భూతానా మహ మేవాత్మే త్యత స్తేషు స్థిత ఇతి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పరమేశ్వరునకు, భూతములకు నాధారాధేయభావము ప్రాప్తించుటచే భేదమే ప్రాప్తించు నని శంకింపజనదు, నిరాత్మక మగు నేభూతము గూడ వ్యవహారముకొఱకు సమర్థము కాదు. కాన నాచే (ఆత్మస్వరూపముచే) నిఖిలభూతము లాత్మవంతములై యున్నవి. అందువలన

శంకరానందీయము:— ఇట్లు జ్ఞానమునకు సర్వోత్తమత్వమును, సులభత్వమును, దుర్భ గాలభ్యత్వమును జెప్పి "పర స్తస్మాత్తు భావోన్యః " యస్యాంతస్థాని భూతాని యేన సర్వ మిదం తత"మ్మనుదానిచేత పూర్వమునందు చెప్పినదానినే యిపుడు పరబ్రహ్మముయొక్క స్వరూపమును, జ్ఞానమును, విజ్ఞానమును "మయా" యను శ్లోకముచేతను, నుత్తరశ్లోకపూర్వార్ధముచేతను చెప్పుచుండెను. ఏప్రమాణముచేతనుగూడ తెలిసికొనుటకు శక్యము కానిది నాస్వరూపము. "తం త్వౌపనిషద"మ్మను శ్రుతి వలన బ్రహ్మ ముపనిషద్బోధ్యమని చెప్పబడుచుండగా నేప్రమాణముచేతను తెలియబడనిది నాస్వరూప మని చెప్పుట యసంగతము కాదా! యని శంకింప వీలులేదు. పరమాత్మ శ్రుతి కగోచరు డగుటచేత, పరమాత్మబోధకత్వము శ్రుతికి సంభవింపదు. "అస్థూల" మిత్యాదిశ్రుతిచే సర్వదృశ్యనిషేధమును జేసి తన్నిషేధావిషయము, సర్వదృశ్యవిలక్షణము బ్రహ్మ మని శ్రుతిబోధించుచున్నది. ఇంతియేగాని, శ్రుతి సాక్షాత్తుగా నిది బ్రహ్మమని బోధించుటలేదు. "సత్యం జ్ఞానం, ఆనందో బ్రహ్మ" ఇత్యాదిశ్రుతులు సాక్షాత్తుగా సత్యాదిస్వరూపము బ్రహ్మమని బోధించుచున్నవనగూడదు. ఆశ్రుతులు బ్రహ్మకు నసద్వై లక్షణ్యప్రతిపాదనపరము లగుటవలన కారణవిశిష్ట మగు, ననృతజడదుఃఖాత్మకముగ జగత్తు ప్రత్యక్ష మగుటవలన బ్రహ్మమునకు నట్టి జగద్వైలక్షణ్యము అర్థాత్తు సిద్ధము. అట్టిజగద్వైలక్షణ్యమునే బ్రహ్మమున కుపదేశించుటకు "సత్యం జ్ఞానం, ఆనందో బ్రహ్మ" యని చెప్పబడినది. కాని సాక్షాత్తు ఇది బ్రహ్మమని యుపదేశించుటలేదు. శ్రుతి వాగ్రూపమగుటవలన యట్టి వాగ్వృత్తికి బ్రహ్మ మవిషయ మగుటవలన శ్రుతిబోధ్యత్వము బ్రహ్మమునకు లేదు. కనుకనే బ్రహ్మము సర్వప్రమాణాగోచరము అని చెప్పబడెను. అట్టి నిర్విశేష మగుబ్రహ్మముచే నీనిఖిలజగత్తు వ్యాప్తము. రూపవత్తులు, జడములు నగుసర్వద్రవ్యములు సూర్యాఽలోకవ్యాప్తమైన చక్షురింద్రియగ్రాహ్యము లగుచున్నవి. సూర్యాఽలోకాఽవ్యాప్తమైన చక్షు గ్రాహ్యములు కావు. అట్లే చిదేకస్వరూపముచే బహిరంతఃవ్యాప్తమైనదై నిఖిలజగత్తు సర్వకరణ వ్యవహారయోగ్య మగుచున్నది. ఇంతియే కాని, చిదేకరసముచే నవ్యాప్తమగునది స్వతః నిరాత్మక మగుటవలనను యప్రకాశమగుటచేతను; కరణవ్యవహారయోగ్యము కాదు. "తస్య భాసా సర్వ మిదం విభాతి" యను శ్రుతిగూడ నీవిషయమున ప్రమాణము. కాననీనిఖిలజగత్తు నాచేత,నంతటవ్యాప్తమై ప్రకాశింప బడుచున్నది. ఇట్లు చెప్పుటచే సర్వజగత్ప్రకాశక మేదియో, యదియే బ్రహ్మ మని జ్ఞాన ముపదేశింప బడెను.

మఱియు నవ్యక్తమహదహంకారాదిస్థూలాంత మగుజంగమస్థావరాత్మకమైన నిఖిలభూతములు, అవ్యక్త మూర్తి యగునాయందే యున్నవి. ఉదకమునందు తరంగములు, బుడగలు మొదలగునవి, జలసత్త చేత సత్తావంతములై, జలమునం దెట్లున్నవో, నగరనివాసులు దర్పణసత్త చేత, సత్తావంతులై, దర్పణమునం

శాంకరభాష్యమ్:—

మూఢబుద్ధీనా మవభాసతేఽతో బ్రవీమి న చాహం తేషు భూతే ష్వవస్థితో మూర్తవ త్సంశ్లేషాభావేనాఽఽకాశస్యా ప్యంతరతమో హ్యహమ్ । న హ్యసంసర్గి వస్తు క్వచి దాధేయభావే నావస్థితం భవతి ॥ ||౪||

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"మత్స్థాని, మయిస్థితాని" అని చెప్పబడుచున్నవి. కాని యాధారాధేయభావము ననుసరించి "మత్స్థాని" అని చెప్పబడలేదు. (కాన పూర్వోక్తాశంక కవకాశము లేదు.) ఆభూతములకు నేనే యాత్మను. కాన మూఢబుద్ధులుకలవారలకు నాయందు భూతము లున్నవని భాసించు చెట్లుండిరో యట్లే సర్వభూతములు నాసత్తచేత సత్తనుపొంది నాయందున్నవి. ఈవిషయమునే "సదాయతనాః సత్ప్రతిష్ఠాః" యను శ్రుతి బోధించుచున్నది. ఇట్లు చెప్పుటచే సర్వభూతాధార మేదియో యదియే బ్రహ్మ మని జ్ఞాన ముపదేశింపబడెను. "పర స్తస్మా త్తు భావోఽన్యోవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః" అను స్థలమునం దవ్యక్తముకంటె పరమాత్మ యుత్కృష్టుడనియు, నవ్యక్తము నికృష్టమనియు చెప్పబడెను. దానినే తిరిగి స్పష్టపఱచుటకు కార్యముతోగూడ నవ్యక్తము వ్యాప్తమగుటచేతను, నాధేయమగుటచేతను నికృష్టమనియు, పరమాత్మ వ్యాపకమగుటచేతను, నాధారమగుటచేతను యుత్కృష్టమనియు చూపి యిపుడు ఇట్లు వ్యాప్యవ్యాపకభావముచేతను, నాధారాధేయభావముచేతను భేద మంగీకృతమగుచో భేదమునకు యథార్థత్వము, భేదదర్శులగుముముక్షువులకు మోక్షాభావము, అద్వైతశ్రుతివిరోధము వాటిల్లును. అట్టిదానిని పరిహరించుటకు "అథాత ఆదేశో నేతి నేతి । న సన్నాసన్న సదసత్" ఇత్యాదిశ్రుతిప్రసిద్ధమైన సర్వదృశ్యనిషేధమును బ్రహ్మ కద్వితీయత్వసిద్ధికై "నచాహ" మ్మనుదానిచే జెప్పుచుండెను.

ఇట చ కార మవధారణార్థకము. అవ్యక్తాదిస్థూలాంతంము, బ్రహ్మాదిస్తంబపర్యంతమునగు భూతములయందు, కూటస్థము, అసంగము, చిద్రూపమునగు పరమాత్మనగు నేను లోపలప్రవేశించిగాని, ఆత్మస్వరూపముచేగాని, వ్యాపకత్వముచేగాని, గృహమునందు వాయువువలెగాని, బిలమునందు, సర్పమువలెగాని, అయఃపిండమునందు అగ్నివలెగాని, వికారివలెగాని, యుండుటలేదు. వికారులగు వాయ్వగ్న్యాదులు, గృహాయఃపిండాదులయందు ప్రవేశించుట వ్యాపించియుండుట, యుపపన్నమే. అవికారి, నిరవయము, అసంగము, అక్రియము, పరిపూర్ణము నగు నాకు యాకాశమునకువలె ప్రవేశ ముపపన్నము కాదు. ఎట్లు ఘటాకాశ మనుచోట, ఆకాశమునకు ఘటమునందు ప్రవేశించి స్థితి యుపపన్నమగుచున్నదో, యట్లే నీకు గూడ (పరమాత్మకు) భూతములయందు ప్రవేశించి యుండుటయెందు కుపపన్నము కాదని ప్రశ్నింపజనదు. నిరవయవమునకు చలనము సంభవింపదు గాన, ఆకాశమునకుగూడ ఘటాంతరప్రవేశకల్పన భ్రమయే యగును. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మమునకు భూతములయందు ప్రవేశమును బోధించుచున్నవని శంకింపజనదు. అది ఆభాసవిషయమగుటవలన బ్రహ్మవిషయము కానేరదు. "నిష్కలం నిష్క్రియం" "అసంగో న హి సజ్యతే । ఆకాశవత్సర్వగతః" "పూర్ణమదః" ఇత్యాది శ్రుతులు బ్రహ్మకు నిరవయత్వ, నిష్క్రియ, త్వాసంగత్వ, పూర్ణత్వములను బోధించుటవలన ప్రవేశక్రియ కాని, వ్యాపనక్రియ కాని, సంయోగము కాని, మఱి యేయితరసంబంధముగాని బ్రహ్మకు కలదని యూహించుటకు శక్యము కానందున "భూతములయందు ప్రవేశించి నేను లేను" అనిచెప్పుట సమంజసమే. ||౪||

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చున్నది. కనుక 'నచాహం తేష్వవస్థితః' అని చెప్పుట సమంజసము. అనగా మూర్తద్రవ్యములకువలె సంశ్లేషము లేకపోవుటచే నాకాశమునకుగూడ నంతరతముడ నగు నేను ఆభూతములయం దాధేయభావమును పొంది యుండుటలేదు. అసంసర్గి యగు యేవస్తువు గూడ నెచటను యాధేయభావముతో నుండదు. ॥౪॥

నీలకంఠీయము:— పైవిధముగ జ్ఞానము స్తుతించి, యర్జునుని వక్తవ్యార్థమునం దభిముఖునిగ జేసి, చెప్పదగు విషయము నీశ్లోకము మొదలుకొని చెప్పుచుండెను— "మయా తత మిదం సర్వం" బంగరుచే కుండలాదికమువలె నుపాదానమునగుట నాచే నీసర్వజగత్తు వ్యాప్తమైనది.

ఇట చెప్పిన యీవిషయము— "అహం సర్వస్య జగతః" ప్రభవః ప్రలయ స్తథా" అని పూర్వమునందే చెప్పబడెను. కాన "రాజవిద్యా రాజగుహ్యం" అని యిట స్తుతించుట వక్తవ్యశేషము లేదు కాన వ్యర్థమే యగు నని శంకింపదగదు. ఏమన:— "యతో వా ఇమాని భూతాని జాయన్తే" । యేన జాతాని జీవన్తి । య త్ప్రయ న్త్యభిసంవిశన్తి । తద్విజిజ్ఞాసస్వ । తద్బ్రహ్మేతి" అని శ్రుతి— జ్ఞేయబ్రహ్మకు జగజ్జన్మాదిహేతుత్వమును లక్షణముగా జెప్పి, ఆబ్రహ్మయొక్క యనుసరణమును అన్నాదిశబ్దవాచ్య విరాడాదులయందు "అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే" అను మొదలగు శ్రుతిచే జూపెను. "ఆనందా ద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే" అనునది ఆలక్షణమునకు నిర్ణాయకవాక్యము. "సైషా భార్గవీ వారుణీ విద్యా" అనువాక్య మీవిషయమునందే పర్యవసితము. అట్లే యీగీతలయందుగూడ సప్తమాధ్యాయమున "భూమి రాపోఽనలో వాయుః" అను మొదలగుదానిచే సర్వభూతాత్మకు డగు విరాట్టునకు జగజ్జన్మాదిహేతుత్వము బ్రదర్శించి, యనంతరము "అహం సర్వస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా" అనుదానిచే మాయాశబలబ్రహ్మమునందుగూడ యాజగజ్జన్మాదిహేతుత్వము బ్రదర్శించి, ప్రస్తుతము ప్రతిపత్తిసౌకర్యమునకై స్థూలారుంధతీన్యాయముచే బ్రత్యగాత్మయందే యాజగజ్జన్మాదిహేతుత్వమును జూపుచుండె నని రాజవిద్యేత్యాదిస్తుతి ననుసరించి తోచుచున్నది. లోకమున యెవడు సూక్ష్మము దుర్లభము నగు నరుంధతి నొక జిజ్ఞాసువునకు జూపదలచి, ప్రథమమున యాయరుంధతికి సమీపమున నున్న యొక స్థూలనక్షత్రము జూపి, యనంతరము దానికి దగ్గరగ నున్న యరుంధతి జూపును. అట్లు జూపిన తెలిసికొనువాడును సూక్ష్మమగు నరుంధతి తెలిసికొనగలుగును. అట్లే జ్ఞానకార్యకారణప్రతిపత్తి ద్వారమున గార్యకారణస్వరూపము కాని శుద్ధబ్రహ్మము తెలిసికొనును. కనుకనే భాష్యకారులు "మయా తత మిదం సర్వం" అను స్థలమున "మయా మమ యః పరో భావ స్తేన తతం" (సోపాధికుడ నగు నాకు సర్వజగద్వ్యాప్తి సంభవము గాదు కాన నాసంబంధమగు పరభావముచే (పరమానందముచే) నీసర్వజగత్తు వ్యాప్తము) అని వ్యాఖ్యానించిరి. "అహం సర్వస్య జగతః ప్రభవః" అను స్థలమున "అహం= నాసంబంధమగు పరభావము సర్వజగత్తునకు కారణము" అని యర్థము కాదు. కారణ మేమన:— మాయాశబలబ్రహ్మమునకే యట్టి కారణత్వముపపన్నమగుట పైవిధముగ నర్థము చెప్పనవసరము లేదు. "ఆనందాద్ధ్యేవ" అనుశ్రుతిచొప్పున జగదుపాదానత్వము పరమానందమునకే యుపపన్నము. తదీయసత్తాస్ఫూర్తులచే నీజగము వ్యాప్తము. కాన నట్టి పరమానందరూపమగు పరభావముచే నీసర్వజగము వ్యాప్తము. కనుకనే "అవ్యక్తమూర్తినా" (మాయాశబలమగు కారణము బుద్ధిగ్రాహ్యమగుటవలన కారణగోచర మగును. శుద్ధబ్రహ్మము బుద్ధికి పరమగుట కారణాగోచర మగును.) ఈయానందరూపపరభావము. భూతాకారముగ పరిణమించునా? అను యాశంకపై చెప్పుచున్నాడు.

గీ॥ నచ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్ ।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥౫॥

పదవిభాగము:— న- చ- మత్స్థాని- భూతాని- పశ్య- మే- యోగం- ఐశ్వరం- భూతభృత్- న- చ- భూతస్థః- మమ- ఆత్మా- భూతభావనః ॥ ॥౫॥

ప్రతిపదార్థము:— భూతాని=బ్రహ్మాదిస్తంబపర్యంతనిఖిలభూతములు; నచమత్స్థాని=నాయందు లేవు; మే=నాయొక్క; ఐశ్వరం=ఈశ్వరసంబంధమైన; యోగం=ఘటనను; (ఆత్మయాథాత్మ్యమును) పశ్య=చూడుము; భూతభృత్=భూతములనుభరించువాడనైనను; భూతస్థః=భూతములయందుండువాడను; నచ=కాను; మమ=నాయొక్క; ఆత్మా=స్వరూపము; భూతభావనః=భూతములనుపుట్టించునది; లేక భూతములను వృద్ధిపొందించునది. ॥౫॥

శాంకరభాష్యమ్:—

అత ఏవాసంసర్గిత్వాన్మమ— న చ మత్స్థాని భూతాని బ్రహ్మాదీని పశ్య మే యోగం యుక్తిం ఘటనం మే మమైశ్వర మీశ్వర స్యేమ మైశ్వరం యోగ మాత్మనో యాథాత్మ్య మిత్యర్థః । తథా చ శ్రుతి రసంసర్గిత్వా దసంగతాం దర్శయతి "అసంగో న హి సజ్జతే"

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నే నసంగినగుటవలననే బ్రహ్మాదిస్తంబపర్యంతనిఖిలభూతములు నాయందు లేవు. నాయొక్క యీశ్వరసంబంధమైన ఘటనను (యాథాత్మ్యమును) చూడుము. పరమాత్మ యసంసర్గి యగుటవలన నసంగిత్వమును "అసంగో న హి సజ్జతే" అను శ్రుతిబోధించుచున్నది. "మత్స్థాని......ష్వవస్థితః" ప్రత్యగానందరూప మగు నాయందు రజ్జువునందు స్రక్సర్పదండధారాదులవలె సర్వభూతములు నున్నందున "నాయందున్న"వని మాత్రమే యుపచారముగ చెప్పబడుచున్నవిగాని, యధిష్ఠానాధ్యస్తములకు వాస్తవికసంబంధము లేదుగాన వాస్తవముగ నాయందవి లేవు. మరియు బరమానందరూపమగు నేను పరిణామిని గానందున యాభూతములయందు- ఘటాదులయందు పరిణాములగు మృదాదులవలె, నుండుటయు లేదు. ॥౪॥

—• ౯వ అధ్యాయము ౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— కనుకనే ఆకాశమునందుండిన సూర్యునియందు జలచలనాదికము కల్పితమైనట్లు నాయందు కల్పితములైన భూతములు పరమార్థముగ నాయందు లేవు. ఓయర్జునా! నీవు ప్రాకృతమైన మనుష్యబుద్ధినివిడచి, మాయావియొక్కవలె నాయొక్క అఘటనఘటనాచాతుర్యరూపమైనప్రభావమును చూడుము. నేను దేనికిని యాధారముకాను. దేనికిని యాధేయమును కాను. అయినను నేను సర్వభూతములయందును, నాయందు సర్వభూతములును కలవు. అనునది గొప్ప మాయ. బ్రహ్మము సర్వకార్యములను ఉపాదానమగుటచే ధరించుచున్నది, పోషించుచున్నది. కాన "భూతభృత్" అని చెప్పబడుచున్నది. నిఖిలభూతములను కర్తృత్వముచే పుట్టించుచున్నది. కాన "భూతభావనః" అని చెప్పబడుచున్నది. ఇట్లు బ్రహ్మము జగత్తున కభిన్ననిమిత్తోపాదానమైనను నాయొక్క పరమార్థస్వరూపభూత మగు, సచ్చిదానందఘనస్వరూపము, అద్వితీయస్వరూపమగుటవలన స్వప్నద్రష్టయొక్క పరమార్థతః స్వకల్పితస్వప్నసంబంధి కానటుల పరమార్థముగ భూతసంబంధి కాదు. "మమాత్మా" అను

శాంకరభాష్యమ్:—

ఇతి । ఇదం చాఽఽశ్చర్య మన్య త్పశ్య భూతభృ దసంగోఽపి సన్భూతాని బిభర్తి న చ భూతస్థో యథోక్తేన న్యాయేన దర్శితత్వా ద్భూతస్థత్వానుపపత్తేః । కథం పున రుచ్యతేఽసౌ మమాత్మేతి, విభజ్య దేహాదిసంఘాతం తస్మి న్నహంకార మధ్యారోప్య లోకబుద్ధి మనుసర న్వ్యపదిశతి, మమాత్మేతి, న పున రాత్మన ఆత్మాఽన్య ఇతి లోకవ దజానన్ । తథా భూతభావనో భూతాని భావయ త్యుత్పాదయతి వర్ధయతీతి వా భూతభావనః ॥ ॥౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని: —

మరియునా (యీశ్వర) సంబంధమైన యింకొకయాశ్చర్యకర విషయమునుగూడ చూడుము. పరమాత్మ యసంగుడైనను భూతములను భరించుచున్నాడు. యథోక్తన్యాయముచే భూతస్థత్వానుపపత్తి ప్రదర్శిత మగుటవలన భూతస్థుడు కాడు. అట్లగుచో "మమాత్మా" (నాయొక్క యాత్మ) యని యెట్లు చెప్పబడె ననెదవా? విచారింప తనకంటె నాత్మ భిన్నముకాదు. మరిలోకమువలె యెరుగనటుల "మమాత్మా" అని చెప్పబడెను. నాయాత్మ భూతములను పుట్టించుచున్నది. లేక వృద్ధిపొందించుచున్నది. ॥౫॥

స్థలమున "రాహోశ్శిరః" అనునట్లు షష్ఠి యని చూడ నగును. అనగా మదభిన్న మగుయాత్మ యని యర్థము. ॥౫॥

శంకరానందీయము:— అవిక్రియుడవు, పూర్ణుడవు నగుపరబ్రహ్మస్వరూపమైన నీవు భూతములయందు అవస్థితి, వ్యాప్తి లేకపోవుగాక, భూతములన్నో నీయం దుండవచ్చునుకదా? అను శంకను "న చ మత్స్థాని" అనుదానిచే దొలిగించుచుండెను.

అవ్యక్తమూర్తి, చిదేకరసము, పరిపూర్ణము నగుబ్రహ్మమునందు అవ్యక్తము మొదలుకొని స్థూలము వరకునైన కార్యములతోగూడిన నిఖిలభూతములు స్థితములు కావు. అనగా భూతములయందు నేనెట్లు లేనో యట్లే పరమాత్మయం దేభూతములుగూడలేవని యర్థము. "సర్వభూతనివాసోఽసి" అను స్మృతి నీవు సర్వభూతాశ్రయత్వమును బోధించుచుండ "న చ మత్స్థాని భూతాని" అని చెప్పుట యెట్లు పొసగు ననిశంకింప జనదు. నిష్కలము, నిరాకారము, నిర్విశేషము, పరిపూర్ణము నగుబ్రహ్మమునందు భూతములు సంయోగసంబంధముననున్నవా? సమవాయసంబంధముతోనున్నవా? లేక తాదాత్మ్య సంబంధముతోనున్నవా? మొదటి పక్షమున భూతములకు బ్రహ్మమునకు సంయోగము అంతటనా? లేక ఏకదేశముచేతనా? పరిచ్ఛిన్నములకు అపరిచ్ఛిన్నములకు సర్వతఃసంయోగము సంభవింపనందున ప్రథమపక్షము సంభవింపదు. నిరవయవ మగుబ్రహ్మమునకు దేశకల్పన సంభవింపనందున భూతములకు, బ్రహ్మమునకు నేకదేశముచే సంయోగ మను రెండవపక్షము నిరస్తము. నిరవయవసావయవములకు సంయోగము సంభవింపదని చెప్పుటచే పరమాణువునందు ద్వ్యణుకమునకువలె భూతములకు, బ్రహ్మమునకు సంయోగము సంభవించు ననుశంకయు తొలిగింపబడెను. భూతములకు, బ్రహ్మమునకు అయుతసిద్ధత్వమే లేమిం జేసి సమవాయము సిద్ధింపనందున భూతములకు, బ్రహ్మమునకు సమవాయసంబంధము కలదను రెండవ పక్షమపాస్తము. జడాజడములకు తాదాత్మ్యము సంభవింపనందున భూతములకు, బ్రహ్మమునకు తాదాత్మ్య సంబంధము కలదను మూడవపక్షము నిరస్తము. అట్లగుచో బ్రహ్మమునకు, భూతములకు నేమి సంబం-

ధము కలదనెదవా? అధ్యాససంబంధ మని చెప్పెదము. రజతము శుక్తికయం దధ్యస్తము. అట్టి రజతము నామమాత్రమే కాని రజతమను వస్తువే లేదు. అట్లే బ్రహ్మమునందు నిఖిలప్రపంచ మధ్యస్తము కాన బ్రహ్మమునందు ప్రపంచము అను నామమాత్రమే కాని వస్తుతః ప్రపంచమనునది లేదు. కాన పరిపూర్ణము, నిర్విశేషము నగు పరబ్రహ్మమునందు భూతములు లేవు. బ్రహ్మమునందు భూతములే యున్నచో భూతకృతమైన పరిచ్ఛిత్తిచే పూర్ణత్వము బ్రహ్మమునకు సంభవింపక పోయెడిని. "పూర్ణ మదః పూర్ణ మిదం" అను శ్రుతి బ్రహ్మమునకు పూర్ణత్వమును బోధించుచున్నది. "త దేత ద్బ్రహ్మాపూర్వ మనపర మనంతర మబాహ్యమ్" "ఏక మేవాద్వితీయం బ్రహ్మ" ఏక ఏవ హి రుద్రో న ద్వితీయాయ తస్థుః" ఇత్యాది శ్రుతిశతములు బ్రహ్మ కద్వితీయత్వమును నియమముగ బోధించుచున్నవి. నిష్కలము, నిష్క్రియము, నిస్సంగము, నిరంతరము, నిరాశ్రయము, నిర్విశేషము, పరిపూర్ణము నగు బ్రహ్మమునందు "నేహ నానాస్తి కించన" ఇత్యాదిశ్రుతిచే ప్రామాణిక మగుప్రపంచాభావము ప్రతిపాదితము కాన, నాకు పారమార్థికము, అప్రాకృతము నగుయీశ్వరసంబంధమైన యోగము తగినది. జ్ఞానముచే పొందదగినది నా: యోగ మనబడును. అది స్వస్వరూపము. సద్ఘనము, చిద్ఘనము, ఆనందఘనము, అద్వితీయము. అట్టిదానిని "ఇద మేవాహం" అని నీస్వరూపముచే చూడుము. "ఈనిఖిలజగత్తు సద్రూపము, బ్రహ్మమే నేను" అని స్వస్వరూపమును బ్రహ్మముగ తెలిసికొనుము. అని "పశ్య మే యోగ మైశ్వరం" అనుద్వితీయ పాదమున కర్థము.

"నేతి నేతి" అనుదానిచే సర్వదృశ్యనిషేధము చేయబడుచుండ తన్నిషేధావధిగ జగదభావమే మిగులును. మరేమియు లేదు కదా! ఏమియున్నదని "ఇది బ్రహ్మస్వరూపమే, నేను బ్రహ్మస్వరూపమే." అను విజ్ఞాన మెట్లు పొసగుననెదవా? సత్యము. ఇట ప్రపంచాభావమే ప్రతీయమానమగుచున్నది. అయినను దృశ్యప్రపంచము దేనిచే భాస్యమానమో, దేని స్వరూపముచే దేనియం దున్నదో, అట్టి ప్రపంచాభావము గూడ దానిచే భాస్యమానమై తత్స్వరూపముచే దానియందే యున్నది. మరియొక విధమున లేదు. అందువలన జగత్తదభావములకు స్వరూపభూతము, తదవభాసకము తదధిష్ఠానము, నిర్విశేషము, నిర్వికల్పము యేదో, అదియే బ్రహ్మము అని సూక్ష్మబుద్ధికల యుక్తికుశలులచే తెలియనగును. ఇట్టి బ్రహ్మస్వరూపము స్వాపరోక్షము. తన యారోగ్యమువలె తనచేతనే తెలిసికొనదగినది. కనుకనే శ్రీకృష్ణపరమాత్మయు "న చ మత్స్థాని భూతాని" అని తనయం దారోపితనిఖిలభూతజాతమును నిషేధించి "పశ్య మే యోగ మైశ్వరం" అని తనను మిగిల్చెను. సర్వదృశ్యనిషేధావధిభూతము, సర్వదృశ్యాభావావభాసకము నగు పరబ్రహ్మమును శుద్ధమైన యంతఃకరణముకల ముముక్షువులు తమస్వరూపముగ తెలిసికొనుదురుగాక. ఈచెప్పుటచే సర్వదృశ్యనిషేధావధిలక్షణము, సర్వాధిష్ఠానము, నిర్విశేషము, ప్రజ్ఞానైకరసము నగుయేపరబ్రహ్మము కలదో నేనాపరబ్రహ్మస్వరూపము. అని తెలిసి కొనుటయే విజ్ఞానమని సూచింపబడెను.

"సామ్యేమాః సర్వాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠితాః" అను శ్రుతియు, "సర్వభూతనివాసోసి" అను స్మృతియు బ్రహ్మకు సర్వభూతాధారత్వమును బోధించుచుండ "నచ మత్స్థాని భూతాని" అని యెట్లు చెప్పబడెనని శంకింపజనదు. నాకు సర్వభూతాశ్రయత్వము కలదు కాని యది పారమార్థికము కాదు. మరేమన మాయావిలసనము నాశ్రయించి లోకదృష్టిచే నట్లు చెప్పబడెను. దానిని నేనుకూడ యంగీకరించెద నని "భూతభృత్" అనుదానిచే జెప్పుచుండెను. అర్జునుడు స్వయముగ "ఇతడే సాక్షాత్తు పరమేశ్వరుడు" డని నాయందీశ్వరత్వబుద్ధి కలవాడగుటవలన "నేను ఆత్మను" అని చెప్పినచో నాదేహమునందే పర

మాత్మబుద్ధిని చేయు నని యూహించి, శ్రీకృష్ణపరమాత్మ ఆత్మశబ్దార్థమును స్వదేహముకంటె వేరుగ "మమాత్మా" అని నిర్దేశించెను. ఈయాత్మ "సన్మాత్రో నిత్యశ్శుద్ధో బుద్ధ స్సత్యో ముక్తో నిరంజనో విభురద్వయానందః పరః ప్రత్యగేకరసః" ఇత్యాది శ్రుత్యుక్తము, యీశ్వరత్వాభిమానము కల నాయొక్కయాత్మ. అది యవ్యక్తమూర్తి. ప్రత్యక్స్వరూపము, భూతభావనము. అనగా ఆకాశము మొదలుకొని పృథివీ పర్యంతము నగు స్వకార్యసహిత నిఖిలభూతములను స్వసత్తచేతను, స్వప్రకాశచేతను సత్తావంతములుగ, ప్రకాశవంతములుగ చేయుచున్నది. కాన 'భూతభావనః' అని యనిపించు కొనుచున్నది. తనయందారోపితమైన భూతములను స్వసత్తచే స్వమాత్రములుగ ధరించుచున్నది కాన "భూతభృత్" అని చెప్పబడును. భూతములయందాత్మ స్వరూపముచేగాని, అభిమానముచేకాని యుండనిది కాన "న తు భూతస్థః" అని చెప్పబడుచున్నవి. ఆత్మ భూతములయందే యున్నచో "విశేషణనాశా ద్విశిష్టస్యాపి నాశః" విశేషణము నశించిన విశిష్టముకూడ నశించునను న్యాయమున విశేషణములగు భూతములు నశించిన తద్విశిష్టమగు యాత్మకుకూడ నాశము ప్రాప్తింపవలసివచ్చును. మరియు భూతములయందుండు కర్తృత్వ భోక్తృత్వాదికముగూడ యాత్మకు ప్రాప్తింపవలసివచ్చును. అను శంకపై "న చ భూతస్థః" అని చెప్పబడెను. ఆత్మకు భూతస్థత్వము లేనిచో భూతములచే నాత్మ పరిచ్ఛిన్నము కావలసివచ్చు నని శంకింపజనదు. ఆకాశమునందు నీలిమవలె నాయందు జగత్తు కల్పితమగుటవలన భూతములకు స్వతః సత్త లేనందున నవి పరిచ్ఛేదకములే కానందున వాటిచే యాత్మ పరిచ్ఛిన్నము కావలసివచ్చునను శంకయే సంభవింపదు. లేదా, అధిష్ఠానముకంటె వేరుగ భూతములకు స్వరూపమే లేనందున స్వమాత్రమగు భూతములయందు తిరిగి యుండదగినదని యెప్పుడును చెప్పబడదని "న చ భూతస్థః" అను దానిచే జెప్పెను. ఈచెప్పుటచే మరుప్రదేశమునందు జలమువలె, ఆకాశమునందు నైల్యమువలె, నాయందు నిఖిలభూతము లున్నవి. నేను భూతములయందు లేను. అని యర్థము పర్యవసితము. ॥౫॥

నీలకంఠీయము:— పైవిధముగ నంగీకరింపబడిన జగద్వివర్తాధిష్ఠానత్వముగూడ పరమానందరూపమగు నాపరభావమునకు లేదని యీశ్లోకమున జెప్పుచున్నాడు.— "అస్య ద్వైతేంద్రజాలస్య యదుపాదానకారణమ్ । అజ్ఞానం త దుపాశ్రిత్య బ్రహ్మ కారణ ముచ్యతే॥" (ఈపరిదృశ్యమానమగు ద్వైతరూప జగదింద్రజాలమున కేయజ్ఞాన ముపాదానకారణముగ జెప్పబడుచున్నదో, అట్టి యజ్ఞానము నాశ్రయించి పరబ్రహ్మము కారణముగ జెప్పబడుచున్నది.) అను వార్తికవాక్యానుసార మజ్ఞానమే జగత్కారణము. అది తుచ్ఛము. (శశవిషాణతుల్యము) నేను (బ్రహ్మను) అసంగుడను. ఆ కారణముచే దుచ్ఛతరము, అజ్ఞానకార్యమునగు భూతసంఘముతో నసంగుడ నగు నాకు అనిర్వచనీయమైన యాధారాధేయభావము గూడ లేదు. ఆవృతమైన రజ్జ్వాదికము అనిర్వచనీయమైన సర్పాదికముతో సంబంధించుచున్నది. ఇక నేనన్నచో సాక్షినగుటచే సర్వదా యనావృతుడనై భూతసంబంధశూన్యుడను. కనుక నీభూతములు నాయందుండుట లేదని జెప్పబడెను.

సాక్షిస్వరూపుడవు, బరబ్రహ్మస్వరూడవు నగునీకు బ్రతీచియందువలె, భూతసంబంధానుభవముండుటవలన, "భూతములు నాయందు లేవు" అనుట యెట్లు పొసగునను యాశంకపై జెప్పుచున్నాడు. "పశ్య మే యోగ మైశ్వరం" మాయావిని, ఈశ్వరుడను నగు నాచే – గగనమునందు గంధర్వనగరమువలె భూతములతో నాదియగు నిర్మింపబడిన యోగమును జూడుము. కనుకనే కారణశరీరుడనగు నాయాత్మరూపమైన ప్రత్యగానందము "భూతభృన్న చ భూతస్థః" భూతభృత్తైనను భూతములయందు లేదు. (ఇట చకార

గీ॥ యథాఽఽకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ ॥ ॥౬॥

పదవిభాగము:— యథా- ఆకాశస్థితః- నిత్యం-వాయుః- సర్వత్రగః- మహాన్- తథా- సర్వాణి- భూతాని- మత్స్థాని- ఇతి- ఉపధారయ ॥

ప్రతిపదార్థము:— యథా=ఎట్లు; ఆకాశస్థితః=ఆకాశమునందున్న, మహాన్=గొప్పదయిన; వాయుః=వాయువు; సర్వత్రగః=అంతట వెళ్ళుచున్నదో; తథా=అట్లే; సర్వాణి=సమస్తమైన; భూతాని=భూతములు; మత్స్థాని=నాయందున్న వాటినిగ; ఉపధారయ= తెలిసికొనుము. ॥౬॥

శాంకరభాష్యమ్:—

యథోక్తేన శ్లోకద్వయే నోక్త మర్థం దృష్టాన్తే నోపపాదయన్నాహ— యథా లోక ఆకాశస్థిత ఆకాశే స్థితో నిత్యం సదా వాయు స్సర్వత్ర గచ్ఛతీతి సర్వత్రగో మహా న్పరిమాణత స్తథాఽఽకాశవ త్సర్వగతే మయ్యసంశ్లేషే ణైవ స్థితా నీత్యేవ ముపధారయ జానీహి ॥ ॥౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"మయా తత మిదం" ఇత్యాదిశ్లోకద్వయముచే సృష్టిస్థితిసంహారముల కసంగాత్మాధారత్వము చెప్పబడెను. దానినే దృష్టాంతప్రదర్శనపూర్వకముగ "యథా" అనుశ్లోకముచే

మప్పర్థమునందు (ప్రయుక్తమై యభిన్నక్రమముగూడ కలది) ఆకాశము గంధర్వనగరధారియైనను, తదాకారముగ బరిణమించదు గాన దానియందుండదు. ఇట్టిదైనను బరమానందరూపమగు నాయాత్మ- "భూతభావనః" భూతాభివృద్ధికరము. "ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి । కోహ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ । యదేష ఆకాశ ఆనందో న స్యాత్" (అవ్యాకృతాకాశమునందు స్వాధిష్ఠాన భూతమగు యానంద మనుస్యూతమై లేకున్నచో నెవడును ప్రాణాపానక్రియను చేయకుండును. ఏమన: కారణగతమైన జాడ్యము కార్యమునందుగూడ గలుగును. ఆకాశము ఆనందానుబంధముగలదగుచో కారణము చేతనమగుట గార్యముగూడ చేతనము కలదగునని శ్రుత్యర్థము.) బృహదారణ్యకమునందు గూడ-యదూర్ధ్వం గార్గి! దివో యదావాక్ పృథివ్యా యదన్తరా ద్యావా పృథివీ ఇమే । యద్భూతం చ భవచ్చ భవిష్యచ్చేత్యాచక్షత ఆకాశ ఏతదోతంచ ప్రోతం చ" అని మాయావియందు సర్వజగత్తునకు ఓతప్రోతత్వము జెప్పి, "కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చప్రోతశ్చ" (దేనియందాకాశము ఓతము, ప్రోతము నగుచున్నది? అను ప్రశ్నమునకు సమాధానముగ "ఏతస్మిన్ ఖల్వక్షరే గార్గి! ఆకాశ ఓతశ్చ ప్రోతశ్చ" అని యస్థూలాది లక్షణమగు అక్షరబ్రహ్మము ఆకాశాధారముగ జెప్పబడెను. కనుక నిట "మమాత్మా భూతభావనః" యని జెప్పుట సమంజసమే. ॥౫॥

—• ౯వ అధ్యాయము ౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అసంశ్లిష్టము లగువాటికికూడ ఆధారాధేయభావము కలదని దృష్టాంతపురస్సరముగ "యథాఽఽకాశస్థితః" అను శ్లోకముచే చెప్పుచుండెను.

అసంగస్వభావము కల యాకాశమునందు నిత్యము ఉత్పత్తిస్థిలయకాలములయందుండి సర్వదా చలనస్వభావముగల వాయువు తిరుగుచున్నది. కనుకనే సర్వత్ర నడచునదై పరిమాణముబట్టి మహత్తమయినది. ఇట్టిదైనను యెప్పుడును ఆకాశముతో సంశ్లేషను ఎట్లు పొందదో అట్లే అసంగతస్వభావ

శాంకరభాష్యతత్త్వబోధని:—
జెప్పుచుండెను. లోకమునం దెట్లు గొప్పదగువాయువు సర్వదా యంతటను నడుచుచున్నదో యట్లే ఆకాశమువలె సర్వవ్యాపకమైన నాయందును యసంశ్లేషముచేతనే నిఖిలభూతము లున్నవని తెలిసికొనుము. ||౬||

మగు నాయందు సంశ్లేషను విడచియే ఆకాశము మొదలుకొని యగునిఖిలభూతములు సర్వత్రగములు, స్థితములు అని విమర్శించి నిశ్చయించుము. ||౬||

శంకరానందీయము:— గొప్పవగు (మహత్పరిమాణముకల) ఆకాశాదిభూతములకు, తత్కార్యము లగుభౌతికములకు, నీయందు స్థితి యెట్లు సంభవించు నను శంకను తొలగించుటకు "స దివో జ్యాయా నంతరిక్షా జ్జ్యాయాన్" "ఏతావా నస్య మహిమా అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః। పాదోఽస్య విశ్వా భూతాని। త్రిపాదస్యామృతం దివి" ఇత్యాదిశ్రుత్యుక్తరీతిని బృహత్తము నగు పరబ్రహ్మమునందు చంద్రునియందు నీలిమవలె యేకదేశమునందే యావ్యక్తము మొదలుకొని నిఖిల భూతము లున్నవని దృష్టాంతపురస్సరముగ "యథా" అను శ్లోకముచే చెప్పుచుండెను.

"సర్వత్రగః" ఆకాశసంబంధములేకుండగనే గొప్పదగు వాయువు సర్వత్ర ఆవిర్భావతిరోభావ ములను పొందుచు నంతట నెట్లు చలించుచుండెనో, అనగా మహత్పరిమాణముగల వాయువు యెట్లు భూతాకాశమునందు సర్వదాయుండెనో, యట్లే మహదాదిస్థూలాంతభూతములు— పరిపూర్ణము, నిష్క్రియము, నిరాకారము, నిరంతరము నగు పరబ్రహ్మమునం దున్నవని నిశ్చయింపుము. ||౬||

పరమార్థప్రపః:— అసంశ్లిష్టములగు వాటికిగూడ నాధారాధేయభావమును "యథా" అను శ్లోకముచే దృష్టాంతపురస్సరముగ దృఢపరచుచుండెను.

అనాకాశములేనిదే యవస్థానము సంభవింపనందున నిత్య మాకాశమునందుండిన గొప్ప వాయువు సర్వత్రయుండినను నిరవయవమగు యాకాశముతో నెట్లు సంశ్లేషను పొందుటలేదో, యట్లే సర్వ భూతములు నాయం దున్నను సంశ్లేషను (సంబంధమును) పొందుటలేదని తెలిసికొనుము. ఈవిష యమునే "యథా విశుద్ధ ఆకాశే సహస్రనాభ్రమండలమ్। భూత్వా విలీయతే తద్వ దాత్మనీహాఖిలం జగత్" విశుద్ధ మగుయాకాశమునందు మేఘమండల మెట్లు పుట్టి నశించుచున్నదో యట్లే నాయం దీనిఖిలజగత్తు పుట్టి నశించుచున్నదని బోధించుచున్నది. ||౬||

నీలకంఠీయము:— పూర్వోక్తశ్లోకద్వయముచే జెప్పబడిన విషయమునకు దృష్టాంతము నీశ్లోకమున జెప్పుచున్నాడు— యెట్లు వాయువు అంతట వ్యాపించినదై, పరిమాణముచేగూడ పెద్దదై ఆకాశమునందుండునో, అట్లే సర్వభూతములు సర్వగతుడ నైననాయందు అసంశ్లేషముగనే యున్న వని తెలిసికొనుము. అని ప్రాచీను లర్థము జెప్పిరి.

"కిం త బ్రహ్మ" అను ప్రశ్నమునకు "అక్షరం పరమం బ్రహ్మ" అని అక్షరసంజ్ఞకశుద్ధ బ్రహ్మమగు త్వంపదార్థమే నిరుపాధికబ్రహ్మ మని చెప్పబడెను. అట నిరుపాధికబ్రహ్మము శ్లోక ద్వయముచే వ్యాఖ్యానింపబడెను. ప్రస్తుతము ఆనిరుపాధికబ్రహ్మమునకు అక్షరాఖ్యజీవాభేదమును దృష్టాంతముతోగూడ జెప్పుచున్నాడు— "వాయుః"="వాయుర్వై గౌతమ తత్సూత్రం" అను శ్రుత్యను సారము సూత్రాత్మ సమిష్టిలింగము గాన "సర్వగః" సర్వగతుడై, "మహాన్" (బాహ్యవాయువ్యా

గీ॥ సర్వభూతాని కౌన్తేయ! ప్రకృతిం యాన్తి మామికామ్ ।
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ । ॥౭॥

పదవిభాగము:— సర్వభూతాని- కౌన్తేయ- ప్రకృతిం- యాన్తి- మామికామ్- కల్పక్షయే- పునః- తాని- కల్పాదౌ- విసృజామి- అహమ్ ॥ ॥౭॥

ప్రతిపదార్థము:— హే కౌన్తేయ!=ఓకుంతీపుత్రుడవగు యర్జున!; సర్వభూతాని=నిఖిలభూతములు; కల్పక్షయే=ప్రలయ కాలమునందు; మామికాం=నాసంబంధమైన; ప్రకృతిం=త్రిగుణాత్మక మైనయపరా ప్రకృతిని; యాన్తి=పొందుచున్నవి; కల్పాదౌ=కల్పాదియందు; తాని=ఆభూతములనే; పునః=తిరిగి; అహం=నేను; విసృజామి=పుట్టించుచుంటిని. ॥౭॥

శాంకరభాష్యమ్:—

ఏవం వాయు రాకాశ ఇవ మయి స్థితాని సర్వభూతాని స్థితికాలే తాని — సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం త్రిగుణాత్మికా మపరాం నికృష్టాం యాంతి మామికాం మదీయాం కల్పక్షయే ప్రళయకాలే । పున ర్భూయ స్తాని భూతా న్యుత్పత్తికాలే కల్పాదౌ విసృజామ్యుత్పాదయా మ్యహం పూర్వవత్ ॥ ॥౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆకాశమునందు వాయ్వాదికమువలె స్థితికాలమునందు సర్వభూతములు పరమేశ్వరుని యందే యున్నచో ప్రళయకాలమునందు పరమేశ్వరునికంటె యన్యత్ర యుండవలసి యుండును. అని శంకింపజనదు. స్థితికాలమున పరమేశ్వరునియందు ఆకాశమునందువాయువు వలె నుండిన నిఖిలభూతములు ఓయర్జునా! ప్రళయకాలమునందు నాసంబంధ మైన త్రిగుణాత్మికయగు యపరాప్రకృతిని పొందుచున్నవి. కల్పాదియం దాభూతములనే తిరిగి నేను పూర్వమునందువలె పుట్టించుచుంటిని. ॥౭॥

వృత్తికై యీవిశేషణము చెప్పబడెను.) పరమమహత్పరిమాణముకలవాడై, "యథాకాశస్థితో నిత్యం" యెల్లప్పుడు యెట్లు స్వకారణమగు నవ్యాకృతాకాశమునందున్నవాడై, (ఇట "నిత్యం" అను విశేషణముచే గాలత్రయమునందు నాసూత్రాత్మకు ఆకాశసంబంధము చెప్పబడెను.) అట్లే "సర్వాణి భూతాని" ఉపాధినిష్కృష్టత్వంపదార్థరూపమగు చేతనవర్గము నాయందున్న దని తెలిసికొనుము. ఎట్లు కార్యభూతమగు సర్వము నుత్పత్తికి బూర్వము, నాశానంతరము, మధ్యకాలమునను స్వకారణమునందే యభేదముతో నుండునో యట్లే జీవవర్గము సర్వము ఉత్పత్తికి ప్రాక్కాలమునను, నాశానంతరమునను, మధ్యకాలమునను (ఘటాకాశము మహాకాశముకంటె వేరు కానటుల) కాలత్రయమునందును పరబ్రహ్మముకంటె వేరు కాక యుండునని యర్థము. ఈజీవబ్రహ్మభేదకథనముచే "స్వభావోఽధ్యాత్మ ముచ్యతే" అని పూర్వమునందు చెప్పబడిన యాజీవబ్రహ్మైక్యమే యిట వివరింపబడెను. ॥౬॥

—• ౯వ అధ్యాయము ౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఉత్పత్తికాలమునందును, స్థితికాలమునందును కల్పితమైన ప్రపంచముతో నసంగమైన యాత్మకు యసంశ్లేషనుచెప్పి, ప్రలయమునందుగూడ యాత్మకు భూతసంశ్లేషము లేదని "సర్వభూతాని" అను శ్లోకముచే జెప్పుచుండెను.

గీ॥ ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః ।
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్ ॥ ॥౮॥

పదవిభాగము:— ప్రకృతిం- స్వాం- అవష్టభ్య- విసృజామి- పునః- పునః- భూతగ్రామం- ఇమం- కృత్స్నం- అవశం- ప్రకృతేః- వశాత్ ॥ ॥౮॥

ప్రతిపదార్థము:—స్వాం=స్వకీయమైన; ప్రకృతిం=ప్రకృతిని; అధిష్ఠాయ=స్వాధీనమొనరించుకొని; అవశం=అస్వతంత్రమైన; కృత్స్నం=సమస్తమైన; ఇమం=ఈ; భూతగ్రామం=భూతసముదాయమును; ప్రకృతేర్వశాత్=స్వభావవశమువలన; పునఃపునః=మాటిమాటికి; విసృజామి=సృష్టించుచుంటిని. ॥౮॥

శాంకరభాష్యమ్:—

ఏవ మవిద్యాలక్షణామ్— ప్రకృతిం స్వాం స్వీయా మవష్టభ్య వశీకృత్య విసృజామి పునః పునః ప్రకృతితో జాతం భూతగ్రామం భూతసముదాయ మిమం వర్తమానం కృత్స్నం సమగ్ర మవశ మస్వతంత్ర మవిద్యాదిదోషైః పరవశీకృతం ప్రకృతే ర్వశా త్స్వభావవశాత్ ॥౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇట్లవిద్యారూపమైన నాసంబంధమగు ప్రకృతిని స్వాధీన మొనరించుకొని ప్రకృతివలన జనించినట్టియు, యస్వతంత్రమైనట్టి వర్తమానమైన యీనిఖిల భూతగ్రామమును

ప్రలయకాలమునందు నిఖిలభూతములు నాశక్తిగ కల్పింబడినదియు, త్రిగుణాత్మకము, సర్వభూత కారణము నగు బ్రకృతిని పొందుచున్నవి. అనగా ప్రకృతియందే సూక్ష్మరూపముచే లీన మగుచున్నవి. సృష్ట్యాదియందు ప్రకృతియం దవిభాగముగ నుండిన యాభూతములనే సర్వజ్ఞుడను, సర్వశక్తులుకల నేను విభాగముతో వ్యక్తపరచెదను. ॥౭॥

శంకరానందీయము:— ఆకాశమునందు వాయువునకు స్థితివలె, తనయందు నిఖిలభూతములకు స్థితిని చెప్పి, తనయందే (పరమాత్మయందే) లయమును, ఉత్పత్తిని "సర్వభూతాని" అను శ్లోకముచే జెప్పుచుండెను.

"అవ్యక్తా ద్వ్యక్తయః" అను శ్లోకముచే పూర్వమునందు భూతములకు దైనందినప్రలయాదికము చెప్పబడెను. ఈశ్లోకముచే ప్రాకృతప్రలయాదికము జెప్పబడుచుండెను. నాయందున్నట్టి ఆకాశాదినిఖిల భూతములు బ్రహ్మకల్పమునశింప (అనగా బ్రహ్మప్రళయము ప్రాప్తింప) త్రిగుణాత్మికము, నాసంబంధిని యునగు "మాయాం తు ప్రకృతిం విద్యాత్" అను శ్రుతిసిద్ధమైన, అపరాప్రకృతిరూపమైన మాయను తమఉత్పత్తికి వ్యుత్క్రమముగ పొందుచున్నవి. అనగా ప్రకృతియం దాకాశాది నిఖిలభూతములు లయించుచున్నవి. అట్లు లయించిన భూతములనే బ్రహ్మకల్పాదియందు తిరిగి నేనే స్వప్రకృతిద్వారమున యథాలక్షణముగ జగద్రూపముగ పుట్టించుచుంటిని. ॥౭॥

—• ౯వ అధ్యాయము ౮వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పరమేశ్వరున కీసృష్టి యెందులకు? సర్వసాక్షిచైతన్య

శాంకరభాష్యతత్త్వబోధిని:—
(అనగా నవిద్యాదిదోషములచే పరవశీకృతమైన భూతసముదాయమును) స్వభావవశమున మాటిమాటికి సృష్టించుచుంటిని. ॥౮॥

మాత్రస్వరూపమైన పరమేశ్వరునకు భోక్తృత్వమే సంభవింపనందునను, అట్టివానికి స్వభోగార్థమే యన్నచో పరమేశ్వరునకు సంసారిత్వప్రాప్తిచే యీశ్వరత్వమునకే భంగముప్రాప్తించుటవలనను, పరమేశ్వరభోగార్థము సృష్టి యని యనుట సంభవింపదు. ఈశ్వరుడే సర్వత్ర జీవరూపముచే నుండుటవలన చేతనాంతరము లేమింజేసి అచేతనమునకు భోక్తృత్వ మసంభవముగాన "మరియొకచేతనునిమిత్త మీసృష్టి" అని చెప్పుటయు పొసగదు. బంధమే లేనందునను, అపవర్గవిరోధి యగుటవలనను సృష్టి భోగార్థము కాకున్నను అపవర్గా(మోక్షా)ర్థమని చెప్పుటయు పొసగదు. సృష్టి భోగార్థమని కాని, అపవర్గార్థమని కాని చెప్పుటకు వీలులేనందున సృష్టికి మాయామయత్వము సిద్ధము. కనుకనే మాకు ప్రతికూలము కాదు, పరిహరింపదగినదియు కాదను యభిప్రాయముచే సృష్టి మాయామయమగుటవలన మిథ్య యని చెప్పుటకై "ప్రకృతిం స్వాం" అని మూడు శ్లోకములచే ప్రారంభించుచుండెను.

అనిర్వచనీయము, పరమేశ్వరునియందు కల్పితము నగు మాయ యను పేరుగల మూలప్రకృతిని "అవష్టభ్య" పరమేశ్వరసత్తాస్ఫూర్తులచే దృఢమొనరించి, యామాయావశమున అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము, కారణము, ఆవరణ, విక్షేపము వీటి స్వరూపశక్తిప్రభావములచే అవశము, పరవశీభూతము, జాయమానము, సర్వప్రమాణసన్నిధాపితము నగు ఆకాశాదిభూతసముదాయమును నేను మాయావివలె మాటిమాటికి అనేకవిధములుగ స్వప్నద్రష్ట స్వప్నప్రపంచమునువలె, కల్పనామాత్రముచే సృజించుచుంటిని. ॥౮॥

శంకరానందీయము:— "య ఏకో వర్ణో బహుధా శక్తియోగా ద్వర్ణా ననేకా న్నిహితార్థో దధాతి। విచైతి చాన్తే విశ్వ మాదౌ స దేవః స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు" అను శ్రుతివలన పరమాత్మ స్వయముగ కూటస్థాసంగచిద్రూపుడైనను, స్వోపాధిధర్మమైన భూతసృష్ట్యాదికమును స్వధర్మమునుగ నిర్దేశించుచుండెను. ఈపరమాత్మయే జగదుత్పత్తిస్థితిలయకర్త, సర్వవిత్తు, మోక్షప్రదాతయు నగుపరమాత్మ నారాధించి మేము కృతార్థుల మైతిమి అని ముముక్షువులు సగుణమునుపాసించుగాక, అని సూచించుటకును, కొందరు జగత్తు అనీశ్వర మని చెప్పుచుండిరి. అట్టివారల మతమును నిరసించుటకును "ప్రకృతిం" అని చెప్ప మొదలిడెను.

మాయయనెడి స్వోపాధిభూతమగు శుద్ధసత్త్వాత్మిక మగు ప్రకృతిని స్వీకరించి పరమేశ్వరుడ నగు నేను అవిద్య, అస్మిత, అభినివేశ, రాగ ద్వేషాత్మక మగు ప్రకృతియొక్క స్వభావమువలన నస్వతంత్రము. అనాదిసంసారవాసనాగ్రస్తము నగు నీపరిదృశ్యమానమైన దేవతిర్యగాది స్వరూపమగు నిఖిలప్రాణిజాతమును సంహరించి, తిరిగి తిరిగి సృష్టించెదను. అనగా అట్టి ప్రాణుల కర్మానురూపముగ నానా యోనులయందు పుట్టించెదను. ఈచెప్పుటచే ప్రాణులకర్మ జన్మమునుగూర్చి నిమిత్తకారణమనియు, పరమేశ్వరుడే స్రష్ట, భర్త, సంహర్త, నేతయనియు, నాతనికంటె నితరు డెవడును లేడని సూచింపబడెను. ఈవిషయమునే "ఏష సర్వేశ్వరః భూతానాం" అను శ్రుతియు బోధించుచున్నది. ॥౮॥

గీ॥ న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ! ।
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు॥ ॥౯॥

పదవిభాగము:— న- చ- మాం- తాని- కర్మాణి- నిబధ్నన్తి- ధనంజయ- ఉదాసీనవత్- ఆసీనం- అసక్త - తేషు- కర్మసు ॥ ॥౯॥

ప్రతిపదార్థము:— హేధనంజయ!=ఓయర్జున! ; తాని= భూతసముదాయముయొక్క విషమసృష్టికి హేతువగు; కర్మాణి=ధర్మాధర్మరూపమగు కర్మలు; ఉదాసీనవత్=ఉదాసీనుడువలె; ఆసీనం= ఉన్నట్టియన్ని; తేషు= ఆ; కర్మసు=ధర్మాధర్మకర్మలయందు; అసక్తం= నేనుచేయుచుంటి నను యభిమానము లేనట్టి; మాం=నన్ను; న నిబధ్నన్తి చ= బంధింపవు. ॥౯॥

---

శాంకరభాష్యమ్:—

తర్హి తస్య పరమేశ్వరస్య భూతగ్రామం విషమం విదధత స్తన్నిమిత్తాభ్యాం ధర్మాధర్మాభ్యాం సమ్బన్ధ స్స్యా దితీద మాహ భగవాన్ — న చ మా మీశం తాని భూతగ్రామస్య విషమవిసర్గనిమిత్తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ । తత్ర కర్మణా మసంబద్ధత్వే కారణ-

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రకృతవశు, స్వభావమువలన నవిద్యాతంత్రము నగు నీభూతసముదాయమును విషమముగ సృష్టించు పరమేశ్వరుడ వగు నీకు అట్టివిషమసృష్టికి హేతువగు ధర్మాధర్మముల సంబంధము ప్రాప్తించెడిని. అట్లయిన ననీశ్వరత్వము నీకు ప్రాప్తింపవలవచ్చు నను శంకను తొలిగించుటకు శ్రీకృష్ణపరమాత్మ "న చ మాం" అని చెప్పుచుండెను.

ఓయర్జున! ఈశ్వరుడ నగు నన్ను భూతసముదాయముయొక్క విషమసృష్టికి హేతువగు ధర్మాధర్మరూపకర్మలు బంధింపవు. పరమేశ్వరునకు ధర్మాధర్మరూపకర్మల సంబంధము లేకుండుటకు కారణమును "ఉదాసీనవదాసీనం" అను యుత్తరార్థముచే చెప్పుచుండెను. ఎట్లుదాసీనుడు (ఉపేక్షకుడు) ఒకానొకడు యిరువురు తగవుపడుచుండ యేపక్షము నాశ్రి

---

—• ౯వ అధ్యాయము ౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మాయావిచేవలె, స్వప్నద్రష్టచేతనుఃలె, నాచే చేయబడు సృష్టిస్థితిప్రళయములు మిథ్యాభూతము లగుటవలన నిగ్రహానుగ్రహములచే నన్ను సుకృతదుష్కృతములు కలవానినిగ చేయవు. ఈశ్లోకమున ("ధనంజయ" అను సంబోధనముచే యుధిష్ఠిర రాజసూయయాగము నిమిత్తము నిఖలరాజులను జయించి ధనమును తీసుకొనివచ్చినవాడ వగుటవలన నీవు గొప్పప్రభావము కలవాడవని అర్జునుని ప్రోత్సహించెనని సూచింపబడెను.) ఆకర్మ లెందులకు నిన్ను బంధింపవనెదవా? లోకమున యిద్దరు కొట్లాడుచుండ నుదాసీనుడు వారల జయపరాజయములతో సంబంధము లేనివాడై, తత్కృతహర్షవిషాదములు లేనివాడై యుండును. అట్టి యుదాసీనుడువలె నిర్వికారుడనై యుండుటవలన సృష్ట్యాది కర్మలయందు "అహం కరోమి" అనెడి యభిమానరూపమైన సంగతి లేని నన్ను కర్మలు బంధింపవు. అని చెప్పుటయుక్తమే. దార్ష్టాంతికమున వివాద పొందువారల లిరువురు లేకున్నను ఉపేక్షత్వమాత్రసాధర్మ్యమే గ్రహింపవలెను. ఈచెప్పుటచే యితరునకుగూడ కర్తృత్వము, ఫలసాంగత్యము లేనిచో వానినిగూడ

శాంకరభాష్యమ్:—

మాహ— ఉదాసీనవ దాసీనం యథోదాసీన ఉపేక్షకః కశ్చి త్తద్వ దాసీన మాత్మనోఽవిక్రియ త్వా దసక్తం ఫలాసంగరహిత మభిమానవర్జిత మహం కరో మీతి తేషు కర్మసు । అతోఽన్య స్యాపి కర్తృత్వాఽభిమానాభావః ఫలాసంగాభావ శ్చాబన్ధకారణ మన్యథా కర్మభి ర్బధ్యతే మూఢః కోశకారవ దిత్యభిప్రాయః ॥ ।౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యింపక వారల హర్షవిషాదసంబంధము లేనిచూడగునో యట్లే నేనును యవిక్రియుడ నగుట వలన యుదాసీనునివలె నున్నవాడను. ఆకర్మలయందు ఫలసంగరహితుడను. మరియు నేను చేయుచుంటి నను యభిమానము లేనివాడను. కాన నాకర్మలు నన్ను బంధింపవు. అందు వలన యితరుడుగూడ కర్తృత్వాభిమానము, ఫలాభిసంధి లేనివా డగుచో నట్టివానిని గర్మలు బంధింపవు. అట్లు కానిచో పట్టుపురుగువలె మూఢుడు కర్మలచే బంధింపబడు నని యభి ప్రాయము. ॥౯॥

కర్మలు బంధింప నేరవని సూచితమయ్యెను. కర్తృత్వము, ఫలసాంగత్యము నున్నచో పట్టుపురుగువలె యట్టి మూఢుడు కర్మలచే బంధింపబడునని యభిప్రాయము. ॥౯॥

శంకరానందీయము:— నానాయోనులయందు భూతసముదాయమును పుట్టించునట్టియు, మాటిమాటికి సంహరించునట్టియు, స్వర్గమును నరకమునుపొందించునట్టి నీకును పుణ్యాపాపసంబంధము కల దను శంకపై ఈభూతముల సంహారము, సృష్టి, సుఖదుఃఖాదిఫలమును పొందించుట, మొదలగు యీసర్వము ప్రకృతివలననే సంభవించుచున్నది. కాని నావలన కాదు. కాన నవిక్రియుడను, అసంగుడను, నవ్యక్త మూర్తినియగు నాకు తత్కర్మలేశసంబంధము వస్తుతః కొంచమైనను లేదు. అని ప్రకృతికర్తృకములగు సృష్ట్యాదులయందు తనకు (పరమాత్మకు) అసంగతోదాసీనత్వములను "నచ" అను శ్లోకముచే జెప్పుచుండెను.

చకారము "తు" అనుశబ్దార్థమునందు ప్రయుక్తము. ప్రకృతికర్తృకములైన భూతముల సృష్టి సంహారాదికర్మలు అసంగము, అవిక్రియము, కూటస్థము నగు పరమాత్మను బంధింపవు. పరమాత్మను స్పృశింప వని యర్థము. పరమాత్మకు కూటస్థత్వమునే "ఉదాసీనవత్" అనుదానిచే జెప్పుచుండెను. ప్రకృతికర్తృకములగు సృష్ట్యాది కర్మలయందు సక్తి లేనివాడను కనుకనే తటస్థుడువలె ప్రకృతితత్కార్యములకు సాక్షిగ దూరమునందుండిన నన్ను ప్రకృతికర్మలు స్పృశింపవు. ఈచెప్పుటచే ఉపాధి, తద్ధర్మ, తత్కర్మలయం దసక్తుడును, తత్సాక్షిగ నున్నట్టియు, ఆకాశమువలె నసంగము, నవిక్రియము నగు ఆత్మ నెవడు తెలిసికొనునో యట్టి బ్రహ్మవేత్త యగు యతి ఉపాధికర్తృకములైన విహితప్రతిషిద్ధములగు కర్మలచే బంధింపబడ డని సూచింపబడెను. ॥౯॥

భాష్యోత్కర్షదీపిక:— జీవుడు విషమస్వభావముకలవా డగుటచే నెట్లు కర్మలచే బంధింప బడుచుండెనో యట్లే దేవమనుష్యతిర్యగాదిరూపమగు విషమసృష్టిని జేయు నీకు వైషమ్య మవశ్యంభావి. కాన నట్టి నిన్ను ధర్మాధర్మాదికర్మ లెందులకు బంధింపవు? అని యాశంకించి, ఉదాసీనమగు కల్పవృక్ష మాయా పురుషునియొక్క యాయా కర్మజన్య తత్తత్సంకల్పానుసారియై ఆయాఫలోత్పత్తిని చేయుచుండ, ఆకల్ప వృక్షమును ఆయాకర్మ లెట్లు బంధించుటలేదో, అట్లే వీనికి శుభము నిచ్చెదను, వీనికి యశుభము నిచ్చెద

గీ॥ మయాఽధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్ ।
హేతునాఽనేన కౌన్తేయ! జగద్విపరివర్తతే ॥ ॥౧౦॥

పదవిభాగము:— మయా- అధ్యక్షేణ- ప్రకృతిః- సూయతే- సచరాచరం- హేతునా- అనేన- కౌన్తేయ- జగత్- విపరివర్తతే ॥ ॥౧౦॥

ప్రతిపదార్థము:— అధ్యక్షేణ=అధ్యక్షుడవైన; మయా=దృశిమాత్రస్వరూపమైన; యవిక్రియాత్మస్వరూపమగు నాచే; ప్రకృతిః=త్రిగుణాత్మకమైన యవిద్యాస్వరూపమగు మాయ; సచరాచరం=జంగమస్థావరాత్మకమగు జగత్తును; సూయతే=కనుచున్నది; అనేన=ఈయధ్యక్షత్వమనెడి; హేతునా=కారణముచే; హేకౌన్తేయ=ఓయర్జునా!; జగత్=చరాచరాత్మకమైన జగత్తు; విపరివర్తతే=జన్మస్థిత్యాద్యవస్థలయందు తిరుగుచున్నది. ॥౧౦॥

శాంకరభాష్యమ్:—

తత్ర భూతగ్రామ మిమం విసృజా మ్యుదాసీనవ దాసీన మితి చ విరుద్ధ ముచ్యత ఇతి తత్పరిహారార్థ మాహ — మయా సర్వతో దృశిమాత్రస్వరూపే ణాఽవిక్రియాత్మనాఽధ్యక్షేణ మమ మాయా త్రిగుణాత్మికాఽవిద్యాలక్షణా ప్రకృతిః సూయత ఉత్పాదయతి సచ

శాంకరభాష్యతత్త్వబోధిని: —

"భూతగ్రామ మిమం విసృజామి" ఈభూతగ్రామమును సృష్టించుచుంటిని అని "ఉదాసీనవదాసీనః" ఉదాసీనుడువలె యున్నట్టి పరమేశ్వరునియందు సృష్టికర్తృత్వమును, ఉదాసీనస్థితిని చెప్పుట విరుద్ధము. అట్టి విరోధమును పరిహరించుటకొఱకు "మయా" అని చెప్పుచుండెను.

నను తత్తచ్ఛుభాశుభదానాత్మకమగు సక్తిలేనివాడనగు నన్ను కర్మలు బంధింపవని "నచ" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ధర్మరాజు రాజసూయయాగమునకై ధనమును సేకరించుటకు ప్రవృత్తుడవైన నీచేఁనచటచట చేయబడిన నిగ్రహానుగ్రహాదికర్మలు యెట్లు నిన్ను బంధింపలేదో అట్లే యీశ్వరుడనగు నన్నును భూతసముదాయసంబంధమైన విష్టంభ, విసర్గనిమిత్తమైన కర్మలు బంధింపవు అని తెల్పుటకై "ధనంజయ" అని సంబోధించెను. కర్మలు నన్ను బంధింపవనుటకు హేతువును "ఉదాసీనవదాసీనం" అను దానిచే జెప్పెను. ఈచెప్పుటవలన ఫలాసక్తిరహితుడగు "నేను చేయుచుంటిని." అను యభిమానములేనివానికి ఆకర్మలచే బంధములేదు. కాన, యితరునకుగూడ ఫలాసక్తికర్తృత్వాభావములు బంధము లేకుండుటకు హేతువులు. అట్లు కానిచో పట్టుపురుగువలె మూఢుడు కర్మలచే బంధింపబడును అని యభిప్రాయము. ॥౯॥

నీలకంఠీయము:— విషమసృష్టిని జేయు నీకు వైషమ్య, నైర్ఘృణ్యములు ప్రాప్తింపవా? అను యాశంకపై జెప్పుచున్నాడు.— "న చ మాం......ధనంజయ!" ఓయర్జునా! ఆవిషమసృష్ట్యాది కర్మలు నన్ను బంధింపజాలవు. కారణ మేమందువా! "ఉదాసీన......కర్మసు" ఎట్లు జీవనదాతయగు మేఘము కొన్నిబీజములయందు రాగమును, మరికొన్ని బీజములయందు ద్వేషమును జేయక యుదాసీనుడై వర్షించునో అట్లే నేనును (ఈశ్వరుడు) పుణ్యవంతులయెడ రాగమును, పాపాత్ములయెడ ద్వేషమును వహింపక జగత్తును సృజించెదను. వారివారి యసాధారణకర్మబీజవశమున వారు ఆయావిభిన్నఫలము ననుభవించెదరు. కాన యీశ్వరునకు వైషమ్యనైర్ఘృణ్యములు లేవని యర్థము. ॥౯॥

శాంకరభాష్యమ్:—

రాచరం జగత్ । తథా చ మంత్రవర్ణః — "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా । కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణ శ్చ ॥" ఇతి హేతునా నిమిత్తేనాఽనేనాధ్యక్షత్వేన కౌంతేయ! జగ త్సచరాచరం వ్యక్తాఽవ్యక్తాత్మకం విపరివర్తతే సర్వావస్థాసు । దృశికర్మత్వాపత్తినిమిత్తా హి జగత స్సర్వా ప్రవృత్తి రహ మిదం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దృశిమాత్రస్వరూపుడను, అవిక్రియాత్మస్వరూపుడను, అధ్యక్షుడనునగు నాచే నాసంబంధమైన త్రిగుణాత్మకము, అవిద్యాస్వరూపము నగు మాయ జంగమస్థావరాత్మక మగు జగత్తును కనుచున్నది. ఈవిషయమునే "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా । కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అను మంత్రము బోధించుచున్నది. ఓయర్జునా! యీయధ్యక్షత్వ మనెడి హేతువుచేతనే జంగమస్థావరాత్మక నిఖిలప్రపంచము జన్మస్థితిలయావస్థలయందు తిరుగుచున్నది.

—• ౯వ అధ్యాయము ౧౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "భూతగ్రామ మిమం విసృజామి" (ఈభూతసముదాయమును సృజించుచుంటిని.) అని చెప్పి, "ఉదాసీనవదాసీనం" ఉదాసీనుడువలె యుంటిని అని చెప్పుట విరుద్ధము. ఉదాసీనుడువలె నుండువానికి భూతగ్రామమును సృష్టించుట యెట్లు సంభవించును? భూతగ్రామము సృష్టించువాడు ఉదాసీనుడువలె నుండుట యెట్లు? యీరెండును విరుద్ధములు. అట్లు సంభవింపని యారెంటిని పరమేశ్వరునియందు చెప్పుట విరుద్ధము కాదా! యను శంకను పరిహరించుటకొఱకు తిరిగి జగత్తునకు మాయామయత్వమునే "మయాఽధ్యక్షేణ" అను శ్లోకముచే స్పష్టపరచుచుండెను.

దృశిమాత్రస్వరూపుడను, అవిక్రియుడను, అధ్యక్షుడను, నియంతను, భాసకుడను నగు నాచే నవభాసితమై, సత్త్వాసత్త్వములచే ననిర్వాచ్యమైన త్రిగుణాత్మక మగు మాయ- మాయావిచే నధిష్ఠితమైన (ప్రసారితమైన) మాయ కల్పితగజతురగాదికమునువలె జంగమస్థావరాత్మక మగు జగత్తును పుట్టించుచున్నది. నేనన్నో సకార్యమాయాభాసనమును విడచి యితరమగు నేవ్యాపారమును జేయను. ఓకౌన్తేయ! నిమిత్తమగు యీఅధ్యక్షత్వహేతువుచే జంగమస్థావరాత్మక మగు జగత్తు "విపరివర్తతే" జన్మాదివినాశాంతవికారజాతము నెల్లపుడు పొందుచున్నది. కాన భాసకత్వమాత్రవ్యాపారముచే సృష్టించుచుంటిని. అని చెప్పబడెను. ఇంతమాత్రముచే సూర్యునికివలె కర్తృత్వము లేమింజేసి "ఉదాసీనవదాసీనం" ఉదాసీనుడువలె యుండువాడనని చెప్పుటయం దేమియు విరోధము లేదు. "ఈవిషయమే" అస్య త్రైవ తేంద్రజాలస్యయదుపాదానకారణమ్ । అజ్ఞానం తదుపాశ్రిత్య బ్రహ్మ కారణముచ్యతే' అనుదానిచే జెప్పబడెను. ॥౧౦॥

శంకరానందీయము:— పూర్వశ్లోకమున గర్మలు ప్రకృతికర్తృకములనియు, వానిసంగము పరమేశ్వరునకు లేదనియు, బరమేశ్వరు డుదాసీనుడనియు జెప్పబడెను. దానినే యీశ్లోకమున స్పష్టపరచుచుండెను.

రాజువలె యెవనియొక్క సన్నిధిమాత్రముచేతనే ప్రధానాదుల ప్రవృత్తి సంభవించుచున్నదో, వాడధ్యక్షు డనబడును. అట్టి యధ్యక్షుడను, సాక్షిని, కూటస్థాసంగచిద్రూపుడను అగు నాచే ప్రకృతి

శాంకరభాష్యమ్:—

భోక్ష్యే పశ్యామీదం శృణోమీదం సుఖమనుభవామి దుఃఖమనుభవామి తదర్థమిదం కరిష్యే ఏతదర్థమిదం కరిష్యే ఇదం జ్ఞాస్యామీత్యాద్యాఽవగతినిష్ఠాఽవగత్యవసానైవ। "యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్" ఇత్యాదయశ్చ మన్త్రా ఏతమర్థం దర్శయన్తి। తత

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"నేను దీనిని భుజింపగలను, దీనిని చూచుచుంటిని, దీనిని వినుచుంటిని, సుఖము ననుభవించుచుంటిని, దుఃఖము ననుభవించుచుంటిని, దీనినిమిత్తము దీనిని చేయుచుంటిని, దీనినిమిత్తము దాని నాచరించగలను, దీనిని తెలిసికొనగలను." అనునిత్యాద్యవగతినిష్ఠము, అవగత్యవసానము నగు జగత్తుయొక్క నిఖిలప్రవృత్తి దృశికర్మత్వాప్తినిమిత్తమైనది. "యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్" ఇత్యాదిమంత్రములు పైయర్థమునే బోధించుచున్నవి. (ఈశ్వరుప్రవృత్తి హేతువగు నాచే) యుపహితమై ప్రకృతియే జంగమస్థావరాత్మక నిఖిలజగత్తును కనుచున్నది; స్థాపనచేయుచున్నది; సంహరించుచున్నది. నేనైతే ప్రకృతిప్రవృత్తికి సాక్షిమాత్రుడను. స్వప్రకృతి కారణమైన సాక్షియగు నాయొక్క సన్నిధిమాత్రరూపమగు హేతువు చేతనే వ్యక్తాది స్థూలాంతమైన సమష్టివ్యష్ట్యాత్మక నిఖిలజగత్తు "విపరివర్తతే" అంతట చలించుచున్నది. సర్వసాక్షియగు సూర్యుని సాన్నిధ్యమాత్రముచే తత్ప్రకాశబలముచే సర్వప్రాణులకు ప్రవృత్తినివృత్తులు సిద్ధించుచున్నట్లు సర్వసాక్షినగు నాయొక్క (పరమాత్మయొక్క) సాన్నిధ్యమాత్రముచే, తత్ప్రకాశబలముచే దేహేంద్రియప్రాణ మనోబుద్ధ్యాదులకు స్వవిషయములందు ప్రవృత్తినివృత్తులు, ఇష్టానిష్టసుఖదుఃఖాది జ్ఞానము సిద్ధించుచున్నది. నేను చేయునదింతమాత్రమే. కూటస్థాసంగచిద్రూపమూర్తినగు నాకింతకంటె వేరుగ కర్తృత్వముగాని, కారయితృత్వముగాని, భోక్తృత్వముగాని, భోజయితృత్వముగాని, దాతృత్వముగాని, దాపయితృత్వముగాని లేదని యాశయము.

॥౧౦॥

భాష్యతత్త్వదీపిక:— "భూతగ్రామమిమం కృత్స్నం విసృజామి" ఈనిఖిలభూతములను సృజించుచుంటిని, "ఉదాసీనవదాసీనం" ఉదాసీనునివలె నుంటిని. అని చెప్పుట విరుద్ధము. యనుశంకను "మయా" అనుశ్లోకముచే తొలగించుచుండెను. చేతనస్వరూపము, సర్వవిక్రియాశూన్యము, స్వామియు, సన్నిధిమాత్రముచే సత్తాస్ఫూర్తిప్రదానముచేత ప్రవర్తకుడను అగు నాచే నను ప్రకృతి- జంగమస్థావరాత్మకము, వ్యక్తావ్యక్తాత్మకము నగు జగత్తును కనుచున్నది. త్రిగుణాత్మకము, అవిద్యాస్వరూపము, మాయాశబ్దవాచ్యము, అనిర్వచనీయము ప్రవర్తితమైనదియు, "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా। కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" మూర్తిత్రయస్వరూపముచే నగుభేదముయొక్క వ్యావృత్తినిమిత్తము "ఏకః" అని ఈవిషయమునే శ్రుతియందు చెప్పబడెను. జాడ్యవ్యావృత్తినిమిత్తము "దేవః" అనియు, ఆదిత్యునివలె తాటస్థ్యమును తొలగించుటకు "సర్వభూతేషు గూఢః" అనియు, బుద్ధ్యాదులవలె పరిచ్ఛిన్నత్వమును తొలగించుటకొఱకు "సర్వవ్యాపీ" అనియు, ఆకాశమువలె అనాత్మత్వమును వారించుటకై "సర్వభూతాంతరాత్మా" అనియు, జీవునివలె కర్మపరాధీనత్వమును నివారించుటకై "కర్మాధ్యక్షః" అనియు, కర్మలయొక్క ఫలప్రదానముకొఱకై "ప్రవర్తకః" అనియు, కేవలము కర్మాధ్యక్షుడే కాడు. సర్వాధిష్ఠానము,

శాంకరభాష్యమ్:—

శ్చైకస్య దేవస్య సర్వాధ్యక్షభూతచైతన్యమాత్రస్య పరమార్థత స్సర్వభోగానభిసంబంధినోఽన్యస్య చేతనాంతరస్యాభావే భోక్తు రన్యస్యాభావా త్కిం నిమిత్తేయం సృష్టి రిత్యత్ర ప్రశ్నప్రతివచనే

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నకు సాక్షిత్వమాత్రముచే స్రష్టృత్వమాత్రము ప్రాప్తింప ఫలితమును శ్రీమద్భాష్యకారులు "తతశ్చ" అనువాక్యముచే జెప్పుచుండెను.) పరమాత్మ పరమార్థము గ భోగసంబంధము లేనివాడగుటవలనను, తాను సర్వసాక్షిభూతచైతన్యమాత్రు డగుటవలనను, ఈశ్వరు డొక్కడే

కర్మలకు సాక్షియు నని చెప్పుటకై "సర్వభూతాధివాసః" అనియు అనగా సర్వభూతములయందు సత్తాస్ఫూర్తిప్రదానముకొఱకై సన్నిహితుడనియు అర్థము. లేదా ఎవనియందు నిఖిలభూతములు అధివసించునో వాడు సర్వభూతాధివాసు డని చెప్పబడును. దర్శనకర్తృత్వమును నివారించుటకు "చేతాః" అనియు, విజాతీయభేదము లేదని చెప్పుటకు "కేవలః" (అద్వితీయుడు) అనియు స్వగతభేదమును నివారించుటకు "నిర్గుణః" అనియు, ఈశ్రుతియందు చెప్పబడెను. కాన సూర్యునివలె ప్రకృతియందు సత్తాస్ఫూర్తియొక్క ప్రదానముచే జగత్కర్తృత్వ ముండినను ఉదాసీనత్వ మవిరుద్ధ మని భావము.

ఈఅధ్యక్షత్వ మనెడి నిమిత్తముచే జంగమస్థావరాత్మకమైన నిఖిలజగత్తు "విపరివర్తతే" విపరిణామమును పొందుచున్నది. జాగ్రదాదిసర్వావస్థలయందు, బాల్యాదులయందు "నేను దీనిని భుజించగలను. దీనిని చూచుచుంటిని. దీనిని వినుచుంటిని. దీని స్పృశించుచుంటిని, దీనిని ఆస్వాదన చేయుచుంటిని. దీని నాఘ్రాణించుచుంటిని. ఈసుఖదుఃఖముల ననుభవించుచుంటిని. ఈసుఖదుఃఖముల నిమిత్తము ఈధర్మాధర్మస్వరూపమగు కర్మను చేయగలను" అను నిట్టినిఖిలప్రవృత్తి చేతనవ్యాప్తినివిడచి జగత్తునకు సంభవింపదు. ఈవిషయమున "యోఽస్యాధ్యక్షః పరమే వ్యోమన్" ప్రత్యక్షాదిసన్నిధాపితమైన ఈజగత్తునకు యెవడు సత్తాస్ఫూర్తిప్రదానముచే ప్రవర్తకుడో, సూర్యునివలె నిర్వికారుడో, ఎవడు ఉత్కృష్టమైన హార్దాకాశమునం దుండెనో వాడు దుర్విజ్ఞేయుడు అని బోధించుచున్నది.

ఈచెప్పుటచే తేలిన ఫలితమేమి? పరమేశ్వరుని కీసృష్టి యెందునిమిత్తము? అనగా తనభోగార్థమా? చేతనాంతరభోగార్థమా? లేక అచేతనార్థమా? లేక అపవర్గార్థమా?

అద్వితీయుడు సర్వప్రకాశకుడు సర్వాధ్యక్షభూతచైతన్యస్వరూపుడు, పరమార్థసద్రూపుడు, ఆప్తకాముడు, పూర్ణుడునగుపరమేశ్వరుడు సర్వభోగాస్పృష్టుడు గాన స్వభోగార్థ మను పక్షము సంభవింపదు. పరమేశ్వరవ్యతిరిక్తచేతనాంతరమే లేనందున "ఏకమేవాద్వితీయం" అనుశ్రుతిచొప్పున చేతనాంతరభోగార్థ మను ద్వితీయపక్షము నిరస్తము. అచేతనసత్వము నిరూపించుటకు శక్యము కానందున "నేహ నానాస్తి కించన" అను శ్రుతిననుసరించి అచేతనమునకు భోక్తృత్వము సంభవింపనందు "అచేతనార్థ మీసృష్టి" యను తృతీయపక్షము పరాస్తము. సృష్టి మోక్షవిరోధి కాన అపవర్గార్థ మను చతుర్థపక్షము దూరతో నిరస్తము. మరియు ఎవరియొక్క మోక్షార్థము యీసృష్టి? తనయొక్క మోక్షార్థమా? పరమోక్షార్థమా? తాను నిత్యముక్తుడగుటవలన తనయొక్క మోక్షముకొరకు సృష్టి అను ప్రథమపక్షము పరాస్తము. అన్యుడను వాడు నిరూపింపబడనందున అన్యునియొక్క మోక్షార్థము సృష్టి అను ద్వితీయపక్షము తొలగింపబడెను.

పరబ్రహ్మమునకు సృష్టి మాయానిబంధనమైయుండ చెప్పబడిన శంకల కవకాశము లేమింజేసి ప్రతివచనయోగ్యతే సంభవింపనందునపైశంకలు, తదనురూపమగు ప్రతివచనము యుక్తము కాదు.

శాంకరభాష్యమ్:—

అనుపపన్నే "కో అద్ధా వేద క ఇహ ప్రవోచ త్కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః" ఇత్యాది మంత్రవర్ణేభ్యః । దర్శితం చ భగవతా— "అజ్ఞానేనాఽఽవృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః" ఇతి ॥ ॥౧౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యగుటచే భోక్త యగు చేతనాంతరుడు లేనందునను, అచేతన మభోక్త యగుటవలనను, తద్విరోధి యగుటవలన సృష్టి కపవర్గార్థము కానందునను పరమాత్మకు సృష్టి మాయా నిబంధన మగుటవలనను పరమాత్మ కీసృష్టి యెందులకు? అను ప్రశ్నయు, ఆప్రశ్నకు సమా

మరియు మాయాసృష్టిని అంగీకరించునట్టియు, పరబ్రహ్మమునందు నానాభావము వాస్తవముగ సంభవింపదని చెప్పెడి ఉపనిషద్రహస్యవేత్తలమగు మాకిట్లు చెప్పుట యిష్టమే. "కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్ । కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః" పరమాత్మకు దుర్విజ్ఞేయత్వమును చెప్పుచు, పరమాత్మయందు సృష్టికర్తృత్వము నీశ్రుతి యాక్షేపించుచున్నది. పరమాత్మ యిదియే యని ఘటమునువలె యెవడు పరమాత్మస్వరూపమును తెలిసికొనును! అనగా యెవడును తెలిసికొనడని యర్థము. ఈసంసారమండలమునందు ఆపరమాత్మస్వరూపమును చెప్పువాడు రెవడు? ఎవడును లేడని యర్థము, ఎందువలననిన శుద్ధమైన పరమాత్మ యేశబ్దమునకుగూడ వాచ్యుడు కానందున, యెవడును పరమాత్మస్వరూపమును చెప్పలేడని యర్థము. ఈవిషయమునే "యతో వాచో నివర్తన్తే, అప్రాప్య మనసా సహ" అను శ్రుతియు బోధించుచున్నది.

అట్లగుచో బ్రహ్మజ్ఞానముకొఱకు శ్రవణాదులయందు ప్రవృత్తిబోధకమగు "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి। తరతి శోక మాత్మవిత్" ఇత్యాదిశ్రుతుల కప్రామాణ్యము ప్రాప్తించునని శంకింపజనదు. ఫలవ్యాప్తినిషేధద్వారమున అజ్ఞానమును తొలగించుటకొఱకై వృత్తివ్యాప్యత్వమును స్వీకరించుటచే పైదోషము సంభవింపనేరదు. శబ్దము సాక్షాత్తు బ్రహ్మమును బోధింపనేరదు. మరేమన:— అజ్ఞానమును తొలగించుటయందే ఆశబ్దమునకు అచింత్యమైన శక్తి కలదు. దేవదత్తుడు నిద్రించియుండ "హేదేవదత్త" అను శబ్దము యెట్లాదేవదత్తుని నిద్రనుండి మేల్కొలుపునో అటులనే "తత్త్వమసి"అనువాక్యముగూడ "నేను బ్రహ్మమును కాను" అను నజ్ఞానమును తొలగించును. ఈవిషయమే సురేశ్వరాచార్యులవారిచే "దుర్బలత్వా దవిద్యాయా ఆత్మత్వాద్బోధరూపిణః । శబ్దశక్తే రచిన్త్యత్వా ద్విద్మస్తం మోహహానతః ॥ అగృహీత్వైవ సంబన్ధ మభిధానాభిధేయయోః । హిత్వా నిద్రాం ప్రబుధ్యన్తే సుషుప్తే బోధితాఃపరైః ॥ జాగ్రద్వన్న యత శ్శబ్దం సుషుప్తే వేత్తి కశ్చన । ధ్వస్తేఽతో జ్ఞానతోఽజ్ఞానే బ్రహ్మాస్మీతి భవే త్ఫలం ॥ అవిద్యాఘాతిన శ్శబ్దా ద్యాహం బ్రహ్మేతి ధీ ర్భవేత్ । నశ్య త్యవిద్యయా సార్థం హత్వా రోగ మివౌషధమ్ ॥" అని చెప్పబడెను.

పరమాత్మ జగత్సృష్టికర్త యగుచో నతనికి జ్ఞేయత్వము ప్రాప్తించు నను శంకను తొలగించుటకై "కుతఆజాతా" అను శ్రుతి బయల్వెడలెను. కూటస్థ బ్రహ్మమునకు స్వతః సృష్టికర్తృత్వము సంభవింపనందునను, బ్రహ్మముకంటె నితరమగు వస్తువు లేనందునను యీవివిధసృష్టి దేనివలనను జనింపదని యర్థము.

అట్లగుచో "యతో వా ఇమాని భూతాని జాయన్తే. "యత స్సర్వాణి భూతాని భవన్త్యాదియుగాగమే" "జన్మాద్యస్య యతః" ఇత్యాదిశ్రుతిస్మృతిసూత్రముల కప్రామాణ్యము ప్రాప్తించునని శంకింప

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ధానమున్ను అనుపపన్నములే. ఈవిషయమే "కో అద్ధా వేద క ఇహ ప్రవోచ త్కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః" అను శ్రుతియు బోధించుచున్నది. ఈవిషయమే శ్రీకృష్ణపరమాత్మ "అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జంతవః" అను వాక్యముచే జెప్పుచుండెను. ॥౧౦॥

దగదు. పైవాటికి బ్రహ్మ జగత్సృష్టయని చెప్పుటయందు తాత్పర్యము కాదు. "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే" అను న్యాయమువలన బ్రహ్మయందు జగత్తును అధ్యారోపణజేసి తదపవాదచే నిష్ప్రపంచము బ్రహ్మ అని"యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాదివాక్యములచే విస్తరింపజేయబడుచుండెను. అట్లయిన "బ్రహ్మ నాస్తి" అను అసత్వాపాదకావరణమునివర్తించుటకై జగత్తునకు పరమాత్మనుండి ఉత్పత్త్యాదులు చెప్పుటచే తదత్యంతాసత్వము నిరపవాదమగుటవలన అధ్యారోపమునకు ప్రపంచాత్యంతాసత్వ ప్రతిపాదనయందే తాత్పర్యము. అట్లు కానిచో 'వాయువునందు రూపములేదు.' అనెడి అపవాదమాత్రముచే తేజస్సుయందు రూపసత్వమునకు అనపాయమువలన రూపమునకసత్వము సిద్ధింపదు. అట్లేబ్రహ్మయందు జగత్తు లేదు అను అపవాదమాత్రముచే ప్రధానాదికమునందు తత్సత్వము సంభవించెడిని. అట్టి సత్వము లేకపోవుటవలన అధ్యారోపాపవాదముల ననుసరించి నిష్ప్రపంచము బ్రహ్మమని విస్తరింపజేయబడెను.

అట్లగుచో మిథ్యాప్రపంచమునందు "ఇదముత్పన్నం, ఇదంనష్టం" (ఇదిపుట్టినది, ఇదినశించునది) అనెడి వైదికలౌకికవ్యవహారము ఎట్లు పొసగునదెవా? అనాద్యనిర్వచనీయమగు అజ్ఞానముచే కల్పితమైన ఈలౌకికజగత్తు అపవదించుటకు శ్రుతులచే అనువదింపబడుచుండెనని గ్రహింపుము. ఈవిషయమే "అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః" జ్ఞానము అజ్ఞానముచే ఆవరింపబడెను. అందుచే జీవులు మోహాబడుచుండిరి. అని చెప్పబడెను. ఇట అధ్యక్షు డగుపాండురాజుచే కుంతి నిన్ను ఎట్లు కనినదో అట్లే అధ్యక్షుడ నగు నాచే ప్రకృతి చరాచరాత్మక మగుజగత్తును కనుచున్నది. అని సూచించుటకు "కౌన్తేయ" అని సంబోధించెను. ॥౧౦॥

పరమార్థప్రప:— "మయా" అను శ్లోకముచే పూర్వోక్తవిషయమును చెప్పుచుండెను. అధ్యక్షుడనగునాచే ప్రకృతి చరాచరాత్మక మగునీవిశ్వమును గనుచున్నది. నేనే అధిష్ఠానమనెడినిమిత్తహేతువుచే ఈజగత్తు తిరిగితిరిగి జన్మించుచున్నది. నా సాన్నిధ్యమాత్రముచే నధిష్ఠాతృత్వము, కర్తృత్వము, ఉదాసీనత్వము అవిరుద్ధములని భావము. పుట్టుకలేనిదే (మిథ్యా)రజితము సంభవింపనటుల సత్యమగు ఆశ్రయము లేనిదే అసత్యమునకు అవస్థానము సంభవింపదు. రజితోత్పత్తిస్థితివినాశములను శుక్తిక స్పృశింపనటుల జగదుత్పత్తిస్థితివినాశములను సత్యమగు బ్రహ్మము స్పృశింపదని యర్థము. మొదట నిరూపింపబడిన యర్థము విషయమై ఋక్సాక్షియగుశ్రుతిసందర్భ మిట్లున్నది. "కిం స్విదాసీ దధిష్ఠాన మారమ్భణం కతమత్ స్విత్కథాసీత్ । యతో భూమిం జనయ న్విశ్వకర్మా విద్యా మౌర్ణో న్మహినా విశ్వచక్షాః ॥ నాస దాసీన్నో సదాసీ త్తదానీం నాసీ ద్రజో నో వ్యోమాపరో యత్ । కి మావరీవః కుహకస్య శర్మ న్నమ్భః కి మాసీ ద్గహనం గభీరమ్ ॥ న మృత్యు రాసీ దమృతం న తర్హి న రాత్ర్యా అహ్న ఆసీ త్ప్రకేతః । ఆనీదవాతం స్వధయా తదేకం తస్మా ద్ధాన్యం న పరః కిం చ నాస ॥ ఈపై ఋక్కులకు రావణభాష్య మిట్లున్నది— ప్రళయకాలమునందు జగత్తును సహరించి అనంతరమున దానిని సృష్టించు యిచ్ఛగలుగ ద్యావాపృథువుల

యొక్క ఉత్పాదన కాలమందు అధిష్ఠానము ఏమికలదు? యేమియు లేదని యర్థము. అట్లే ఉత్పాదన కారణము యొక్క ఉత్పాదన కాలమందు అధిష్ఠానము ఏమికలదు? యేమియు లేదని యర్థము. ఉత్పాదన కారణము సంభవించినను అది ఎట్టిది? సత్తా? లేక యేమి కలదు? అదియు లేదని యర్థము. ఉభయపక్షములు సంభవింపనేరవు. సత్త్వ మగుచో అద్వైతతత్త్వభంగము. అసత్త్వ మగుచో అసత్తా? అని యర్థము. ఉభయపక్షములు సంభవింపనేరవు. సత్త్వ మగుచో అద్వైతతత్త్వభంగము. అసత్త గుచో అసద్రూప మగుద్యావాపృథువులకు, ఉత్పాదన మనర్థము. "నాన్యత్కించన మిషతు" ఇత్యాది శ్రుతులవలన ఉత్పాదనము లేదని చెప్పబడుచుండెను. యే అధిష్ఠానమువలనను ఆరంభణమువలనను సర్వద్రష్ట యగుపరమేశ్వరుడు భూమిని పుట్టించుచుండెనో అట్లే ద్యులోకమును పుట్టించెను. దేనిచేతపుట్టించెను? తనమహిమచేతనే పుట్టించెను. ఈప్రశ్నోత్తరమును తెలుపునదియే "నాసత్" అను శ్రుతి. దీనిచే సృష్టికి పూర్వమునందు నిరస్తసమస్తప్రపంచలయావస్థ నిరూపింపబడుచుండెను. ప్రలయదశయందుండిన ఈజగత్తునకు మూలకారణ మేదియో అది శశవిషాణమువలె నిరుపాఖ్యము. (చెప్పదగినది కాదు.) అసద్రూపమగు కారణమువలన సద్రూపమగు జగత్తునకు ఉత్పత్తి సంభవింపనేరదు. అట్లే "నో సదాసీత్" పరమార్థసద్రూపమగు పరమాత్మకంటె ఇతరమగు సద్రూపము కలదనిన ద్వైతత్వప్రసక్తి సంభవించును. మున్ముందు వ్యవహారాభావము చెప్పబడుటవలన వ్యావహారసద్రూపము ఆరంభణకారణ మనియు చెప్పనొప్పదు. కాన సదసద్విలక్షణము, అనిర్వాచ్యము నగునదియే సృష్టికి పూర్వమునందు కలదని యర్థము.

"తదానీం" అను వాక్యముచే వ్యావహారికసత్త్వమును నిషేధించుచుండెను. "లోకో రజాం స్యుచ్యతే" అని యాస్కుడు చెప్పెను. ఇచట "లోకః" అను ఏకవచనము సామాన్యాపేక్షము. లోకములు రజోరూపములు. అనగా పృథివ్యాదులకు వ్యావహారికసత్త లేనందున సద్రూపములు కావని యర్థము. అట్లే అంతరిక్షము లేదు. ఆకాశముకంటె పైనుండు సత్యలోకాంతము యేలోకములు కలవో అవియు లేవు. ఈచెప్పుటచే బ్రహ్మాండమంతయు నిషేధింపబడెను. దేనివలన ఈభాసమానమగు భూతజాతము పూర్వము నందు లేదో, మరేమనిన శుక్తి కారజితమువలె మధ్యయందు జనించినదని శ్రుతిచే నిరూపింపబడెను. "నత్వాసీత్" అను ధాతువువలన "తదానీం" అను అవ్యయము భూతకాలమును చెప్పునదగుటవలన ఆకాశాదులు సంభవింపకున్నను యేదో యొకానొక కాలము సంభవించుననియు శంకింపజనదు. "అనీదవాతం" అను శ్రుతి కాలమునుగూడ నిషేధించుచున్నది. కాన దృశ్యమానమగు సకలజగత్తు పూర్వమందు నిరూపింపబడిన సదసద్విలక్షణము ఉపాదానముగా కలది, ప్రాతిభాసికము అని తేలిన యాశయము. ఈజగత్తునకు జ్ఞానైకనాశ్యత్వముచే ప్రాతిభాసికత్వమును దృఢీకరించుటకు "కి మావరీవః" అని చెప్పెను. పూర్వమందు జెప్పబడిన దృశ్యజాతము అబాధితమగు బ్రహ్మమునందు యేదైన ఆవరణకలదా? లేదు. అని యర్థము. ఈచెప్పుటచే యేసదసల్లక్షణముకలదో అది సాగ్ర్యమును మోహపెట్టదని చెప్పబడెను. అది యెట్లనిన మాయావియగు ఐంద్రజాలికునియొక్క గంభీరమైన అక్షోభ్యమగు అంభస్సు (ఉదకము) ఆమాయావిచే మాయచే రచింపబడిన అంభోమధ్యయందే ఉత్పన్నమైనదై ఐంద్రజాలికున కావరక మగునా? కాదని యర్థము. అట్టి సమయమునందు, కేవలస్వరూపమునందు జననమరణాత్మక మగు బంధము, మోక్షముకూడ లేదు. సూర్యుని యందు రాత్రిచే జ్ఞానము సంభవింపదు. "ఆసీత్" అట్టి సమయమున ఏకము, ప్రాణరహితము శుద్ధమునగు బ్రహ్మమే కలదు. ఈవిషయమునే "అప్రాణో హ్యమనాః" అను శ్రుతి బోధించుచున్నది. పరమాత్మయందు కల్పింపబడునదియే "స్వధ" అనిపించుకొనును. దానిచేతనే బ్రహ్మము కర్తృరూపమాయెను. అని చెప్పుటకు "ఆసీత్" అను ధాతువు ప్రయోగింపబడెను, ఇట్లు మాయాశబలితము సూత్రాత్మ అను సంజ్ఞ కలదని చెప్పబడెను. దానికంటె ఇతరమగున దేదియు లేదు. అవసానమందుగూడ యా బ్రహ్మమే కలదు.

॥౧౦॥

గీ॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్ ।
పరం భావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్ ॥ ॥౧౧॥

పదవిభాగము:— అవజానన్తి- మాం- మూఢాః- మానుషీం- తనుం- ఆశ్రితం- పరం- భావం-అజానన్తః- మమ- భూతమహేశ్వరమ్ ॥ ॥౧౧॥

ప్రతిపదార్థము:— మూఢాః=అవివేకులు; మమ=నాయొక్క; పరం=ఉత్కృష్టమైన; భావం= పరమాత్మతత్త్వమును; అజానన్తః=తెలిసికొననివారై; మానుషీం=మనుష్యసంబంధమైన; తనుం=శరీరమును; ఆశ్రితం=ఆశ్రయించిన; (పొందిన) భూతమహేశ్వరం=సర్వభూతములకు గొప్ప యీశ్వరుడనైన: మాం= నన్ను; అవజానంతి=అవజ్ఞను చేయుచుండిరి. (తిరస్కరించుచుండిరి) ॥౧౧॥

శాంకరభాష్యమ్:—

ఏవం మాం నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావం సర్వజ్ఞం సర్వజంతూనా మాత్మాన మపి సంతమ్— అవజానంతీతి । అవజానంతి అవజ్ఞాం పరిభవం కుర్వంతి మాం మూఢా అవివేకినః మానుషీం మనుష్యసంబంధినీం తనుం దేహ మాశ్రితం, మనుష్యదేహేన వ్యవహరంత మిత్యేతత్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నీవు సర్వాధ్యక్షుడవు, సర్వభూతాధివాసుడవు, నిత్యముక్తుడవు నగుచో సర్వులు నిన్నే యాత్మస్వరూపముగకాని, భిన్నముగకాని యెందులకు సేవింపరనెదవా? నేను నిత్య శుద్ధముక్తస్వరూపుడనైనను, సర్వజంతువులకు ఆత్మనై యున్నను మనుష్యసంబంధమైన

—• ౯వ అధ్యాయము ౧౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు నేను నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము, సర్వజంతువులకు ఆత్మస్వరూపము, ఆనందఘనము,అనంతమునగుబ్రహ్మమునైయున్నను,“ఇతడు“సాక్షాదీశ్వరుడు కాడు” అని అవివేకులగు జనులు ఆదరింపక నిందించెదరు. వారలట్లు తిరస్కరించుటకుభ్రమయే కారణము. అట్టి భ్రమకునేను మనుష్యదేహమును ధరియించియుండుటయే కారణము. మనుష్యదేహమును స్వేచ్ఛచే భక్తానుగ్రహార్థము ధరించి, మనుష్యునిగ తోచెడి దేహముతో వ్యవహరించుచుంటిని. ఆ కారణమువలన “ఇతడు మనుష్యుడు” అను భ్రాంతిచే ఆచ్ఛాదితమైన అంతఃకరణకలవారై నాసంబంధమగు పారమార్థిక తత్త్వమును (అనగా సర్వభూతములకు ఈశ్వరుడనగు నన్ను) తెలిసికొననివారై నిందించుచుండిరి. నిరాదరించుచుండిరి. ॥౧౧॥

శంకరానందీయము:— ఇట్లు సర్వప్రకాశకుడు, సర్వద్రష్ట, సర్వసాక్షి అగు నన్ను (పరమాత్మను) పాపిష్ఠతములు, పశుతుల్యులు నగు జనులు అవమానించుచుండిరని “అవజానన్తి” అను శ్లోకముచే జెప్పుచుండెను.

“ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా । కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ” “ఏక ఏవ హి రుద్రో న ద్వితీయాయ తస్థుః” అనుశ్రుతిప్రసిద్ధివలన ఈశ్వరు డొక్కడే. ఈచెప్పుటచే బ్రహ్మాదిభేదముచే నీశ్వరు లనేకు లను పక్షము తొలగింపబడెను. మరియు బ్రహ్మాదులకు ఐశ్వర్యము ప్రాకృతమనియు, అనిత్యమనియు, ఔపాధికమనియు

శాంకరభాష్యమ్:—

పరం ప్రకృష్టం భావం పరమాత్మతత్త్వ మాకాశకల్ప మాకాశా దప్యంతరతమ మజానంతో మమ భూతమహేశ్వరం సర్వభూతానాం మహాంత మీశ్వరం స్వాత్మానమ్ ॥ ॥౧౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దేహము నాశ్రయించిన అనగా మనుష్యదేహముచే వ్యవహరించుచున్నట్టి; సర్వభూతములకు మహేశ్వరుడనైన నాయొక్క యుత్కృష్టమైన, యాకాశసదృశమైన, ఆకాశముకంటె యంతరతమమైన తమయాత్మస్వరూపమైన పరమాత్మతత్త్వము నవివేకులు

సూచింపబడెను. "దేవః" కాలత్రయమునందు ఇతరానపేక్షతో అఖండచిదాత్మస్వరూపముగ స్వయముగ ప్రకాశించువాడు దేవుడు- ఈశ్వరుడు. అవ్యాకృతము జడమగుటచే దానికి దేవత్వము సంభవింపనందున స్వతః కారణత్వ మనుపపన్నము. "సర్వభూతేషు గూఢః" సర్వభూతములయందు చిదేకరసస్వరూపముచే నున్నవాడు. ఈచెప్పుటచే సూర్యున కేకత్వము దేవత్వ మున్నను చిద్రూపముగ సర్వభూతములయం దవస్థితత్వము సంభవింపనందున నీశ్వరత్వము నిరస్తము. "గూఢః" సర్వభూతములయందు ప్రకాశస్వరూపముచే నుండినను మేఘములచే సూర్యుడావరింపబడినటుల యవిద్యాతత్కార్యములచే తిరోహితు డగుటవలన పరమాత్మ యందరికి వేద్యుడు కాడు. "సర్వవ్యాపీ" ఘటాదికమును మృత్తునవలె నిఖిలజగత్తును లోపల వెలుపల అంతటను స్వసత్తచే వ్యాపించువాడు. ఈ చెప్పుటచే బ్రహ్మము బహిరంతః పూర్ణుడగుటవలన బ్రహ్మమునకు పరిచ్ఛిన్నత్వము లేదని యాశయము. "సర్వభూతాంతరాత్మా" సర్వభూతములయొక్క బుద్ధిగుహాయం దాత్మస్వరూపముచే నుండువాడు. ఈచెప్పుటవలన యాకాశము సర్వవ్యాపకమైనను జడమగుటవలన సర్వభూతాత్మత్వము సంభవింపనందున యాకాశమునకు బ్రహ్మత్వము నిరస్తము. బ్రహ్మము సర్వభూతాత్మ యగుచో నతనికి కర్మకర్తృత్వము, కర్మఫలభోక్తృత్వము, సంసారిత్వము ప్రాప్తించు నను శంకను "కర్మాధ్యక్షః" అనుపదముచే తొలగించుచుండెను. ఉపాధినధిష్ఠించి ఉపాధిధర్మముల నీక్షించువాడు అధ్యక్షు డనంబడును భూతములకు, తత్కర్మలకు, ఆయాకర్మఫలభోగములకు ఆత్మ నిరవయవుడగుటవలన, నిష్క్రియుడగుటవలన సాక్షి మాత్రమే యగును. స్వయముగ నేకర్మను యాచరింపడు. ఏకర్మఫలము ననుభవింపడు.

బ్రహ్మ సర్వభూతముల కంతరాత్మ యగుచో సర్వభూతాశ్రయత్వము, సర్వభూతాధీనత్వము ప్రాప్తించునను శంకను "సర్వభూతాధివాసః" అను పదముచే తొలగించుచుండెను. "వసత్యస్మి న్సర్వ మితి వాసః। అధికతమ శ్చాసౌ వాస శ్చేత్యధివాసః" దేనియందు సర్వము నివసించునో అది వాస మనబడును. ఈపరబ్రహ్మమనునది అధికతమమైన వాసము కాన అధివాస మనబడుచున్నది. లేక "అధివసత్యస్మి న్సర్వ మితి వాఽధివాసః" శుక్తియందు రజితమువలె, దర్పణమునందు పత్తనమువలె ఆత్మయందు కల్పితమైన సర్వభూతములకు పరమాత్మ యధిష్ఠాన మగుచున్నది. ఇంతియేకాని పరమాత్మ సర్వభూతము లధికరణముగా కలది కాదని యర్థము. "సాక్షీ" పరమాత్మ కేవలకర్మలకే సాక్షి కాదు. భూతములకు, తద్ధర్మములకు, తత్కర్మలకు, తత్ఫలానుభూతులకు, తదవస్థాత్మలకు బుద్ధితద్వికారములకు అన్నిటికిని ద్రష్టయని యర్థము. సాక్షీ యనగా ప్రత్యక్షముగా జూచువాడని యర్థముకదా! అట్లగుచో ఈక్షణక్రియాకర్తృత్వము పరమాత్మకు ప్రాప్తించునను శంకను తొలగించుటకై "చేతా" అని జెప్పబడెను. చేతయితృత్వమనగ అవిక్రియత్వము. స్వయముగ అవిక్రియుడై పరమాత్మ సర్వమును చూచుచుండెనని యర్థము. పరమాత్మ యవిక్రియు డనుటయందు హేతువును "కేవలః" అనుపదముచే జెప్పుచుండెను. కేవలుడనగ నిరవయవుడని యర్థము. నిరవయవుడు కనుకనే పరమాత్మ యవిక్రియుడై సర్వమును చూచుచుండెనని యర్థము. "శబ్దగుణకమాకా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లెరుగనివారలై నన్ను పరిభవించుచుండిరి. (తిరస్కరించుచుండిరి) అందువలన యట్టివారు పరమేశ్వరునియొక్క తిరస్కారముచే దానివలన జనించిన దురితప్రభావమువలన ప్రతిబద్ధమైన బుద్ధులుకలవారగుచుండి రని యర్థము ॥౧౧॥

శమ్'' ఆకాశము శబ్దమనెడి గుణముకలది. నిరవయవమగు ఆకాశమునకు తార్కికులెట్లు గుణవత్త్వము నంగీకరించిరో అట్లే నిరవయవమగు బ్రహ్మమునకు సత్త్వచిత్త్వాదిగుణవత్త్వము ప్రాప్తించునను శంకను "నిర్గుణః'' అనుపదముచే తొలగించుచుండెను. ఆత్మన ఆకాశస్సంభూతః'' ఆత్మనుండి ఆకాశము జనించుచున్నది. అని శ్రుతిబోధించుటవలన ఆకాశము ఉత్పత్తి కలది. కనుకనే సావయవము. కనుకనే గుణము కలదని చెప్పుట యుక్తమే. బ్రహ్మమునకన్ననో "నిష్కలమ్'' అను శ్రుతివలన నిరవయవత్వము శ్రూయమాణమగుటచే గుణవత్త్వమనుపపన్నము. కాన సత్త్వచిత్త్వాదిస్వరూపముచే బ్రహ్మమగుచున్నది. సత్త్వచిత్త్వాదికము గుణము కానేరదు.

ఇట చ కారము పరబ్రహ్మమునకు విశేషణము లేవియులేవని చెప్పుటకు ప్రయోగింపబడెను. ఇట్లు శ్రుతినిరూపితమగు లక్షణములుకల "భూతమహేశ్వరమ్'' స్వసన్నిధిమాత్రముచే ప్రకృతిని, ప్రకృతిసంబంధమగు సర్వమును చలింపజేయువాడు గాన ఈశ్వరుడనబడును. అయస్కాంతము (అయస్సు) ఇనుమునువలె స్వయమవిక్రియుడై సర్వమునకు ప్రవృత్తి హేతువగుచుండెను. "మహతో మహీయాన్'' అనుశ్రుతిచేత మహత్తముడగుటవలన మహేశ్వరుడనంబడును. అవ్యక్తాది స్థూలాంతభూతములకు మహేశ్వరుడు గాన భూతమహేశ్వరు డనంబడును. సర్వమునకు చేష్టాకారణము, సర్వమహత్తమము, పరము, నిత్యత్వ, కూటస్థత్వ, అసంగత్వ, సత్త్వ, చిత్త్వ, అనంతత్వ, సర్వవ్యాపిత్వ, సర్వజ్ఞత్వ, సర్వప్రకాశకత్వాదిధర్మములచే సర్వదృశ్యవిలక్షణము పరబ్రహ్మము ఆకాశకల్పమగు సచ్చిదానందైకస్వరూపము నైన అహంశబ్దార్థమును శాస్త్రాచార్యులవలన కొంచెమైన తెలిసికొనని పశుతుల్యులగు మూఢులు మనుష్యదేహమును ఆశ్రయించిన (తమ దేహమునందుగల) బుద్ధిగుహయందు సర్వప్రకాశముగ సర్వసాక్షిగనున్న ప్రత్యగ్లక్షణమగు ఆత్మస్వరూపమును "తిరస్కుర్వన్తి'' తిరస్కరించుచుండిరి. అహమర్థము, స్వాత్మస్వరూపమునగు అనందైకరసమునందు మలమాంసాస్థిపిండరూపమగు దేహము నారోపించి తద్ధర్మములగు కర్తృత్వభోక్తృత్వాదులను, జరారోగాదులను అధ్యసించి యవమానించుచుండిరి. అనగా నేను కర్తను భోక్తను, నేను బాలుడను, నేను మూఢుడను, నేను పాపిష్ఠిని, బధిరుడను, అంధుడను, కాణుడను, ఖంజుడను, పంగువును, జీర్ణుడను, నేనుకొట్టబడితిని, నేనుహతుడను అని ఇట్టిరీతుల నెల్లపుడు నాకు వైపరీత్యమునే సంపాదించుచుండిరని యర్థము. ॥౧౧॥

పరమార్థప్రపః:— పూర్వమునందు చెప్పబడిన యధ్యక్షత్వమును ప్రకటనజేయుచు జగత్కారణీభూతమాయాగతమగు మౌఢ్యము జీవులయం దనువర్తించుచున్నదని "అవజానన్తి'' అను శ్లోకముచే జెప్పుచుండెను. నాసంబంధ మగు యుత్కృష్టమైన ప్రసిద్ధమగు తత్త్వమును తెలియనివారై మూఢులు సర్వభూతమహేశ్వరుడ నగునన్ను అవమానించుచుండిరి. ఇట మహచ్ఛబ్దముచే నైన సర్వభూతనివాసత్వ ముండ తదంతర్యామిత్వముచే నియంతనగు నన్ను లెక్కబెట్టకుండిరి. అవాఙ్మానసగోచరమగు చిన్మాత్రమును యెట్లు తెలిసికొనెదరు? అను శంకను తొలగించుటకు "మానుషీం'' అని చెప్పెను. భక్తునియందుగల దయచే తెలిసికొనుటకు సులభమగు శుద్ధసత్త్వమయము, మనోహారిణి మనుష్యాకారము నగు మూర్తి

గీ॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ ॥౧౨॥

పదవిభాగము:— మోఘాశాః- మోఘకర్మాణః- మోఘజ్ఞానాః- విచేతసః- రాక్షసీం- ఆసురీం- చ- ఏవ- ప్రకృతిం- మోహినీం- శ్రితాః ॥ ॥౧౨॥

ప్రతిపదార్థము:— మోఘాశాః=వ్యర్థమైన యాశలుకలవారై; మోఘకర్మాణః= మోఘ= వ్యర్థమైన; కర్మాణః=కర్మలుకలవారై; మోఘజ్ఞానాః=వ్యర్థమైన జ్ఞానముకలవారై; విచేతసః=పోయిన వివేకముకలవారై: రాక్షసీం=రాక్షససంబంధమైన; ఆసురీం=అసురసంబంధమైన; మోహినీం=మోహకరమైన: ప్రకృతిం=స్వభావమును: శ్రితాః=ఆశ్రయించినవారలై, భవన్తి= (ఈపదమధ్యాహార్యము) అగుచున్నారు. ॥౧౨॥

శాంకరభాష్యమ్:—

తతశ్చ తస్య మమావజ్ఞాభావనేన హతా స్తే వరాకాః । కథమ్?— మోఘేతి । మోఘాః వృథా ఆశా ఆశిషః యేషాం తే మోఘాశాః, తథా మోఘకర్మాణః యాని చాగ్నిహోత్రాదీని తై రనుష్ఠీయమానాని కర్మాణి తాని చ, తేషాం భగవత్పరిభవాత్, స్వాత్మభూ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భగవంతుని తిరస్కరించువారలు శోచ్యులు. ఎట్లనిన? అట్టివారలు వ్యర్థమైన యాశలు కలవారు. అట్టివారలచే ననుష్ఠింపబడు యగ్నిహోత్రాదికర్మలు స్వాత్మభూతమైన భగవంతుని పరిభవమువలన నిష్ఫలములే యగును. కాన వారలు మోఘకర్ము లగుచుండిరి. అట్టివారల

నధిష్ఠించి అవిర్భవించినట్టి నన్ను తిరస్కరించుచుండిరని భావము. ఈవిషయము "విశ్వప్రకాశమపి యోజనషట్సహస్రవిస్తారయుక్తమ్మపిభి ర్యదిహార్కబింబం। మర్త్యై రితస్తిమిత మీక్షత ఏత దేవ పశ్యన్తి మర్త్య మివ విశ్వవిభుం విమూఢాః" ఆరువేలయోజనములు విస్తారముకలది సూర్యబింబమని ఋషులచే జెప్పబడినను మనుష్యులు ప్రాదేశమాత్రముగ జూచుచుండిరి. అట్లే మూఢులు విశ్వవిభువగు నన్ను మర్త్యునిగ తలచుచుండిరి. ఋగ్వేదమునందుగూడ "మయా సో అన్న మత్తి యో విపశ్యతి యః ప్రాణితి య ఈం శృణో త్యుక్తం అమన్తవో మాం త ఉపక్షియన్తి శ్రుధిశ్రుతశ్రద్ధి వన్తే వదామి" బ్రహ్మస్వరూపుడగు నమ్భృణ మహర్షి యొక్క బ్రహ్మరూపిణి యగు వాక్ అనెడి కన్యక చెప్పుచున్నది. ఎవ డన్నమును భుజించుచుండెనో వాడు భోక్తృత్వశక్తిరూపమగు నాచేతనే యన్నమును భుజించుచున్నాడు. అట్లే యెవడు మనోభిరామమగు విషయమును సాదరముగ చూచునో, ఎవడు శ్వాసోచ్ఛ్వాసాదికమును చేయునో, ఎవడు వినునో వాడు నాచేతనే వ్యవహారము చేయుచుండెను. అంతర్యామిరూపముచే నిట్టి యుపకారకమగు నన్ను యెవరు తెలిసికొనరో అట్టివారు యాతాయాతయాతనలచే దీనులగుచుండిరి. ఓస్నేహితుడా! నాచే చెప్పబడుచున్న విషయము వినుము. శ్రద్ధధానునిచే లభ్యమగు నిట్టి బ్రహ్మాత్మకమగు వస్తువును నీకొఱకు చెప్పెద నని చెప్పబడెను. ॥౧౧॥

—• ౯వ అధ్యాయము ౧౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అట్టివారు భగవదవజ్ఞానిందనజనితమహాదురితముచే ప్రతిబద్ధమైన బుద్ధులుకలవారై, యెల్లపుడు నరకనివాసార్హులై యగుచుండిరని "మోఘాశాః" అను శ్లోకముచే చెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

తస్య అవజ్ఞానాత్, మోఘా న్యేవ నిష్ఫలాని కర్మాణి భవంతీతి మోఘకర్మాణః । తథా మోఘజ్ఞానాః మోఘం నిష్ఫలం జ్ఞానం యేషాం తే మోఘజ్ఞానాః। జ్ఞాన మపి తేషాం నిష్ఫల మేవ స్యాత్ । విచేతసః విగతవివేకా శ్చ తే భవంతీ త్యభిప్రాయః । కించ తే భవంతి రాక్షసీం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జ్ఞానముగూడ నిష్ఫలమే యగుటవలన వారలు మోఘజ్ఞాను లగుచుండిరి. మరియు విగత మైన వివేకముకలవారగుచున్నారు, మ రి యు నట్టివారు రాక్షససంబంధమైన, యసుర సంబంధమైన మోహకరమైన దేహాత్మవాదము కల స్వభావము నాశ్రయించినవారలై

ఈశ్వరుని విడచియే కర్మలే మనలకు ఫలము నిచ్చునను నిష్ఫలమైన ఫలప్రార్థన కలవారై, కనుకనే యీశ్వరవిముఖులగుటవలన వ్యర్థమైన (శ్రమమాత్రస్వరూపమగు) యగ్నిహోత్రాదికర్మలు కలవారై, ఈశ్వ రాప్రతిపాదకకుతర్కశాస్త్రజనితజ్ఞానముకలవారై, భగవదవజ్ఞానజనితదురితముచే ప్రతిబద్ధమైన వివేకవిజ్ఞాన ముకలవారై, ఇంతియే కాదు. అట్టివారు తామసప్రకృతిని, భగవదవజ్ఞావశమున యవిహితహింసాహేతు ద్వేషప్రధానమైన రాజసప్రకృతిని, శాస్త్రముచే నభ్యనుజ్ఞాతము కాని విషయముల భోగమునకు హేతువగు రాగప్రధానమైన శాస్త్రీయజ్ఞానభ్రంశహేతువగు, మోహకరమగు స్వభావమును ఆశ్రయించినవా రగుచుం డిరి. "త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః । కామః క్రోధ స్తథా లోభః" కామక్రోధలోభ ములనెడివి మూడును, ఆత్మనాశకమగు నరకద్వారములని చెప్పినటుల యట్టివారలు నరకద్వారభాగులగు టచే నరకయాతననే యెల్లపు డనుభవించుచుండిరి. ॥౧౨॥

శంకరానందీయము:— "అసుర్యా నామ తే లోకాః" అను శ్రుత్యర్థమును ప్రకటన చేయుటకు ఆత్మజ్ఞానవిముఖులై, ఆత్మకు యెల్లపుడు విపరీతభావమునే సంపాదించు మూఢులయొక్క స్వభా వమును వర్ణించి, అట్టివారల యాత్మజ్ఞానవైముఖ్యమునకు శ్రుత్యుక్తఫలమును "మోఘాశాః" అనుదానిచే జెప్పుచుండెను.

ఏమూఢులు నాతత్త్వమును తెలిసికొనక యాత్మస్వరూపమగు నన్ను పరిభవించెదరో యట్టివారు వ్యర్థమైన మనోరథములు కలవారు. ఎందువలననిన? "అక్షయ్యగ్ం హ వై చాతుర్మాస్యయాజిన స్సుకృ తం భవతి" చాతుర్మాస్యయాగ మాచరించినవారల కక్షయమగు సుకృతము ప్రాప్తించునను ప్రరోచనో క్తిచే శతకోటికల్పపర్యంతము స్వర్గమునందు నివసింపగలమని చాతుర్మాస్యయాగ మొనరించిన సకాముల యాశ "శ్వోభావా మర్త్యస్య య దంతకైతత్" ఓమృత్యువా! నీవొసగిన గజతురగరథస్త్ర్యాదులు రేపుండునో యుండవో (అనగా నశ్వరములని యర్థము.) అను శ్రుత్యుక్తరీతిని స్వల్పకాలికములగుటవలన యట్టివారలు వ్యర్థమైన యాశ కలవారని చెప్పుట యుక్తమే. మరియు "మోఘకర్మాణః" బహుశ్రమసం పాదితమైన శ్రౌతస్మార్తకర్మలు క్షణికతుచ్ఛజిహ్వోపస్థసుఖైకప్రయోజనము కలవగుటచే నట్టివారలకర్మలు వ్యర్థమైనవి. కాన నట్టి కర్మల నాచరించువారు వ్యర్థకర్ములు. అని చెప్పుట యుక్తమే. "మోఘజ్ఞానాః" "మోఘం" అనర్థసాధకమై యసద్గోచరమగు సకలవేదశాస్త్రాధ్యయనజన్యమైన "జ్ఞానాః" జ్ఞానముకలవారు "బ్రహ్మచారివాసోఽష్టా చత్వారింశ ద్వర్షాణి" నలుబది యెనిమిది సంవత్సరములు బ్రహ్మచారిగనుండి వేదాధ్యయనాదు లాచరింపవలయునను స్మృత్యుక్తరీతిని చిరకాలము సకలవేదశాస్త్రాధ్యయన తదర్థవిచార జనితజ్ఞానము సర్వము బంధముకొఱకే యగుచున్నది. మోక్షముకొఱకు కాదు. కాన నట్టి జ్ఞానముకలవారు

శాంకరభాష్యమ్:—

రక్షసాం ప్రకృతిం స్వభావం ఆసురీం అసురాణాం చ ప్రకృతిం మోహినీం మోహకరీం దేహాత్మవాదినీం శ్రితా ఆశ్రితాః। "ఛింది, భింది, పిబ, ఖాద, పరస్వ మపహర" ఇత్యేవం వదనశీలాః క్రూరకర్మాణో భవంతీ త్యర్థః। "అసుర్యా నామ తే లోకా" ఇతి శ్రుతేః ॥౧౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"ఛిన్ది, భిన్ది, పిబ, ఖాద, పరధనమపహర" (ఛేదింపుము, భేదింపుము, పానముచేయుము, భక్షింపుము, పరధనము నపహరింపుము) అను నిత్యాదివాక్యములను పలుకు స్వభావము కలవారై యగుచున్నారు. ఈవిషయమునే "అసుర్యా నామ తే లోకాః" అనుశ్రుతి బోధించుచున్నది ॥౧౨॥

మోఘజ్ఞానము కలవారని చెప్పుటయుక్తమే. అట్టివారు మోఘ (వ్యర్థ) జ్ఞానులు కనుకనే "విచేతసః" విపరీతబుద్ధులు కలవారు. అనగా "రాక్షసీం" "అగ్నిహోత్రంచ వేదాశ్చ రాక్షసానాం గృహే గృహే। దయా సత్యం చ శౌచం చ రాక్షసానాం న విద్యతే" రాక్షసుల ప్రతిగృహమునందు అగ్నిహోత్రము, వేదములు కలవని యాంజనేయులు రాముని కెరిగింప యిట్టివారలను జయించుటెట్లని రాము డూహించుచుండ రాక్షసులకు దయ, సత్యము, శౌచము లేదని యాంజనేయులు చెప్పెను. ఇట్లాంజనేయులు పలికిన లక్షణములుకలవారు రాక్షసులు. వారలసంబంధమైన 'యోనిం' దయ, సత్యము, శౌచము, క్షమ, లజ్జా, దానము మొదలగు సద్ధర్మములతో శూన్యము, క్రౌర్యము, హింస, దంభము దర్పము, మొదలగు దుర్గుణైకప్రధానము నగునది రాక్షసీయోని. "ఇదమద్యమయాలబ్ధం" ఇది నాచేయిపుడు పొందబడినది. ఇత్యాదికముచే చెప్పబడిన లక్షణములుకలవా రసుర లనంబడుదురు. అట్టివారల స్వభావప్రచురమైన మోహకరమైన ఉపర్యుపరిమాఢత్వాతిశయమును సంపాదించెడి ప్రకృతిని తిరిగితిరిగి పొందినవారగుచున్నారు. లేక—ఎవరాత్మమోక్షణమునందు ప్రయత్నముచేయక మోహకరమగు రాక్షసీసంపత్తిని కాని, ఆసురీసంపత్తిని కాని యాశ్రయించుచుండిరో, వారలు ప్రతిజన్మమునందు మోఘాశులు, మోఘకర్ములు, మోఘజ్ఞానులు, విచేతస్కులు నగుచుండి రని యర్థము. ॥౧౨॥

భాష్యోత్కర్షదీపిక:— తిరస్కారముచేతను, అనాదరముచేతను, నిందచేతను హతులు, సర్వపురుషార్థభ్రష్టులు, అతిక్షుద్రులు నగునట్టివారల ప్రార్థన యేవిధముగను సిద్ధింప దని "మోఘాశాః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

వ్యర్థమైన మాయావస్తువిషయమైన ప్రార్థనలుకలవారు. భగవంతుని యవమానించువారల యగ్నిహోత్రాదికర్మలు శ్రమమాత్రమే యగుటచే ఫలములేని వగుటవలన— వారల ప్రార్థన యగ్నిహోత్రాదికర్మానుష్ఠానమువలన నర్థవత్తగు నను శంకపై "మోఘకర్మాణః" అని చెప్పుచుండెను. అట్టివారల కర్మలు (అగ్నిహోత్రాదులు) నిష్ఫలములై కేవలశ్రమహేతువులే యగుచున్నవి. ఈవిషయము "ధర్మ స్స్వనుష్ఠితః పుంసాం విష్వక్సేనకథాసు యః। నోత్పాదయే ద్యది రతిం శ్రమ ఏవ హి కేవలమ్" ఏధర్మము యోగ్యముగ ననుష్ఠింపబడి విష్ణుకథలయం దభిరతిని పుట్టింపదో యాధర్మము కేవలము శ్రమమాత్రమే యగు నని చెప్పబడెను. భగవంతుని తిరస్కరించు జ్ఞానులుకూడ కలరు. యట్టివారల జ్ఞానమువలన మోక్షప్రార్థనయు సార్థకము కాగలదని శంకింపజనదు. భగవదవజ్ఞాసహితమైన వారల జ్ఞానము ఆత్మసాక్షాత్కారమునకు హేతువు కానందున మోక్షమునకు కారణము కాక

గీ॥ మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః ।
భజ న్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ ॥ ॥౧౩॥

పదవిభాగము:— మహాత్మానః- తు- మాం- పార్థ- దైవీం- ప్రకృతిం- ఆశ్రితాః- భజన్తి- అనన్యమనసః- జ్ఞాత్వా- భూతాదిం- అవ్యయమ్ ॥ ॥౧౩॥

ప్రతిపదార్థము:— మహాత్మానస్తు=అక్షుద్రమైనయంతఃకరణకలవారు; హేపార్థ=ఓయర్జునా; దైవీం=దేవతాసంబంధమైన; ప్రకృతిం=శమదమదయాశ్రద్ధాది రూపమైన స్వభావమును; ఆశ్రితాః=ఆశ్రయించినవారలై; అనన్యమనస్కులై; (ఇతరమునందు మనస్సులేనివారై) అవ్యయం=నాశరహితమైన; భూతాదిం—వియదాదిభూతములకు. ప్రాణులకు కారణమైన; మాం=నన్ను; జ్ఞాత్వా=తెలిసికొని; భజన్తి= సేవించుచున్నారు. ॥౧౩॥

పోవుటచే నాజ్ఞానము సఫలము కాదని "మోఘజ్ఞానాః" అను పదముచే చెప్పుచుండెను. "మోఘజ్ఞానాః" వ్యర్థమైన జ్ఞానముకలవారు. ఈవిషయము "నైష్కర్మ్య మప్యచ్యుతభావవర్జితం న శోభతే జ్ఞానఫలం నిరంజనమ్ । కుతః పున శ్శశ్వ దభద్ర మీశ్వరే నచార్పితం కర్మ యదప్యకారణమ్" నిరంజనము, జ్ఞానఫలమునగు నైష్కర్మ్యము అచ్యుతభావశూన్యమగుచో శోభింపదు. (మోక్షముకొరకు సమర్థము కాదు) అకారణముగ నెల్లపుడు తనచే నాచరించబడిన కర్మ యీశ్వరార్పణ మొనరించకపోవుటయే యమంగళము అని చెప్పబడెను. "విగతచేతసః" "విగతవివేకాశ్చేతిభాష్యే" "హ్రోహేతౌ" ఏకారణముచే భగవదవజ్ఞానముచే కర్మాదులు నిష్ఫలములో భగవద్భక్తిచే సఫలములో అందుకలన భగవద్భక్తి లేనివారలు వివేకశూన్యులు కాన నిట్టివారు విగతచేతస్కుల వారగుచున్నారని యభిప్రాయము.

మరియు రాక్షసుల స్వభావమును (అనగా "ఛిన్ధి, భిన్ధి, పిబ, ఖాద" ఇత్యాదిరూపమగు స్వభావమును,) అసురసంబంధమగు ప్రకృతిని ("న దేహి" ఇవ్వకు "నజుహుధి" హోమముచేయకుము "పరస్వమపహర" పరధనము నపహరింపుము) అను నిట్టిమోహకరమైన దేహాత్మాభిమానరూపమైనప్రకృతి నాశ్రయించినవారలు క్రూరకర్ములగుచున్నారు. ఆకారణమువలనను వారలకు పైని చెప్పిన విశేషణములు తగిన వని యర్థము. లేక కేవలము వారుచెప్పిన విశేషణములే కలవారు కారు. మరేమనిన రాక్షసాదుల ప్రకృతినికూడ నాశ్రయించినవారలు.

లేక, వర్తమానదేహమునందే యిట్టివారలు కారు. మరేమనిన: వర్తమానదేహపాతానంతరముగూడ వారల కత్యంతక్రూరస్వభావముయొక్క ప్రాప్తి నిశ్చితమని "రాక్షసీం" అనుదానిచే చెప్పుచుండెను. ఈవిషయమునే "అసుర్యా నామ తే లోకా అన్ధేన తమసా వృతాః । తాగ్ స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యేకే చాత్మహనో జనాః" ఎవ రాత్మస్వరూపమును తెలిసికొనరో వారాత్మహంతలు. అట్టివారు మరణించినపిదప అంధతమస్సు (అజ్ఞానము) చే నావరింపబడిన అసురసంబంధమైన లోకమును పొందుచున్నారు. అని చెప్పబడెను. ॥౧౨॥

పరమార్థప్రపః— అట్టివారలకు మూఢత్వమునే "మోఘాశాః" అను శ్లోకముచే ప్రకటన చేయుచుండెను. 'మోఘాశాః' క్షుద్రదేవతోపాసనచే క్షణభంగురమైన క్షుద్రఫలాశలు కలవారు, కనుకనే మద్విముఖులగుటవలన నంతముతోకూడిన కర్మలు కలవారు. అట్లే కుతర్కాశ్రితమైన జ్ఞానము కలవారు. కనుకనే విక్షిప్తమైన చిత్తముకలవారై యగుచున్నారు. ఇట్లగుటకు కారణమును "రాక్షసీం" అనుదానిచే చెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

యే పున శ్శ్రద్దధానా భగవద్భక్తిలక్షణే మోక్షమార్గే ప్రవృత్తా స్తే— మహాత్మాన ఇతి । మహాత్మానోఽక్షుద్రచిత్తా మా మీశ్వరం పార్థ! దైవీం దేవానాం ప్రకృతిం శమదమదయాశ్రద్ధాదిలక్షణాం ఆశ్రితా స్సంతో భజంతి సేవంతేఽనన్యమనసోఽనన్యచిత్తాః, జ్ఞాత్వా భూతాదిం భూతానాం వియదాదీనాం ప్రాణినాం చాదిం కారణ మవ్యయమ్ ॥౧౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓయర్జునా! యెవరు మోక్షమార్గమగు భగవద్భక్తియందు శ్రద్ధకలవారై ప్రవృత్తులో యక్షుద్రస్వభావముకలవారో, యట్టి మహానుభావులు దేవతలసంబంధమైన శమదమదయాశ్రద్ధాదిస్వరూపమైన ప్రకృతిని (స్వభావము) నాశ్రయించినవారై యనన్యమనస్కులై నాశరహితము, ఆకాశాదిభూతములకు నిఖిలప్రాణులకు కారణమైన నన్ను తెలిసికొని సేవించెదరు.

—• ౯వ అధ్యాయము ౧౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— భగవద్విముఖులు ఫలకామనము, ఫలకామనాప్రయుక్త నిత్యనైమిత్తికకామ్యకర్మానుష్ఠానము, తత్ప్రయుక్తశాస్త్రీయజ్ఞానము వ్యర్థమగుటవలన పారలౌకికఫలసాధనశూన్యులగుదురు. ఇంతియే కాదు. ఈలోకసంబంధమైన స్వల్పఫలముగూడ అట్టివారలకు సంభవింపదు. అట్టివారు వివేకజ్ఞానశూన్యు లగుటచే విచేతస్కులు. కనుకనే సర్వపురుషార్థబాహ్యులై సర్వులకు శోచింపదగినవారు. అని చెప్పబడెను. అట్లగుచో నెవరు సర్వపురుషార్థభాజు లనెదవా? ఎవరు భగవదేకశరణులై, అనేకజన్మకృతసుకృతములచే క్షుద్రమైన కామక్రోధాదికముచే నభిభూతము కానట్టి యంతఃకరణముకలవారో (అనగా "అభయం సత్త్వసంశుద్ధిః" ఇత్యాదికముచే చెప్పబోవు సాత్త్వికీప్రకృతి నాశ్రయించినవారు) కనుకనే నాకంటె భిన్నమైనదానియందు మనస్సులేనివారై సర్వజగత్కారణము, అవ్యయము నగు నీశ్వరుని తెలిసికొని సేవించెదరో యట్టివారు సర్వపురుషార్థములను పొందెదరు. ॥౧౩॥

శంకరానందీయము:— అసురసంపత్తిగల యజ్ఞానులకు గతిని చెప్పి, యిపుడు దైవీసంపత్తిగల విద్వాంసుల స్థితిని ప్రతిపాదించుటకై ఉత్తమమధ్యమమందాధికారిభేదముచే బ్రహ్మోపాసనకుగూడ భేదమును మూడుశ్లోకములచే జెప్పుచుండెను.

అందు, దైవీసంపత్తికలవారిలోనుత్తములను "మహాత్మానః" అనుదానిచే జెప్పుచుండెను. ఇట "తు" అనుశబ్దము బ్రహ్మవేత్తలకు మూఢులపై పరీత్యద్యోతనార్థము. "మహాత్మానః" బహుజన్మారాధితపరమేశ్వర ప్రసాదాతిశయవశమున లెస్సగ మృదితకషాయులగుటచే విషయజ్ఞానవైముఖ్యమును పొంది యెల్లపుడు ప్రత్యక్ప్రవణశీలు రగుటవలన నుత్కృష్టమైన చిత్తముకలవారు. అట్టిప్రసన్నమైన చిత్తముకల కొందరు యతులు (బ్రహ్మవేత్తలు) స్వయముగ "దైవీం" పరమాత్మప్రాప్తి కంతరంగసాధనమైన దైవీసంపత్తి (అనగాతీవ్రమోక్షేచ్ఛ, వైరాగ్య, శమ, దమ, తితిక్షోపరమాదిసత్త్వగుణప్రాచుర్యస్వరూపమైన ప్రకృతి) నాశ్రయించినవారై, భూతావిర్భూతికారణమైనట్టియు, ఈచెప్పుటవలన "తదనన్యత్వ మారంభణశబ్దాదిభ్యః" అను న్యాయముచే కార్యము కారణమాత్రస్వరూపమగుటచేత భూతములకు పృథక్స్వరూపము లేనందున బ్రహ్మమున కద్వితీయత్వము సూచింపబడెను.) భూతములకు బ్రహ్మము కారణమగుచో కార్యనాశనమువలన కారణమగు (అరటికి) నాశము ప్రాప్తించునటుల భూతముల నాశము

గీ॥ సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః ।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ ॥౧౪॥

ప ద వి భా గ ము:—— సతతం— కీర్తయన్తః— మాం— యతన్తః— చ— దృఢవ్రతాః— నమస్యన్తః— చ— మాం— భక్త్యా— నిత్యయుక్తాః— ఉపాసతే ॥ ॥౧౪॥

ప్రతి ప దా ర్థ ము:——సతతం=ఎల్లప్పుడు; మాం=బ్రహ్మస్వరూపమగునన్ను; కీర్తయన్తః= కీర్తించుచు; యతంతశ్చ=ఇంద్రియోపసంహారశమదమదయాఽహింసాదిధర్మములచే ప్రయత్నించుచు; దృఢవ్రతాః=స్థిరమైనవ్రతముకలవారై; నమస్యన్తశ్చ=నమస్కారముచేయుచు; భక్త్యా=భక్తిచే; నిత్యయుక్తాః=నిత్యయుక్తులై; మాం=నన్ను; ఉపాసతే=ఉపాసించుచుండిరి. ॥౧౪॥

---

శాంకరభాష్యమ్:——

కథమ్—— సతత మితి । సతతం సర్వదా భగవంతం బ్రహ్మస్వరూపం మాం కీర్తయంతః, యతంత శ్చ ఇంద్రియోపసంహారశమదమదయాఽహింసాదిలక్షణై ర్ధర్మైః ప్రయతంత శ్చ, దృఢవ్రతా దృఢం స్థిర మచాల్యం వ్రతం యేషాం తే దృఢవ్రతా నమస్యంత శ్చ మాం హృదయే శయ మాత్మానం భక్త్యా నిత్యయుక్తాః సంత ఉపాసతే సేవంతే ॥౧౪॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:——

యెట్లు నిన్ను సేవించెద రనెదవా? యెల్లప్పుడు నన్ను కీర్తించువారలై, ఇంద్రియోపసంహార(ఇంద్రియనియమన)శమదమదయాఽహింసాస్వరూప మగు ధర్మములచే ప్రయత్నిం

వలన భూత కారణ మగు బ్రహ్మముకూడ నశింపవలసివచ్చు నను శంకను "అవ్యయం" అనుదానిచే తొలగించుచుండెను. జ్ఞానముచేగాని, అజ్ఞానముచేగాని, కారణనాశముచేకాని, కార్యనాశముచేకాని, స్వతఃకాని యితరమువలన కాని దేనిచేతను నశింపనిదని యర్థము. నిత్యము, సర్వాత్మకము, అద్వితీయము, అఖండానందైకరసమునగు పరబ్రహ్మమును శ్రవణాదులచే లెస్సగ తెలిసికొనినవారు నాకంటె వ్యతిరిక్తమైన విషయము లేని బుద్ధివృత్తికలవారై (అనగావస్త్వంతరదర్శనరహితులై) ఈసర్వము, నేను బ్రహ్మమే" అనియుప్రతిబద్ధ బుద్ధివృత్తిచే నెల్లప్పుడు సర్వమును బ్రహ్మముగనే తెలిసికొనెదరు. కనుకనే వారికి "మహాత్మానః" అను విశేషణ మర్థవత్తగుచున్నది. ॥౧౩॥

—• ౯వ అధ్యాయము ౧౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మ ధు సూ ద న స ర స్వ తీ య ము:—— అట్టివారు పరమేశ్వరుని యేవిధమున సేవించెదరో అరితిని "సతతం" అను శ్లోకము మొదలుకొని రెండు శ్లోకములచే జెప్పుచుండెను.

ఎల్లప్పుడు బ్రహ్మనిష్ఠుడగు గురువువద్దకు "తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛే త్సమిత్పాణి శ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" అను శ్రుత్యుక్తరీతిని యరుదెంచి యచట వేదాన్తవాక్యవిచారముచేతను, గురూపసదనకాలముకంటె భిన్నమగు కాలమునందు ప్రణవజపముచేతను, ఉపనిషత్తుల పారాయణాదులచేతను, సర్వోపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మస్వరూపము గీర్తించుచు అనగా వేదాన్తశాస్త్రాధ్యయన రూపశ్రవణ వ్యాపారవిషయముగ బ్రహ్మస్వరూపమును చేయుచు, "యతంతశ్చ" గురుసన్నిధియందు కాని, అన్యత్ర కాని, వేదాంతములకు విరోధి కాని, తర్కముల యనుసంధానముచే యప్రామణ్యజ్ఞానానాస్కందితగురూపదిష్టాత్మస్వరూపనిశ్చయముకొఱకై ప్రయత్నించుచు, (అనగా శ్రవణముచే నిర్ధారితమైన యర్థమునందు బాధశంకను తొలగించెడి తర్కముయొక్క యనుసంధానరూపమగు మననమునం దాసక్తులై.) అట్లే "దృఢ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చువారలై, స్థిరమైన (వ్రతము) బ్రహ్మచర్యాదికముకలవారై నమస్కరించువారలై భక్తితో నిత్యయుక్తులై నన్ను సేవించుచుండిరి. ౹౧౪౹౹

వ్రతాః" ప్రతిపక్షులచే చలింపచేయుటకు శక్యము కాని అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, ప్రతిగ్రహములేకపోవుట మొదలగు వ్రతములు కలవారై, ఈవిషయమే "అహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహా యమాః । తే తు జాతిదేశకాలసమయానవచ్ఛిన్నా స్సార్వభౌమా మహావ్రతమ్" అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము ఇవి యమము లనబడును. వీటి నాచరించుటయందు బ్రాహ్మణత్వాదిజాతివిశేషము కాని, తీర్థాదిదేశవిశేషము కాని, చతుర్దశి మొదలగు కాలవిశేషము కాని, యజ్ఞకాలముకంటె భిన్న కాలము కాని యపేక్షింపబడదు. అనగా నేజాతివారైనను, యేప్రదేశమునందైనను, ఏ కాలమందైననుయజ్ఞాదిసమయములయందైనను అహింసాదియమము లాచరింపదగినవి. "ఇవి సార్వభౌమము లనంబడును. క్షిప్త, మూఢ, విక్షిప్త, భూములయందుకూడ నాచరింపదగినవి. ఇవి మహావ్రతములనబడును. అని పతంజలిమహర్షిచే యోగసూత్రములలో చెప్పబడెను. అట్లే "నమ్యన్తశ్చ" భగవంతుడు, వాసుదేవుడు, సకలకల్యాగుణనిధానము, ఇష్టదేవతారూపముగను గురురూపముగను నున్ననన్ను కాయవాఙ్మనస్సులచే నమస్కరించువారై, (చకారమువలన "శ్రవణం కీర్తనం విష్ణో స్స్మరణం పాదసేవనమ్ । అర్చనం వన్దనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్" అనుదానిచే చెప్పబడిన శ్రవణాదికముకూడ గ్రహింపవలయు నని చెప్పబడెను.) అర్చనము, పాదసేవనము గురురూపమగు వాసుదేవునియందు సుకరములే. ఈశ్లోకమున "మాం" అని రెండుమారులు చెప్పుట సగుణరూపపరాయర్యనిమిత్తమే యని గ్రహింపవగును. అట్లు కానిచో "మాం" అని రెండుసారులు గ్రహించుట వ్యర్థమే యగును అట్లే మద్విషయకమైన భక్తిచే (ప్రేమచే) నెల్లపుడు కూడినవారై, ఈచెప్పుటచే నిఖిలసాధనపుష్కలము, ప్రతిబంధకాభావము చూపబడెను. "యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ । తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః" ఎవనికి దేవునియం దుత్కృష్టభక్తి యుండునో, దేవునియందున్నటుల గురువునందుత్కృష్టభక్తి యుండునో యట్టి మహాత్మునకు యీచెప్పిన యర్థములు ప్రకాశించుచున్నవని చెప్పబడెను. పతంజలికూడ "తతః ప్రత్యక్చేతనాధిగమోఽప్యన్తరాయాభావశ్చ" ఈశ్వరప్రణిధానమువలన త్వంపదలక్ష్యార్థముయొక్క సాక్షాత్కారము, విఘ్నముల యభావము ప్రాప్తించునని చెప్పెను. ఇట్లు శమదమాదిసాధనసంపన్నులై, వేదాంతశ్రవణమననపరాయణులై పరమగురువగు పరమేశ్వరునియందు ప్రేమచేతను, (భక్తి) నమస్కారములచేతను నశించిన విఘ్నములుకలవారై పరిపూర్ణ నిఖిలసాధనములుకలవారై మహాత్ములు "మాముపాసతే" శ్రవణమననోత్తరభావి యగు విజాతీయప్రత్యయానంతరితమైన సజాతీయప్రత్యయప్రవాహముచే నెల్లపుడు నన్ను చింతించుచుండిరి.

ఈచెప్పుటచే చరమసాధనమగు నిదిధ్యాసనరూపమగు జరమసాధనము నిర్దిష్టము. భక్తిసాధనములు పుష్కలముగ నుండినచో వేదాన్తవాక్యజన్యమైన యఖండవిషయకమైన సాక్షాత్కారరూపమగు "అహం బ్రహ్మాస్మి" అనెడి జ్ఞానము సర్వశంకాకలంకాస్పృష్టమై సర్వసాధనఫలభూతమై ప్రదీపము తమస్సును వలె స్వోత్పత్తిమాత్రముచే నిఖిలాజ్ఞానమును నశింపజేయును. కాన జ్ఞానము యితరాపేక్షలేకుండగనే సాక్షాత్తు మోక్షహేతువు. భూమికాజయక్రమముచే భ్రూమధ్యయందు ప్రాణప్రవేశనమును, మూర్ధన్యనాడిచే (సుషుమ్నానాడిచే) ప్రాణోత్క్రమణమును, అర్చిరాదిమార్గముచే బ్రహ్మలోకగమనమును,

గీ॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మా ముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్॥ ॥౧౫॥

పదవిభాగము:— జ్ఞానయజ్ఞేన- చ- అపి- అన్యే- యజన్తః- మాం- ఉపాసతే- ఏకత్వేన-పృథక్త్వేన- బహుధా- విశ్వతోముఖమ్ ॥ ॥౧౫॥

ప్రతిపదార్థము:— అన్యేచ=కొందరు; జ్ఞానయజ్ఞేన=భగవద్విషయకమైన జ్ఞానమనెడి యజ్ఞముచే; యజన్తః=పూజించువారై; మాం=నన్ను; ఏకత్వేన=ఏకమే పరబ్రహ్మ మనెడి పరమార్థదర్శనముచేతను; కేచిత్=కొందరు; (ఈపద మధ్యాహార్యము) పృథక్త్వేన=అభగవంతుడగు విష్ణువు ఆదిత్యచంద్రాది రూపముచే నుండె నని; కేచిత్=మరికొందరు; బహుధా=అనేకవిధముల; విశ్వతోముఖమ్=విశ్వరూపునిగ; ఉపాసతే=ఉపాసించుచుండిరి. ॥౧౫॥

---

బ్రహ్మలోకభోగాన్త కాలవిలంబమును వీటిని శ్రవణమనననిదిధ్యాసజనిత బ్రహ్మసాక్షాత్కారము మోక్షము నిచ్చుటయం దపేక్షింపదు. కాన పూర్వమునందు "ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే। జ్ఞానం" అని యేది ప్రతిజ్ఞ చేయబడెనో యది చెప్పబడెను. ఈజ్ఞానమునకు ఫలము యశుభమగు సంసారమునుండిమోక్షణమే యని పూర్వమునందు చెప్పబడినందున తిరిగి యిట చెప్పబడలేదు. దీనియందే శ్రీకృష్ణపరమాత్మకు గంభీరమైన యభిప్రాయము. ఉత్తరార్థము స్పష్టమే. ॥౧౪॥

శంకరానందీయము:—ఇట్లుత్తమాధికారుల కుపాసనాప్రకారమును చెప్పి మధ్యమాధికారులకు భగవదుపాసనాప్రకారమును "సతతం" అనుదానిచే జెప్పుచుండెను.

కొందఱు ముముక్షువులు స్వాత్మతత్త్వజిజ్ఞాసచే తీవ్రమోక్షేచ్ఛావైరాగ్యములచే సాధనములతో గూడిన నిఖిలకర్మలను సన్యసించి, తమ జీవనమునందుగూడ నపేక్షారాహిత్యముచే బ్రహ్మచర్యాహింసాద్యుత్తమధర్మములచేత బహిరంతరింద్రియనిగ్రహ మొనరించి, దానిచే దృఢమైన జ్ఞానసంపాదననియమము కలవారై, "ఆసుప్తే రామృతేః కాలం నయే ద్వేదాన్తచింతయా" అను నియమాను సారము యెల్లపుడు ప్రత్యగ్రూపమగు నాత్మ నుద్దేశించి పరమాత్మసాక్షాత్కారసిద్ధికొఱకై సద్గురు సన్నిధియందు వేదాంతములను కీర్తించుచు, పఠించుచు, వేదాంతార్థమునుపపత్తులచే జ్ఞానసిద్ధికై విచారించుచు ప్రయత్నించుచు "తగ్ంహ దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే" అను శ్రుత్యుక్తరీతిని శ్రద్ధతోడను, భక్తితోడను జ్ఞానప్రదాత యగు యీశ్వరుని నమస్కరించుచు, ప్రార్థించుచు ఇట్లు నిరంతరనియమోపేతులై, శిశూష్రువులై నన్ను సేవించుచుండిరి. లేక మోక్ష సిద్ధికొఱకు నియతులై నన్నుపాసించుచుండిరి. "సతతం కీర్తయన్తో మాం" అనుదానిచే నామసంకీర్తనము చెప్పబడె నని మూఢబుద్ధికలవారు తలవరాదు. అట్లగుచో నుపక్రమవిరోధము, ప్రకరణవిరోధము, విశేషణవిరోధము ప్రాప్తించును. ॥౧౪॥

## —• ౯వ అధ్యాయము ౧౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఎవరు శ్రవణమనననిదిధ్యాసనాద్యసమర్థులో అట్టి యుత్తమమధ్యమమందాధికారులగు ముగ్గురు తమ కనురూపముగ నన్నే యుపాసించుచుండి రని "జ్ఞానయజ్ఞేన" అనుదానిచే జెప్పుచుండెను.

పూర్వమునందు చెప్పబడిన సాధనముల ననుష్ఠించుటయం దసమర్థులగు కొందరు "జ్ఞానయజ్ఞేన" "త్వం వా అహ మస్మి భగవో దేవ తేఅహం వై త్వమసి" ఇత్యాదిశ్రుత్యుక్తమైన అహంగ్రహోపాసనయే

శాంకరభాష్యమ్:—

తే కేన ప్రకారేణోపాసత ఇత్యుచ్యతే— జ్ఞానయజ్ఞేన జ్ఞాన మేవ భగవద్విషయం యజ్ఞస్తేన జ్ఞానయజ్ఞేన యజంతః పూజయంతో మా మీశ్వరం చాప్యన్యేఽన్యా ముపాసనాం పరిత్యజ్యోపాసతే। తచ్చ జ్ఞాన మేకత్వే నైక మేవ పరం బ్రహ్మేతి పరమార్థదర్శనేన యజంత ఉపాసతే। కేచి చ్చ పృథక్త్వే నాదిత్యచంద్రాదిభేదేన స ఏవ భగవా న్విష్ణు రాదిత్యాదిరూపే ణావస్థిత ఇత్యుపాసతే। కేచి ద్బహుధాఽవస్థితః స ఏవ భగవా న్సర్వతోముఖో విశ్వతో ముఖో విశ్వరూప ఇతి తం విశ్వరూపం సర్వతోముఖం బహుధా బహుప్రకారే ణోపాసతే॥౧౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వారేవిధమున నుపాసించెద రను శంకపై "జ్ఞానయజ్ఞేన" అని చెప్ప మొదలిడెను. ఉత్తమాధికారులగు కొందరు యితరోపాసనలను పరిత్యజించి భగవద్విషయకజ్ఞానమనెడి యజ్ఞముచే పూజించుచు పరమేశ్వరు నుపాసించుచుండిరి మధ్యమాధికారులగు మరికొందరు ఆదిత్యచంద్రాదిభేదముచే భగవంతుడగు యాపరమేశ్వరుడైన విష్ణువే యుండె నని యుపాసించుచుండిరి. మధ్యమాధికారులలోనే మరికొందరు ఆపరమేశ్వరుడే విశ్వరూపుడని యాపరమేశ్వరుని విశ్వరూపునిగ ననేకవిధముల నుపాసించుచుండిరి. ॥౧౫॥

జ్ఞానమనబడును. అదియే పరమేశ్వరయజనరూపమగుటవలన యజ్ఞ మనబడును. చకారము ఏవకారార్థకము. అపిఅనునది సాధనాంతరపరిత్యాగ మర్థము కలది. కొందఱు సాధనాంతరమునందు నిస్పృహులై, ఉపాస్యోపాసకాభేదచింతారూపమగు జ్ఞానయజ్ఞముచే నేకత్వముచేనగు భేదవ్యావృత్తిచేత యుత్తములు నన్నే చింతించుచున్నారు. కొందఱు మధ్యములు ఉపాస్యోపాసకభేదముచే "ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః" ఇత్యాదిశ్రుత్యుక్తమైన ప్రతీకోపాసనరూపమగు జ్ఞానయజ్ఞముచే నన్నే యుపాసించుచుండిరి. అహంగ్రహోపాసనయందు కాని, ప్రతీకోపాసనయందు కాని, యసమర్థులైన మరికొందఱు మందాధికారులు యేవో యితర దేవతల నుపాసించుచు, కొన్ని కర్మలనైన చేయుచు "బహుధా" అనేకరీతులుగ సర్వాత్మనగు నన్ను సేవించుచుండిరి. ఆయా జ్ఞానయజ్ఞముచే నుత్తరోత్తరులకు క్రమముగ పూర్వపూర్వభూమిలాభము కలుగుచున్నది. ॥౧౫॥

శంకరానందీయము:— ఇట్లాత్మతత్త్వజిజ్ఞాసులు, ముముక్షువులునగు యతులకు వేదాంతశ్రవణరూపమైన యుపాసనను చెప్పి శ్రవణమననములచే లెస్సగ తెలియబడిన తత్త్వముకల యతులకు నిదిధ్యాసనరూపమగు నాత్మోపాసనను "జ్ఞానయజ్ఞేన" అనుదానిచే ప్రతిపాదించుచుండెను.

బ్రహ్మాత్మైకత్వవిషయకజ్ఞానమే యిట జ్ఞానమనబడును. ఆజ్ఞానమే బ్రహ్మోపాస్తికి సాధన మగుటవలన యజ్ఞ మనబడును. "ఇజ్యతేఽనేనేతి యజ్ఞః జ్ఞాన మేవ యజ్ఞః జ్ఞానయజ్ఞః" అను వ్యుత్పత్తి ననుసరించి జ్ఞానమనెడి యజ్ఞముచే నపక్వాంతఃకరణముకలవారు "బ్రహ్మైవాహ మహ మేవ బ్రహ్మ" అని తనను బ్రహ్మముగ భావన చేయుచు ప్రత్యగాత్మ యగు పరబ్రహ్మమును విపరీతభావనావృత్తికొరకై నిత్య మనుసంధానమును చేయుచుండిరి. "అపి" అను శబ్దముచే కొందఱు కర్ములు కర్మయజ్ఞముచే నుపాసించుచుండిరని సూచింపబడెను. భేదముచేగాని, యభేదముచేగాని చేయదగిన నీయుపాసన యెట్లుజ్ఞానయజ్ఞముచే చేయనగునను శంకయందు "స యశ్చాయం" "అయ మాత్మా బ్రహ్మ" "అహం బ్రహ్మాస్మి" ఇత్యాదిశ్రుత్యర్థమును బ్రహ్మవేత్తయగు యాచార్యుని ముఖమునుండి సరహస్యముగ లెస్సగ విని (తెలిసి

గీ॥ అహం క్రతు రహం యజ్ఞ స్స్వధాఽహ మహ మౌషధమ్,
మన్త్రోఽహ మహ మేవాజ్య మహ మగ్ని రహం హుతమ్॥ ॥౧౬॥

పదవిభాగము:— అహం- క్రతుః- అహం- యజ్ఞః- స్వధా- అహం- ఔషధమ్- మన్త్రః- అహం- అహం- ఏవ- ఆజ్యం- అగ్నిః- అహం- హుతమ్ ॥ ॥౧౬॥

ప్రతిపదార్థము:— అహం=నేను; క్రతుః=శ్రౌతకర్మవిశేషము; అహం=నేను: యజ్ఞః= స్మార్తకర్మస్వరూపము; అహం=నేను: స్వధా=పితృదేవతలకొరకు చేయబడు యన్నస్వరూపము: అహం= నేను; ఔషధం=సర్వప్రాణులచే భక్షింపబడు యౌషధమ్- అన్నస్వరూపము; అహం=నేను; మన్త్రః= మంత్రస్వరూపము; అహమేవ=నేనే; ఆజ్యం=ఆజ్యము; అహం=నేను; అగ్నిః—హోమాధారమగు యగ్ని స్వరూపము; అహం=నేను; హుతం=హవనకర్మస్వరూపము నగుచుంటిని. ॥౧౬॥

---

కొని) అయర్థమునే శ్రుత్యుక్తవిశేషములచే తనయాత్మచే (యంతఃకరణచే) లెస్సగ ననుభవించి తిరిగి భేదము నవలంబింపక అబ్రహ్మైకత్వమునే యెల్లపుడు భావించుట కొఱకు యెవరు సమర్థులో అట్టివారిచే నేకత్వముగ నుపాసింపదగినది. అశక్తులచే భేదముచే నుపాసింపదగినదని బోధించుటకు "ఏకత్వేన పృథక్త్వేన" అని చెప్పెను. జ్ఞాన యజ్ఞముచే ముఖ్యాధికారులు, పరమహంసలు నగు యేయతు లుపాసించెదరో, అట్టి పరమహంసలే యభేదముచే 'బ్రహ్మైవాహం' అని స్వాభిన్నమైన నన్నుపాసించుచుండిరి. హంస కుటీచకాది మధ్యమాధికారు లన్ననో వారుభేదముచే సర్వాత్మకమైన నన్ను అనేకప్రకారములుగ "ఆదిత్యో బ్రహ్మ" 'మనోబ్రహ్మ' "ఓ మిత్యేతేనైవాక్షరేణ" ఇత్యాదిశ్రుత్యుక్తరీతిచే ననేకవిధముల భేదముచే నుపాసించుచుండిరి. అట్టి యుపాసనయందుకూడ నధికారములేని వైదికులగు కొందఱు ముముక్షువులు 'సోమేన యక్ష్యే' ఇత్యాదికమగు కర్మయజ్ఞముచే నింద్రాదిరూపమగు నన్నుపాసించుచుండిరి. అందుకూడ గొందరు శివవిష్ణుబ్రహ్మాదిత్యాదిరూపమగు నన్ను వైదికతంత్రములచే నుపాసించుచుండిరి. ॥౧౫॥

పరమార్థప్రపః:— జ్ఞానులెట్లు నిన్ను భజించెదరను శంకపై "జ్ఞానయజ్ఞేన" అని చెప్పుచుండెను. కొందరు సర్వత్ర ఆత్మదర్శనరూపమగు జ్ఞానయజ్ఞముచే నన్ను యజించుచుండిరి. "ఏకత్వేన" స్థూలసమష్టిరూపముచే "పృథక్త్వేన" ఇంద్రాదివిభూతిరూపముచే ననేకవిధముల సర్వదేహులయందు కాని, విశ్వరూపమగు నన్ను సేవించుచుండిరి. "హంస శ్శుచిష ద్వసురంతరిక్షస ద్ధోతా వేదిష దతిథిర్దురోణసత్। నృషద్వరస దృతసద్వ్యోమస దబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతంబృహత్" ఈనిఖిలవ్యష్టిరూపము కలసి ఋతము, బృహత్తు సమష్టిరూపము సత్యమునగు బ్రహ్మము కలదు. ఈవిషయమునే "హంసః" అను మంత్రముచే చెప్పుచుండెను. "హంసః" జీవుడు బ్రహ్మమే. "శుచిషత్" జ్ఞానమునందు జ్ఞేయముగ నున్నవాడు. "వసుః" స్థూలప్రపంచరూపమగు విరాట్టుగూడ "అంతరిక్షసత్" ఆకాశమునందున్నవాడు. లేక "వసుః" యజ్ఞము "హోతా" హోమముచేయు హోతయు బ్రహ్మమే. అట్లె "వేదిషత్" ఉత్తరవేదియందుండు యతిథిరూపమగు నట్టి యగ్నియు, అట్లే "దురోణసత్" యజ్ఞాధారము స్థాపితమైన ద్రోణకలశయందున్నట్టి, అట్లే "నృషత్" మనుష్యులయందుండునట్టి, "వరసత్" దేవతలయందుండు నట్టి, అట్లే "ఋతసత్" ప్రాణమునందుండునట్టి, "వ్యోమసత్" ఆకాశమునందుండునట్టి, "అబ్జాః" ఉదకములపుట్టునట్టి జీవులు, "గోజాః", భూమినుండిపుట్టునట్టి జీవులు, "ఋతజాః" వాయువునుండి పుట్టిన జీవులు, "అద్రిజాః" పర్వతములవలనపుట్టినజీవులు సర్వము బ్రహ్మస్వరూప మని శ్రుతి బోధించుచున్నది. ॥౧౫॥

శాంకరభాష్యమ్:—

యది బహుభిః ప్రకారై రుపాసతే కథం త్వా మేవోపాసత ఇత్యత ఆహ— అహం క్రతుః శ్రౌతకర్మభేదోఽహ మేవాహం యజ్ఞః స్మార్తః । కించ స్వధాన్న మహం పితృభ్యో యద్దీయతే । అహ మౌషధం సర్వప్రాణిభి ర్యదద్యతే తదౌషధశబ్దవాచ్యమ్ । అథ వా స్వధేతి సర్వప్రాణిసాధారణ మన్న మౌషధ మితి వ్యాధ్యుపశమార్థం భేషజమ్ । మంత్రోఽహం యేన పితృభ్యో దేవతాభ్యశ్చ హవి ర్దీయతే । అహ మేవాజ్యం హవి శ్చాహ మగ్ని ర్యస్మిన్ హూయతే సోఽగ్ని రహ మేవాహం హుతం హవనకర్మ చ ॥ ॥౧౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అనేకవిధముల నుపాసించువారగుచో నిన్నే యెట్లుపాసించుచుండి రనెదవు? అను శంకపై చెప్పుచుండెను. నేను శ్రౌతకర్మవిశేషస్వరూపము, నేను స్మార్తకర్మస్వరూపము. ఇంతియే కాదు. నేను పితృదేవతలకొఱ కీయబడు యన్నస్వరూపము. సర్వప్రాణులచే నేది భక్షింపబడునో యది యౌషధశబ్దముచే చెప్పబడును. నే నట్టి యౌషధస్వరూపము. లేక "స్వధా" అనునది సర్వప్రాణిసాధారణమగు యన్నము. నే నట్టి యన్నస్వరూపము, ఔషధ మనగ వ్యాధినివృత్తికొఱకగునది. నే నట్టి యౌషధస్వరూపము. దేనిచే పితరులకొఱకు, దేవతలకొఱకు హవిస్సు లీయబడునో నే నట్టి హవిస్స్వరూపము. నేను యాజ్య మనెడి హవిస్స్వరూపము దేనియందు హోమము చేయబడునో నే నట్టి యగ్నిస్వరూపము. నేను హవనకర్మస్వరూపము నైయుంటిని. ॥౧౬॥

—• ౯వ అధ్యాయము ౧౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అనేకవిధముల నుపాసించు వారగుచో నిన్నే యుపాసించుచుండి రనుట యెట్లు పొసగుననిశంకించి "అహంక్రతుః" అనునది మొదలుకొని నాలుగుశ్లోకములచే నాత్మకు విశ్వరూపత్వమును విస్తరింపజేయుచుండెను.

ఇట సర్వరూపుడను నేను అని చెప్పవలసియుండ తత్తదేకదేశకథనము ద్వాదశకపాలకమగు వైశ్వానరునియం దష్టాకపాలత్వాదికథనమువలె యుపపన్నమే. నేను "క్రతుః" శ్రౌతమైన అగ్నిష్టోమాది క్రతుస్వరూపుడను. నేను "యజ్ఞః" స్మార్తమైన మహాయజ్ఞముగ శ్రుతిస్మృతిప్రసిద్ధమైన వైశ్వదేవాది స్వరూపుడను. నేను "స్వధా" పితృదేవతల కివ్వబడు యన్నస్వరూపుడను. నేను "ఔషధం" సర్వప్రాణులచే భుజింపబడెడి యోషధులనుండి జనించిన యన్నస్వరూపుడను. లేక భోజనస్వరూపుడను. నేను "మంత్రః" యాజ్యాపురోనువాక్యాదిస్వరూపుడను. ఏయాజ్యాపురోనువాక్యాదికముచేతనే దేవతల నుద్దేశించి హవిస్సులివ్వబడును. నేను "ఆజ్యం" ఘృతమును, ఇది సర్వహవిస్సుల కుపలక్షణము. అనగా ఆజ్యాది సర్వహవిస్సులు నాస్వరూపమే యని యర్థము. "అగ్నిః" హవిఃప్రక్షేపాధికరణమైన యాహవనీయాదికము నాస్వరూపమే. "హుతం" హవిఃప్రక్షేపము నాస్వరూపమే. పైచెప్పబడిన సర్వము నాస్వరూపమే. ఏతదేకదేశజ్ఞానముకూడ భగవదుపాసనమే యని చెప్పుటకు ప్రత్యేక మహంశబ్ద ప్రయోగము చేయబడెను. భగవదతిరిక్తమైన క్రియాకారకకలాపమేదియు లేదని సముదాయార్థము. ॥౧౬॥

శంకరానందీయము:— "యత్త దద్రేశ్యం" "తదరూప మవ్యయం" "దివ్యో

శ్లో॥ పితాఽహ మస్య జగతో మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజు రేవ చ॥ ॥౧౭॥

పదవిభాగము:— పితా- అహం- అస్య- జగతః- మాతా- ధాతా- పితామహః- వేద్యం- పవిత్రం- ఓంకారః- ఋక్- సామ- యజుః- ఏవ- చ ॥ ॥౧౭॥

ప్రతిపదార్థము:— అస్య=ఈజగత్తునకు; పితా=తండ్రిని; (పుట్టించువాడను) అహం=నేనే; మాతా=తల్లిని; ధాతా=ప్రాణులకొరకు కర్మఫలము నిచ్చువాడను; పితామహః=తండ్రితండ్రిని; వేద్యం=తెలిసికొనదగినది; పవిత్రం=పవిత్రమైనది; ఓంకారః=ప్రణవము; ఋక్=ఋగ్వేదము; సామ=సామవేదము. యజురేవచ=యజుర్వేదమును; అహమేవ=నాస్వరూపమే. ॥౧౭॥

శాంకరభాష్యమ్:—

కించ— పితా జనయితాహ మస్య జగతో మాతా జనయిత్రీ ధాతా కర్మఫలస్య ప్రాణిభ్యో విధాతా పితామహః పితుః పితా వేద్యం వేదితవ్యం పవిత్రం పావన మోంకార శ్చ ఋక్సామ యజు రేవ చ ॥ ॥౧౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈజత్తును పుట్టించువాడును, (తండ్రియు) తల్లియు, ప్రాణులకొరకు కర్మఫలము నిచ్చువాడు, తండ్రికి తండ్రియు, తెలిసికొనదగినదియు, పావనమైనదియు, ఓంకారము ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదమునివియ్నియు నాస్వరూపమే. ॥౧౭॥

హ్యమూర్తః పురుషః” ఇత్యాదిశ్రుతులచే పరబ్రహ్మము నామరూపాదులు లేనివాడని చెప్పబడు చుండ నామరూపాదులు లేని నీయొక్క దృశ్యములయందు, ఇంద్రాదులయందు, శివాదులయందు బ్రహ్మబుద్ధిచే యుపాసన యెట్లు కుదురును? అనుయాశంకపై “ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయతే” “మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్ । తస్యావయవభూతై స్తు వ్యాప్తం సర్వ మిదం జగత్” “ఏకం సద్విప్రా బహుధా వదన్తి । ఇన్ద్రం మిత్రం వరుణ మగ్ని మాహుః” ఇత్యాదిశ్రుతులచే పరబ్రహ్మమగు నాకు మాయచేతనే సవిశేషత్వము, సార్వాత్మ్యము ప్రతిపాదింపబడుచున్నది. కాన నింద్రాదులు, శివాదులు, క్రతుయజ్ఞమంత్రాదులు నిఖిలజగత్తు నాస్వరూపమే యని తనకు విశ్వతోముఖత్వమును “అహం క్రతుః” అను శ్లోకము మొదలుకొని నాలుగుశ్లోకములచే ప్రతిపాదించుచుండెను.

శ్రుత్యుక్తమైన అధానాద్యశ్వమేధాంతయాగములు నేనే. అద్వితీయత్వమర్థముగాగల “ఏవ” అనునది యంతట నన్వయింప నగును. ఔపాసనాదీశానవల్యన్తస్మార్తకర్మలు నాస్వరూపమే. అంశులను క్రతుయజ్ఞములు బ్రహ్మస్వరూపమగుచో తదంగములగు దేవతాయజమానాదులకు బ్రహ్మస్వరూపత్వము సిద్ధించునని తెలిసికొనవలెను. పితృదేవతలకొఱకు చేయబడు పితృశ్రాద్ధాదికము “స్వధా” అనుశబ్దము యొక్క యర్థముగ పితృశ్రాద్ధాదికము నాస్వరూపమే. వ్రీహ్యాద్యోషధులచే సముత్పన్నమై ప్రాణులచే భుజింపబడుచున్న యన్నము నాస్వరూపమే. భోజ్యమగు యన్నము బ్రహ్మస్వరూప మగుచో భోక్తలగు ప్రాణులకు బ్రహ్మత్వము సిద్ధమే. దేవతలకు, పితృదేవతలకు స్వాహాస్వధాంతముకల యేమంత్రముచే హవిస్సు యీయబడునో యామంత్రములు నాస్వరూపమే. ఆజ్యము, పురోడాశాదికము నాస్వరూపమే. అగ్నియు నాస్వరూపమే. హవనక్రియయు నాస్వరూపమే. ॥౧౬॥

గీ॥ గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్।
ప్రభవః ప్రలయ స్థ్సానం నిధానం బీజ మవ్యయమ్॥ ॥౧౮॥

ప ద వి భా గ ము:— గతిః- భర్తా- ప్రభుః- సాక్షీ- నివాసః- శరణం- సుహృత్- ప్రభవః- ప్రలయః- స్థానం- నిధానం- బీజం- అవ్యయమ్ ॥ ॥౧౮॥

ప్ర తి ప దా ర్థ ము:— గతిః=కర్మఫలము; భర్తా=పోషించువాడు; ప్రభుః=స్వామియు; సాక్షీ=సాక్షియు; నివాసః=నివాసస్థానము; శరణం=ఆర్తిహరుడు; సుహృత్=సుహృత్తున్ను; ప్రభవః=ఉత్పత్తియు; ప్రలయః=ప్రలయస్థానము: స్థానం=స్థితిస్థానము; నిధానం=నిక్షేపము; అవ్యయం=నాశరహితమైన; బీజం=ప్రరోహ కారణము: అహం=నాస్వరూపమే యని పూర్వశ్లోకముతో సంబంధము. ॥౧౮॥

శాంకరభాష్యమ్:—

కించ — గతిః కర్మఫలం, భర్తా పోష్టా, ప్రభుః స్వామీ, సాక్షీ ప్రాణినాం కృతాకృతస్య. నివాసో యస్మి న్ప్రాణినో నివసంతి, శరణ మార్తానాం మత్ప్రపన్నానా మార్తిహరః, సుహృత్ప్రత్యుపకారానపేక్షః సన్నుపకారీ, ప్రభవ ఉత్పత్తి ర్జగతః, ప్రలయః ప్రలీయతే యస్మి న్నితి। తథా స్థానం తిష్ఠ త్యస్మి న్నితి। నిధానం నిక్షేపః కాలాంతరోపభోగ్యం ప్రాణినాం, బీజం ప్రరోహకారణం ప్రరోహధర్మిణామ్। అవ్యయం యావ త్సంసారభావిత్వా దవ్యయమ్। న హ్యబీజం కించి త్ప్రరోహతి। నిత్యం చ ప్రరోహదర్శనా ద్బీజసంతతి ర్న వ్యేతీతి గమ్యతే। ॥౧౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కర్మఫలము, పోషించువాడు, స్వామి, ప్రాణుల కృతాకృతములకు సాక్షియు, ప్రాణులు నివసించు స్థానము, ఆర్తులైన మత్ప్రపన్నుల యార్తిహరుడు, ప్రత్యుపకారము నపేక్షింపక నుపకార మొనరించు వాడు, జగిత్తున కుత్పత్తి, లయస్థానము, ఉన్కి స్థితిస్థానము, ప్రాణులకు కాలాంతరమున నుపభోగ్యమగు నిక్షేపము (పాతు) ప్రరోహధర్మము కల వాట్లకు ప్రరోహకారణము, (అట్టి బీజము సంసారముండువర కుండునది కాన నాశరహిత మనబడును. బీజము లేనిదే యేదియు మొలవదు. నిత్యము ప్రరోహదర్శనమువలన బీజసంతతి నశింప దని తోచుచున్నది.) ఇవన్నియు నా స్వరూపమే యని పూర్వశ్లోకముతో సంబంధము. ॥౧౮॥

—• ౯వ అధ్యాయము ౧౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మ హ మా ద న స ర్వ తీ య ము:— ఈనిఖిలప్రాణిజాతమునకు తండ్రి, తల్లి. పోషకుడు, లేక, తత్కర్మఫలదాత, తండ్రికి తండ్రి (తాత) తెలిసికొనదగినవస్తుజాతము. శుద్ధిహేతుకగు గంగాస్నానగాయత్రీజపాదికము, తెలిసికొనదగిన బ్రహ్మవిషయకజ్ఞానసాధనమగు ఓంకారము, ఋగ్వేదము, (నియతాక్షర పాదములు కలది) సామవేదము (గీతిసహితఋక్కులు) గీతిరహితమైన యనియతాక్షరములుకల యజుర్వేదము, (ఈమూడును వేదముల మంత్రములు కర్మోపయోగులు) చకారమువలన ప్రాప్తించిన అథర్వాంగిరస్సు (అథర్వణవేదము) యీసర్వము నాస్వరూపమే. ॥౧౭॥

గీ॥ తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ ।
అమృతం చైవ మృత్యు శ్చ స దస చ్చాహ మర్జున ॥ ॥౧౯॥

పదవిభాగము:— తపామి- అహం- అహం- వర్షం- నిగృహ్ణామి- ఉత్సృజామి- చ- అమృతం- చ- ఏవ- మృత్యుః- చ- సత్- అసత్- చ- అహం- అర్జున ॥ ॥౧౯॥

ప్రతిపదార్థము:— అహం=నేను; తపామి=తపింపచేయుచున్నాను; అహం=నేను; వర్షం=వర్షమును; ఉత్సృజామి=విడచిపెట్టుచున్నాను; అహం=నేను; వర్షం=వర్షమును; నిగృహ్ణామి=గ్రహించుచున్నాను; (లాగుకొనుచున్నాను.) హేఅర్జున=ఓయర్జునుడా; అహం=నేను; అమృతం=అమృతస్వరూపుడను; అహం=నేను; మృత్యుశ్చ=మృత్యుస్వరూపుడను; సత్=సత్స్వరూపుడను; అహం=నేను: అసచ్చ=అసత్స్వరూపుడను. ॥౧౯॥

శంకరానందీయము:— మాయాశబలము బ్రహ్మము. అట్టి బ్రహ్మమునుండి యవ్యక్తము, అవ్యక్తమునుండి మహత్తు, మహత్తునుండి యహంకారము, అహంకారమునుండి పంచతన్మాత్రలు జనించుచున్నవని శ్రూయమాణమగుటవలన యాకాశాదిపంచకమునకు జనకుడను నేనే. "మాతా" అవ్యక్తము, అపరాప్రకృతియు నేనే. "పితామహః" అక్షరసంజ్ఞికమైన మాయోపాధికుడనగు నీశ్వరుడ నేనే. "ధాతా" పోషించువాడను నేనే. తెలిసికొన దగిన శబ్దస్పర్శరూపాదిలక్షణములుకల నిఖిలవస్తువులు నేనే. పవిత్రకరమగు సూర్యాగ్నివాయ్వాదినిఖిలవస్తువులు నాస్వరూపమే. పరాపరబ్రహ్మవాచకమగు ఓంకారము నాస్వరూపమే. ఋక్సామయజుస్సులు, అథర్వణము యితిహాసపురాణాదికము నాస్వరూపమే. ॥౧౭॥

—• ౯వ అధ్యాయము ౧౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "గతిః" కర్మఫలము, "భర్తా" సుఖసాధనమునిచ్చువాడు, "ప్రభుః" వీడు నావాడని స్వీకరించువాడు, "సాక్షీ" సర్వప్రాణుల శుభాశుభములను చూచువాడు, "నివాసః" భోగస్థానము, "శరణం" ప్రపన్నుల యార్తిని హరించువాడు, "సుహృత్" ప్రత్యుపకారము నపేక్షింపక యుపకారమొనరించువాడు, "ప్రభవః" ఉత్పత్తి, "ప్రలయః" వినాశము, "స్థానం" స్థితి, లేక "ప్రకర్షేణ భవన్త్యనేనేతి ప్రభవః" స్రష్టయు, "ప్రకర్షేణ లీయన్తేఽనేనేతి ప్రలయః" సంహర్తయు, "తిష్ఠన్త్యస్మిన్నితిస్థానం" ఆధారము, 'నిధానం' తత్కాలభోగాయోగ్యమగుటచే కాలాంతరోపభోగ్యమగు వస్తువు దేనియందుంచబడునో అట్టి సూక్ష్మరూపవస్త్వధికరణమైన ప్రలయావస్థానము, లేక శంఖపద్మాదినిధులు, 'బీజం' ఉత్పత్తికారణము, 'అవ్యయం' వ్రీహ్యాదులవలె నశించనిది; ఈచెప్పుటచేత అనాద్యనంతమైన కారణము యీసర్వము నాస్వరూపమేయని పూర్వశ్లోకముతో సంబంధము. ॥౧౮॥

శంకరానందీయము;— కర్మఫలమగు స్వర్గాదికము నాస్వరూపమే. జగత్తును ధరియించు యూదికూర్మము నాస్వరూపమే. నియంతయు నాస్వరూపమే. ప్రాణికృతకర్మసాక్షులగు ఆదిత్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు నాస్వరూపమే. సర్వభూతధాత్రియు నాస్వరూపమే. ఆర్తుల యార్తిని పొంగొట్టువాడను నేనే. దయచే ప్రాణుల కుపకారమొనరించు చంద్రపర్జన్యవాయువులు నాస్వరూపమే. సర్వజగత్సృష్టికి కారణము నేనే. సర్వజగత్సంహర్తయు నేనే. స్థితికారణము నేనే. కార్యకారణ ప్రపంచాధిష్ఠానము నేనే. జ్ఞానవ్యతిరిక్తముచే నశించని జగద్బీజమగు నవ్యాకృతము నాస్వరూపమే. ॥౧౮॥

శాంకరభాష్యమ్:—

తయా విద్యమానం తద్విపరీత మసచ్చైవాహమర్జున । న పున రత్యంత మేవాస ద్భగవా న్స్వయం కార్యకారణే వా సదసతీ । యే పూర్వోక్తై రనువృత్తిప్రకారై రేకత్వపృథక్త్వాదివిజ్ఞానై ర్యజ్ఞై ర్మాం పూజయంత ఉపాసతే జ్ఞానవిద స్తే యథావిజ్ఞానం మా మేవ ప్రాప్నువంతి ॥౧౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నేనట్టి సద్రూపము. తద్విపరీత మసత్తనబడును. ఓయర్జునా! నేనట్టి యసద్రూపము. అట్లగుచో భగవంతు డత్యంత మసద్రూపమా? యని శంకింపజనదు. "సత్" అనగ కార్యము: "అసత్" అనగా కారణము. కార్యకారణస్వరూపము భగవంతుడ నగు నేను అని యర్థము. పూర్వము నందు చెప్పబడిన యనువృత్తిప్రకారరూపములైన యేకత్వ పృథక్త్వాదివిజ్ఞానరూపములగు యజ్ఞములచే నెవరు నన్ను పూజించి యుపాసించెదరో యట్టి జ్ఞానవిదులు వారియుపాసనానుగుణముగ నన్నే పొందుచున్నారు. ॥౧౯॥

వస్తువుకలదను మొదటిపక్షమున యావస్తువు సద్రూపముచే నుండెనా? యసద్రూపముచే నుండెనా? యసద్రూపమున కలదను పక్షమున శశవిషాణసదృశమగు యసద్వస్తువునకు "అస్తి" (కలదు) అను నిర్దేశమే సంభవింపనందున యాపక్ష ముపపన్నము కాదు. అట్లగుచో సద్రూపముచేతనే యుండు ననెదవా? బ్రహ్మాతిరిక్తమునకు సత్త్వమే లేనందున సర్వము బ్రహ్మస్వరూపమే. సర్వము బ్రహ్మస్వరూప మగుచో ఘటపటాదులు నశించిన బ్రహ్మము గూడ నశించెడిని యని శంకింపజనదు. నాశమనునది భ్రమకల్పితవ్యాప్యాంశవిషయము. ఎట్లన: ఘటాదికముచే గల్పితమగు కంబుగ్రీవాద్యాకారవత్తగు వ్యాప్యాంశ మగు ఘటమునకు నాశము కన్పట్టుచున్నది. వ్యాపకాంశమగు మృత్తునకు నాశము కన్పట్టుటలేదు. అట్లే వ్యాప్యాంశమగు భ్రమకల్పితనామరూపాదులకే నాశము కాని, వ్యాపకాంశమగు సత్తునకు నాశము లేదు. అసత్తే నశించినచో దృశ్యము, తద్భానముగూడ లేకపోవును. కాన దృశ్యము, దృశ్యభావము, సదాత్మ స్వరూపముతో నున్నవి. కాన సర్వము బ్రహ్మస్వరూప మని పర్యవసితము. కాబట్టి యిష్టమగు వస్తువు నందు బ్రహ్మబుద్ధితో నాచరించిన యుపాసనము- ఫలసిద్ధి భావనానురూపమగుట- ఫలసిద్ధికై సమర్థమగుచున్నది. ॥౧౯॥

పరమార్థప్రప;— ఈస్థూలప్రపంచస్వరూపుడనుగూడ నేనే యని యీశ్లోకమున జెప్పుచున్నాడు:— నేను ప్రలయకాలమున ద్వాదశాదిత్యరూపుడనై భూతసమూహమును తపింపజేయుచుంటిని. ఈవిషయమున నారాయణీయోపనిషత్తునందు "అర్ద్రం జ్వలతి జ్యోతి రహ మస్మి జ్యోతి ర్జ్వలతి బ్రహ్మాహ మస్మి" (అనగా ప్రలయకాలమున శుక్రశోణితోద్భవమగు ప్రాణిజాతము ద్వాదశాదిత్యరూపమగు సంకర్షణముఖాగ్నిచే దహింపబడుచున్నది. ఆకాలమున నేను జ్యోతీరూపమగు తైజసవిరాడ్రూపము నైతిని. అనంతర మెపుడాజ్యోతిస్సు జ్వలించునో యపుడు నేను లింగరూపమగు బ్రహ్మము నైతిని.) అని చెప్పబడెను. అట్లే నేనే పర్జన్యుని యాకర్షించెదను. నేనే తిరిగి వృష్టికాలమున పర్జన్యుని విడిచిపెట్టెదను. నేనే జీవనస్వరూపుడను. క్రమప్రాప్తమగు మృత్యువును నేనే. వ్యవహారసత్తైన స్థూలప్రపంచరూపుడను, సూక్ష్మప్రపంచరూపమగు యసత్తును గూడ నేనే యని యర్థము. ॥౧౯॥

గీ॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే।
తే పుణ్య మాసాద్య సురేన్ద్రలోక మశ్నన్తి దివ్యా న్దివి దేవభోగాన్॥ ॥౨౦॥

పదవిభాగము:— త్రైవిద్యాః- మాం- సోమపాః- పూతపాపాః- యజ్ఞైః- ఇష్ట్వా స్వర్గతిం- ప్రార్థయన్తే- తే- పుణ్యం- ఆసాద్య- సురేన్ద్రలోకం- అశ్నన్తి- దివ్యాన్- దివి- దేవభోగాన్ ॥౨౦॥

ప్రతిపదార్థము:— త్రైవిద్యాః=ఋగ్యజుస్సామవేత్తలు; సోమపాః=సోమపానముచేసినవారై; పూతపాపాః=పూత=పవిత్రితమైన; పాపాః=పాపములుకలవారై; (క్షాళితమైన పాపములుకలవారై)మాం= వసురుద్రాదిత్యాదిస్వరూప మగునన్నునుగూర్చి; యజ్ఞైః=అగ్నిష్టోమాదియజ్ఞములచే; ఇష్ట్వా=యాగము చేసి; స్వర్గతిం= స్వర్గమునుగూర్చి గమనమును; ప్రార్థయన్తే= ప్రార్థించుచుండిరి; తే= వారు; పుణ్యం= పుణ్యఫలమగు; సురేంద్రలోకం= స్వర్గలోకమును; ఆసాద్య= పొంది; దివి= స్వర్గమునందు; దివ్యాన్= స్వర్గమునందైన (అప్రాకృతమైన;) దేవభోగాన్= దేవతలభోగములను; అశ్నన్తి=అనుభవించుచుండిరి. ॥౨౦॥

శాంకరభాష్యమ్:—

యే పున రజ్ఞాః కామకామాః— త్రైవిద్యా ఋగ్యజుస్సామవిదో మాం వస్వాదిదేవరూపిణం సోమపాః సోమం పిబంతీతి సోమపా స్తేనైవ సోమపానేన పూతపాపాః శుద్ధకిల్బిషా యజ్ఞై రగ్నిష్టోమాదిభి రిష్ట్వా పూజయిత్వా స్వర్గతిం స్వర్గగమనం స్వర్గతి స్తాం ప్రార్థయంతే। తే చ పుణ్యం పుణ్యఫల మాసాద్య సంప్రాప్య సురేంద్రలోకం శతక్రతోః స్థాన మశ్నంతి భుంజతే దివ్యా న్దివి భవా నప్రాకృతా న్దేవభోగా న్దేవానాం భోగా స్తాన్ ॥౨౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏయజ్ఞులు కామకాములో అట్టి ఋగ్యజుస్సామవేదములను తెలిసికొనినవారు యజ్ఞములయందు సోమపాన మొనరించి యాసోమపానముచేతనే పాపములను పోఁగొట్టుకొనినవారై నిర్ధూతపాపులై వసురుద్రాదిత్యాదిస్వరూపమున నున్ననన్నుగూర్చి యగ్నిష్టోమాదిక్రతువులచే యాగ మొనరించి స్వర్గగమనమును ప్రార్థించుచుండిరి. అట్టివారు పుణ్యఫలమగు స్వర్గలోకమును పొంది స్వర్గమునందు అప్రాకృతమైన దేవభోగముల ననుభవించుచుండిరి. ॥౨౦॥

—• ౯వ అధ్యాయము ౨౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు ఏకత్వముతో, పృథక్త్వముతో ననేకవిధముల నుత్తమ, మధ్యమ, మందాధికారులు నిష్కాములై భగవంతు నుపాసించుచు సత్త్వశుద్ధిజ్ఞానోత్పత్తిద్వారమున క్రమముగ ముక్తులగుదురు. ఎవరు సకాములై యేవిధముగనుగూడ భగవంతు నుపాసింపక, తమతమకోరికలకు సాధనములగు కామ్యకర్మములనే చేయుదురో, యట్టివారు సత్త్వశోధకము లేమింజేసి జ్ఞానసాధనమును పొందనివారై, మాటిమాటికి జన్మమరణప్రబంధముచే నెల్లపుడు సంసారదుఃఖమునే యనుభవించెదరని 'త్రైవిద్యామాం'' అను శ్లోకము మొదలుకొని రెండుశ్లోకములచే జెప్పుచుండెను. ఋగ్వేద, యజుర్వేద, సామ

గీ॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా గతాగతం కామకామా లభన్తే॥ ॥౨౧॥

పదవిభాగము:— తే- తం- భుక్త్వా- స్వర్గలోకం- విశాలం- క్షీణే- పుణ్యే- మర్త్యలోకం- విశన్తి- ఏవం- త్రయీధర్మం- అనుప్రపన్నాః- గతాగతం- కామకామాః- లభన్తే ॥౨౧॥

ప్రతిపదార్థము:— తే=వారు; విశాలం=విస్తీర్ణమైన; స్వర్గలోకం=స్వర్గలోకమును; భుక్త్వా=అనుభవించి; పుణ్యే=పుణ్యము; క్షీణే=క్షీణింప; మర్త్యలోకం=భూలోకమును; విశన్తి=ప్రవేశించుచుండిరి. ఏవం=ఇట్లు; త్రయీధర్మం=కేవలవైదికకర్మను; అనుప్రపన్నాః=పొందినవారై; గతాగతం=గమనాగమనములను; కామకామాః=విషయములను కోరెడివారై; లభన్తే=పొందుచున్నారు. ॥౨౧॥

---

వేదరూపములు, హోత్ర, అధ్వర్యవ, ఔద్గాత్రప్రతిపత్తి హేతువులగు మూడువిద్యలు కలవారు 'త్రైవిద్యు' లనబడుదురు. వేదత్రయవేత్తలగుయజ్ఞానుష్ఠానపరులు "యజ్ఞై రిష్ట్వా" అగ్నిష్టోమాదిక్రమముతో సవనత్రయమునందు వసురుద్రాదిత్యస్వరూపుడ నగు నన్ను గూర్చి యాగముచేసి, ఆవసురుద్రాదిత్యస్వరూపునిగ నన్ను తెలిసికొనని వారై, వస్తుస్థితి ననుసరించి నన్ను పూజించి, స్తుతించి, హోమముజేసిగూడ "సోమపాః పూతపాపాః" సోమపాయులై, స్వర్గభోగప్రతిబంధకము లగుసకలపాపములను నశింపజేసికొనినవారై, "స్వర్గతిం ప్రార్థయన్తే" సకాములగుటచే స్వర్గగమనమును కోరుచుండిరిగాని సత్త్వశుద్ధి, జ్ఞానోత్పత్తి మొదలగు దానిని కోరుకొనకుండిరి. "తే—భోగాన్" అట్టి సకాములు స్వర్గమున సర్వోత్కృష్టమగు ఇంద్రలోకముననుండి మనుష్యాలభ్యములును, దేవదేహోపభోగ్యములు నగు భోగములననుభవించుచుండిరి. ॥౨౦॥

శంకరానందీయము:— ద్వైవిధమున మందబుద్ధులగు ముముక్షువుల కుపాసనాసిద్ధికై క్రత్వాది, అసదంతము నాస్వరూపమే యని చెప్పి, సర్వము తన స్వరూపమే యని ప్రతిపాదించి "రాజవిద్యా" అనుస్థలమునందు బ్రహ్మవిద్యావ్యతిరిక్తము లగుచు సకలవేదశాస్త్రాధ్యయనజనితము లగు విద్యలు సంసారవర్ధకములేయగు నని చెప్పి యావిషయమునే "అశ్రద్ధధానాః" అనుస్థలమున నిరూపించి ప్రస్తుతము కూడ ముముక్షువులకు వివేకసిద్ధికై తిరిగి యావిషయమునే రెండుశ్లోకములచే ప్రతిపాదించుచుండెను. "త్రైవిద్యాః—ప్రార్థయన్తే" ఋగ్యజుస్సామాథర్వణవేదముల నెవరధ్యయన మొనరించెదరో వాటి యర్థమును తెలిసికొనెదరో వారు "త్రైవిద్యు" లనబడుదురు. అట్టివారు సోమపాయులై, అగ్నిష్టోమాతిరాత్రాదుల జేసి యష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, ప్రజాపతి, వషట్కారము నను దేవతాస్వరూపుడ నైననన్నారాధించి స్వర్గప్రాప్తిని గోరుచుండిరి. అట్టివారు స్వర్గమున దేవభోగముల మాత్రమనుభవించి, "యావత్సంపాత ముషిత్వా" అనున్యాయమున పుణ్యఫలానుభవకాలపర్యంతము స్వర్గభోగముల ననుభవించెద రని యర్థము. ॥౨౦॥

శ్రీధరీయము:— "అవజానన్తి మాం మూఢాః" అనుశ్లోకము మొదలుకొని రెండుశ్లోకములచే మూఢులు క్షిప్రఫలాశచే దేవతాన్తరమును సేవించుచు నన్ను ఆదరింపకుండిరి. అనిచెప్పి, "మహాత్మాన స్తు మాం పార్థ" అనుదానిచే పరమేశ్వరభక్తులు చెప్పబడిరి. ఇక నేకత్వముచేగాని, పృథక్త్వముచేగాని నన్ను (పరమేశ్వరు) నెవరు సేవింపరో యట్టివారికి జన్మమృత్యుప్రవాహము దుర్వారమే యని రెండుశ్లోకములచే జెప్పుచుండెను. (శేషము గతార్థము) ॥౨౦॥

—— ౯వ అధ్యాయము ౨౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ——

మధుసూదనసరస్వతీయము:— అట్టి సకాములు స్వర్గమునుభవించుచో గలుగు అనర్థమేమి? అనుశంకపై జెప్పుచున్నాడు. "తే తం...విశంతి" ఆసకాములు కామ్యపుణ్యముచే ప్రాప్తమైన

శాంకరభాష్యమ్:—

తే త మితి । తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం విస్తీర్ణం క్షీణే పుణ్యే మర్త్యలోక మిమం విశన్త్యావిశంతి । ఏవం హి యథోక్తేన ప్రకారేణ త్రైధర్మ్యం కేవలం వైదికం కర్మా ఽనుప్రపన్నా గతాగతం గతం చాగతం చ గతాగతం గమనాగమనం కామకామాః కామా న్కామయంత ఇతి కామకామా లభంతే గతాగత మేవ న తు స్వాతంత్ర్యం క్వచి ల్లభంత ఇత్యర్థః ॥ ॥౨౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అట్టివారు విస్తీర్ణమైన స్వర్గలోకము ననుభవించి పుణ్యము నశింప భూలోకమును పొందుచున్నారు. ఇట్లు వేదత్రియధర్మమున వైదికకర్మలను పొందినవారై (అనుష్ఠించిన వారై) స్రక్చందనవనితాదిభోగములను కోరెడివారు యాతాయాతముల పొందుచున్నారు. ఎప్పుడును స్వాతంత్ర్యమును పొందుటలేదు. ॥౨౧॥

విస్తీర్ణమగు స్వర్గలోకము ననుభవించి ఆభోగములకు కారణమగు పుణ్యము నశింప యాదేహము నశింప, తిరిగి దేహధారణమునకై మర్త్యలోకమును ప్రవేశించుచుండిరి. (తిరిగి గర్భవాసాదియాతనల ననుభవించు చుండిరని యర్థము.) "ఏవం...లభన్తే" పైన జెప్పిన విధమున జ్యోతిష్టోమాదికర్మ నాచరించినవారై, యనాది యగుసంసారమునందు దివ్యకాములను కోరువారై గతాగతమును పొందుచుండిరి. కర్మల నాచరించి స్వర్గమును పొంది, యటనుండి తిరిగి మర్త్యలోకమునకువచ్చి, తిరిగి కర్మ చేయుచుండిరి. ఈవిధముగా గర్భవాసాదియాతనాప్రవాహము వారలకెల్లపు డనువర్తించుచున్నది యని యభిప్రాయము. ॥౨౧॥

శంకరానందీయము:— సోమపాయు లగు ఆస్వర్గకాములు స్వస్వపుణ్యాధిక్యముచే యపారమైన స్వర్గీయమైన సుఖవిశేషము ననుభవించి, యనంతరమున ఆసుఖవిశేషకారణమైన పుణ్య విశేషము నశింప, మర్త్యలోకము నొందుదురు. (ఆదేవదేహమును త్యజించి తిరిగి మర్త్యలోకమున జన్మించు చుండిరని యర్థము.) ఈవిధముగ శ్రుతిప్రతిపాదితమైన కర్మకాండము నాచరించి "త్రికర్మకృ త్తరతి జన్మమృత్యూ. దక్షిణావన్తో అమృతత్వం భజన్తే" త్రికర్మకృత్తు (నాచికేతమంత్రాధ్యయనము, తన్మంత్రార్థమును తెలిసికొనుట, నాచికేతాగ్నిచయన మాచరించుట యీమూడును త్రికర్మలనంబడును. యీమూడుకర్మల నాచరించువాడు త్రికర్మకృత్తనబడును.) జన్మమృత్యురూప మగుసంసారమును దాటును. మరియు కర్మల నాచరించి యాయాకర్మలకు విహితమైన దక్షిణల నొసరించువారలు దక్షిణావంతు లనబడుదురు. అట్టివారు మోక్షమును పొందుచున్నా రనునది మొదలగు యర్థవాదవాక్యపూర్వకమైన వేదములచే చెప్పబడిన ధర్మమగు కర్మమునే శరణుపొందినవారలై, శ్రుత్యుక్తమైన కర్మయే నిశ్శ్రేయ సాభ్యుదయముల సిద్ధికి కారణము కాని, శమము, దమము, సంన్యాసము, జ్ఞానము, ఈశ్వరుడునివి కారణము కావను నిశ్చయము ననుసరించి కేవలకర్మైకనిష్ఠులై కామకాములై అనగా భూసంబంధమైనవియు, స్వర్గీయ ములునగు విషయములను కోరువారైన విషయభోగలంపటులైన మీమాంసకులు పండితులైనను చెప్పినరీతిగ కర్మ లాచరించునట్టి యనుసరతమైన గమనాగమనమునే పొందుచున్నారు. స్వర్గమునుండి వచ్చి పుట్టుచుండిరి. పుట్టి తిరిగి మరణించి స్వర్గమునే పొందుచున్నారు. ఇట్టి జననమరణ ప్రవాహమునందు కాములు మునుగు చుండిరి. ॥౨౧॥

గీ॥ అనన్యా శ్చింతయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్ ॥ ౨౨

పదవిభాగము:— అనన్యాః- చిన్తయన్తః- మామ్- యే- జనాః- పర్యుపాసతే- తేషామ్- నిత్యాభియుక్తానామ్- యోగక్షేమమ్- వహామి- అహమ్ ॥౨౨॥

ప్రతిపదార్థము:— యే జనాః=ఏసంన్యాసులు; అనన్యాః=అపృథగ్భూతులై; (పరమేశ్వరుడగు నారాయణుని యాత్మస్వరూపముగ పొందినవారై;) మామ్=నన్ను; (పరమేశ్వరుని) చిన్తయన్తః=చింతించుచున్నవారై; పర్యుపాసతే=అంతటసాకల్యముచే నద్వైతదృష్టిచేత యుపాసించెదరో; తేషామ్=ఆ మార్గదర్శులగునట్టి; నిత్యాభియుక్తానామ్=సతతాభియోగులగు వారలయొక్క; యోగక్షేమమ్= యోగః=అప్రాప్తమగు దానియొక్క ప్రాపణము; క్షేమమ్=ప్రాప్తపరిరక్షణమనెడిరెంటిని; అహమ్=నేను; వహామి=పొందించుచుంటిని. ॥౨౨॥

పరమార్థప్రప:— స్వర్గమునందు దేవభోగముల ననుభవించినతరువాత యేమగు ననెదవా! అను శంకపై "తే తం" అని చెప్పుచుండెను.

అట్టివారు స్థూలఫలమునిచ్చు విశాలమైన స్వర్గలోకము ననుభవించి స్వర్గార్థ మాచరితమైన పుణ్యము నశింప దేవదేహమును విడచి తిరిగి లింగదేహముచే గర్భమును ప్రవేశించుచుండిరి. ఈవిధముగ వేదత్రయముచే చూపబడిన ఫలప్రశంసనరూపమగు ధర్మమును లక్ష్యము మొనరించుకొని యాజ్ఞికులు ప్రవృత్తులైరి. అట్టివారు విషయములను కోరువారై యాతాయాతములను పొందుచుండిరి. ఈవిషయమునే "ఆత్మానమేవలోకముపాసీత సయ ఆత్మానమేవ ముపాస్తే నహాస్య కర్మ క్షీయతే అస్మాద్ధ్యేవాఽఽత్మనోయద్యత్కామయతే తత్తత్సృజతే" అన్యదేవతోపాసనచే నికృష్టఫలప్రాప్తియేగాదు. యనర్థముగూడజేకూరునని పూర్వమునందు చెప్పబడెను. కాన దేనిచే సర్వము పొందబడునో యది ఆత్మయనబడును. అట్టియాత్మనే యుపాసింపవలయును. యితరమునుపాసింపరాదు. ఎవ డాత్మనుపాసించునో అట్టి వాని కర్మ భోగముచే నశింపదు. మరే మగుననెదవా! ఆకర్మ జ్ఞానమును పుట్టించి మోక్షమును పొందించును. వాడు విషయసుఖము నపేక్షించుచు నాత్మవలననే యావిషయసుఖమును పొందునని 'అస్మాత్' అనువాక్యముచే చెప్పుచుండెను. అట్టి యాత్మోపాసకుడు ఏయే విషయసుఖమును కోరునో యాయా విషయసుఖమునెల్ల యాత్మవలననే సృజించుకొనును. అట్టివాడు అష్టసిద్ధులను పుట్టించును. కాన ఇతరమును పుట్టించునని చెప్పనవసరము లేదు. అని శృతియందు టిప్పణులయందు చెప్పబడెను. 'యత్సత్యం తముపాసితవ్యం సత్యం యతో లభ్యతే ఽసత్యోపాసనయా తత్రైవ చ ఫలం. స్వప్నక్షేత్రరాజ్యాదివత్ ఆయాసే సమ్యకే ఽతుచ్ఛఫలదే మార్గే ప్రపత్తిః కథం మాయావైభవ మేతదేవ తదిదం భక్త్యా హరే ర్వ్యాప్యతే' సత్యోపాసనవలన సత్యమే పొందబడును. అసత్యోపాసనలవలన స్వప్నమునందు రాజ్యప్రాప్తివలె యసత్యమే పొందబడును. ఆయాసము సమానమైయుండ తుచ్ఛఫలము నిచ్చు మార్గమునందు ప్రవృత్తి యెందులకు! ఈజగమంతయు మాయావైభవమే. శ్రీహరిభక్తిచే సత్యమే పొందబడును. సత్యమైనది యాత్మయే. కాన ఆత్మయే యుపాసింపదగినదనిభావము.

—• ౯వ అధ్యాయము ౨౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నిష్కాములగు సమ్యగ్దర్శులు "అనన్యాః" నేనుతప్ప విషయములేనివారై అనగా (సర్వాద్వైతదర్శులై) సర్వభోగములయందు కోరికలేనివారై, నేనే సర్వాత్మ

శాంకరభాష్యమ్:—

యే పున ర్నిష్కామాః సమ్యగ్దర్శినః— అనన్యా అపృథగ్భూతాః పరం దేవం నారాయణ మాత్మత్వేన గతా స్సంత శ్చింతయంతో మాం యే జనా స్సంన్యాసినః పర్యుపాసతే తేషాం పరమార్థదర్శినాం నిత్యాభియుక్తానాం సతతాభియోగినాం యోగక్షేమం యోగోఽప్రాప్తస్య ప్రాపణం క్షేమ స్తద్రక్షణం త దుభయం వహామి ప్రాపయా మ్యహమ్ । జ్ఞానీ త్వాత్మైవ మే మతం సచ మమ ప్రియో యస్మా త్తస్మా త్తే మమాత్మభూతాః ప్రియా శ్చేతి । నన్వ న్యేషా మపి భక్తానాం యోగక్షేమం వహత్యేవ భగవాన్ । సత్య మేవం వహ త్యేవ । కిం త్వయం విశేషోఽన్యే యే భక్తాస్తే స్వాత్మార్థం స్వయ మపి యోగక్షేమ మీహంతేఽనన్యదర్శిన స్తు నాఽఽత్మార్థం యోగక్షేమ మీహంతే । న హి తే జీవితే మరణే వాఽఽత్మనో గృద్ధిం కుర్వంతి కేవల మేవ భగవచ్ఛరణా స్తే । అతో భగవా నేవ తేషాం యోగక్షేమం వహతీతి ॥౨౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నిష్కాములు, సమ్యగ్దర్శులు, నగు యే సంన్యాసులు పరమేశ్వరుడగు నారాయణుని యాత్మస్వరూపముగ పొందినవారై పరమేశ్వరుడనగు నన్ను చింతించుచు యుపాసించెదరో వారు నిత్యాభియుక్తులు. (యెల్లప్పుడుయోగముతోగూడినవారు.) వారలయోగక్షేమమును— (యోగమనగనప్రాప్తమైనదానియొక్క ప్రాపణము, క్షేమమనగ ప్రాప్తమైనదానియొక్క పరిరక్షణము) నేను పొందించెదను. "జ్ఞానీ త్వాత్మైవ మే మతం, సచ మమ ప్రియః" జ్ఞాని యైతే యాత్మయే యని నామతము. అట్టి జ్ఞాని నాకు ప్రియుడు కాన నట్టి వారు భగవంతుడైన వాసుదేవుడను, నాకంటెవేరుగ నేదియు లేదని తెలిసికొని యాప్రత్యగ్రూపమగు యాత్మనే యెల్లప్పుడు చింతించువారై సాధనచతుష్టయసంపన్నులై యేసంన్యాసులు అంతట అనవచ్ఛిన్నులుగనే నారాయణుడనగు నన్నే చూచెదరో, అట్టివారు మదనన్యులగుటచే (నాస్వరూపులగుటచే) కృతకృత్యులే. స్వయముగ ప్రయత్నింపనట్టి, అత్యంతనిష్కాములైన అద్వైతదర్శననిష్ఠులకు యోగక్షేమము [illegible] ననను తొలగించుటకు "అనన్యాః" అని చెప్పుచుండెను. ఎల్లపుడు ధ్యానమునందే [illegible]. దేహయాత్రామాత్రమున కైనను ప్రయత్నింపని యద్వైతదర్శననిష్ఠుల యోగమును, క్షేమమును నేను వహించెదను. (పొందించెదను.) యోగమనగ పొందబడనిదానియొక్క లాభము. లాభమైన లబ్ధమైన దానియొక్క పరిరక్షణము. "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః । [illegible] జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అని యీగీతలయందే చెప్పబడెను. విచారింపగా [illegible] సర్వుల యోగక్షేమములను వహించును. అయినను జ్ఞానుల యోగక్షేమములను వారల ప్రయత్నము లేనిదే వహించును. యితరుల యోగక్షేమములను వారలకు ప్రయత్నము పుట్టించియే తత్ప్రయత్నద్వారమున వహించును. ఇదియే జ్ఞానికిని యజ్ఞానికిని గల విశేషము. ॥౨౨॥

శంకరానందీయము:— నిరీశ్వరవాదులు, కర్మయేముఖ్యమైన శరణగాకలవారు, బాహ్యాశ్రితులగువారు అను వారలకు గతిని చెప్పి, యిపుడు ద్వంద్వాతీతులు, నిత్యసత్త్వస్థులు, యోగక్షేమరహితులు, ఆత్మవంతులు, నిష్కాములు, అహంకారమమకారరహితులు, మదేకశరణులు నగు బ్రహ్మ[illegible]యొక్క యోగక్షేమములను నేనే వహించెద నని "అనన్యాః" అను శ్లోకముచే చెప్పుచుండెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—
జ్ఞానులు నాయాత్మభూతులు, నాకు ప్రియులును యగుచున్నారు. యితరులగు భక్తులయొక్క యోగక్షేమమును పరమేశ్వరుడే వహించును. కాని యీవిశేషము కలదు. యితరభక్తులు స్వాత్మార్థము స్వయముగ యోగక్షేమములను కోరుదురు. అనన్యదర్శులన్ననో యాత్మార్థము యోగక్షేమములను కోరరు. వారుజీవితమునందు కాని, మరణమునందు కాని గృద్ధిని (అపేక్షను) చేయరు. (పొందరు) అట్టివారు కేవలముభగవచ్ఛరణులే యగుదురు. కాన భగవంతుడే యోగక్షేమములను పొందించును. (ఇదియే విశేషము) ॥౨౨॥

ఎవరియొక్క "అహం" అనుబుద్ధికి, "మమ" అనుబుద్ధికి, పరమేశ్వర వ్యతిరిక్తమైన విషయ ముండదో వారనన్యు లనబడుదురు. అట్టి యనన్యులై యెల్లపుడు అద్వైతదర్శననిష్ఠులైనవారై యే యతులు నిర్విశేషము, నిత్యానందైకరసము నగు పరబ్రహ్మమునే వెలుపల, లోపల శబ్దస్పర్శరూపరసగంధాది విషయానవగాహి యగుఏకవృత్తి చేతనే "యీసర్వము నేను బ్రహ్మస్వరూపమే" అని భావన చేయువారై తనను, సర్వమును యెల్లపుడు బ్రహ్మస్వరూపముగ చూచెదరో "నిత్యాభియుక్తానాం-నిత్యో నిరస్తరోఽవిచ్ఛిన్నోఽభియోగ ఆత్మాభిముఖ్యేన బుద్ధివృత్తేర్వస్తుసంయోగ 'స్సాక్షాత్కారలక్షణ స్తద్వన్తః" నిరంతరము విచ్ఛిన్నము కాని అభియోగముకలవారలయొక్క (అనగా బుద్ధివృత్తికి సాక్షాత్కారస్వరూపమైన వస్తుసంయోగముకలవారలు నిత్యాభియుక్తు లనబడుదురు. అట్టినిరంతరసమాహితచిత్తముకల బ్రహ్మవేత్తలయొక్క) యోగక్షేమములను నేను వహించెదను. లేక యోగ మనగ (నిత్యాభియుక్తులయొక్క నిరంతరబ్రహ్మనిష్ఠ.) అట్టి బ్రహ్మనిష్ఠయొక్క "క్షేమం" ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికాద్యుపద్రవరాహిత్యమును యెల్లపుడు నేను చేయుచున్నాను. ॥౨౨॥

భాష్యోత్కర్షదీపిక:— కామకాముల కాయా కామములచే భోగాదికము సిద్ధించును. ఏకత్వదర్శులు నిష్కాములై నిన్ను భజింతురో భోగకామనారహితులగు నట్టివారలకు శరీరస్థితిహేతువులగు యోగక్షేమము లెట్లు సమకూరునను శంకను "అనన్యాః" అను శ్లోకముచే తొలగించుచుండెను.

నాకంటె యపృథగ్భూతులై (నాస్వరూపులై) పరమాత్మస్వరూపుడను, వాసుదేవుడను అగు నన్ను ప్రపన్నులగు జనులు అనగా "నేనే వాసుదేవుడను" అని తెలిసికొని ప్రత్యగభిన్నమగు నన్ను ధ్యానించువారై, సర్వతోఽనవచ్ఛిన్నముగ నన్ను తెలిసికొనెదరో, ఎల్లపు డత్యాదరముచే నాచింతనమునందాసక్తులగునట్టి సమ్యగ్దర్శుల యోగక్షేమములను నేను వహించెదను. యోగమనగ నలబ్ధమగు దానియొక్క ప్రాపణము, లబ్ధమైనదానియొక్క పరిపాలనము క్షేమ మనబడును. జ్ఞాను లతిప్రియు లగుటవలన నట్టివారలకు యోగక్షేమములను సమకూర్చెదను. ఈవిషయమే "జ్ఞానీ త్వాత్మైవ మే మతం, స చ మమ ప్రియః" అని చెప్పబడెను. విచారింప యితరభక్తుల యోగక్షేమములనుగూడ భగవంతుడే వహించును. అయినను యితరభక్తులు ఆత్మార్థము స్వయముగ యోగక్షేమములను కోరెదరు. అనన్యదర్శులన్ననో స్వయముగ యోగక్షేమములను కోరరు. ఇదియే విశేషము. ॥౨౨॥

నీలకంఠీయము:— పైవిధముగ కర్ములకు ఆవృత్తిని, ఫలమును జెప్పి, భక్తులకుగూడ నాభజనముచేతనే సర్వార్థములు సిద్ధించు నని యీశ్లోకమున జెప్పుచున్నాడు—

ఇతరమగు నుపాస్యదేవత లేనివారై, "నేనే భగవద్వాసుదేవస్వరూపుడను" అని యభేదముగ దలచెడివారై, యేజనులు నన్నే సాకల్యముగ నద్వైతదృష్టితో నుపాసించెదరో అట్టి నిత్యాభియుక్తుల

గీ॥ యేఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః।
తేఽపి మామేవ కౌన్తేయ! యజన్త్యవిధిపూర్వకమ్ ॥ ॥౨౩॥

పదవిభాగము:— యే- అపి- అన్యదేవతాభక్తాః- యజన్తే- శ్రద్ధయా- అన్వితాః- తే- అపి- మాం- ఏవ- కౌన్తేయ- యజన్తి- అవిధిపూర్వకమ్ ॥ ॥౨౩॥

ప్రతిపదార్థము:— యే=ఎవరు; అన్యదేవతాభక్తాఅపి=యితరదేవతలయందుభక్తికలవారైనను; శ్రద్ధయా=ఆస్తిక్యబుద్ధితో; అన్వితాః=కూడినవారై; యజన్తే=పూజించెదరో; హే కౌన్తేయ=ఓకుంతీపుత్రుడవగు యర్జున; తేఽపి=అట్టివారున్ను; మామేవ=నన్నుగూర్చియే; అవిధిపూర్వకం= అజ్ఞానపూర్వకముగా; యజన్తి= పూజించుచుండిరి. ॥౨౩॥

శాంకరభాష్యమ్:—

నన్వన్యా అపి దేవతా స్త్వమేవ చే త్తద్భక్తాశ్చ త్వామేవ యజంతే సత్య మేవమ్— యే ప్యన్యదేవతాభక్తా అన్యాసు దేవతాసు భక్తా అన్యదేవతాభక్తా స్సన్తో యజన్తే పూజయన్తే శ్రద్ధయాఽఽస్తిక్యబుద్ధ్యాఽన్వితా అనుగతా స్తేపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వ మవిధి రజ్ఞానం తత్పూర్వక మజ్ఞానపూర్వకం యజంత ఇత్యర్థః ॥౨౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇతరదేవతలుకూడ నీస్వరూపమే యగుచో యితరదేవతాభక్తులుకూడ నిన్నే పూజించుచుండి రందువా? సత్యమే. ఎవరన్యదేవతాభక్తులై, ఆస్తిక్యబుద్ధితో కూడినవారై, పూజించెదరో వారును యజ్ఞానపూర్వకముగా నన్నే పూజించుచుండిరి. ॥౨౩॥

"యోగక్షేమం" (అప్రాప్తమగు యన్నాదులనుగాని, యోగభూమికనుగాని సమకూర్చుట యోగమనబడును. అట్లి సమకూరినదానిని రక్షించుట క్షేమమనబడును.) యోగక్షేమములను నేను నిర్వహించెదను. అట్టివారు అన్నాదికములకుగాని, యూర్ధ్వభూమిప్రాప్తికైగాని చింతింప నవసరములేదని యర్థము. అనన్యచేతస్కు లగు నట్టివారు మదభిన్నులేగాన వారికి సర్వము సిద్ధించునని యర్థము. ఈవిషయమే "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అనుదానుచే జెప్పబడెను. ॥౨౨॥

— • ౯వ అధ్యాయము ౨౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నీకంటె వేరగు వస్తువే లేనందున యితరదేవతలుగూడ నీవే (నీస్వరూపమే) కాన దేవతాంతరభక్తులుకూడ నిన్నే భజించుచుండిరికదా! ఇందు యేమియు విశేషము లేదు. అందుచే వసురుద్రాదిత్యాదిభక్తులు యాతాయాతములను పొందెదరనియు, అనన్యులై నన్ను చింతించువారలు కృతకృత్యు లగుదు రనియు చెప్పుట యెట్లు పొసగు నను శంకను తొలగించుటకు "యేప్యన్యదేవతాభక్తాః" అని చెప్పుచుండెను.

ఎట్లు నాభక్తులు నన్నే పూజించుచుండిరో అట్లే వసురుద్రాదిత్యాదిభక్తులుకూడ ఆస్తిక్యబుద్ధితో కూడినవారై జ్యోతిష్టోమాదులచే నాభక్తులువలె ఆయాదేవతారూపముగ నున్న నన్నే అజ్ఞానపూర్వకముగ అనగా నన్ను సర్వాత్మగ తెలిసికొనక మద్భిన్నులుగ వస్వాదులను కల్పించి పూజించుచుండిరి. ॥౨౩॥

శంకరానందీయము:— "అహం క్రతుః" ఇత్యాదికముచే "క్రతుయజ్ఞమంత్రదేవతాదికము సర్వము నేనే" అని నీకేసర్వాత్మత్వము నీచేతనే సాక్షాత్తు ప్రతిపాదింపబడెను. కామకాములు

గీ॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ।
న తు మా మభిజానన్తి తత్త్వేనాత శ్చ్యవన్తి తే॥ ॥౨౪॥

పదవిభాగము:— అహం- హి- సర్వయజ్ఞానాం- భోక్తా- చ- ప్రభుః- ఏవ- చ- న- తు- మాం- అభిజానన్తి- తత్త్వేన- అతః- చ్యవన్తి- తే ॥ ॥౨౪॥

ప్రతిపదార్థము:— అహంహి= నేనైతే; సర్వయజ్ఞానాం= నిఖిలశ్రౌతస్మార్త యజ్ఞములకు; (కర్మలకు) భోక్తాచ=దేవతాస్వరూపుడనగుటచే భోక్తను; ప్రభురేవచ=ఫలప్రదాతను; మాం=నన్ను; తథా=అట్టివానినిగ; తత్త్వేన=యథార్థముగ; నాభిజానన్తి=యెఱుగరు; అతః=అందువలన; తే=వారు; చ్యవన్తి=యాగఫలమునుండిజారిపోవుచుండిరి. అనగాజ్ఞానఫలమునుపొందక సంసారమునందుపడుచుండిరి. ॥౨౪॥

గూడ ఇంద్రాదిదేవతాస్వరూప మగు నన్నే క్రతువులచే నుపాసించుచుండిరి. ఇట్లు నీభక్తులగువారలకు ముఖ్యఫలభ్రంశ మెట్లు సంభవించును. జన్మాద్యనర్థపాత మెట్లు సంభవించు ననెదవా? "సర్వం హ్యేతద్బ్రహ్మ। సర్వం ఖల్విదం బ్రహ్మ। ఇన్ద్రం మిత్రం। ఏకం సద్విప్రా బహుధా వదన్తి" ఇత్యాదిశ్రుతులచేతను "భూతాని విష్ణుః" ఇత్యాదిస్మృతులచేతను సర్వము బ్రహ్మస్వరూపమే యని చెప్పబడుచుండెను. "అహం క్రతుః" ఇత్యాదికముచే నాసర్వాత్మత్వము నాచేతనే చెప్పబడెను. సర్వదేవాత్మకుడనగు నేను సత్యము. అనిఖిలదేవతలు నన్నే క్రతువులచే నుపాసించుచుండిరి. అయినను శ్రుతియందు, స్మృతియందు, నావాక్యమునందు విశ్వాస ముంచక అవిద్యాఽస్మితాదిదోషముచే "సర్వం బ్రహ్మైవ" అని నన్ను తెలిసికొనక తమయందు, దేవతలయందు, మంత్రాదులయందు భేదబుద్ధిని విడవనివారై నన్నుపాసించుచుండిరి. కాన నట్టివారు నాభక్తులు కారు. మరేమనిన! దేవతలనే పూజించువారగుచుండిరి. ఆ కారణముచేతనే వారలకు ముఖ్యఫలభ్రంశ, అనర్థపాతము సంభవించుచున్న దని సింహావలోకనన్యాయముచే తత్పూర్వశ్లోకార్థము ననుసరించి "యేఽపి" అను శ్లోకము మొదలుకొని మూడు శ్లోకములచే చెప్పుచుండెను.

ఐహికాముష్మికఫలార్థులగు యేబ్రాహ్మణాదులు స్వేష్టదేవతలయందు, ఆదేవతారాధనయందు శ్రద్ధచే అనగా "పరదేవత యిదియే, ఈదేవతయొక్క ఆరాధనచే నేను కృతార్థుడను కాగలను" అనెడి యాస్తిక్యబుద్ధితో కూడినవారై తాము భిన్నులై, ఈదేవతనాదని, ఈదేవతారాధకుడను నేను అని స్వభిన్నముగ గృహీతమైన యింద్రాదిదేవతలయొక్క భక్తులు అయింద్రాదిదేవతారాధనయందే భక్తికలవారై వైదికమంత్రముచేతనే పూజించుచుండిరి. అయింద్రాదిదేవతాయాజకులు విచారింప ఇంద్రాదిదేవతారూపమగు నన్నే పూజించుచుండిరి. బ్రహ్మసర్వాత్మ స్వరూపమగుటవలన యింద్రాదిదేవతారూపముచే నేనే వారలచేత యారాధించబడుచుంటిని. అయినను యట్టివారు నన్ను అవిధిపూర్వకముగ పూజించుచుండిరి. "దేనియందు విధియు. విధ్యర్థజ్ఞానము లేదో యది "అవిధి" అని చెప్పబడును. అయవిధి యజ్ఞానము. అట్టి యజ్ఞానపూర్వకముగ నన్ను పూజించుచుండిరి. "అహం క్రతుః" అని చెప్పినరీతిని "పూజింపదగినవాడు, పూజించువాడు, పూజ, యాగము సర్వము బ్రహ్మమే" అను జ్ఞానశూన్యులై నన్ను పూజించుచుండిరి. ॥౨౩॥

—• ౯వ అధ్యాయము ౨౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అట్టివారల భగవదారాధన (కర్మలు) యెట్లవిధిపూర్వకములో. దానిని వివరించుచు అవిధిపూర్వకముగ కర్మల నాచరించువారలకు ఫలమునుండి ప్రచ్యుతిని "అహంహి" అను శ్లోకముచే జెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

కస్మాత్తేఽవిధిపూర్వకం యజంత ఇత్యుచ్యతే యస్మాత్— అహం హి సర్వయజ్ఞానాం శ్రౌతానాం స్మార్తానాం చ సర్వేషాం యజ్ఞానాం దేవతాత్మత్వేన భోక్తా చ ప్రభు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏకారణవలన వా రవిధిపూర్వకముగ పూజించుచుండిరని శంకించెదవా? చెప్పెద వినుము. నేనైతే నిఖిలశ్రౌతస్మార్తకర్మలకు ఆయాదేవతాస్వరూపుడ నగుటచే భోక్తను,

పరమాత్మయగు వాసుదేవుడనగు నేను అంతర్యామిస్వరూపముచే నధియజ్ఞస్వరూపుడనగుటవలన శ్రౌతస్మార్తకర్మలకు భోక్తను. ఫలప్రదాతను నేనే. "హి" అనుదానివలన నీవిషయము ప్రసిద్ధమే యని చెప్పబడెను. దేవతాంతరయాజులు భగవంతుడగు వాసుదేవుడే వసురుద్రాదిత్యాదిస్వరూపముచే యజ్ఞములకు భోక్త, స్వస్వరూపముచే ఫలదాత, యతనికంటె వేరుగ నెవడును ఆరాధ్యుడు లేడు. అని యిట్టివిధమున వాసుదేవుని తత్త్వముగ, భోక్తగ, ప్రభువుగ నెరుగరు. కాన మత్స్వరూపాజ్ఞానమువలన గొప్పప్రయాసముచే యాగములు చేసియు, నాయందర్పింపబడని కర్మలు కలవారై ఆయా దేవలోకమును ధూమాదిమార్గముచే నేగి, తద్భోగాంతమున నాభోగజనకకర్మక్షయమువలన నాదేహముతో వియోగమును పొందినవారై తిరిగి దేహమును ధరించుటకొఱకు మనుష్యలోకమునుగూర్చి వచ్చెదరు. ఎవరు ఆయా దేవతలయందు సర్వాంతర్యామియగు భగవంతునే చూచుచుండి (అనగా తత్తద్దేవతలను సర్వాంతర్యామియగు పరమేశ్వరునిగ ధ్యానించుచు) యాగముల నాచరించెదరో, అట్టివారు భగవంతునియం దర్పితములైన కర్మలు కలవారై తదుపాసనాసహితకర్మవశమున అర్చిరాదిమార్గముచే బ్రహ్మలోకమును పొంది, యాబ్రహ్మలోకమున జనించిన సమ్యజ్జ్ఞానముకలవారై తద్భోగాంతమున ముక్తిని పొందెదరు. ఇట తత్త్వవివేకమే. ॥౨౪॥

శంకరానందీయము:— "శుక్లా త్రయో వైష్ణవాః అగ్నేః ఘృతం విష్ణో స్తండులాః యజ్ఞో వై విష్ణుః" అనునట్లు నిన్నే యజ్ఞములయందు భోక్తగను, నేతగను తెలిసికొనియే వారలు యాగము చేయుచుండిరి. అజ్ఞానపూర్వకముగ నెట్లు యాగము చేయుచుండి రను శంకను తొలగించుటకై "అహం" అని చెప్పుచుండెను.

పైన చెప్పబడిన శ్రుతియొక్క ప్రసిద్ధిని ద్యోతనచేయుటకై "హి" అని యీశ్లోకమున ప్రయోగించబడెను. ఏదాని కనగా శ్రౌతస్మార్తములగు సర్వయజ్ఞములకు ఇంద్రాదిదేవతారూపముచే నేనే భోక్తను, ప్రభువును. నేతను అయియుంటిని. అట్లే వారుకూడ భోక్తనుగను, ప్రభువునుగను, నన్ను తెలిసికొనుచున్నారు. అయినను "బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః, సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాదిశ్రుత్యుక్తప్రకారముగ నాచే చెప్పబడిన రీతిని యజ్ఞము, యజ్ఞభోక్త, యజ్ఞనేత, యజమానుడు, యాజకులు (యజ్ఞము చేయువారు) చరుపురోడాశాదికము యీసర్వము బ్రహ్మమే. బ్రహ్మముకంటె వేరుగ కొంచమైనను లేదు. అనెడి యథాభూతస్వరూపముచే పరబ్రహ్మమును యెరుగరు. (తెలిసికొనుటలేదు.) కాన నాతత్త్వముయొక్క యజ్ఞానమువలన ఆదేవతాయాజకులు పరమపురుషార్థమునుండి జారుచుండిరి. (పరమపురుషార్థమును పొందకుండిరి.) అట్టివా రెన్నడును ముక్తిని పొందరని యర్థము. ॥౨౪॥

పదార్థప్రకాశః:— పూర్వమునందు చెప్పినవిషయమునే "అహం హి" అను శ్లోకముచే చెప్పుచుండెను. ఏకారణమువలన నేనే సర్వయజ్ఞములకు భోక్తను, పాలయితనో, అట్టివాడనైనను యథార్థముగా నన్ను తెలిసికొనుటలేదు. ఆకారణమువలన కామకాములు తిరిగి భూలోకమును ప్రవేశించుచుండిరి. ఇచట యీవిషయము చెప్పబడినది:- ఏదియన? దేవర్షి పితృపూర్వకమైన నీశ్వరనామరూపోపేతమైన ;దేహ

శాంకరభాష్యమ్:—

రేవ చ । మత్స్వామికో హి యజ్ఞోఽధియజ్ఞోఽహ మేవాత్రేతి హ్యుక్తమ్ । తథా న తు మమాభిజానంతి తత్త్వేన యథావత్ । అత శ్చాఽవిధిపూర్వక మిష్ట్వా యాగఫలా చ్చ్యవంతి ప్రచ్యవంతే తే ॥ ॥ ౨౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఫలప్రదాతను నయితిని. యజ్ఞమునకు నేను ప్రభువును. కాన నేనే యధియజ్ఞము. ఈవిషయ మిదివరకు చెప్పబడెను. అట్టివానినిగ యథార్థముగ నన్ను తెలిసికొనరు. అందుచేత వారజ్ఞాన పూర్వకముగ పూజించి యాగఫలమునుండి జారిపోవుచుండిరి. ॥ ౨౪॥

విశేషములైన నాయుపాధులు ఆయాలోకములయం దున్నవి. ఆయాలోకములయందుండు ఆందరియొక్క యంతర్యామిని నేనే అయితిని. ఇట్టి వానినిగ నన్ను తెలిసికొనక వేరుగ నాయాయుపాధుల నుద్దేశించి యే యాగాదు లాచరింపబడునో వాటిచే నేనే సంతర్పితుడ నగుచుంటిని. అనంతరమున నాసంతర్పణశేషముచే నాయాదేవతలును సంతర్పితులు కాగలరు. విషయ మిట్లుండ అద్వయానందము, అఖండైకరసమునగు నన్నుద్దేశించి చేయబడిన యేయుపాసనకలదో అదియే విధి యనబడును. మూఢులు చేయు యేయుపాస్యోపాసనము కలదో అది అవిధియని యనబడును. అట్టి యవిధిపూర్వకమైన యాగము నశించు ఫలము నిచ్చునది యగును. ఈవిషయమునే శాతపథీయశ్రుతి "అథ యోఽన్యాం దేవతా ముపాస్తేఽన్యోఽసా వన్యోఽహ మస్మీతి । న స వేద యథా పశురేవమ్" అని చెప్పుచున్నది. "అథో అయం వా ఆత్మా సర్వేషాం భూతానాం లోక స య జ్జుహోతి య ద్యజతే తేన దేవానాం లోకోఽథ యదనుబ్రూతే తేన ఋషీణా మథ య త్ప్రజా మిచ్ఛతే యత్పితృభ్యో నిపృణాతి తేన పితౄణా మథ యన్మనుష్యా న్వాసయతే యదేభ్యోఽశనం దదాతి తేన మనుష్యాణా మథ య త్పశుభ్య స్తృణోదకం విన్దతి తేన పశూనాం యదస్య గృహేషు శ్వాపదా వయాగ్ంస్యా పిపీలికాభ్య ఉపజీవన్తి తేన తేషాం లోకో యథా హ వై స్వాయలోకా యారిష్ట మిచ్ఛ దైవం హైవం విదే సర్వాణి భూతా న్యరిష్టి మిచ్ఛన్తి తద్వా ఏత ద్విదితం మీమాగ్ంసితమ్" పూర్వమునందు చెప్పిన రీతిగ ప్రకారాంతరముగ నీశ్రుతియందు చెప్పబడుచుండెను. ఈ యాత్మయే సర్వభూతములకు సంతర్పణస్థానము.

ఇట్లుండ అధికారియగు ఋత్విక్కు మంత్రపూర్వకముగ నగ్నియం దేహవిస్సును హోమము చేయునో, అట్లే యజ్ఞకర్త స్వతంత్రముగ దేనిని యాగము చేయునో, లేక శ్రౌతస్మార్తప్రకారముచే దేనిని యాగముచేయునో దానిచే నిందప్రముఖ్యాదులయొక్క యాత్మ సంతర్పిత మగును. అనంతరము యేస్వాధ్యాయమును పఠించునో దానిచే ఋషులయొక్కయు, పితృదేవతలఋణమును పరిహరించెడి సంతతిని కోరునో లేక పితృదేవతల కొరకు శ్రాద్ధమునందు దేనిని యర్పించునో దానిచే పితృదేవతలయొక్కయు, అట్లే మనుష్యులను నివాసముకలవారలనుగ జేయునో, మనుష్యులకొఱకు గృహములను కట్టించి దానము చేయునో మనుష్యులకొఱకే అన్నము నిచ్చునో దానిచేత మనుష్యుల యొక్కయు, మహిషబలీవర్దాదిపశువులకొఱకు తృణోదకము నిచ్చునో దానిచే పశువులయొక్కయు, అట్లే వీనియొక్క గృహములయందు శునకమార్జాలాదులు, కాక కలవింగాదిపక్షులు, పిపీలికలు, కీటవిశేషములు జీవించునో దానిచే వాటి యాత్మయు సంతర్పిత మగును. నిశ్చయముగ తన స్వరూపమగు పరమాత్మకొరకు కుశలమును కోరుచున్నాడు. ఇదియే తెలియబడిన దని చెప్పుచున్నారు. ఇదియే విచారితము. ఇంతకంటె భిన్నమైనది యవిదితము, అని పైశ్రుతికి యర్థము. ఈవిషయము "సురర్షిపితృమానవప్రభృతి దత్త మేకంవిదా తదాహు రమ్మున

గీ॥ యాన్తి దేవవ్రతా దేవా న్పితౄ న్యాన్తి పితృవ్రతాః ।
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి మామ్ ॥ ॥౨౫॥

పదవిభాగము:— యాన్తి- దేవవ్రతాః- దేవాన్- పితౄన్- యాన్తి- పితృవ్రతాః- భూతాని- యాన్తి- భూతేజ్యాః- యాన్తి- మద్యాజినః- అపి- మామ్ ॥ ॥౨౫॥

ప్రతిపదార్థము:— దేవవ్రతాః=దేవతలయందు నియమము, భక్తి కలవారు; దేవాన్=దేవతలను; యాన్తి=పొందుచున్నారు; పితృవ్రతాః=శ్రాద్ధాదిక్రియాపరులగు పితృభక్తులు; పితౄన్=అగ్నిష్వాత్తాదిదేవతలను; యాన్తి=పొందుచున్నారు; భూతేజ్యాః=వినాయక, మాతృగణ, చతుర్భగిన్యాదులనుపూజించువారు; భూతాని=వినాయక, మాతృగణ, చతుర్భగిన్యాదిభూతములను; యాన్తి=పొందుచున్నారు; మద్యాజినోఽపి=నన్నుపూజించువారు; మాం=నన్ను; యాన్తి=పొందుచున్నారు. ॥౨౫॥

శాంకరభాష్యమ్:—

యేఽప్యన్యదేవతాభక్తిమత్త్వే నావిధిపూర్వకం యజంతే తేషా మపి యాగఫల మవశ్యంభావి, కథమ్— యాంతి గచ్ఛంతి దేవవ్రతా దేవేషు వ్రతం నియమో భక్తి శ్చ యేషాం తే దేవవ్రతా దేవా న్యాంతి । పితౄ నగ్నిష్వత్తాదీ న్యాంతి పితృవ్రతాః శ్రాద్ధాదిక్రియాపరాః

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎవ రన్యదేవతాభక్తిచే నజ్ఞానపూర్వకముగ సేవించెదరో, వారలకుకూడ యాగఫల మవశ్యము ప్రాప్తించును. అది యెట్లనిన దేవవ్రతులు దేవతలను పొందెదరు. శ్రాద్ధాదిక్రియాపరులైన పితృదేవతాభక్తులు పితృదేవతలను పొందెదరు. వినాయక, మాతృగణ, చతుర్భగిన్యాదిపూజా

ప్రదం యదభవ త్తదాత్మార్పణమ్ । అదాయి పదలబ్ధయే క్రతుభుజా మసేవంపదా గతం గతపరిశ్రమపప్రద మసత్యసంతర్పణాత్ ॥౧॥ సర్వదేవతలు పరమాత్మస్వరూపమే యని తెలిసికొననివానిచే సురర్షిపితృమానవ ప్రభృతుల కీయబడిన దాత్మార్పణమగుటవలన నది యమృతప్రద మని చెప్పుచుండిరి. సురర్షిపితృమానవ ప్రభృతులను పరమాత్మస్వరూపముగ తెలిసికొననివానిచే దేవలోకాదిస్థానప్రాప్తికొఱ కీయబడినది యసత్యసంతర్పణమగుటవలన యాతాయాతపరిశ్రమ నిచ్చునదియే యగును. "ఏకోఽనేకై స్స్వరూపై ర్నటతి నటవరో దర్శయ న్భావభావాం స్తత్తద్రూపా స్పృథ గభిలషితే ష్వత్ర సామాజికేషు । కస్మైచి త్కశ్చిదర్థం వితరతి ముదిత స్తేన సంతర్పిత స్స్యా దేక స్సర్వాన్తరాత్మార్పణ మఖిలతనుభ్యోఽర్పితం స్యా త్తథైవ" (ఒకే నటుడు అనేకవేషములనుధరించినవాడై, హావభావములను జూపువాడై, వేర్వేరు రూపాదికము నభిలషించిన సామాజికులలో నొక్కొకరూపధారణాదికముచే నొక్కొకనేసంతుష్టుని జేయును. అట్లుగాక సర్వాంతరాత్మార్పణ మఖిలజీవరాశిని తృప్తినొందించును.

"హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే భూతస్య జాతః పతి రేక ఆసీత్, స దాధార పృథివీం ద్యా ముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ" "హిరణ్యగర్భ ఇతి దశర్చం సూక్తం త్రైష్టుభం" "హిరణ్యగర్భః" అనునది పది ఋక్కులు కల సూక్తము. త్రిష్టుప్ ఛందస్సు కలది. అందు "హిరణ్యగర్భః" అనునది మొదటి ఋక్కు. హిరణ్మయమగు అండము గర్భమువలె యెవనియొక్క యుదరమునందు కలదో యట్టి సూత్రాత్మ హిరణ్యగర్భు డనబడును. అట్టి సూత్రాత్మ యగు హిరణ్యగర్భుడు సృష్టికి పూర్వము

శాంకరభాష్యమ్: —

పితృభక్తాః । భూతాని వినాయకమాతృగణచతుర్భగిన్యాదీని యాంతి భూతేజ్యా భూతానాం పూజకాః । యాంతి మద్యాజినో మద్యజనశీలా వైష్ణవా మామేవ । సమానే ప్యాయాసే మామేవ న భజన్తేఽజ్ఞానాత్ । తేన తేఽల్పఫలభాజో భవంతీ త్యర్థః ॥౨౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని: —

తత్పరులు మాతృగణాదిభూతములను పొందెదరు. నాపూజాతత్పరులగు వైష్ణవులు నన్నే పొందెదరు. ఆయాసము సమానమైనను అజ్ఞానమువలన నన్నే సేవింపకుండిరి. అందుచే వారల్ప ఫలములనే పొందుచున్నారు ॥౨౫॥

సందుండెను. మాయాధ్యక్షుడు, సిసృక్షువు నగు పరమాత్మవలన యాహిరణ్యగర్భుడు జనించెను. విచారింప హిరణ్యగర్భుడు పరమాత్మయే అట్టి పరమాత్మ కుత్పత్తి యెట్లుహా సగునవెదవా? హిరణ్యగర్భుని యుపాధిభూతములు, సూక్ష్మభూతములు నగు వియ (ఆకాశాదులకు) దాదులు బ్రహ్మమువలన నుత్పన్న మగుటవలన యట్టి వియదాద్యుపాధులచే నుపహిత (కూడిన) మైన హిరణ్యగర్భు డుత్పన్నుడని చెప్పబడును. ఆహిరణ్యగర్భుడు పుట్టినంత మాత్రముననే అద్వితీయుడై వికారజాతమగు నిఖిలబ్రహ్మాండమున కీశ్వరుడాయెను. కేవల మీశ్వరుడే కాడు. మరేమనిన? పృథివిని, ద్యులోకమును, ధరియించెను. ఇట్లుండ సర్వాత్మక మగునట్టి పరమేశ్వరుని విడచి యేదేవునికొఱకు హవిస్సుచే పరిచర్య చేయుదుము? సర్వము బ్రహ్మార్పణమే యగును. ॥౨౪॥

— • ౯వ అధ్యాయము ౨౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు • —

మధుసూదనసరస్వతీయము: — దేవతాంతరములనుగూర్చి యాగముల నొనరించువారల కనావృత్తిరూపఫలము లేకున్నను ఆయా దేవతా యాగానురూప క్షుద్రఫల మవశ్యము సంభవించు నని చెప్పుచు భగవంతునిగూర్చి యాగము నొనరించువారలకు దేవతాంతర యాజులకంటె వైలక్షణ్యమును "యాన్తి దేవవ్రతాః" అను శ్లోకముచే చెప్పుచుండెను.

అంతఃకరణరూపోపాధిగత గుణత్రయ భేదమువలన సవిధిపూర్వకముగ యాగముల నొనరించువారు సాత్వికులని, రాజసులని, తామసులని మూడు విధములు. అందు సాత్వికులు దేవవ్రతులు. అనగా వసురుద్రాదిసంబంధమైన బల్యుపహార ప్రదక్షిణ ప్రహ్వీభావాదిరూపమైన పూజనొనరించువారు "తం యథా యథోపాసతే" అను శ్రుతి బోధించు నటుల దేవతలను పొందెదరు. రాజసులు పితృవ్రతులు. అనగా శ్రాద్ధాదిక్రియలచే నగ్నిష్వాత్తాదిపితృదేవతల నారాధించువారు. అట్టివారు పితృదేవతలను పొందెదరు. అట్లే తామసులు యక్షరక్షోవినాయక మాతృగణాది పూజకులు. అట్టివారు భూతములను పొందెదరు.

ఇచట "దేవవ్రతాః, పితృవ్రతాః, భూతేజ్యాః" అనుస్థలములయందు మధ్యమపదలోపిసమాసాసంగీరమువలన, ప్రకృతివికృతిభావము లేకపోవుటచే తాదర్థ్యచతుర్థీసమాసము సంభవింపనందునను ఉష్ట్రముఖన్యాయముచే దేవపితృభూతశబ్దములకు దేవపితృభూతసంబంధులయందు లక్షణ నంగీకరించిన సమాసము పొసగును. ఉష్ట్రముఖన్యాయమనగ "ఉష్ట్రముఖం" అను స్థలమున మధ్యమపదలోపసమాసము సంభవింపనందున ప్రకృతివికృతిభావము పొసగనందున ఉష్ట్రపదమునకే ఉష్ట్రసంబంధిముఖమునందు లక్షణ చెప్పి

"ఉష్ట్రస్యేవ ముఖం యస్య" అను విగ్రహము చెప్పవలెను. అట్లగుచో ఉష్ట్రముఖసదృశముఖము కలదని యర్థము ప్రాప్తించును. ఇదియే ఉష్ట్రముఖన్యాయము.

మఱికొందరు పూజావాచక మగు "ఇజ్య" అను శబ్దప్రయోగమువలన పూర్వమునం దున్న వ్రత శబ్దమును పూజావాచకమే అని నిర్ధారించిరి. ఇట్లు దేవతాంతరారాధనాసక్తునకు తత్తద్దేవతారూపత్వమగు సంకేతవ్యాలమును చెప్పి భగవదారాధనాసక్తున కనంతఫలమగు భగవద్రూపత్వమును "యాన్తి మద్యాజినో ఽపి మామ్" అను దానిచే చెప్పుచుండెను.

భగవంతుని పూజించు స్వభావముకలవాడు సర్వదేవతలయందు భగవద్భావదర్శులగు భవగదారాధన పరాయణులు భగవంతుని పొందెదరు. ఆయాసము సమానమైనను అంతర్యామి, అనంతఫలప్రదుడు నగు భగవంతుని యారాధింపక దేవతాంతరము నారాధించి అంతవత్తగు ఫలమును పొందుచుండిరి. ఎంతఆశ్చర్యము! ఇది యజ్ఞానమని యభిప్రాయము. ॥౨౪॥

శాంకరానందీయము:— అట్లగుచో దేవతాంతరయాజకులకు గతి యేమి? అను యాశంకపై వారికి ముఖ్యఫలము సంభవింపకున్నను ఆయా దేవతోపాసనానురూపమైన ఫలము సంభవించునని "యాన్తి" అను శ్లోకముచే చెప్పుచుండెను.

ఇంద్రాదులయందు యజ్ఞదానాది నియమరూపము, శివవిష్ణ్వాదులయందు జపపూజోపవాసాదినియమరూపమునగు వ్రతముకలవారు దేవవ్రతులు. అట్టివారు ఇంద్రాదులను, శివవిష్ణ్వాదులను పొందుచున్నారు. అనగా ఇంద్రాదుల స్థానమును, శివవిష్ణ్వాదిస్థానముల పొందుదురని యర్థము. పితృదేవతలయందు వ్రతముకలవారు అనగా శ్రాద్ధభూరిభోజనాది నియమముకలవారు అగ్నిష్వాత్తాది పితృదేవతలను పొందుచున్నారు. అనగా పితృలోకమును పొందుచున్నారని యర్థము. వినాయక, భేతాల, దుర్గా, క్షేత్రపాల యక్షిణ్యాదుల జపహోమబల్యాదులచే నెవరు సేవించెదరో వారు భూతేజ్యులనబడుదురు. అట్టివారు భూతములను (భూతలోకములను) పొందుచున్నారు. సగుణబ్రహ్మమును "ఆదిత్యో బ్రహ్మ, మనో బ్రహ్మ, అన్నం బ్రహ్మ" అని ఇత్యాదులయందు భేదముచేతను, అభేదముచేతను యెవరు ఉపాసించెదరో వారు మద్యాజులు. అట్టి సగుణోపాసకులుకూడ నర్చిరాదిక్రమముచే నన్ను పొందుచున్నారు. ఇచట నుండు "అపి" అను శబ్దముచే నిర్గుణపరబ్రహ్మమును యెవరు తనయాత్మగ తెలిసికొనెదరో వారల కుత్క్రమణాభావము, సద్యోముక్తిభావము సూచింపబడుచుండెను. లేక నిర్గుణోపాసకులు, సగుణోపాసకులు పరబ్రహ్మ భావమునే పొందుచున్నారు. అనగా పరమేశ్వర భావమును పొందుచున్నారు.

వివేకవైరాగ్య సంపన్నుల కుపశమాదిసంపత్తిచే వేదాన్తశ్రవణద్వారమున బ్రహ్మజ్ఞానము సులభము. దానిచే నత్యంతమైన అట్టి బ్రహ్మజ్ఞానఫలప్రాప్తి సులభమే. అట్లైనను నిత్యశ్రమసాధ్యమైన జపహోమాదులచేతను, అతిదుష్కరమైన శాస్త్రనియమముల చేతను, బహ్వర్థవ్యయైకప్రధానమైన హోమాదులచేతను, బహుశ్రమమూలకమైన ఉక్తానుక్తక్రియావిశేషముల చేతను, సంపాదింపబడు ఫలము స్వల్పకాలికము, నశించునది, విరోధికలది, పునరావృత్తికరము నగుచున్నది. అట్టి ఫలమునందే కామము, సంకల్పము, ప్రయత్నము, ప్రవృత్తిన్ని చూడబడుచున్నది. అనంతమగు మోక్షమునందు కాని, స్వల్పశ్రమకల నిత్యఫలమునందు కాని, కామము సంకల్పము, ప్రయత్నము, ప్రవృత్తి లేదు. ఎంతఆశ్చర్యము! ఇదియే పరమేశ్వర సంబంధమైన మాయ. జగన్మోహినియని యర్థము.

॥౨౫॥

గీ॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥ ౨౬॥

పదవిభాగము:— పత్రం- పుష్పం- ఫలం- తోయం- యః- భక్త్యా- ప్రయచ్ఛతి- తత్- అహం- భక్త్యుపహృతం- అశ్నామి- ప్రయతాత్మనః ॥

ప్రతిపదార్థము:— పత్రం=పత్రమును కాని; పుష్పం= పుష్పమునుగాని; ఫలం=ఫలమునుగాని; తోయం=ఉదకమునుగాని; యః=యెవడు; భక్త్యా=భక్తితో; మే=నాకొఱకు; ప్రయచ్ఛతి=ఇచ్చునో; ప్రయతాత్మనః= శుద్ధబుద్ధియగువానియొక్క; భక్త్యుపహృతం=భక్తితో సమర్పించిన; తత్= ఆ పత్రపుష్పాదికమును; అశ్నామి=స్వీకరించెదను. ॥౨౬॥

శాంకరభాష్యమ్:—

న కేవలం మద్భక్తానా మనావృత్తిలక్షణ మనంతఫలం, సుఖారాధన శ్చాహం, కథమ్— పత్రం పుష్పం ఫలం తోయ ముదకం యో మే మహ్యం భక్త్యా ప్రయచ్ఛతి త దహం పత్రాది భక్త్యోపహృతం భక్తిపూర్వకం ప్రాపితం భక్త్యుపహృత మశ్నామి గృహ్ణామి ప్రయతాత్మనః శుద్ధబుద్ధేః ॥ ౨౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నాభక్తులకు కేవలము అనావృత్తిరూపఫలము చేకూరుటే కాదు. ఇకేమన: నేను గూడ సుఖారాధనుడను. ఎట్లనిన: ఏ పరిశుద్ధాత్ముడు పత్రమునుగాని, పుష్పముగాని, ఫలముగాని, యుదకమునుగాని భక్తితో నాకొరకు యిచ్చునో అట్టి పరిశుద్ధాత్ముని భక్త్యుపహృతమైన ఆపత్రాదికమును నేను గ్రహించెదను. ॥౨౬॥

—• ౯వ అధ్యాయము ౨౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— దేవతాంతరములను పరిత్యజించి యనంతఫలమునిచ్చువాడగుటవలనను, సుకరమగుటవలన భగవంతుని యారాధించుటయే కర్తవ్యమని "పత్రంపుష్పం" అనుదానిచే చెప్పుచుండెను.

పత్రమును కాని, పుష్పమును కాని, ఫలమును కాని, యుదకమును కాని అనాయాసలభ్యమైన మరొకదానిని కాని యెవడో యొకమనుష్యుడు అనంతమహావిభూతిపతిని, పరమేశ్వరుడను అగు నాకొరకు వాసుదేవుని కంటె వేరెయేదియు లేదను బుద్ధిపూర్వకమైన ప్రీతిచే భృత్యుడువలె యుపకల్పించునో (యర్పించునో) (నాస్వత్వము లేని ద్రవ్యమే లేనందున నఖిలజగత్తు నాచేతనే సంపాదింపబడినందున సర్వము నాసంబంధమైనదే మనుజుడు నాకొర కర్పించుచున్నాడు.) ప్రీతిపూర్వకముగ నిచ్చుచున్న శుద్ధమైన యంతఃకరణకల యతనియొక్క పత్రపుష్పాదికమును కాని, తుచ్ఛమైన వస్తువును కాని సర్వేశ్వరుడ నగు నేను అశనమునువలె స్వీకరించి సంతృప్తిని పొందుచున్నాను. ఇచట పత్రపుష్పాదికమున కత్యంత తిరస్కారముయొక్క యదర్శనముచే లక్షితమైన స్వీకారవిశేషముచే ప్రీత్యతిశయహేతుత్వ ముపలక్షితము. (ఊహింపబడుచున్నది.) "న హ వై దేవా అశ్నన్తి న పిబ న్త్యేతదేవాఽమృతం దృష్ట్వా తృప్యన్తి" దేవతలు భక్తునిచే నర్పించబడినదానిని భక్షింపరు, పానముచేయరు. అయమృతమునే చూచి తృప్తినొందెదరు. అని శ్రుతి బోధించుచున్నది. ఏకారణమువలన తుచ్ఛపదార్థమును కూడ నీవు స్వీకరించెద వనెదవా! ప్రీతిచే సమర్పితము కాన స్వీకరించెదను. కాన ప్రీతిచే సమర్పణమే నేను స్వీకరించుటయందు హేతువు. ఇచట "భక్త్యా ప్రయచ్ఛతి" అని చెప్పి తిరిగి "భక్త్యుపహృతం" అని చెప్పుటవలన నభక్తుని బ్రాహ్మణత్వతపస్వి

శాంకరభాష్యం:—

యత ఏవ మతః— య త్కరోషి స్వతః ప్రాప్తం య దశ్నాసి యచ్చ జుహోషి హవనం నిర్వర్తయసి శ్రౌతం స్మార్తం వా, యద్దదాసి ప్రయచ్ఛసి బ్రాహ్మణాదిభ్యో హిరణ్యా న్నాజ్యాది, యత్తపస్యసి తప శ్చరసి కౌంతేయ! త త్కురుష్వ మదర్పణం మత్సమర్పణమ్ ॥ ॥౨౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓకుంతీపుత్రుడా! నీవు స్వతఃప్రాప్తమగు (శాస్త్రాపేక్షము లేకుండగనే ప్రాప్తమగు) గమనాదికమగు యేయేకర్మ జేయుదువో, దేనిని భుజించెదవో, శ్రౌతకర్మయందుగాని, స్మార్తకర్మయందుగాని దేనిని హోమముచేయుదువో, బ్రాహ్మణాదులకు హిరణ్యాన్నాదికమును దేనిని యిచ్చెదవో, యేతపస్సుచేయుదువో, దానినంతను నాకై యర్పింపుము ॥౨౭॥

"యత్కరోషి" అనుదానిచే చెప్పుచుండెను. శాస్త్రమును విడచి రాగమువలన ప్రాప్తమైన గమనాదికమును నీతృప్తినిమిత్తము కాని, కర్మసిద్ధినిమిత్తముగానిని నీవు భుజించుదాని, అట్లే శాస్త్రబలమువలన నీచేనాచరింపబడు నిత్యాగ్నిహోత్రశ్రౌతస్మార్తాది సర్వహోమములను, అట్లే అతిథిబ్రాహ్మణాదులకొఱకు నీచే నర్పింపబడు అన్నహిరణ్యాదికమును, అట్లే ప్రతిసంవత్సగ మజ్ఞాతపాపమాదిక పాపనివృత్తికొఱ కాచరింపబడు చాంద్రాయణాదివ్రతములను, లేక స్వేచ్ఛాప్రవృత్తినిరోధము కొఱకు నీచే నాచరింపబడు యింద్రియ సంయమమును, ఈసర్వము నిత్యనైమిత్తికకర్మల కుపలక్షణము. అనగా నీవాచరించు నిఖిలనిత్యనైమిత్తికకర్మలను, ప్రాణిస్వభావవశమున శాస్త్రమును విడచి ప్రాప్తించునట్టి యవశ్యంభావులగు గమనాశనాదులను, శాస్త్రవశమున నాచరించు హోమదానాదికమును, ఓ యర్జున! అన్యనిమిత్తముగ నాచరింపబడు లౌకికవైదికకర్మలను సర్వమును నాయర్పణము చేయుము. ఇచట "కురుష్వ" అని ఆత్మనేపదిచే సమర్పణఫలము సమర్పకనిష్ఠమే కాని నాయందేమియు లేదని చెప్పబడెను. అవశ్యమాచరింపదగిన కర్మలను పరమగురువగు నాయం దర్పించుటయే నాభజనము. ఇంతియే కాని పరమేశ్వరసేవనిమిత్తము యితరవ్యాపారమేదియు లేదని యాశయము. ॥౨౭॥

శంకరానందీయము:— నేను సాధువులకు భక్తిచే సులభుడను. కాన నేయే కర్మ నాచరించెదవో యానిఖిలకర్మలను నాకర్పింపుమని "యత్కరోషి" అను శ్లోకముచే జెప్పుచుండెను.

విహితము లోకవిద్విష్టము కాని యేలౌకిక కర్మ నాచరించెదవో, శాస్త్రీయము అనాయాసలబ్ధమునగు నన్నమును భుజించెదవో, అగ్న్యాదిదేవతలకొఱకు యేచరుపురోడాశాదిద్రవ్యములను హోమముచేసెదవో సత్పాత్రకొఱకు ఓదనోదకధనధాన్యకన్యాగవాది విశిష్టద్రవ్యము నిచ్చెదవో, సంధ్యావందనాదికమును వేదాధ్యయనాదికమును, వ్రతోపవాసాదికమునుగాని యేతపస్సు నాచరించెదవో, లౌకికము, వైదికమునగు నేయే కర్మల నాచరించెదవో వాటినన్నిటిని నాయర్పణ మొనరింపుము. అనగా బ్రహ్మార్పణ బుద్ధిచే నిఖిలకర్మల నాచరింపుమని యర్థము. ॥౨౭॥

భాష్యోత్కర్షదీపిక:— ఎట్లు కున్తి భర్త్రాజ్ఞచే, ఇంద్రాదిసాంగత్యముచే భవదాదులను కని ఆకర్మసంబంధము లేనిదై యుండెనో అట్లే నీవును యేయే కర్మల నాచరించెదవో, ఆయాకర్మలను పరమేశ్వరార్పణ మొనరించినచో కర్మబంధనములచే విడువబడగలవని "కౌన్తేయ" అను సంబోధనచే సూచింపబడెను.

గీ॥ శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః ।
సంన్యాసయోగ యుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి ॥ ౨౮॥

పదవిభాగము:— శుభాఽశుభఫలైః- ఏవం- మోక్ష్యసే- కర్మబంధనైః- సంన్యాసయోగయుక్తాత్మా- విముక్తః- మాం- ఉపైష్యసి ॥ ౨౮॥

ప్రతిపదార్థము:— త్వం=నీవు; ఏవం=సర్వమును నాసమర్పణము జేసి; శుభాశుభఫలైః=శుభము అశుభము ఫలములుగాకల; కర్మబంధనైః=కర్మలనెడిబంధనములచే; మోక్ష్యసే=విడువబడుదువు; సంన్యాసయోగయుక్తాత్మా=సంన్యాసయోగముతోగూడిన యంతఃకరణముకలవాడవై; విముక్తః=ముక్తుడవై; మాం=నన్ను; ఉపైష్యసి=పొందగలవు. ॥౨౮॥

శాంకరభాష్యం:—

ఏవం కుర్వత స్తవ యద్భవతి త చ్ఛృణు! శుభాశుభఫలై రేవం శుభాశుభే ఇష్టానిష్టే ఫలే యేషాం తాని శుభాశుభఫలాని కర్మాణి తైః శుభాశుభఫలైః కర్మబంధనైః కర్మాణ్యేవ బంధనాని తైః కర్మబంధనై రేవం మత్సమర్పణం కుర్వ న్మోక్ష్యసే । సోఽయం సంన్యాసయోగః

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈవిధముగ జేసినచో నేమగునో చెప్పెదవినుము! ఇష్టాఽనిష్టములు ఫలములుగాగల పుణ్యాపాపములనెడి బంధనములనుండి విముక్తుడ వగుదువు. సంన్యాసమే మత్సమర్పణరూప

—౯వ అధ్యాయము ౨౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు—

మధుసూదనసరస్వతీయము:— ఇట్టి భజనకు ఫలమును "శుభాఽశుభఫలైః" అనుదానిచే చెప్పుచుండెను. ఇట్లు సర్వకర్మసమర్పణరూపమైన నాభజనము అనాయాసముగ సిద్ధించుచుండ నిష్టానిష్టఫలములుకల కర్మయనెడి బంధనములచే విడువబడగలవు. శుభాశుభకర్మలు నాకర్పింపబడిన వగుటవలన నట్టి కర్మల సంబంధము నీకు లేనందున నట్టి కర్మలచేతను, అకర్మఫలములచేతను నీవు సంబంధింపబడవు. అనంతరము నిఖిలకర్మలను భగవంతుని కర్పించుటయే సంన్యాసము. అట్టి సంన్యాసమనెడి యోగముతో గూడిన యంతఃకరణ కలవాడవై (యోగముచే బోధితమైన యంతఃకరణ కలవాడవై) పరిత్యక్తకర్ములు కలవాడవై జీవించియుండగనే కర్మలనెడి బంధనములచే విముక్తుడవై సమ్యగ్దర్శనముచే నజ్ఞానావరణము తొలగ "అహం బ్రహ్మాస్మి" అని సాసాక్షాత్కారము కలవాడవగుదువు. అనంతరమున ప్రారబ్ధకర్మక్షయమువలన యీశరీరము పతితమగును. తత్క్షణమే విదేహకైవల్యరూపమగు నన్ను పొందుదువు. ఇపుడు కూడ నాస్వరూపుడవే యయినను సర్వోపాధినివృత్తిచే మాయికభేద వ్యవహారవిషయుడవు కావని యర్థము. ॥౨౮॥

శంకరానందీయము:— శ్రౌతకర్మనుగాని, స్మార్తకర్మనుగాని, మరియొకకర్మనుగాని యీశ్వరార్పణబుద్ధిచే ననుష్ఠించువానికి తదనుష్ఠానమువలన కల్గుఫలమును "శుభాశుభఫలైః" అనుదానిచే చెప్పుచుండెను.

ఇట్లీశ్వరార్పణబుద్ధిచే వైదికకర్మను గాని, అవైదికకర్మను గాని యుక్తమైనదాని నాచరించు నీవు సుఖదుఃఖములనిచ్చు, లేక స్వర్గనరక హేతువులగు కర్మలనెడి బంధనములనుండి ముక్తుడవు కాగలవు. "కర్మ త్వే

శాంకరభాష్యమ్:—

నామ సంన్యాస శ్చాసౌ మత్సమర్పణతయా కర్మత్వా ద్యోగ శ్చాసా వితి తేన సంన్యాసయోగేన యుక్త ఆత్మాంతఃకరణం యస్య తవ స త్వం సంన్యాసయోగయుక్తాత్మా స న్విముక్తః కర్మబంధనై ర్జీవ న్నేవ పతితే చాఽస్మి న్ఛరీరే మా ముపైష్య స్యాగమిష్యసి ॥ ॥౨౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మగుటచే కర్మయగును గాన నది సంన్యాసయోగమనబడును. దానితోఁగూడిన యంతఃకరణము కలవాడవగుచో కర్మబంధనములనుండి జీవద్దశయందే విముక్తుడవై, శరీరపాతానంతరము నన్ను పొందెదవు. ॥౨౮॥

వాధికారస్తే” “నియతం కురు కర్మ త్వం” “స్వధర్మ మపి చావేక్ష్య” అను వాక్యములచే విహితకర్మలకు కర్తవ్యత్వమును విధించుటవలన విహితకర్మల కశుభఫలకత్వ మెటుల సంభవించునని శంకింపజనదు. విహితకర్మలకుకూడ ననుష్ఠానవైకల్యముచే అశుభఫలహేతుత్వము సంభవించును. అది యెట్లనిన? “యస్యాగ్నిహోత్రమదర్శ మపౌర్ణమాస మచాతుర్మాస్య మనాగ్రయణ మతిథివర్జితం చ। అహుత మవైశ్వదేవ మవిధినా హుతమాసప్తమాం స్తస్య లోకాన్ హినస్తి” “స వాగ్వజ్రో యజమానం హినస్తి” ఇత్యాదిశ్రుతిస్మృతుల వలన మంత్రస్వరవర్ణద్రవ్యకాలాది నియమములకు వైపరీత్యము ప్రాప్తించినను, అగ్నియం దుంచబడిన హవిస్సు స్కన్నమైనను (అగ్నినుండి యితరప్రదేశమునకు హవిస్సు పడిపోవుటయే స్కన్నమనబడును.) భిన్నమైనను విహితకర్మలుకూడ నశుభఫలము నిచ్చును. కాన పూర్వోక్తాశంక సంభవింపదు. కాన “నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే” అను న్యాయముచే నీశ్వరార్పణ బుద్ధిచేతను, శ్రద్ధాభక్తుల చేతను చేయబడిన కర్మలకైతే విపర్యాసము ప్రాప్తించినను ప్రత్యవాయము ప్రాప్తింపదు. అట్లే పరమేశ్వరునియందు కర్మల ఫలము నర్పించుటయే సంన్యాసము. అట్టి సంన్యాసమే కర్మబంధమోక్షోపాయము. అట్టి సర్వకర్మఫల సంన్యాసమునందే సక్తమైన యంతఃకరణ కలవాడవై కర్మలనెడి బంధనములచే విముక్తుడవై క్రమముగ పరమాత్మను పొందగలవు. అనగా విదేహముక్తిని పొందగలవు.

లేక, సిద్ధ్యసిద్ధులయందు సముడవై యీశ్వరార్పణబుద్ధిచే “అనేనేశ్వరో మే ప్రసీదతు” “యీకర్మచే నీశ్వరుడు నాకనుగ్రహించుగాక” అను కామనారాహిత్యముచేతను నీవు నిత్యనైమిత్తికముల నాచరించువాడవై నీచే నాచరింపబడిన సత్కర్మలవలన జనించిన చిత్తశుద్ధి ద్వారమున సంప్రాప్తమైన యాత్మవిజ్ఞానము కలవాడవై, సంన్యాయోగయుక్తమైన యంతఃకరణకలవాడవై “నేను కర్తను కాను” అని నీకు లెస్సగ కూటస్థత్వాసంగత్వవిజ్ఞానముచే సంచితాద్యశేషకర్మసంబంధాభావదర్శనమే సంన్యాసయోగము. అట్టి సంన్యాసయోగమునందే సంచితాగామివర్తమానసర్వకర్మ తత్కర్త్రాది సంబంధాభావదర్శనమునందు సమాహితమైన మనస్సుకలవాడవై స్వర్గనరకసుఖదుఃఖములను కలుగజేసెడి సంచితాగామివర్తమానమైన పుణ్యాపుణ్యమిశ్రకర్మలచే పురుషుడు జన్మాదులవలన బంధింపబడునుగాన నట్టికర్మలే బంధనము లనబడును. అట్టి కర్మబంధనములనుండి నీవు విడువబడగలవు. ఇట్లు విడువబడి అనగా సంన్యాసయోగద్వారమున కర్మబంధనములచే విడువబడినవాడవై నిర్విశేషపరబ్రహ్మమును (విదేహకైవల్యమును) యితరము నపేక్షింపకుండగనే పొందగలవు. ॥౨౮॥

సమో౽హం సర్వభూతేషు న మే ద్వేష్యో౽స్తి న ప్రియః ।
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥ ॥౨౯॥

పదవిభాగము:— సమః- అహం- సర్వభూతేషు- న-మే-ద్వేష్యః- అస్తి- న- ప్రియః- యే- భజన్తి- తు- మాం- భక్త్యా- మయి- తే- తేషు- చ- అపి- అహమ్ ॥ ॥౨౯॥

ప్రతిపదార్థము:— అహం=నేను; సర్వభూతేషు=సమస్తభూతములయందు; సమః=సముడను; మే=నాకు; ద్వేష్యః=ద్వేషింపతగినవాడు; న=లేడు; ప్రియః=ప్రేమింపదగినవాడును; న=లేడు; యే=ఏవారు; తు=మరి; మాం=నన్ను; భక్త్యా=భక్తితో; భజన్తి=సేవించెదరో; తే=వారు; మయి=నాయందు; వర్తంతే=ఉంటున్నారు; (ఈపదమధ్యాహార్యము) తేషుచ=అట్టిభక్తులయందు; అహం=నేను; వర్తే=ఉండెదను. ॥౨౯॥

శాంకరభాష్యమ్:—

రాగద్వేషవాం స్తర్హి భగవా న్యతో భక్తా ననుగృహ్ణాతి నేతరా నితి, తన్న— సమ స్తుల్యో౽హం సర్వభూతేషు న మే ద్వేష్యో౽స్తి న ప్రియో౽గ్నివ దహం దూరస్థానాం యథా౽గ్నిః శీతం నాపనయతి సమీప ముపసర్పతా మపనయతి తథా౽హం భక్తా ననుగృహ్ణామి నేత-

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భగవంతుడు భక్తుల ననుగ్రహించుచు నితరుల ననుగ్రహింపకుండుటచే రాగద్వేషవంతుడగునా? అట్లుకాదు- నేను (పరమేశ్వరుడు) సర్వభూతములయందు సముడను. నాకు ద్వేష్యుడుగాని, ప్రియుడుగాని లేడు. యెట్లు అగ్ని దూరస్థుల శీతబాధను తొలగింపక,

—• ౯వ అధ్యాయము ౨౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము: ఓ శ్రీకృష్ణా! నీవు భక్తులనే యనుగ్రహించి భక్తులు కాని వారల ననుగ్రహింపనిచో రాగద్వేషములు కలవాడవగుదువు. అందుచే నీవు పరమేశ్వరుడ వెట్లగుదువు! అని శంకింపబడినదని “సమః” అనుదానిచే చెప్పుచుండెను.

సూర్యసంబంధమైన గగనమండలవ్యాపియగు ప్రకాశకు ద్వేష్యుడుగాని, ప్రియుడుగానిలేనటుల సర్వప్రాణులయందు సద్రూపముచేతను, స్ఫురణరూపముచేతను, ఆనందరూపముచేతను; స్వాభావికమైన యథాపాధికముచేతను. అంతర్యామిత్వముచేతను నేను సముడనగుటవలన నాకు ద్వేష్యుడు (ద్వేషింపదగినవాడు) కాని, ప్రియుడు (ప్రీతివిషయుడు) కాని లేడు. అట్లగుచో భక్తాభక్తులకు ఫలవైషమ్యమెటుల సంభవించుచున్నది అని శంకించబడెను. ఏవారు సర్వకర్మసమర్పణరూపమగు భక్తిచే నన్ను సేవించెదరో ఇచట “తు” అను శబ్దము అభక్తులకంటె భక్తునివిశేషమును బోధించుచున్నది. అట్టివారు నాయందర్పింపబడిన నిష్కామకర్మలచే సంశోధితాంతఃకరణులవారై నిరస్తసమస్తరజస్తమోమలములు కలిగినట్టిన్ని, సత్త్వోద్రేకముచే నతిస్వచ్ఛమైనట్టి యంతఃకరణము యెల్లప్పుడు మదాకారమైన వృత్తిని యుపనిషత్ప్రమాణముచే పుట్టించువారై నాయందు స్థితిని పొందుచున్నారు. నేనును అతిస్వచ్ఛమైన యాభక్తుల చిత్తవృత్తియందును ప్రతిబింబితుడనై స్థితిని పొందగలను. “చ” అనునది అవధారణార్థకము. అనగా అట్టి భక్తులే నాయందు, వారలయందే నేను యుండెదనని యాశయము. స్వచ్ఛమైన ద్రవ్యమున కిదియే స్వభావము. అదిదేనితోటి సంబంధించునో దానికారమును గ్రహించును. ఏది దానియందు ప్రతిఫలించునో యిదియే స్వచ్ఛద్రవ్యసంబద్ధవస్తువు

శాంకరభాష్యమ్:—

రాన్ । యే భజంతి తు మా మీశ్వరం భక్త్యా మయి తే స్వభావత ఏవ న మమ రాగనిమిత్తం మయి వర్తంతే । తేషు చా ప్యహం స్వభావత ఏవ వర్తే నేతరేషు నైతావతా తేషు ద్వేషో మమ ॥ ॥౨౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సమీపస్థుశీతబాధనే తొలగించునో యట్లే నేను భక్తుల ననుగ్రహించుటయు, నితరుల ననుగ్రహింపకుండుటయు నుండును. యెవరు నన్ను భక్తితో సేవించెదరో వారు నా సంబంధమగు రాగముచేగాక సహజముగనే నాయందుండిరి. నేనును వారియందు స్వభావతః (వస్తుస్థితిననుసరించియే) యుందును. యింతమాత్రముచే నితరులయందు (భక్తులుకానివారియందు) నాకేమియు ద్వేషము లేదు. ॥౨౯॥

యొక్క స్వభావము. అస్వచ్ఛవస్తుసంబద్ధవస్తువుయొక్క స్వభావము స్వసంబద్ధవస్తువుయొక్క ఆకారమును గ్రహింపకపోవుట స్వభావసిద్ధము. అస్వచ్ఛద్రవ్యసంబద్ధవస్తువునకు అస్వచ్ఛద్రవ్యమునందు ప్రతిబింబించకపోవుట స్వభావము. సూర్యప్రకాశ సర్వత్ర యుండినను స్వచ్ఛమైన దర్పణాదులయందే యభివ్యక్తమగును. అస్వచ్ఛమగు ఘటాదులయం దభివ్యక్తము కాదు. ఇంతమాత్రముచే సూర్యప్రకాశ దర్పణమునం దనురాగము కలది కాదు. ఘటాదులను ద్వేషించునదియు కాదు. ఇట్లే నేను భక్తుని చిత్తమునం దభివ్యజ్యమానుడను. అభక్తచిత్తమునం దభివ్యజ్యమానుడను కాను. దేనియందును అనురాగము కలవాడను కాను. దేనిని ద్వేషించను. సామగ్రీమర్యాదచే జాయమానమైన కార్యమపర్యనుయోజ్యము (వారించుటకు శక్యము కానిది.) వహ్నివలె, కల్పవృక్షమువలె నాకు వైషమ్యము లేకపోవుటను వ్యాఖ్యానింపఁగలయును. ॥౨౯॥

శంకరానందీయము:— పరమాత్మ భక్తులకు ముక్తినిడునుగాని, భక్తిలేనివారి నుద్ధరింపడు కదా! కాన "నిర్దోషం హి సమం బ్రహ్మ" అను స్మృత్యుక్తమగు సమత్వము ఉక్తిమాత్రమేగాని. పరమాత్మకు వైషమ్యమే కలదు. అనుశంకపై అట్లు కాదు, సూర్యుడు సర్వసముడైనను, శీతకాలమున యనావృతప్రదేశమున తన్ను సేవించువారల శీతబాధను నివర్తింపజేయును గాని యట్లు తన్ను సేవింపని వారి శీతనివృత్తిని జేయడుగదా! అందుచే నావైషమ్యము సూర్యకృతముగాక, పురుషకృతమే యగును. ఈవిషయ మెట్లో ప్రకృతముగూడ నట్లే అని సూచించుటకై జెప్పుచున్నాడు. "సమోఽహం సర్వభూతేషు" నిర్విశేషుడను, పరిపూర్ణుడను, పరమాత్మస్వరూపుడను అగు నేను బ్రహ్మాదిస్తంబపర్యంతమగు సర్వభూతములయందు- ఘటమఠాదులయం దాకాశమువలె తుల్యస్వభావముకలవాడనేగాని, వాయ్వాదులవలె వైషమ్యముకలవాడను కాను. "న మే ద్వేష్యోఽస్తి కశ్చన" కనుకనే- "అప్రాణో హ్యమనా శ్శుభ్రః" అను శ్రుత్యనుసారము అమనస్కునికి ప్రియాఽప్రియత్వభావనయే సంభవింపనందున నాకు ప్రేమింపదగినవాడుగాని ద్వేషింపదగినవాడుగాని, యెవడును లేడు. అట్లగుచో ప్రియత్వాఽప్రియత్వభావనయేలేనిచో కొందరికి ముక్తియు, మరికొందరికి బంధము నెట్లు కల్గుచున్న దనుశంకపై జెప్పుచున్నాడు— 'యే భజన్తి......ప్యహమ్' స్వీయప్రయత్నముతోను, తీవ్రమగు మోక్షేచ్ఛతోను, బహుజన్మలనుండి శుభకర్మలనే జేయుచు తత్పరిపాకముచే శుద్ధాంతఃకరణులై, సర్వమును త్యజించి, సద్గురుకృపచే శ్రవణాదికము నాచరించి, పరతత్త్వమును తెలిసికొని, యే ధన్యులగు పురుషధౌరేయులు అఖండవృత్తికల భక్తితో నన్ను భజించెదరో, (నేను బ్రహ్మస్వరూపుడనైతిని. అని తనను పూర్ణస్వరూపునిగా తెలిసికొనియుందురో) అట్టివారు బ్రహ్మనిష్ఠులై యెల్లపుడు నానందస్వరూపుడనైన నాయందు సంస్థితు లగుచున్నారు. నేనును నిర్విశేషుడనైనను, పరి

శ్లో॥ అపిచే త్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధు రేవ స మంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః ॥ ॥30॥

పదవిభాగము:— అపి- చేత్- సుదురాచారః- భజతే- మాం- అనన్యభాక్- సాధుః- ఏవ- సః- మంతవ్యః- సమ్యగ్వ్యవసితః- హి- సః- ॥30॥

ప్రతిపదార్థము:— అపిచేత్సుదురాచారః=అత్యంతము దురాచారుడైనప్పటికి; యః=యెవడు; మాం=నన్ను; భజతే=సేవించునో; సః=అట్టివాడు; సాధురేవ=ఉత్తముడనియే; మంతవ్యః=తలవదగినవాడు; హి=ఏ కారణమువలన; సః=వాడు; సమ్యగ్వ్యవసితః, లెస్సగ నిశ్చితమైన బుద్ధికలవాడో. ॥30॥

---

ప్రాప్తమైనను, ఆబ్రహ్మవేత్తలయందు (ఆబ్రహ్మవేత్తల యంతఃకరణవృత్తికి— చక్షురింద్రియమునకు రూపమువలె, విషయమై) యుందును. యెట్లు సర్వవ్యాపకము, సర్వసమము నగు ఆకాశము స్వచ్ఛమగు జలదర్పణాదులయందు ప్రతిబింబించునో, స్వచ్ఛముకాని కుడ్యాదికమునందు ప్రతిబింబింపదో యట్లే నేనును, బ్రహ్మవేత్తలయందు భాసించెదనుగాని, యసత్పురుషులయందు భాసింపను. 'తరతి శోక మాత్మవిత్' అను శ్రుత్యుక్తరీతిని ఎవరు నన్ను తెలిసికొందురో వారు ముక్తు లగుదురు. ఎవరు తెలిసి కొనరో వారు బద్ధులగుదురు. కాన పురుషప్రయత్నసాధ్యమగు మద్వేదనమే ముక్తిసాధనము. నన్ను తెలిసికొనకుండుటచే బంధకారణము. నేనుగాని, గురువుగాని, శాస్త్రముగాని ఇట కారణము గాము. కాన నాసర్వసమత్వమునకు వ్యాఘాతము లేదని యాశయము. (ఈచెప్పుటచే యెట్లుశీతనివృత్తి పురుష ప్రయత్నసాధ్యమో, అట్లే భవబంధవిముక్తియు పురుషప్రయత్నసాధ్యమేగాని, స్వయముగ సిద్ధింపదు. కాన ముముక్షువులు భక్తికై తీవ్రముగప్రయత్నింప దగు నని సూచిత మయ్యెను.) ॥౨౯॥

పదార్థప్రశ్న:— అట్లగుచో భక్తుల కొఱకే నీవు మోక్షము నిచ్చెదవు. భక్తులు కానివారికి మోక్షము నివ్వవు. అందుచే నీకు రాగద్వేషప్రయుక్తమైన వైషమ్యము ప్రాప్తింపవలసివచ్చునను శంకపై "సమోఽహం" అని చెప్పుచుండెను.

నేను సర్వభూతములయందు సముడను. కాన నాకు ద్వేషింపదగినవాడు కాని; ప్రియుడుని కాని యెవడును లేడు. మరేమనిన? ఎవరు నన్ను భక్తిచే సేవించెదరో వారు నాయందనుగ్రాహ్యులుగ నుంటు న్నారు. నేనును వారలయం దనుగ్రాహకునిగ నుంటున్నాను. ఎవరు నన్ను సేవింపరో వారట్లే యుండుచున్నారు. నాయందు రాగద్వేషవ్యవస్థ లేదని యర్థము. ఈవిషయము "యే యథా మాం ప్రప ద్యంతే" అని పూర్వమునందే చెప్పబడెను. మార్గమునందున్న వృక్షమును కొందరు ఫలార్థులై, కొందరు పుష్పార్థులై, మఱికొందరు ఛాయార్థులై యాశ్రయించెదరు. వారు వారివారి కభిమతమును పొందుచున్నారు. వృక్షమున కట్టియత్రి ఆపేక్ష కాని, యుపేక్ష కాని లేదు. అట్లే నాకు ప్రియుడు కాని, ద్వేష్యుడు కాని లేడు. ఈవిషయమునే "యాతే ధామాని పరమాణి యావమా యా మధ్యమా విశ్వకర్మ న్నుతేమాః శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః స్వయం యజస్వ తన్వం వృధానః" ఎవని నిమిత్తము నిఖిలకర్మ లాచరింప బడుచున్నవో అట్టివాడు విశ్వకర్మఆని పరమేశ్వరుడు చెప్పబడు చున్నాడు. అతని సంబుద్ధి "హే విశ్వకర్మన్" అని. ఓపరమేశ్వరా! నీయొక్క యుత్కృష్టమైన దేవశరీరములు, అపకృష్టమైన పశ్వాదిశరీ రములు, మధ్యమమగు మనుష్యశరీరములు కలవో వాటిలో తనకనుకూలమైన వాటికొరకు "శిక్షా" ప్రార్థించెదము, అట్లే ప్రలయకాలమునందు హోతవ్యముగ ప్రాప్తమైన స్వప్రతికూలమైన జీవజాతమునందు భిన్నమైన మాయ అజ్ఞానము స్వయముగనే ప్రాప్తించుచున్నది. నీవైతే శరీరమును ప్రకటన చేయుం బానిపై యనుగ్రహింపుము. ॥౨౯॥

శాంకరభాష్యమ్:—

శృణు మద్భక్తేర్మాహాత్మ్యమ్— అపి చే ద్యద్యపి సుష్ఠు దురాచారః సుదురాచారోఽతీవ కుత్సితాచారోఽపి భజతే మా మనన్యభా గనన్యభక్తిః స న్సాధు రేవ సమ్య గ్వృత్త ఏవ స మంతవ్యో జ్ఞాతవ్యః సమ్య గ్యథావ ద్వ్యవసితో హి యస్మా త్సాధునిశ్చయ స్సః ॥౩౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నాదు భక్తియొక్కమహాత్మ్యమును వినుము— అత్యంతముదురాచారుడైనప్పటికి యెవడు అనన్యభక్తికలవాడై నన్ను భజించునో వాడు సమ్యగ్వృత్తుడని (భక్తుడని, యే

—• ౯వ అధ్యాయము ౩౦ వశ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సమునియందుకూడ వైషమ్యమును కలుగజేయునది నాభక్తిమహిమయే. ఆమహిమను చెప్పెదవినుము. అజామిలాదులవలె సుదురాచారుడైనను యితరులను భజింపక యేదోయొక యదృష్టవశమున నన్ను ఎవడు సేవించునో అట్టివాడు పూర్వమునందుసాధువైనను యేకార యోగ్యమైన నిశ్చయము కలవాడగుటవలన సాధువేయని తలపదగినవాడు. ॥౩౦॥

శంకరానందీయము:— "రాజవిద్యా" అను విశేషణముచే సూచితమైన సకలవేదశాస్త్రాధ్యయనసముత్పన్నమైన బ్రహ్మవిద్యావ్యతిరిక్తవిద్యలకు బంధకత్వమును "మోఘాశాః" "త్రైవిద్యా మాం" ఇత్యాదిస్థలములయందు చెప్పి బ్రహ్మవిద్యకు మోక్షప్రదత్వమును "మహాత్మానః" "యాన్తి మద్యాజినోఽపి మాం" ఇత్యాదిస్థలములయందు చెప్పి యిపుడు "పవిత్రమిద ముత్తమం" అని జ్ఞానమునకుపూర్వమునందు ప్రతిజ్ఞాతమైన పావకతమత్వమును "అపిచేత్" అనుశ్లోకముచే స్పష్టపరచుచుండెను.

బ్రాహ్మణుడుకాని, క్షత్రియుడుకాని, మరియితరుడుకాని "సుదురాచారః" జాతివలనకాని, వర్ణమువలనగాని, క్రియవలనకాని, స్వభావమువలనకాని అత్యంతము దుష్టమైన స్వభావము (వృత్తము) కలవాడైనను, విచారింప పాపిష్ఠుడైనను జన్మాంతరీయపుణ్యకర్మవిశేషముచే సద్గురుప్రసాదమువలన పరతత్త్వమును తెలిసికొని స్వయముగ అనన్యభాక్కులయి అనగా అనాత్మస్వరూపము, కర్తృత్వభోక్తృత్వాదిధర్మవిశిష్టమైన దేహేంద్రియాదికమును ఆత్మగ భజించు(తెలిసికొను) వాడు "అనన్యభాక్" అని అనిపించుకొనును. చిత్తప్రసాదజనితస్వయాథాత్మ్యవిజ్ఞానముచే అన్యభాక్కు కానివాడు "అనన్యభాక్కు" అని యనిపించుకొనును. అట్టివాడై పరబ్రహ్మమును "భజతే" నేను బ్రహ్మస్వరూపుడనే యని యవిక్రియమైన బ్రహ్మమునే యెల్లపుడు తనను యనుసంధానము చేయును. అట్టి జ్ఞానమువలన సదాచారసంపన్నుడగుటచే సత్పురుషుడేయని పండితులచే తలపదగినవాడు. అనగా "వీడు పాపి, దుష్టాచారుడు" అనెడి పూర్వబుద్ధిని విడచి "వీడు బ్రహ్మవేత్త, పుణ్యతముడు" అని తెలిసికొనదగినవాడు.

అట్టివాని పుణ్యతమత్వమునే "సమ్యగ్వ్యవసితో హి సః" అను వాక్యముచే నిశ్చయించుచుండెను "వ్యవసీయతే వస్తుయాథాత్మ్యం నిశ్చీయతేఽనేనేతి వ్యవసితం సమ్యక్ • వ్యవసితం యస్య సః సమ్యగ్వ్యవసితః" దేనిచే వస్తుతత్త్వము నిశ్చయింపబడునో యది వ్యవసితమనబడును. అదితత్త్వనిశ్చయాత్మకమైన విజ్ఞానము.సమీచీనమైన విజ్ఞానము. (జాతి, వర్ణ, తద్ధర్మ, తత్కర్మసంబంధశూన్యము) ఆకాశమువలె అతినిర్మలము, నిష్క్రియము, నిత్యముక్తస్వభావము కల పరబ్రహ్మమే నేను అనెడి తత్త్వసాక్షాత్కారజనితము, స్వభావనిశ్చయలక్షణము యెవనికి కలదో యట్టివాడు సమ్యగ్వ్యవసితు డనిపించుకొనును సమ్యగ్జ్ఞానసంపన్నుడు కనుకనే యితడు సాధువని అందరిచేతను తెలిసికొనదగినవాడు, పూజింపదగినవాడును యగుచున్నాడు. అని భావము. వాసుదేవ స్తుతిలకే కాదు. "న మే భక్తః ప్రణశ్యతి" అను వాక్యముయొక్క యర్థమును విచారించి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

తెలిసికొనదగినవాడు. కారణమేమందువా? ఆత డున్నదున్నట్లుగ తెలిసికొని సాధునిశ్చయము గలవాడై యుండును. ॥30॥

వచో యీశ్లోకమునకు యర్థముకూడ సంభవించును. "అపిచేత్సు దురాచారః" బ్రహ్మనిష్ఠుడగు బ్రహ్మవేత్త యయిన యతి స్వయముగ భ్రమప్రమాదములచే సుదురాచారుడైనప్పటికి అనగా అతినిందితాచారము కలవాడైనను ఏకాకియగుటచేతను, మౌనియగుటచేతను, భిక్షాటనము చేయుచు అభిశస్తపతితాదుల యన్నమును భక్షించుటచేతను దేశకాలవైషమ్యము ప్రాప్తింప దుష్టాన్న భక్షణముచేతను క్వచిత్తుచండాలాదిసంపర్కము చేతనైన నత్యంతదోషి యయినను "అనన్యభాక్" ఏవృత్తికి నాకంటె వ్యతిరిక్తమైన విషయము లేదో యావృత్తి "అనన్యా" అని చెప్పబడును. విషయాంతరశూన్యమైన వృత్తి యెవనికో వాడు "అనన్యభాక్" అని చెప్పబడును. అట్టివాడై "అహ మన్న మహ మన్న మహ మన్నం। అహ మన్నాదో౽హ మన్నాదః" అను శ్రుత్యుక్తరీతిని దాత; దానము, దేయము, భోక్తా, భోజ్యము, భోజనము, సర్వము నేనే (బ్రహ్మమే) అని యంతట బ్రహ్మదృష్టి కలవాడై యెవడు నిర్విశేషపరబ్రహ్మమును భజించునో, ప్రత్యగ్దృష్టిచే నీసర్వము, నేను బ్రహ్మస్వరూపమేయని యనుసంధానము చేయునో, అట్టివాడు బ్రహ్మమాత్రత్వానుసంధానము చేతనే (సాధువు) శుద్ధుడేయని పండితులచే తెలిసికొనదగినవాడు.

బ్రహ్మవేత్తయైనను దురాచారసహితు డగుచో నాదురాచారానురూపమగు ప్రాయశ్చిత్తము లేనిచో నాతడు శుద్ధుడేయని యెట్లు తెలిసికొందుము? అను నాశంకపై జెప్పుచున్నాడు:— "సమ్యగ్వ్యవసితో హి సః" "ఆత్మలాభా న్న పరం విద్యతే" ఆత్మలాభముకంటె వేరొండు లాభములేదు. "సమ్యగ్దర్శన సంపన్నః కర్మభి ర్న నిబధ్యతే। దర్శనేన విహీనస్తు సంసారం ప్రతిపద్యతే॥ ప్రాయశ్చిత్తం బ్రహ్మవిదో యత్తేస్తు బ్రహ్మవేదనమ్। దోషప్రసక్తా వన్య న్న శాస్త్రదృష్టం విధీయతే॥ అపి పాపప్రసక్తోపి ధ్యాయ న్నిమిష మచ్యుతమ్। భూయ స్తపస్వీ భవతి పంక్తిపావన పావనః॥ ప్రాయశ్చిత్తా న్యశేషాణి తపఃకర్మాత్మకాని వై। యానితేషా మశేషాణాం కృష్ణానుస్మరణం పరమ్॥ యది కుర్యా త్ప్రమాదేన యోగీ కర్మవిగర్హితమ్। యోగేనైవ దహే దంహో నాన్య త్తత్ర కదాచన॥ స్వే స్వే౽ధికారే యా నిష్ఠా స గుణః పరికీర్తితః। విపరీతస్తు దోషస్స్యా దుభయో రేష నిశ్చయః"॥ (సమ్యగ్దర్శనము కలవాడుకర్మలచే బంధింపబడడు. జ్ఞానవిహీనునకు ప్రాయశ్చిత్తముగ నాయాసంస్కారములు విహితము. బ్రహ్మవేత్త ప్రమాదవశమున దురాచారి యగుచో నాతనికి బ్రహ్మవేదనమే ప్రాయశ్చిత్తముకాని, శాస్త్రదృష్టమగు వేరొండు ప్రాయశ్చిత్తము లేదు. అట్టివాడు ప్రమాదవశమున పాపప్రసక్తుడైనను నిమిషమాత్ర మచ్యుతధ్యాన మొనరించుచో తపస్వియు (శుచియు) పంక్తిపావనపావనుడు నగును. తపఃకర్మాత్మకము లగు సర్వప్రాయశ్చిత్తములలోను కృష్ణస్మరణ ముత్తమమైనది. యోగి ప్రమాదమున నిందితకర్మను జేసినచో నాపాపమును యోగముచేతనే దహింపచేసుకొనదగును కాని, వేరొకవిధముగ నివర్తింపదు. వారి వారి యధికారానురూపమగు నిష్ఠ యుత్తమమైనదియు, విపరీతమగునిష్ఠ దుష్టమైనదియు నగును.) ఈ మొదలగు వాక్యములచే జ్ఞానికి జ్ఞానమే ప్రాయశ్చిత్తము. అని మన్వాదుల నిర్ణయముకలవాడు గాన బ్రహ్మవేత్త "సమ్యగ్వ్యవసితు" డనబడును. (సమీచీనప్రాయశ్చిత్తము కలవాడని యర్థము.) "తద్ధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ" "యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యంత ఏవ మేవంవిది కర్మ న శ్లిష్యతే" "నశ్లిష్యతే కర్మణా పాపకేన। ఉభే హ్యేవైష ఏతే తరతి" అను యీమొదలగు శ్రుతులుగూడ నీయర్థమునే తెలుపుచున్నవని చెప్పుటకై "హి" అను శబ్దము ప్రయుక్తము.

"అతిపాప ప్రసక్తోపి" అను శ్లోకమునకు వివరణము— అతిపాపప్రసక్తోపి= బ్రహ్మవేత్తయగు యతి

గీ॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి । ౹౩౧॥

పదవిభాగము:— క్షిప్రం- భవతి- ధర్మాత్మా- శశ్వత్- శాన్తిం- నిగచ్ఛతి- కౌన్తేయ- ప్రతిజానీహి- న- మే- భక్తః- ప్రణశ్యతి ॥ ౹౩౧॥

ప్రతిపదార్థము:— సః=(ఈపదమధ్యాహార్యము) అట్టిసమ్యగ్వ్యవసాయముగలవాడు [illegible] క్షిప్రం=శీఘ్రముగ; ధర్మాత్మా=ధర్మాసక్తమనస్సుగలవాడై; శశ్వత్=ఎల్లప్పుడు; శాంతిం=ఉపశమమును [illegible] నిగచ్ఛతి - పొందుచున్నాడు; కౌన్తేయ!=ఓకుంతీపుత్రుడా!; మే=నాయొక్క; భక్తః=భక్తుడు; న ప్రణశ్యతి=నశింపడు; ఇతి=(ఈపదమధ్యాహార్యము) ఇట్లని; ప్రతిజానీహి=ప్రతిజ్ఞ చేయుము. ౹౩౧॥

శాంకరభాష్యం:—

ఉత్సృజ్య చ బాహ్యాం దురాచారతా మంతః సమ్య గ్వ్యవసాయసామర్థ్యాత్ — క్షిప్రం శీఘ్రం భవతి ధర్మాత్మా ధర్మచిత్త ఏవ శశ్వ న్నిత్యం శాంతిం చోపశమం నిగచ్ఛతి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అట్టి నాభక్తుడు సమ్యగ్వ్యవసాయసామర్థ్యముచే దురాచారత్వమును విడి, శీఘ్రముగ ధర్మాత్ముడయి యెల్లపుడు ఉపశమమును పొందును. ఓయర్జునా! నాయందు [illegible]

భ్రమప్రమాదములచేగాని, దేశకాలాదివైషమ్యముచేగాని దుష్టాన్నభక్షణాదిరూపమగు [illegible] చియు, క్షణకాల మచ్యుతుని కూటస్థాసంగాత్మస్వరూపునిగ ధ్యానించి, (నేను కర్తను, [illegible] రిని, క్రియారహితుడను అని కర్తృ, కరణ, కార్యములకంటె భిన్నుడగు తనను [illegible] పునిగ జూచుచు) "భూయ స్తపస్వీ భవతి" "శుచిదీనర్షి వ్రతినో [illegible]" అను వాక్యానుసారము తిరిగి శుద్ధుడే యగును; లేక తపస్సంపన్నుడగును.

అట్టి బ్రహ్మవేత్త శుద్ధుడే యగుననుకొందుము. అట్లైనను [illegible] రడు. అనుశంకపై చెప్పుచున్నాడు. "పంక్తిపావనపావనః" త్రిసుపర్ణపఠితలు, [illegible] చయనాది క్రతుకర్తలు మొదలగువారందరు పంక్తిపావనులు. అట్టివారికిగూడ [illegible] నీబ్రహ్మవేత్త పునీతులను జేయునుగాన పంక్తిపావనపావను డనబడును. (అందరిలోను [illegible])

"ప్రాయశ్చిత్తా న్యశేషాణి" అను శ్లోకవివరణము:—కృచ్ఛ్రాతికృచ్ఛ్ర, మహాకృచ్ఛ్ర, చాంద్రా యణాది ప్రాయశ్చిత్తములు, తపోరూపప్రాయశ్చిత్తములు, వాజపేయ, రాజసూయ, అశ్వమేధాదిరూప [illegible] రూపమగు ప్రాయశ్చిత్తములు, శాస్త్రప్రసిద్ధములగు నీసర్వప్రాయశ్చిత్తములకంటె [illegible] బ్రహ్మ ప్రాయశ్చిత్తము శ్రేష్ఠమైనది. "కృషి ర్భూవాచక శ్శబ్దో ణశ్చ నిర్వృతివాచకః [illegible] కృష్ణ ఇత్యభిధీయతే ॥" అను స్మృత్యనుసారము కృష్ణశబ్దమునకు సదానంద [illegible] అట్టి పరబ్రహ్మస్మరణము (అవిక్రియబ్రహ్మాత్మ స్వరూపుడను నేను అని [illegible] స్వాత్మానుభవమే) యుత్కృష్టమైనదియు, సుకరమునగు ప్రాయశ్చిత్తము.

ఇట తత్త్వమిది:— ఏదో యొకానొక పాపమును తొలగించుకొనుటకై [illegible] ప్రాయశ్చిత్త మొనర్చిన యాపాపమే తొలగునుగాని, ఆగామిసంచితరూపమగు [illegible] జాలవు. ఇక కృష్ణానుస్మరణమన్ననో "అహం బ్రహ్మేతి మాం ధ్యాయ న్నే [illegible] తరతి పాప్మానం కల్పకోటిశతైః కృతమ్॥" అను స్మృత్యనుసారము, శతకోటి [illegible] యగు సమస్తపుణ్యపాపరాశిని నశింపజేసి మోక్షము నిచ్చునదిగాన బ్రహ్మానుసంధానము [illegible] ప్రాయశ్చిత్తము. ॥౩౧॥

శాంకరభాష్యమ్:—

ప్రాప్నోతి । శృణు పరమార్థం కౌంతేయ ప్రతిజానీహి నిశ్చితాం ప్రతిజ్ఞాం కురు న మే మమ భక్తో మయి సమర్పితాంతరాత్మా మద్భక్తో న ప్రణశ్యతీతి ॥ ॥౩౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మైన యంతఃకరణము గల నాభక్తుడు నశింపడు. ఈవిషయమై నీవు నిశ్చితమైన ప్రతిజ్ఞ చేసి చాటుము. ॥౩౧॥

—॥ ౯వ అధ్యాయము ౩౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ॥—

మధుసూదనసరస్వతీయము:— అట్టి బ్రహ్మవేత్త సమ్యగ్వ్యవసాయి కనుకనే దురాచారమును వీడి— "క్షిప్రం భవతి ధర్మాత్మా" చిరకాల మధర్మకారియైనను మద్భజనసామర్థ్యముచే శీఘ్రముగ ధర్మాభినివిష్టచిత్తుడగును. శీఘ్రముగ దురాచారమును వీడి సదాచారి యగునని యర్థము. "శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి" మరియు నెల్లపుడు విషయభోగస్పృహానివృత్తిరూప మగు శాంతిని పొందుచున్నాడు.

ఒకానొకభక్తుడు పూర్వాభ్యాసాతిశయముచే దురాచారమును వీడనిచో ధర్మాత్ముడు కాడుకదా! అట్టివాడు నశించు నందువా? అట్లు కాదని (భక్తానుకంపపారవశ్యముతో కోపించినవాడువలె) శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నాడు—"కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి" ఓకుంతీపుత్రా! నాయొక్క భక్తియొక్క మాహాత్మ్యము నిశ్చితమైనది. కాన విపరీతవాదుల సమక్షమునగూడ సగర్వముగ, సావజ్ఞముగ ప్రతిజ్ఞ చేయుము. నాదు (వాసుదేవుని) భక్తుడు అతిదురాచారియైనను ప్రాణసంకటావస్థ పొందినవాడైనను, అతిమూఢుడైనను, శరణములేనివాడైనను నశింపడు. మరియు కృతార్థుడే యగును. ఈవిషయమై అజామిళ, ప్రహ్లాద, ధృవ, గజేంద్రాదులు తార్కాణము. మరియు "న వాసుదేవభక్తానా మశుభం విద్యతే క్వచిత్" అను శాస్త్రముగూడ పైవిషయమున కుపష్టంభకము. ॥౩౧॥

శంకరానందీయము:— పాపాపనోదనార్థమై కృచ్ఛ్రచాంద్రాయణాశ్వమేధాదితపఃకర్మాత్మక ప్రాయశ్చిత్తములను చేసినను, వాటిని శాస్త్రోక్తదేశ, కాల, ద్రవ్య, మంత్ర, తంత్రాదినియమవైకల్యములేకుండగ చేసిననే శుద్ధి ప్రాప్తించును. అదియైనను షడ్రాత్ర, ద్వాదశరాత్ర, పక్ష, మాస, ఋతు, సంవత్సరాదికాలవ్యవధానముగ (దీర్ఘకాలమునకు) సంభవించును. అట్లైనను ఆశుద్ధి పాక్షికియే యగును. ఇక నాధ్యానమువలన కలుగు శుద్ధి అట్టిది కాదని యీశ్లోకమున జెప్పుచున్నాడు— "క్షిప్రం భవతి ధర్మాత్మా" బ్రహ్మవేత్త యగు యతి నాధ్యానముచే నుత్తరక్షణముననే (ప్రత్యగ్వృత్తిచే దనకు అవిక్రియబ్రహ్మాత్మత్వదర్శనకాలమునందే) ధర్మాత్ముడై (పుణ్యాత్ముడై) శుద్ధు డగును. ఈవిషయమున నియమవైకల్యకమపేక్షితము గాదు. మరియు పాపనివృత్తికి కాలాతిపాతముగాని, పరోక్షత్వముగాని సంభవింపదు. ఇంతియే కాదు. "శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి" పునరావృత్తిరహిత మగు విదేహముక్తిని తప్పక పొందును. (ఇట "ని" యను యుపసర్గము నిశ్చయార్థకము.) బ్రహ్మవేత్త యగు యతికి అవాంతరముగ ప్రాప్తించెడి దోషవిశేషములచే ముక్తి ప్రతిబంధింపబడదు. ఈవిషయమై నీవు ప్రతిజ్ఞ చేసి చెప్పవచ్చు నని చెప్పుచున్నాడు. "కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి" 'నేనే బ్రహ్మను' అను జ్ఞానయోగబలముచే బ్రహ్మభావమును పొందినవాడు భక్తు డనబడును. ఓయర్జునా! అట్టి నాభక్తుడగు బ్రహ్మవేత్త మధ్యకాలమున యప్రాప్తబ్రహ్మనిష్ఠుడై విఘ్నదోషముచే దుర్గతిని పొందడు. ఇక నేమన కోటివిఘ్నములనైన నాయనుగ్రహముచే నిర్మూలించి విదేహముక్తిని తప్పక పొందును. ఈవిషయమున సందేహింపవలదు. కాన నీవిషయమున నీవు ప్రతిజ్ఞ జేసి భగవద్భక్తుడు (బ్రహ్మజ్ఞాని) నశింప డని

గీ॥ మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేపి యాంతి పరాం గతిమ్ ॥ ॥౩౨॥

పదవిభాగము:— మాం- హి- పార్థ- వ్యపాశ్రిత్య- యే- అపి- స్యుః- పాపయోనయః- స్త్రియః- వైశ్యాః- తథా- శూద్రాః- తే- అపి- యాంతి- పరాం- గతిం ॥ ॥౩౨॥

ప్రతిపదార్థము:— పాపయోనయః=పాపజన్ములగు; స్త్రియః=స్త్రీలు; వైశ్యాః=వైశ్యులు; తథా=అట్లే; శూద్రాః=శూద్రులు; యేపి=యెవరైనను; మాం=నన్ను; వ్యపాశ్రిత్య=ఆశ్రయించి; స్యుః=అయ్యెదరో: తేపి=వారుకూడ: పరాం=ఉత్కృష్టమైన; గతిం=గతిని; యాంతి=పొందుచున్నారు. ॥౩౨॥

శాంకరభాష్యమ్:—

కించ— మాం హీతి । మాం హి యస్మా త్పార్థ! వ్యపాశ్రిత్య మా మాశ్రియత్వేన గృహీత్వా యేఽపి స్యు ర్భవేయుః పాపయోనయః పాపా యోని ర్యేషాం తే పాపయోనయః పాపజన్మానః । కే త ఇత్యాహ స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేపి యాంతి గచ్ఛంతి పరాం గతిం ప్రకృష్టాం గతిమ్ ॥ ॥౩౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓయర్జునా! పాపజన్ములైన స్త్రీలు, వైశ్యులు, శూద్రులుకూడ యెవరు నన్ను ఆశ్రయించినవారగుదురో వారు గూడ పరమపదమును పొందెదరు. ॥౩౨॥

జెప్పుము ('యోగక్షేమం వహా మ్యహం' అని నాచే బ్రతిజ్ఞ చేయబడినదిగాన మదైకశరణులగు బ్రహ్మనిష్ఠుల ముక్తి విఘ్నములచే బ్రతిబంధింపబడ దని గజఘంటను చేత బూని చాటుమని యర్థము.) ॥౩౧॥

—• ౯వ అధ్యాయము ౩౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పైవిధముగ ఆగంతుకదోషదుష్టులకు భగవద్భక్తిప్రభావముచే సుత్తీర్ణతను జెప్పి, స్వాభావికదోషదుష్టులకు గూడ భగవద్భక్తిప్రభావముచే సుత్తీర్ణతను జెప్పుచున్నాడు— ఓయర్జునా! నన్ను శరణునొందినవారు అంత్యజులైనను, లేక తిర్యగ్జంతువులైనను, జాతిదోషముచే దుష్టులైనను అట్లే వేదాధ్యయనశూన్యులగుటచే నికృష్టులైన స్త్రీలైనను, కృష్యాదిమాత్రరతులగు వైశ్యులైనను, జాతిచేతను, వేదాధ్యయనాద్యభావముచేతను పరమగతికి అయోగ్యులగు శూద్రులైనను పరమగతిని పొందుచున్నారు.

శంకరానందీయము:— పైవిధముగ నుపక్రాంతమైన జ్ఞానముయొక్క మాహాత్మ్యమును, జ్ఞానఫలమును జెప్పి, ప్రస్తుతము "సుసుఖం కర్తుమర్హసి" అనుదానిచే జెప్పబడిన జ్ఞానసౌలభ్యమును రెండు శ్లోకములచే జెప్పుచున్నాడు.

స్త్రీలు, వైశ్యులు, శూద్రులు మరియు నితరులగు నీచజన్ములు మ్లేచ్ఛ, పులిందాదులగు నీచకర్ములు కలరో వీరందరుగూడ పరమాత్మస్వరూపుడ నగు నన్ను సోపాధికముగగాని, నిరుపాధికముగగాని, సద్గురూపదేశజనితజ్ఞానముచే లెస్సగ నుపాసించి క్రమముగగాని, సాక్షాత్తుగగాని, పరమపురుషార్థ మగు కైవల్యమును పొందుచున్నారు. ఈశ్లోకమున గల 'హి' అను శబ్దము "కిరాతహూణాంధ్రపులిందపుల్కసా ఆభీరకంకా యవనాః ఖసాశాదయః । యేన్యే చ పాపా యదుపాశ్రయాశ్రయాః శుధ్యంతి తస్మై ప్రభవిష్ణవే నమః॥" అను శాస్త్రప్రసిద్ధిని ద్యోతనచేయుచున్నది. ఈచెప్పుటచే శాస్త్ర, ప్రజ్ఞాశూన్యులగు స్త్రీ శూద్రాదులకుగూడ జ్ఞాన, తత్ఫలప్రాప్తిప్రతిపాదనముచే జ్ఞానము అతిసులభ మని సూచింపబడెను. ॥౩౨॥

శ్లో॥ కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా ।
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్ ॥ ॥33॥

పదవిభాగము:— కిం- పునః- బ్రాహ్మణాః- భక్తాః- రాజర్షయః- తథా- అనిత్యం- అసుఖం- లోకం- ఇమం - ప్రాప్య- భజస్వ- మామ్ ॥ ॥33॥

ప్రతిపదార్థము:— పుణ్యాః=పుణ్యజన్మకల; బ్రాహ్మణాః=బ్రాహ్మణులు; తథా=అట్లే; భక్తాః=భక్తులగు; రాజర్షయః=రాజర్షులు; మాంఆశ్రితాశ్చేత్=(ఈపదమధ్యాహార్యము) నన్నాశ్రయించినవారగుచో, కింపునః=ఇక నేమిచెప్పవలెను?; అనిత్యం=క్షణభంగురము; అసుఖం=సుఖరహితమునగు; ఇమం=ఈ; లోకం=మనుష్యలోకమును; ప్రాప్య=పొంది; త్వం=నీవు; మాం=నన్ను; భజస్వ=సేవింపుము. ॥33॥

శాంకరభాష్యం:—

కిం పున రితి । కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యాః పుణ్యయోనయో భక్తా రాజర్షయ స్తథా రాజాన శ్చ త ఋషయ శ్చేతి రాజర్షయః । యత ఏవ మతోఽనిత్యం క్షణభంగుర మసు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పుణ్యజన్ములగు బ్రాహ్మణులు, భక్తులగురాజర్షులు, నన్నాశ్రయించినచో వారు పరమగతిని పొందెదరని వేరే చెప్పవలెనా? నశ్వరము, సుఖవర్జితమునగు (మనుష్యదేహాతిరిక్త

పదార్థప్రపా:— నాయందలి భక్తి కులాచారాదికము నపేక్షింప దని యీశ్లోకమున జెప్పుచున్నారు— ఓ యర్జునా! నన్ననన్యభక్తితో నాశ్రయించినవారు పాపాధికారముగల యుత్పత్తిగలవారైనను పరమగతిని పొందుచున్నారు.

"అనృతం సాహసం మాయా మూర్ఖత్వ మతిలుబ్ధతా" (అసత్యమాడుట, సాహసించుట, వంచన చేయుట, మూర్ఖత్వము ఇట్టి స్వభావసిద్ధగుణములుగల స్త్రీలు (గోపికలు) జారబుద్ధితో సంగమించియు, అట్లే కృషిగోరక్షణ కర్తలగు నందగోపప్రముఖులగు శూద్రులు గూడ నాయాశ్రయముచేత నే యుత్కృష్టమగు గతిని పొందుచున్నారు. ఈవిషయమై తైత్తిరీయకమున ఇట్లు జెప్పబడెను.

"త్వాం మనో యజమానా అనుద్యూన్ విశ్వా వసూని దధిరే వార్యాణి । త్వయా సహ ద్రవిణ మిచ్ఛమానా, వ్రజం గోమంత ముశిజా వివవ్రుః" దీనికి భాష్యానుశ్రితమైన యర్థము:— ఓవిశ్వస్వరూపుడవైన భగవానుడా! నిన్ను ప్రతిదివసము పూజించుచున్నవారై, యివ్వదగనిదైనను సమస్తధనములను యర్పించినవారై, కామోత్సుకులై, నీ సన్నిధానమున విషయ భోగ మాత్రమ పేక్షించువారై గోపప్రముఖులైన గోకులమును కోరుకొనిరి. అంతమాత్రము చేతనే కృతార్థులైరి. ఋగ్వేదమునందు గూడ "తా వాం వాస్తూ న్యుశ్మసి గమధ్యై యత్ర గావో భూరిశృంగా అయాసః। అత్రాహ తదురుగాయస్య వృష్ణః పరమం పద మవభాతి భూరి" ఈశ్రుతికి భాష్యసముదితార్థము:— మేము తాపత్రయము ప్రాప్తింపని గృహములను పొందుటకు వెళ్లెదము. ఆగృహము లెట్లుండవలెనన:- ఏగృహములయందు గోవులు పెద్ద కొమ్ములుకలవై, పెద్ద పొదుగులు కలవై సంచరించునో, దేవతలచే జేగీయమానుడగు శ్రీమహావిష్ణువు యొక్క- యుత్కృష్టమగు పారమార్థికస్వరూపము శ్రీకృష్ణరూపమున ప్రకాశించుచుండెనో, అట్టి గృహములను పొందుటకు మేము నిశ్చయించెదము. (వేదములచేగూడ యాదవవంశమున శ్రీకృష్ణరూపమున భగవానుడు జన్మించెనని చెప్పబడుచున్న దని తెలిసికొనదగును.) ॥3౨॥

—• 9వ అధ్యాయము 33వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పైన జెప్పిన రీతిగ దురాచారాదులే ముక్తులగుచుండినచో 'కింపునః...' సదాచారులు, ఉత్తమజన్మ కారణులు, మరియు సూక్ష్మవస్తువివేకముగల

శాంకరభాష్యమ్:—

ఖం చ సుఖవర్జిత మిమం లోకం మనుష్యలోకం ప్రాప్య పురుషార్థసాధనం దుర్లభం మనుష్యత్వం లబ్ధ్వా భజస్వ సేవస్వ మాం ॥ ౩౩ ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దేహములు భగవద్భజనయోగ్యములు కావుగాన) నీమనుష్యదేహమును [illegible] నీవు నన్ను సేవింపుము. ౹౩౩౹

రాజర్షులు వీరు నాభక్తులై పరమగతిని బొందుదురను విషయమున సందేహమేమి! [illegible] మహిమ కలదుగాన సర్వపురుషార్థసాధనయోగ్యము, అతిదుర్లభము నగు మనుష్యదేహమును [illegible] నీవు నశ్వరము, గర్భవాసాద్యనేకదుఃఖబహుళమగుటచే నీదేహము నశించకముందె [illegible] నన్ను శరణు పొందుము. ఈదేహము అనిత్యము, దుఃఖదాయకము గాన నిర్లక్ష్యము చేయకుము. [illegible] విధముగ సుఖసాధనకై ప్రయత్నింపకుము. నీవు రాజర్షివి, కాన నాభజనముచే నిన్ను [illegible] కొనుము. (లేనిచో నిట్టి జన్మము నిష్ఫలమే యగు నని భావము.)

శంకరానందీయము:— శ్రవణమననాద్యయోగ్యులు, అనక్షరాస్యులు [illegible] దులకుగూడ భక్తిచే జ్ఞానము, తత్ఫలము సిద్ధించుచుండ వేదశాస్త్రాధ్యయనసంపన్నులును, [illegible] నగు బ్రాహ్మణాదులకు జ్ఞానము. దాని ఫలము సిద్ధించు నని వేరె చెప్పవలెనా! [illegible] కన్యాయముచే సౌలభ్యమును సూచించు చు శుద్ధాత్ములు, సదసద్వివేకులు ముముక్షువులు [illegible] ణులను జ్ఞాన తత్ఫలసంపాదనమునందు ప్రవర్తింపజేయుటకై జెప్పుచున్నాడు:—'కింపున [illegible]...' 'పుణ్యాః' ఉత్తమజాతులు లేక పుణ్యకర్ములై శుద్ధాత్ము లగు బ్రాహ్మణులు. [illegible] దులచే నొందబడిన జ్ఞానసంపత్తి గల భక్తిచే నాయందు నిష్ఠను సంపాదించినవారై [illegible] రూపమగుటచే నుత్తమమైన విదేహముక్తిని పొందుచున్నారని ఏమి చెప్పవలెను!

"పురుషార్థము" అనుపదము బహువ్రీహియా? కర్మధారయమా? లేక [illegible]! అర్థసంగతిలేదుగాన బహువ్రీహియు, కర్మధారయము కానేరదు. ద్వితీయా. [illegible] సప్తమీతత్పురుషలు అయోగ్యార్థములుగాన తత్పురుషయుగానేరదు. 'పురుషస్య [illegible]' అని షష్ఠీతత్పురుష యుపయుక్తమే యగునుకదా?యని శంకింపరాదు. అట్లైన [illegible] స్త్రీల కయోగ్యమయ్యెడిని. కాన'పురుషేణ సాధ్యో అర్థః పురుషార్థః' అని పరిశేషన్యాయముచే [illegible] తత్పురుషము సిద్ధించుచున్నది. అట్టి పురుషార్థత్వము మోక్షమునకే సిద్ధించును గాని, [illegible] సిద్ధింపదు. 'భర్తృశుశ్రూషణ స్త్రీణాం మగ్నిహోత్రనిషేవణమ్' అను స్మృత్యుక్తరీతిని స్త్రీ[illegible] శాస్త్రసిద్ధమైన ధర్మము సాధ్యమై కన్పట్టుచున్నది కాన ధర్మమునకు స్త్రీసాధ్యత్వము కలదు. [illegible] అర్థమునకు, కామమునకుగూడ స్త్రీసాధ్యత్వము కలదు. పైవేదశాస్త్రాధ్యయన[illegible] స్త్రీలకు లేదు కాన మోక్షము స్త్రీసాధ్యము గాదు. అట్లే శూద్రజాతికిగూడ [illegible] 'ఆత్మా వా అరే శ్రోతవ్యో నిదిధ్యాసితవ్యః' అనుశ్రుతిచే నాత్మసాక్షాత్కార[illegible] విధింపబడినదిగాన స్త్రీశూద్రసాధ్యత్వము మోక్షమునకు లేదు. ఆ స్త్రీలకు వేదా[illegible]యోగ్యత లేకున్నను శ్రవణయోగ్యత కలదుకదా? యనిశంకింపరాదు 'మంతవ్యశ్చోపపత్తిభిః' అను[illegible] వారికి మనన శక్తి సంభవము కాదు గాన పదవాక్యప్రమాణజ్ఞునకే వేదాంతవిచార, మనన, [illegible]

సామర్థ్యము తగును కాని, యితర సామాన్యపురుషునకుగూడ సంభవము కాదు కాన నిక స్త్రీల విషయమై యేమి చెప్పవలెను. కాన స్త్రీలకు మోక్షసాధనసంపాదనయోగ్యత లేనందున మోక్షమునం దధికారము లేదు. కాన 'పురుషేణ సాధ్యో అర్థః పురుషార్థః' అని మోక్షమునకే ముఖ్యమైన పురుషార్థత్వము. ధర్మాదికమునకు గౌణమైన పురుషార్థత్వము సంభవించును.

ధర్మముగూడ మోక్షమువలె సాధ్యమైన యర్థమే యగును. 'ఉదితే సూర్యే ప్రాతరగ్నిహోత్రం అహరహ ర్యజమానః స్వయ మేవాగ్నిహోత్రం జుహోతి, విద్వా న్యజతే' అను ధర్మమునకుగూడ పురుషార్థత్వము శ్రూయమాణమగుటవలన ధర్మముగూడ ముఖ్యమైన పురుషార్థమే యగు నని శంకింపజనదు. అగ్నిహోత్రాదికముగూడ స్త్రీపురస్కారముగనే చేయబడుటవలన వీటికి కేవలపురుషసాధ్యత్వము సంభవింపనందునను, ధర్మానుష్ఠానము జ్ఞానసిద్ధికి అంగ మగుటవలనను సాధ్య మగుమోక్షమునకే ప్రధానత్వము. ధర్మము అంగమగును. కాన మోక్షమే ముఖ్యపురుషార్థమని సిద్ధము.

'స్త్రియో వైశ్యా స్తథా శూద్రాః' అనుదానిచే స్త్రీశూద్రులకు జ్ఞాన, తత్ఫలసిద్ధి ప్రతిపాదింపబడుచుండెనుగదా! యని శంకింపజనదు. ఆవచనము- స్త్రీశూద్రులకుగూడ జ్ఞాన, తత్ఫలసిద్ధియగుచుండ బ్రాహ్మణాదులవిషయమై యేమి చెప్పవలెను? అని జ్ఞానసౌలభ్యప్రతిపాదనపరమగుటచే స్వార్థమునందు తాత్పర్యము లేమింజేసి స్త్రీలకు జ్ఞానమునం దధికారము లేదని సిద్ధము.

గార్గి, సులభ మొదలగు స్త్రీలకును, ధర్మవ్యాధాదిశూద్రులకుగూడ జ్ఞానసంపత్తి శ్రూయమాణ మగుచున్నది. ఇట్లుండ స్త్రీశూద్రులకు జ్ఞానాధికారము లేదని చెప్పుట యెట్లు సమంజసమగును? అని శంకింపరాదు. ధర్మవ్యాధుడు పూర్వము బ్రాహ్మణుడై, జ్ఞాననిష్ఠకలవాడై బ్రాహ్మణశాపముచే శూద్రుడయ్యెను. అందునను పూర్వజన్మపుణ్యకర్మవిశేషముచేతనే జ్ఞాని యయ్యెను. ఎట్లు జ్ఞానియగు బ్రాహ్మణునికే దుష్కర్మవశమున శూద్రజన్మమో, యట్లే బ్రాహ్మణునకే కర్మవిశేషముచే స్త్రీజన్మముగూడ ప్రాప్తించును. అట్టి స్త్రీలకుగూడ అట్టి బ్రహ్మజ్ఞానము పూర్వజన్మమునందదిరియే కాని యాధునికముగాదు. స్త్రీలకు వేదాధ్యయన. తదర్థవిచారములయం దధికారము లేదుగాన యట్లు నిర్ణయింపవలసియున్నది. ఈనిర్ణయము బట్టియే "పురుషేణసాధ్యో అర్థః పురుషార్థః మోక్షః" (పురుషునిచే సాధింపనగు అర్థము గాన పురుషార్థమనియు నది మోక్షమేయని పర్యవసితము. పుంస్త్వసిద్ధికై సదసద్వివేకముగల ముముక్షువుచే సత్సాధన. సంన్యాసపూర్వకముగ ప్రయత్నముతో సంపాదింపదగునని బోధించుటకై జెప్పుచున్నాడు— "అనిత్య మసుఖం ప్రాప్య మిమిం లోకం భజస్వ మాం" నిత్యము కానిది యనిత్య మనబడును. "మఘవ న్మర్త్యం వా ఇదం శరీర మాత్తం మృత్యునా" అను శ్రుతిచొప్పున దేహము మృత్యుగ్రస్త మనుటచే ననిత్యము నిశ్చితమైన స్వభావము కలది. (అనగా దేహము రేపు నిలబడునని విశ్వసింప తగనిదని భావము.) కాన శరీర మయోగ్యమని చెప్పబడును (ఈచెప్పుటచే "శ్వః కార్య మద్యకర్తవ్యం" అను న్యాయమున బుద్ధిమంతుడు కాలవిలంబను లేకుండగనే పురుషార్థసిద్ధికై శీఘ్రముగ ప్రయత్నింప దగునని సూచింపబడెను.) మరియు "అసుఖం" ఆధ్యాత్మికాద్యుపద్రవకోటిగ్రస్త మగుటచే దుఃఖస్వరూపము (ఈచెప్పుటచే దేహమునకు స్వాస్థ్యమున్నంత లోపుననే మోక్షమునకై ప్రయత్నింపదగునని సూచింపబడెను.) "లోక్యత ఇతి వా ఆత్మస్వరూపం లోకయతీతి వా లోకః" దేహముచే నాత్మస్వరూపము చూడబడుచున్నవి. గాన దేహము లోకమనబడును. లేక, ఈదేహము ఆత్మస్వరూపమును చూచుచున్నదిగాన లోకమనబడును. అట్టి ముక్తిసాధనమైన దేహమును పొంది (దేహము క్షణభంగురము, దుర్లభమునని తెలిసికొని తీవ్రమోక్షేచ్ఛావైరాగ్యములచే నన్ను "మాం" ముక్తిప్రదాతనగునన్ను సోపాధికునిగగాని, నిరుపాధికునిగగాని "భజస్వ" శ్రద్ధాభక్తులతో ననుసంధానము చేయుము. (నిర్విశేషవిషయకముగ జ్ఞానము కలిగినచో నిర్విశేషపరబ్రహ్మముగనే "మహాత్మానః" అని చెప్పినరీతిని నన్ను అభేదముగనే యుపాసింపుము. అట్టిజ్ఞానము కలగదనినచో సోపాధికునిగనే నన్నుపాసించుమని యభిప్రాయము.)

గీ॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మా మేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః ॥ ॥౩౪॥

హరిః ఓమ్ తత్స దితి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం, సంహితాయాం, వైయ్యాసిక్యాం భీష్మపర్వణి. శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యారాజగుహ్యయోగో నామ
నవమోధ్యాయః ॥౯॥

పదవిభాగము:— మన్మనాః- మద్భక్తః- మద్యాజీ- మాం- నమస్కురు- మాం- ఏవ- ఏష్యసి- యుక్త్వా- ఏవం- ఆత్మానం- మత్పరాయణః ॥ ॥౩౪॥

ప్రతిపదార్థము:— త్వం=(ఈపదమధ్యాహార్యము) నీవు; మన్మనాః=నాయందేమనస్సుకలవాడవై; భవ=అగుము; మద్భక్తః=నాభక్తుడవై; భవ=అగుము; మద్యాజీ=నన్నుగూర్చియజనముచేయువాడవై; భవ=అగుము; మాం=నన్నుగూర్చి; నమస్కురు; నమస్కరించుము: ఏవం=ఫైవిధముగా; ఆత్మానం=ఆత్మస్వరూపుడనగునన్ను; యుక్త్వా=అనుసంధానముజేసి; మత్పరాయణః=నేనేపరమస్థానముగా కలవాడవై; మామేవ=నన్నే; ఏష్యసి=పొందగలవు. ॥౩౪॥

—• ౯వ అధ్యాయము ౩౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పరమేశ్వరభజనస్వరూపమును జూపుచు నుపసంహరించుచుండెను.— "మన్మనాభవ..." లోకమున రాజభక్తుడగు రాజభృత్యునికి పుత్రాదికమునందు మనస్సుండును. అట్లగుటచే నాతడు రాజభక్తుడనిపించుకొనడు. అట్లే నాభజనశీలుడైనను యితరమునందు కూడ మనస్సునుంచినచో నాకు నిజమైన భక్తుడు కాకుండును, అని తెలుపుటకై "మన్మనాభవ" అని చెప్పెను. నాయందే మనస్సుకలవాడవై యని అర్థము. అట్లే "మద్యాజీ" నన్నుపూజించు స్వభావముకలవాడవై "మాం నమస్కురు" మనోవాక్కాయములచే నన్నుగూర్చి నమస్కరించుము. ఈవిధముగ మదేకశరణుడవై యంతఃకరణమును నాయందు లగ్నముజేసి పరమానందఘనుడను, స్వప్రకాశస్వరూపుడను, సర్వోపద్రవశూన్యుడను అగు నన్నే పొందగలవు

శ్లో॥ శ్రీగోవిందపదారవిందమకరందాస్వాదశుద్ధాశయాః
సంసారాంబుధి ముత్తరంతి సహసా పశ్యంతి పూర్ణం మహః ।
వేదాంతై రవధారయంతి పరమం శ్రేయ స్త్యజంతి భ్రమం
ద్వైతం స్వప్నసమం విదంతి విమలాం విందంతి చానందతామ్ ॥

అధ్యాయసముదితార్థము:— సాధకులు బృందావనసంచారియగు శ్రీకృష్ణపరబ్రహ్మముయొక్క పాదారవిందములందలి మకరందము నాస్వాదించుటచే శుద్ధాంతఃకరణులై. సంసారార్ణవమును దాటుచుండిరి. శీఘ్రముగ నాపూర్ణతేజస్సును జూచుచుండిరి. ఆపరమశ్రేయస్సును వేదాంతములచే నిశ్చయించుచుండిరి. జగత్సత్యత్వాదిభ్రమను వీడుచుండిరి. కనుకనే ద్వైతప్రపంచమును స్వప్నతుల్యముగా తెలిసుకొనుచుండిరి. ఇట్టివారై పరమానందము నొందుచుండిరి. ॥౩౪॥

ఇట్లు శ్రీమధుసూదన సరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా నవమాధ్యాయ గూఢార్థ దీపికకు "తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణ, దర్శనాలంకార" బులుసుఅప్పన్నశాస్త్రిచే రచింపబడిన తాత్పర్యబోధిని
సమాప్తము.

——

శాంకరభాష్యమ్:—

కథం— మయి మనో యస్య స త్వం మన్మనా భవ। తథా మద్భక్తో భవ। మద్యాజీ మద్యజనశీలో భవ। మా మేవ చ నమస్కురు। మా మేవేశ్వర మేష్య స్యాగమిష్యసి యుక్త్వా సమాధాయ చిత్తమ్। ఏవ మాత్మాన మహం హి సర్వేషాం భూతానా మాత్మా పరా చ గతిః పర మయనం తం మా మేవంభూత మేష్యసీ త్యతీతేన పదేన సంబంధః। మత్పరాయణ స్సన్నిత్యర్థః॥ ॥34॥

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిందభగవత్పూజ్యపాదశిష్యశ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీభగవద్గీతాభాష్యే రాజవిద్యారాజగుహ్యయోగో నామ నవమోఽధ్యాయః।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భగవత్సేవనవిధాన మెట్టిద నెదవా? వినుము:— నాయందే మనస్సును నిల్పుము నాయందే భక్తికలవాడ వగుము. నన్ను గూర్చి యజించుము. నన్ను నమస్కరించుము. నేను సర్వభూతములకు ఆత్మస్వరూపుడను, పరమగతిని గూడ నేనే. కాన మత్పరాయణుడవై నన్నే యనుసంధానముచేయువాడవైన నన్నే పొందగలవు. ॥34॥

ఇట్లు నూరువేల సంఖ్య కలిగి, వ్యాసప్రోక్తము, సంహితారూపము నగు మహాభారతమునం దంతర్గతమైన భీష్మపర్వమునందున్న యుపనిషద్రూపము, బ్రహ్మవిద్యారూపము, యోగశాస్త్రము నగు భగవద్గీతలయందున్న శ్రీకృష్ణార్జునసంవాదమునందుగల రాజవిద్యారాజగుహ్యయోగ మను పేరి నవమాధ్యాయమునకు గౌతమసగోత్రుడగు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార" బులుసు అప్పన్నశాస్త్రిచే రచియింపబడిన, ఆనందగిరీయవ్యాఖ్యానుసృత శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని సమాప్తము.

హరిః ఓమ్ తత్సత్.

శంకరానందీయము:— నిర్విశేషజ్ఞానానధికారినగు నేను సోపాధికుడవగు నీభజనము నెట్లు చేయదగును? అను శంకపై జెప్పుచున్నాడు.— నీవు "మన్మనాభవ" సర్వాత్మకుడనగు నాయందు లగ్నమైన మనస్సు కలవాడవై యగుము. "వాసుదేవ స్సర్వం" అను రీతిని సమస్తజగత్తును నాస్వరూపముగ భావించుము. "మనో మోక్షే నివేశయేత్" అను న్యాయమున యానందస్వరూపము, మోక్షస్వరూపము నగు నాయందే మనస్సునుంచుము. (మోక్షరూపమైన పరమపురుషార్థమునందే సంయుక్తమైన మనస్సు కలవాడవగుము కాని ధర్మార్థకామఫలములయందు మనస్సును లగ్నము చేయకుమని యర్థము.) ముముక్షువగువాడు కేవల మోక్షఫలమునే కోరదగు నని చెప్పి వాని కర్తవ్యమును చెప్పుచున్నాడు.— "మద్యాజీ" పరమేశ్వరుడనగు నన్ను గూర్చి శ్రౌతస్మార్తకర్మలచే భజించుము. కర్మలను జేయునపుడు అగ్న్యాదులయందు భేద

బుద్ధిని జేయవలదని జెప్పుచున్నాడు. "మద్భక్తః" "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః" అను న్యాయముచే హోమము జేయబడు ద్రవ్యము, యాగము, యజమానుడు ఈసర్వము బ్రహ్మమే యని యంతట బ్రహ్మబుద్ధితో నన్ను సేవించువాడుమద్భక్తుడనబడును. అట్టివాడవగుము. (అంతటను బ్రహ్మబుద్ధిని చేయుమని యర్థము.) అట్లే "మాం నమస్కురు" సర్వము వాసుదేవస్వరూపమే యనుబుద్ధితో నమస్కరించుము. లేక, మాతృ, పితృ, గురు, దేవతలు నాస్వరూపులను బుద్ధితో నమస్కరించుము. మరియు "మత్పరాయణః" సర్వావస్థలయందును, యెల్లపుడు పరమేశ్వరుడే నాకు గతియను బుద్ధితో మచ్ఛరణుడ వగుము. లేక, నా (పరమేశ్వర) ప్రీతి కొరకే లౌకిక, వైదిక కర్మలను జేయువాడవగుము. "మామే వైష్యసి యుక్త్వైవం" పైవిధముగ నన్నే యుపాసించి, పరమాత్మస్వరూపమగు నన్నే పొందగలవు. (విదేహకైవల్యసుఖమును పొందగలవని యర్థము ) ||౩౪||

ఇట్లు శ్రీశంకరానందసరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా నవమాధ్యాయవాక్య
తాత్పర్యబోధినికి "తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణ, దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన తాత్పర్యబోధిని
సమాప్తము.

---

శ్రీధరీయము:— పరమేశ్వర భజనవిధానము జెప్పుచు నుపసంహరించుచుండెను. "మన్మనాభవ......" ఓయర్జునా! నాయందే లగ్నమైన మనస్సుకలవాడ వగుము. అట్లే నన్నే సేవించువాడవగుము. నన్ను గూర్చియే యాగము చేయుము. నన్నే నమస్కరించుము. పైవిధముగజేసి, మత్పరాయణుడవై మనస్సును నాయందే సమాధానమొనర్చిన నన్నే పొందగలవు.

శ్లో|| "నిజమాశ్చర్య మైశ్వర్యం భక్తేశ్చాద్భుత వైభవమ్ ।
నవమే రాజగుహ్యాఖ్యే కృపయాఽవోచ దచ్యుతః ||"

రాజగుహ్యమను పేరుగల యీనవమాధ్యాయమునందు స్వీయ మైన యైశ్వర్యము ఆశ్చర్యకరమైనదనియు, భక్తియొక్క అద్భుతవైభవమును భక్తులయెడ యనుగ్రహాతిశయముచే దెల్పెను. ||౩౪||

ఇట్లు శ్రీధరవిరచిత శ్రీభగవద్గీతానవమాధ్యాయటీకకు "తర్కరత్న,
న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార" బులుసు
అప్పన్నశాస్త్రివిరచిత తాత్పర్యబోధిని సమాప్తము.

భాష్యోత్కర్ష దీపిక.— భగవద్భజన ప్రకారము నీశ్లోకమున జెప్పుచున్నాడు— "మన్మనాభవ" పరమేశ్వరుడనగు నాయందే మనస్సును నిలుపుము. కాని దారపుత్రాదులయందు నిలుపకుము. అట్లే నాయందే భక్తికలవాడవగుము. కాని భూతాదులయెడ భక్తికలవాడవు కాకుము. అట్లే నన్నుగూర్చియే యాగము చేయుము. కాని యింద్రాదులను గూర్చి చేయబోకుము. (అనగా నీవుచేయు యాగములన్నిటిని యీశ్వరార్పణముగ చేయుము.) నన్నే నమస్కరించుము. (అనగా నాకంటె వేరను బుద్ధితో దేనికిని నమస్కరింపకుము.) నీయంతఃకరణమును స్థిరపరచుకొని, మద్భజనప్రకారముచే మత్పరాయణుడవైన నన్నే పొందగలవని యర్థము. లేక, చెప్పిన విధముగ భక్తియోగము నాచరించి "ఆత్మానం" సమస్తభూతప్రత్యగాత్మాభిన్నపరమాత్మనగు నన్నే పొందగలవని యర్థము. ఈనవమాధ్యాయముచే తత్పదలక్ష్యము, జ్ఞేయమునగు బ్రహ్మమును నిరూపించుచు తదుపాయభూతమగు భగవద్భజనము అత్యుత్తమఫలము నిచ్చునదియు, అతిసులభమైనదియు, పాపజన్ములనుకూడ నుద్ధరించునదియు గాన యావశ్యకమని సూచించెను. ||౩౪||

ఇట్లు ధనపతిసూరివిరచిత శ్రీభగవద్గీతానవమాధ్యాయ భాష్యోత్కర్షదీపికకు
"తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

---

పరమార్థప్రపా:— ఇక భగవద్భజన విధానమును జెప్పుచున్నాడు.— "మన్మనాభవ" నీమానసికసంకల్పము మదాకారమగునట్లు నాయందు మనస్సుకలవాడవగుము. క్షుద్రదేవతలకు భక్తుడవుగాక, నాకే భక్తుడవగుము. నన్ను గూర్చియే యజింపుము. అట్లే తరతమ భావవిసర్జనపూర్వకము అంతటనున్న నన్నే నమస్కరింపుము. (ఎవరికి నమస్కరించినను వారందరియందు నేనే యుంటిని. గాన యట్టి బుద్ధితో నాకే నమస్కరింపుము.) "విసృజ్య స్మయమానాన్ స్వాన్ దృశం వ్రీడాం చ దైహికీమ్। ప్రణమేద్దండవద్భూమా వాశ్వచండాల గోఖరమ్॥" తన్నుగూర్చి హేలనజేయు స్వీయులను జూడక, దేహము విషయమై సిగ్గిలక, శునకము, చండాలుడు, గోవు, గాడిద యను తరతమభేదమును వీడి యంతటనున్న నాకు సాష్టాంగదండప్రణామ మాచరించుము. అట్లైన యోగయుక్తుడవై పరమానంద స్వరూపమైన నన్నే పొందగలవు.

"శ్లో॥ విలిఖిత మివ రూపం చిత్తభిత్తౌ మురారేః సుమన ఇవ మనో యై రర్పితం తత్పదాబ్జే। ప్రతిపద ముదయద్భి స్సాత్త్వికై రంకితాంగా స్త ఇహ భవపయోధేః పార ముల్లంఘయంతి॥"

ఏధన్యులగు భక్తులు శ్రీకృష్ణభగవానుని సుందరరూపమును తమ చిత్తమను భిత్తికయందు చిత్రించుకొని భగవత్పాదారవిందయుగలమునందు సత్సంస్కారపరిమళపరిశోభితమృదుమనస్సుమనస్సును(పుష్పమును) సభక్తికముగ ప్రతిక్షణమునందునను యుదయించిన భక్తిభావస్ఫోరకములగు ఆనందబాష్ప, రోమాంచ, గద్గదస్వర, పారవశ్యాదిచేష్టావిశేషములచే నలంకృతాంగులగుదురో యట్టి మహానుభావులే సంసారసాగరము నుల్లంఘింపగలరు.

"విశ్వాభాసః కిలాసౌ మదధికరణకః స్యాన్మదజ్ఞాన కార్యం
యన్మిథ్యా తద్ధి సత్యాశ్రయమితి నియమో నైవ మిథ్యాశ్రితం సత్
సత్యేఽసత్యం భ్రమాన్తే న భజతి సహసాఽవస్థితిం మయ్యసంగే,
తత్సర్వోఽపి కదాచి న్న భవతి నవమేనోక్త మేత ద్రహస్యమ్॥"

## —• అధ్యాయతాత్పర్యము •—

ఈప్రపంచముయొక్క అభాసము నేను అధికరణముగా కలది. (అధిష్ఠానమగు నాయందు ప్రపంచము కల్పితమైనది.) ఆత్మాజ్ఞానముచే భాసించు యీప్రపంచకమంతయు మిథ్యాభూతము. మిథ్యాభూతమైనది సత్యమైన యధిష్ఠానము నాశ్రయించి భాసించును. (ప్రాతిభాసికరజతము సత్యమగు శుక్తిక నాశ్రయించి భాసించినట్లు) కాన ఇదియొక నియమము. ఈవిధముగ సత్పదార్థము మిథ్యాభూతమగు దాని నాశ్రయింపదు. భ్రమాపగమానంతరము సంగరహితుడను, సత్యస్వరూపుడను అగు నాయందు ఆసత్యప్రపంచము స్థితిని పొందజాలదు. కాన యట్టి యసంగస్వరూపుడనగు నాయందు మిథ్యాప్రపంచ మ్పర్శకూడ సంభవింపవేరదు. అను యీరహస్య మీనవమాధ్యాయమున జెప్పబడెను. ॥౩౪॥

ఇట్లు దైవజ్ఞ పండితవిరచిత శ్రీభగవద్గీతానవమాధ్యాయపరమార్థప్రపకు
"తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార" బిరుదు
అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్య బోధిని
సమాప్తము.

——

నీలకంఠీయము:— భగవద్భజనవిధానము నీశ్లోకమున జెప్పుచున్నాడు.— "మన్మనాభవ" నాయందే మనస్సుకలవాఁడవగుము. కాని, పుత్రాదులయం దుంచకుము. "మద్భక్తః" ధనాదులకై ధనికులయెడ గాక, నాయెడ భక్తి కలవాఁడవగుము. "మద్యాజీ" స్వర్గాద్యర్థ మిందాదులనుగాక, నన్నుగూర్చి యజింపుము. "మాంనమస్కురు" ఇతరులనుగాక నన్నే నమస్కరించుము. "మామేవ...మత్పరాయణః" పైవిధముగ నుండిననీవు సర్వోపాధిశూన్యమగు చిదాత్మయే సర్వోత్కృష్టప్రాప్యస్థానముగా కలవాఁడవగుదువు. గాన, పైన జెప్పినరీతిని యోగము నాచరించినచో సర్వాన్తరాత్మయగు నన్నే అభేదముతో ఘటాకాశము, మహాకాశమునువలె పొందగలవు. "యథా నద్యః స్యన్దమానా స్సముద్రేఽస్తంగచ్ఛంతి । నామరూపే విహాయ తథా విద్వాన్నామరూపా ద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్" (ఎట్లు నదులు సముద్రప్రవణములై ప్రవహించుచు వాటి నామరూపముల వీడి సముద్రములో లీనమగుచున్నవో యట్లే బ్రహ్మజ్ఞాని నామరూపవిముక్తుడై పరబ్రహ్మములో లీనమగుచున్నాడు.) అను శ్రుతియు పైయర్థమునే జెప్పుచున్నది. ॥౩౪॥

ఇట్లు శ్రీనీలకంఠాచార్య విరచిత శ్రీభగవద్గీతానవమాధ్యాయప్రకాశకను

బులుసు వెంకటశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని

సమాప్తము.

హరిః ఓం తత్స ద్బ్రహ్మార్పణ మస్తు.

న॥వ॥మాధ్యాయము సమాప్తము.



శుభమస్తు.

# శ్రీభగవద్గీతా
# శాంకరభాష్యతత్త్వబోధిని

## దశమోఽధ్యాయః.

### విభూతియోగః.

శ్రీభగవానువాచ:—

గీ॥ భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః ।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥ ॥౧॥

పదవిభాగము:— శ్రీభగవాన్- ఉవాచ- భూయః- ఏవ- మహాబాహో!- శృణు- మే- పరమం- వచః- యత్- తే- అహం- ప్రీయమాణాయ- వక్ష్యామి- హితకామ్యయా ॥ ॥౧॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=షడ్గుణైశ్వర్యసంపన్నుడగు శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ=పలికెను; హితకామ్యయా=హితేచ్ఛచే; అహం=నేను; ప్రీయమాణాయ=సంతసించుచున్నట్టి; తే=నీకొరకు; యత్=ఏవాక్యమును; వక్ష్యామి=చెప్పగలనో; హేమహాబాహో=ఓగొప్పబాహువులుకలయర్జున; మే=నాయొక్క; పరమం=నిరతిశయవస్తుప్రకాశకమైన; వచః=ఆవాక్యమును; భూయఏవ=తిరిగి; శృణు=వినుము. ॥౧॥

---

శాంకరభాష్యమ్:—

సప్తమేఽధ్యాయే భగవత స్తత్త్వం. విభూతయ శ్చ ప్రకాశితా నవమే చ । అథే దానీం యేషు యేషు భావేషు చింత్యో భగవాం స్తే తే భావా వక్తవ్యాః । తత్త్వం చ

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సప్తమాధ్యాయమునందు నవమాధ్యాయమునందున్ను, భగవంతుని సోపాధికనిరుపాధిక తత్త్వము సవిశేషనిర్విశేషరూపప్రతిపత్త్యుపయోగివిభూతులు ప్రకాశింపచేయబడెను. ఇక యిప్పుడు యే యే భావములయందు భగవంతుని చింతింపదగునో యాయాభావములు చెప్ప

---

—• ౧౦వ అధ్యాయము ౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు•—

మధుసూదనసరస్వతీయము:— ఇంతకుపూర్వము సప్తమ, అష్టమ, నవమాధ్యాయములచే తత్పదార్థమగు భగవత్తత్త్వము సోపాధికము, నిరుపాధికముగూడ ప్రదర్శింపబడెను. సోపాధికబ్రహ్మము

శాంకరభాష్యమ్:—

భగవతో వక్తవ్య ముక్త మపి దుర్విజ్ఞేయత్వా దిత్యతః— భూయ ఏవ భూయః పున స్తే మహాబాహో! శృణు మే మదీయం పరమం ప్రకృష్టం నిరతిశయవస్తునః ప్రకాశకం వచో వాక్యం యత్పరమం తే తుభ్యం ప్రీయమాణాయ। మద్వచనా త్ప్రీయసే త్వ మతీవామృత మివ పిబం స్తతో వక్ష్యామి హితకామ్యయా హితేచ్ఛయా॥ ॥౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దగియున్నవి. మరియు భగవంతునియొక్క తత్త్వము యిదివరలో చెప్పబడినను దుర్విజ్ఞేయ మగుటవలన తిరిగి చెప్పదగిన దని శ్రీకృష్ణపరమాత్మ తిరిగి చెప్ప మొదలిడెను.

నావాక్యమువలన నమృతపానముచేయువాడువలె సంతోషించుచున్న నీకొరకు హితేచ్ఛచే నేను ఓమహాబాహువులుకల యర్జున! తిరిగినాసంబంధమైన నిరతిశయవస్తుప్రకాశకమగు నుత్కృష్టమైన వాక్యమును చెప్పెద వినుము. ॥౧॥

యొక్క ధ్యానమునందును, నిరుపాధికబ్రహ్మముయొక్క జ్ఞానమునందును, ఉపాయభూతములైన విభూతులు "రసోఽహ మప్సు కౌంతేయ" అను మొదలగువానిచే సప్తమాధ్యాయమునందును, "అహం క్రతు రహం యజ్ఞః" అను మొదలగువానిచే నవమాధ్యాయమునందును సంక్షేపముగ జెప్పబడెను. ఇక ప్రస్తుతము భగవద్ధ్యానోపయుక్తముగ నావిభూతులను విపులముగ జెప్పుటకును, మరియు నట్లే భగవత్తత్త్వము దుర్విజ్ఞేయము గాన జ్ఞానసిద్ధికై విపులముగ దానిని జెప్పుటకును యీదశమాధ్యాయము నారంభించుచున్నాడు.— అందు ప్రప్రథమమున యర్జునుని ప్రోత్సహించుటకై శ్రీకృష్ణభగవానులు జెప్పుచున్నాడు.– "భూయ ఏవ..." గొప్ప బాహువులుగల ఓయర్జునా! నాయీ చెప్పబోవు యుత్తమమైన వాక్యమును వినుము. ఏమందువా? నేను చెప్పువిషయము వినుచు నీవు అమృతపాన సమయమున సంతసించునట్లు సంతసించుచుంటివి. కాన హితుడవగు నీకు హితము నుపదేశించుచుంటిని. కాన వినుమని యర్థము. ॥౧॥

శంకరానందీయము:— పూర్వాధ్యాయాంతమున "మన్మనా భవ మద్భక్తః" అని యర్జునుని గూర్చి ముముక్షువగు నీవు చిత్తశుద్ధి కొరకును, దానివలన గలుగు జ్ఞానద్వారమున కైవల్యసిద్ధికై సవిశేషబ్రహ్మోపాసనము జేయుమని జెప్పి, యీయధ్యాయమున మందప్రజ్ఞుడగు ముముక్షువునకు తీవ్రమోక్షేచ్ఛచే స్వోపాసనమునందు శీఘ్రముగ ప్రవృత్తుడగుటకై తనయుపాసనకు ఫలమును, పరమాత్మస్వరూపుడును, యుపాస్యుడును అగు తనకు సర్వజ్ఞత్వమును, సర్వేశ్వరత్వమును, నిఖిలాభీష్టదాదృత్వమునుభక్తులననుగ్రహించుటయు. విభూతివిశేషమును తెలుపుటకై యీదశమాధ్యాయము నారంభించుచుండెను. అందు ప్రథమమున శ్రోత యగు యర్జునునకు రుచ్యుత్పాదనమునకై మనోరంజకముగా నీవాక్యమును శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నాడు. "భూయ ఏవ" గొప్పబాహువులు గల ఓయర్జునా! జ్ఞాతవ్యమగు పరమతత్త్వము పరమసూక్ష్మమగుటవలనను, దుర్విజ్ఞేయమగుటవలనను సర్వవ్యవహారాగోచరమగుటవలనను "భూయః" తిరిగి బోధించుటకై నేజెప్పబోవు 'పరమం' పరమార్థవిషయకము తన్నిష్ఠా కారణము నగుటచే నుత్కృష్టమైన వాక్యమును వినుము. "ఈవాక్యమును విని, దాని యర్థమును తెలిసికొని నేను తరించెదను." అని సంతసించెడి నీకై (నిత్యనిరతిశయసుఖము హిత మనబడును. అట్టి హితమును చేకూర్చు తలంపుతో నుపదేశింపనుంటిని. కాన వినుమని యాశయము. ఈచెప్పుటచే నీతత్త్వమును విని, తెలిసికొని నేను తరింపగలనను దృఢ విశ్వాసమున్నవానికే తత్త్వోపదేశము చేయదగునని సూచింపబడెను. ॥౧॥

గీ॥ న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః ।
అహ మాది ర్హి భూతానాం మహర్షీణాం చ సర్వశః ॥ ॥౨॥

పదవిభాగము:— న- మే- విదుః- సురగణాః- ప్రభవం- న- మహర్షయః- అహం- ఆదిః- హి- భూతానాం- మహర్షీణాం- చ- సర్వశః ॥ ॥౨॥

ప్రతిపదార్థము:— హి=ఏ కారణమువలన; అహం=నేను; దేవానాం=బ్రహ్మాదిదేవతలకు; మహర్షీణాంచ=భృగ్వాదిమహర్షులకు; సర్వశః=సర్వవిధములచే; ఆదిః= కారణమో; తస్మాత్ =(ఈపదమధ్యాహార్యము)ఆ కారణమువలన; సురగణాః=బ్రహ్మాదిదేవతలు; మహర్షయః=భృగ్వాదిమహర్షులు; మే=నాయొక్క; ప్రభవం=ప్రభుశక్త్యతిశయమును, లేక ఉత్పత్తిని; న విదుః=యెరుగరు. ॥౨॥

శాంకరభాష్యం:—

కి మర్థ మహం వక్ష్యామి త్యత ఆహ— న మే విదు ర్న జానంతి సురగణా బ్రహ్మాదయః । కిం తే న విదుః, మమ ప్రభవం ప్రభావం ప్రభుశక్త్యతిశయమ్, అథ వా ప్రభవం ప్రభవన ముత్పత్తిమ్ । నాపి మహర్షయో భృగ్వాదయో విదుః । కస్మా త్తే న విదు రిత్యుచ్యతేఽహ మాదిః కారణం హి యస్మా ద్దేవానాం మహర్షీణాం చ సర్వశః సర్వప్రకారైః॥౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

బ్రహ్మాదిదేవతలకు, భృగ్వాదిఋషులకు నేను సర్వవిధముల కారణమగుటవలన బ్రహ్మాదిదేవతలు, భృగ్వాదిమహర్షులు నాయొక్క ప్రభుశక్త్యతిశయమును యెరుగరు. లేక నాయొక్కయుత్పత్తిని యెరుగరు. ॥౨॥

—• ౧౦వ అధ్యాయము ౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వము అనేకవిధముల జెప్పిన విషయమునే తిరిగి చెప్పుట వ్యర్థము కాదా? యను ప్రశ్నపై జెప్పుచున్నాడు— "న మే విదుః" నాయొక్క 'ప్రభవం' ప్రభుశక్త్యతిశయమును, లేక యనేకవిభూతులతో నావిర్భవించుటను ఇంద్రాదిదేవతాగణములు, భృగ్వాది మహర్షులు సర్వజ్ఞులైగూడ తెలిసికొనలేరు. కారణ మేమందువా? "అహ మాది ర్హి..."నేను సర్వదేవతలకును, సమస్తఋషులకును అన్నివిధముల (ఉత్పాదకత్వముచేతను, బుద్ధ్యాదిప్రేరకుడ నగుటచేతను, నిమిత్తకారణముగను, ఉపాదానకారణముగను) కారణుడను కాన మద్వికారులగు వారు నాప్రభావము నెరుంగజాలరు. ॥౨॥

శంకరానందీయము:— మహాత్ములగు వ్యాసాదులు అనేకులు నాకు తత్త్వము నుపదేశింపగలరు. ప్రామాణికులైనవారి యుపదేశమున జ్ఞాన మవశ్యము కలుగును. కాన పిష్టపేషణముగ జెప్పుట వ్యర్థము కాదా! అను శంకపై జెప్పుచున్నాడు— 'న మే విదుః...' ఇంద్రాది దేవతలు, భృగ్వాది ఋషులుగూడ మహదాదిసర్వప్రపంచసృష్టనగు నాయొక్క సృష్టి,స్థితి,అదన,ప్రవేశ,నియమన, నిగ్రహ, అనుగ్రహాది సామర్థ్యమును పూర్తిగ నెరుంగజాలరు. కారణ మేమందువా? 'అహ మాది ర్హి...' ఆదేవతలయొక్కయు, ఋషులయొక్కయు ఉత్పత్తికి, వైభవసిద్ధికి, తపస్సిద్ధికి, యోగసిద్ధికి, దివ్యజ్ఞానసిద్ధికి గూడ నేనే కారణము. 'తస్మా చ్చ దేవా బహుధా సంప్రసూతాః' అనియు,"యస్మి న్యక్తా మహర్షయో దేవతాశ్చ"అను శ్రుత్యనుసారము నానుండియే వారి యుత్పత్తియు, సర్వార్థసిద్ధియు నగుచున్నది. కాన నాకంటె యర్వాచీనులగు వారు నామహత్త్వము నెఱుంగజాలరు. తండ్రిమహత్త్వమును శిశువు యెరుగజాలునా? (కనుక నామహత్త్వమును నేనే తెల్పుచుంటి నని భావము.) ॥౨॥

గీ॥ యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరమ్ ।
అసంమూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥ ॥3॥

పదవిభాగము:— యః- మాం- అజం- అనాదిం- చ- వేత్తి- లోకమహేశ్వరం- అసంమూఢః- సః- మర్త్యేషు- సర్వపాపైః- ప్రముచ్యతే ॥ ॥3॥

ప్రతిపదార్థము:— యః=ఎవడు; అసంమూఢః=సంమోహము లేనివాడై; మాం=నన్ను; అనాదిం=కారణరహితునిగను; (కనుకనే) అజం=ఉత్పత్తి లేనివానినిగను; లోకమహేశ్వరం=అజ్ఞానతత్కార్యవర్జితమైనతురీయునిగను; వేత్తి=తెలిసికొనునో; మర్త్యేషు=మనుష్యులలో; సః=వాడు; సర్వపాపైః=జ్ఞానాజ్ఞానకృతనిఖిలపాపములచేతను; ప్రముచ్యతే=విడువబడుచున్నాడు. ॥3॥

—• ౧౦వ అధ్యాయము ౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు • —

మధుసూదనసరస్వతీయము:— భగవత్ప్రభావము మహాఫలకముగాన దానిని బహుసంఖ్యాకులలో నొకడే తెలిసికొనగలడని యీశ్లోకమున జెప్పుచున్నాడు. "యో మా మజం" సర్వమునకు కారణుడ నగు నాకు కారణమేదియు లేదు కాన ననాది నగు నన్ను జన్మశూన్యునిగను, సర్వలోకమహేశ్వరునిగను యెవడు తెలిసికొనునో యతడు సంమ్మోహవర్జితుడై సర్వపాపములనుండి (కారణనాశ మగుటచే నాసంస్కారములు లేకుండునుగాన) విడువబడును. ॥3॥

శంకరానందీయము:— నీవే నీమాహాత్మ్యము నుపదేశింపుము. దీనిని వినినంతమాత్రమున నాకేమి ఫలముప్రాప్తించు నను ఆశంకపై జెప్పుచున్నాడు:—"మర్త్యేషు" మరణశీలురగు శతకోటిసంఖ్యాకులగు పండితులలో "యః" యెవడు తీవ్రముముక్షుచే సదసద్వివేకముల నార్జించినవాడై "అసంమూఢః" (విషయములయందగు యిష్టతాబుద్ధి సంమోహ మనబడును.) అట్టిసంమోహము లేనివాడై, (విషయాశాపిశాచికి యవశుడై) తుచ్ఛసుఖసాధనముల సన్యసించినవాడై, నాయనుగ్రహమునకు పాత్రుడై, శ్రవణమననాదిసముత్పన్నజ్ఞానముచే "అనాదిం" జన్మ కారణములగు నిమిత్త, ఉపాదానములు లేనివాడును, కనుకనే "అజం" జన్మాదిషడ్భావవికారశూన్యుడను, (నిత్యుడను) అజత్వము, అనాదిత్వము, శశవిషాణమునకుగూడ సంభవించునుగాన నదిగూడ నిత్యమేయగును అనుదోషమును నివారించుటకై దనకు భావత్వమును, అదృశ్యత్వమును, పరమమహత్త్వమును, శ్రుత్యనుమానగమ్యత్వమును సూచించుటకై జెప్పుచున్నాడు—"లోకమహేశ్వరం" ఎవనిసన్నిధిమాత్రముచే నీసర్వజగత్తు చేష్టించుచున్నదో యాతడు పరమేశ్వరుడు. యెట్లు జడ మగురథము రథికునిచే నధిష్ఠింపబడి చలించుచున్నదో యట్లే నీసమస్తప్రపంచకము చేతనాధిష్ఠితమై చేష్టించుచున్నది. కాన జగత్తుయొక్క చేష్టాక్రియచే దానికి హేతువగు చేతనుని సత్త్వభావత్వము, పరమమహత్త్వము గూడ నూహింపబడుచున్నది. "య ఈశ అస్య జగతో నిత్యమేవ" అను శ్రుతియుపైవిషయమునే చెప్పుచున్నది. సర్వమలోకమహేశ్వరుడ నగునన్ను సర్వప్రపంచ ప్రవర్తకుడను, (ఇట! చ కారముచే గూటస్థాసంగచిద్రూపుడను అని గ్రహింపనగును) అగు "మాం" నిర్విశేషపరబ్రహ్మనగు నన్ను "వేత్తి" తెలిసికొనునో. (ఈసర్వము నేనే యని సాక్షాత్కరింపజేసుకొనునో) అట్టి బ్రహ్మవేత్తయగు యతి బుద్ధిపూర్వకములు, బుద్ధిపూర్వకములు కానివియునగు పాపములనుండియు, పాపకార్యములగు దుఃఖ దుర్యోని, దుర్గతులనుండియు విముక్తుడగును. (బ్రహ్మవేత్తకు పాపములతోటియు, పాపకార్యములతోటియు నేమియు సంబంధ ముండ దనియర్థము)

బుద్ధిపూర్వకపాపాచారి యగుచో నాతడు బ్రహ్మవేత్తయే కాడుగాన బ్రహ్మవేత్తయగువాడెపుడును, బుద్ధిపూర్వకపాపాచారి కాడు. పాపపుణ్యకర్మాచరణము దేహ జాతి, వర్ణ, ఆశ్రమాద్యభిమానము

శాంకరభాష్యమ్:—

కించ — యో మా మజ మనాదిం చ యస్మా దహ మాది ర్దేవానాం మహర్షీణాం చ న మమాన్య ఆది ర్విద్యతేఽతోఽహ మజోఽనాది శ్చానాదిత్వ మజత్వే హేతు స్తం మా మజ మనాదిం చ యో వేత్తి విజానాతి లోకమహేశ్వరం లోకానాం మహాన్త మీశ్వరం తురీయ మజ్ఞానతత్కార్యవర్జిత మసమ్మూఢః సమ్మోహవర్జితః స మర్త్యేషు మనుష్యేషు సర్వపాపైః సర్వైః పాపై ర్మతిపూర్వాఽమతిపూర్వకృతైః ప్రముచ్యతే ప్రమోక్ష్యతే ॥3॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు నేను బ్రహ్మాదిదేవతలకు, భృగ్వాదిమహర్షులకు కారణము నాకంటె వారలకు వేరు కారణము లేదు. కాన నేను కారణము లేనివాడను. కనుకనే జన్మరహితుడను. అట్టి వానినిగను, అజ్ఞానతత్కార్యవర్జితమైన తురీయముగను నన్ను యెవడు సంమోహములేనివాడై, తెలిసికొనునో అట్టివాడు జ్ఞానాజ్ఞానకృతమైన నిఖిలపాపములచేతను విడువబడుచున్నాడు ॥3॥

కారణముగాకలది. కాన నట్టి యభిమాన మున్నచో నాతనికి బ్రహ్మవిత్త్వమే సంభవింపనేరదు. బ్రహ్మవిత్త్వమన సర్వదృశ్యవిలక్షణ మగు పరబ్రహ్మమునం దాత్మస్వరూపవేదనము. ఇట్టి బ్రహ్మవిత్త్వముకల యతికి దేహాద్యహంభావమే యుండదు. దేహాద్యహంభావ మున్న ప్రాకృతునకు బ్రహ్మవిత్త్వ ముపపన్నము కాదు. కాన తేజస్తిమిరములవలె పరస్పరవిరుద్ధస్వభావములుకల యీబ్రహ్మవిత్త్వ, దేహాద్యహంభావములకు క్రమముగాగాని యొకే సారిగాని యేకాధికరణకత్వము సంభవింపనేరదు. దేహాదికమునం దహంభావము లేనపుడే, తదాశ్రితజాత్యాద్యభిమానము లేనపుడే బ్రహ్మవేత్తకు కర్మకర్తృత్వము లేకుండును. కాన బ్రహ్మవేత్తకు బుద్ధిపూర్వకపాపాచరణము సంభవింపనేరదు.

దేహాత్మభ్రాంతితో పాపము నాచరించిన వానికి 'నాచే పాపము చేయబడె' ననుప్రత్యయ మొకప్పుడును, తిరిగి యాతడే యవిక్రియబ్రహ్మస్వరూపముతో నుండిన 'నేను కర్తనుగాను' అను ప్రత్యయము మరొకప్పుడును కలుగును కదా! యని శంకింపజనదు. ఏమందువా? అట్లగుచో సార్వాత్మ్యదర్శనవిచ్ఛిత్తియే కల్గును. సార్వాత్మ్యదర్శనము, దేహాదులయం దాత్మబుద్ధియు, పాపాచరణము నివి బ్రహ్మవేత్తకు సంభవింపనేరవు. యేమన! నేను బ్రహ్మవేత్తను కాన నాకు దోష మంటదు. అను జ్ఞానముతో ప్రాణిహింసను గాని, యథేష్టాచరణమునుగాని యెవడు చేయునో వాడు బ్రహ్మవేత్తయే గాడు. యేమన: అట్టివాడు "సర్వభూతసుహృచ్ఛాంతః" ఇత్యాదిబ్రహ్మవిల్లక్షణముకలవాడే కాడు. కాన బ్రహ్మవేత్త బుద్ధిపూర్వకపాపకారి యెప్పుడును కానేరడు. ఇక బుద్ధిపూర్వకముగ గాక ప్రమాదవశమున పాపమును జేయవచ్చును. అయ్యది జ్ఞానముచే నివర్తించును. వస్తుస్థితి యిట్టిదైనను జ్ఞానమాహాత్మ్యమును "ద్వివిధపాపనిర్ముక్తుడగు" నని స్తుతించెను.

లేక, "అనాదిం" "జన్మాదికారణవర్జితుడను, కనుకనే "అజం" జన్మాదివికారశూన్యుడను, "సర్వలోకమహేశ్వరం" సమస్త లోకములలో నిరతిశయైశ్వర్యసంపన్నుడను, నిగ్రహానుగ్రహకర్తను, మోక్షప్రదాతను అగు "మాం" నన్ను పరమాత్మనుగా నెవడు తెలిసికొనునో అట్టివాడే మరణధర్మముకల మర్త్యులలో అసమ్మూఢుడగును. ఏమన: సదసద్వివేకశూన్యులగు మూఢులందరు కామాగ్నిచే దహ్యమానులగుచుండ యెవడుస్వయముగ వాటికి లోనుగాక, మోక్షమునే కోరుచు, భక్తిశ్రద్ధలతో నన్నుపాసించునో యాతడు అసమ్మూఢు డనిపించుకొనును. అట్టివాడు మనోవాక్కాయకృతములు, జన్మాంతరీయములు, ఆధునికములు, జ్ఞానోత్పత్తిప్రతిబంధకములు నగు సర్వపాపములనుండి నాయుపాసనాబ

గీ॥ బుద్ధి ర్జ్ఞాన మసంమోహః క్షమా సత్యం దమ శ్శమః ।
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాఽభయ మేవ చ ॥ ॥౪॥

పదవిభాగము:— బుద్ధిః– జ్ఞానం– అసంమోహః– క్షమా– సత్యం– దమః– శమః– సుఖం– దుఃఖం– భవః– అభావః– భయం– చ– అభయం– ఏవ– చ ॥ ॥౪॥

ప్రతిపదార్థము:— బుద్ధిః=అంతఃకరణసూక్ష్మార్థావబోధనసామర్థ్యము; జ్ఞానం=ఆత్మాదిపదార్థములవిజ్ఞానము; అసంమోహః=తెలిసికొనదగినవిషయములుసంప్రాప్తమైయుండవాటియందువివేకపూర్వకమైనప్రవృత్తి; క్షమా=ఒకనిచేయాకృష్టుడైనను,కొట్టబడినను వికృతినిపొందనిచిత్తముకలవాడగుట; సత్యం=పరబుద్ధియందుసంక్రమించుటకు తానుచూచినదిచూచినటుల వినినదివినినటుల తనచేననుభూతమైనదియనుభూతమైనటులయుచ్చరించబడువాక్కు; దమః=బాహ్యేంద్రియనిగ్రహము, శమః=అంతఃకరణనిగ్రహము; సుఖం=ఆహ్లాదము; దుఃఖం=సంతాపము; భవః=ఉద్భవము, (పుట్టుట) అభావః=తద్విపర్యయము; భయంచ=త్రాసము; అభయంచ=త్రాసవిపరీతము. ॥౪॥

గీ॥ అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః ।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥ ॥౫॥

పదవిభాగము:— అహింసా– సమతా– తుష్టిః– తపః– దానం– యశః– అయశః– భవన్తి– భావాః– భూతానాం– మత్తః– ఏవ– పృథగ్విధాః ॥ ॥౫॥

ప్రతిపదార్థము:— అహింసా=ప్రాణులనుపీడించకపోవుట; సమతా=ప్రాణులయందుసమానమైనచిత్తముకలవాడగుట; తుష్టిః=సంతోషము; (అనగాప్రాప్తమైనవాటియందలంబుద్ధి) తపః=ఇంద్రియసంయమపూర్వకమైనశరీరపీడనము; దానం=పాత్రయందుశ్రద్ధాపూర్వకముగ తనశక్తినతిక్రమింపకుండగ దేశకాలానుగుణముగ వస్తుసమర్పణము; యశః=కీర్తి; అయశః=అపకీర్తి అసెడి; పృథగ్విధాః=అనేకవిధములైన; భావాః=భావములు; భూతానాం=ప్రాణులకు; మత్త ఏవ=నావలననే; భవన్తి=అగుచున్నవి. ॥౫॥

---

ముచే విడిపించబడును. ("జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయా త్పాపస్య కర్మణః" అను స్మృతి చొప్పున సత్త్వప్రధానమగు నాయుపాసనముచే సర్వపాపవినిర్ముక్తుడై, జ్ఞానమును పొంది, ముక్తుడగునని యర్థము. ॥౩॥

—• ౧౦వ అధ్యాయము ౪, ౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— తనయొక్క లోకమహేశ్వరత్వమును వివరించుచున్నాడు:- అంతఃకరణముయొక్క సూక్ష్మార్థవివేకసామర్థ్యము బుద్ధి. ఆత్మానాత్మసర్వపదార్థావబోధము జ్ఞానము. బోద్ధవ్యములుగాను; కర్తవ్యములుగాను. తటస్థించిన వాటివిషయమై యవ్యాకులభావముతో, వివేకముతో ప్రవర్తించుట అసంమోహము. ఆకృష్టుడైగాని, తాడితుడైగాని నిర్వికారచిత్తముతో నుండుట క్షమ. ప్రమాణపురస్సరముగ దెలిసికొనిన విషయము నట్లే చెప్పుట సత్యము. బాహ్యేంద్రియములను తమతమవిషయముల నుండి మరలించుట దమము. అంతఃకరణమున విషయములనుండి మరలించుట శమము. ధర్మము అసాధారణ కారణముగా గల్గి యనుకూలముగా తెలిసికొనదగినది సుఖము. అధర్మము అసాధారణకారణముగా కలిగి ప్రతికూలముగా తెలిసికొనదగినది దుఃఖము. పుట్టుక భవము. ఉనికి భావము. లేక, లేకుండుట అభావము. త్రాసము భయము. తద్విపరీత మభయము. (ఇట ప్రథమచకారము ఉక్తసముచ్చాయకము. ద్వితీయచకారము అనుక్తఅబుద్ధి, అజ్ఞానాది సముచ్చయార్థకము) సర్వలోకప్రసిద్ధములగు నివన్నియు, (ముందుశ్లోకముతో నన్వయము) ప్రాణులను పీడింపకుండుట యహింస. రాగద్వేషరహితావస్థ సమత. భోగ్యవిషయమై "యింతటితో జాలు నను యలంప్రత్యయము తుష్టి. శాస్త్రీయమార్గముచే శరీరేంద్రియశోషణము తప మనబడును. యోగ్యప్రదేశమునను, యోగ్య కాలమునను శక్త్యనుసారము సత్పాత్రములయం దర్థసమర్పణము దానమనబడును.

శాంకరభాష్యమ్:—

ఇతశ్చాహం మహేశ్వరో లోకానాం— బుద్ధిరంతఃకరణస్య సూక్ష్మాద్యర్థాఽవబోధన సామర్థ్యం। తద్వంతం బుద్ధిమానితి హి వదంతి। జ్ఞాన మాత్మాదిపదార్థానా మవబోధః। అసమ్మోహః ప్రత్యుత్పన్నేషు బోద్ధవ్యేషు వివేకపూర్వికా ప్రవృత్తిః। క్షమాఽఽక్రుష్టస్య తాడితస్య వాఽవికృతచిత్తతా। సత్యం యథాదృష్టస్య యథాశ్రుతస్య చాత్మానుభవస్య పరబుద్ధిసంక్రాంతయే తథైవోచ్చార్యమాణా వాక్సత్య ముచ్యతే। దమో బాహ్యేంద్రియోపశమః। శమోఽన్తఃకరణస్య। సుఖ మాహ్లాదః। దుఃఖం సంతాపః। భవ ఉద్భవోఽభావ స్తద్విపర్యయః। భయం చ త్రాసోఽభయమేవ చ తద్విపరీతం॥ ॥౪॥

అహింసేతి। అహింసాఽపీడా ప్రాణినాం। సమతాసమచిత్తతా। తుష్టిః సంతోషః పర్యాప్తబుద్ధిర్లాభేషు। తప ఇంద్రియసంయమపూర్వకం శరీరపీడనం। దానం యథాశక్తి సంవిభాగః। యశో ధర్మనిమిత్తాకీర్తిః। అయశ స్త్వధర్మనిమిత్తాఽకీర్తిః। భవన్తి భావా యథోక్తా బుద్ధ్యాదయో భూతానాం ప్రాణినాం మత్త ఏవేశ్వరా త్పృథగ్విధా నానావిధాః స్వకర్మానురూపేణ॥ ॥౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అంతఃకరణకు సూక్ష్మాద్యర్థావబోధనసామర్థ్యము, కనుకనే సూక్ష్మార్థావబోధన సామర్థ్యముకలవానిని బుద్ధిమంతుడు అని చెప్పెదరు. ఆత్మాదిపదార్థజ్ఞానము, తెలిసికొనదగిన పదార్థములు ప్రాప్తింప వాటియందు వివేకపూర్వకమైన ప్రవృత్తి, ఆక్రుష్టమైనవాని యొక్కకాని, తాడితమైనవానియొక్కకాని యవికృతమైనచిత్తముకలిగియుండుట, ఆత్మానుభవము, పరబుద్ధిసంక్రాంతికొరకు చూచినది చూచినటుల వినినది వినినటుల యథ్లే యుచ్చరింపబడువాక్కు, బాహ్యేంద్రియనిగ్రహము, అంతఃకరణనిగ్రహము, ఆహ్లాదము' సంతాపము, ఉద్భవము, తద్విపర్యయము, త్రాసము, తద్విపరీతము ॥౪॥ ప్రాణులను పీడింపకపోవుట, సమచిత్తత్వము, సంతోషము (ప్రాప్తమైనవాటియందు అలంబుద్ధి,) ఇంద్రియసంయమపూర్వకమైన శరీరపీడనము, దేశకాలానుగుణముగ తన శక్తి నతిక్రమింపకుండ శ్రద్ధాపూర్వకముగ సత్పాత్రయందు ధనాదుల నర్పించుట, ధర్మనిమిత్తకమగు కీర్తి, అధర్మనిమిత్తకమగు నపకీర్తి అను "భావాః" ఈచెప్పబడిన నానావిధములైన బుద్ధ్యాదులు ప్రాణులకు తమ కర్మానురూపముగ ప్రాప్తించుచున్నవి. ॥౫॥

ధర్మము కారణముగా కలదైయై లోకశ్లాఘారూపమైన ప్రసిద్ధి (కీర్తి) యశస్సనబడును. అధర్మము కారణముగా కలదియై లోకనిందారూపమగు ప్రసిద్ధి యయశస్సనబడును. కార్యవిశేషములైన యీబుద్ధ్యాదిభావములు వాటి వాటి కారణములతోగూడ ధర్మాధర్మాదిసాధనవైచిత్ర్యముచే నానావిధములై సర్వప్రాణులకు పరమేశ్వరుడనగు నానుండియే కల్గుచున్నవికాని, మరియొకనినుండి కలుగుటలేదు. కాన నాలోకమహేశ్వరత్వ మిట్టిదని యర్థము. ॥౪, ౫॥

శంకరానందీయము:— తన యుపాసనముచే సర్వపాపవినిర్ముక్తులయిన ముముక్షువులకు తన వలననే జ్ఞానము, జ్ఞానసాధనములుగూడ సిద్ధించునని రెండుశ్లోకములచే జెప్పుచున్నాడు:— పరోక్షము, వపరోక్షము నగు బ్రహ్మాత్మైకత్వవిషయకమగు జ్ఞానము జ్ఞానమనబడును. అజ్ఞానమే జ్ఞాతకుకలుగు నేనేయను

గీ॥ మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥ ॥౬॥

పదవిభాగము:— మహర్షయః- సప్త- పూర్వే- చత్వారః- మనవః- తథా- మద్భావాః- మానసాః- జాతాః- యేషాం- లోకః- (లోకే) ఇమాః- ప్రజాః ॥ ॥౬॥

ప్రతిపదార్థము:— సప్తమహర్షయః=భృగ్వాదిసప్తమహర్షులు; పూర్వే=ప్రాచీనులైన; చత్వారః=నలుగురైన; మనవః=మనువులు; తథా=అట్లేప్రసిద్ధమైనసావర్ణులు; మద్భావాః=నాభావనకలవారై; (అనగా వైష్ణవసామర్థ్యముతో గూడినవారై; మానసాః=మనస్సుచేతనే పుట్టించబడినవారై; మయా=నాచే, జాతాః=ఉత్పాదితులు; లోకే=లోకమునందు; ఇమాః=ఈ, ప్రజాః=స్థావరజంగమములు; యేషాం=ఏమను, మహర్షి సంబంధులో. ॥౬॥

శాంకరభాష్యం:—

కించ— మహర్షయః సప్త భృగ్వాదయః పూర్వేఽతీతకాలసంబంధిన శ్చత్వారో మనవ స్తథా సావర్ణా ఇతి ప్రసిద్ధాః । తే చ మద్భావా మద్గతభావనా వైష్ణవేన సామర్థ్యే నోపేతా మానసా మనసైవోత్పాదితా మయా జాతా ఉత్పన్నా ఏషాం మనూనాం మహర్షీణాం చ సృష్టి ర్లోక ఇమాః స్థావరజంగమాః ప్రజాః ॥ ॥౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈలోకమునందున్న స్థావరజంగమాత్మకనిఖిలప్రజలు భృగ్వాదిసప్తమహర్షులయొక్క, మనువులయొక్క విద్యచేతను, జన్మచేతను సంతతిభూతులో అట్టి భృగ్వాదిసప్తమహర్షులు, ప్రాచీనమగు నలుగురుమనువులు బ్రహ్మసావర్ణ్యాదులు మద్గతభావనకలవారై వైష్ణవ సామర్థ్యముతో గూడినవారై నాస్వరూపమైన హిరణ్యగర్భునియొక్క మనస్సుచేతనే పుట్టించబడిరి. ॥౬॥

బ్రహ్మమాత్రత్వనిశ్చయమై బుద్ధి యనబడును. అజ్ఞానమున విపరీతభావన పుట్టకుండుటయే అసంమోహ మనబడును. ఆధ్యాత్మికాద్యుపద్రవసహిష్ణుత్వమే క్షమ యనబడును. యథార్థవక్తృత్వము సత్యమనబడును. ఇయ్యది బ్రహ్మచర్యాదుల కుపలక్షణము. బాహ్యేంద్రియసంయమనము దమ మనబడును. అంతఃకరణమునకు విషయప్రవృత్త్యుపరమము శమ మనబడును. బ్రహ్మనిష్ఠ నాశ్రయించి, ఆత్మహననక్రియ నాచరింపకుండుట అహింస యనబడును అంతటను సమదర్శనము సమత యనబడును. స్వానందానుభవము తుష్టి యనబడును. చిత్తైకాగ్ర్యము తపమనబడును. "దండన్యాసః పరందానం" అను స్మృత్యనుసారము మనోవాక్కాయకర్మలచే ప్రాణులను దండింపకపోవుట (దండన్యాసము) దాన మనబడును. యీతను బ్రహ్మవేత్తయను కీర్తి యశస్సనబడును. (ఇవి ఈశ్వరోపాసనచే ప్రాప్తించు జ్ఞానసాధనములు) అపకీర్తి అయశస్సనబడును. ఈఅయశశ్శబ్దము పూర్వోక్తవిపరీతములగు అబుద్ధి, అజ్ఞాన, సంమోహ, అక్షమ, అసత్య, అదమ, అశమ హింసల కుపలక్షణము. విషయానుభవజనితమైనది సుఖ మనబడును. ఆధ్యాత్మికాద్యుపద్రవనిమిత్తమైనదిదుఃఖము. ఉత్పత్తి భవ మనబడును. వినాశ మభావమనబడును. భూతములనుండి త్రాసము నొందుట భయమనబడును. అది లేకుండుట యభయమనబడును. పై నానావిధములగు ఉక్తములు, అనుక్తములనగు కామ, క్రోధ, లోభ, దంభ, దర్ప, అసూయా, అహంకారాదిరూపమగు భావములు (రాజసములు, తామసములునగు అబుద్ధ్యాది అయశోంతములగు వికారములు) మద్భజనశూన్యులగువారికి నీవలననే సంభవించును. కాన ముముక్షువులు అవశ్యము నాయుపాసనము చేయదగును. నాయుపాసనముచే సర్వపాపనివృత్తిపూర్వకముగ సాధనసహిత ముగ జ్ఞానము సంభవించునని యర్థము. ఈచెప్పుటచే "సంసారమోక్షస్థితిబంధహేతుః" అను శ్రుతిప్రసి

గీ॥ ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః।
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః॥ ॥౭॥

పదవిభాగము:— ఏతాం- విభూతిం- యోగం- చ- మమ- యః- వేత్తి- తత్త్వతః- సః- అవికంపేన- యోగేన- యుజ్యతే- న అత్ర- సంశయః॥ ॥౭॥

ప్రతిపదార్థము:— యః=ఎవడు; మమ=నాయొక్క; ఏతాం=ఈ; విభూతిం=విస్తారమును; యోగం చ=యుక్తిని, లేక—యోగైశ్వర్యసామర్థ్యరూపమగుసర్వజ్ఞత్వమును; తత్త్వతః=యథార్థముగ; వేత్తి=తెలిసికొనునో; సః=అట్టివాడు; అవికంపేన=చలింపచేయుటకుశక్యము కాని; యోగేన=సమ్యగ్దర్శన స్థైర్యరూపమైనయోగముచే; యుజ్యతే=కూడుకొనును; అత్ర=ఈవిషయమై; సంశయః=సందేహము, న=లేదు. ॥౭॥

---

ద్ధమైన సంసారబంధ, తన్మోక్ష కారణత్వము తనకు కలదని తెలుపబడెను. కాన పరమేశ్వరునకు ముముక్షు భజనీయత్వము సిద్ధించుచున్నది. ॥౪. ౫॥

## —• ౧౦ అధ్యాయము ౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈచెప్పబోవు కారణముచేగూడ నాలోకమహేశ్వరత్వము మహామహిమాన్వితము అని యీశ్లోకమున జెప్పుచున్నాడు— వేద, తదర్థద్రష్టలును. సర్వజ్ఞులును, విద్యా సంప్రదాయప్రవర్తకులును, సృష్ట్యాదియం దావిర్భవించినవారు నగు భృగ్వాదిసప్తమహర్షులు "మరీచి మత్రిం చ పులస్త్యం పులహం క్రతుమ్। వసిష్ఠం చ మహాతేజా సోఽసృజ న్మనసా సుతాన్॥ సప్త బ్రహ్మాణ ఇత్యేతే పురాణే నిశ్చయం గతాః" అను వాక్యము పైవిషయమును జెప్పుచున్నది. నలుగురు 'సావర్ణి' నామముతో ప్రసిద్ధులగు మనువులు, (లేక, భృగ్వాదిసప్తమహర్షులు, వారికంటెను పూర్వులగు నలుగురు సనకాది మహర్షులు అనియైన జెప్పకొనదగును.) స్వాయంభువాదిచతుర్దశమనువులును "మద్భావాః" మచ్చింతనపరులై (నన్ను భావనచేయుటచే నావిర్భూతమైన నాసంబంధమగు జ్ఞాన, ఐశ్వర్య, శక్తులు కలవారై) "మానసాః" మానసికసంకల్పమువల్లనే జనించినవారై, విశుద్ధజన్ములుగాన సర్వప్రాణిశ్రేష్ఠులై హిరణ్యగర్భరూపుడనగు నావల్లనే జనించిరి. లోకమున సర్వప్రజలును యీఋషులకు, మనువులకు జన్మముచేతను, విద్యచేతను సంతతిభూతులు. అట్టి ఋషులు, మనువులు నామానసికసంకల్పముచే నుద్భవించిరన నాలోకమహేశ్వరత్వ మహత్వము నేమి చెప్పవలెను. ॥౬॥

శంకరానందీయము:— "భవన్తి భావా భూతానాం" అనుదానిచే తాను ముముక్షువులకుపాస్యుడగుటకు కారణముగ దుష్టశిక్షణ, శిష్టరక్షణసామర్థ్యము, బంధమోక్షహేతుత్వము, సర్వతంత్రస్వాతంత్ర్యము, సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము వీటిని సూచించి ప్రాకృతము మందప్రజ్ఞులకుపాసనీయమగు తన విభూతిని నిర్దేశించుచుండెను "తమహర్షయః...ప్రజాః" అందరికంటెను ప్రాచీనులగు భృగ్వాదిసప్త మహర్షులును, అట్లే ప్రాచీనులగు స్వాయంభువాదులగు నలుగురు మనువులును. జగత్స్రష్ట నగు నాదుసంకల్పాత్మకమగు మనస్సునుండి యుద్భవించిరి. కనుకనే "పరమేశ్వరుడనగు నన్ను స్వస్వరూపముగా భావించుచుందురు. ముల్లోకములయందును నున్న యీప్రజలు భృగ్వాదిసప్తమహర్షులకును, స్వాయంభువాదిమనువులకును సంబంధించినవారు. (సంతతికి జెందినవారు) కాన స్థావరజంగమాత్మకమగు యీప్రజలు నాయొక్క విభూతులే యని భావము. (ఈచెప్పుటచే చరాచరాత్మక మగు నీవిశ్వమంతయు నావిభూతియేయని సూచింపబడెను) ॥౬॥

## —• ౧౦వ అధ్యాయము ౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పైవిధముగ సోపాధికబ్రహ్మముయొక్క ప్రభావమును జెప్పి దానిని తెలిసికొనిన గలుగు ఫలమును జెప్పుచున్నాడు—"ఏతాం...నసంశయః" బుద్ధ్యాదిమహర్ష్యంత

శాంకరభాష్యమ్:—

ఏతామితి। ఏతాం యథోక్తాం విభూతిం విస్తారం యోగం చ యుక్తిం చాత్మనో ఘటన మథవా యోగైశ్వర్యసామర్థ్యం సర్వజ్ఞత్వం యోగజం యోగ ఉచ్యతే। మమ మదీయం యో వేత్తి తత్త్వతః తత్త్వేన యథావ దిత్యేతత్। సోఽవికంపేనాఽప్రచలితేన యోగేన సమ్యగ్దర్శనస్థైర్యలక్షణేన యుజ్యతే సంబధ్యతే నాత్ర సంశయో నాస్మిన్నర్థే సంశయోస్తి ॥౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భగవంతుని సోపాధికప్రభావము నింతవరకు చెప్పి దానియొక్క జ్ఞానఫలమును "ఏతాం" అనుశ్లోకముచే చెప్పుచుండెను.

బుద్ధ్యాదుల కుపాదాన మగుటచే అనేకవిధములుగ నగుటయే విభూతి యనబడును. అదియే సర్వాత్మకత్వము, నాసంబంధమైన యట్టి విభూతిని, ఆత్మసంఘటనరూపమగు నాసంబంధమైన యోగమును, లేక యోగైశ్వర్యసామర్థ్యరూపమగు యోగజన్యసర్వజ్ఞత్వరూపమగు యోగమును, ఎవడు యథార్థముగ తెలిసికొనునో యట్టివాడు చలింపజేయుటకు శక్యము కాని సమ్యగ్దర్శనస్థైర్యరూపమగు యోగముచే కూడుకొనబడును. ఈవిషయమై యెంత మాత్రము సందేహము లేదు. ॥౭॥

మగు పూర్వోక్తవిభూతిని, తత్తదర్థనిర్మాణసామర్థ్యరూపమగు (పరమైశ్వర్యరూపమగు)యోగమును. నాసంబంధమగుదానినిగ తత్త్వము ననుసరించి యెవడు తెలిసికొనునో యట్టివాడు అప్రచలితస్వభావము గల సమ్యగ్జ్ఞానస్థైర్యరూపమగు సమాధితో కూడుకొనును. ఈవిషయమై సందేహింపవలదు. ॥౭॥

శ ం క రా నం దీ య ము:— పైవిధముగ స్వీయమగు యోగజమగు ఐశ్వర్యమును, విభూతిని ప్రతిపాదించి, యారెంటిని తెలిసికొనిన కలుగు ఫలమును జెప్పుచున్నాడు—"ఏతాం...న సంశయః" నిర్విశేషపరబ్రహ్మరూపుడ నగు నాయొక్క ప్రతిపాదింపబడిన "విభూతిం" మాయచే వివిధాకారముగ పరిణమించుట విభూతి యనబడును. అట్టివిభూతిని, "యోగం చ" సృష్టి, స్థితి, అదన, ప్రవేశ, నియమన, నిగ్రహ అనుగ్రహాదిసామర్థ్యమునుగూడ యథార్థముగ నేవివేకి శాస్త్రాచార్యోపదేశముచే గల్గిన వివేకవిజ్ఞానముచే 'నీజగత్తంతయులేనిదే. ఇక నేమన: పరమేశ్వరస్వరూపమే' అని సర్వమును నాస్వరూపముగను, నన్నే బంధమోక్షములకు కారణముగను లెస్సగ తెలిసికొనునో అట్టి ముముక్షువు "అవికంపేన యోగేన" వికల్పరహితమగు నాయుపాసనారూపమగు యోగముతో కూడుకొనును. అట్టివాడు మోక్షేచ్ఛచే నన్నిటియందును విరక్తుడై భక్తిశ్రద్ధలతో "ఈసర్వము వాసుదేవస్వరూపమే" యని యంతటను నన్నే చూచుచు, నన్నే యుపాసించును. ఈవిషయమై సంశయము లేదు. (ముముక్షువు సర్వమును సన్యసించి శ్రవణాదినిష్ఠచే నన్నే యుపాసించు ననుటలో సంశయింప దగదని యర్థము.) ॥౭॥

నీ ల కం ఠీ య ము:— ఉపాసనయందధికారిని "ఏతాం" అను శ్లోకముచే చెప్పుచుండెను.

"ఏతాం" చెప్పబోవు విభూతిని, యోగమును విశ్వతోముఖమగు భగవంతునియందు మనస్సమాధాన మును "యస్తత్త్వతోవేత్తి" లెస్సగ ననుష్ఠానము జేయుటకొఱకు, తెలిసికొనుటకొఱకు సమర్థుడగునో వాడు చలించని షష్ఠాధ్యాయమునందు "శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః" ఇత్యాదికముచే చెప్ప బడిన నిర్వికల్పకసమాధిరూపమగు యోగముచే అనగా మద్విషయకమగు నిర్వికల్పసమాధిచే కూడుకొన దానివలన కృతకృత్యుడగును. (ముక్తుడగునని యాశయము.) ఈవిషయమున సందేహము లేదని భగవద్వచ నమునందు సంశయము లేనందున ప్రవృత్త్యతిశయము నిమిత్తము చెప్పబడెను. ॥౭॥

గీ॥ అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః ॥ ॥౮॥

పదవిభాగము:— అహం- సర్వస్య- ప్రభవః- మత్తః- సర్వం- ప్రవర్తతే- ఇతి- మత్వా- భజన్తే- మాం- బుధాః- భావసమన్వితాః ॥ ॥౮॥

ప్రతిపదార్థము:— భావసమన్వితాః=పరమార్థతత్త్వాభినివేశముతోఁగూడినవారై; బుధాః=తెలియబడినతత్త్వముకలపండితులు; "అహం" పరబ్రహ్మమగువాసుదేవుడు; సర్వస్య=నిఖిలజగత్తునకు; ప్రభవః=కారణము; మత్తః=పరమేశ్వరునివలననే; సర్వం=నిఖిలజగత్తు: ప్రవర్తతే=ప్రవర్తించుచున్నది; ఇతి=ఇట్లు; మత్వా=తలచి; మాం=నన్ను; (పరమేశ్వరుని) భజన్తే=సేవించుచుండిరి. ॥౮॥

---

శాంకరభాష్యం:—

కీదృశే నావికంపేన యోగేన యుజ్యత ఇత్యుచ్యతే— అహం పరం బ్రహ్మ వాసుదేవాఖ్యం సర్వస్య జగతః ప్రభవ ఉత్పత్తి ర్మత్త ఏవ స్థితినాశక్రియాఫలోపభోగలక్షణం విక్రియారూపం సర్వం జగ త్ప్రవర్తత ఇత్యేవం మత్వా భజంతే సేవంతే మాం బుధా అవగతతత్త్వార్థా భావసమన్వితా భావో భావనా పరమార్థతత్త్వాభినివేశ స్తేన సమన్వితా స్సంయుక్తా ఇత్యర్థః ॥ ॥౮॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అవిచాల్యమగు నెట్టి యోగముచే కూడుకొనుననెదవా? చెప్పెదవి ము. వాసుదేవుడను పరబ్రహ్మమునగు నేను నిఖిలజగత్తునకు కారణము. పరమేశ్వరస్వరూపమగు నావలననే స్థితి నాశక్రియాఫలోపభోగరూపమగు వికిక్రియాస్వరూపమైన నిఖిలజగత్తు ప్రవర్తించుచున్నదని తలచి తెలియబడిన తత్త్వార్థము కలవారు (తత్త్వజ్ఞానులు) పరమార్థతత్త్వాభినివేశముతోఁ గూడినవారై నన్ను సేవించుచుండిరి. ॥౮॥

---

—• ౧౦వ అధ్యాయము ౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఎట్టి విభూతియోగజ్ఞానముచే నవికంపయోగము ప్రాప్తించునో యట్టి జ్ఞానమును నాల్గు శ్లోకములచే జూపుచున్నాడు— "అహం సర్వస్య ప్రభవః" పరబ్రహ్మస్వరూపమగు నేనీసర్వజగత్తున కుపాదానకారణుడను, నిమిత్తకారణుడను. "మత్త స్సర్వం ప్రవర్తతే" స్థితి,నాశాదిక మంతయు నానుండియే యగుచున్నది. లేక, అంతర్యామిని, సర్వజ్ఞుడను, సర్వశక్తిని యగు నాచే ప్రేరేపింపబడి యీసర్వజగత్తు తన హద్దును మీరకుండ చేష్టించుచున్నది. "ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః" పైవిధముగ వివేకులు తెలిసికొని పరమార్థతత్త్వగ్రహణరూపమగు ప్రేమతోఁ గూడినవారై నన్ను సేవించుచున్నారు. ॥౮॥

శంకరానందీయము:— అట్టిముముక్షువుకు వస్తుతత్త్వనిశ్చయవిధానమును, ఉపాసనమును స్పష్టపరచుచుండెను— "అహం" నిర్విశేషపరబ్రహ్మస్వరూపడనగు నేను మాయాశబలితుడనై "సర్వస్య" సమస్తప్రపంచమునకు 'ప్రభవః' ఉపాదానకారణుడను. 'కార్యం సర్వం కారణమాత్రమేవ' (కార్యమాత్రమెల్ల కారణస్వరూపము) అను న్యాయముచే సర్వము పరమాత్మస్వరూపమే. కనుకనే "మత్తః" పరమాత్మస్వరూపుడనగు నానుండియే "సర్వం""బుద్ధి ర్జ్ఞానం" అనుపూర్వోక్తవిధముగ మోక్షసాధనము, మోక్షము, బంధసాధనము, సంసారము మొదలగు నీసర్వము "ప్రవర్తతే" కలుగుచున్నది.

గీ॥　మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్ ।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ॥　॥౯॥

పదవిభాగము:— మచ్చిత్తాః- మద్గతప్రాణాః- బోధయన్తః- పరస్పరం- కథయన్తః- చ- మాం- నిత్యం- తుష్యన్తి- చ- రమన్తి- చ ॥　॥౯॥

ప్రతిపదార్థము:— మచ్చిత్తాః=నాయందేచిత్తముకలవారై; మద్గతప్రాణాః=నన్ను పొందిన చక్షురాదీంద్రియములు కలవారై; లేక నన్ను పొందినజీవనము కలవారై; పరస్పరం=అన్యోన్యము; బోధయన్తః=తెలియజేసుకొనువారై; మాం=నన్ను; కథయన్తః=చెప్పుకొనువారై; నిత్యం=ఎల్లప్పుడు; తుష్యన్తిచ=సంతోషించుచుండిరి; రమన్తిచ=క్రీడించుచుండిరి.　॥౯॥

శాంకరభాష్యమ్:—

కించ మచ్చిత్తా మయి చిత్తం యేషాం తే మచ్చిత్తా మద్గతప్రాణా మాం గతాః ప్రాప్తా శ్చక్షురాదయః ప్రాణా యేషాం తే మద్గతప్రాణా మ య్యుపసంహృతకరణా ఇత్యర్థః। అథ వా మద్గతప్రాణా మద్గత జీవనా ఇత్యేతత్ । బోధయంతోఽవగమయంతః పరస్పర మన్యోన్యం కథయన్తో జ్ఞానబలవీర్యాదిధర్మై ర్విశిష్టం మాం తుష్యంతి చ పరితోష ముపయాంతి రమంతి చ రతిం చ ప్రాప్నువంతి ప్రియసంగత్యేవ ॥　॥౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు తత్త్వజ్ఞానముకలవారు నాయందే యుంచబడిన చిత్తము కలవారై, నన్ను పొందిన చక్షురాదీంద్రియములు కలవారై, అనగా నాయం దుపసంహృతమైన చక్షురాది కరణములు కలవారై, లేక, నన్ను పొందిన ప్రాణధారణ కలవారై; (అనగా భగవదధీనమైన జీవనముకలవారై) ఆచార్యులవలన విని వాదకథారూపమున పరస్పరము భగవంతుని బోధించుకొనుచుండినవారై; వేదములచేతను, ఉపపత్తులచేతను గురువులు శిష్యులకొరకు విశిష్టధర్మములుకల (జ్ఞానబలవీర్యాదిధర్మములుకల) భగవంతుని యుపదేశించుచుండినవారై, సంతోషించుచుండిరి. ప్రియసంగతిచే క్రీడించినటుల రతిని పొందుచుండిరి.　॥౯॥

సర్వప్రాణులయొక్కయు ప్రవృత్తినివృత్తులు పరమేశ్వరునుండియే కలుగుచున్నవిగాన పరమేశ్వరుడే సర్వకారణు డని శ్రుతియుక్తులచే నిశ్చయించి, పరోక్షజ్ఞానులగు ముముక్షువులు "సర్వము బ్రహ్మస్వరూపమే" అను భావముతో గూడినవారై, అంతటను మద్భావనాయుక్తులై, యెల్లప్పుడు సర్వాత్మ నగు నన్ను సేవించుచుండిరి.　॥౯॥

—• ౧౦వ అధ్యాయము ౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ప్రేమపూర్వకమైన భజనమునే యీశ్లోకమున వివరించుచుండెను—నాయందే చిత్తముకలవారై, అట్లే మద్గతప్రాణులై (మద్భజననిమిత్తచక్షురాదీంద్రియ వ్యాపారులై) లేక, (నాయందే ఉపసంహరింపబడిన చక్షురాదిసర్వకరణములు కలవారై) లేక, (నాభజనముకంటె వేరె ప్రయోజనము లేని జీవనముకలవారై) విద్వద్గోష్ఠులలో పరస్పరము శ్రుతులచేతను, యుక్తులచేతను నన్నే బోధించుకొనువారై, (తత్త్వమును తెలిసికొను యిచ్ఛతో ప్రవృత్తమైన చర్చతో తెల్పుకొనువారై) తమ శిష్యులకు నాతత్త్వమును బోధించుచున్నవారై నాయందు చిత్తమును సమర్పించుట,

గీ॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే ॥ ॥౧౦॥

పదవిభాగము:— తేషాం- సతతయుక్తానాం- భజతాం- ప్రీతిపూర్వకం- దదామి- బుద్ధియోగం- తం- యేన- మాం- ఉపయాన్తి- తే ॥ ౧౦॥

ప్రతిపదార్థము:— యేన=ఏసమ్యగ్దర్శనరూపబుద్ధియోగముచే; తే=భక్తులు; మాం=నన్ను; ఉపయాన్తి=పొందెదరో; తం=అట్టి; బుద్ధియోగం=భగవత్తత్త్వవిషయకమైనసమ్యగ్దర్శనముతో సంబంధము; తేషాం=అట్టి; సతతయుక్తానాం=నిత్యాభియుక్తులైన (నివృత్తసర్వబాహ్యైషణులుకలిగినట్టి) ప్రీతిపూర్వకం=స్నేహపూర్వకముగ, భజతాం=సేవించువారలకు; తం=అట్టి; బుద్ధియోగం=భగవత్తత్త్వవిషయకమైనసమ్యగ్దర్శనమును, దదామి=ఇచ్చుచున్నాను. ॥౧౦॥

శాంకరభాష్యమ్:—

యే యథోక్తప్రకారై ర్భజంతే మాం భక్తాః సంతః— తేషాం సతతయుక్తానాం నిత్యాభియుక్తానాం నివృత్తసర్వబాహ్యైషణానాం భజతాం సేవమానానాం, కి మర్థిత్వాదినా కారణేన నేత్యాహ । ప్రీతిపూర్వకం ప్రీతిః స్నేహః తత్పూర్వకం మాం భజన మిత్యర్థః ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎవరు భక్తితోకూడినవారై, పూర్వమునందు చెప్పబడిన విధములచే నన్ను సేవించెదరో ఏసమ్యగ్దర్శనరూపమగు బుద్ధియోగముచే ఆత్మభూతమైన పరమేశ్వరుని ఆత్మగ నన్ను పొందెదరో అట్టి నిత్యాభియుక్తులు (మరలిపోయిన బాహ్యములగు సర్వైషణులుకలవారు) బాహ్యేంద్రియములను నాయందే సమర్పించుట, జీవనము సమర్పించుట, సమానులు అన్యోన్యము బోధించుకొనుట, తమకంటె న్యూనుల కుపదేశించుట, ఈమొదలగు నాభజనమునే చేయుచు, దాని చేతనే సంతసించుచున్నారు. ("ఇంతమాత్రముచే సర్వార్థములు సిద్ధించినవి. ఇతర మేమియు నక్కఱలేదు"అను అలంప్రత్యయరూపమైన సంతోషమును పొందుచుండిరి.) ఆసంతోషముచే నుత్తమసుఖము నొందుచుండిరి. "సంతోషా దనుత్తమః సుఖలాభః" (సంతోషమువలననే యుత్కృష్టసుఖలాభము) అను పతంజలిసూత్రము పైవిషయమునే తెల్పుచున్నది. "యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్ । తృష్ణాక్షయసుఖస్యైతే కలాం నార్హంతి షోడశీమ్" (స్రక్చందనవనితాదివిషయికసుఖము, స్వర్గీయమగుసుఖముకూడ తృష్ణానాశనముచే గల్గు సుఖముయొక్క పదునారవభాగమునకైనను సరిరావు.) అను స్మృతియు పైవిషయమునే ధృవపరచుచున్నది. ॥౯॥

శంకరానందీయము:— పరమేశ్వరోపాసనప్రకారమునే యీశ్లోకమున జెప్పుచున్నాడు— సర్వభూతస్వరూపుడను, సవిశేషుడను అగు నా(బ్రహ్మ)యందు "సర్వము బ్రహ్మమే" అను వాసనావాసితమైన చిత్తముగలవారై, నాతత్త్వమును ప్రతిపాదించు వాక్యముల నుచ్చరించుటయందును ఆవాక్యముల యర్థమును వినుటయందును. ఆవాక్యములయొక్క నిశ్చితమైన యర్థమును జూచుటయందును, ఆసక్తములైన వాగాదీంద్రియములు కలవారై, పండితులు అన్యోన్యము వారివారి ప్రజ్ఞానుసారముగ వాక్యార్థమును బోధించుకొనుచున్నవారై, వారివారి యనుభవమును చెప్పుకొనుచున్నవారై, స్వానుభవానురూపముగ సంతోషించుచుండిరి. ఎల్లపుడీవిధముగ వేదాన్తములయందు రమించుచుండిరి. అంతటను నన్నే చూచుచు, వినుచు, భావించుచు, కాలమును వెళ్ళబుచ్చుచుండి రని భావము. ॥౯॥

శాంకరభాష్యమ్:—

దదామి ప్రయచ్ఛామి బుద్ధియోగం బుద్ధిః సమ్యగ్దర్శనం మత్తత్త్వవిషయం తేన యోగో బుద్ధియోగ స్తం బుద్ధియోగమ్। యేన బుద్ధియోగేన సమ్యగ్దర్శనలక్షణేన మాం పరమేశ్వర మాత్మభూత మాత్మత్వే నోపయాంతి ప్రతిపద్యంతే। కే తే, యే మచ్చిత్తత్వాదిప్రకారై ర్మాం భజంతే ॥ ॥౧౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అర్థిత్వాదికారణములను పరిత్యజించి స్నేహపూర్వకముగ సేవించువారు అగు వారలకు నాతత్త్వవిషయకమగు సమ్యగ్దర్శనముతోకూడికను (బుద్ధియోగమును)యిచ్చెదను. ॥౧౦॥

—• ౧౦వ అధ్యాయము ౧౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అట్టి పండితులు పూర్వోక్తవిధముగా సేవించెదరు. సర్వకాల, సర్వావస్థలయందును భగవంతునియందే యేకాగ్రబుద్ధి కలిగినట్టియు, కనుకనే లాభ, పూజా, ఖ్యాత్యాదికమును కోరక ప్రీతిపూర్వకముగనే సేవించునట్టి. ఆపండితులకు "సోఽవికంపేన యోగేన" అని పూర్వోక్తమైన మత్తత్త్వవిషయకమగు సమ్యగ్దర్శనమును (బుద్ధియోగమును) కలుగజేసెదను. ఏబుద్ధియోగముచే నీశ్వరుడనగు నన్ను ఆత్మస్వరూపముగ నెవరు తెలిసికొనెదరో, అట్టివారు నన్నే సేవించెదరు. ॥౧౦॥

శంకరానందీయము:— ఈవిధముగ శ్రవణశ్రావణభేదముచే సేవనవిధానమును జెప్పి, ప్రస్తుతము తన యనుగ్రహస్వరూపమును రెండు శ్లోకములచే చెప్పుచున్నాడు:— "సతతయుక్తానాం" ఎల్లపుడు వేదాంతశ్రవణాదికమునందే పరినిష్ఠితులైనట్టియు, "భజతాం ప్రీతిపూర్వకం" స్వస్వరూపసాక్షాత్కారసిద్ధికై కలుగు అసక్తివిశేషము ప్రీతి యనబడును. అట్టి ప్రీతిపూర్వకముగ శ్రవణాదిజన్యజ్ఞానానురూపముగ నన్ను భజించునట్టివారికి స్వరూపజ్ఞానరూపమగు బుద్ధియోగము నిచ్చెదను. (అట్టివారికి నిత్యనిరంతరశ్రవణాదినిష్ఠచే ప్రీతిపూర్వకముగా జేయు నాయుపాసనముచే నేను సంతుష్టుడనై సమ్యగ్దర్శనము "ఈసర్వము నేనును బ్రహ్మస్వరూపమే." అని సర్వమునకు చిదేకరసబ్రహ్మమాత్రత్వావగాహమును, మత్ప్రాప్తిప్రతిబంధకనివర్తకమునగు జ్ఞానయోగము ననుగ్రహించెదనని యర్థము.) ఈచెప్పుటచే నొక దివ్యమణియొక్క లక్షణమును లక్షణజ్ఞాని వలన విని, అలక్షణజ్ఞాని వాక్యములచే లక్షణమును తెలిసికొని, లక్ష్యమునందు సూక్ష్మబుద్ధిచేతను, యుక్తిచేతను, లక్షణము నన్వేషించి, లక్ష్యలక్షణముల సంగతి నాలోచించుచు. దానినే మాటిమాటికి వినుచు నాలోచించుచు లెస్సగ జూచువారికే యీశ్వరానుగ్రహమువలన మణియొక్క తత్త్వము తెలియబడును. అట్లు కాక అట్టి దివ్యమణినామమును కీర్తింపక, ఆమణియొక్క తత్త్వము తెలియనివానియొద్ద ఆమణివిషయమైవిని. తత్త్వము నాలోచింపక, సూక్ష్మబుద్ధి లేక, యుక్తినిపుణులుగాక సమ్యగ్ద్రష్టలుగాక, ఈశ్వరప్రసాదపాత్రులు గాని వారలకు ఆదివ్యమణి తత్త్వము గోచరింపదు. అట్లే బ్రహ్మతత్త్వవిషయమైగూడ జూడనగునని సూచింపబడెను.

లేక, "ఏమ యో వేత్తి తత్త్వతః" అనుదానియొక్క వ్యాఖ్యార్థమును విచారించినచో "ఏతాం విభూతిం" అనునది మొదలుకొని, "ఏన మా ముపయాంతి తే" అనునది యంతముగా గల నాలుగు శ్లోకములకు నీవిధముగ నర్థము చెప్పందగును. "ఏతాం...సంశయః" ఈయథోక్తముమహత్త్వవిస్తారరూపమునగు

విధానం సృష్టి, స్థితి, ప్రలయ, ప్రవేశ, నియమనాది క్రియా సామర్థ్యము సర్వము నిర్విశేషుడను, అవిక్రియుడను పరబ్రహ్మస్వరూపుడను అగు నాయొక్క మాయచేతనే యగుచున్నదిగాని, వస్తుతః లేదు. అను యథాభూతార్థదర్శనముచే యేబ్రహ్మవేత్త సద్గురుప్రసాదలబ్ధాత్మవిజ్ఞానముకలవాడై యీసర్వము మాయికము, మిథ్య అని తెలిసికొనునో, ఆబ్రహ్మవేత్త బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానదార్ఢ్యముచే విక్షేపరహితమైన సమ్యగ్దర్శనరూపమగు యోగముతో "యుజ్యతే" దేహాదికమునందు ఆత్మభావమును వీడి "నేను బ్రహ్మమును" అని బ్రహ్మమునందే యాత్మబుద్ధిచే నిశ్చలుడగునుగాని "నేను, ఇది, నాది" అను వికల్పమును పొందడు. ఈవిషయమున సందేహములేదు." ||౭|| "మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్" అను శ్రుతిప్రసిద్ధమైన బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానవంతుల యనుభవమును జెప్పుచున్నాడు. — "అహం సర్వస్య......భావసమన్వితాః" ఈప్రతీయమానమగు నీసర్వజగత్తునకు పరబ్రహ్మస్వరూపుడనగు నేను ఉపాదానకారణుడను. (నాయందే యీసర్వము ప్రతీయమాన మగుచున్నదని యర్థము.) నాసన్నిధానము నుండియే యీసర్వజగత్తు ప్రవర్తించుచున్నది. ఈవిధముగ జగత్ప్రతీతికిని, తత్ప్రవృత్తికిని స్వస్వరూపమగు పరబ్రహ్మమునే కారణముగా తలచి, బ్రహ్మవేత్తలు బ్రహ్మమునందే యాత్మభావముతో గూడినవారై "నేనే బ్రహ్మము. బ్రహ్మమునే నేను" అని యనుసంధానము చేయుదురని యర్థము. ||౮|| పరమేశ్వరభజనవిధానమునే చెప్పుచున్నాడు:— "మచ్చిత్తా...రమంతి చ" శాస్త్రార్థమును శిష్యులకు బోధించుచున్నవారై, అన్యోన్యము వారి వారి యనుభవములను చెప్పుకొనుచున్నవారై. ఆపండితులు ప్రత్యగభిన్నపరబ్రహ్మస్వరూపుడను నాయందే మదాకారాకారితమైన చిత్తముకలవారై, ప్రత్యగ్వృత్తిచే నాస్వరూపముచే ప్రవిలాపితమైన ఇంద్రియాదులు కలవారై. వృత్త్యారూఢుడను, ఆనందైకరసస్వరూపుడనైన నన్నుగూర్చి సంతోషించుచుండిరి సర్వకాలములందును యీవిధముగా రమించుచుండిరి. ||౯|| పైవిధముగ బ్రహ్మవేత్తలై తనయందు భక్తికల యతులకు స్వభజనవిధానమును జెప్పి, ప్రస్తుతము తనుఅనుగ్రహించు విధానమును జెప్పుచున్నాడు— "తేషాం.....మా ముపయాంతి తే" పరబ్రహ్మస్వరూపుడనగు నాయందు సమాహితచిత్తులై, నన్ను భజించెడు ఆబ్రహ్మవేత్తలకు ప్రీతిపూర్వకముగా "భక్తాస్తేఽతీవ మే ప్రియాః" అను వచనానుసారము ఐహికాముష్మికసుఖములను తత్సాధనములను, సర్వమును సన్యసించి, స్వీయదేహ, జీవనాదికమునందుగూడ ఆశను వదలుకొని మోక్షైకవాంఛతో సచ్చిదానందఘనము, ఇతరులకు తెలిసికొనుటకు శక్యము కానిదియునగు నాసంబంధమగు పరతత్త్వమును యెల్లప్పుడు దానియందే ప్రీతిచే భజించెడి ఆభక్తులయెడ కలిగిన "ఈనాభక్తులు నాప్రాప్తికై యత్యంతము శ్రమనొందుచుండిరి." అనుదయార్ద్రాంతఃకరణవృత్తివిశేషరూపమగు ప్రీతితో నేను విశ్వేశ్వరుడుగా తొలగిన విపరీతప్రత్యయములు కలదియు, సన్మాత్రైకవిషయమునగు సమ్యగ్దర్శనముతో నంతఃకరణవృత్తికి సంబంధ (సంయోగ) మును కలుగజేసెదను. ('నేను, ఇది; అది, అను భేదప్రత్యయములు లేనట్టియు, బ్రహ్మమాత్రైకవిషయకమగునట్టియు, అఖండాకారము కలదియునగు వృత్తిని ప్రసాదించెదనని యర్థము.) నాయనుగ్రహప్రాప్తమైన అట్టి బుద్ధియోగముచే నాబ్రహ్మవేత్తలు అద్వితీయుడను, నిర్విశేషుడను, సచ్చిదానందఘనస్వరూపుడను, పరబ్రహ్మస్వరూపుడను, అగు నన్ను స్వాత్మస్వరూపునిగ తెలిసికొనుచున్నారు. (ఈ చెప్పుటచే ననేకపర్యాయములు శ్రవణముజేసి, శిష్యులకు జెప్పినవారైనను వారిలో సతతయుక్తులగు యతులకే ఈశ్వరుడు ప్రసన్నుడై సమ్యగ్దర్శనమును కలుగజేయునుగాని, యితరులకు అట్టి జ్ఞానము ననుగ్రహింపడు. కావ ముముక్షువులు; విజ్ఞాతాత్మతత్త్వులు నగు యతులు నిరంతరపరబ్రహ్మనిష్ఠతో నుండదగునని సూచింపబడెను.

గీ॥ తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః ।
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ ॥౧౧॥

పదవిభాగము:— తేషాం- ఏవ- అనుకంపార్థం- అహం- అజ్ఞానజం- తమః- నాశయామి- ఆత్మభావస్థః- జ్ఞానదీపేన- భాస్వతా ॥ ॥౧౧॥

ప్రతిపదార్థము:— అహం=నేను; అనుకంపార్థం=నాభక్తులకు శ్రేయస్సుయెట్లు ప్రాప్తించు ననుయనుకంపముకవలన (దయవలన) తేషాం=ఆభక్తులయొక్క; అజ్ఞానజం=అవివేకమువలనజనించిన; తమః=మోహాంధకారమును; ఆత్మభావస్థః=అంతఃకరణాశయమందుండినవాడనై; భాస్వతా=ప్రకాశించుచున్న; జ్ఞానదీపేన=జ్ఞానమనెడిదీపముచే; నాశయామి=నశింపచేయుచున్నాను. ॥౧౧॥

శాంకరభాష్యం:—

కి మర్థం కస్య వా త్వత్ప్రాప్తిప్రతిబంధహేతో ర్నాశకం బుద్ధియోగం తేషాం త్వద్భక్తానాం దదాసీ త్యపేక్షాయా మాహ— తేషా మేవ కథం నామ శ్రేయః స్యా దిత్యను కమ్పార్థం దయాహేతో రహ మజ్ఞానజ మవివేకతో జాతం మిథ్యాప్రత్యయలక్షణం మోహాంధ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నీయొక్క ప్రాప్తికి ప్రతిబంధహేతువగు దేనియొక్క నాశమునకు కారణమగు బుద్ధియోగమును యెందునిమిత్తము నీయొక్క భక్తుల కిచ్చెదవు? అను శంకపై "తేషాం" అని చెప్పుచుండెను. (అనగా భగవత్ప్రాప్తి బుద్ధిసాధ్యమగుచో భగవత్ప్రాప్తి యనిత్యము కావలసివచ్చును. నీవుకూడ అనిత్యఫలక మగు బుద్ధియోగమును భక్తులకు యిచ్చుచుంటివి. యిది యయుక్తమని యాశంక యాశయము.)

—• ౧౦వ అధ్యాయము ౧౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— తానను గ్రహించు బుద్ధియోగమునకు ఆత్మప్రాప్తి ఫలమైయుండ నారెంటికి మధ్యనుండు వ్యాపారమును జెప్పుచున్నాడు—"తేషాం...భాస్వతా" అట్టి భక్తులకు శ్రేయస్సు యెట్లు సమకూరునా యని యనుగ్రహించుటకై ఆత్మాకారాంతఃకరణవృత్తియందు విషయుడనై యుండి స్వప్రకాశచైతన్యానందాద్వయాత్మస్వరూపుడ నగు నేను, మదాకారితాంతఃకరణ రూపమగు దీపసదృశము చిదాభాసయుక్తము నగు నప్రతిబద్ధము నగు జ్ఞానముచే నజ్ఞానముపాదాన కారణముగా కలదియు, మిథ్యాజ్ఞానరూపము, స్వవిషయావరణము నగు యంధకారమును దానికి యుపాదానమగు యజ్ఞానమును నశింపజేసి తద్ద్వారమున నశింపజేయుదును. (ఉపాదాననాశముచే నుపాదేయము నివర్తించును. సమస్తభ్రమలకు ఉపాదానకారణమగు యజ్ఞానము జ్ఞానముచే నివర్తించిన ఉపాదేయములగు సర్వభ్రమలు తొలగు నని యాశయము) దీపముచే నంధకారమున తొలగింపజేయువలసియుండ, దీపమును వెలిగించుటను విడచి, మరియొక పనియొక్కగాని, అభ్యాసముయొక్కగాని యపేక్ష యుండదు. మరియు చీకటి యందుండెడి వస్తువుయొక్క అభివ్యక్తియే అపేక్షితముగాని, లేని వస్తువుయొక్క యుత్పత్తి యపేక్షితము గాదు. ఈవిధముగనే జ్ఞానముచే నజ్ఞానమును తొలగింపజేయవలసియుండ జ్ఞానోత్పత్తిని విడచి యితరమగు కర్మయొక్కగాని, యభ్యాసముయొక్కగాని యపేక్ష యుండదు. మరియు శశ్వత్సిద్ధమగు బ్రహ్మభావరూప మగు మోక్షముయొక్క అభివ్యక్తియే అపేక్షితముగాని, అనుత్పన్నమగు మోక్షముయొక్క

శాంకరభాష్యం:—

కారం తమో నాశయా మ్యాత్మభావస్థ ఆత్మనో భావోఽన్తఃకరణాశయ స్తస్మి న్నేవ స్థిత సః । జ్ఞానదీపేన వివేకప్రత్యయరూపేణ భక్తిప్రసాదస్నేహాభిషిక్తేన మద్భావనాభినివేశవాతే

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నాభక్తులకు బుద్ధియోగము నెందుల కిచ్చెద వనెదవా? బుద్ధియోగము భగవత్ప్రాప్తికి హేతువు కాదు. మరేమన! భగవత్ప్రాప్తిప్రతిబంధకనాశకము కాన భగవత్ప్రాప్తి కనిత్యత్వ ప్రసక్తి లేదు. అని పైయాంశంకకు సమాధానము. అవివేక మనగ అజ్ఞాన మని యర్థము. నాభక్తులకెటుల శ్రేయస్సు ప్రాప్తించును. అను దయవలన నేను అజ్ఞానమువలన జనించిన మిథ్యాప్రత్యయరూపమగు మోహాంధకారమనెడి తమస్సును అంతఃకరణాశయమందుండిన వాడనై నశింపజేయుచుంటిని. ఇచట అవివేక మనగ నజ్ఞానము. దానివలన జనించినది. యుత్పత్తి యపేక్షితము గాదు. అట్లు కాక మోక్షము జన్యమే యగుచో నది నశించునదియు, కర్మ సాపేక్షముగూడ కావలసివచ్చును. అను నీయర్థము యీశ్లోకమునందున్న రూపకాలంకారముచే సూచింపబడెను. (ఇట "భాస్వతా" అను విశేషణముచే దీపమునకు ప్రతిబంధక మగు తీవ్రపవనాదికమువలె, జ్ఞాన ప్రతిబంధక మగు విపరీతభావనాదికము లేదని సూచింపబడెను.) జ్ఞానమునకు దీపసాధర్మ్యమేమనగా స్వవిషయావరణమును తొలగించుట, తాను జేయు పనియందు తనతో సజాతీయమగు నితరము నపేక్షింపకుండుట, తాను పుట్టుటకంటె నితరమగుదాని నపేక్షింపకుండుట మొదలగు రూపకబీజముల నూహింపదగును. ॥౧౧॥

శంకరానందీయము:— "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" అను శ్రుతిచెప్పిన పరిపూర్ణము, అనంతము నగు బ్రహ్మస్వరూపుడవైన నీదు ప్రాప్తి సాధకులకు సంభవించుచునేయున్నది. ఇట్లగుట "దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే" అని జెప్పుట యయుక్త మనెదవాతి. సత్యమే, సర్వాత్మకుడను, పరబ్రహ్మస్వరూపుడను అగునన్ను సర్వులు పొందియే యుండిరి. అట్లైనను అజ్ఞానముచే నన్ను పొందనట్లు మూఢులు తలచుచుండిరి. (ఎట్లు జాత్యంధులు ప్రాప్తమైన సూర్యకాంతిని పొందనట్లు తలచెదరో అట్లే ప్రాప్తమైన బ్రహ్మము నప్రాప్తముగ తలచెదరని భావము.) కనుక మద్భజనశీలు రగువారియెడ దయార్ద్రహృదయుడనై నేను నాప్రాప్తికి హేతువగు జ్ఞానమున కావరకమైన యజ్ఞానమును నశింపజేసెదనని యీశ్లోకమున జెప్పుచున్నాడు—"తేషా మేవానుకంపార్థం" పూర్వోక్తులగు మచ్చిత్తత్వసతతయుక్తత్వాదిజ్ఞానపరిపాకసాధనములచే నెవరు నన్ను సంసారమోక్షణమునకై సేవించెదరో అట్టి మద్భజనైకనిష్ఠులగు బ్రహ్మవేత్తలయెడ దయకల్గి (వీరు నిరంతరసమాధినిష్ఠారూపమగు మద్భజనమునందు శ్రమనొందుచుండిరి. వీరి శ్రమ యెట్లు తొలగునని వారియెడ దయకల్గును. అదియును పురస్కరించుకొని) పరమాత్మస్వరూపుడ నగు నేను ఆత్మభావస్థః" ప్రత్యగ్బ్రహ్మవిషయకమగు ధ్యానాత్మకవృత్తియందున్నవాడనై, (చక్షురింద్రియమునకు సూర్యుడువలె మద్ధ్యానవృత్తికి విషయుడనై అనియర్థము) లేక, ఇట ఆత్మయన యంతఃకరణము. దాని వృత్తి భావ మనబడును. అవృత్తియందు ప్రత్యగ్రూపముతో నుండువాడు. "ఆత్మభావస్థః" అని చెప్పబడును. "భాస్వతా" నిత్యనిరంతరసమాధినిష్ఠాసంభావితాప్రతిబద్ధస్వభావముకల దగుటచే నిరంకుశస్వభావముకల "జ్ఞానదీపేన" వస్తుతత్త్వము దీనిచే దెలియబడునుగాన జ్ఞానమనబడును. అది ఆత్మస్వరూపప్రకాశకమైన బుద్ధివృత్తివిశేషము.

శాంకరభాష్యమ్:—

రితేన బ్రహ్మచర్యాదిసాధనసంస్కారవత్ప్రజ్ఞావర్తినా విరక్తాంతఃకరణాధారేణ విషయవ్యావృత్తచిత్తరాగద్వేషాకలుషితనివాతాపవరకస్థేన నిత్యప్రవృత్తైకాగ్ర్యధ్యానజనితసమ్యగ్దర్శనభాస్వతా జ్ఞానదీపే నేత్యర్థః ॥ ॥౧౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మిథ్యాజ్ఞానము. ఆరెంటిని యేకముచేసి "తమః"అని చెప్పబడెను. అట్టి తమోనాశకము, తదంతర్గతమగు నేజడమునకు సంభవింపనందున నేనే నశింపజేయుచుంటి నని చెప్పబడెను. జడబుద్ధిప్రవృత్తివలె కేవలచైతన్యము అజ్ఞానాదినాశకము కానేర దని శంకింపజనదు. కేవలచైతన్య మజ్ఞానాదికనాశకము కాకున్నను అంతఃకరణాశయస్థమై యజ్ఞానాదినాశకమగు నని యాశయము చేతనే "ఆత్మభావస్థః"అని చెప్పెను. అనగా తత్త్వమస్యాదివాక్యోత్థబుద్ధివృత్త్యభివ్యక్తచిదాత్మసహాయసామర్థ్యమువలన నజ్ఞానాదినివర్తకమగు నని యాశయము.

ఇంతవరకు బుద్ధిద్ధబోధకజ్ఞానాదినివర్తకత్వమును చెప్పి, బోధేద్ధబుద్ధి కజ్ఞానాదినివర్తకత్వమను పక్షాంతరమును "జ్ఞానదీపేన భాస్వతా"అనుదానిచే చెప్పుచుండెను దేహాద్యవ్యక్తాన్తాఽనాత్మవర్గాతిరిక్తవస్తుగోచరమైనట్టిన్ని, భగవంతునియందు యెల్లప్పుడు విహితమైన భక్తిచే పరమేశ్వరునియొక్క యనుగ్రహము ప్రాప్తించును. అట్టి యనుగ్రహ మనెడి స్నేహము (తైలము)చే తడుపబడినట్టియు, భగవద్విషయకమైన భావనయందభినివేశ మనెడి (వాయువుచే ప్రేరితమైనట్టియు, వాయుప్రేరణములేనిదే. మొట్టమొదటదీపముయొక్క యుత్పత్తియే సంభవింపనందున జ్ఞానదీపోత్పత్తికి కారణము భగవద్భావనాభినివేశ వాయుప్రేరితమని చెప్పబడెను.) బ్రహ్మచర్యము, అష్టాంగయోగము, శమము మొదలగు సాధనములచే నాహితమైన సంస్కారము కల ప్రజ్ఞ యనెడి వర్తి(వత్తి)కలిగినట్టియు, విరక్తాంతఃకరణమనెడి ప్రమిదకలిగినట్టియు, విషయవ్యావృత్తము, రాగద్వేషములచే నకలుషితము అగు చిత్తమనెడి నివాతాపవరకము(గది)నందుండిన నిత్యప్రవృత్తైకాగ్ర్యధ్యానజనితసమ్యగ్దర్శనమనెడి కాంతికల జ్ఞానదీపముచే నంతఃకరణాశయమందుండినవాడనై, మోహాంధకారతమస్సును నశింపజేయుదును. ॥౧౧॥

అట్టి జ్ఞానమనెడి దీపముచే "అజ్ఞానజం" అనాద్యవిద్యారూపమగు అజ్ఞానమువలన జనించెడి "తమః నాశయామి" ఉదయాచలారూఢుడైన సూర్యుడు తన ప్రభచే ఘటాద్యావరకమగు తమస్సును నశింపజేయునట్లు ఆవరణాత్మకమగు తమస్సును నశింపజేయుదును. (నన్నే నిరంతము ధ్యానించెడి సత్పురుషులయొక్క ధీవృత్తిఫలకారూఢుడనై, నేను సత్ప్రకాశవ్యాప్తధీవృత్తివిశేషముచే నాస్వరూపము నావరించిన యవిద్యాధ్వాంతమును నిశ్శేషముగ నశింపజేసి, అవిద్యా, తత్కార్య, తద్ధర్మ, తల్లక్షణ, తదవస్థా, తదాభాసముల సంబంధలేశముకూడ లేనట్టియు, నాకాశమువలె నిత్యము, నిరంతరము, వికల్పశూన్యము, వికారరహితము, నిరంజనము, నిష్క్రియము, నిత్యశుద్ధ, బుద్ధ, ముక్తస్వభావము, అనాద్యనంతాఖండైకరసము, పరిపూర్ణము నగు ఆస్వాత్మతత్త్వమును ఇదియే నేను అని పరబ్రహ్మనగు నాయందే ఆత్మతత్త్వప్రత్యయము విస్పష్టమగునట్లు ప్రకాశింపచేసెద నని యర్థము. (ఈచెప్పుటచే "యమేవైష వృణుతే తేన లభ్యః

అర్జున ఉవాచ:—

గీ॥ పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।

పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్ ॥ ॥౧౨॥

పదవిభాగము:— అర్జునః- ఉవాచ- పరం- బ్రహ్మ- పరం- ధామ- పవిత్రం- పరమం- భవాన్- పురుషం- శాశ్వతం- దివ్యం- ఆదిదేవం- అజం- విభుమ్ ॥ ॥౧౨॥

ప్రతిపదార్థము:— అర్జునః=అర్జునుడు; ఉవాచ=పలికెను; భవాన్=నీవు; పరం=కూటస్థుడవు; బ్రహ్మ=పరబ్రహ్మవు. ధామ=ఉత్కృష్టతేజోరూపుడవు; పరమం=ఉత్కృష్టమైన; పవిత్రం=పావనుడవు; శాశ్వతం=నిత్యమైన; పురుషం=పురుషుడవు; దివ్యం=ద్యులోకమందుండిన; ఆదిదేవం=ఆదిదేవుడవు; (అనగా సర్వదేవతలకుముందేయుండినవాడవు) అజం=ఉత్పత్తిలేనివాడవు; విభుం=సర్వవ్యాపకుడవు. ॥౧౨॥

శాంకరభాష్యమ్:—

యథోక్తాం భగవతో విభూతిం యోగం చ శ్రుత్వా— పరం బ్రహ్మ పరమాత్మా పరం ధామ పరం తేజః పవిత్రం పావనం పరమం ప్రకృష్టం భవా న్పురుషం శాశ్వతం నిత్యం దివ్యం దివి భవ మాదిదేవం సర్వదేవానా మాదౌ భవం దేవ మజం విభుం విభవనశీలమ్ ॥౧౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నిరస్తాశేషవిశేషములుకల నిరుపాధికము, సోపాధికము, సర్వాత్మత్వాదిస్వరూపము నగు బ్రహ్మముయొక్క రూపమును, తద్విజ్ఞానఫలమును విని నిరుపాధికము ప్రాకృత (అజ్ఞానుల)బుద్ధిగోచరము కాదని చెప్పుచు మందానుగ్రహార్థము యెల్లపుడు సర్వబుద్ధిగ్రాహ్యమైన సోపాధికరూపమును విస్తారముగ వినుట కిచ్ఛగలవాడై అర్జునుడు ప్రశ్నించుచుండెను.

పరబ్రహ్మము నీవు అని లక్ష్యనిర్దేశము. పరబ్రహ్మమునకు "పరం ధామ" అనునది మొదలుకొని మూడు విశేషణములు లక్షణము. (ధామశబ్దము స్థానవాచకముకాదని ద్యోతన చేయుటకు భాష్యమునందు "ధామ పరం తేజః"అని వివరించబడెను.) శుద్ధచైతన్యము

తస్యైష ఆత్మావివృణుతే తనుం స్వామ్" అను శ్రుత్యుక్తరీతిని తీవ్రమోక్షేచ్ఛచేతను, తీవ్రవైరాగ్యముచేతను నిదిధ్యాససమాధులయందు పరిశ్రాంతు డగు యతికే ఈశ్వరానుగ్రహము లభ్యమగును. ఈశ్వరానుగ్రహముచేతనే సమ్యగ్దర్శనము, దానివలననే యవిద్యాధ్వాంతము నిశ్శేషముగ నివర్తించును. అట్టి దానిచే విదేహకైవల్యసుఖము సిద్ధించునని సూచింపబడెను.) ॥౧౧॥

—• ౧౦వ అధ్యాయము ౧౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పైవిధముగ భగవంతుని విభూతిని, యోగమును విని, పరమోత్కంఠితుడై యర్జునుడు చెప్పుచున్నాడు:— "పరం బ్రహ్మ...భవాన్" నీవు పరబ్రహ్మవు. పరమాశ్రయుడవు; లేక, పరమప్రకాశస్వరూపుడవు, పరమపవిత్రుడవు. తత్త్వజ్ఞాననిష్ఠులగు భృగువసిష్ఠాదిసర్వర్షులును, అట్లే దేవర్షియగు నారదుడును, అసితుడును, ధౌమ్యజ్యేష్ఠభ్రాతయగు దేవలుడును, వ్యాసమహర్షియు వీరందరును నిన్ను పరమాత్మస్వరూపునిగను, యెల్లపుడు నొకేవిధముగ నుండువానిగను, పరమవ్యోమరూపముగా స్వస్వరూపమునందుండువానిగను, సర్వప్రపంచాతీతునిగను, సర్వకారణునిగను, ద్యోతనాత్మకునిగను, స్వప్ర

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జన్మాదిరహితమగుటచే కూటస్థము. అత్యంతము శుద్ధము. కూటస్థత్వ, తేజస్స్వరూపత్వ పరమపవిత్రత్వలక్షణలక్షితమైన పరబ్రహ్మవు నీవే. యితరుడు కాడని యర్థము. నేనిట్టి వాడనని నీవెట్లు తెలిసికొంటివనెదవా? ఆప్తవాక్యమువలన తెలిసికొంటినని యీశ్లోకము యొక్క యుత్తరార్ధముచే చెప్పుచుండెను. నిన్ను "దివ్యం" పరవ్యోమయందుండినవానినిగను, అనగా సర్వప్రపంచాతీతునిగను.) "ఆదిదేవం" "దేవః"అనగా ప్రకాశించువాడు అని యర్థము. బ్రహ్మ మన్ననో సర్వకారణ మగుటవలన ఆదిదేవుడు. అట్టి యాదిదేవునిగను, కనుకనే యజునిగను, సర్వగతునిగను, పురుషునిగను ఆప్తులు చెప్పుచుండిరి. ॥౧౨॥

కాశరూపునిగను, ఆదిదేవునిగను, కనుకనే జన్మరహితునిగను సర్వగతునిగను జెప్పుచున్నారు. పిరంగరిమాట యుటుంచుము. సాక్షాత్తు నీవే నాకై చెప్పుచుంటివి. ॥౧౨॥

శంకరానందీయము:— పైవిధముగ మందప్రజ్ఞుడగు ముముక్షువునకు తననుపాసించుటకు సామాన్యరూపముగ విభూతియోగము ప్రతిపాదించి, తన యుపాసనముచే విశుద్ధాన్తఃకరణుడును, విజ్ఞాతాత్మతత్త్వుడును అగు యతికి నిర్విశేషోపాసనమును, దాని ఫలమును శ్రీకృష్ణభగవానులు లెస్సగ ప్రతిపాదించెను. దానిని యర్జునుడు విని, మూఢులు నిర్విశేషస్వరూపము నుపాసింపలేరని స్వయముగ నిశ్చయించి, వారి ననుగ్రహించు యిచ్ఛతో మూఢబుద్ధికి అనురూపముగ సోపాధికబ్రహ్మము యొక్క స్వరూపమును ప్రశ్నింపదలచి యర్జునుడు పరమేశ్వరుని రెండు శ్లోకములచే స్తుతించుచుండెను.— "పరం" సవిశేషబ్రహ్మము విలక్షణమైనదియు, అప్రాకృతము, అతిసూక్ష్మము, అతీంద్రియము, ఉత్పత్తివినాశశూన్యము, వృద్ధిక్షయరహితము. అనాద్యంతము, అప్రమేయము, నగు "ధామ" కేవలకూటస్థాసంగచిద్రూపము. సకృత్స్మరణమాత్రముచేతనే శతకోటికల్పార్జితపాపపటలవిధ్వంసకమగుటవలన "పరమం" ఉత్కృష్టమైనది. వాయ్వగ్న్యాదులనుగూడ పవిత్రంప జేయునదిగాన "పవిత్రం" పరమపవిత్రమైనది. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ", "పవిత్రాణాం పవిత్రం యో మంగలానాం చ మంగలమ్" ఇత్యాదిశ్రుతిస్మృతిప్రసిద్ధమైన "పరం బ్రహ్మ" పరబ్రహ్మస్వరూపము "భవాన్" నీవే కాని మరియొకడు గాడు. నీవే పరబ్రహ్మరూపమని నిశ్చయించుచుంటిని. ఈవిషయమును నీవెట్లు తెలిసికొంటివి? అను భగవత్ప్రశ్నముపై నేనాప్తవాక్యముచే తెలిసికొంటిని. అని సూచించుటకై చెప్పుచున్నాడు. "పురుషం...బ్రవీషి మే" దేవర్షియగు నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు యీమొదలగు సర్వఋషులు నిన్ను "శాశ్వతం" నిత్యునిగను, "దివ్యం" స్వీయమహిమయునం దున్నవానిగను, లేక, దివ్యవ్యాకృతాకాశమునందు, బుద్ధిగుహయం దుండువానిగను "ఆదిదేవం" ఆదికారణునిగను, ద్యోతనశీలునిగను, "అజం" జన్మాదికారణవర్జితునిగను, "విభుం" సర్వవ్యాపకునిగను, పరిపూర్ణపురుషునిగను "ఆహుః" చెప్పుచున్నారు. (ఈచెప్పుటచే బ్రహ్మతత్త్వము అనేకుల నుండి వినదగునని, తెలిసికొనదగునని సూచితమయ్యెను.) మరియు నీవుకూడ "భోక్తారం యజ్ఞతపసాం" అనియు "సర్వభూతస్థితం యో మాం" అనియు, నిన్నుగూర్చి నాకొరకు చెప్పుచుంటివి. కాన నీవే పరబ్రహ్మస్వరూపుడవని యర్థము. ॥౧౨॥

గీ॥ ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా ।
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే ॥ ॥౧౩॥

పదవిభాగము:— ఆహుః- త్వాం- ఋషయః- సర్వే- దేవర్షిః- నారదః- తథా- అసితః- దేవలః- వ్యాసః- స్వయం- చ- ఏవ- బ్రవీషి- మే ॥ ॥౧౩॥

ప్రతిపదార్థము:— త్వాం=నిన్ను; ఈదృశం=(ఈపద మధ్యాహార్యము) పూర్వమునందు చెప్ప బడినలక్షణములుకలవానినిగ; సర్వేఋషయః=వశిష్ఠాదిఋషులు; దేవఋషిర్నారదః=దేవర్షియగు నారదుడు; తథా=అట్లే; అసితః=అసితఋషి; దేవలః=దేవలఋషి; వ్యాసః=వ్యాసమహర్షి; ఆహుః=చెప్పుచుండిరి; స్వయం=స్వయముగ; త్వమపి=నీవుకూడ; మే=నాకొరకు; బ్రవీషి=చెప్పుచుంటివి. ॥౧౩॥

గీ॥ సర్వ మేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ ।
న హి తే భగవ న్వ్యక్తిం విదు ర్దేవా న దానవాః ॥ ॥౧౪॥

పదవిభాగము:— సర్వం- ఏతత్- ఋతం- మన్యే- యత్- మాం- వదసి- కేశవ- న- హి- తే- తే- భగవన్- వ్యక్తిం- విదుః- దేవాః- న- దానవాః ॥ ॥౧౪॥

ప్రతిపదార్థము:— హే కేశవ!=ఓ శ్రీకృష్ణ; త్వం=(ఈపదమధ్యాహార్యము) నీవు; మాం= నన్నుగూర్చి; యత్=దేనిని; వదసి=చెప్పుచుంటివో; ఏతత్=ఈ; సర్వం=నీచేతను, ఋషులచేతను చెప్పబడిన దంతయు; ఋతం=సత్యమని; అహం=నేను; మన్యే=తలచెదను; హే భగవన్=ఓ భగవంతుడా; తే=నీయొక్క; వ్యక్తిం=ఉత్పత్తిని; దేవాః=దేవతలు: నహివిదుః=గుర్తెరుగరు; దానవాః=దానవులు; నవిదుః=గుర్తెరుగరు ॥౧౪॥

శాంకరభాష్యమ్:—

ఈదృశమ్— ఆహుః కథయంతి త్వా మృషయో వశిష్ఠాదయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథాఽసితో దేవలో ప్యేవ మేవాహ వ్యాస శ్చ, స్వయం చైవ బ్రవీషి మే ॥౧౩॥

సర్వ మితి । సర్వ మేత ద్యథోక్త మృషిభి స్త్వయా చ తదృతం సత్య మేవ మన్యే య న్మాం ప్రతి వదసి భాషసే । హే కేశవ! న హి తే తవ భగవ న్వ్యక్తిం ప్రభవం విదు ర్న దేవా న దానవాః ॥ ॥౧౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నిన్ను పూర్వమునందు చెప్పబడిన విశేషణములుకలవానినిగ వశిష్ఠాదిఋషులు, దేవఋషియగు నారదమహర్షి, అసితమహర్షి, దేవలమహర్షి, వ్యాసమహర్షియు చెప్పు చుండిరి. వీరు వారు చెప్పుట యెందులకు? స్వయముగ నీవే పూర్వమునందు చెప్పబడిన విశేషణములుకలవాడనని నాకొరకు చెప్పుచుంటివి. ॥౧౩॥

ఓ శ్రీకృష్ణ! నీవు యేవిషయమును చెప్పితివో, ఋషులు యేవిషయమును చెప్పిరో ఆవిషయ మంతయు సత్యమే. నీయుత్పత్తిని దేవతలుకాని, దానవులుకాని యెరుగరు. ॥౧౪॥

—• ౧౦ అధ్యాయము ౧౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఋషులచేతను, నీచేతను చెప్పబడిన యీవిషయ మంతయు సత్యమే యని నేను తలచెదను. నన్నుగూర్చి నీవు చెప్పినది నిజమే. సర్వజ్ఞుడ వగుటచే నీవు

గీ॥ స్వయ మేవాత్మనాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన! భూతేశ! దేవదేవ! జగత్పతే ॥ ॥౧౫॥

పదవిభాగము:— స్వయం- ఏవ!- ఆత్మనా- ఆత్మానం- వేత్థ- త్వం- పురుషోత్తమ- భూతభావన- భూతేశ- దేవదేవ- జగత్పతే ॥ ॥౧౫॥

ప్రతిపదార్థము:— హేపురుషోత్తమ!=(పురుషశ్చాసావుత్తమశ్చేతివిగ్రహః) ఓయుత్తమపురుషుడా; (క్షరాక్షరాతీతపూర్ణచైతన్యరూపుడా!) భూతభావన!=భూతములనుభావనచేయువాడా!; భూతేశ=భూతములకుప్రభునా!; దేవదేవ=దేవతలకుదేవుడా!; జగత్పతే=జగత్తునకుప్రభువా!; త్వం=నీవు; స్వయమేవ=స్వయముగనే; ఆత్మనా=ప్రత్యగ్రూపముచేత; ఆత్మానం=నిరుపాధికరూపమును; వేత్థ=తెలిసికొనుచున్నావు. ॥౧౫॥

శాంకరభాష్యమ్:—

యత స్త్వం దేవాదీనా మాది రతః— స్వయ మేవాఽఽత్మనాఽఽత్మానం వేత్థ త్వం నిరతిశయజ్ఞానైశ్వర్యబలాదిశక్తిమంత మీశ్వరం పురుషోత్తమ! । భూతాని భావయతీతి భూతభావనో హేభూతభావన! భూతేశ! భూతానా మీశితః! హేదేవదేవ! జగత్పతే! ॥౧౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

క్షరాక్షరాతీతపూర్ణచైతన్యస్వరూపుడా! భూతములను భావనచేయువాడా! "భూతభావన" అనిచెప్పుటచే సర్వప్రకృతిత్వము, సర్వకర్తృత్వము చెప్పబడెను. భూతములకు ప్రభువా! ("భూతేశ" అనుసంబుద్ధిచే సర్వేశ్వరత్వము చెప్పబడెను.) దేవదేవుడా! "దేవదేవ"

సర్వము నెఱుగుదువు. ఇట "కశ్చ ఈశ శ్చ- కేశౌ, తౌ వాత్యవగచ్ఛతీతి కేశవః" సర్వేశ్వరులగు. బ్రహ్మరుద్రులను గూడ తెలిసికొనువాడు కాన కేశవు డనబడును. ఈవ్యుత్పత్తిచే "కేశవ" అను సంబోధనచే సర్వజ్ఞత్వము సూచింపబడెను.) కాన "న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః" అని నీవు చెప్పినరీతిని దేవదానవులుగూడ నీమాహాత్మ్యమును నెఱుంగజాలరు. ॥౧౪॥

శంకరానందీయము:— నేను శతవిధముల చెప్పితిని. ఋషులుగూడ సహస్రవిధముల చెప్పిరి. అట్లైనను నీకు దీనివిషయమై ప్రామాణ్యనిశ్చయ మెట్లు కల్గెను. అను శ్రీకృష్ణప్రశ్నము నాశంకించుకొని దానికి సమాధానము నీశ్లోకమున జెప్పుచున్నాడు— ఓశ్రీకృష్ణా! "బహూని మే వ్యతీతాని" అనియు, "మత్తః పరతరం నాన్యత్" అనియు, "నమే విదుః స్సురగణాః" అనియు, "మహర్షయః సప్త పూర్వే" అనియు నన్ను గూర్చి చెప్పిన విషయము సత్యమే యని నేను తలచెదను. (నీవు పరమాప్తుడవుకనుకను, పరమేశ్వరుడవుకనుకను, వేదకారణుడవుకనుకను నీవాక్యము యథార్థమని నేను నమ్మెద నని యర్థము.) ఇంద్రాదిదేవతలు మధ్వాదిదైత్యులు నీయొక్క యభివ్యక్తిని తెలిసికొనలేకుండిరి. అంతకంటె నర్వాచీనులగు మనుజులు తెలిసికొనలేరని వేరె చెప్పవలెనా? ॥౧౪॥

—• ౧౦వ అధ్యాయము ౧౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నీవు అందరికిని ఆదిభూతుడవు, అందరికిని తెలియబడనివాడవు. కాన యన్యుల యుపదేశమును విడచియే స్వయముగనే నీవే స్వరూపముచేతనే నిరుపా[illegible]

శాంకరభాష్యతత్త్వబోధిని:—
అనుసంబుద్ధిచే సర్వప్రకృతిత్వము చెప్పబడెను.) ఓజగత్పతే! ("జగత్పతే"అనుసంబుద్ధిచే సర్వమునకు స్వామి యగుటచే పాలయితృత్వము చెప్పబడెను.) నీవు ఉపదేశము లేకుండగ స్వయముగనే నిరుపాధికాత్మస్వరూపమును అనగా నిరతిశయజ్ఞానైశ్వర్యబలాదిశక్తిమత్తయిన రూపమును దేవాదులకుకూడ కారణమగుటవలన తెలిసికొనుచున్నావు. ॥౧౫॥

కము, సోపాధికము నగుతత్త్వమును (నిరుపాధికమును ప్రత్యగ్రూపమగుటచే నవిషయముగను, సోపాధికమును నిరతిశయజ్ఞానైశ్వర్యాదిశక్తిమత్తుగను) తెలిసికొనుచుంటివి. "ఇతరు లెవరును, తెలిసికొనలేనట్టి విషయమును నేనుమాత్ర మెట్లు తెలిసికొనుచుంటిని" అను శ్రీకృష్ణప్రశ్న నాశంకించుకొని చెప్పుచు ప్రేమాత్సుక్యముచే ననేకవిధములుగ సంబోధించుచుండెను. "పురుషోత్తమ"లోకములో నందరును నిన్ను బట్టిజూడ యపకృష్టులే కానవారియందరికంటె నీవుత్తముడవు. కాన వారందరికి యశక్యమగు దానిని నీవు జేయగలవని సంబోధనాభిప్రాయము. అట్టి పురుషోత్తమత్వమునే నాలుగు సంబోధనములచే వివరించుచుండెను.

'భూతభావన' భూతముల నన్నిటిని ('భావయతి ఉత్పాదయతి) పుట్టించుదువుగాన నీవు జగత్కర్తవు. "భూతేశ!" సర్వభూతములకు నియంతవు. నియంతగూడ నొకానొకప్పు డారాధ్యుడు కాకుండును. కానచెప్పుచున్నాడు—దేవదేవ!" సర్వారాధ్యులగు దేవతలకుగూడ నారాధ్యుడవు. ఆరాధ్యుడుగూడ నొకానొకడు పరిపాలకుడుగా సమ్మతుడుగాకుండును అను నాశంకపై జెప్పుచున్నాడు—"జగత్పతే" హితాహితోపదేశకవేదప్రణేతవుగావున సర్వజగత్తునకు పరిపాలకుడవు. (ఇట యీవిశేషణములనన్నిటిని సంబుద్ధ్యంతములుగ భావింపదగును.) (ఈచెప్పిన విశేషణములు కల నీవు అందరకును తండ్రివి, గురుడవు, పరిపాలకుడవు సర్వారాధ్యుడవు.గాన పురుషోత్తముడవని నిన్ను వేరే చెప్పవలెనా? యని భావము) ॥౧౫॥

శంకరానందీయము;— నీవు దేవర్ష్యాదులకు కారణుడవుగావున స్వయముగనే నీవు తెలిసికొనుచుంటివని యీశ్లోకమున జెప్పుచున్నాడు.— "భూతభావన" అకాశాదిస్తంబపర్యంతములగు భూతములను తననుండి సృష్టించువాడుగాన "భూతభావను డనబడును." భూతేశ" సమస్తభూతములను స్వయముగ నంతర్యామిరూపమున ప్రవర్తింపజేయువాడుగాన "భూతేశు", డనబడును. అగ్న్యాదులు వాగాదింద్రియముల నధిష్ఠించి జగత్తును ప్రవర్తింపజేయుచుండిరిగదా? అను ప్రశ్నకు సమాధానముగ జెప్పుచున్నాడు.— "దేవదేవ" "య ఆదిత్యేతిష్ఠన్" అను శ్రుతి చొప్పున జగత్ప్రవర్తకులగు అగ్న్యాదులనుగూడ చేష్టింపజేయువాడుగాన దేవదేవు డనబడును. (లేక అగ్న్యాదులకుగూడ పూజ్యుడని యర్థము.) "జగత్పతే" తనచే సృష్టమైన సర్వజగత్తును అన్నోదకాదుల నిచ్చి, నియన్తయై రక్షించువాడుగాన "జగత్పతి" యనబడును. "పురుషోత్తమ" "పూర్ణత్వా త్పురుషః, సర్వమహత్త్వా దుత్తమః పురుషశ్చాసా వుత్తమశ్చ పురుషోత్తమః" పూర్ణుడు సర్వమహత్తుగాన, 'పురుషోత్తము' డనబడును. (పైవిశేషణముల నన్నిటిని సంబుద్ధ్యంతములుగ గ్రహింపదగును.) "స్వయమేవ...త్వం" అట్టినీవు స్వయముగనే స్వాత్మను యెఱుగుదువు. (లోకమున యొకానొక పురుషుడు బల, పుష్టి, జవ, ఆరోగ్య, అనారోగ్య, అవయవ. గుణ, వైకల్య, ధైర్యాదిరూపమగు స్వాంగ సంపత్తి నెట్లు తెలిసికొనునో యట్లే నీవుగూడ మాయాయోగవిశేషవిశేషితమైన స్వీయవైభవము నెరుగుదువుగాని పరిచ్ఛిన్నుడు కించిజ్జ్ఞుడు నెరుంగజాలడని భావము.) ॥౧౫॥

గీ॥ వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ ॥౧౬॥

పదవిభాగము:— వక్తుం- అర్హసి- అశేషేణ- దివ్యాః- హి- ఆత్మవిభూతయః- యాభిః- విభూతిభిః- లోకాన్- ఇమాన్- త్వం- వ్యాప్య- తిష్ఠసి ॥ ॥౧౬॥

ప్రతిపదార్థము:— యాభిః=ఏ; విభూతిభిః=మాహాత్మ్యవిస్తరములచే; ఇమాన్=ఈ; లోకాన్=లోకములను; త్వం=నీవు; వ్యాప్య=వ్యాపించి; తిష్ఠసి=ఉంటివో; దివ్యాః=దివ్యమైన; ఆత్మవిభూతయః=ఐశ్వర్యములు; సన్తి=కలవో; తాః=ఆవిభూతులను; త్వం=నీవు; అశేషేణ=శేషములేకుండగ; వక్తుం=చెప్పుటకు; అర్హసి=తగుదువు. ॥౧౬॥

గీ॥ కథం విద్యా మహం యోగిం స్త్వాం సదా పరిచిన్తయన్ ।
కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవ న్మయా ॥ ॥౧౭॥

పదవిభాగము:— కథం- విద్యాం- అహం- యోగిన్- త్వాం- సదా- పరిచిన్తయన్- కేషు- కేషు- చ- భావేషు- చిన్త్యః- అసి- భగవన్- మయా ॥ ॥౧౭॥

ప్రతిపదార్థము:— హేయోగిన్=ఓయోగీశ్వరుడా!; అహం=నేను; త్వాం=నిన్ను; సదా=యెల్లపుడు; పరిచింతయన్=చింతించువాడనై; కథం=ఎట్లు; విద్యాం=తెలిసికొనగలను?; హేభగవన్=షడ్గుణైశ్వర్యసంపన్నుడవగుయో శ్రీకృష్ణపరమాత్మ; మయా=నాచేత; కేషుకేషు=యేయే; భావేషు=వస్తువులయందు; త్వం=నీవు; చిన్త్యః=చింతింపదగినవాడవు; అసి=అయితివి?. ॥౧౭॥

శాంకరభాష్యమ్:—

వక్తుమితి । వక్తుం కథయితు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయ ఆత్మనో విభూతయో యా స్తా వక్తు మర్హసి । యాభి ర్విభూతిభి రాత్మనో మాహాత్మ్యవిస్తరై రిమాం లోకాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ ॥౧౬॥

కథ మితి । కథం విద్యాం విజానీయా మహం హే యోగిం స్త్వాం సదా పరిచింతయన్ । కేషు కేషు చ భావేషు వస్తుషు చింత్యోఽసి ధ్యేయోఽసి భగవ న్మయా ॥౧౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓ శ్రీకృష్ణ! ఆత్మయొక్క (నీయొక్క) ఏమాహాత్మ్యవిస్తరములచే నీలోకములను వ్యాపించియుంటివో అట్టి దివ్యములైన యాత్మమాహాత్మ్యవిస్తరములను శేషములేకుండగ నీవు చెప్పుటకుతగుదువు. ॥౧౬॥

ఓ యోగీశ్వరుడా! నేను నిన్ను యెల్లపుడు పరిచింతనచేయువాడనై యెట్లు తెలిసికొనెదను? ఓషడ్గుణైశ్వర్యసంపన్నుడా! నాచే నీవు యేయే పదార్థములయందు చింతింపదగినవాడనైతివి. (ధ్యానింపదగినవాడవైతివి) ॥౧౭॥

—• ౧౦వ అధ్యాయము ౧౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నీవిభూతులు ఇతరులకు నందరకు తెలియ శక్యముగాని

గీ॥ విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన !
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥౧౮॥

పదవిభాగము:— విస్తరేణ- ఆత్మనః- యోగం- విభూతిం- చ- జనార్దన- భూయః- కథయ- తృప్తిః- హి- శృణ్వతః- న- అస్తి- మే- అమృతమ్ ॥ ॥౧౮॥

ప్రతిపదార్థము:— హేజనార్దన!=ఓశ్రీకృష్ణపరమాత్మ; ఆత్మనః=ఆత్మస్వరూపముయొక్క; యోగం=యోగైశ్వర్యశక్తిని;విభూతించ=ఆత్మమాహాత్మ్యవిస్తరమును; భూయః=తిరిగి;విస్తరేణవిస్తరముగ;కథయ చెప్పుము; అమృతం=త్వన్ముఖాంభోజవినిస్సృతవాక్యామృతమును; శృణ్వతః=వినుచున్న, మే=నాకు; తృప్తిః= తృప్తి; హి=ఏకారణమువలన; నాస్తి=లేదో, ఆకారణమువలన తిరిగి చెప్పుమని పూర్వవాక్యముతో సంబంధము. ॥౧౮॥

వియు, అవశ్యకముగ తెలిసికొనదగినవియు నయియున్నవి. కాన: "వ్యాప్య...సి" ఏవిభూతులచే నీసర్వ లోకములను వ్యాపించి నీవుంటివో యట్టి నీదివ్యవిభూతులను నీవే చెప్పదగుదువు. ॥౧౬॥

శంకరానందీయము:— నీవొక్కడవే నీమహిమమును తెలిసికొనుటకు సమర్థుడవుగాన నీతత్త్వమును నీవే యుపదేశింపుము. అని యీశ్లోకమున జెప్పుచున్నాడు— ఏనీవిభూతులచేనీస్వర్గమర్త్యపాతాలములను వ్యాపించియుంటివో యట్టి "దివ్యాః" తేజో, బల, పౌరుష, శక్తి, ప్రకాశాదిగుణములచే. నసాధారణ్యకృతమైన నీసంబంధమగు విభూతులను నిశ్శేషము నాకై చెప్పదగుదువు. ॥౧౬॥

—• ౧౦వ అధ్యాయము ౧౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఆవిభూతికథనమునకు ప్రయోజనమును రెండు శ్లోకములచే జెప్పుచుండెను— "యోగిన్" నిరతిశయైశ్వర్యగుణశాలివియగు నోకృష్ణా! అతిస్థూలమగు బుద్ధికల నేను దేవాదులకుగూడ తెలియశక్యముగాని నిన్ను యెల్లపుడు ధ్యానించువాడనైనను యెట్లు తెలిసికొనగలుగుదును? నావిభూతులయందు నన్ను ధ్యానించువాడనై నన్ను తెలిసికొనగలుగుదువందువా? అట్లైన "కేషు...మయా" చేతనాచేతనాత్మకమగు నేయేవిభూతులయందు నీవు చింతింపదగినవాడవు. ॥౧౭॥

శంకరానందీయము:— "యోగిన్" మాయాయోగ (సంబంధ) ముచే గలుగు నైశ్వర్యము యోగమనబడును. అట్టి యైశ్వర్యముకల ఓశ్రీకృష్ణప్రభూ! నిన్ను సవిశేషునిగ నెల్లపుడు ధ్యానించుచు, స్తుతించుచు, నమస్కరించుచు నేను శుద్ధాత్ముడనై, అవాఙ్మానసగోచరుడవు, విశేషరహితుడవు, పరబ్రహ్మస్వరూపుడవునగు నిన్ను యెట్లు తెలిసికొనగలుగుదును? అట్టిమహత్త్వవిశిష్టమైన నీయొక్క విభూతిశేషమును నాకై చెప్పదగుదువని పూర్వముతో నన్వయము,) జడాజడభేదముచేతను, దేవదానవమర్త్యాదిభేదముచేతను ననేకవిధములగు భేదములు కలపదార్థములలో నేయే పదార్థములయందు నీవు నాచేచింతింపదగినవాడవు. (సర్వం విష్ణుమయం జగత్" అను న్యాయముచే నీస్వరూపమగు జగత్తునం, దెక్కడెక్కడ నీవిశేషస్ఫూర్తియగునో, యెక్కడెక్కడ నీధ్యానము జేయవలయునో చెప్పదగుదువని యర్థము. ॥౧౭॥

—• ౧౦వ అధ్యాయము ౧౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— కనుక "విస్తరేణ" నీయొక్క సర్వశక్తిత్వాదిరూపమగు యోగమును, ఐశ్వర్యాతిశయరూపవిభూతిని ధ్యానాలంబనముగ, సవిస్తరముగ తిరిగి చెప్పుము. "సర్వైః జనైః" సర్వజనులచే నభ్యుదయనిశ్శ్రేయసప్రయోజనమునకై కోరబడువాడు "జనార్దను" డనబడును. ఓజనార్దనా!

శాంకరభాష్యం:—

విస్తరే ణేతి। విస్తరే ణాత్మనో యోగం యోగైశ్వర్యశక్తివిశేషం విభూతిం చ విస్తరం ధ్యేయపదార్థానాం హే జనార్దన!, అర్దతే ర్గతికర్మణో రూపమ్। అసురాణాం దేవప్రతిపక్షభూతానాం జనానాం నరకాదిగమయితృత్వా జ్జనార్దనః। అభ్యుదయనిశ్శ్రేయసపురుషార్థ ప్రయోజనం సర్వై ర్జనై ర్యాచ్యత ఇతి వా। భూయః పూర్వ ముక్త మపి కథయ తృప్తిర్హి పరితోషో యస్మా న్నాస్తి మే శృణ్వత స్త్వన్ముఖనిస్సృతవాక్యామృతమ్ ॥౧౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దేవప్రతిపక్షభూతులైన యసురులను నరకాదులను పొందించువాడు జనార్దను డనబడును. లేక, అభ్యుదయనిశ్శ్రేయసప్రయోజనము సర్వులచే యాచింపబడును. అట్టి శ్రీకృష్ణపరమాత్మ! త్వన్ముఖాంభోజవినిస్సృతవాక్యామృతమును వినుచున్న నాకు పరితోషము (తృప్తి) లేదు. కాన ఆత్మయొక్క యోగైశ్వర్యశక్తివిశేషమును ఆత్మమాహాత్మ్యవిస్తార మును విస్తారముగ తిరిగి చెప్పుము. ॥౧౮॥

కాన నాయొక్క యాచనముగూడ నీయం దుచితమైనదే. చెప్పినవిషయమునే తిరిగి చెప్పుమని కోరుచుంటివేమి? అనెదవా? ('ఇక చాలును' అను అలంపత్యయానుచేనగుయిచ్ఛానివృత్తి తృప్తి యనబడును.) అట్టి తృప్తి వినుచున్న (శ్రోత్రములతో నమృతమునువలె మాటిమాటికి పానము చేయుచున్న) నాకు కలుగుట లేదు. (ఇట 'త్వద్వాక్యం' అను పదమును ప్రయోగింపమిచే నపహ్నుతి, అతిశయోక్తి రూపకాలంకారములకు సాంకర్యమేర్పడు చున్నది. ఆసాంకర్యముచే, మాధుర్యాతిశయానుభవముచేసైన యౌత్కంఠ్యము వ్యంజిత మగుచున్నది. ॥౧౮॥

శంకరానందీయము:— ప్రశ్నితప్రశ్నము నుపసంహరించుచున్నాడు— "జాయత ఇతి జనః దృశ్య వర్గః, తం అంత ర్బహిశ్చ సర్వతో౽ర్దతి వ్యాప్నోతీతి జనార్దనః" పుట్టుకకల సర్వదృశ్యవర్గము జనమనబడును. అదృశ్యవర్గమును వెలుపల, లోపల నంతటను వ్యాపించియుండువాడు జనార్దను డనబడును. సర్వవ్యాపివగు యోకృష్ణా! "ఆత్మనః" పరమాత్మస్వరూపుడవగు నీయొక్క 'యోగం' మాయాకృతమైన యైశ్వర్యవిశేషమును, "విభూతిం" విభూతిని, "భూయః విస్తరేణ కథయ" తిరిగి నామరూపాదిభేదములతో విశేషముగ జెప్పుము.

"అక్షరం బ్రహ్మ పరమం" అనియు, "అహం క్రతు రహం యజ్ఞః" అనియు, "మహర్షయ స్సప్త పూర్వే" అనియు అష్టమ, నవమ, దశమాధ్యాయములయందు కలిపియు, వేర్వేరుగను విభూతి చెప్ప బడెను. పిష్టపేషణన్యాయముగా పునరుక్తిచే ప్రయోజనమేమి? అను శంకపై జెప్పుచున్నాడు— 'తృప్తిః... అమృతం" పరమేశ్వరుడవగు నీసంబంధమగు వాగమృతమును శ్రోత్రములచే పానముచేయుచున్న నాకు తృప్తి కలుగుట లేదు.

ఇట అభిప్రాయమిది. అష్టమాధ్యాయమునందు అధ్యాత్మాదిభేదభిన్నమైన సర్వము బ్రహ్మస్వరూపమే యని, యుపాసింపుమని చెప్పబడెను. అట సర్వాత్మయందు నామ, రూప, జాత్యాది- భేదభాసనాదోష దూషితాంతఃకరణుడగు మాధునకు భేదబుద్ధిని విడచి యభేదబుద్ధి యుద్భవింపదుగాన యుపాసన సంభవిం పదు. నవమాధ్యాయమున "అహం క్రతుః" నిత్యాదికముచే సార్వాత్మ్యమే ప్రతిపాదింపబడెను. అక్క

శ్రీభగవానువాచ:—

గీ॥ హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నాస్త్యన్తో విస్తరస్య మే ॥ ॥౧౯॥

పదవిభాగము:— హన్త- తే- కథయిష్యామి- దివ్యాః- హి- ఆత్మవిభూతయః- ప్రాధాన్యతః- కురుశ్రేష్ఠ- న- అస్తి- అన్తః- విస్తరస్య- మే ॥ ॥౧౯॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ=పలికెను; హేకురుశ్రేష్ఠ!=ఓయర్జున!; మే=నాసంబంధమైన; విభూతీనాం=(ఈపదమధ్యాహార్యము) విభూతులయొక్క; విస్తరస్య=విస్తారమునకు; అంతః=అంతము; నాస్తి=లేదు; అతః=(ఈపదమధ్యాహార్యము)ఈ కారణమువలన; హన్త=ఇపుడు; తే=నీకొరకు; దివ్యాః=దివ్యమైన; ఆత్మవిభూతయోహి=ఆత్మ=పరమాత్మస్వరూపమైననాయొక్క; విభూతయోహి=విభూతులైతే; సన్తి=(ఈపదమధ్యాహార్యము)కలవో; తాః=(ఈపదమధ్యాహార్యము)ఆవిభూతులను; ప్రాధాన్యతః=ప్రాధాన్యముచే; (అనగాప్రధానవిభూతులను) తే=నీకొరకు; కథయిష్యామి=చెప్పగలను. ॥౧౯॥

---

డను విశేషాలంబనము లేదుగాన మనస్సునకు ప్రవేశము సంభవింపదు. ఇక దశమాధ్యాయమునందును సామాన్యాకారముగ జెప్పబడెను. అక్కడను మనస్సునకు విశేషాలంబనము కనబడకుండెను. కాన మూఢబుద్ధికి పరమేశ్వరోపాసనమునందు స్థైర్యసిద్ధికై విభూతివిశేషము విస్తరముగ జెప్పవలసియున్నది. దానిని జెప్పుమని యర్జునుడు కోరుట యుపపన్నము. ॥౧౭॥

భాష్యోత్కర్షదీపిక:— సప్తమాధ్యాయమునను, నవమాధ్యాయమునను విభూతియు, ఐశ్వర్యము జూపబడినవికదా! తిరిగి వాటిని తెలుపమనెదవేమి? అను ఆశంకపై జెప్పుచున్నాడు— నీయొక్క యోగైశ్వర్యశక్తివిశేషమును, విభూతిని పూర్వోక్తమైనను విస్తరముగ తిరిగి చెప్పుము. "హేజనార్దన!" దేవతలకు శత్రువులగు జనులను (అసురులను) నశింపజేయుటవలనను, అట్లే అంతశ్శత్రుజనులగు రాగద్వేషాదులను నశింపజేయుటకై ధ్యేయమగు యోగ, విభూతులను జెప్పుట నీ (జనార్దన) నామమునకు తగియున్నదని యాశయము.

లేక, అభ్యుదయనిశ్శ్రేయసపురుషార్థప్రయోజనమునకై జనులచే కోరబడెడువాడు గాన "జనార్దను" డనబడును. కాన 'జనార్దన, అను సంబుద్ధిచే నందరు నిన్ను యాచించినట్లే నేనుగూడ నిన్ను యాచించుటతగునని సూచింపబడెను. నీదగు వాక్యామృతమును వినుచున్న నాకు తృప్తి కలుగుటలేదు. భగవద్వాక్యము నీరసమగుటచే దృప్తి కలుగుటలేదను యభిప్రాయమును దొలగించుటకు "అమృతం" అని విన్యసింపబడెను. అర్జునుడు రసజ్ఞుడు కాకపోవుటచే దృప్తి గలుగుటలేదను యభిప్రాయమును దొలగించుటకు 'రసజ్ఞుడనగునాకు' అను యర్థమును సూచించు "మే" అను పదము ప్రయుక్తమయ్యెను. అమృతపానముచే కడుపు నిండినచో నలంబుద్ధి కలుగును. అట్టిది కాదని చెప్పుటకు 'శృణ్వతః' అని చెప్పబడెను. నీవాక్య మమృతతుల్యమైనను నేను రసజ్ఞుడనైనను, ఆకాశాత్మకమగు శ్రోత్రమునకు గుణమగు శబ్దముచే పూరణము సంభవింపదుగాన తృప్తి కలుగుటలేదని యాశయము. ॥౧౮॥

శాంకరభాష్యమ్:—

హంత త ఇతి । హంతేదానీం తే దివ్యా దివి భవా ఆత్మవిభూతయ ఆత్మనో మమ విభూతయో యా స్తాః కథయిష్యామీ త్యేత ప్రాధాన్యతో యత్ర యత్ర ప్రధానా యా యా విభూతి స్తాం తాం ప్రధానాం ప్రాధాన్యతః కథయిష్యా మ్యహం కురుశ్రేష్ఠ! అశేషతస్తు వర్ష శతేనాపి న శక్యా వక్తుం యతో నాస్త్యంతో విస్తరస్య మే మమ విభూతీనా మిత్యర్థః ॥౧౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓకురుశ్రేష్ఠ! నావిభూతుల విస్తారమున కంతము లేదు. కాన నిశ్శేషముగ ననేక సంవత్సరములు చెప్పుటకైనను శక్యముకాదు. అందువలన యిపుడు నాదివ్యమైన విభూతులలో నేవేవి ప్రధానమైనవో ఆవిభూతుల నిపుడు నీకొరకు చెప్పెదను. ॥౧౯॥

—• ౧౦వ అధ్యాయము ౧౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పైవిధముగ ప్రార్థితుడై శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నాడు— "హన్త" అనునది యనుమత్యర్థకము. నీచే కోరబడినట్లు నేను నీకు చెప్పెదను. వ్యాకులత నొందకుమని యర్జుననూరడించి చెప్పుచున్నాడు— ఆత్మస్వరూపుడ నగు నా యసాధారణములు ప్రసిద్ధములు నగు విభూతులను ప్రాధాన్యముననుసరించి చెప్పెదను. కురువంశశ్రేష్ఠుడ వగు నోయర్జునా! నావిభూతులనుగూర్చి విస్తరముగ (సాకల్యముగ)చెప్పుట యశక్యము. కారణ మేమందువా? ఆవిభూతుల విస్తారము అంతములేనిది. కాన ప్రధానభూతము లగు కొన్ని విభూతులనే చెప్పెదనని యర్థము. ॥౧౯॥

శంకరానందీయము:— స్వయముగ తాను సర్వజ్ఞుడైనను అర్జునప్రశ్నవాక్యముచే మూఢబుద్ధుల ప్రజ్ఞామాంద్యముయెడ పరితపించుచున్నవాడువలె దయతో మందప్రజ్ఞుల ననుగ్రహించు తలంపుతో శ్రీకృష్ణభగవానులు పలుకుచున్నాడు— "హన్త" మూఢబుద్ధుల ప్రజ్ఞ యిట్టిదా? ఓకురువంశశ్రేష్ఠుడా! తద్బుద్ధ్యనురూపములు, అప్రాకృతములు నగు విభూతులను ప్రాధాన్యముననుసరించి (తేజ,శ్శక్తి,బల, పౌరుష,విద్యా.మహత్త్వగుణవిశేషణములచే నేవిభూతి ప్రధానమైనదో) మూఢులకు ప్రీత్యుత్సాహ, శ్రద్ధా భక్తులను కలుగజేసెడి అట్టి విభూతిని నీకై చెప్పెదను. ఉత్తమములు ననుత్తమములు నగు విభూతుల నన్నిటిని చెప్పకూడదా యను ఆశంకకు సమాధానముగ జెప్పుచున్నాడు—"నాస్త్యంతో విస్తరస్య మే" మాయ యొక్క అపరిమితమగు శక్తిచే నైన విజృంభణములు కలవియగు నావిభూలయొక్క బాహుల్యమునకు అంతము లేదు. గంగానదియందలి యిసుకరేణువులను, ఆకాశమందలి నక్షత్రముల లెక్కింపవచ్చునుగాని నావిభూతిబాహుల్యమును లెక్కించుటకు శక్యముగాదు. ॥౧౯॥

నీలకంఠీయము:- ఈశ్లోకమున శ్రీకృష్ణభగవానులుఅర్జునప్రశ్నమునకుసమాధానమును జెప్పుచున్నాడు. ఇప్పుడు లేక, అట్లే చెప్పెద నను అనుమతియందు కాని, "హంత" శబ్దము ప్రయోగింపబడెను. "దివ్యాః" పురాణాంతరములయందుగూడ శ్రేష్ఠములుగా ప్రసిద్ధము లైన యాత్మవిభూతులను చెప్పెద నని యోజింపదగును. "ప్రాధాన్యతః" యోగోపకారులుగా ప్రధానమైనవి విభూతులని యర్థము. యోగము సంక్షేపముగనే ముందు చెప్పబడును గాన తదుపయోగముగ విభూతులను చెప్పుమంటి వనిభావము. అట్లు కానిచో "యోగం విభూతిం చ కథయ" అని ప్రశ్నింపబడి, విభూతినిమాత్రమే చెప్పుచో భగవంతునకు అనవహితచిత్తత్వము ప్రసక్తమయ్యెడిని. నాయొక్క విభూతుల విస్తారమునకు అంతము లేదని యోజన చేయదగును. ॥౧౯॥

గీ॥ అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।
అహ మాదిశ్చ మధ్యంచ భూతానా మన్త ఏవ చ ॥ ॥౨౦॥

పదవిభాగము:— అహం- ఆత్మా- గుడాకేశ- సర్వభూతాశయస్థితః- అహం- ఆదిః- చ- మధ్యం- చ- భూతానాం- అన్తః- ఏవ- చ ॥ ॥౨౦॥

ప్రతిపదార్థము:— హేగుడాకేశ=జయించబడిననిద్రకల, లేక, గొప్పకేశములుకలయర్జునా!; అహం=నేను; ఆత్మా=ప్రత్యగాత్మస్వరూపుడనై; సర్వభూతాశయస్థితః=సర్వభూత=నిఖిలభూతములయొక్క; ఆశయ=అంతర్హృదయమునందు; స్థితః=ఉంటిని; అహం=నేను; భూతానాం=భూతములకు, ఆదిశ్చ=కారణము; మధ్యంచ=(స్థితిసాధనము); అంతశ్చ=నాశనము(నాశసాధనము.) ॥౨౦॥

---

శాంకరభాష్యం:—

తత్ర ప్రథమ మేవ తావ చ్ఛృణు— అహ మాత్మా ప్రత్యగాత్మా గుడాకేశ గుడాకా నిద్రా తస్యా ఈశో గుడాకేశో జితనిద్ర ఇత్యర్థః, ఘనకేశ ఇతి వా । సర్వేషాం భూతానా మాశయేఽన్తర్హృది స్థితోఽహ మాత్మా ప్రత్యగాత్మా నిత్యం ధ్యేయః । తదశక్తేన చోత్త

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అందు ముందుగనే వినుము. (విభూతిప్రదర్శనము ప్రస్తుతమైయుండ మొట్టమొదట పారమార్థికమైన పారమేశ్వరరూపమును ప్రదర్శించుటకొరకు శ్రోతయగు యర్జునుని యొక్క యభిముఖీకరణార్థము సోపాధికమగు కాల్పనికమైన పరబ్రహ్మముయొక్క అనంతరమునందు చెప్పబోవు రూపమును వినుటకొరకు చిత్తసమాధానము చేయదగినది.) "గుడాకా" అనగ నిద్ర యని యర్థము. దానికి ప్రభువు "గుడాకేశః" అని పిలువబడును. అనగా జయింపబడిన నిద్ర కలవాడని యర్థము. ఓజయించబడిననిద్రకలవాడా! లేక ఘన

---

—• ౧౦వ అధ్యాయము ౨౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నావిభూతులలో ముఖ్యముగా ధ్యానింపదగువానిని వినుము. "అహం...ఏవచ" సర్వభూతములయొక్కయు హృదయమునందు అంతర్యామిరూపముగను, ప్రత్యగాత్మ రూపముగను నున్న చైతన్యానందఘనుడనగు నేను (వాసుదేవుడు) నీచే స్మరింపదగినవాడను. ("హేగుడాకేశ!" (నిద్రను జయించినవాడా!) అను సంబుద్ధిచే నర్జునుని ధ్యానసామర్థ్యము సూచితమయ్యెను.) ఈధ్యానమునందు సామర్థ్యము లేనిచో జెప్పబోవు ధ్యానములు చేయదగును. అందు ప్రథమమున ధ్యేయమును జెప్పుచుండెను. "అహ మాదిశ్చ...ఏవచ" లోకమున చేతనములుగా వ్యవహరింపబడుచున్న యీభూతములకు నేనే ఉత్పత్తి, స్థితి, నాశ స్వరూపుడను. మరియు ఉత్పత్తి, స్థితి, నాశములకు కారణమును నేనే. (సమస్త చేతనవర్గమున కుత్పత్తి స్థితి నాశస్వరూపునిగను, ఉత్పత్తి, స్థితి, నాశకారణునిగను నన్ను ధ్యానింపదగునని యర్థము.) ॥౨౦॥

శాంకరభాష్యమ్:—

రేషు భావేషు చింత్యోఽహం చిన్తయితుం శక్యో యస్మా దహ మేవాదిర్భూతానాం కారణం మధ్యం చ స్థితి రంతః ప్రళయశ్చ ॥ ॥౨౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కేశములు కలవాడా! ఓయర్జునా! "ఆశయఃఆశేరతేఽస్మిన్విద్యాకర్మపూర్వప్రజ్ఞా ఇత్యాశయః" దేనియందు విద్యాకర్మప్రజ్ఞ లుండునో యది యాశయ మనబడును. అట్టిది హృదయము. సర్వభూతముల యంతర్హృదయమునందు యేప్రత్యగాత్మ యుండెనో యాప్రత్యగాత్మను నేనే. అట్టి పరమాత్మ నిత్యము ధ్యేయము. అట్టి పరమాత్మయొక్క ధ్యానమునం దశక్తుడు అగుచో చెప్పబోవు పదార్థములయందు ధ్యానింపదగినవాడనుగూడ నేనే. చెప్పబోవు పదార్థములయందు ధ్యానించుటకు శక్యుడను. ఎందువలననిన? నేనే భూతములకు కారణము, స్థితికారణము, లయకారణము. కాన నేనే సర్వకారణ మగుటచేతను, సర్వజ్ఞుడ నగుటచేతను, నేనే ఆదిత్యాదులయందు ధ్యేయుడను. కాని యాదిత్యాదులయందు నాకంటె వేరుగ ధ్యేయము లేదని యర్థము. ॥౨౦॥

శంకరానందీయము:— ముముక్షువులకు చిత్తశుద్ధినిమిత్తమై యుపాస్యములగు విభూతివిశేషములను చెప్పెదననగనే ముఖ్యాధికారులగువారికి నిర్విశేషపరబ్రహ్మమే యుపాస్యముగాని, సవిశేషబ్రహ్మ ముపాస్యముగాదని తెలుపుటకై ముందుగబ్రహ్మవేత్తల కుపాస్యమగు వస్తువును నిర్దేశించుచుండెను.— "గుడాకేశ" గడాక యనగ నిద్ర. దానికి ఈశుడు (వశము చేసుకొనువాడు) గుడాకేశు డనబడును. నిద్రను వశమునందుంచుకొని ధ్యానసమర్థుడవగు నోయర్జునా! బ్రహ్మాదిస్తంబపర్యంతమగు సర్వభూతములకు కూటస్థాసంగచిద్రూపుడను అగు ఆత్మను నేను (వాసుదేవుడను) బ్రహ్మవేత్తల కుపాస్యుడనని యర్థము. "అంత శ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో యం పశ్యంతి యతయః క్షీణదోషాః" అనుశ్రుతియు పైవిషయమునే బోధించుచున్నది. ఈవిధముగ ముఖ్యాధికారుల కుపాస్యమును నిరూపించి, మధ్యమాధికారుల కుపాస్యమును జెప్పుచున్నాడు—. "అహం...ఏవ చ" ఆకాశాదిభూతముల కుపాదానమగు యవ్యక్తస్వరూపుడను, అభూతములయొక్క స్థితిరూపమైన వ్యక్తస్వరూపుడను, అభూతముల ప్రలయస్వరూపుడనుగూడ నేనే. (ప్రపంచ కారణ రూపముగను, ప్రపంచరూపముగను ప్రపంచలయరూపముగను నున్న సగుణాత్మనగు నేను మధ్యమాధికారుల కుపాస్యుడనని యర్థము. ॥౨౦॥

భాష్యార్థదీపిక:— యోగమును, విభూతిని తెలుపుమని నీవడిగితివి, అందు ముందునా సంబంధమగు యోగమును జెప్పుచుంటిని వినుము. "అహ మాత్మా......సర్వభూతాశయస్థితః" వాసుదేవుడనగు నేను ప్రత్యగాత్మనై "సర్వభూతాశయస్థితః" సమస్తభూతములయొక్క యంతఃకరణమునందుంటిని. యీవిషయమును నిద్రను జయించినవారే తెలిసికొనగలరు. అని ద్యోతనచేయుటకై 'గుడాకేశ' (నిద్రను (ఏలికా!) వశముజేసుకొనినవాడా! అని యర్థము.) అను సంబోధనము ప్రయోగింపబడెను. పైయుపాసనమునం దశక్తులు నేను సర్వభూతములకు కారణుడను, సృష్టి, స్థితి, ప్రలయ కారణుడనని, యుపాసింపదగునని యర్థము. ॥౨౦॥

గీ॥ ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్ ।
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ ॥ ॥౨౧॥

పదవిభాగము:— ఆదిత్యానాం- అహం- విష్ణుః- జ్యోతిషాం- రవిః- అంశుమాన్- మరీచిః- మరుతాం- అస్మి- నక్షత్రాణాం- అహం- శశీ ॥ ॥౨౧॥

ప్రతిపదార్థము:— ఆదిత్యానాం=ద్వాదశాదిత్యులలో; అహం=నేను; విష్ణుః=విష్ణువనెడి యాదిత్యస్వరూపుడను; లేకవామనావతారస్వరూపుడను; జ్యోతిషాం=అగ్న్యాదులలో; అంశుమాన్రవిః=వేసవియందుమధ్యాహ్న సమయమున తీవ్రముగతపింపచేయురవియు; అహం=నేనే; అహం=నేను; మరుతాం=సప్తమరుత్తులలోను, మరీచిః=మరీచియనునామముకలమరుత్తును; నక్షత్రాణాం=నక్షత్రములలో; శశీ=చంద్రుడను; అహం=నేనే. ॥౨౧॥

శాంకరభాష్యమ్:—

ఏవం చ ధ్యేయోఽహం—ఆదిత్యానాం ద్వాదశానాం విష్ణుర్నామాఽఽదిత్యోఽహం జ్యోతిషాం రవిః ప్రకాశయిత్రూణా మంశుమా న్రశ్మిమా న్మరీచిర్నామా మరుతాం మరుద్దేవతాభేదానా మస్మి నక్షత్రాణా మహం శశీ చన్ద్రమాః ॥ ॥౨౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నిరుపాధికబ్రహ్మధ్యానమునం దశక్తులకు చెప్పబోవు సోపాధికముగ నేను ధ్యానింప దగినవాడను ద్వాదశాదిత్యులలో విష్ణువను యాదిత్యుడను నేనే. అగ్న్యాదితేజస్సులలో గ్రీష్మకాలమున మధ్యాహ్నసమయమున తపింపజేయు రవియు నేనే. సప్తమరుత్తులలో మరీచియనువాడను నేనే. నక్షత్రములలో చంద్రుడను నేనే. అనగా ఆదిత్యవిష్ణురవిమరీచి చంద్రులను పరబ్రహ్మముగ ధ్యానింపవలయునని యాశయము. ముందుకూడ నిట్లే తెలిసికొనవలయును. ॥౨౧॥

—•౧౦వ అధ్యాయము ౨౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు•—

మధుసూదనసరస్వతీయము:— సర్వభూతాంతరస్థాంతర్యామిరూపముగ ధ్యానింప నశక్తుడగువాడు బాహ్యములగు నీయుపాసనల జేయదగునని అధ్యాయాంతమువరకు జెప్పుచున్నాడు.— నేను "ఆదిత్యానాం...శశీ" ద్వాదశాదిత్యులలో విష్ణునామముగల ఆదిత్యుడను, లేక వామనావతారుడను, ప్రకాశించెడివారలలో సూర్యుడను. సప్తమరుత్తులలో మరీచిని. నక్షత్రముల కధిపతియగు చంద్రుడను నేను. ॥౨౧॥

శంకరానందీయము:— పూర్వోక్తవిధముగ నుత్తమమధ్యముల కుపాస్యభేదమును జెప్పి, అధముల కుపయోగించు ఉపాస్యభేదములగు స్వీయవిభూతులను జెప్పుచున్నాడు:— ద్వాదశాదిత్యులు నావిభూతులే. అయినను వారిలో విష్ణువుఅను నామముగల ఆదిత్యస్వరూపుడను నేను. (అనగా విష్ణువుఅను ఆదిత్యుని నాస్వరూపముగ నుపాసింపదగునని యర్థము.) జ్యోతిశ్చక్రమునందుండు సర్వజ్యోతిస్సులు నావిభూతులే. అయిననూ వాటిలో తేజః ప్రాబల్యముచే సూర్యుడను నేను. (ఆసూర్యుని పరమేశ్వరుడని యుపాసింపదగునని యర్థము.) మరుత్తులన్నియు నావిభూతులే! అయినను వానిలో నధిపుడగు మరీచుడు నాస్వరూపుడు. (అట్టి మరీచుని నాస్వరూపునిగా నుపాసింపదగునని యర్థము.) అశ్విన్యాది నక్షత్రములన్నియు నావిభూతులే. వానిలో శోభాధిక్యముచే చంద్రుడనునేను. ఈవిధముగా నంతటను షష్ఠ్యంతపదవాచ్యములకు విభూతిత్వమును ప్రథమాంత, ద్వితీయాంతపదవాచ్యములను ఈశ్వరునిగా నుపాసించుటను చూడదగును. ॥౨౧॥

గీ॥ వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః ।
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా ॥ ॥౨౨॥

పదవిభాగము:— వేదానాం- సామవేదః- అస్మి- దేవానాం- అస్మి- వాసవః- ఇన్ద్రియాణాం- మనః- చ- అస్మి- భూతానాం- అస్మి- చేతనా ॥ ॥౨౨॥

ప్రతిపదార్థము:— వేదానాం=వేదములలో; అహం=నేను; సామవేదః=సామవేదస్వరూపము; అస్మి=అయితిని; దేవానాం=రుద్రాదిత్యాదిదేవతలలో; వాసవః=ఇంద్రుడను; అస్మి=అయితిని; ఇన్ద్రియాణాం=ఏకాదశేంద్రియములలో; మనశ్చ=మనస్స్వరూపుడనై; అస్మి=అయితిని; భూతానాం=భూతములలో; చేతనా=బుద్ధివృత్తియై; అస్మి=అయితిని. ॥౨౨॥

శాంకరభాష్యమ్:—

వేదానామితి । వేదానాం మధ్యే సామవేదోఽస్మి, దేవానాం రుద్రాదిత్యాదీనాం వాసవ ఇన్ద్రోఽస్మి, ఇన్ద్రియాణా మేకాదశానాం చక్షురాదీనాం మనశ్చాస్మి సంకల్పవికల్పాత్మకం మన శ్చాస్మి । భూతానా మస్మి చేతనా కార్యకరణసంఘాతే నిత్యాభివ్యక్తా బుద్ధివృత్తి శ్చేతనా ॥ ॥౨౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మంత్రబ్రాహ్మణసముదాయరూపమైన ఋగాదివేదములలో నేను సామవేదస్వరూపమైతిని. రుద్రాదిత్యాదిదేవతలలో యింద్రస్వరూపుడనైతిని. చక్షురాదీంద్రియములలో సంకల్పవికల్పాత్మక మనస్స్వరూప మయితిని. భూతములలో కార్యకరణసంఘాతమునందు నిత్యాభివ్యక్తమైన బుద్ధివృత్తిస్వరూప మైతిని. ॥౨౨॥

—• ౧౦వ అధ్యాయము, ౨౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నాలుగు వేదములలో గానమాధుర్యముచే నతి రమణీయమైనదిగాన నేను సామవేదస్వరూపుడను. నేను దేవతల కధిపతియగు యింద్రుడను. పదునొకొండు యింద్రియములకు ప్రవర్తకమగుటవలన మనస్సు నాస్వరూపము. సర్వప్రాణిసంబంధమగు పరిణామములలో చిదభివ్యంజనమగు బుద్ధివృత్తిరూపమగు చేతన నాస్వరూపము. ॥౨౨॥

శంకరానందీయము:— "భూతానా మస్మి చేతనా" జీవాధిష్ఠితములగు శరీరములలో "బుద్ధ్యాదిస్థూలాంతం చేతయతీతి చేతనా సాభాసా చిత్తవృత్తిః" బుద్ధ్యాదిస్థూలాంతమగు సర్వమును తెలివి కలదిగ చేయునదిగాన బుద్ధి చేతన యనబడును. అట్టి చేతన నాస్వరూపము. (శేషము స్పష్టము.) ॥౨౨॥

పరమార్థప్రపా:— నేను ఋగాదిచతుర్వేదములలో సామవేదస్వరూపుడను. "సా చ అమశ్చ సామ, సా=ఋక్; అమః=గీతరూపమగు స్వరము; ఆరెంటియొక్క ద్వంద్వము "సామ" అనబడును. "సైవ సామ ఋగాసీ దమో నామ సామ సా వా ఋక్సామోపావదత్ మిథునం సంభవావ ప్రజాత్యా ఇతి నేత్యబ్రవీ త్సామ జ్యాయాన్వా అతో మమ మహిమా" ఈశ్రుతికి భాష్యానుమతార్థము:— 'సా' అని తచ్ఛబ్దవాచ్యమగు ఋక్, అమ యనెడు రెండు పదార్థములు కలవు. అమ మనగ గీతిరూపమగుస్వరము. (కాణ్వశాఖలయందుగూడ నిట్లు చెప్పబడినది. "తస్య హైతస్య సామ్నో యః స్వం భవతి హాస్య స్వం తస్య హై స్వర ఏవ స్వమితి । ఏతం సా ఋక్ సామోపసమీపం గత్వా ఇత్యవదత్ । ఇతి కిం ఆవాం ప్రజాత్యై

గీ॥ రుద్రాణాం శంకర శ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావకశ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్ ॥ ॥౨౩॥

ప ద వి భా గ ము:— రుద్రాణాం- శంకరః- చ- అస్మి- విత్తేశః- యక్షరక్షసాం- వసూనాం- పావకః- చ- అస్మి- మేరుః- శిఖరిణాం- అహమ్ ॥ ॥౨౩॥

ప్రతి ప దా ర్థ ము:— రుద్రాణాం=ఏకాదశరుద్రులలోను; అహం=నేను; శంకరశ్చ=శంకరుడనై; అస్మి=అయితిని; యక్షరక్షసాం=యక్షులలోను, రక్షస్సులలోను; విత్తేశః=కుబేరుడనై; అస్మి=అయితిని; వసూనాం=అష్టవసువులలో; పావకశ్చ=అగ్నిస్వరూపమై; అస్మి=అయితిని; శిఖరిణాం=పర్వతములలో; మేరుః=మేరుపర్వతమై; అస్మి=అయితిని. ॥౨౩॥

---

శాంకరభాష్యమ్:—

రుద్రాణామితి । రుద్రాణా మేకాదశానాం శంకర శ్చాస్మి । విత్తేశః కుబేరో యక్షరక్షసాం యక్షాణాం రక్షసాం చ । వసూనా మష్టానాం పావక శ్చా స్మ్యగ్ని ర్మేరుః శిఖరిణాం శిఖరవతా మహమ్ ॥ ॥౨౩॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నేను యేకాదశరుద్రులలో శంకరస్వరూపుడను. యక్షులలోను, రక్షస్సులలోను కుబేరస్వరూపుడను. అష్టవసువులలోను యగ్నిస్వరూపుడను. పర్వతములలో మేరుపర్వత స్వరూపమై అయితిని. అనగా నాయాస్వరూపముగ పరమాత్మ ధ్యేయమని యాశయము. ॥౨౩॥

---

ప్రజాయై మిథునం దాంపత్యం సంభవావేతి । అత స్సామ నేత్యబ్రవీ న్నిషేధం చకార । యత స్సామ జ్యాయా నాదిభూత మతో మమ మహిమా మత్సామర్థ్య మధికం విద్యతే కి మేకయా ఋచా । అత స్తే ద్వే ఋచా భూత్వా ఉపావదతా మిత్యాది" సామసంబంధమగు ఋక్ స్వరసమీపమునకు వెళ్ళి ఇట్లనెను. ఏమనగ మనమిద్దరము సంతానమునకై దాంపత్యము నొందుదము. అని. అనంతరము సామ దానిని నిషేధించెను కారణమేమన: నామహిమ (సామర్థ్యము) అధికమైనది. ఈఋక్కుతో నేమి? అని ఈవిధముగ ఋక్కుకంటె సామము ఉపజీవ్యమగుటచే నాధిక్యమునుగాన నేను వేదములలో సామవేదస్వరూపుడను అని చెప్పబడెను. లేక, సామవేదమునం దున్నవన్నియు నీశ్వరస్తావకములుగాను; పావమాన్యములగుచున్నవి. "అథాతః పావమానాః" అను శ్రుతియు పైవిషయమును జెప్పుచున్నది. ఇట్లే ఆసామలు "తత్పావమానాభి రహం పునామి" అనుపరిశిష్టోక్తిననుసరించి పఠనమాత్రముచేతనే పవిత్రింపజేయుచున్నవి. గాన నాలుగు వేదములలో సామవేదమునకు విభూతిత్వము చెప్పబడెను. (శేషము సమానము.) ॥౨౨॥

—• ౧౦వ అధ్యాయము ౨౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మ ధు సూ ద న స ర స్వ తీ య ము:— నేను ఏకాదశరుద్రులలో శంకరుడను, యక్షరాక్షసులలో కుబేరుడను, అష్టవసువులలో నగ్నిని, శృంగములుగల పర్వతములలో మేరువును. ॥౨౩॥

భా ష్యో త్క ర్ష దీ పి క:— వీరభద్ర, శంభు, గిరిశ, అజ, ఏకపాత్, అహిర్బుధ్న్య; పినాకి, ఈశ, కపాలి, దిక్పతి, స్థాణు నామక:ఏకాదశరుద్రులలో శంకరుడగు (సుఖమును జేయువాడగు) శంభుస్వరూపుడను నేను. ధ్రువ, అధర్వ, అప, సోమ, అనల, అనిల, ప్రత్యూష, ప్రభాస నామములగు అష్టవసువులలో ననలస్వరూపుడను నేను. (శేషము గతార్థము.) ॥౨౩॥

గీ॥ పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్ ।
సేనానీనా మహం స్కంద స్సరసా మస్మి సాగరః ॥ ॥౨౪॥

పదవిభాగము:— పురోధసాం- చ- ముఖ్యం- మాం- విద్ధి- పార్థ- బృహస్పతిం- సేనానీనాం- అహం- స్కందః-సరసాం- అస్మి- సాగరః ॥ ॥౨౪॥

ప్రతిపదార్థము:— హేపార్థ!=ఓయర్జున; మాం=నన్ను; పురోధసాం=పురోహితులలో; ముఖ్యం=ముఖ్యమైన; బృహస్పతిం చ=బృహస్పతినిగ; విద్ధి=తెలిసికొనుము; అహం=నేను; సేనానీనాం=సేనాధిపతులలో; స్కందః=కుమారస్వామిస్వరూపమైతిని; సరసాం=దేవఖాతసరస్సులలో; సాగరః=సముద్రస్వరూపమై; అస్మి=అయితిని. ॥౨౪॥

గీ॥ మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరమ్ ।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥ ॥౨౫॥

పదవిభాగము:— మహర్షీణాం- భృగుః- అహం- గిరాం- అస్మి- ఏకం- అక్షరం- యజ్ఞానాం- జపయజ్ఞః- అస్మి- స్థావరాణాం- హిమాలయః ॥ ॥౨౫॥

ప్రతిపదార్థము:— మహర్షీణాం=మహర్షులలో; భృగుః=భృగుమహర్షి స్వరూపమై; అహం=నేను; అస్మి=అయితిని; గిరాం=పదస్వరూపమైన వాక్కులలో; ఏకం=ఒకటైన; అక్షరం=అక్షరమగు ఓంకార స్వరూపమై; అస్మి=అయితిని; యజ్ఞానాం=యజ్ఞములలో; జపయజ్ఞః=జపనెడి యజ్ఞస్వరూపమై; అస్మి=అయితిని; స్థావరాణాం=స్థావరములలో; హిమాలయః=హిమవత్పర్వతస్వరూపమై; అస్మి=అయితిని. ॥౨౫॥

శాంకరభాష్యమ్;—

పురోధసా మితి । పురోధసాం రాజపురోహితానాం ముఖ్యం ప్రధానం మాం విద్ధి జానీహి హేపార్థ! బృహస్పతిమ్ । స హీన్ద్రస్యేతి ముఖ్యః స్యా త్పురోధాః । సేనానీనాం సేనాపతీనా మహం స్కందో దేవసేనాపతిః । సరసాం యాని దేవఖాతాని సరాంసి తేషాం సరసాం సాగరోస్మి భవామి ॥ ॥౨౪॥

మహర్షీణామితి । మహర్షీణాం భృగురహం గిరాం వాచాం పదలక్షణానా మేక మక్షర మోంకారోస్మి । యజ్ఞానాం జపయజ్ఞోస్మి, స్థావరాణాం స్థితిమతాం హిమాలయః ॥ ॥౨౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని: —

ఓయర్జున! నన్ను రాజపురోహితులలో ప్రధానమైన బృహస్పతినిగ తెలిసికొనుము. ఆబృహస్పతి యింద్రునకు ముఖ్యపురోహితుడు. సేనాధిపతులలో దేవసేనాధిపతియగు కుమారస్వామిస్వరూపుడను నే నైతిని. దేవతలచే త్రవ్వబడిన యే సరస్సులు కలవో వాటిలో సముద్రస్వరూపుడను నే నైతిని. అనగా బృహస్పతి, కుమారస్వామి, సముద్రములు పరమాత్మస్వరూపములుగ ధ్యానింపదగినవారని యాశయము. ॥౨౪॥

నేను మహర్షులలో భృగుమహర్షిస్వరూపుడను, పదస్వరూపమగు వాక్కులలో ఒకయక్షరమగు ఓంకారస్వరూపము అయితిని యజ్ఞములలో జపయజ్ఞస్వరూపము, స్థావరములలో హిమవత్పర్వతస్వరూపము అయితిని. ॥౨౫॥

—• ౧౦ అధ్యాయము ౨౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇంద్రుడు సర్వరాజశ్రేష్ఠుడుగాన రాజపురోహితులలో

గీ॥ అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।
గన్ధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః ॥ ॥ ౨౬॥

పదవిభాగము:— అశ్వత్థః- సర్వవృక్షాణాం- దేవర్షీణాం- చ- నారదః- గన్ధర్వాణాం- చిత్రరథః- సిద్ధానాం- కపిలః- మునిః ॥ ॥ ౨౬॥

ప్రతిపదార్థము:— సర్వవృక్షాణాం=నిఖిలవృక్షములలో; అశ్వత్థః=అశ్వత్థవృక్షస్వరూపమై; దేవర్షీణాం=దేవర్షులలో; నారదశ్చ=నారదస్వరూపమై; గన్ధర్వాణాం=గన్ధర్వులలో; చిత్రరథః=చిత్రరథుడనుగన్ధర్వస్వరూపమై; సిద్ధానాం=సిద్ధులలో; కపిలోమునిః=కపిలమహర్షి స్వరూపుడనై; అస్మి= అయితిని. ॥ ౨౬॥

గీ॥ ఉచ్చై శ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్ ।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥ ॥ ౨౭॥

పదవిభాగము:— ఉచ్చైశ్శ్రవసం- అశ్వానాం- విద్ధి- మాం- అమృతోద్భవం- ఐరావతం- గజేన్ద్రాణాం- నరాణాం- చ- నరాధిపతిమ్ ॥ ॥ ౨౭॥

ప్రతిపదార్థము:— మాం=నన్ను; అశ్వానాం=అశ్వములలో; అమృతోద్భవం=అమృతనిమిత్తక్షీరసముద్రమథనోద్భవమైన; ఉచ్చైశ్శ్రవసం=ఉచ్చైశ్శ్రవస్సను పేరుగల యశ్వస్వరూపముగ; విద్ధి=తెలిసికొనుము; గజేన్ద్రాణాం=గజశ్రేష్ఠములలో; ఐరావతం=ఐరావతమనెడి గజస్వరూపముగను; నరాణాం= మనుష్యులలో; నరాధిపం చ=మనుష్యులకు ప్రభుస్వరూపముగను; విద్ధి=తెలిసికొనుము. ॥ ౨౭॥

శాంకరభాష్యమ్:—

అశ్వత్థ ఇతి । అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదో దేవా ఏవ సంత ఋషిత్వం ప్రాప్తా మన్త్రదర్శిత్వాత్తే దేవర్షయ స్తేషాం నారదోఽస్మి । గన్ధర్వాణాం చిత్రరథో నామ గన్ధర్వోఽస్మి । సిద్ధానాం జన్మనైవ ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యాతిశయం ప్రాప్తానాం కపిలో మునిః ॥ ॥ ౨౬॥

ఉచ్చై రితి । ఉచ్చైశ్శ్రవస మశ్వానా ముచ్చైశ్శ్రవా నామాశ్వ స్తం మాం విద్ధి జానీ హ్యమృతోద్భవ మమృతనిమిత్తమథనోద్భవమ్ । ఐరావత మిరావత్యా అపత్యం గజేంద్రాణాంహస్తీశ్వరాణాం తం మాం విద్ధీ త్యనువర్తతే । నరాణాం మనుష్యాణాం చ నరాధిపం రాజానం మాం విద్ధి జానీహి ॥ ॥ ౨౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సర్వవృక్షములలో నశ్వత్థవృక్షస్వరూపమై, దేవఋషులలో నారదమహర్షిస్వరూపుడనై, గంధర్వులలో చిత్రరథు డనుగంధర్వస్వరూపుడనై, సిద్ధులలో కపిలమహర్షిస్వరూపుడనై అయితిని. ॥ ౨౬॥

నన్ను అశ్వములలో యమృతనిమిత్తము క్షీరసముద్రమథనమువలన జనించిన ఉచ్చైశ్శ్రవస్సను యశ్వస్వరూపముగను, గజశ్రేష్ఠములలో ఐరావతమను గజముగను, మనుష్యులలో నరాధిపస్వరూపముగను తెలిసికొనుము. ॥ ౨౭॥

గీ॥ ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కందర్ప స్సర్పాణా మస్మి వాసుకిః ॥ ॥౨౮॥

పదవిభాగము:— ఆయుధానాం— అహం— వజ్రం— ధేనూనాం— అస్మి— కామధుక్— ప్రజనః— చ— అస్మి— కందర్పః— సర్పాణాం— అస్మి— వాసుకిః ॥ ॥౨౮॥

ప్రతిపదార్థము:— ఆయుధానాం=ఆయుధములలో; వజ్రం=వజ్రాయుధము; అహం=నేను; అస్మి=అయితిని; ధేనూనాం=ధేనువులలో; కామధుక్=కామధేనువునై; అహం=నేను; అస్మి=అయితిని; ప్రజనః=పుత్రోత్పాదనసమర్థమైన; కందర్పః=కామస్వరూపమై; అస్మి=అయితిని; సర్పాణాం=సర్పములలో; వాసుకిః=వాసుకి అనెడి సర్పస్వరూపమై; అస్మి=అయితిని. ॥౨౮॥

శాంకరభాష్యమ్:—

ఆయుధానా మితి । ఆయుధానా మహం వజ్రం దధీచ్యస్థిసంభవం ధేనూనాం దోగ్ధ్రీణా మస్మి కామధుక్, వసిష్ఠస్య సర్వకామానాం దోగ్ధ్రీ సామాన్యా వా కామధుక్ । ప్రజనః ప్రజనయితాస్మి కందర్పః కామః । సర్పాణాం సర్పభేదానా మస్మి వాసుకి స్సర్పరాజః ॥ ॥౨౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నేను ఆయుధములలో దధీచిమహర్ష్యస్థిసంభూతమైన వజ్రాయుధస్వరూపము, ధేనువులలో వశిష్ఠమహర్షికి సర్వకామముల నిచ్చెడి ధేనుస్వరూపమై, లేక, కామధేనుస్వరూపమై, పుత్రోత్పత్తిసమర్థమైన కామస్వరూపుడనై, సర్పవిశేషములలో వాసుకి యను సర్పరాజస్వరూపమై అయితిని. ॥౨౮॥

శ్రేష్ఠుడగు బృహస్పతి నాస్వరూపుడని తెలిసికొనుము. సేనాపతులలో దేవసేనకధిపతియగు కుమారస్వామి నాస్వరూపుడు. దేవఖాతములగు జలాశయములలో సాగరము నాస్వరూపము. ॥౨౪॥

—• ౧౦వ అధ్యాయము ౨౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సప్తబ్రహ్మర్షులలో నతితేజస్వీగాన భృగుమహర్షి నాస్వరూపుడు. పదములు అను పేరుకల వాక్కులలో, నేను ఓంకారస్వరూపుడను. యజ్ఞములలో హింసాదిదోషశూన్యమగుటచేతను, అత్యంతశుద్ధిహేతువగుటచేతను శ్రేష్ఠమగు జపయజ్ఞము నాస్వరూపము. స్థావరములగు పర్వతాదులలో హిమవత్పర్వతము నాస్వరూపము. (శిఖరములుగల పర్వతములలో మేరువు నాస్వరూపమని చెప్పుటచే యర్థభేదముచే దోషములేదు.) ॥౨౫॥

—• ౧౦వ అధ్యాయము ౨౬, ౨౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అన్ని వృక్షములలో నశ్వత్థవృక్షము నాస్వరూపము. దేవజాతికిజెంది స్వయముగ మంత్రద్రష్టలగు ఋషులు దేవర్షులనబడుదురు. అట్టి దేవర్షులలో నారదుడను నేనే. దేవగాయకులగు గంధర్వులలో చిత్రరథుడను నేను. ప్రయత్నము లేకుండగనే జన్మచేతనే ధర్మ, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్యాతిశయమును బొందినట్టియు, అధిగతసకలపరమార్థములు గల సిద్ధులలో కపిలమునిని నేను. అశ్వములలో నమృతమథమనోద్భవమైనయుచ్చైశ్శ్రవస్సునుగా నన్ను తెలిసికొనుము. ఏనుగులలో నైరావతమునుగా నన్ను తెలిసికొనుము. నరులలో నరాధిపతి నాస్వరూపుడని తెలిసికొనుము. ॥౨౬, ౨౭॥

౨౯

గీ॥ అనన్త శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్ ।
పితౄణా మర్యమాచాస్మి యమ స్సంయమతా మహమ్ ॥ ॥౨౯॥

పదవిభాగము:— అనన్తః- చ- అస్మి- నాగానాం- వరుణః- యాదసాం- అహం- పితౄణాం- అర్యమా- అస్మి- యమః- సంయమతాం- అహమ్ ॥ ॥౨౯॥

ప్రతిపదార్థము:— అహం=నేను; నాగానాం=నాగములనెడి సర్పములలో, అనన్తః=అనన్తుడనెడి సర్పరాజస్వరూపమై; యాదసాం=జలదేవతలలో; వరుణః=వరుణదేవస్వరూపమై; అస్మి=అయితిని; అహం=నేను; పితౄణాం=పితృదేవతలలో; అర్యమాచ=అర్యమ అనెడి పితృదేవతాస్వరూపమై; సంయమతాం=దండించువారలలో; యమః=యమధర్మరాజస్వరూపమై; అస్మి=అయితిని. ॥౨౯॥

శాంకరభాష్యమ్:—

అనంత ఇతి । అనంత శ్చాస్మి నాగానాం నాగవిశేషాణాం నాగరాజ శ్చాస్మి । వరుణో యాదసా మహ మద్దేవతానాం రాజాఽహమ్ । పితౄణా మర్యమా నామ పితృరాజ శ్చాస్మి. యమ స్సంయమతాం సంయమనం కుర్వతా మహమ్ ॥ ॥౨౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నేను నాగములనెడి సర్పవిశేషములలో అనంతుడనెడి సర్పరాజస్వరూపము. జలదేవతలలో వరుణదేవస్వరూపము అయితిని. నేను పితృదేవతలలో "అర్యమా" అను పితృదేవతాస్వరూపము, దండించువారలలో యమధర్మరాజస్వరూపము అయితిని. ॥౨౯॥

—• ౧౦వ అధ్యాయము ౨౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అస్త్రములలో దధీచియొక్క అస్థిచే నిర్మితమైన వజ్రమును నేను. ఆవులలో సముద్రమథనోద్భవయగు కామధేనువును నేను. కామములలో పుత్రోత్పత్తి ప్రయోజనముగాగల కామమును నేను. (ఇట చకారము రతిమాత్రహేతు కామమును గ్రహింపకుండుటకు ప్రయుక్తమయ్యెను.) సర్పములు, నాగులు జాతిభేదముచే వేర్వేరుగనున్నవి. సర్పములలో రాజగు వాసుకిని నేను. ॥౨౮॥

శ్రీధరీయము:— విషసహితము లగునవి సర్పములు. అట్టి సర్పములలో రాజగు వాసుకిని నేను. (శేషము గతార్థము.) ॥౨౮॥

—• ౧౦వ అధ్యాయము ౨౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నాగులను నామముగల పాములలోనివాడగు అనంతుడను (శేషాహిని) నేను. జలచరములలో వాటికి రాజగు వరుణదేవుడను నేను. పితృదేవతలలో వారికి రాజగు అర్యముడను నేను. సంయమమును (ధర్మాధర్మఫలము నిచ్చుచు, నిగ్రహానుగ్రహములను) జేయువారిలో యముడను నేను. ॥౨౯॥

శ్రీధరీయము:— విషరహితములగు నాగములకు (పాములకు) రాజగు అనంతుడను (శేషాహిని) నేను. (శేషము గతార్థము.) ॥౨౯॥

గీ॥ ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్ ।
మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయ శ్చ పక్షిణామ్ ॥ ॥౩౦॥

పదవిభాగము:— ప్రహ్లాదః- చ- అస్మి- దైత్యానాం- కాలః- కలయతాం- అహం- మృగాణాం- చ- మృగేంద్రః- అహం- వైనతేయః- చ- పక్షిణామ్ ॥ ॥౩౦॥

ప్రతిపదార్థము:— అహం=నేను; దైత్యానాం=దైత్యులలో; ప్రహ్లాదశ్చ=ప్రహ్లాదస్వరూపుడనై; కలయతాం=పరిగణనము చేయువారలలో; కాలః=కాలస్వరూపమై; అస్మి=అయితిని; మృగాణాం=మృగములలో; మృగేంద్రః=సింహస్వరూపమై; లేక వ్యాఘ్రస్వరూపమై; పక్షిణాం=పక్షులలో; వైనతేయశ్చ=గరుత్మత్స్వరూపమై; అస్మి=అయితిని. ॥౩౦॥

గీ॥ పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహమ్ ।
ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ ॥ ॥౩౧॥

పదవిభాగము:— పవనః- పవతాం- అస్మి- రామః- శస్త్రభృతాం- అహం- ఝషాణాం- మకరః- చ- అస్మి- స్రోతసాం- అస్మి- జాహ్నవీ ॥ ॥౩౧॥

ప్రతిపదార్థము:— అహం=నేను; పవతాం=పావయితృలలో; లేక, వేగముకలవారలలో; పవనః=వాయుస్వరూపమై; శస్త్రభృతాం=శస్త్రమును ధరించువారలలో; రామః=దశరథపుత్రుడగు శ్రీరామచంద్రస్వరూపుడనై; అస్మి=అయితిని; ఝషాణాం=మత్స్యములలో; మకరశ్చ=మకరమనెడి మత్స్యస్వరూపమై; అస్మి=అయితిని; స్రోతసాం=నదులలో; జాహ్నవీ=గంగానదీస్వరూపమై; అస్మి=అయితిని. ॥౩౧॥

శాంకరభాష్యమ్:—

ప్రహ్లాద ఇతి । ప్రహ్లాదో నామ చాస్మి దైత్యానాం దితివంశ్యానామ్ । కాలః కలయతాం కలనం గణనం కుర్వతా మహం, మృగాణాం చ మృగేంద్రః సింహో వ్యాఘ్రో వాఽహం, వైనతేయ శ్చ గరుత్మా న్వినతాసుతః పక్షిణాం పతత్రిణామ్ ॥౩౦॥

పవన ఇతి । పవనో వాయుః పవతాం పావయితౄణా మస్మి, రామ శ్శస్త్రభృతా మహం శస్త్రాణాం ధారయితౄణాం దాశరథీ రామోఽహం, ఝషాణాం మత్స్యాదీనాం మకరో నామ జాతివిశేషోఽహం స్రోతసాం స్రవంతీనా మస్మి జాహ్నవీ గంగా ॥౩౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నేను దితిసంతతియగు దైత్యులలో ప్రహ్లాదస్వరూపమై, పరిగణనము చేయువారలలో కాలస్వరూపమై అయితిని. నేను మృగములలో సింహస్వరూపమై, లేక వ్యాఘ్రస్వరూపమై అయితిని పక్షులలో వినతాపుత్రుడగు గరుత్మంతుడ నైతిని. ॥౩౦॥

నేను పవిత్రపజేయు వారలలో, లేక వేగముకలవారలలో వాయుస్వరూపమై శస్త్రధారులలో దశరథపుత్రుడగు శ్రీరామచంద్రప్రభుస్వరూపమై, అయితిని. మత్స్యములలో మకర(మొసలి)స్వరూపమై, నదులలో జాహ్నవీ(గంగా)నదీస్వరూపమై అయితిని. ॥౩౧॥

—• ౧౦వ అధ్యాయము ౩౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీ వ్యాఖ్య:— దితియొక్క వంశములో బుట్టినవారిలో :పరమసాత్త్వికు

గీ॥ సర్గాణా మాది రన్తశ్చ మధ్యం చైవాహ మేవ చ ।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్ ॥ ॥౩౨॥

పదవిభాగము:— సర్గాణాం– ఆదిః– అన్తః– చ– మధ్యం– చ– ఏవ– అహం– అర్జున– అధ్యాత్మవిద్యా– విద్యానాం– వాదః– ప్రవదతాం– అహమ్ ॥ ॥౩౨॥

ప్రతిపదార్థము:— హే అర్జున!=ఓయర్జునుడా!; సర్గాణాం=సృష్టులకు; ఆదిః=కారణము; (మొదలు) అంతశ్చ=నాశము; మధ్యంచ=స్థితియు; అహమేవ=నాస్వరూపమే; విద్యానాం=విద్యలలో; అధ్యాత్మవిద్యా=అధ్యాత్మవిద్య; అహమేవ=నాస్వరూపమే; ప్రవదతాం=వాదజల్పవితండకథలను పలికెడివారలయొక్క; వాదః=వాదకథారూపమై; అహం=నేను; అస్మి=అయితిని. గురుశిష్యులకథ వాదమనబడును. పరస్పరము జయించు యిచ్ఛకల వాదిప్రతివాదుల కథ జల్పకథ యనబడును. స్వపక్షస్థాపనాహీనమై పరపక్షవిదళనమాత్రపర్యవసాయియగు కథ వితండము. ॥౩౨॥

డగుటచే మిక్కిలి యానందింపజేయువాడు గాన ప్రహ్లాదుడను నేను. లెక్కించువారిలో కాలస్వరూపుడను నేను. మృగములలో సింహమును నేను. పక్షులలో వైనతేయుడను నేను. ॥౩౦॥

శంకరానందీయము:— శుభాశుభములను, వృద్ధిక్షయములను జేయువాటిలో కాలమును నేను. (శేషము స్పష్టము.) ॥౩౦॥

—• ౧౦వ అధ్యాయము ౩౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పవిత్రింపజేయువాటిలో లేక, వేగము కలవాటిలో వాయువును నేను. శస్త్రధారులై యుద్ధనిపుణులగువారిలో పరమవీరుడగు దశరథరాముడను నేను. (శ్రీరాముడు సాక్షాద్విష్ణుస్వరూపుడైనను శ్రీరామరూపముతో ధ్యానించుటకై "వృష్ణీనాం వాసుదేవోఽస్మి" అనినట్లే పాఠమని పూర్వము చెప్పబడెను.) మత్స్యములలో శ్రేష్ఠమగు మకరమును నేను. నదులలో సర్వనదీశ్రేష్ఠయగు గంగను నేను. ॥౩౧॥

—• ౧౦వ అధ్యాయము ౩౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అచేతనసృష్టులలో నుత్పత్తిస్థితిలయములు నేను. ("భూతానా మాది రంతశ్చ" అని యుపక్రమమునందు జీవావిష్టములగువాని యుత్పత్తిస్థితిలయములు చెప్పబడుటచే పౌనరుక్త్యములేదు.) విద్యలలో మోక్షహేతువగు ఆత్మతత్త్వవిద్యను నేను. చర్చించుకొనువారి వాదించుకొనుటరూపమగు కథాభేదములగు వాద, జల్ప వితండారూపమగువాటిలో వాదమును నేను. ("భూతానాం చేతనా" అను స్థలమున భూతశబ్దముచే వాటికి సంబంధించిన పరిణామములెట్లు లక్షితములో అట్లే ఇట ప్రవదచ్ఛబ్దముచే వారికి సంబంధించిన కథాభేదములు లక్షితములగును గాన నిర్ధారణషష్ఠి యుపపన్నము.) తత్త్వబుభుత్సులు, వీతరాగులు నను సమానబ్రహ్మచారు లగువారికిగాని, గురుశిష్యులకుగాని ప్రమాణపురస్సరముగ తర్కముచే సాధనదూషణరూపమైన, స్వపక్ష, ప్రతిపక్షపరిగ్రహము తత్త్వనిర్ణయాంతమగుచో నది వాద మనబడును. ॥౩౨॥

శంకరానందీయము:— ఆదిత్యాదివిభూతులు, విష్ణ్వాదివిభూతివిశేషములు స్వస్వరూపమేయని సూచించుటకు సర్వవికారములకు ఆదియు, మధ్యము, అంతముగూడ పరిపూర్ణుడను సర్వాత్మను అగు, నేనే యని చెప్పుచున్నాడు.— "సర్గాణా...మహం" సృజింపబడు మహదాదిస్థూలాంతరములగు వికారములు సర్గము

శాంకరభాష్యం:—

సర్గాణా మితి । సృష్టీనా మాది రంతశ్చ మధ్యం చైవాహ ముత్పత్తిస్థితిలయా అహ మర్జున! । భూతానాం జీవాధిష్ఠితానా మేవాఽఽఽది రంత శ్చేత్యా ద్యుక్త ముపక్రమ ఇహ తు సర్వస్యైవ సర్గమాత్ర స్యేతి విశేషః । అధ్యాత్మవిద్యా విద్యానాం మోక్షార్థత్వా త్ప్రి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సృష్టులకు కారణము, నాశనము, స్థితియు ఓయర్జున! నాస్వరూపమే. ఉపక్రమము నందు జీవాధిష్ఠితభూతముల ఆద్యన్తములు నేనే యని చెప్పబడెను. ఇచట నిఖిలసృష్టి మాత్రముయొక్క యాద్యన్తములు నేనే యని విశేషము గ్రహింపనగును. విద్యలలో

అనబడును. వాటికి యుపాదానకారణమును నేనే. ("తస్మా త్సర్వం సమభవత్" అను శ్రుతి చెప్పిన ఘటాదికమునకు మృత్తువలె నేనిసర్వమున కుపాదానకారణుడ నని యర్థము.)

సర్వవికారకారణుడ వగుటచే సృష్ట్యాదియందు నీకుసద్భావమున్నను, కార్యదశయందు నీసత్త కనబడుటలేదు గాన నీకు సర్వాత్మత్వము, పూర్ణత్వము సంభవించుట లేదు. అనునాశంకపై జెప్పుచున్నాడు.— "మధ్యం" మృత్కార్యమగు ఘటాదికమునందు మృద్ధర్మమగు గంధవత్త్వాదికము కనబడుటవలన మృత్తుయొక్క సమ న్వయము. (సంబంధము) దానిచే నెట్లుఘటాదికము సర్వము మృత్స్వరూపమో యట్లే మహదాదికమునందు నా ధర్మమగు సత్తాస్ఫూర్త్యాదికము కనబడుటవలన నాసమన్వయముచే సర్వము నేనే. కాన ప్రపంచముయొక్క మధ్యావస్థనుగూడ నేనే. (వికారరూపముతో నే నుంటినని యర్థము.)

నీవు వికారస్వరూపముగ నున్నచో వికారము నశించిన, నీకుకూడ నాశము సంభవించునుగాన నీసత్తయే యుండదు కనుక నీకుఅనిత్యత్వము, అసర్వాత్మత్వము, అపూర్ణత్వము ప్రసక్తములయ్యెడిని అనుఆశంకపై జెప్పుచు న్నాడు.— "అంత శ్చ" కార్యముయొక్క (అదర్శనరూపమగు) అంతముగూడ నేనే. కల్పితరూపముగల ఘటము నశింపగనే ఘటకారణమై యనువృత్తమగు మృత్తునకు నాశము లేనందున కపాలములుగ చూర్ణాద్య నువృత్తమైన మృత్తుయొక్క సత్త యెట్లు సంభవించుచున్నదో యట్లే మహదాదిసర్వవికారములు నశించినను, వాటికి కారణభూతుడను, అనువృత్తుడను అగు నాయొక్క సత్తకు నాశములేదుగాన నాయొక్క సద్భావ మెప్పుడు నున్నదే యట్టినాకు నిత్యత్వము, సార్వాత్మ్యము, పూర్ణత్వము నివి యెల్లప్పుడు నున్నవే. కాన వికా రములయొక్క ఆదియు, నంతము, మధ్యమునేనే. నాకంటె నతిరిక్తమగు వస్తువును ప్రమాణము ననుసరించి నిరూపించుటకు శక్యము కాదు కాన యాదిత్యాదివిభూతులు, విష్ణ్వాదివిభూతివిశేషములు నివన్నియు నేనేయని సిద్ధము.

లేక, "సృష్టిస్థిత్యంతకారిణీం బ్రహ్మవిష్ణుశివాత్మికామ్। స సంజ్ఞాం యాతి భగవా నేక ఏవ జనార్దనః॥" అను వచనానుసారము "సృజన్త ఇతి సర్గాః సృష్టింపబడు ప్రాణులు సర్గములనబడును. వాటికి కారణుడగు బ్రహ్మను నేనే. వాటికి సంహర్తయగు శివుడను నేనే. వాటి స్థితికి కర్తనగు విష్ణువును నేనే. జ్ఞానహేతువు లగు సమస్తవేదములు, శాస్త్రములు విద్యలనబడును. వాటిలో మోక్షహేతువులగుటవలన యుపనిషత్తులు ॥౩౨॥

నేనే. వాద, జల్ప, వితండాదులలో యర్థనిర్ణయహేతువగుటవలన వాదకథను నేను.

శ్రీధరీయము:— సృజింపబడు ఆకాశాదులకు ఆదిని, అంతమును; మధ్యమును నేనే. (అనగా వాటి సృష్టి స్థితిలయహేతుత్వము పరమేశ్వరునిదేయని తెలుపబడెను. దీనిచే సృష్టి, స్థితి, ప్రలయములను

శాంకరభాష్యమ్:—

ధాన మస్మి । వాదోఽర్థనిర్ణయహేతుత్వా త్ప్రవదతాం ప్రధాన మతః సోఽహ మస్మి । ప్రవక్తృద్వారేణ వదనభేదానామేవ వాదజల్పవితండానా మిహ గ్రహణం ప్రవదతామితి॥౩౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మోక్షార్థమగుటవలన ప్రధానమగు నధ్యాత్మవిద్య నాస్వరూపమే. వాదజల్పవితండ కథలను పలుకువారలయొక్క వాదకథ అర్థనిర్ణయహేతువగుటవలన ప్రధానమైనది. అట్టివాదకథ స్వరూపము నేను అయితిని. ॥౩౨॥

నావిభూతులుగా నుపాసింపదగునని సూచింపబడెను.) విద్యలలో నధ్యాత్మవిద్య నాస్వరూపము. వాదించుకొనెడివారికి సంబంధించిన వాద, జల్ప, వితండలలో వాదమును నేను. ఇద్దరు వాదిప్రతివాదులు ప్రమాణము ననుసరించియు, తర్కము చేతను స్వపక్షమును స్థాపించుకొనుటకును, ఛల, జాతి, నిగ్రహస్థానములచే పరపక్షమును దూషించుకొనుటకును ప్రవృత్తమగు వాక్యోపవాక్యసందర్భము జల్పమనబడును. ఒక వాది తన పక్షమును స్థాపించుకొనుచుండ, ప్రతిపక్షి యాతని పక్షమును ఛల, జాతి, నిగ్రహస్థానములచే దూషించును గాని, తనపక్షమును స్థాపించుకొనడు. ఇది వితండయనబడును. ఈ జల్పవితండములు రెండును విజిగీషువులగు వాదిప్రతివాదులశక్తిని పరీక్షించుటకుమాత్రమే యుపయోగించును కాని తత్త్వనిర్ణయమున కుపకరింపవు. వీతరాగులగు శిష్యాచార్యులయొక్క గాని, యితరులయొక్క గాని వాగ్వాదము వాదమనబడును. ఇది తత్త్వనిర్ణయము ఫలముగాకలదిగాన శ్రేష్ఠమగుటచే నావిభూతియని యర్థము. ॥౩౨॥

పరమార్థప్రపా:— సృజింపబడు ఆకాశాదులకు మూలమును, అంతమును, స్థితిని నేనే. చతుర్దశ విద్యలలో నాత్మప్రతిపాదకమగుటవలన శ్రేష్ఠమగు ఆధ్యాత్మవిద్యను నేను. ఇతరమగు విద్యలు తమతమ మతములయందలి యభినివేశముచే మత్సరాదిజనకములగుటచే నధ్యాత్మవిద్యకంటె నవరములు. ఈవిషయమున నొక మహాకవి మాత్సర్యమునుగూర్చి యిట్లు వ్రాసెను. "రే! రే? మత్సర! జీవ వత్సరశతం యేన త్వయా నిర్జితం, శాస్త్రాణా మిద మూర్జితం ప్రయతతాం త్వద్వంశవిచ్ఛిత్తయే। యస్మా త్తద్గురుతా ముపాస్య చ కృథాః స్వా న్యాయుధా న్యన్యథా స్వీయం స్థాపయితుం మతం పరమతచ్ఛేదం కథం కుర్వతే॥" (ఓమత్సరమా! నీవు నూరేండ్లు బ్రతుకుము. నీవంశవినాశనమునకై ప్రయత్నించు శాస్త్రములయొక్క దృఢమగుమతము నీచే జయింపబడినది. (మాత్సర్యోన్మూలనమునకై శాస్త్రము లనేకవిధములుగ బోధించును. కాన ఆయా శాస్త్రకర్తలయెడ మాత్సర్యమును వహించి ఆయా శాస్త్రములయందు గౌరవమును వీడి; ఆయా శాస్త్రోపదేశములను నమ్మకుండుటకై యశాస్త్రీయములగు యుక్తు లనెడు ఆయుధములను నిర్మించుకొంటివి. అట్లు కానిచో నాయాయుధములు స్వీయమతమును స్థాపించుటకై, యన్యమతము నెట్లు ఖండింపగల్గుచున్నవి?) మాత్సర్యగ్రస్తవాదభూయిష్ఠములై, తత్త్వనిర్ణాయకములు కాని విద్యలకంటె నుత్కృష్టమగు నధ్యాత్మవిద్య నావిభూతియని యర్థము. తత్త్వనిర్ణయరూపప్రయోజనములేని జల్ప వితండాది భూయిష్ఠములగు విద్యలకంటె తత్త్వనిర్ణయముగల బ్రహ్మవిద్య శ్రేష్ఠము గనుకనే "వాదః ప్రవదతా మహం" పరస్పరము వాద, జల్ప, వితండాకథలలో తత్త్వబుభుత్సున కుపయోగించెడి తత్త్వనిర్ణయఫలముగల వాదకథను నేను. ॥౩౨॥

గీ॥ అక్షరాణా మకారోఽస్మి ద్వన్ద్వః సామాసికస్య చ।
అహ మేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతో ముఖః ॥ ॥33॥

పదవిభాగము:— అక్షరాణాం- అకారః- అస్మి- ద్వన్ద్వః-సామాసికస్య- చ- అహం- ఏవ- అక్షయః- కాలః- ధాతా- అహం- విశ్వతోముఖః ॥ ॥33॥

ప్రతిపదార్థము:— అక్షరాణాం=అక్షరములలో; అకారః=అకారము; సామాసికస్య=సమాస సమూహములో; ద్వంద్వః=ద్వన్ద్వసమాసము; అహ మేవ=నేనే; అస్మి=అయితిని; అక్షయః=క్షయముకాని: కాలః= కాలస్వరూపము; ధాతా=కర్మఫలమునిచ్చువాడు; విశ్వతోముఖః=సర్వతోముఖుడు; అహ మేవ=నేనే: అస్మి=అయితిని. ॥33॥

---

శాంకరభాష్యమ్:—

అక్షరాణా మితి । అక్షరాణాం వర్ణానా మకారో వర్ణోఽస్మి ద్వంద్వః సమాసోఽస్మి సామాసికస్య సమాససమూహస్య । కిం చాహ మేవాఽక్షయోఽక్షీణః కాలః ప్రసిద్ధః క్షణాద్యాఖ్యం అథ వా పరమేశ్వరః కాలస్యాపి కాలోఽస్మి, ధాతాహం కర్మఫలస్య విధాతా సర్వ జగతో విశ్వతోముఖ స్సర్వతోముఖః ॥ ॥33॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అకారాదివర్ణములలో అకారము నేనే అయితిని. సమాససమూహములో ద్వన్ద్వ సమాసము నేనే అయితిని. క్షీణముకాని ప్రసిద్ధమైన క్షణాదు లను పేరుగల కాలము నేనే అయితిని. లేక, కాలమునకు కాలస్వరూపమైన పరమేశ్వరస్వరూపము నేనే అయితిని. సర్వజగత్తునకు కర్మఫలముల నిచ్చువాడను నేనే అయితిని. సర్వతోముఖుడను నేనే అయితిని. ॥33॥

---

—• ౧౦వ అధ్యాయము ౩౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "అకారో వై సర్వావాక్" అను శ్రుతిచెప్పన అన్ని అక్షరముల (వర్ణము) లలో శ్రేష్ఠమగు అకారమును నేను. సమాససమూహములో ద్వంద్వసమాసమును నేను. (అవ్యయీభావసమాసము పూర్వపదార్థప్రధానము. ఉత్తరపదార్థప్రదానమైనది తత్పురుషము. అన్యపదార్థ ప్రధానమైనది బహువ్రీహిసమాసము. ఉభయపదార్థప్రధానమైనదిగాన ద్వంద్వసమాసము శ్రేష్ఠమైనది. అద్వంద్వసమాసమును నేను అని యర్థము.) "జ్ఞః కాల కాలో గుణీ సర్వవిద్యః" అను శ్రుతిప్రసిద్ధి ననుస రించి అక్షయమగు కాలమును నేనే. కర్మఫలప్రదాతలలో సర్వతోముఖుడనగు ధాతను నేనే. ॥33॥

నీలకంఠీయము:— "అకారో వై సర్వావాక్" అను శ్రుత్యనుసారము అక్షరములలో అకారమును నేను. "ద్వంద్వ స్సామాసికస్య చ" సమాససముదాయములో ఉభయపదార్థప్రధానమగుట ద్వంద్వసమాసమును నేను. లేక, "సమం ఆసనం సమాసః" పండితులుగాని, గురుశిష్యులుగాని మంత్రార్థ మును చెప్పుకొనుటకై యొకప్రదేశమున గూర్చుండుట, అక్కడ కూర్చొని తెలిసికొనిన యర్థజాతము సామా సిక మనబడును. వానిలో "ద్వంద్వః" రహస్యమగు అర్థమును నేను. క్షయరహితమగు కాలమును నేను. కర్మ ఫలప్రదుడనగు విశ్వతోముఖుడను నేను. (సర్వప్రాణులు తృప్తినొందినచో నేను తృప్తుడ నగుదు నని యర్థము. ॥33॥

గీ॥ మృత్యు స్సర్వహర శ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తి శ్శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా ॥ ॥౩౪॥

పదవిభాగము:— మృత్యుః- సర్వహరః- చ- అహం- ఉద్భవః- చ- భవిష్యతాం- కీర్తిః- శ్రీః- వాక్- చ- నారీణాం- స్మృతిః- మేధా- ధృతిః- క్షమా ॥ ॥౩౪॥

ప్రతిపదార్థము:— సర్వహరః=ధనప్రాణములనుహరించు; మృత్యుః=మృత్యువు; అహం= నేనే; భవిష్యతాం=ఉత్కర్షప్రాప్తియోగ్యులయొక్క; ఉద్భవశ్చ=అభ్యుదయము, అభ్యుదయప్రాప్తి హేతువు; అహం=నేనే; నారీణాం=స్త్రీలయొక్క; కీర్తిః=కీర్తియు; శ్రీః=లక్ష్మియు; వాక్చ=వాక్కున్ను; స్మృతిః= స్మృతియు; ధృతిః=ధృతియు; క్షమా=ఓర్మియు; ఈయుత్తమగుణములన్నియు; అహం=నేనే; అస్మి= అయితిని. ॥౩౪॥

శాంకరభాష్యమ్:—

మృత్యు ర్ద్వివిధో ధనాదిహరః ప్రాణహర శ్చ సర్వహర ఉచ్యతే సోఽహ మిత్యర్థః । అథ వా పర ఈశ్వరః ప్రలయే సర్వహరణా త్సర్వహరః సోఽహమ్ । ఉద్భవ ఉత్కర్షోఽభ్యుదయ స్తత్ప్రాప్తిహేతు శ్చాహం, కేషాం భవిష్యతాం భావికల్యాణానా ముత్కర్షప్రాప్తియోగ్యానా మిత్యర్థః । కీర్తిః శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమేత్యేతా ఉత్తమాః స్త్రీణా మహ మస్మి యాసా మాభాసమాత్రసంబంధే నాపి లోకః కృతార్థ మాత్మానం మన్యతే ॥ ॥౩౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ధనమును హరించువాడు ఒకమృత్యువు. ప్రాణములను హరించువాడు రెండవ మృత్యువు. ఈరెండువిధములైన మృత్యువు నాస్వరూపమే. లేక ప్రలయకాలమునందు సర్వమును హరించుటవలన నీశ్వరుడు సర్వహరుడు. అట్టి యీశ్వరుడును నాస్వరూపమే. భావికల్యాణములుకలవారికి అనగా ఉత్కర్షప్రాప్తియోగ్యులకు ఉత్కర్ష అనగా అభ్యుదయము, అభ్యుదయప్రాప్తిహేతువు నాస్వరూపమే. కీర్తి, లక్ష్మి, వాక్కు, స్మృతి మేధ, ధృతి, క్షమ ఇవి స్త్రీల యుత్తమగుణములు. యే స్త్రీల యాభాసమాత్రసంబంధముచేతను గూడ లోకము తనను కృతార్థునిగ తలచునో అట్టి స్త్రీలయొక్క పైనిచెప్పబడిన కీర్త్యాది గుణములు నాస్వరూపమే. ॥౩౪॥

—• ౧౦వ అధ్యాయము ౩౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సంహారకారులలో సర్వసంహారకారియగు మృత్యువును నేను. భావికల్యాణములలో నుత్కర్షమును నేను. స్త్రీలలో కీర్తి; శ్రీ, వాక్, స్మృతి, మేధా, ధృతి, క్షమ యనెడు నేడుగుర ధర్మపత్నులు నేనే. ధార్మికుడుగా, ప్రశస్తుడుగా నానాదిగ్దేశీయసర్వలోకమువలన తెలియబడుట రూపమగు ఖ్యాతి కీర్తి యనబడును. ధర్మార్థకామసంపత్తు శ్రీ యనబడును. సర్వార్థప్రకాశకమైన సంస్కృతవాణి వాక్ అనబడును. (ఇట చ కారమువలన మూర్త్యాదికముగూడ గ్రహింపదగును.) చిరానుభూతార్థస్మరణశక్తి స్మృతి యనబడును. అనేకగ్రంథార్థధారణశక్తి మేధ యనబడును. అవసానకాలమందు

గీ॥ బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛన్దసా మహమ్ ।
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః ॥ ౹౩౫॥

పదవిభాగము:— బృహత్సామ- తథా- సామ్నాం- గాయత్రీ- ఛన్దసాం- అహం- మాసానాం- మార్గశీర్షః- అహం- ఋతూనాం- కుసుమాకరః ॥ ॥౩౫॥

ప్రతిపదార్థము:— సామ్నాం=సామములలో; బృహత్సామ=బృహత్సామ; అహం=నాస్వరూపమే; తథా=అట్లే; ఛన్దసాం= గాయత్ర్యాదిఛన్దోవిశిష్టఋక్కులలో; గాయత్రీ=గాయత్రి; అహం=నాస్వరూపమే; మాసానాం=మాసములలో; మార్గశీర్షః=మార్గశీర్షమాసము; అహం=నాస్వరూపమే; ఋతూనాం=ఋతువులలో; కుసుమాకరః=వసంతఋతువు; అహం=నాస్వరూపమే. ॥౩౫॥

శాంకరభాష్యం:—

బృహత్సామేతి । బృహత్సామ తథా సామ్నాం ప్రధాన మస్మి గాయత్రీ ఛన్దసా మహం గాయత్ర్యాదిఛందోవిశిష్టానా మృచాం గాయత్ర్యృగహ మిత్యర్థః। మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరో వసంతః ॥ ॥౩౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సామములలో బృహత్సామయు, గాయత్ర్యాదిఛన్దోవిశిష్టఋక్కులలో గాయత్రీఛన్దోవిశిష్టఋక్కున్ను, మాసములలో మార్గశీర్షమాసమున్ను, ఋతువులలో వసంతఋతువున్ను నాస్వరూపమే. ॥౩౫॥

గూడ శరీరేంద్రియసంఘాతధారణశక్తి ధృతి యనబడును. లేక, ఉచ్ఛృంఖలప్రవృత్తి కారణముచే చాపల్యము ప్రాప్తింప దానినుండి మరలెడి శక్తి ధృతి యనబడును. హర్షవిషాద కారణములు ప్రాప్తింప చిత్తము వికృతిని పొందకుండుట క్షమ యనబడును. ఈచెప్పినవాటియొక్క యాభాసమాత్రముచేతనే జనుడు సర్వులో కాదరణ పాత్రుడగునుగాన నివి స్త్రీలలో నుత్తమములు గాన నివన్నియు నావిభూతులని యర్థము. ॥౩౪॥

—• ౧౦ అధ్యాయము ౩౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వము "వేదానాం సామవేదోస్మి" అని చెప్పబడెను. అందునను మరియొక విశేషము గలదు. ఋగక్షరారూఢములగు గీతి విశేషములలో "త్వా మిద్ధి హవా వహే" అను ఋక్కునందు గీతివిశేషరూపమగు బృహత్సామ కలదు. అవిశేషము అతిరాత్రమునందు ప్రశ్నింపబడినది. ఆసామము సర్వేశ్వరస్వరూపమగు నింద్రునిస్తుతిరూపమై యున్నది. కాన అ య్యాది యితరసామలకంటె శ్రేష్ఠమైనదిగాన నాస్వరూపము. నియతాక్షర, పాద, రూపఛందోవిశిష్టములగు ఋక్కులలో గాయత్రిని నేను. (ద్విజాతులగు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు ద్వితీయజన్మప్రాప్తి హేతువగుటవలనను, ప్రాతస్సవనాదిసవనత్రయిహేతువగుటచేతను, సర్వశ్రేష్ఠమైనది గాయత్రి. మరియు సోమాహరణమునకై వెళ్ళిన త్రిష్టుప్, జగతీ, ఛందస్సులు సోముని తీసుకొని రాలేకపోయినవి. మరియు జగతీఛందస్సు మూడక్షరములను, త్రిష్టుప్పు ఛందస్సు ఒకయక్షరము హరితములు కాగా నాయక్షరములతోగూడ, సోముని తీసుకువచ్చుటచే గూడ సర్వశ్రేష్ఠమైనది. అట్టి గాయత్రిని నేను. పదురెండుమాసములలో మార్గశిరము అభినవశాల్యాదిక (సన్న వరి) ముచే నొప్పి శీతవాతాతపశూన్యమగుట సుఖహేతువు కాన యామార్గశిరమును నేను. ఋతువులలో సర్వసుగంధి కుసుమాకరమగుటచే నత్యాహ్లాదకరమైనది వసంతర్తువు. మరియు "వసన్తె బ్రాహ్మణ ముపన

యీత” “వసంతే బ్రాహ్మణోఽగ్నీ నాదధీత” “వసంతే వసంతే జ్యోతిషా యజేత । తద్వైవ వసన్త ఏవా భ్యారభేత । వసన్తో వై బ్రాహ్మణస్యర్తుః” అను మొదలగు శ్రుతి ప్రసిద్ధము. అట్టి వసంతర్తువును నేను. ॥35॥

పరమార్థ ప్ర కా:— సామలు ౧౦౧౮ సంఖ్యాకములై యున్నవి. వాటిలో నీశ్వరస్తావకములగు కొన్ని పావమాన్యములు, రథంతరాదులు కలవు. వానిలో బృహత్సామ నావిభూతియగును. (ఈవిషయమై ముందధ్యాయమున స్పష్టపరచెదము.) ఉష్ణిక్ ఛందస్సుమొదలగు ఛందస్సులలో గాయత్రి ప్రథమమైనది. “గాయన్తం త్రాయతే ఇతి గాయత్రీ” తన్నుగూర్చి గానము (జపము) చేయువాని రక్షించునది గాయత్రి యన బడును. మరియు నిరువదినాల్గక్షరములు గలది. దానినుండి నాలుగు అక్షరములు వృద్ధినొందుటచే ఉష్ణిగాది ఛందస్సులు నిష్పన్నము లగుచున్నవి. అట్టి గాయత్రియు పరమేశ్వర ప్రతిపాదకమగుటచే నాదు విభూతియే. (ఆగాయత్రిని వివరించుచుంటిమి. “తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి । ధియో యో నః ప్రచోద యాత్” దీనికి కాణ్వసంహితాభాష్యకారు లిట్లు వ్రాసిరి. యీగాయత్రికి విశ్వామిత్రుడు, ఋషి. సావి త్రియే గాయత్రి “తత్” అనునది షష్ఠీవిభక్తిచే మార్పుచెందును. “తస్య సవితుః=సర్వమునకు ప్రసవదాతయు “యోऽసా వాదిత్యే” అను శ్రుతిచెప్పున ఆదిత్యాంతర్గతపురుషుడగు; దేవస్య=హిరణ్యగర్భోపాధ్యవచ్ఛిన్ను డును; విజ్ఞానానందస్వభావుడును నగు బ్రహ్మముయొక్క; వరేణ్యం=సర్వోత్కృష్టమైన; భర్గః=తేజస్సును; ధీమహి=ధ్యానించెదము; లేక, ఆతేజస్సు యెట్టిదన? సవితుః సూర్యస్యాపి ఉపజీవ్యం= “యదాదిత్యగతం తేజః” అని చెప్పుటచే సూర్యునకుగూడ నుపజీవ్యమగునట్టిది. అని చెప్పుకొనదగును. “యః నః ధియః ప్రచో దయాత్=యేసూర్యునియొక్క తేజస్సు మా బుద్ధులను ప్రేరేపించుచున్నదో; ⁝తస్య సవితుః సంబంధి వరేణ్యం వీర్యం తేజః ధీమహి=అట్టి సూర్యుని వీర్యభూతమగు తేజస్సును ధ్యానించెదము; అని సంబంధించు కొనదగును. ఇట యీవిషయము చెప్పబడెను.— సత్యజ్ఞానానందాత్మకుడు, సర్వజగదుపాదానాశ్రయుడగుట జగత్కర్తయునగు పరబ్రహ్మము సర్వోపాధులతో గ్రీడింపదలచియు, ఆయుపాధిధర్మములను జయింపదల చియు, తన కమనీయత్వాది మహిమను జూపపదలచియు, స్వయముగ మాయను వశపరచుకొని, సర్వాత్మ లకు నాత్మభూతుడై యంతర్యామియై మాయొక్క బుద్ధులను ప్రేరేపించుగాక. అట్టి సవితృదేవుని సంబం ధమగు, సంసారక్లేశమూలభంజకమగు తేజస్సును యెల్లపుడు ధ్యానించెదము. అని యర్థము,) పదురెండు మాసములలో మార్గశీర్షమాసమును నేను. (మాసములుచాంద్రమానముచే నగుచున్నవి. చంద్రసంబంధముకల నక్ష త్రముయొక్క నామముతో వ్యవహరింపబడుచున్నవి. యెట్లనః— ఏమాసమందున్న పూర్ణిమయందు చిత్రానక్షత్ర మగుచున్నదో (చిత్రానక్షత్రముతో పూర్ణిమాచంద్రుడు కలియునో) ఆమాసము చైత్రమాసమని పిలువబడు చున్నది. ఇట్లే యన్నిటిని జూడనగును. ప్రకృతము మృగశిరసంబంధముచే మార్గశీర్షమాస మగుచున్నది. కాన మృగశిరకు స్వామి చంద్రుడగును. అట్లే “స్వనామ సమాననక్షత్రసమాననాథాః మాసాః” అని చెప్పబడుటవలన మాసముకూడ మార్గశీర్షమే యని వ్యవహరింపబడుచున్నది. ఆమాసమునందలి పూర్ణిమకు ప్రభువుకూడ మృగశీర్షాసంబంధముగల చంద్రుడే యగును. ఈవిధముగ మాస, నక్షత్ర, తిథులు ఒక్కొక్క దేవతారూపములుగనుక మార్గశీర్షమాసము నాయొక్కవిభూతియని యర్థము. లేక, మృగశిరః పూర్ణిమాసంబంధ ముచే వత్సరారంభము నిర్ణయింపబడును. “తస్మిన్నేవాగ్రహాయణీ” అను శ్రుతిచే అగ్రహాయణము గాన అగ్రహాయణి అని చెప్పబడును. కనుకనే “అగ్రహాయణికః”అనుమార్గశీర్షనామ ముపపన్నము. కాన నీమాసము శ్రేష్ఠ మగుటచే నావిభూతి యని యర్థము. శిశిరాదిషడృతువులలో వసంతర్తువు అందరకు నానందకరముగాన నావిభూతి యని యర్థము. ॥35॥

గీ॥ ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతా మహమ్॥ ॥౩౬॥

పదవిభాగము :— ద్యూతం-ఛలయతాం-అస్మి-తేజః-తేజస్వినాం-అహం-జయః-అస్మి-వ్యవసాయః-అస్మి-సత్త్వం-సత్త్వవతాం-అహమ్॥ ॥౩౬॥

ప్రతిపదార్థము :— ఛలయతాం=అభిభవము చేయువారలయొక్క=ద్యూతం= పాచికలు వేయుటయనెడిద్యూతము; తేజస్వినాం= తేజోవంతులయొక్క; తేజః=తేజస్సు; అహం=నేను; అస్మి=అయితిని; జేతౄణాం= (ఈపదమధ్యాహార్యము;) జయశీలురయొక్క; జయః=జయము; వ్యవసాయినాం= (ఈపద మధ్యాహార్యము) ఫలహేతువగు ఉద్యమముకలవారలయొక్క; వ్యవసాయః=వ్యవసాయము; సత్త్వవతాం సాత్త్వికులయొక్క; సత్త్వం=సత్త్వగుణము;అహం=నేనే; అస్మి=అయితిని; ॥౩౬॥

గీ॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనంజయః।
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః॥ ॥౩౭॥

పదవిభాగము:— వృష్ణీనాం-వాసుదేవః-అస్మి-పాండవానాం-ధనంజయః- మునీనాం- అపి అహం-వ్యాసః-కవీనాం-ఉశనా-కవిః॥ ॥౩౭॥

ప్రతిపదార్థము:— వృష్ణీనాం=యాదవులలో; వాసుదేవఃవాసుదేవుడను; అస్మి-అయితిని; పాండవానాం=పాండవులలో; ధనంజయః=అర్జునుడను; అస్మి=అయితిని; అహం=నేను; మునీనాం=సర్వపదార్థజ్ఞానముకలవారలలో; వ్యాసః=వ్యాసమునినై; అస్మి=అయితిని; కవీనాం= క్రాంతదర్శులలో; ఉశనా=శుక్రుడను అస్మి=అయితిని. ॥౩౭॥

శాంకరభాష్యమ్:—

ద్యూత మితి। ద్యూత మక్షదేవనాదిలక్షణం ఛలయతాం ఛలస్య కర్తౄణా మస్మి తేజ స్తేజస్వినా మహం, జయోస్మి జేతౄణామ్ వ్యవసాయోస్మి వ్యవసాయినాం సత్త్వం సత్త్వవతాం సాత్త్వికానా మహమ్॥ ॥౩౬॥

వృష్ణీనా మితి। వృష్ణీనాం వాసుదేవోఽస్మ్యయ మేవాఽహం త్వత్సఖా, పాండవానాం ధనంజయ స్త్వమేవ, మునీనాం సర్వపదార్థజ్ఞానినా మప్యహం వ్యాసః, కవీనాం క్రాంతదర్శినా ముశనా కవి రస్మి॥ ॥౩౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అభిభవముచేయువారల యక్షదేవనాది(పాచికలువేయుట)రూపమైన ద్యూతము, తేజశ్శాలురయొక్క తేజస్సు, నాస్వరూపమే. ।యస్వభావముకలవారల జయము, ఫలహేతువగు ఉద్యమముకలవారల వ్యవసాయము (ఫలహేతువగు ఉద్యమము) సత్త్వగుణవంతుల ధర్మజ్ఞాన వైరాగ్యాదిసత్త్వకార్యరూపమైన సత్త్వము నేనే యయితిని. ॥౩౬॥

యాదవులలో వాసుదేవుడనై, పాండవులలో అర్జునుడనై అయితిని. నిఖిలపదార్థజ్ఞానము కలవారలలో నేను వ్యాసమహర్షినై, క్రాంతదర్శులలో శుక్రాచార్యుడనై యయితిని. ॥౩౭॥

గీ॥ దణ్డో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్॥ ॥౩౮॥

పదవిభాగము:— దణ్డః-దమయతాం-అస్మి- నీతిః-అస్మి- జిగీషతాం-మౌనం- చ-ఏవ అస్మి-గుహ్యానాం-జ్ఞానం-జ్ఞానవతాం-అహమ్॥ ॥౩౮॥

ప్రతిపదార్థము:— అహం=నేను; దమయతాం=దమముకలుగ చేయువారలయొక్క; దండః దండము= (శిక్ష) అస్మి=అయితిని; జిగీషతాం=జయించెడియిచ్ఛకలవారల; నీతిః=నీతిస్వరూపము;అస్మి=అయితిని; గుహ్యానాం=గోప్యములలో; మౌనం=మౌనస్వరూపము; జ్ఞానవతాం=జ్ఞానవంతులయొక్క; జ్ఞానం= జ్ఞానము; అస్మి=అయితిని॥ ॥౩౮॥

—• ౧౦వ అధ్యాయము ౩౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "ద్యూతం...మహమ్" పరవంచనముచేయువారిద్యూతము సర్వస్వాపహార కారణమగుటచే నావిభూతి. అత్యుగ్రప్రభావముకలవారిదగు [అప్రతిహతాజ్ఞారూపమగు తేజస్సు నావిభూతి. పరాజితాపేక్షతో జూచిన యుత్కృష్ట మగు జయమును నేను. ఫలనిష్పత్తి పర్యంతము మందు యుద్యము నాస్వరూపము. సాత్త్వికులయొక్క జ్ఞానవైరాగ్యరూపమగు ధర్మమును నేను. ॥౩౬॥

—• ౧౦వ అధ్యాయము ౩౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— శ్రీకృష్ణభగవానులు సాక్షాదీశ్వరులైనను, విభూతి మధ్యమునందు చెప్పుట నన్ను భగవద్విభూతిగ నుపాసింపదగు నని తెల్పుటకై యని పూర్వమే చెప్పబడెను. వృష్ణివంశరాజులలో వాసుదేవపుత్రుడను, నీకుపదేష్టనగు నేను భగవద్విభూతిరూపుడను. పాండవులలో ధనంజయుడ వగు నీవు నావిభూతిస్వరూపుడవు. మననశీలురగువారిలో వ్యాసుడను నేను. క్రాన్తదర్శులగు (సూక్ష్మార్థవివేకముకల)వారిలో శుక్రుడను నేను. ॥౩౭॥

పరమార్థప్రపః— యాదవులలో వసుదేవపుత్రుడగు బలభద్రుడు నావిభూతిస్వరూపుడు. (ఇట తననే విభూతిరూపముగ జెప్పినచో నొకనికే ముఖ్యత్వము, విభూతిత్వము సంభవింపనేరవు. (శిష్టము గతార్థము.) ॥౩౭॥

—• ౧౦వ అధ్యాయము ౩౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— దాంతులు కాక యుత్పథప్రవృత్తులగువారిని సన్మార్గ మున ప్రవేశపెట్టెడివారి సంబుధమగు నిగ్రహహేతువగు దండమును నేను. జిగీషువులయొక్క జయోపాయ ప్రకాశక మగు నీతిని నేను. గోపనజేయవలసినవాటికి సంబంధించినమౌనమును నేను. లేక గోప్యములలో సన్న్యాస, శ్రవణ, మనన; పూర్వకముగ జేయు నిదిధ్యాసనరూపమగు మౌనమును నేను. జ్ఞానులయొక్క జ్ఞానమును (శ్రవణమనననిదిధ్యాసనాపరిపాకముచే నుత్పన్నమైన యద్వితీయాత్మసాక్షాత్కారరూపమైనదియు, సర్వ జ్ఞానవిరోధియు నగు జ్ఞానమును నేను.) ॥౩౮॥

—• ౧౦వ అధ్యాయము ౩౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సర్వభూతములకు ప్రరోహ కారణమైన మాయోపాధిక మగు యేచైతన్యము కలదో యయ్యది నేనే. ఓయర్జునా! భూతభవిష్యత్కాలిక మగు నన్ను విడచి చరాచర ములలో నేదియు లేదు. కాన సర్వము మత్కార్యమే యని యర్థము ॥౩౯॥

గీ॥ యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున! ।
న తదస్తి వినా య త్స్యా న్మయా భూతం చరాచరమ్ ॥ ॥౩౯॥

ప ద వి భా గ ము:— యత్-చ-అపి-సర్వభూతానాం-బీజం-తత్- అహం-అర్జున-న- తత్-అస్తి-వినా-యత్-స్యాత్-మయా-భూతం-చరాచరమ్ ॥ ॥౩౯॥

ప్రతి ప దా ర్థ ము:— సర్వభూతానాం=నిఖిలభూతములకు; యచ్చ=ఏ; బీజమపి=ప్రరోహ కారణమో; హేఅర్జున!=ఓయర్జునుడా; తదపి=ఆబీజమున్ను; అహం=నాస్వరూపమే; మయావినా=నాతోవిడచి; యత్=ఏది; స్యాత్=అగునో(ఉండునో)తత్=ఆ; భూతం=భూతము కాని; చరాచరం=జంగమస్థావరము కాని; నాస్తి=లేదు ॥ ॥౩౯॥

శాంకరభాష్యమ్:—

దండ ఇతి । దండో దమయతాం దమయితౄణా మస్మ్యదాంతానాం దమ కారణమ్, నీతి రస్మి జిగీషతాం జేతు మిచ్ఛతామ్. మౌనం చైవాస్మి గుహ్యానాం గోప్యానామ్, జ్ఞానం జ్ఞానవతా మహమ్ ॥ ॥౩౮॥

యచ్చాపీతి । యచ్చాపి సర్వభూతానాం బీజం ప్రరోహకారణం త దహ మర్జున!, ప్రకరణోపసంహారార్థం విభూతిసంక్షేప మాహ న త దస్తి భూతం చరాచరం చర మచరం వా మయా వినా య త్స్యా ద్భవే న్మయాఽపకృష్టం పరిత్యక్తం నిరాత్మకం శూన్యం హి తత్స్యా దతో మదాత్మకం సర్వ మిత్యర్థః ॥ ॥౩౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అదాంతులను శిక్షించువారల దమకారణమైన దండస్వరూపము, జయించుయిచ్ఛకలవారల జయస్వరూపము,గుహ్యములలో(రహస్యములలో)మౌనస్వరూపము, జ్ఞానవంతుల జ్ఞాన స్వరూపము నేను అయితిని. ॥౩౮॥

ఓయర్జునా! సర్వభూతములకు యేది ప్రరోహకారణమో అట్టి బీజమునాస్వరూపమే. నాతో విడచి అనగా నాచే పరిత్యక్తమై (నిరాత్మకమై శూన్యమై యేది యుండునో యట్టి భూతము కాని, చరాచరము కాని లేదు. కాన సర్వము మదాత్మకమే. ॥౩౯॥

శ ం క రా న ం దీ య ము:— పైవిధముగ విభూతివిశేషములను జెప్పి, యుపక్రాంతమైన విషయము నుపహరించుటకై "కార్యం సర్వం కారణమాత్రమేవ" అను న్యాయము ననుసరించి సామాన్యముగ సర్వము నేనే యని జెప్పుచున్నాడు— "యచ్చ...అర్జున! ఏది ఆకాశాదిసర్వభూతములకు "బీజం" అవ్యాకృత మనెడి సంభూతికారణము కలదో యదియు నేనే. (ఈచెప్పుటచే గార్యము కారణమాత్రమగుటవలన సర్వము నేనే యని సూచితమయ్యెను. సిద్ధమైన యర్థమునే వ్యతిరేకముఖముగా జెప్పుచున్నాడు— "నతదస్తి...చరాచరం" సచ్చిదానందానంత బ్రహ్మస్వరూపుడనగు నన్ను విడచి, (మత్సత్తతో) వ్యాప్తము కానిదియు, నాకంటె వేరగునదియునగు యేదియు) చరాచరములలో భూతభవిష్యత్కాలములలో నేదియు లేదు. సత్తుగాని, యసత్తుగాని నాకంటె వ్యతిరిక్తమగున దేదియు లేదని యర్థము. (ఈచెప్పుటచే:"బ్రహ్మైవేదం సర్వమ్" అను శ్రుతిచొప్పున సర్వము నేనే యని సిద్ధించినది.) ॥౩౯॥

గీ॥ నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా॥ ॥౪౦॥

పదవిభాగము:— న- అన్తః- అస్తి- మమ- దివ్యానాం- విభూతీనాం- పరంతప- ఏషః- తు- ఉద్దేశతః- ప్రోక్తః- విభూతేః- విస్తరః- మయా॥ ॥౪౦॥

ప్రతిపదార్థము:— హేపరన్తప!=శత్రువులను తపింపజేయుయర్జున!; మమ=నా సంబధమైన; దివ్యానాం=క్రీడాత్మకమగు; విభూతీనాం=విభూతులకు; అన్తః=అన్తము;(అవధి) నాస్తి=లేదు; ఏషః=ఈచెప్పబడిన; విభూతేః=విభూతులయొక్క; విస్తరస్తు=విస్తారముఅయితే; ఉద్దేశతః=సంక్షేపముగ; మయా=నాచేత; ప్రోక్తః=చెప్పబడెను. ॥౪౦॥

శాంకరభాష్యమ్:—

నాఽన్తోఽస్తీతి। నాఽన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం విస్తరాణాం పరన్తప న హీశ్వరస్య సర్వాత్మనో దివ్యానాం విభూతీనా మియత్తా శక్యా వక్తుం జ్ఞాతుం వా కేనచిత్। ఏష తూద్దేశత ఏకదేశేన ప్రోక్తో విభూతి ర్విస్తరో మయా॥ ॥౪౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శత్రువులను తపింపజేయు యోయర్జునా! నాసంబంధమైన దివ్యమైన (క్రీడాత్మకమైన) విభూతుల (విస్తారముల)కు అంతము (ఇయత్త) లేదు. ఎవనికిని సర్వాత్మ యగు యీశ్వరుని సంబంధమైన విభూతులయొక్క యియత్త చెప్పుటకుగాని తెలిసికొనుటకుగాని శక్యము కాదు. నాచే విభూతియొక్క విస్తారము యేకదేశముగ చెప్పబడెను. ॥౪౦॥

—• ౧౦వ అధ్యాయము ౪౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ప్రకరణార్థము నుపసంహరించుచు విభూతిని సంక్షేపించుచుండెను. "హేపరంతప!" కామక్రోధలోభాదియంతశ్శత్రువులను తపింపజేయు ఓయర్జునా! నాదివ్యములగు విభూతులకు అంతము లేదు. సర్వజ్ఞత్వము సన్మాత్రవిషయకమేగాన నావిభూతులు సర్వజ్ఞుడనగు నేనుగూడ తెలిసికొనుటకుగాని, చెప్పుటకుగాని శక్యముగానివి. ఈ విభూతులయొక్క విస్తారము ఏకదేశముగా నీకు చెప్పబడెను.

శంకరానందీయము:— ఈసమస్తజగత్తు నావిభూతియే. గాన నావిభూతులకంతము లేదని చెప్పుచున్నాడు.— నిర్వికారుడగు పరబ్రహ్మమునందు స్వకార్యములగు మహదాదులతోగూడ నావిర్భావతిరోభావములతో "దీవ్యతి" క్రీడించునదిగాన త్రిగుణాత్మకయగు మాయ దివ్య యనబడును. ఆమాయనుండి పుట్టెడి విభూతులు దివ్యము లనబడును. అట్టి నావిభూతులకు అంతము లేదు. (నామాయాశక్తులు, తద్వికారములుగూడ ననంతము లగుటవలన నావిభూతు లనంతములు. కాన వాటికి ఇయత్త లేదని యర్థము. అట్లగుచో "ఆదిత్యానా మహం విష్ణుః" ఇత్యాదికము నెట్లు చెప్పితివందువా? వినుము. "ఏషతే...మయా" ప్రస్తుతము నీకు చెప్పిన విభూతివిస్తారము నిన్నుగూర్చి సంక్షేపముగ జెప్పబడెనుగాని, విస్తరముగ జెప్పబడలేదు. (నాయొక్క విభూతి సాకల్యముగ తెలిసికొనుటకును, చెప్పుటకును కల్పకోటిశతములు ప్రయత్నించినను శక్యము గాదు.) ॥౪౦॥

గీ॥ య ద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా।
త త్త దేవావగచ్ఛ త్వం మమ తేజోంఽశసంభవమ్ ॥ ॥౪౧॥

పదవిభాగము:— యత్–యత్–విభూతిమత్–సత్త్వం–శ్రీమత్–ఊర్జితం–ఏవ–వా–తత్–తత్–ఏవ–అవగచ్ఛ–త్వం–మమ–తేజోంఽశసంభవమ్ ॥ ॥౪౧॥

ప్రతిపదార్థము:— లోకే=(ఈపదమధ్యాహార్యము) లోకమునందు; యద్యత్=ఏఏప్రాణిజాతము; విభూతిమత్=ఐశ్వర్యయుక్తమో; శ్రీమత్=లక్ష్మీయుక్తమో; లేక శోభాయుక్తమో; ఊర్జితమేవవా=బలాతిశయ యుక్తమో; తత్తత్=ఆయాప్రాణిజాతమును; త్వం=నీవు; మమ=నాయొక్క;(ఈశ్వరునియొక్క) తేజోంఽశ సంభవం=తేజస్సుయొక్కయేకదేశమువలన జనించినదానినిగ; అవగచ్ఛ=తెలిసికొనుము. ॥౪౧॥

శాంకరభాష్యమ్:—

యద్య దితి। యద్య ల్లోకే విభూతిమ ద్విభూతియుక్తం సత్త్వం వస్తు శ్రీమ దూర్జిత మేవ వా శ్రీ ర్లక్ష్మీ స్తయా సహిత ముత్సాహోపేతం వా తత్త దేవావగచ్ఛ త్వం జానీహి మమేశ్వరస్య తేజోంఽశసంభవం తేజసోంఽశ ఏకదేశ స్సంభవో యస్య త త్తేజోంఽశసంభవ మిత్యవగచ్ఛ త్వమ్ ॥ ॥౪౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లోకమునం దేయే ప్రాణివర్గము ఐశ్వర్యయుక్తమో లక్ష్మీసహితమో, లేక శోభాయుక్తమో, బలాద్యతిశయసహితమో ఆయా ప్రాణిజాతమునెల్ల యీశ్వరునియొక్క తేజస్సంబంధమైన యేకదేశమువలన జనించినదానినిగ నీవు తెలిసికొనుము. ॥౪౧॥

—• ౧౦వ అధ్యాయము ౪౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— చెప్పబడని భగవద్విభూతులనుగూడ సంగ్రహించుకొనుటకై యీయుపలక్షణమును చెప్పుచున్నాడు— "యద్యత్...సంభవం" ఏయే ప్రాణి, యైశ్వర్యయుక్తమో, సంపద్యుక్తమో, శోభాయుక్తమో అట్లే బలాద్యతిశయయుక్తమో ఆయా ప్రాణి నాయొక్క తేజోంఽశ(శక్త్యంశ)సంభవ మని తెలిసికొనుము. ॥౪౧॥

శంకరానందీయము:— నీవిభూతివిశేషములు నీవు సాకల్యముగ చెప్ప నలవిగానివి యగుచో వాటిని నేనెట్లు తెలుసుకొనగల్గుదును. అను నాశంకపై వక్ష్యమాణలక్షణములనుబట్టి నావిభూతిని తెలిసికొనదగు నను యాశయముతో జెప్పుచున్నాడు— "యద్యత్...సంభవమ్" ఈలోకమునగాని, పరలోకమునగాని యేయే ద్రవ్యము చేతనముగాని, యచేతనముగాని "విభూతిమత్" ప్రజాపత్యముయొక్కగాని, ప్రభావముయొక్కగాని, ధనముయొక్కగాని, పుణ్యకర్మలయొక్కగాని, విద్యయొక్కగాని, తపస్సుయొక్కగాని, శౌర్య, ధైర్య, ఔదార్య, శమ, దమాదిసద్గుణములయొక్కగాని, జ్ఞానముయొక్కగాని సమృద్ధికల్గి యుండునో అదియు, మరియు నెయ్యది "ఊర్జితమేవవా" ఓజస్సుచేగాని, తేజస్సుచేగాని, వేగముచేగాని, బలముచేగాని, పౌరుషముచేగాని, సారముచేగాని, ఆకారముచేగాని, దార్ఢ్యముచేగాని, ఉత్సాహముచేగాని ప్రకాశించునదియై యుండునో యదియును, మరియు "శ్రీమత్" శోభ, లక్ష్మి, కాంతి, సరస్వతి, బుద్ధి, కీర్తి, స్ఫూర్తి, వీటిలోనేదియైనకల్గియుండునో యదియు పరమేశ్వరుడనగునాయొక్క తేజోంఽశ(శక్తియొక్కకల)చే నుత్పన్నమైనదానిగ తెలిసికొనుము. (అట్టిదానిని పరమేశ్వరవిభూతివిశేషముగ తెలిసికొను మని యర్థము) ॥౪౧॥

గీ॥ అథ వా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున!!
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥ ॥౪౨॥

హరిః ఓమ్ తత్స దితి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం, సంహితాయాం, వైయాసిక్యాం
భీష్మపర్వణి, శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే,
శ్రీకృష్ణార్జునసంవాదే విభూతియోగోనామ
దశమోఽధ్యాయః ॥౧౦॥

పదవిభాగము:— అథ-వా-బాహునా-ఏతేన-కిం-జ్ఞాతేన -తవ-అర్జున-విష్టభ్య-అహం-ఇదం-కృత్స్నం-ఏకాంశేన-స్థితః-జగత్ ॥ ॥౪౨॥

ప్రతిపదార్థము:— హేఅర్జున=ఓయర్జునుడా; అథవా=అట్లు కానిచో; ఏతేన=ఈ; బహునా=విస్తారమైన; జ్ఞాతేన=తెలిసికొనుటచే; తవ=నీకు; కిం=ఏమిప్రయోజనము; అహం=నేను: ఇదం=ఈ; కృత్స్నం=సమస్తమైన; జగత్=జగత్తును; ఏకాంశేన=ఏకాంశచే; విష్టభ్య=విశేషముగస్తంభనమును (దృఢమును) చేసి; స్థితః=ఉంటిని. ॥౪౨॥

---

శాంకరభాష్యమ్:—

అథ వేతి । అథవా బహు నైతే నైవ మాదినా కిం జ్ఞాతేన తవార్జున స్యాత్సావశేషేణ । అశేషత స్త్వ మిమ ముచ్యమాన మర్థం శృణు విష్టభ్య విశేషతః స్తంభనం దృఢం కృత్వేదం కృత్స్నం జగ దేకాంశే నైకావయవే నైకపాదేన సర్వభూతస్వరూపే ణేత్యేతత్ । తథా చ మంత్రవర్ణః— "పాదోఽస్య విశ్వా భూతాని" ఇతి స్థితోఽహ మితి ॥౪౨॥

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిందభగవత్పూజ్యపాదశిష్య
శ్రీమదాచార్య శ్రీశంకరభగవతః కృతౌ శ్రీభగవద్గీతాభాష్యే
విభూతియోగో నామ దశమోఽధ్యాయః ॥౧౦॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓయర్జున! యిట్టితీరున సావశేషముగ తెలిసికొనుటచే నీకేమి ప్రయోజనము? నిరవశేషముగ నేను చెప్పబోవు విషయమును వినుము. నేనీ నిఖిలజగత్తును విశేషముగ స్తంభనమును,

---

—• ౧౦వ అధ్యాయము ౪౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అవయశః విభూతిని జెప్పి, సాకల్యముగ దానిని జెప్పుచున్నాడు— "అథవా" అనునది పక్షాంతరమునందు అను యర్థమున ప్రయుక్తము. సావశేషముగా ఎక్కువగా నీచెప్పుటచేతను, తెలిసికొనుటచేతను యేమి ప్రయోజనము? ఓయర్జునా! ఈసమస్తమగుజగత్తును ఏకదేశమాత్రముచే ధరించి, లేక, వ్యాపించి నేనే యుంటిని. "పాదోస్యవిశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" అను శ్రుతిచొప్పున నాకంటె వ్యతిరిక్తమగును దేదియు లేదని యర్థము.) కాన యీపరిచ్ఛిన్నదర్శనముచే నేమి ప్రయోజనము? అంతటను నన్నే చూడు మనియర్థము ॥౪౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—
(దృఢము) చేసి యేకావయవముచే సర్వభూతస్వరూపమైన యేకపాదముచే మంటిని. ఈవిష యమునే "పాదోఽస్య విశ్వా భూతాని"అను శ్రుతి బోధించుచున్నది. ॥౪౨॥

ఇట్లు నూరువేల సంఖ్య కలిగి, వ్యాసప్రోక్తము, సంహితారూపము నగు మహాభార
తమునం దంతర్గతమైన భీష్మపర్వమునందున్న యుపనిషద్రూపము, బ్రహ్మవిద్యా
రూపము, యోగశాస్త్రము నగు భగవద్గీతలయందున్న శ్రీకృష్ణార్జునసంవా
దమునందుగల విభూతియోగ మనుపేరి దశమాధ్యాయమునకు గౌత
మసగోత్రుడగు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ,దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన, ఆనందగిరీయవ్యాఖ్యానుసృత
శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని
సమాప్తము.
హరిః ఓమ్ తత్సత్.

---

శ్లో॥ కుర్వంతి కేపి కృతినః క్వచి దప్యనంతే స్వాంతం విధాయ విషయాంతరశాంతిమేవ । త్వత్పాద పద్మవిగలన్మకరందబిందు మాస్వాద్య మాద్యతి ముహు ర్మధుభి న్మనో మే ॥

తా॥ కొంతమంది పుణ్యాత్ములు(ధన్యులు)యనంతునియందు (పరబ్రహ్మమునందు) మనస్సును నిల్పి విషయాంతరములనుండి మరలించి శాంతిని సంపాదించుచుండిరి. ఓమధుసూదనా! నాయొక్క మనస్సనెడు భ్రమరము త్వత్పాదపద్మమునుండి స్రవించిన మకరందము నాస్వాదించి, మైమరపు నొందుచున్నది.

ఇట్లు శ్రీమధుసూదనసరస్వతీవిరచిత శ్రీమద్భగవద్గీతా దశమాధ్యాయ
గూఢార్థదీపికకు "తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణ,
దర్శనాలంకార" బులుసు అప్పన్నశాస్త్రి విరచిత
తాత్పర్యబోధిని సమాప్తము.

---

శంకరానందీయము:— ఈవిధముగ ముముక్షువులగు మందప్రజ్ఞు లుపాసించుటకై "ఇవి పరమాత్మయొక్క విభూతివిశేషముగాన పరమేశ్వరస్వరూపమే"యను జ్ఞానము కలుగుటకై 'ఆదిత్యానా మహం విష్ణుః' అనునదిమొదలుకొని "జ్ఞానం జ్ఞానవతా మస్మి" అనునంతవరకుగల గ్రంథభాగముచే దన విభూతివిశేషములను ప్రతిపాదించి, ప్రస్తుతము విభూతివిశేషజ్ఞానము, తదుపాసనయు నకించిత్కర మని సూచించి, తద్ద్వారమున సవిశేషపరమేశ్వరునే యధికారుల కుపాసనీయయవస్తువునుగ ఉపదేశించుచు నీయ ధ్యాయము నుపహరించుచుండెను. "అథ వా...అర్జున" నాసంబంధమగు విభూతులు అనంతములు. కాన చెప్పుటకు, తెలిసికొనుటకుగూడ నవి శక్యముకానివి. అదియునుకాక, ఇది నావిభూతి, ఇది నావిభూతి యని నావిభూతు లనేకము చెప్పబడినను, శుద్ధాత్మవు, ముఖ్యాధికారివి యగు నీకు బహుప్రకార మద్విభూతివిషయకజ్ఞానముచే నేమి ఫలము ప్రాప్తించును? (అట్టి విభూతిజ్ఞానముచేగాని, తదుపాసముచేగాని, చిత్తశుద్ధిగాని, మోక్షముగాని (యేమియుఫలము)ప్రాప్తింప దని యర్థము.

విష్ణ్వాదివ్యక్తివిశేషములుగూడ విభూతివిశేషములేగాన తదుపాసనముచేతను, తజ్జ్ఞానముచేతను, ముఖ్య మగు ఫలము గలుగుచునే యున్నదందువా? అట్లు కాదు. విభూతివిశేషములుగూడ ననంతములుగాన

నానియం దీశ్వరత్వబుద్ధి కలుగుచో ననేకేశ్వరత్వజ్ఞానము కలుగును. అది మోక్షహేతువు కానేరదు. మఱియు విభూతుల కానంత్య మున్నచో నట్టి విభూతుల నొక డుపాసింప శక్యము గాకుండును. ఆవిభూతుల గుణవిశేషతారతమ్యము ననుసరించి యుపాసకుని చిత్తము రాగద్వేషాదికలుషితమే యగును కాని ప్రసన్నము గానేరదు. కాన ముముక్షువువు ముఖ్యాధికారివి యగు నీవు సర్వాత్మకుడ నగు నన్నొకనినే సంసారబంధ ముక్తికై సేవింపుము. అని సూచించుటకై చెప్పుచుండెను:— "విష్టభ్య...జగత్" నిర్విశేషపరబ్రహ్మ స్వరూపుడ నగు నేనే యీపరిదృశ్యమానము, మాయాకార్యము, స్థావరజంగమాత్మకము నగు సమస్త ప్రపంచకమును ఏకాంశతో (ఏకపాదముతో) వ్యాపించియుంటిని. ఎట్లు ఆకాశము నిరవయవమైనను మేఘావచ్ఛిన్న మగుచో దానికి మేఘాకాశమని భాగకల్పనము జేయుచుంటిమో, అట్లే పరమాత్మ నిరంశ మైనను మాయా తత్కార్యావచ్ఛిన్నమైన తదుపహితచైతన్యమున కంశత్వము కల్పింపబడుచున్నది. అట్టి కల్పితాంశచే "పాదోऽస్య విశ్వా భూతాని" అనుశ్రుతిచెప్పిన మాయోపాధికమగు పాదముచే) అంతటను వ్యాపించి ప్రపంచరూపముగ నేనే యుంటినని యర్థము.) "సహస్రశీర్షా పురుషః । సహస్రశీర్షం దేవం" అనుశ్రుతిప్రసిద్ధవిశ్వరూపుడ నగు నన్నొకనినే యీశ్వరునిగ భజించిన కృతార్థుడవు కాగలవని యర్థము. ||౪౨||

ఇట్లు శ్రీశంకరానందసరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా దశ
మాధ్యాయవాక్యతాత్పర్యబోధినికి "తర్కరత్న, న్యాయ
వేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార" బులుసు
అప్పన్నశాస్త్రిచే రచింపబడిన తాత్పర్య
బో ధి ని స మా ప్త ము.

---

శ్రీ ధ రీ య ము:— శ్లో|| "ఇంద్రియద్వారత శ్చిత్తే బహి ర్ధావతి సత్యపి । ఈశదృష్టివిధానాయ విభూతీ ర్దశమేऽబ్రవీత్||" తా|| చంచలస్వభావముకల చిత్తము ఇంద్రియములద్వారా వెలుపలను (విషయములపై పునను) పరుగిడుచున్నను, ఆయాబహిర్వస్తువులయందుగూడ ఈశ్వరదృష్టినే యలవరచుకొనుటకై యీదశమాధ్యాయమున విభూతివిశేషములు చెప్పబడెను. (శేషము గతార్థము.) ||౪౨||

ఇట్లు శ్రీధరస్వామివిరచిత శ్రీభగవద్గీతా దశమాధ్యాయటీకకు "తర్కరత్న,
న్యాయవేదాన్తవిద్యాపారీణ, దర్శనాలంకార" బులుసు
అప్పన్నశాస్త్రివిరచిత తాత్పర్యబోధిని సమాప్తము.

భా ష్యో త్క ర్ష దీ పి క:— ఈవిధముగ సంక్షేపముగను, విస్తరముగను విభూతులను జెప్పి, శక్తు డగు యర్జును నుద్దేశించి చెప్పుచున్నాడు.— శుద్ధచిత్తుడవు, శక్తుడవు నగు నీకు చిత్తశోధక మగు నీవిభూతి విశేషకథనముతో నేమి ప్రయోజనము? (శుద్ధచిత్తముకల అను యర్థముకల "అర్జున!" అను సంభోధనము పూర్వోక్తవిషయమునే సూచించుచున్నది.) అట్లగుచో నేనిక దేని నుపాసింపదగునను ప్రశ్నపై జెప్పుచు న్నాడు.— "విష్టభ్య...జగత్" "పాదోऽస్య విశ్వా భూతాని" యీసర్వజగత్తును యేకాంశముతో స్తంబ నముజేసి నేనుంటిని. లేక, యీశ్లోకముచే నర్జునపృష్టమైన యోగము వివరింపబడెను. ఈవిధముగ దశమా ధ్యాయముచే జ్ఞేయము, జ్ఞానోపాయము నగు యోగవిభూతిమత్తగు ధ్యేయజ్ఞానమును వివరించి తత్పదార్థము నిరూపింపబడెను. ||౪౨||

ఇట్లు ధనపతిసూరివిరచిత శ్రీభగవద్గీతాదశమాధ్యాయ భాష్యోత్కర్షదీపికకు "తర్కరత్న,
న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార" బులుసు అప్పన్నశాస్త్రి
విరచిత తాత్పర్యబోధిని స మా ప్త ము.

పరమార్థప్ర పా:— విభూతివిశేషమును తెలిసికొనుట పరచ్ఛిన్నదర్శనము. అట్టి పరిచ్ఛిన్నదర్శనముతో ప్రయోజన మేమియు లేదు. కాన వృక్షన్యాయమున సమష్టివ్యష్ట్యాత్మకుడను నేనే యని యీశ్లోకమున జెప్పుచున్నాడు:— ఈసమస్తచరాచరజగత్తును ఏకాంశముచే వ్యాపించి నేనుంటిని. ("పాదోస్య విశ్వాభూతాని" అను శ్రుతియు నీవిషయమునే జెప్పుచున్నది.) ఋగ్వేదమునందు "కిం స్వి ద్వనం క ఉ స వృక్ష ఆస యతో ద్యావా పృథివీ నిష్టతక్షుః । మనీషిణో మనసా పృచ్ఛతేవ తద్యదధ్యతిష్ఠ ద్భువనాని ధారయన్" అని. దీనికి భాష్యానుసృతార్థము:— పూర్వఋక్కునందు బ్రహ్మమే భూమ్యాదికారణమని చెప్పబడెను. ఆవిషయమే ప్రశ్నకథనవ్యాజమున చెప్పబడుచుండెను. లోకమున పెద్దమేడను నిర్మించువాడు ఒక గొప్పవనమున యొక పెద్దవృక్షమును ఛేదించి వడ్రంగులద్వారా దానికవసరమగు సామగ్రిని సంపాదించును. అట్లే ఇట ప్రస్తుతము ప్రేరకుడు పరమేశ్వరుడు. జగత్స్రష్టలు యేవనమునుండి యేవృక్షమును స్వీకరించి ద్యావాపృథువులను నిర్మించిరి. అట్టి వనమునకు పేరేమి? ఆవృక్ష మేద్రై యుండును? ఓమనస్సునకు ప్రభువులారా! యారెండును జిజ్ఞాసాయుక్తమైన మనసుచే ప్రశ్నింపబడుచున్నది వలె నున్నవి. మరియు నీశ్వరుడు భువనములను ధరించుచు ఏస్థానము నధిష్ఠించె ననునదియు యొక ప్రశ్నము. ఈప్రశ్న లన్నిటికి సమాధానము "బ్రహ్మవనము బ్రహ్మవృక్షమని చెప్పబడెను," అనగ సమష్టివ్యష్టిరూపముగ బ్రహ్మమే యని సమాధానము. ఈచెప్పుటచే ముందధ్యాయమునకు సంగతిగూడ జూపబడెను. ॥౪౨॥

శ్లో॥ అత్యంతోత్కర్షశాలీ నను భవతి సతతమిహాముత్ర సర్వోత్తమోహం, త్వేకైకోత్కర్షభాజః సురమునిమనుజశ్వాపదాద్యాస్త ఏతే । వ్యష్టిరూపా మదంశా ఇతి ఖలు భవతా పూజనీయాః క్రమేణ, తేన ద్రష్టృ స్యథో మా మిహ మయి దశమే ప్రాహ పార్థం పరాత్మా ॥

తా॥ ఈదశమాధ్యాయమున- శ్రీకృష్ణపరమాత్మ యర్జునునిగూర్చి- అంతములేని యుత్కర్ష (ఐశ్వర్య) ముతో నేనెల్లపుడు నొప్పుచుందును. కాన యీలోకమునను, పరలోకమునను సర్వోత్తముడను నేనే. ఒక్కొక్క యుత్కర్షగల సుర, ముని, మనుజ, మృగాదులు నాయొక్క విభూతివిశేషములు. ఇవన్నియు నాయొక్క వ్యష్టిరూపములు, నాయంశములు గాన పూజ్యములు. నిట్టి వ్యష్ట్యుపాసనముచే గ్రమముగ సమష్టిరూపుడనగు నన్ను తెలిసికొనగలవు. అని చెప్పెను.

ఇట్లు దైవజ్ఞపండిత విరచిత శ్రీభగవద్గీతాదశమాధ్యాయ పరమార్థప్రపకు
"తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

నీలకంఠీయము:— మందప్రజ్ఞులకై యీవిభూతులను చెప్పితిని. ఇక నీవన్ననో యీచెప్పబోవు విషయమును తెలిసికొనుము. "పాదోస్య విశ్వా భూతాని" అను శ్రుత్యుక్తరీతిని నీసర్వజగత్తును యేకాంశతో వ్యాపించి నేనుంటిని. కాన పరిచ్ఛిన్న దర్శనమును వీడి యంతటను బ్రహ్మమును జూడుము. ॥౪౨॥

ఇట్లు శ్రీనీలకంఠాచార్య విరచిత శ్రీభగవద్గీతా దశమాధ్యాయ భారతభావ
దీమునకు బులుసు వెంకటశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

దశమాధ్యాయము సమాప్తము.

హరిః ఓం తత్సద్బ్రహ్మార్పణ మస్తు.

శుభమస్తు.

# శ్రీభగవద్గీతా శాంకరభాష్యతత్త్వబోధిని

## ఏకాదశోఽధ్యాయః.

### విశ్వరూపదర్శనయోగః।

అర్జున ఉవాచ:—

గీ॥ మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్ ।
యత్త్వయోక్తం వచ స్తేన మోహోఽయం విగతో మమ ॥ ॥౧॥

పదవిభాగము:— అర్జునః- ఉవాచ- మదనుగ్రహాయ- పరమం- గుహ్యం- అధ్యాత్మసంజ్ఞితమ్- యత్- త్వయా- ఉక్తం- వచః- తేన- మోహః- అయం- విగతః- మమ ॥ ॥౧॥

ప్రతిపదార్థము:— అర్జునః=అర్జునుడు; ఉవాచ=పలికెను; మదనుగ్రహాయ= మత్=నాయొక్క; అనుగ్రహాయ=అనుగ్రహముకొరకు; త్వయా=నీచే; యత్=ఏ; పరమం=ఉత్కృష్టమైన; గుహ్యం=రహస్యమైన; అధ్యాత్మసంజ్ఞితం=ఆత్మానాత్మవివేకవిషయకమైన; వచః=వాక్యము; ఉక్తం=చెప్పబడెనో; తేన=ఆవాక్యముచే; మమ=నాయొక్క; అయం=ఈ; మోహః=అవివేకబుద్ధి; విగతః=పోగొట్టబడెను. ॥౧॥

శాంకరభాష్యమ్;—

భగవతో విభూతయ ఉక్తా స్తత్ర చ "విష్టభ్యాఽహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ।" ఇతి భగవతాఽభిహితం శ్రుత్వా య జ్జగ దాత్మరూప మాద్య మైశ్వరం తత్సాక్షాత్కర్తు మిచ్ఛన్— మదనుగ్రహాయ మమానుగ్రహార్థం పరమం నిరతిశయం గుహ్యం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భగవంతుని విభూతులు చెప్పబడెను. అందునను "విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్"అని భగవంతునిచే చెప్పబడిన విషయమును విని యే జగత్తు ఆత్మస్వరూపమై ఆద్యమైన ఐశ్వర్యమో (ఈశ్వరసంబంధమైన ఆద్యమగు ఆత్మస్వరూపమైన జగత్తును)

—• ౧౧వ అధ్యాయము ౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వాధ్యాయమున నానావిభూతులను జెప్పి, "విష్టభ్యాహమహం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" అనుదానిచే విశ్వరూపమగు పరమేశ్వరరూపమును జెప్పెను.

శాంకరభాష్యమ్:—

గోప్య మధ్యాత్మసంజ్ఞిత మాత్మానాత్మవివేకవిషయం యత్త్వయోక్తం వచో వాక్యం తేన తే వచసా మోహోఽయం విగతో మమావివేకబుద్ధి రపగతే త్యర్థః ॥ ॥౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సాక్షాత్కరింపజేసుకొను యిచ్ఛకలవాడై యర్జును డిట్లు పలికెను. ఓ శ్రీకృష్ణ! నన్ను ననుగ్రహించుటకై నిరతిశయము, గోప్యము, ఆత్మానాత్మవివేకవిషయకము నైన యేవాక్యము నీచే చెప్పబడెనో అట్టివాక్కుచే నాయొక్క యవివేకబుద్ధి తొలగింపబడెను. ॥౧॥

దానిని యర్జునుడువిని పరమోత్కంఠితుడై యావిశ్వరూపమును జూచు నిచ్ఛగలవాడై పూర్వోక్తవిషయము నభినందించుచున్నాడు— "మదనుగ్రహాయ...మమ" శోకమోహనివృత్త్యుపకారరూపానుగ్రహమునకై "పరమం" నిరతిశయపురుషార్థపర్యవసాయియు, గోప్యము, "అధ్యాత్మసంజ్ఞితం" ఆత్మానాత్మవివేక విషయకము, "అశోచ్యా నన్వశోచ స్త్వం" అనునది మొదలుకొని షష్ఠాధ్యాయపర్యంతము త్వంపదార్థ ప్రధానమునగు యేవాక్యము పరమకారుణికుడవగు నీచే చెప్పబడినదో యట్టివాక్యముచే "నేను వీరలను హంతను, నాచే వీరు హింసింపబడుదురు, నాచే వారు హింసింపబడుదురు." అను వివిధవిపర్యాసరూపమగు; యనుభవ సాక్షికమగు నాయొక్క మోహము నష్టమైనది. (ఆవాక్యమున (గ్రంథమున) యనేకసారులు ఆత్మ సర్వ క్రియాశూన్యమని చెప్పుటచే మోహము నష్టమైనదని యర్థము.) ॥౧॥

శంకరానందీయము:— దశమాధ్యాయమునందు మందప్రజ్ఞులకు మనశ్శుద్ధిద్వారమున మోక్షసిద్ధికొరకు తనవిభూతివిశేషముల నుపాసనార్థము ప్రతిపాదించి, అమందప్రజ్ఞులకు "విష్టభ్యాహం" అను దానిచే సోపాధికము, విశ్వాత్మకమునగు యీశ్వరస్వరూపము నుపాస్యముగ సూచించి, ప్రస్తుత మర్జున ప్రార్థనముచే మాయావిలాసవిజృంభితము, అత్యద్భుతము, విశ్వరూపమునగు స్వరూపమును జూపుటకై తన నుండియే సృష్ట్యాదిక్రియను తెలుపుటకును, స్వసాక్షాత్కార మతిదుర్లభ మైనదనియు, నది భక్త్యైకలభ్యమేయని తెల్పుటకును యీయేకాదశాధ్యాయ మారంభింపబడుచున్నది. అందు ప్రథమమున సర్వజగత్కారణము, సర్వాత్మకము, సర్వైశ్వర్యసంపన్నమునగు స్వరూపము తన కుపాస్యముగావిని, యట్టి స్వరూపమును సాక్షాత్కరింప జేసుకొను నిచ్ఛగలవాడై భగవత్కృతానుగ్రహానువాదముచే శ్రీకృష్ణభగవానుని యభిముఖునిగ జేసికొనుటకై యర్జునుడిట్లు చెప్పుచుండెను.— "మదనుగ్రహాయ" "యీనానాసంబంధులగు భాతృపుత్రాదులు మరణించుచుండిరి. వీరికి నేను హంతను" అని శోకసాగరమమున మునిగిననన్ను అనుగ్రహించుటకై యాత్మయాథాత్మ్య ప్రకాశకమగు "అశోచ్యా నన్వశోచ స్త్వం, నాయం హన్తి న హన్యతే, న జాయతే మ్రియతే వా కదాచిత్, వేదాఽవినాశినం నిత్యం, అచ్ఛేద్యోఽయం" అను మొదలగు పరమార్థవిషయకము, "పరమం" కర్తృత్వ, భోక్తృత్వ భ్రమాపనోదక మగుటచే నుత్కృష్టము, కనుకనే "గుహ్యం" నసద్ధర్ములు, అశ్రద్ధధానులు నగువారికి యుపదేశింపదగనిదియు నగు యేవాక్యము నీచే యుపదేశింపబడినదో యట్టి యాత్మానాత్మప్రకాశకమగునదియు, మిథ్యాజ్ఞాననివర్తకమగునదియు నగు ఆవాక్యముచే బూర్వోక్తమగు చిత్తభ్రమము పూర్తిగ పోయినది. (నీయనుగ్రహముచే వినష్టమోహుడ నయితినని యర్థము.) ॥౧॥

గీ॥ భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమలపత్రాక్ష! మాహాత్మ్య మపి చావ్యయమ్ ॥ ॥౨॥

పదవిభాగము:— భవాప్యయౌ– హి– భూతానాం– శ్రుతౌ– విస్తరశః– మయా– త్వత్తః– కమలపత్రాక్ష– మాహాత్మ్యం– అపి– చ– అవ్యయమ్ ॥ ॥౨॥

ప్రతిపదార్థము:— హేకమలపత్రాక్ష=తామరరేకులవంటినేత్రములుకలయోశ్రీకృష్ణపరమాత్మ; త్వత్తః=నీవలన; భూతానాం=భూతములయొక్క; భవాప్యయౌ=ఉత్పత్తిప్రలయములు; మయా=నాచే; విస్తరశః=విస్తారముగ; శ్రుతౌ=వినబడినవి; అవ్యయం=నాశరహితమైన; మాహాత్మ్యమపి=మాహాత్మ్యమున్ను; శ్రుతం=వినబడినది. ॥౨॥

శాంకరభాష్యమ్:—

కిం చ— భవ ఉత్పత్తిరప్యయః ప్రలయో భూతానాం తౌ భవాప్యయౌ శ్రుతౌ విస్తరశో మయా న సంక్షేపత స్త్వత్త స్త్వత్సకాశాత్కమలపత్రాక్ష కమలస్య పత్రం కమలపత్రం తద్వ దక్షిణీ యస్య తవ స త్వం కమలపత్రాక్షో హేకమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయ మక్షయం శ్రుత మిత్యనువర్తతే ॥ ॥౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

తామరరేకులవంటి నేత్రములు కల యోశ్రీకృష్ణపరమాత్మ! నీవలన భూతముల యొక్క యుత్పత్తిప్రలయములు నాచే విస్తారముగ వినబడెను. మరియు మహాత్ముడవగు నీసంబంధమైన మాహాత్మ్యము అనగా పారమార్థికము, సోపాధికము నగు సర్వాత్మత్వాదికమున్ను శ్రుతము. ॥౨॥

—• ౧౧వ అధ్యాయము ౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సప్తమాధ్యాయము మొదలుకొని దశమాధ్యాయపర్యంతము తత్పదార్థప్రధానమైన నీయుపదేశమును వింటి నని చెప్పుచున్నాడు—"భవాప్యయౌ...చావ్యయమ్" భూతములయొక్క యుత్పత్తిలయములు నీవల్లనే కల్గుచుండును. వాటివిషయమై సవిస్తరముగ నీనుండియే వింటిని. ఓపుండరీకాక్ష! విశ్వసృష్ట్యాదికర్తృత్వ మున్నను అవికారిత్వము, శుభాశుభకర్మకారయితృత్వ మున్నను యవైషమ్యము, బంధ,మోక్షాదివిచిత్రఫలదాతృత్వమున్నను అసంగిత్వము, ఔదాసీన్యత్వము, మరియు నితర మగు సర్వాత్మత్వాదికము మొదలగు నీమాహాత్మ్యమును సోపాధికము, నిరుపాధికము నవ్యయము నగు దానిని వింటిని. ॥౨॥

శంకరానందీయము:— ద్వైవిధముగ భగవత్కృతోపకారానువాదపురస్సరముగా స్తుతించి భగవత్స్వరూపమును జూచు నిచ్ఛతో దన్మాహాత్మ్యమునుగూడ స్తుతించుచుండెను— "కం బ్రహ్మ సుఖం స్వరూపానంద స్తం అలతి ప్రకాశయతీతి కమలం ఆత్మజ్ఞానం, తదేవ పతనాత్త్రాయత ఇతి పత్రం, కమలం చ తత్పత్రం చ కమలపత్రం తేన అక్షతే ప్రాప్యత ఇతి కమలపత్రాక్ష!" (స్వరూపానందము "కం" అనబడును. దానిని ప్రకాశింపజేయు ఆత్మజ్ఞానము "కమల" మనబడును. ఆయాత్మజ్ఞానమే సంసారమునుండి రక్షించునుగాన కమలపత్ర మనబడును. అట్టి ఆత్మజ్ఞానముచే పొందబడు వాడు "కమలపత్రాక్షు" డనబడును.) జ్ఞానైకగమ్యుడ వగు నో శ్రీకృష్ణప్రభూ! "అహం కృత్స్నస్య జగతః ప్రభవః

గీ॥ ఏవ మేత ద్యథాత్థ త్వ మాత్మానం పరమేశ్వర ।
దృష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ ॥ ॥౩॥

పదవిభాగము:— ఏవం- ఏతత్- యథా- అత్థ-త్వం- ఆత్మానం- పరమేశ్వర- ద్రష్టుం- ఇచ్ఛామి- తే- రూపం- ఐశ్వరం- పురుషోత్తమ! ॥ ॥౩॥

ప్రతిపదార్థము:— హేపరమేశ్వర!=ఓపరమేశ్వరుడా! త్వం=నీవు; యథా=ఏవిధముగ; ఆత్మానం=ఆత్మస్వరూపమును; అత్థ=చెప్పుచుంటివో; ఏతత్=ఇది; ఏవం=ఇట్టిదే; హేపురుషోత్తమ!=ఓపురుషోత్తముడా!; తే=నీయొక్క; ఐశ్వరం=ఈశ్వరసంబంధమైన; రూపం=రూపమును; ద్రష్టుం=చూచుటకొరకు; ఇచ్ఛామి=ఇచ్ఛయించుచుంటిని. ॥౩॥

శాంకరభాష్యమ్:—

ఏవ మితి । ఏవ మేత న్నాన్యథా యథా యేన ప్రకారేణాఽఽత్థ కథయసి త్వ మాత్మానం పరమేశ్వర తథాఽపి ద్రష్టు మిచ్ఛామి తే తవ జ్ఞానైశ్వర్యశక్తిబలవీర్యతేజోభిః సంపన్న మైశ్వరం వైష్ణవం రూపం పురుషోత్తమ! ॥ ॥౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓపరమేశ్వరుడవగు శ్రీకృష్ణపరమాత్మ! నీవు యేతీరుగ చెప్పుచుంటివో అది యట్లే. మరియొకవిధముగ కాదు. ఓపురుషోత్తముడా! నీయొక్క జ్ఞానైశ్వర్యశక్తిబలవీర్యతేజస్సులతో గూడిన వైష్ణవరూపమును చూచుట కిచ్ఛ యించుచుంటిని. ॥౩॥

ప్రలయ స్తథా'' ప్రకృతిం స్వా మవష్టభ్య ''అహం సర్వస్య ప్రభవః''అని నీనుండి ఆకాశాదిభూతములయొక్కయు, తత్కార్యములయొక్కయు, నన్నింటియొక్క యుత్పత్తిప్రలయములను వింటిని. మరియు ''అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ । సర్వభూతమహేశ్వరం, మత్తః సర్వం ప్రవర్తతే'' అనుదానిచే చెప్పబడిన మాహాత్మ్యమును, సర్వేశ్వరత్వమును గూడ వింటి. ॥౨॥

—• ౧౧వ అధ్యాయము ౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఓపరమేశ్వర! ఏవిధముగా నిరుపాధికము, సోపాధికమునగు నిరతిశయైశ్వర్యముతో కూడిన స్వరూపము నెట్లు తెలిపితివో యది యట్లే. (నీవాక్యమునం దవిశ్వాసము లేదు.) అట్లైనను ఓపురుషోత్తముడా! జ్ఞానైశ్వర్యశక్తిబలవీర్యతేజస్సులతోకూడిన నీస్వరూపమును జూచి కృతార్థుడ నగుటకై కోరుచుంటిని. (ఇట''పురుషోత్తమ''అనుసంబుద్ధిచే నీవాక్యమునం దవిశ్వాసములేదు. ఇక నేమన:నీస్వరూపమును జూచు వేడ్క మెండయ్యె ననియు, ఈవిషయమును సర్వజ్ఞుడ వగుటవలనను, సర్వాన్తర్యామివగుటవలనను నీవెరుగుదు ననియు సూచింపబడెను.) ॥౩॥

శంకరానందీయము:— నీవు చెప్పిన దంతయు సత్యమే యని చెప్పుచున్నాడు— ''సర్వాతిశయమహత్వా త్పరమః, సర్వవ్యాపృతిహేతుత్వా దీశ్వరః, పరమశ్చాసా వీశ్వరశ్చ పరమేశ్వరః'' పరమమహత్త్వము, సర్వవ్యాపృతిహేతుత్వము కల యోపరమేశ్వర! సర్వజ్ఞుడ వగు నీవు చెప్పినట్లు నీస్వరూపము సర్వకారణము, సర్వవ్యాపకము, సర్వమును నియమించెడిది యగును. ఈశ్వరవాక్యము మరొకవిధముగ గాకుండును. కాన యావిషయమైు శంకింప నవసరము లేదు. ఇకనేమన: నీయనుగ్రహపాత్రుడ

గీ॥ మన్యసే యది త చ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో ।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్ ॥ ॥౪॥

పదవిభాగము:— మన్యసే- యది- తత్- శక్యం- మయా- ద్రష్టుం- ఇతి- ప్రభో- యోగేశ్వర- తతః- మే- త్వం- దర్శయ- ఆత్మానం- అవ్యయమ్ ॥ ॥౪॥

ప్రతిపదార్థము:— హేప్రభో=ఓస్వామి; మయా=నాచే;(అర్జునునిచే) తత్=ఆవైష్ణవరూపము; ద్రష్టుం=చూచుటకొరకు; శక్యం=శక్యమైనది; ఇతి=ఈలాగున; త్వం=(ఈపదమధ్యాహార్యము)నీవు; మన్యసే యది=తలచితివేని; హేయోగేశ్వర!=ఓయోగములకు ప్రభువగు శ్రీకృష్ణపరమాత్మ; తతః=నేనత్యంతమర్థిని యగుటవలన; త్వం=నీవు; మే=నాకొరకు; అవ్యయం=నాశరహితమైన; ఆత్మానం=ఆత్మస్వరూపమును; (నీస్వరూపమును;) దర్శయ=చూపుము. ॥౪॥

శాంకరభాష్యం:—

మన్యస ఇతి । మన్యసే చింతయసి యది మయాఽర్జునేన తచ్ఛక్యం ద్రష్టు మితి ప్రభో స్వామి న్యోగేశ్వర యోగినో యోగా స్తేషా మీశ్వరో యోగేశ్వరో హే యోగేశ్వర! యస్మా దహ మతీవార్థీ ద్రష్టుం తత స్తస్మా న్మే మదర్థం దర్శయ త్వ మాత్మాన మవ్యయమ్ ॥ ॥౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓస్వామి! అర్జునుడనగు నేను ఆవైష్ణవరూపము చూచుటకొరకు శక్యమైన దని నీవు తలచితివేని యోగుల సంబంధమైన యోగములకు ప్రభువగు ఓశ్రీకృష్ణపరమాత్మ! నే నత్యంత మారూపమును చూచుటకర్థిని యగుటవలన నాశరహితమైన యారూపమును నాకొరకు చూపుము. ॥౪॥

నగు నాకీవిధమగు తృష్ణ కలుగుచున్నదని చెప్పుచుండెను— వ్యాకృతావ్యాకృతపురుషులకంటె స్వీయ మహిమచే నుత్తముడుగాన "పురుషోత్తము"డనబడును. ఓపురుషోత్తముడా? నాజన్మసాఫల్యమునకై నీదగు సమగ్రైశ్వర్య, జ్ఞాన. తేజస్సంపన్నము, సర్వాత్మకము నగు స్వరూపమును దర్శింప కోరిక పుట్టుచున్నది. ॥3॥

—• ౧౧వ అధ్యాయము ౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— జూడ శక్యముకాని నన్ను జూచుకోరిక నీకు ఎందులకు కలిగె నందువా? "ప్రభో" సృష్టి. స్థితి, సంహారములయందు సమర్థుడవగు యోశ్రీకృష్ణా! నీదగు స్వరూపము మును నేను జూడసమర్థుడనే యని నీవు తలచితివివేని పరమకారుణికుడ వగు నీవు నాకు చూపుము. ॥౪॥

భాష్యోత్కర్షదీపిక:— నీస్వరూపము నేను చూచుటకు శక్యమైనదని నీవు తలచుచో నాకై క్షయరహితమగు నీస్వరూపమును జూపుము. (ఇట"ప్రభో"అనుసంబోధనముచే నేను నీస్వరూప మునుజూచుట కసమర్థుడనైనను, సర్వసమర్థుడవగు నీవు నీస్వరూపమును జూపుటకును, నన్ను నీస్వరూప మును జూచుటకుసమర్థునిగ జేయుటకు నీవు తగుదువని సూచింపబడెను. నీస్వరూపదర్శనసమర్థులగు యోగు లకుగూడ నీశ్వరుడవగుట నన్నుగూడ యోగిగా జేసి నీస్వరూపమును జూపుమని సూచించుటకై "యోగే శ్వర!" అని సంబోధించెను. ॥౪॥

శ్రీభగవా నువాచ:—

గీ॥ పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ॥ ॥౫॥

పదవిభాగము:— శ్రీభగవాన్- ఉవాచ- పశ్య- మే- పార్థ- రూపాణి- శతశః- అథ- సహస్రశః- నానావిధాని- దివ్యాని- నానావర్ణాకృతీని- చ ॥ ॥౫॥

ప్రతిపదార్థము:— హేపార్థ!=ఓయర్జునుడా; మే=నాసంబంధమైన; శతశః,అథ,సహస్రశః=అనంతమైన; నానావిధాని=అనేకవిధములైన; నానావర్ణాకృతీనిచ=అనేకవర్ణములు, అనేకఅవయవసంస్థానములుకల; దివ్యాని=అప్రాకృతమైన; రూపాణి=స్వరూపములను; పశ్య=చూడుము. ॥౫॥

గీ॥ పశ్యాదిత్యా న్వసూ న్రుద్రా నశ్వినౌ మరుత స్తథా ।
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥ ॥౬॥

పదవిభాగము:— పశ్య- ఆదిత్యాన్- వసూన్- రుద్రాన్- అశ్వినౌ- మరుతః- తథా- బహూని- అదృష్టపూర్వాణి- పశ్య- ఆశ్చర్యాణి- భారత ॥ ॥౬॥

ప్రతిపదార్థము:— హేభారత!=ఓభరతవంశోద్భవుడవగుయర్జునుడా!: త్వం=(ఈపదమధ్యాహార్యము) నీవు; ఆదిత్యాన్=ద్వాదశాదిత్యులను; వసూన్=అష్టవసువులను; రుద్రాన్=ఏకాదశరుద్రులను; అశ్వినౌ= ఇద్దరుఅశ్వినీదేవతలను; మరుతః= నలుబదితొమ్మిది మరుద్గణములను; తథా= అట్లే; అదృష్టపూర్వాణి=పూర్వమునందుచూడబడని; ఆశ్చర్యాణి=అద్భుతమైన; బహూని=ఇతరమైనయనేకరూపములను; పశ్య=చూడుము. ॥౬॥

శాంకరభాష్యం:—

ఏవం చోదితోఽర్జునేన— పశ్య మే మమ పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశోఽనేకశ ఇత్యర్థః । తాని చ నానావిధా న్యనేకప్రకారాణి దివి భవాని దివ్యా న్యప్రాకృతాని నానావర్ణాకృతీని చ నానా విలక్షణా నీలపీతాదిప్రకారా వర్ణా స్తథాఽఽకృతయోఽవయవసంస్థానవిశేషా యేషాం రూపాణాం తాని నానావర్ణాకృతీని చ ॥ ॥౫॥

పశ్యాఽఽదిత్యా నితి । పశ్యాదిత్యా న్ద్వాదశ వసూ నష్టౌ రుద్రా నేకాదశాశ్వినౌ ద్వౌ మరుతః సప్తసప్తగణా యే తాం స్తథా బహూ న్యన్యా న్యప్యదృష్టపూర్వాణి మనుష్యలోకే త్వయా త్వత్తోఽన్యేన వా కేనచి త్పశ్యాఽఽశ్చర్యా ణ్యద్భుతాని భారత॥ ॥౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓకుంతీపుత్రుడా! అనంతమైన, అనేకవిధములైన, అనేకవర్ణములు ఆకృతులు గల యప్రాకృతములైన నారూపములను చూడుము. ॥౫॥

ఓభరతవంశోద్భవుడా! ద్వాదశాదిత్యులను, అష్టవసువులను, ఏకాదశరుద్రులను, అశ్వినీదేవతాద్వయమును, సప్తసప్తమరుత్తులను, అట్లే నీచేతకాని, యితరులచేతను కాని మనుష్యలోకమునం దెపుడును యింతకు పూర్వమునందు చూడబడని యద్భుతమైన యితరరూపములను చూడుము. ॥౬॥

—౧౧వ అధ్యాయము ౫, ౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు—

మధుసూదనసరస్వతీయమ్:— ఈవిధముగ అత్యంతభక్తుడగు యర్జునునిచే ప్రార్థింపబడి

గీ॥ ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ! యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి ॥ ॥౭॥

పదవిభాగము:— ఇహ- ఏకస్థం- జగత్- కృత్స్నం- పశ్య- అద్య- సచరాచరం- మమ- దేహే- గుడాకేశ- యత్- చ- అన్యత్- ద్రష్టుం- ఇచ్ఛసి ॥ ॥౭॥

ప్రతిపదార్థము:— హేగుడాకేశ!=గుడాకా=నిద్రకు; ఈశ=ప్రభువా; అనగాజయించబడిన నిద్రకలయోయర్జునా! ఇహ=ఈ; మమ=నాయొక్క; దేహే=దేహమునందు; ఏకస్థం=ఏకదేశమునం దున్నట్టిన్ని, సచరాచరం=జంగమస్థావరాత్మకప్రపంచముతోకూడిన; కృత్స్నం=నిఖిలమైన; జగత్= జగత్తును; యత్=ఏ; అన్యత్=మనముజయించెదమా? లేక మనలనేదుర్యోధనాదులు జయించెదరా? అను విషయమును; ద్రష్టుం=చూచుటకుయిచ్ఛయించుచుంటివో; తత్=అవిషయమును; అద్య=యిపుడు; పశ్య= చూడుము. ॥౭॥

శాంకరభాష్యమ్:—

న కేవల మేతావ దేవ— ఇహైకస్థ మేకస్మింస్థితం జగత్కృత్స్నం సమస్తం పశ్యా ద్యేదానీం సచరాచరం సహ చరేణాఽచరేణ చ వర్తతే మమ దేహే గుడాకేశ యచ్చాన్య జ్జయ పరాజయాది యచ్ఛంకసే 'యద్వా జయేమ యది వా నో జయేయుః' ఇతి య దవోచ స్తదపి ద్రష్టుం యదీచ్ఛసి ॥ ॥౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జయించబడిన నిద్ర కల యోయర్జున! కేవలమింతమాత్రమే కాదు. ఈనాదేహము నం దేకదేశమునందున్న జంగమస్థావరాత్మకప్రపంచకముతో గూడిన నిఖిలజగత్తును, ఏజయ పరాజయాదికమును శంకించుచుంటివోదానిని, లేక "యద్వా జయేమ యది వా నో జయేయుః" మనము దుర్యోధనాదులను జయించెదమో దుర్యోధనాదులే మనలను జయిం చెదరో అని పలికితివో అవిషయమును యిపుడు యేవిషయమును చూచుట కిచ్ఛయించు చుంటివో యాసర్వమును చూడుము. ॥౭॥

శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నాడు:— ఇటనుండి నాలుగు శ్లోకములలో "పశ్య" అని ఆవృత్తి చేసి, నాయత్యద్భుత స్వరూపముల జూపించెదను నీవు సావధానుడవు కమ్మని యర్జునుని యభిముఖునిగా జేసుకొను చుండెను;— "శతశోథ సహస్రశః" నాస్వరూపములు అపరిమిత సంఖ్యాకములు, అనేకప్రకారములు, అత్యద్భుతములు, నానావర్ణాకృతులు గలవియునునైయున్నవి. వాటిని జూడుము. "పశ్య" అని అర్థా ర్థము కలలోట్ ప్రయోగింపబడుటచే నీవు చూచుట కర్హుడవని సూచితమయ్యెను. దివ్యరూపమును జూడుమని చెప్పి, విడివిడిగా రెండుశ్లోకములచే జెప్పుచున్నాడు.— ద్వాదశాదిత్యులను, ఏకాదశరుద్రులను, అశ్వినులను నలుబదితొంమిదిసంఖ్యగల మరుత్తులను, మరియు నీవుగాని, యితరులుగాని యిదివరలో జూడని ఆశ్చర్యము లను జూడుము. ॥౫. ౬॥

శంకరానందీయము:— పైవిధముగ ప్రార్థింపబడి శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నాడు— "దివ్యాని" మాయనుండి పుట్టినవి, నానావర్ణములు, నానాకారములు, శత; సహస్ర (అపరిమిత) సంఖ్యా కములు నగు నారూపములను జూడుము. (నీరూపమునుజూడ వేడుచుంటివనను యర్జునునకు త్రివిక్రమావతార

గీ॥ న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్ ॥ ॥౮॥

పదవిభాగము:— న- తు- మాం- శక్యసే- ద్రష్టుం- అనేన- ఏవ- స్వచక్షుషా- దివ్యం- దదామి- తే- చక్షుః- పశ్య- మే- యోగం- ఐశ్వరమ్ ॥ ॥౮॥

ప్రతిపదార్థము:— అనేన=ఈ; స్వచక్షుషా=నీచక్షుస్సుచే; మాం=నన్ను; ద్రష్టుం=చూచుటకు; నతుశక్యసే=సమర్థుడవు కావు; తే=నీకొరకు; దివ్యం=అలౌకికమైన; చక్షుః=చక్షుస్సును; దదామి=యిచ్చెదను; తేన=(ఈపదమధ్యాహార్యము)అదివ్యచక్షుస్సుచే; మే=నాయొక్క; ఐశ్వరం=ఈశ్వర సంబంధమైన; యోగం=యోగమును; పశ్య=చూడుము. ॥౮

శాంకరభాష్యమ్:—

కింతు—నతు మాం విశ్వరూపధరం శక్యసే ద్రష్టు మనేన ప్రాకృతేన స్వచక్షుషా స్వకీయేన చక్షుషా యేన తు శక్యసే ద్రష్టుం దివ్యేన తద్దివ్యం దదామి తే తుభ్యం చక్షుస్తేన పశ్య మే యోగ మైశ్వర మీశ్వరస్య మమైశ్వరం యోగం యోగశక్త్యతిశయ మిత్యర్థః ॥ ॥౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విశ్వరూపమును ధరించిన నన్ను యీప్రాకృతమైన నీచక్షుస్సుతో చూచుటకు సమర్థుడవు కావు. ఏయప్రాకృత చక్షుస్సుచే నన్ను చూచుటకు సమర్థుడవో యట్టి దివ్యచక్షుస్సును నీకొరకిచ్చుచుంటిని. దానితో నాయొక్క పరమేశ్వరరూపమును చూడుము. ॥౮॥

మువలె తన రూపమును జూపక, "పశ్య మే పార్థ రూపాణి" అని ఆదిత్యాదిరూపములగు బహుస్వరూపముల జూపుట ఔషధమును తెమ్మనిన బర్వతమును తీసుకువచ్చినట్లు యుక్తమా? అని శంకింపజనదు. అవ్యక్తాదిస్తంబపర్యంతము స్థూలసూక్ష్మకారణప్రపంచరూపముగాను సమష్టివ్యష్టిరూపముగాను, సర్వాత్మగనున్న "అగ్ని ర్మూర్థా చక్షుషీ చంద్రసూర్యౌ దిశ శ్శ్రోత్రే వా గ్వివృతాశ్చ వేదాః వాయుః ప్రాణో హృదయం విశ్వ మస్య పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా । సహస్రశీర్షం దేవం" ఇత్యాది శ్రుతిప్రసిద్ధమైన సర్వము కారణబ్రహ్మమగు తన స్వరూపమే. "బహుధా విశ్వతో ముఖం" అని తన చెప్పబడుటచే నట్టిదియే స్వస్వరూపము. కేవల శంకచక్రాదిచిహ్నితమగు రూపముగూడ ప్రాకృతమగుటచేనై విశ్వరూపమునందే యంతర్భవించును. కాన సర్వాత్మకము, సర్వకారణము, సర్వోత్తమము నగు నీశ్వరరూపమిదియే. కాన, వీనిని జూచుటయే యర్జునాభిమతముగాన నిట్టి రూపమునే యర్జునునకు జూపెను.) మరియు బూర్వమెవడును జూడనట్టి యద్భుతములను, రూపములను జూడుమని యర్థము. ॥౫, ౬॥

—• ౧౧వ అధ్యాయము ౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— కేవల మింతియేకాదు. సమస్తజగత్తు నాదేహస్థముగ చూడుమని చెప్పుచున్నాడు.— ఈనా దేహమునందు అవయవరూపముగనున్న సమస్తజగత్తును (కోటి సంవత్సరములు అంతటను తిరిగికూడ జూడశక్యముగానిదాని) నిప్పుడే జూడుము. ఓగుడాకేశ! నితరమగు జయపరాజయాదికమునుగూడ సంశయవిచ్ఛిత్తికై జూడుము. ॥౭॥

—• ౧౧వ అధ్యాయము ౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుం" (కేను

సంజయ ఉవాచ:—

గీ॥ ఏవ ముక్త్వా తతో రాజ న్మహాయోగేశ్వరో హరిః ।
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్ ॥ ॥౯॥

పదవిభాగము:— ఏవం- ఉక్త్వా- తతః- రాజన్- మహాయోగేశ్వరః- హరిః- దర్శయామాస- పార్థాయ- పరమం- రూపం- ఐశ్వరమ్ ॥ ॥౯॥

ప్రతిపదార్థము:— సంజయః=సంజయుడు; ఉవాచ=పలికెను; హేరాజన్=ఓధృతరాష్ట్రి!; తతః=అనంతరమున; మహాయోగేశ్వరః=మహాయోగేశ్వరుడగు; హరిః=శ్రీకృష్ణపరమాత్మ; ఏవం=ఇట్లు; ఉక్త్వా=పలికి; పార్థాయ=అర్జునునికొరకు; ఐశ్వరం=ఈశ్వరసంబంధమైన; పరమం=ఉత్కృష్టమైన; రూపం=విశ్వరూపమును; దర్శయామాస=చూపించెను. ॥౯॥

---

శాంకరభాష్యమ్:—

ఏవం యథోక్తప్రకారేణోక్త్వా తతోఽనన్తరం రాజన్ ధృతరాష్ట్ర మహాయోగేశ్వరో మహాంశ్చాసౌ యోగేశ్వరశ్చ హరి ర్నారాయణో దర్శయామాస దర్శితవాన్పార్థాయ పృథాసుతాయ పరమం రూపం విశ్వరూప మైశ్వరమ్ ॥ ॥౯॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సంజయుడు ధృతరాష్ట్రునిగూర్చి యిట్లు పలికెను. ఓరాజ! ధృతరాష్ట్ర! మహాయోగేశ్వరుడగు శ్రీకృష్ణపరమాత్మ యిట్లు పలికి యనంతరమున కుంతీపుత్రుడగు యర్జునునికొఱకు యీశ్వరసంబంధమైన పరమరూపమును (విశ్వరూపమును) చూపెను. ॥౯॥

---

చూచుటకు సమర్థుడనని నీవు తలచినచో నీస్వరూపమును జూపుము.) అనుదానికి సమాధానమును జెప్పుచున్నాడు:— "నతు...స్వచక్షుషా" ఓయర్జునా! ఈప్రాకృతము స్వభావసిద్ధము నగు నీచక్షురింద్రియముతో నన్ను (నాదివ్యస్వరూపము) జూడనేరవు. అట్లగుచో నిన్నెట్లు జూడగల్గుదు నందువా? "దివ్యం... ఐశ్వర్యం" అప్రాకృతము, (నాదివ్యరూపదర్శనసమర్థము) అగు చూపును నీకై యిచ్చెదను. ఆచక్షుస్సుతో ననితరసాధారణమగు నాదుఅఘటనఘటనాసామర్థ్యాతిశయమును జూడుము. ॥౮॥

శంకరానందీయము:— పూర్వమింద్రాదులను జూచిన యీచర్మచక్షుస్సుతో విశ్వరూపధరుడనగు నన్ను చూడజాలవు. అట్లగుచో నాకేమి గతి యందువా? నీకై మద్దర్శనయోగ్యము, తేజోమయము వగు చక్షుస్సు నిచ్చెదను. దానితో నా (ఈశ్వరసంబంధమగు) యోగమాయావిజృంభితమును చూడుము. ॥౮॥

—• ౧౧ అధ్యాయము ౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "శ్రీకృష్ణభగవాను లర్జునునకు తన దివ్యరూపమును జూపెను. ఆస్వరూపము నర్జునుడు జూచి విస్మయావిష్టచిత్తుడై యీవిధముగ విజ్ఞాపన చేసెను. అను నీవృత్తాంతమును ఆరు శ్లోకములతో సంజయుడు ధృతరాష్ట్రునితో జెప్పుచున్నాడు:— ఓధృతరాష్ట్రమహారాజా! సావధానుడవై వినుము. పూర్వోక్తవిధముగ చెప్పి భక్తుల సర్వక్లేశములను హరించువాడగుటచే మహాయోగేశ్వరుడగు శ్రీకృష్ణభగవానులు దివ్యచక్షుస్సు ననుగ్రహించి, ఏకాన్తభక్తుడగు అర్జునునకు తన (ఈశ్వరుని) దివ్యరూపమును జూపెను. ॥౯॥

శంకరానందీయము:— "యోగేశ్వరః" కార్యసహితమగు యోగమాయ యోగ మనబడును. దాని ప్రవృత్తికి ఈశ్వరుడు (కారణము) గాన యోగేశ్వరుడనబడును. 'హరిః' స్వసాక్షాత్కారముకలవారి యవిద్యను హరించువాడు గాన 'హరి' అనబడును. (శేషము గతార్థము.) ॥౯॥

గీ॥ అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్ ।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥ ॥౧౦॥

పదవిభాగము:— అనేకవక్త్రనయనం- అనేకాద్భుతదర్శనం- అనేకదివ్యాభరణం- దివ్యానేకోద్యతాయుధమ్ ॥ ॥౧౦॥

ప్రతిపదార్థము:— అనేకవక్త్రనయనం, అనేక=అనేకమైన; వక్త్ర=ముఖములు; నయనం=నేత్రములుకలిగినట్టిన్ని; అనేకాద్భుతదర్శనం= అనేక=అనేకమైన; అద్భుత=విస్మాపకమైన; (ఆశ్చర్యకరమైన) దర్శనం=దర్శనములుకలిగినట్టిన్ని; అనేకదివ్యాభరణం= అనేక=అనేకమైన; దివ్య=అప్రాకృతమైన; ఆభరణం=ఆభరణములుకలిగినట్టిన్ని; దివ్యానేకోద్యతాయుధం= దివ్య=దివ్యమైన; అనేక=అనేకమైన; ఉద్యత=ఎత్తబడిన; ఆయుధం=ఆయుధములుకలిగినట్టిన్ని. ॥౧౦॥

గీ॥ దివ్యమాలాంబరధరం దివ్యగన్ధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతో ముఖమ్ ॥ ॥౧౧॥

పదవిభాగము:— దివ్యమాల్యాంబరధరం- దివ్యగన్ధానులేపనం- సర్వాశ్చర్యమయం- దేవం- అనన్తం- విశ్వతోముఖమ్ ॥ ॥౧౧॥

ప్రతిపదార్థము:— దివ్యమాల్యాంబరధరం=దివ్య=దివ్యమైన; మాల్య=పుష్పములను; అంబర=వస్త్రములను; ధరం=ధరించినట్టిన్ని; దివ్యగన్ధానులేపనం= దివ్య=దివ్యమైన; గంధానులేపనం=గంధానులేపనముకలిగినట్టిన్ని: సర్వాశ్చర్యమయం, సర్వ=నిఖిలప్రపంచమునకు; ఆశ్చర్యమయం=ఆశ్చర్యప్రాయమైనట్టిన్ని, విశ్వతోముఖం=అంతటముఖములుకల; అనంతం=అంతములేని; దేవం=పరమేశ్వరరూపమును; దర్శయామాస=(ఈపదమనువృత్తము)చూపించెను. లేక, అర్జునః, దదర్శ=(ఈరెండుపదములమధ్యాహార్యములు) అర్జునుడు చూచెను. ॥౧౧॥

---

శాంకరభాష్యమ్:—

అనేకేతి । అనేకవక్త్రనయన మనేకాని వక్త్రాణి నయనాని చ యస్మిన్ రూపే తదనేకవక్త్రనయనం । అనేకాద్భుతదర్శనం మనేకా న్యద్భుతాని విస్మాపకాని దర్శనాని యస్మిన్రూపే తదనేకాద్భుతదర్శనమ్ । తథాఽనేకదివ్యాభరణ మనేకాని దివ్యా న్యాభరణాని

---

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

అనేకమైన ముఖములు, నేత్రములు కలిగినట్టియు అనేకమైన యద్భుత మగు దర్శనములు కలిగినట్టియు అనేకమైన దివ్యమగు యాభరణములు కలిగినట్టియు దివ్యమగు యనేకమైన యెత్తబడిన ఆయుధములు కలిగినట్టి విశ్వరూపమును చూచెను. ॥౧౦॥

---

—• ౧౧వ అధ్యాయము ౧౦, ౧౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఓధృతరాష్ట్రమహారాజా! అర్జునునకు జూపిన యావిశ్వరూప మెట్టిదనెదవా? వినుము. ఆరూపము అనేకముఖములు, నేత్రములు కలది. అనేకాద్భుతములు ఆదివ్యస్వరూపమున కన్పట్టుచున్నవి. అనేక దివ్యాభరణములుకలది యావిశ్వరూపము. దివ్యములైన యుద్యతములైన యాయుధములు కలది. దివ్యములగు పుష్పమాలలు, మణిమాలలు ధరించినది. దివ్యగంధానులేపనము గలది. సర్వాశ్చర్య

గీ॥ దివి సూర్యసహస్రస్య భవే ద్యుగప దుత్థితా ।
యది భా స్సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః ॥ ॥౧౨॥

పదవిభాగము:— దివి- సూర్యసహస్రస్య- భవేత్- యుగపత్- ఉత్థితా- యది- భాః- సదృశీ- సా- స్యాత్- భాసః- తస్య- మహాత్మనః ॥ ॥౧౨॥

ప్రతిపదార్థము:— దివి=అంతరిక్షమునందు; సూర్యసహస్రస్య=సహస్రసూర్యులయొక్క; భాః=కాంతి; యుగపదుత్థితా; యది=ఒక్కమారుపుట్టినచో; సా=ఆ కాంతి; తస్య=ఆ; మహాత్మనః=విశ్వరూపముయొక్క; భాసః=దీప్తికి; సదృశీస్యాత్=సమానమగునా? ॥౧౨॥

శాంకరభాష్యమ్:—

యస్మింస్తదనేకదివ్యాభరణమ్ । తథా దివ్యానేకోద్యతాయుధం దివ్యాని అనేకాని ఉద్యతాని ఆయుధాని యస్మిం స్త ద్దివ్యానేకో ద్యతాయుధం దర్శయా మాసేతి పూర్వేణ సమ్బన్ధః ॥ ॥౧౦॥

కించ — దివ్యమాల్యామ్బరధరం దివ్యాని మాల్యాని పుష్పా ణ్యమ్బరాణి వస్త్రాణిచ ధ్రియన్తే యేనేశ్వరేణ తం దివ్యమాల్యాంబరధరం దివ్యగన్ధానులేపనం దివ్యం గన్ధానులేపనం యస్య తం దివ్యగన్ధానులేపనం సర్వాశ్చర్యమయం సర్వాశ్చర్యప్రాయం దేవ మనన్తం నాస్యాన్తో స్తీత్యనన్త స్తం విశ్వతోముఖం సర్వతోముఖం సర్వభూతాత్మత్వాత్తం దర్శయామాసార్జునో దదర్శేతి వాఽధ్యాహ్రియతే ॥ ॥౧౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు దివ్యములైన పుష్పమాలలను, వస్త్రములను ధరించినట్టియు, దివ్యగంధము అనులేపనముగా గల్గినట్టియు, సర్వాశ్చర్యప్రాయమును, అంతములేనిదియును, సర్వభూతస్వరూపుడుగాన యంతటను ముఖములుకల్గినట్టి యావిశ్వరూపమును శ్రీకృష్ణభగవానులు అర్జునునకు జూపెను. లేక అట్టివిశ్వరూపము నర్జునుడు చూచెను. ॥౧౧॥

ప్రచురమైనది. ద్యోతనాత్మకమైనది. అపరిచ్ఛిన్నమైనది. అంతటను ముఖములు కలది. ఇట్టి రూపము నుజూపెనని యర్థము. ॥౧౦, ౧౧॥

శంకరానందీయము:— "అనేకాద్భుతదర్శనం" అపరిమితములును, అద్భుతములును అగు ఊర్ధ్వ; అధః తిర్యక్ దేశదృష్టి (చూపులు) గలిగినదియు, లేక, వికృతములు, సౌమ్యములు, సాధారణములు, భయంకరములు, చిత్రములు నగుదృష్టులు కలిగినట్టియు, "దివ్యానేకోద్యతాయుధం" ప్రచండప్రకాశముకల్గి, యుద్ధృతములైన చక్రగదాద్యాయుధములు కలిగినట్టియు, "సర్వాశ్చర్యమయం" తేజో, బల, వీర్య, శక్తి, రూప, గుణ, అవయవావస్థానాది సర్వవిశేషములతో ప్రచురమైనదియు "దేవం" అంతటను స్వయముగ ప్రకాశించునదియు, సర్వాత్మకము, కనుకనే యపరిచ్ఛిన్నమునగు స్వరూపము జూపించెనని యన్వయము. ॥౧౦,౧౧॥

—• ౧౧వ అధ్యాయము ౧౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వశ్లోకమున చెప్పిన "దేవం" అను పదమును వివరించుచుండెను.— ఆకాశమధ్యమున వేయి (అపరిమిత) సూర్యసమూహామునుండి కాంతి యొకమారు బయల్వెడలినచో నా కాంతి యావిశ్వరూపముయొక్క కాంతికి సమానమగునో కాదో? (ఇట యవిద్యమానాధ్య

శాంకరభాష్యమ్:—

యా పున ర్భగవతో విశ్వరూపస్య భాః తస్యా ఉపమోచ్యతే—దివ్యంతరిక్షే తృతీయస్యాం వా దివి సూర్యాణాం సహస్రం సూర్యసహస్రం తస్య యుగపదుత్థితస్య యా యుగపదుత్థితా భాః సా యది సదృశీ స్యాత్తస్య మహాత్మనో విశ్వరూపస్యైవ భాసో యది వా వస్యాత్ తతోపి విశ్వరూపస్యైవ భా అతిరిచ్యత ఇత్యభిప్రాయః ॥ ॥౧౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

తిరిగి భగవత్స్వరూపమగు విశ్వరూపముయొక్క యేదీప్తి కలదో దానికి సాదృశ్యమును "దివి"అను శ్లోకముచే చెప్పుచుండెను.

అంతరిక్షమునందు, లేక తృతీయద్యులోకమునందు వేయి సూర్యు లొకసారి యుదయించిన యట్టి సూర్యుల యుగపదుత్థితమైన దీప్తి పరమాత్మస్వరూపమైన విశ్వరూపముయొక్క దీప్తికి సమానమగునా? కాదా? (అనగా విశ్వరూపముయొక్క దీప్తి యుగపదుత్థితసూర్యసహస్రదీప్తికంటె యధిక మని యాశయము.) ॥౧౨॥

వసాయము ఔపమ్యాభావపరమగుటవలన, అభూతోపమారూపఅతిశయోక్తి యుత్ప్రేక్షను వ్యంజింపజేయుచు విశ్వరూపప్రభకు ఔపమ్యరాహిత్యమునే సూచించుచున్నది. ॥౧౨॥

—• ౧౧వ అధ్యాయము ౧౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "ఇహైకస్థం"అను శ్లోకమునందు భగవదాజ్ఞప్తమగు రీతిని యర్జునుడు విశ్వరూపమును చూచెనని చెప్పుచున్నాడు. ఒకే స్థలమునందున్న సర్వజగత్తును దేవ, పితృ, మనుష్యాది నానాప్రకారములుగ దేవదేవుని యావిశ్వరూపశరీరమునం దాసమయమున యర్జునుడు చూచెనని యర్థము. ॥౧౩॥

భాష్యోత్కర్షదీపిక:— విశ్వరూపమును ధరించిన పరమేశ్వరునేగాక, శ్రీభగవానుని శరీరైకదేశమునందే దేవపితృమనుష్యాదిభేదములచే ననేకప్రకారముగ ప్రవిభక్తమైయున్న సర్వజగత్తును పాండవుడగు యర్జునుడు చూచెను. (భగవద్భక్తుడగు యర్జునునియొక్కయు, నాతని దండ్రియగు పాండురాజుయొక్కయు భాగ్యమెంతటిదో! ఈశ్వరవిముఖుడగు దుర్యోధనునియొక్కయు, వాని తండ్రియగు నీ (ధృతరాష్ట్రుని) యొక్కయు, నభాగ్యమెట్టిదో గమనింపుమని "పాండవః" అనుపదముచే సూచించెను.)

నీలకంఠీయము:— "ఇహైకస్థం జగత్కృత్స్నం" అని భగదుపదిష్టవిధముగ జూచెనని యీశ్లోకమున జెప్పుచున్నాడు.— తత్రైకస్థం-అనేకధా" వర్షాకాలమునందు మొలకెత్తిన తింత్రిణీబీజమునందు సూక్ష్మరూపముగ వృక్షము కనబడును. అట్లు కాక సావకాశముగ ననేకవిధములుగ విభాగయుక్తఏకావయవమునందున్న జగత్తును జూచెనని యర్థము. ఎపుడు భగవంతుని చతుర్భుజరూపము చింతింపబడునో అచిత్తము చతుర్భుజాకారముగ స్థానముకలదై, క్రమముగ దానిని విడచి ముఖమునందుగాని, స్మితమునందుగాని పాదమునందలి గోరునందుగాని నిలచి,యది స్థానముగకలదై దానిని గూడ విడచివిశ్వరూపము నధిరోహించుచు దివ్యచక్షువు (సూక్ష్మతమత్వమునొందినమనస్సు) కూడ నిశ్చలయగును. "మనోఽస్య దైవం చక్షుః స ఏతేన దైవేన చక్షుషా మనసైతాన్ కామా న్పశ్య న్రమతే" అను శ్రుతియు పైవిషయము జెప్పుచున్నది. (హార్దాకాశాఖ్యసగుణబ్రహ్మగతములగు విషయములను అని శ్రుతిగతఏతచ్ఛబ్ద, కామశబ్దముల కర్థము,) శ్రీభాగవతమున

గీ॥ తత్రైకస్థం జగ త్కృత్స్నం ప్రవిభక్త మనేకధా ।
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా ॥ ॥౧౩॥

పదవిభాగము:— తత్ర– ఏకస్థం– జగత్– కృత్స్నం– ప్రవిభక్తం– అనేకధా– అపశ్యత్– దేవదేవస్య– శరీరే– పాండవః– తదా ॥ ॥౧౩॥

ప్రతిపదార్థము:— తత్ర=ఆవిశ్వరూపమునందు; ఏకస్థం=ఒకదానియందేయుండినట్టిన్ని; అనేకధా=అనేకవిధములుగ: ప్రవిభక్తం=వేరుపరుచబడిన; కృత్స్నం=సమస్తమైన; జగత్=జగత్తును; తదా=అపుడు; పాండవః=అర్జునుడు; దేవదేవస్య=నిఖిలదేవతలకుప్రభువైన పరమేశ్వరునియొక్క; శరీరే=శరీరమునందు; అపశ్యత్=చూచెను. ॥౧౩॥

గీ॥ తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః ।
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత ॥ ॥౧౪॥

పదవిభాగము:— తతః– సః– విస్మయావిష్టః– హృష్టరోమా– ధనంజయః– ప్రణమ్య– శిరసా– దేవం– కృతాంజలిః– అభాషత ॥ ॥౧౪॥

ప్రతిపదార్థము:— తతః=విశ్వరూపసందర్శనానంతరమునందు; సః=అ; ధనంజయః=అర్జునుడు; విస్మయావిష్టః=ఆశ్చర్యముతోకూడినవాడై; హృష్టరోమా=గరిపొడిచినరోమములుకలవాడై; దేవం=విశ్వరూపధారియగుశ్రీకృష్ణపరమాత్మను; శిరసా=శిరస్సుచే; ప్రణమ్య=నమస్కరించి: కృతాంజలిః=కట్టబడినదోశిలకలవాడై; అభాషత=పలికెను. ॥౧౪॥

శాంకరభాష్యమ్:—

కించ—తత్ర తస్మిన్ విశ్వరూప ఏకస్మిన్ స్థిత మేకస్థం జగ త్కృత్స్నం ప్రవిభక్త మనేకధా దేవపితృమనుష్యాదిభేదై రపశ్యద్దృష్టవాన్ దేవదేవస్య హరేః శరీరే పాండవో అర్జునస్తదా ॥ ॥౧౩॥

తత ఇతి । తతస్తం దృష్ట్వా స విస్మయేనావిష్టో హృష్టాని రోమాని యస్య సోయం హృష్టరోమా చాభవ ద్ధనంజయః ప్రణమ్య ప్రకర్షేణ నమనం కృత్వా ప్రహ్వీభూతస్సన్ శిరసా దేవం విశ్వరూపధరం కృతాంజలిః నమస్కారార్థం సంపుటీకృతహస్తః సన్నభాషతోక్తవాన్ ॥౧౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆవిశ్వరూపమునం దనేకవిధములుగ ప్రవిభక్తమైన(వేరుపరుచబడిన) నిఖిలజగత్తును యొక విశ్వరూపమునందున్నదానినిగ భగవద్రూపసందర్శనసమయమునందు పాండుమహారాజనందను డగు యర్జునుడు నిఖిలదేవతలకు దేవుడగు యాశ్రీకృష్ణపరమాత్మ శరీరమునందు చూచెను. ॥౧౩॥

విశ్వరూపసందర్శనానంతరమున ధనంజయుడు (అర్జునుడు) ఆశ్చర్యముతో కూడినవాడై గరిపొడిచిన రోమములుకలవాడై శిరస్సుచే శ్రీకృష్ణపరమాత్మను నమస్కరించి నమస్కారమునిమిత్తము చేతులుదగ్గరగాజోడించి ఒక వాక్యమును పలికెను. ॥౧౪॥

తత్ర లబ్ధపదం చిత్త మాకృష్యైకత్ర ధారయేత్ । నాన్యాని చింతయే ద్భూయః సుస్మితం భావయే న్ముఖమ్ ॥

అర్జున ఉవాచ:—

గీ॥ పశ్యామి దేవాం స్తవ దేవ దేహే సర్వాం స్తథా భూతవిశేషసంఘాన్ ।
బ్రహ్మాణ మీశం కమలాసనస్థ మృషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్ ॥ ॥౧౫॥

పదవిభాగము:— పశ్యామి- దేవాన్- తవ- దేవ- దేహే- సర్వాన్- తథా- భూతవిశేషసంఘాన్- బ్రహ్మాణం- ఈశం- కమలాసనస్థం- ఋషీన్- చ- సర్వాన్- ఉరగాన్- చ- దివ్యాన్ ॥ ॥౧౫॥

ప్రతిపదార్థము:— అర్జునః=అర్జునుడు; ఉవాచ=పలికెను; హే దేవ!=ఓ శ్రీకృష్ణపరమాత్మ; తవ=నీయొక్క; దేహే=దేహమునందు; సర్వాన్=సమస్తమైన; దేవాన్=దేవతలను; తథా=అట్లే; భూతవిశేషసంఘాన్=భూతవిశేషసమూహములను; కమలాసనస్థం=పద్మాసనమునందుండిన; బ్రహ్మాణం=బ్రహ్మదేవుని; ఈశం=శంకరుని; సర్వాన్=సమస్తమైన; ఋషీంశ్చ=ఋషీశ్వరులను; దివ్యాన్=ద్యులోకమునందుండిన; ఉరగాంశ్చ=వాసుకిమొదలగుసర్పములను; పశ్యామి=చూచుచుంటిని. ॥౧౫॥

---

శాంకరభాష్యమ్:—

కథం యత్త్వయా దర్శితం విశ్వరూపం తదహం పశ్యామీతి స్వానుభవ మావిష్కుర్వన్ — పశ్యా మ్యుపలభే హే దేవ! తవ దేహే దేవా న్సర్వాన్ తథా భూతవిశేషసంఘాన్ భూతవిశేషాణాం స్థావరజంగమానాం నానాసంస్థానవిశేషాణాం సంఘా భూతవిశేషసఙ్ఘా

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎట్లనిన? నీచే విశ్వరూప మెట్లు చూపబడెనో యట్లే యావిశ్వరూపమును నేను చూచు

---

తత్ర లబ్ధపదం చిత్త మాకృష్య వ్యోమ్ని ధారయేత్ । తచ్చ త్యక్త్వా మదారోహో న కించి దపి చింతయేత్॥" (ధ్యేయమగు మూర్తియందు స్థిరమైన మనస్సు నొక యవయవమునందు స్థిరపరచుకొని, అటనుండి ఆకర్షించి హార్దాకాశాఖ్య సగుణబ్రహ్మమునందు నిల్పి, దానిని గూడ విడచి, నిర్వికల్పబ్రహ్మమునధిరోహించి యికదేనిని చింతింపకుండ నుండదగును.) ఈవిషయమే "అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా" అని ఇట చెప్పబడెను. ॥౧౩॥

—• ౧౧వ అధ్యాయము ౧౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈవిధముగ నర్జునుడు విశ్వరూపాద్భుతదర్శనముచే నేమియు జంకలేదు, నేత్రములను కదల్పలేదు, ఆశ్చర్యముచే గర్తవ్యమును మరువలేదు, మరియు నటనుండి కదలలేదు. ఇకనేమన: అతిధైర్యశాలిగాన యట్టిచిత్తవిక్షోభసమయమునందుగూడ తత్కాలోచితముగనే పల్కెను. అని యీశ్లోకమున చెప్పుచున్నాడు—"తతః...అభాషత" ఆవిశ్వరూపదర్శనానంతరము, అత్యద్భుతదర్శనముచే గల్గిన యలౌకికచిత్తచమత్కారవిశేషముతో నావిష్టుడై, కనుకనే పులకితరోముడై (ప్రఖ్యాతమహాదేవాదిసంగ్రామాదిప్రభావుడు, యుధిష్ఠిరరాజసూయమునందును, ఉత్తరగోగ్రహణమునందును సమస్తశత్రువర్గమును జయించి ధనము నార్జించినవాడుగాన "ధనంజయు" డనబడును.) అట్టి యర్జునుడు విశ్వరూపధరుడైన భగవంతుని శిరస్సుతో నమస్కరించి బద్ధాంజలియై పలికెను. ॥౧౪॥

—• ౧౧వ అధ్యాయము ౧౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— భగవంతుడవగు నీచే జూపబడిన విశ్వరూపమును నీచే

గీ॥ అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వా సర్వతోఽనన్తరూపమ్ ।
నాన్తం న మధ్యం న పున స్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥౧౬॥

పదవిభాగము:— అనేకబాహూదరవక్త్రనేత్రం- పశ్యామి- త్వా- సర్వతః- అనన్తరూపం- న- అన్తం- న- మధ్యం- న- పునః- తవ- ఆదిం- పశ్యామి- విశ్వేశ్వర- విశ్వరూప ॥ ॥౧౬॥

ప్రతిపదార్థము:— త్వా=నిన్ను; అనేకబాహూదరవక్త్రనేత్రం, అనేక=అనేకమైన: బాహు=బాహువులు; ఉదర=ఉదరములు; వక్త్ర=వక్త్రములు; నేత్రం=నేత్రములుకలవానినిగను; సర్వతః=అంతటను; అనన్తరూపం=అనంతమైనరూపములుకలవానినిగను; పశ్యామి=చూచుచుంటిని; హేవిశ్వేశ్వర=ఓజగత్ప్రభువా!; విశ్వరూప=విశ్వరూపుడా!: తవ=నీయొక్క; ఆదిం=ఆదిని; (మొదలును) నపశ్యామి=చూచుటలేదు; మధ్యం=మధ్యభాగమును; నపశ్యామి=చూచుచుటలేదు; అంతం=అవసానమును(-చివరుభాగమును;) నపశ్యామి=చూచుటలేదు. ॥౧౬॥

శాంకరభాష్యమ్:—
స్థాన్ । కించ బ్రహ్మాణం చతుర్ముఖ మీశ మీశితారం ప్రజానాం కమలాసనస్థం పృథివీపద్మమధ్యే మేరుకర్ణికాసనస్థ మిత్యర్థః । ఋషీంశ్చ వసిష్ఠాదీన్, సర్వా నురగాంశ్చ వాసుకిప్రభృతీన్ దివ్యాన్ దివిభవాన్ ॥ ॥౧౫॥

అనేకబాహూదరవక్త్రనేత్ర మనేకే బాహవ ఉదరాణి వక్త్రాణి నేత్రాణి చ యస్య తవ స త్వమనేకబాహూదరవక్త్రనేత్ర స్త మనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వా త్వాం సర్వతః సర్వత్ర అనన్తరూప మనన్తాని రూపాణి యస్యేత్యనంతరూపం నాన్త మన్తోఽవసానం న మధ్యం మధ్యంనామ ద్వయోః కోట్యో రంతరం న పున స్తవాదిం తవ దేవస్య నాన్తం పశ్యామి న మధ్యం పశ్యామి న పునరాదిం పశ్యామి హేవిశ్వేశ్వర! హేవిశ్వరూప! ॥ ॥౧౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—
చుంటినని స్వానుభవమును ప్రకటన చేయుచు యర్జునుడు పలికెను.

ఓశ్రీకృష్ణపరమాత్మ! నీయొక్క దేహమునందు అనేకవిధములైన సంస్థానవిశేషములు కల స్థావరజంగమాత్మక నిఖిలభూతవిశేషసమూహములను, పద్మాసనస్థు డగు బ్రహ్మదేవుని, శంకరుని, ద్యులోకమునందుండెడి, వశిష్ఠాదిఋషులను, ద్యులోకమునందుండెడి వాసుకిమొదలగు నిఖిలసర్పములను నేను చూచుచుంటిని. “దివ్యాన్”అనునది ఋషులకు, ఉరగములకుగూడ విశేషణ మని గ్రహింపనగును. ॥౧౫॥

ఓశ్రీకృష్ణ! నిన్ను అనేకమైన బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు కలవానినిగను, అంతటను అనంతరూపములు కలవానినిగను చూచుచుంటిని. ఓవిశ్వేశ్వర! ఓవిశ్వరూప! నీమొదలును, మధ్యభాగమును, అంతమును (కొనభాగమును) నేను గుర్తించ లేకుంటిని. ॥౧౬॥

గీ॥ కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్ ॥ ౧౭॥

పదవిభాగము:— కిరీటినం- గదినం- చక్రిణం- చ- తేజోరాశిం- సర్వతః- దీప్తిమంతం- పశ్యామి- త్వాం- దుర్నిరీక్ష్యం- సమన్తాత్- దీప్తానలార్కద్యుతిం- అప్రమేయమ్ ॥ ॥౧౭॥

ప్రతిపదార్థము:— కిరీటినం=కిరీటముకలిగినట్టిన్ని; గదినం=గదయనుయాయుధమునుధరించినట్టిన్ని; చక్రిణం=చక్రమనుయాయుధమునుధరించినట్టిన్ని; తేజోరాశిం=తేజఃపుంజస్వరూపమైనట్టిన్ని; సర్వతో దీప్తిమన్తం=అంతట,దీప్తి(ప్రకాశ)కలిగినట్టిన్ని; దుర్నిరీక్ష్యం=దుఃఖ(కష్ట)ముచేచూచుటకుశక్యమైనట్టిన్ని; సమన్తాత్=అంతట; దీప్తానలార్కద్యుతిం, దీప్త=ప్రకాశించుచున్న; అనల=అగ్నిహోత్రునియొక్క; అర్క=సూర్యునియొక్క; ద్యుతిం=కాంతికలిగినట్టిన్ని; అప్రమేయం=ఊహించుటకుశక్యము కాని; త్వాం=నిన్ను; పశ్యామి=చూచుచున్నాను. ॥౧౭॥

శాంకరభాష్యమ్:—

కించ— కిరీటినం కిరీటంనామ శిరోభూషణవిశేషః తద్యస్యాస్తి స కిరీటీ తం కిరీటినం తథా గదినం గదా యస్య విద్యత ఇతి గదీ తం గదినం తథా చక్రిణం చక్ర మస్యాస్తీతి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కిరీటమును ధరించినట్టిన్ని, గద యనెడి యాయుధవిశేషమును ధరించినట్టిన్ని, చక్ర మనెడి యాయుధవిశేషమును ధరించినట్టిన్ని, అంతటనుప్రకాశముకలిగినట్టిన్ని, చూచుటకు

ననుగ్రహింపబడిన దివ్యచక్షుస్సుతో సర్వలోకాదృశ్య మగుదానినిగూడ చూచుచుంటిని. నాభాగ్య మెంతటిది! అని తనయనుభవమును యర్జును డావిష్కరించుకొనుచున్నాడు— ఓదివ్యస్వభావా! నీదేహమగు విశ్వరూపమునందు వస్వాదిసర్వదేవతలను, సర్వభూతవిశేషసంఘములను, సర్వులకు నీశ్వరుడగు కమలాసనమందున్న చతుర్ముఖబ్రహ్మను, సర్వఋషులను, అప్రాకృతులగువాసుకిప్రభృతులనుజూచుచుంటిని. ॥౧౫॥

పరమార్థప్రప:— "బ్రహ్మాణ మీశం కమలాసనస్థం" ఓదేవ! నీవిశ్వరూపదేహమున సత్యలోకనివాసియగు బ్రహ్మను, కైలాసవాసియగు శంకరుని, "కమలయా సహ ఆసనే గరుడాసనే స్థితః" లక్ష్మితో గూడ గరుడాసనమునందుండి వైకుంఠవాసి యగు విష్ణువును చూచుచుంటిని (దివ్యదృష్టిదానమునకు ఫలము చెప్పబడెను.) (శేషము గతార్థము.) ॥౧౫॥

—• ౧౧వ అధ్యాయము ౧౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— భగవద్దేహమగు విశ్వరూపమున జూచిన సర్వమును చెప్పుచుండెను— అసంఖ్యాకములైన బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు కల్గినట్టియు, అంతములేనిరూపములు గల్గినట్టి నిన్ను జూచుచుంటిని. నీయొక్క అంతము, మధ్యము, ఆదియు కనుబడుటలేదు. "విశ్వేశ్వర! విశ్వరూప" (అను సంబోధనద్వయము అతిసంభ్రమప్రయుక్తము) ॥౧౬॥

—• ౧౧వ అధ్యాయము ౧౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఆవిశ్వరూపుడైన భగవంతునే ప్రకారాంతరముగ చెప్పుచుండెను.— కిరీట, గదా, శంఖ, చక్రధారియు, అంతటను వెలుగొందుచున్న తేజోరాశిస్వరూపుడును, కనుకనే చర్మచక్షుస్సులకు జూడశక్యముగానివాడును, ప్రజ్వలించుచున్న యనలార్కుల కాంతివంటి కాంతిగల్గినట్టియు, ఇట్టివాడ వని నిర్ణయించుటకు అశక్యుడవును, అగు నిన్ను దివ్యచక్షువుతో జూచుచుంటిని. కాన అధికారిభేదము ననుసరించి దుర్నిరీక్ష్యుడవు అనుట విరుద్ధము కాదు. ॥౧౭॥

గీ॥ త్వ మక్షరం పరమం వేదితవ్యం త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా సనాతన స్త్వం పురుషో మతో మే ॥ ॥౧౮॥

పదవిభాగము:— త్వం- అక్షరం- పరమం- వేదితవ్యం- త్వం- అస్య- విశ్వస్య- పరం- నిధానం- త్వం- అవ్యయః- శాశ్వతధర్మగోప్తా- సనాతనః- త్వం- పురుషః- మతః- మే ॥ ॥౧౮॥

ప్రతిపదార్థము:— త్వం=నీవు; ముముక్షుభిః=ముముక్షువులచే; వేదితవ్యం=తెలిసికొనదగిన; అక్షరం=నాశరహితమైన; పరమం=పరబ్రహ్మము; త్వం=నీవు; అస్య=ఈ; విశ్వస్య=ప్రపంచమునకు; పరం=ఉత్కృష్టమైన; నిధానం=ఆశ్రయము; అవ్యయః=నాశరహితమైన; త్వం=నీవు; శాశ్వతధర్మగోప్తా. శాశ్వత=నిత్యమైన; ధర్మ=ధర్మమును; గోప్తా=రక్షించువాడవు; త్వం=నీవు; సనాతనః=చిరంతనుడవైన; పురుషః=పురుషుడవై; మే=నాకు; మతః=సంమతుడవు. ॥౧౮॥

శాంకరభాష్యమ్;—

చక్రి తం చక్రిణం చ తేజోరాశిం తేజఃపుంజం సర్వతో దీప్తిమంతం దీప్తి ర్యస్యాస్తి స సర్వతో దీప్తిమాన్ తం సర్వతోదీప్తిమన్తం పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం దుఃఖేన నిరీక్ష్యో దుర్నిరీక్ష్య స్తం దుర్నిరీక్ష్యం సమంతా త్సమంతతః సర్వత్ర దీప్తానలార్కద్యుతి మనల శ్చార్కశ్చానలార్కౌ దీప్తౌ వనలార్కౌ దీప్తానలార్కౌ తయోః దీప్తానలార్కయోః ద్యుతిరివ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శక్యముకానట్టిన్ని, అంతటను ప్రకాశించుచున్న యగ్నియొక్క, సూర్యునియొక్క కాంతి వంటి కాంతికలిగినట్టిన్ని, ఊహించుటకు శక్యముకానట్టి, నిన్ను చూచుచుంటిని. ॥౧౭॥

ఓ శ్రీకృష్ణపరమాత్మ! నీవు ముముక్షువులచే తెలిసికొనదగిన నాశరహితమైన పరబ్రహ్మస్వరూపము, నీవీనిఖిలజగత్తున కుత్కృష్టమైన యాశ్రయము. నాశరహితమైన నీవు

—• ౧౧వ అధ్యాయము ౧౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఊహించుటకు శక్యము గానిదియు, నిరతిశయము నగు నీయైశ్వర్యమును జూచుటచే నేనిట్లూహించుచుంటిని అని చెప్పుచుండెను— ముముక్షువుచే వేదాంత శ్రవణాదికముచే క్షయరహితమైన బ్రహ్మముగనీవే తెలిసికొనదగినవాడవు. నీవేయీజగత్తునకు పరమాశ్రయుడుగా తెలిసికొనదగినవాడవు. నీవే వ్యయరహితుడవు. నిత్యమగు వేదముచే ప్రతిపాదింపబడిన నిత్యధర్మమును రక్షించెడివాడవు. లేక "శాశ్వత" అనునది సంబోధనము. సనాతను డగు పురుషుడుగా నాకు తెలియబడితివి. ॥౧౮॥

శంకరానందీయము:— నీసంబంధమగు నీమహామాయాయోగముచే సంభావితాద్భుతైశ్వర్య దర్శనముచే నేనిట్లు తలచుచుంటిని. అని చెప్పుచున్నాడు.— "అక్షరం" నిరవయవమగుటవలనను, నిరాశ్రయమగుటవలనను, క్రియకు ఆశ్రయము, విషయము కాకపోవుటవలనను, అనంతమగుటవలనను 'నక్షరతీ త్యక్షరం' నశించునది కాదుగాన "ఏతద్వై తదక్షరం గార్గి" అను శ్రుతి చెప్పిన నిత్యకూటస్థము, కనుకనే "పరం" "అవ్యక్తా త్తు పరః పురుషః" అను శ్రుతిచెప్పిన యుత్తమోత్తమము, కనుకనే "వేదితవ్యం" పరమార్థమగుటవలన "స ఆత్మా సవిజ్ఞేయః" అను శ్రుతిననుసరించి ముముక్షువులచే తెలిసికొనదగినదియు

శాంకరభాష్యమ్:—
ద్యుతి స్తేజో యస్య తవ స త్వం దీప్తానలార్కద్యుతి స్తం త్వాం దీప్తానలార్కద్యుతిం। అప్రమేయం న ప్రమేయ మప్రమేయ మప్రమేయ మశక్యపరిచ్ఛేద మిత్యర్థ॥ ॥౧౭॥

ఇత ఏవ తే యోగశక్తిదర్శనా దనుమినోమి— త్వమక్షరం న క్షరతీతి పరమం బ్రహ్మ వేదితవ్యం జ్ఞాతవ్యం ముముక్షుభి స్త్వమస్య విశ్వస్య సమస్తస్య జగతః పరం ప్రకృష్టం నిధానం నిధీయతే అస్మిన్నితి నిధానం పర ఆశ్రయ ఇత్యర్థః। కించ త్వ మవ్యయో న తవ వ్యయో విద్యత ఇత్యవ్యయః। శాశ్వతధర్మగోప్తా శశ్వద్భవః శాశ్వతో నిత్యో ధర్మస్తస్య గోప్తా శాశ్వతధర్మగోప్తా సనాతన శ్చిరంతనస్త్వం పురుషః పరో మతోఽభిప్రేతో మే మమ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—
నిత్యమైన ధర్మమును రక్షించువాడవు. నీవు చిరంతనపురుషుడవని నాయభిప్రాయము. (ఇట "త్వ మవ్యయః"అని చెప్పుటవలన పరబ్రహ్మ మవినాశి యగుటవలన నాపరబ్రహ్మమే జ్ఞాతవ్య మనియు, అందుచే నితరము వినాశి యగుటవలన హేయమనియు చెప్పబడెను. "శాశ్వత ధర్మగోప్తా"అనుదానిచే జ్ఞానకర్మరూపమగు ధర్మము నిత్యమనియు, వేదప్రమాణకమనియు, అట్టి ధర్మమునకు "ధర్మసంస్థాపనార్థాయ సంభవాని యుగే యుగే"అనిచెప్పుటవలన పర మేశ్వరుడే రక్షకుడనియు చెప్పబడెను.) ॥౧౮॥

నేతత్త్వము కలదో యది నీవే. అట్లయినను జగద్బీజము నాకంటె వేరుగ మరియొకటి కలదను ప్రశ్నపై చెప్పుచున్నాడు.— "త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్॥" మహదాదిస్థూలాంతమగు, నీసర్వవికారజాతరూపమగు విశ్వమునకు "నిధీయతే సర్వమస్మి న్నితి నిధానం" (దీనియందు సర్వముంచబడును గాన నిధానమనబడును.) అవ్యాకృతమను జగద్బీజము నీవే. "ప్రకృతిశ్చప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్" "పరస్మాన్న సన్నాఽసన్న సదస దితి అత్మన ఏవ త్రైవిధ్యం సర్వత్ర యోనిత్వ మపి", "మత్తః పరతరం నాన్యత్" అను నీసూత్ర, శ్రుతి, స్మృతుల ననుసరించి అవ్యాకృతస్వరూపుడవగు నీవే జగద్బీజము. "నేనే నిర్విశేష పరబ్రహ్మమును. జగత్కారణమును గూడ నేనే. అయినను నాకంటె వేరుగ నుపాస్యుడు, జ్ఞాతవ్యుడునగు యీశ్వరుడు కల" డందువేమో, అట్లుకాదు. "త్వ మవ్యయః...మతో మే" జ్ఞానముచేగాని, యజ్ఞానముచే గాని వ్యయములేనివాడు అవ్యయు డనబడును. నీవు అట్టి నిత్యుడవు. శాశ్వతమగు వేదముచే చెప్పబడిన ధర్మములను రక్షించువాడవు నీవే. సృష్ట్యాదికర్తవు గూడ నీవే. "ఏష భూతాధిపతి రేష భూత పాలఏష సేతు ర్విధరణ ఏషాం లోకానా మసంభేదాయ" అను శ్రుతియు నీవిషయమునే చెప్పుచున్నది. "నిర్విశేష బ్రహ్మమును, సవిశేషబ్రహ్మమును గూడ నేనే. అయినను నాకంటె జీవుడు వేరుగ కలడు కాదా?" అను ప్రశ్నముపై జెప్పుచున్నాడు.— 'సనాతనః' 'న జీవో మ్రియతే' అను శ్రుతిచెప్పున నిత్యుడును నీవే. "అయ మాత్మా బ్రహ్మ" అను శ్రుతిచెప్పున పురుషుడును నీవే. ॥౧౮॥

నీలకంఠీయము:— ఈవిధముగ నీయోగైశ్వర్యదర్శనముచే నిన్ను దెలిసికొంటినని చెప్పుచు అప్రమేయత్వమునే వివరించుచుండెను.— "త్వమక్షరం పరమం" నీవు అస్థూలాదిలక్షణములుగల నిష్కలబ్రహ్మస్వరూపుడవు. (ఈచెప్పుటచే సగుణబ్రహ్మము శాఖాచంద్రన్యాయమున నిర్గుణబ్రహ్మ జ్ఞాపకమని చెప్పబడెను.) కనుకనే "వేదితవ్యం" వేదాంతప్రమాణములచే దెలిసికొనదగిన వాడవు గాని,

గీ॥ అనాదిమధ్యాన్త మనన్తవీర్య మనన్తబాహుం శశిసూర్యనేత్రం ।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వ మిదం తపన్తమ్ ॥ ॥౧౯॥

పదవిభాగము:— అనాదిమధ్యాన్తం- అనన్తవీర్యం- అనన్తబాహుం- శశిసూర్యనేత్రం- పశ్యామి- త్వాం- దీప్తహుతాశవక్త్రం- స్వతేజసా- విశ్వం- ఇదం- తపన్తమ్ ॥ ॥౧౯॥

ప్రతిపదార్థము:— త్వాం=నిన్ను; అనాదిమధ్యాన్తం=ఆదిమధ్యాన్తరహితునిగను; అనన్తవీర్యం=నాశరహితమైనపరాక్రమముకలవానినిగను; అనన్తబాహుం=అసంఖ్యాకమైనబాహువులుకలవానినిగను; శశిసూర్యనేత్రం=చంద్రసూర్యులు నేత్రములుకలవానినిగను; దీప్తహుతాశవక్త్రం=ప్రకాశించుచున్న యగ్నిహోత్రుడుముఖముగాకలవానినిగను, స్వతేజసా=నీతేజస్సుచే; ఇదం=ఈ; విశ్వం=జగత్తును; తపన్తం=తపింపజేయుచున్నట్టివానినిగను; పశ్యామి=చూచుచున్నాను. ॥౧౯॥

శాంకరభాష్యమ్:—

కించ— అనాదిమధ్యాన్త మాదిశ్చ మధ్యంచ అంతశ్చ న విద్యతే యస్య సోఽయ మనాదిమధ్యాన్త స్తం త్వామనాదిమధ్యాన్త మనన్తవీర్యం న తవ వీర్యస్యాన్తోఽస్తీ త్యనన్తవీర్యస్తం త్వా మనన్తవీర్యం తథా అనన్తబాహు మనన్తా బాహవో యస్య తవ స త్వ మనన్తబాహుస్తం త్వా మనన్తబాహుం శశిసూర్యనేత్రం శశిసూర్యౌ నేత్రే యస్య తవ సత్వం శశిసూర్యనేత్ర స్తం త్వాం శశిసూర్యనేత్రం చంద్రాదిత్యనయనం పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం దీప్తశ్చాసౌ హుతాశశ్చ స వక్త్రం యస్య తవ స త్వం దీప్తహుతాశవక్త్రస్తం త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వమిదం తపన్తం తాపయన్తమ్ ॥ ॥౧౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓశ్రీకృష్ణపరమాత్మ! నిన్ను ఆదిమధ్యాంతరహితునిగను, అనంతవీర్యము(పరాక్రమము) కలవానినిగను, అనంతమైన బాహువులు కలవానినిగను, చంద్రసూర్యులు నేత్రములుగా కలవానినిగను, ప్రదీప్తమైన యగ్నిహోత్రుడు ముఖముగా కలవానినిగను, నీతేజస్సుచే నిఖిలజగత్తును తపింపజేయుచున్న వానినిగను చూచుచుంటిని. ॥౧౯॥

యుపాసింపదగినవాడవు కావు. సగుణబ్రహ్మస్వరూపుడవు గూడ నీవేయని చెప్పుచున్నాడు.— "త్వమస్య విశ్వస్య పరం నిధానం" నీవే విశ్వమునకు లయస్థానము. (ఈచెప్పుటచే కారకత్వము చెప్పబడెను.) "త్వ మవ్యయః" నీవు వ్యయరహితుడవు. "శాశ్వత ధర్మగోప్తా" నీవు శాశ్వతమైన వైదికధర్మమును రక్షించెదవు. (ఈచెప్పుటచే కార్యబ్రహ్మభూతహిరణ్యగర్భరూపము చెప్పబడెను.) "సనాతనస్త్వం పురుషో మతో మే" చిరంతనుడవగు జీవాత్మవుగూడ నీవే. (ఈవిధముగ విశ్వరూపదర్శనముచే జీవబ్రహ్మైక్యము శాఖాచంద్రమసన్యాయముచే దెలియబడునని చెప్పబడెను. ॥౧౮॥

—• ౧౧వ అధ్యాయము ౧౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఉత్పత్తి, స్థితి, వినాశములు లేనివానిగను, అనంతబాహువులు గల వానిగను (ఇది ముఖాదుల కుపలక్షణము.) చంద్రసూర్యులు నేత్రములుగా కలవానిగను, ప్రజ్వలించెడి యగ్నిహోత్రుడు ముఖముగా కలవానిగను, స్వీయతేజస్సుచే నీవిశ్వమును తపింపజేయు వానిగనునిన్ను జూచుచుంటిని. ॥౧౯॥

గీ॥ ద్యావాపృథివ్యో రిద మన్తరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।
దృష్ట్వాఽద్భుతం రూప మిదం తవోగ్రం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥

పదవిభాగము:— ద్యావాపృథివ్యోః- ఇదం- అంతరం- హి- వ్యాప్తం- త్వయా- ఏకేన- దిశః- చ- సర్వాః- దృష్ట్వా- అద్భుతం- రూపం- ఇదం- తవ- ఉగ్రం- లోకత్రయం- ప్రవ్యథితం- మహాత్మన్ ॥ ॥౨౦॥

ప్రతిపదార్థము:— హేమహాత్మన్=క్షుద్రముకానిస్వభావముకల యో శ్రీకృష్ణపరమాత్మ; ఏకేన=ఒక; త్వయైవ=నీచేతనే; ద్యావాపృథివ్యోః=భూమ్యంతరిక్షములయొక్క; ఇదం=ఈ; అంతరం=మధ్యభాగమున్ను; సర్వాః=నిఖిలమైన; దిశశ్చ=దిక్కులున్ను; వ్యాప్తం=వ్యాప్తమైన; తవ=నీయొక్క;అద్భుతం=అద్భుతమైన; ఉగ్రం=ఉగ్రమైన; ఇదం=ఈ; రూపం=విశ్వరూపమును; దృష్ట్వా=చూచి; లోకత్రయం=ముల్లోకములు; ప్రవ్యథితమ్=భయపడుచున్నది. ॥౨౦॥

శాంకరభాష్యమ్:—

ద్యావాపృథివ్యో రిద మంతరం హ్యంతరిక్షం వ్యాప్తం త్వయైకేన విశ్వరూపధరేణ దిశశ్చ సర్వా వ్యాప్తాదృష్ట్వోపలభ్యాద్భుతం విస్మాపకం రూప మిదం తవోగ్రం క్రూరం లోకానాం త్రయం లోకత్రయం ప్రవ్యథితమ్ భీతం ప్రచలితం వా హేమహాత్మన్నక్షుద్రస్వభావ ॥ ॥౨౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓక్షుద్రముకానిస్వభావముకల శ్రీకృష్ణపరమాత్మ! నీయొక్కనిచేతనే యీపృథివ్యంతరిక్షములయొక్క మధ్యభాగము, నిఖిలదిక్కులును వ్యాపించియున్న యీనీయొక్క భయంకరమైన, అద్భుతమగు రూపమును చూచి మూడు లోకములు భయపడుచున్నవి, లేక, చలించుచున్నది. ॥౨౦॥

శంకరానందీయము:— "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "ఏష సర్వేశ్వరః" "యతో వా ఇమాని భూతాని" ఇత్యాది శ్రుతిప్రామాణ్యము ననుసరించి నీవు చెప్పినదంతయు సత్యమే. అట్లయినను నాకంటె వేరుగ నీజగత్తు కలదుకదా? అను శ్రీకృష్ణప్రశ్న నాశంకించుకొని "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుత్యర్థమును నాధారముగ జేసుకొని యాజగత్తుగూడ నీస్వరూపమే యని చెప్పుచున్నాడు— (శ్లోకార్థము గతార్థము.) నిన్ను విశ్వరూపునిగానున్నవానినిగా చూచుచుంటినని యర్థము. ॥౧౯॥

—• ౧౧వ అధ్యాయము ౨౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ప్రకృతమగు భగవద్రూపముయొక్క వ్యాప్తిని జెప్పుచుండెను.— ద్యావాపృథివులయంతరాళమగు యంతరిక్షము నీయొక్కనిచేతనే వ్యాప్తము.ఈసర్వదిక్కులు నీచే వ్యాప్తము లైనవి. అత్యద్భుతమైనదియు, యుగ్రమైనదియు నగు నీరూపమును జూచి లోకత్రయము నతిభీతమగుచున్నది. (సాధుజనుల కభయము నొసంగువాడా! ఇక నీరూపము నుపసంహరింపుమని యభిప్రాయము.) ॥౨౦॥

గీ॥ అమీ హి త్వా సురసంఘా విశన్తి కేచి ద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి ।
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః స్తువన్తి త్వా స్తుతిభిః పుష్కలాభిః ॥ ॥౨౧॥

పదవిభాగము:— అమీ- హి- త్వా- సురసంఘాః- విశన్తి- కేచిత్- భీతాః- ప్రాఞ్జలయః- గృణన్తి- స్వస్తి- ఇతి- ఉక్త్వా- మహర్షిసిద్ధసంఘాః- స్తువన్తి- త్వా- స్తుతిభిః- పుష్కలాభిః ॥౨౧॥

ప్రతిపదార్థము:— అమీహి=ఈయుద్ధముచేయుటకుసన్నద్ధమైనమహావీరులు; సురసంఘాః= భూభారావతారముకొరకవతీర్ణులైన మనుష్యాకృతిగల వస్వాదిదేవసంఘములు; త్వా=నిన్ను; విశన్తి=ప్రవేశించుచుండిరి; కేచిత్=కొందరు; భీతాః=భయపడినవారై; ప్రాఞ్జలయః=దోశలొగ్గి; గృణన్తి=స్తుతించుచుండిరి; మహర్షిసిద్ధసంఘాః; మహర్షి=మహర్షులయొక్క; సిద్ధ=సిద్ధులయొక్క; సంఘాః=సమూహములు; జగతః=(ఈపదమధ్యాహార్యము) జగమునకు; స్వస్తి=మంగళము; అస్తు=అగుగాక; ఇతి=ఈలాగున; ఉక్త్వా=పలికి; త్వా=నిన్ను; పుష్కలాభిః=సంపూర్ణమైన; స్తుతిభిః=స్తోత్రములచే; స్తువన్తి=స్తుతిచేయుచుండిరి. ॥౨౧॥

శాంకరభాష్యమ్:—

అథాధునాపురా "యద్వా జయేమ యది వా నో జయేయుః" ఇత్యర్జునస్య సంశయ ఆసీత్ తన్నిర్ణయాయ పాండవజయ మైకాంతికం దర్శయామీతి ప్రవృత్తో భగవాం స్తం పశ్యన్నాహ, కించ అమీహి యుద్ధ్యమానా యోద్ధార స్త్వా త్వాం సురసంఘాః యేఽత్ర

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్వమునందు "యద్వా జయేమ యది వా నో జయేయుః"మనము దుర్యోధనాదులను జయించెదమో? దుర్యోధనాదులు మనలనే జయించెదరో? అని యర్జునునికి సంశయము జనించెను. ఇపు డాయర్జునుని సంశయమును తొలిగించు జయనిర్ణయముకొరకు పాండవులకు

శంకరానందీయము:— "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనుశ్రుత్యుక్తరీతిని ఈవిశ్వమంతయు నీస్వరూపమే యను పూర్వోక్తవిషయమునే స్పష్టపరచుచుండెను.:— భూమ్యాకాశముల యంతరాలమంతయు విశ్వరూపుడవగు నీచే వ్యాప్తమైనది. అట్లే ప్రాచ్యాదిసర్వదిక్కులు నీచే వ్యాప్తమైనవి. (ఈచరాచరాత్మకమైన విశ్వమంతయు నీచే వ్యాప్తమైనదని యుపలక్షణముగ గ్రహింపనగును.) దేనిచే నెద్ది వ్యాప్తమగునో, యది తత్స్వరూపమే, అను న్యాయమననుసరించి యీవిశ్వమంతయు "బ్రహ్మైవేదం సర్వం" అను శ్రుతి ననుసరించి త్వత్స్వరూపమాత్రమే యని యర్థము. పైధముగ సార్వాత్మ్యమును చెప్పి విశ్వరూపమును స్తుతించుచుండెను.— "మహాత్మన్!" (మహత్తరమైన విశ్వరూపమగు దేహముకలవాడు మహాత్మ డనబడును.) ఓమహాత్మా! ఆశ్చర్యకరమగు నతిభయంకరమునగు నీరూపమును జూచి త్రిలోకములందునుండు ప్రాణిజాతము వ్యాకుల (క్షుబ్ధ) మగుచున్నది. ॥౨౦॥

—• ౧౧వ అధ్యాయము ౨౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ప్రస్తుతము భూభారసంహారకారిత్వమును ప్రకటించుచున్న భగవంతుని చూచుచు ఆయనుభవము నావిష్కరించుచుండెను.— భూభారావతారమునకై భీష్మాదిరూపమున యవతరించి యుద్ధము చేయుచున్న దేవతాసంఘములు నిన్ను ప్రవేశించుచు కనబడుచున్నారు. అట్లే "త్వాఽసురసంఘాః" అని పదచ్ఛేదము చేయుచో భూభారభూతులగు దుర్యోధనాదిరూపమున యవ

గీ॥ రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ ।
గన్ధర్వయక్షాసురసిద్ధసంఘా వీక్షన్తే త్వా విస్మితా శ్చైవ సర్వే ॥ ॥౨౨॥

పదవిభాగము:— రుద్రాదిత్యాః- వసవః- యే- చ- సాధ్యాః- విశ్వే- అశ్వినౌ- మరుతః- చ- ఊష్మపాః- చ- గన్ధర్వయక్షాసురసిద్ధసంఘాః- వీక్షన్తే- త్వా- విస్మితాః- చ- ఏవ- సర్వే ॥౨౨॥

ప్రతిపదార్థము:— రుద్రాదిత్యాః, రుద్ర=రుద్రగణము; (ఏకాదశరుద్రులు) ఆదిత్యాః=ఆదిత్యగణము (ద్వాదశాదిత్యులు) వసవః=వసుగణము (అష్టవసువులు) యేచ=ఏ; సాధ్యాః=సాధ్యులో; తే=వారున్ను; విశ్వే=త్రయోదశవిశ్వేదేవతలు; అశ్వినౌ=అశ్వినీదేవతలిద్దరున్ను; మరుతశ్చ=సప్తసప్త మరుద్గణమున్ను; ఊష్మపాశ్చ=పితృదేవతలు; గన్ధర్వయక్షాసురసిద్ధసంఘాః= హాహాహూహూప్రభృతిగంధర్వులయొక్క; యక్ష=కుబేరాదియక్షులయొక్క; అసుర=విరోచప్రభృత్యసురులయొక్క; సిద్ధ=కపిలాదిసిద్ధులయొక్క; సంఘాశ్చ=సంఘములున్ను; విస్మితాః=విస్మయావిష్టులై; సర్వే=అందరు; త్వా=నిన్ను; వీక్షన్తే=చూచుచుండిరి. ॥౨౨॥

శాంకరభాష్యమ్:—

భూభారావతారాయావతీర్ణా వస్వాదిదేవసంఘా మనుష్యసంస్థానా త్వాం విశన్తి ప్రవిశన్తో దృశ్యంతే । తత్ర కేచిద్భీతాః ప్రాంజలయః సంతో గృణన్తి స్తువంతి త్వా మన్యే పలాయనేఽప్యశక్తాస్సంతః । యుద్ధే ప్రత్యుపస్థిత ఉత్పాతాదినిమిత్తా న్యుపలక్ష్య స్వస్త్యస్తు జగత ఇత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః మహర్షీణాం సిద్ధానాం చ సంఘాః స్తువంతి త్వాం స్తుతిభిః సంపూర్ణాభిః ॥

కించాన్యత్— రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా రుద్రాదయో గణా విశ్వేఽశ్వినౌ చ దేవౌ మరుత శ్చ ఊష్మపాశ్చ పితరో గంధర్వయక్షాసురసిద్ధసంఘా గంధర్వా హాహాహూహూప్రభృతయో యక్షాః కుబేరప్రభృతయోఽసురా విరోచనప్రభృతయః సిద్ధాః కపిలాదయ స్తేషాం సంఘా గంధర్వయక్షాసురసిద్ధసంఘా స్తే వీక్షంతే పశ్యంతి త్వా త్వాం విస్మితా విస్మయ మాపన్నాః సంత స్త ఏవ సర్వే ॥ ॥౨౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నియమముగ జయమునుచూపించెదను అని శ్రీకృష్ణపరమాత్మ ప్రవృత్తుడాయెను. అట్టి విశ్వరూపధారి యగు శ్రీకృష్ణపరమాత్మను చూచుచు యర్జునుడు పలుకుచుండెను.

ఈయుద్ధవీరులందరు భూభారహరణార్థము మనుష్యరూపమున నవతరించిన వస్వాదిదేవసంఘములు అట్టివారు నిన్ను ప్రవేశించుచున్నవారలై నాచే చూడబడుచుండిరి. అందు కొందరు పలాయనమునందుగూడ నశక్తులై బద్ధాంజలులై (దోశలొగ్గి) నిన్ను స్తుతించుచుండిరి. యుద్ధము సిద్ధమైయుండ ఉత్పాతాదినిమిత్తములను చూచి మహర్షిసంఘము, సిద్ధసంఘము జగత్తునకు కల్యాణముప్రాప్తించుగాక యని పలికి సంపూర్ణమైన స్తుతులచే నిన్ను స్తుతించుచుండిరి. ॥౨౧॥

ఏకాదశరుద్రగణము, ద్వాదశాదిత్యగణము, అష్టవసువులు, సాధ్యులు, త్రయోదశవిశ్వేదేవతలు, ఇద్దరశ్వినీదేవతలు, సప్తసప్తమరుద్గణములు. అగ్నిష్వాత్త్వాదిపితృదేవతలు,

తరించిన యసురసంఘములు విశ్వరూపుడవగు నిన్ను ప్రవేశించుచుండిరి. ఈవిధముగ నుభయసైన్యములలోను కొందరు భీతులై పలాయనాశక్తులై దోసిలొగ్గి నిన్ను స్తుతించుచుండిరి. యుద్ధము దాపరింప నుత్పాత

గీ॥ రూపం మహ త్తే బహువక్త్రనేత్రం మహాబాహో బహుబాహూరుపాదమ్ ।
బహూదరం బహుదంష్ట్రాకరాలం దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్ ॥

పదవిభాగము:— రూపం- మహత్- తే- బహువక్త్రనేత్రం- మహాబాహో!- బహుబాహూరుపాదమ్- బహూదరం- బహుదంష్ట్రాకరాలం- దృష్ట్వా- లోకాః- ప్రవ్యథితాః- తథా- అహమ్ ॥ ॥౨౩॥

ప్రతిపదార్థము:— హేమహాబాహో!=ఓగొప్పబాహువులుకలశ్రీకృష్ణపరమాత్మ; బహువక్త్రనేత్రం=అనేకమైనముఖములునేత్రములుకలిగినట్టిన్ని; బహుబాహూరుపాదం=అనేకమైనబాహువులు, ఊరువులు, పాదములుకలిగినట్టిన్ని; బహూదరం=అనేకమైనయుదరములుకలిగినట్టిన్ని; బహుదంష్ట్రాకరాలం=అనేకమైనకోరలచేభయంకరమైనట్టి; తే=నీయొక్క; మహత్=అతిప్రమాణమైన; రూపం=స్వరూపమును; దృష్ట్వా=చూచి; లోకాః=లౌకికప్రాణులు; భయేన=(ఈపదమధ్యాహార్యము)భయముచే; ప్రవ్యథితాః=ప్రచలితులైరి; అహం=నేను; ప్రవ్యథితః=ప్రచలితుడనైతిని. ॥౨౩॥

శాంకరభాష్యమ్:—

యస్మాత్— రూపం మహ దతిప్రమాణం తే తవ బహువక్త్రనేత్రం బహూని వక్త్రాణి ముఖాని నేత్రాణి చక్షూంషి చ యస్మిం స్తద్రూపం బహువక్త్రనేత్రం హేమహాబాహో! బహుబాహూరుపాదం బహవో బాహవ ఊరవః పాదాశ్చ యస్మి న్రూపే తద్బహుబాహూరుపాదం, కించ బహూదరం బహూ న్యుదరాణి యస్మి న్నితి బహూదరం బహుదంష్ట్రాకరాలం బహ్వీభి ర్దంష్ట్రాభిః కరాలం వికృతం త ద్బహుదంష్ట్రాకరాలం దృష్ట్వా రూప మీదృశం లోకా లౌకికాః ప్రాణినః ప్రవ్యథితాః ప్రచలితా భయేన తథాఽహ మపి ॥౨౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

హాహాహూహూమొదలగుగంధర్వులు, కుబేరాదియక్షులు, విరోచనాద్యసురులు, కపిలాది సిద్ధులుకలరో, వీరలసంఘములు యీసర్వులు విస్మయావిష్టులై నిన్ను చూచుచుండిరి. ॥౨౨॥

ఓగొప్ప బాహువులుకల శ్రీకృష్ణపరమాత్మ! అనేకమైన ముఖములు, నేత్రములు కలిగినట్టిన్ని, అనేకమైన బాహువులు, ఉదరములు, పాదములు కలిగినట్టిన్ని, అనేకమైన యుదరములు కలిగినట్టిన్ని, అనేకమైన దంష్ట్ర(కోర)లచే వికటమైనట్టి అతిప్రమాణమైనట్టి నీయొక్క రూపమును చూచి లౌకికప్రాణులెల్లరు భయముచే ప్రకృష్టముగ కంపితులైరి. అట్లే నేనుకూడ ప్రకృష్టముగ కంపితుడనైతిని. ॥౨౩॥

నిమిత్తముల నూహించి "సమస్తజగత్తునకు స్వస్తి యగుగాక" అని నారదప్రభృతిమహర్షి సిద్ధసంఘములు నీగుణోత్కర్షప్రతిపాదకములగు స్తుతులచే స్తుతించుచుండిరి. ॥౨౧॥

శంకరానందీయము:— నీవు శాశ్వతధర్మగోప్తవుగాన యుగ్రము, నత్యద్భుతమునగు నీస్వరూపమును జూచుటకై బలాధికులగుకొందరు దేవతలు నిన్నుగూర్చి వచ్చుచుండిరి. దుర్బలులగు కొందరు దేవతలు భీతులై దూరమునుండియే దోసిలొగ్గి స్తుతించుచుండిరి. లోకకల్యాణమును కోరినవారై భృగ్వాది మహర్షులును, కపిలాదిసిద్ధులును శబ్దార్థపుష్టిగల స్తోత్రపాఠములచే స్తుతించుచుండిరి. ॥౨౧॥

గీ॥ నభస్స్పృశం దీప్త మనేకవర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్ ।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా ధృతిం న విన్దామి శమం చ విష్ణో ॥

పదవిభాగము:— నభస్స్పృశం- దీప్తం- అనేకవర్ణం- వ్యాత్తాననం- దీప్తవిశాలనేత్రం- దృష్ట్వా- హి- త్వాం- ప్రవ్యథితాంతరాత్మా- ధృతిం- న- విన్దామి- శమం- చ- విష్ణో ॥ ॥౨౪॥

ప్రతిపదార్థము:— నభస్స్పృశం=ద్యులోకమును స్పృశించుచున్నట్టిన్ని; దీప్తం=ప్రజ్వలించుచున్నట్టిన్ని; అనేకవర్ణం=అనేకభయంకరమైనయనేకయవయవసన్నివేశములుకలిగినట్టిన్ని; వ్యాత్తాననం=తెరువబడినముఖములుకలిగినట్టిన్ని; దీప్తవిశాలనేత్రం, దీప్త=ప్రజ్వలింపజేయబడిన; విశాల=విస్తీర్ణమైన; నేత్రం=నేత్రములు కలిగినట్టి; త్వాం=నిన్ను; దృష్ట్వా=చూచి; హేవిష్ణో=ఓసర్వవ్యాపక!; అహం=(ఈపదమధ్యాహార్యము)నేను; ప్రవ్యథితాంతరాత్మా. ప్రవ్యథిత=అతిభయగ్రస్తమైన; అంతరాత్మా=మనస్సుకలవాడనై; ధృతిం=ధైర్యమును; శమంచ=శాంతిని; (మనస్తుష్టిని) నవిన్దామి=పొందుటలేదు. ॥౨౪॥

శాంకరభాష్యమ్:—

తతేదం కారణమ్— నభస్స్పృశం ద్యుస్పర్శ మిత్యర్థః, దీప్తం ప్రజ్వలిత మనేకవర్ణ మనేకే వర్ణా భయంకరా నానాసంస్థానా యస్మిం స్త్వయి తం త్వా మనేకవర్ణం వ్యాత్తాననం వ్యాత్తాని వివృతా న్యాననాని ముఖాని యస్మిం స్త్వయి తం త్వాం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రం దీప్తాని ప్రజ్వలితాని విశాలాని విస్తీర్ణాని నేత్రాణి యస్మిం స్త్వయి తం త్వాం దీప్తవిశాలనేత్రం దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా ప్రవ్యథితః ప్రభీతోఽంతరాత్మా మనో యస్య మమ సోఽహం ప్రవ్యథితాంతరాత్మా సన్ధృతిం ధైర్యం న విన్దామి న లభే శమం చోపశమం మనస్తుష్టిం హేవిష్ణో! ॥౨౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అర్జునునకు విశ్వరూపసందర్శనముచే చలించుటయందు కారణమేమనిన? ద్యులోకమును స్పృశించుచున్నట్టిన్ని, ప్రజ్వలితమైనట్టిన్ని, భయంకరమైన నానావయవసన్నివేశములు కలిగినట్టిన్ని, తెరువబడిన ముఖములు కలిగినట్టిన్ని, ప్రజ్వలితమైన విశాలమగు నేత్రములు కలిగినట్టి నిన్ను చూచి యత్యంతము భీతమైన యంతరాత్మకలవాడనై ధైర్యమును, మనస్తుష్టిని నేను పొందుటలేదు. కాన ప్రచలితుడనైతినని యాశయము. ॥౨౪॥

—• ౧౧వ అధ్యాయము ౨౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మరియు, రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవులు, అశ్వినులు, మరుత్తులు, పితరులు, గంధర్వ, యక్షాసురసిద్ధసంఘములు నిన్ను జూచుచు అలౌకిక చమత్కారమును పొందుచుండిరి. ॥౨౨॥

శ్రీధరీయము:— "ఊష్మపాః" (ఊష్మను పానముచేసెడివారు.) (ఊష్మభాగా హి పితరః") (పితరులు ఊష్మభాగులు) అను శ్రుతియు, "యావ దుష్ణం భవే దన్నం యావ దశ్నంతి వాగ్యతాః। పితరస్తావ దశ్నంతి యావ న్నోక్తా హవిర్గుణాః ॥" (ప్రత్యాబ్దికాదులయందు భోక్తలు భుజించుసమయమున యాభోక్తలయం దావాహ్వానింపబడిన పితరులు అన్నము వెచ్చగ నున్నంతవరకే, వాగ్యతులైయున్నంతవరకే, హవిర్గుణములను కీర్తింపనంతవరకే భోజ్యము నారగించెదరు.) అను స్మృతియు (పితరులు ఊష్మపులని చెప్పుచున్నవి.) శేషముగ తార్థము. ॥౨౨॥

గీ॥ దంష్ట్రాకరాళాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసంనిభాని ।
దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస ॥ ॥౨౫॥

పదవిభాగము:— దంష్ట్రాకరాళాని- చ- తే- ముఖాని- దృష్ట్వా- ఏవ- కాలానలసన్నిభాని- దిశః- న- జానే- న- లభే- చ- శర్మ- ప్రసీద- దేవేశ- జగన్నివాస ॥ ॥౨౫॥

ప్రతిపదార్థము:— హే దేవేశ=ఓ దేవతలకు ప్రభువా!; జగన్నివాస=జగత్తుల కాధారభూతుడా!; తే=నీయొక్క; దంష్ట్రాకరాళాని, దంష్ట్రా=కోరలచే; కరాళాని=వికృతమైన; కాలానలసన్నిభాని, కాలానల=ప్రలయ కాలమునందు లోకములనుదహింపజేయుయగ్నితో; సన్నిభాని=సమానమైన; ముఖాని=ముఖములను; దృష్ట్వైవచ=చూచియే; దిశః=దిక్కులను; నజానే=గుర్తెరుగకుంటిని; శర్మ=సుఖమును; నలభే=పొందకుంటిని; ప్రసీద=అనుగ్రహింపుము. ॥౨౫॥

శాంకరభాష్యమ్:—

కస్మాత్— దంష్ట్రాకరాలాని దంష్ట్రాభిః కరాలాని వికృతాని తే తవ ముఖాని దృష్ట్వైవోపలభ్య కాలానలసంనిభాని ప్రలయకాలే లోకానాం దాహకోఽగ్నిః కాలానల స్తత్సన్నిభాని కాలానలసదృశాని దృష్ట్వే త్యేత ద్దిశః పూర్వాపరవివేకేన న జానే దిఙ్మూఢో జాతోఽస్మ్యతో న లభే చ నోపలభే చ శర్మ సుఖ మతః ప్రసీద ప్రసన్నో భవ హే దేవేశ జగన్నివాస! ॥ ॥౨౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓదేవేశ! ఓజగన్నివాస! కోరలచే భయంకరమైన ప్రలయకాలమునందు లోకములు దహింపజేయు యగ్ని "కాలానల" మనబడును. అట్టి కాలానలముతో సమానమైన ముఖములును జూచి దిక్కులను గుర్తించలేకుంటిని. సుఖమును పొందకుంటిని. అనుగ్రహింపుము. ॥౨౫॥

—• ౧౧వ అధ్యాయము ౨౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఓ గొప్ప బాహువులుగల భగవానుడా! అతిప్రమాణము, అనేకముఖ, నేత్రములు గలదియు. బహుబాహు; ఊరు, పాదములు కలదియు, బహూదరములు కలదియు; బహుదంష్ట్రలచే భయానకమనగు నీస్వరూపము జూచి సర్వప్రాణులు భయపీడితు లగుచుండిరి. అట్లే నేనును భయపీడితుడ నగుచుంటిని. ॥౨౩॥

—• ౧౧వ అధ్యాయము ౨౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అంతరిక్షవ్యాపియు, ప్రజ్వలించుచున్నదియు, భయంకర నానాసంస్థానవిశేషములు కలదియు; వివృతమైన ముఖము కలదియు, ప్రజ్వలిత విశాలనేత్రములు కలదియు. నగు నీవిశ్వరూపమును (నిన్ను)జూచి పరిక్షుబ్ధమనస్కుడనై ధైర్యము నవలంబింపలేకుంటిని. మరియు శాంతి నొందలేకుంటిని. ॥౨౪॥

—• ౧౧వ అధ్యాయము ౨౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— హేదేవేశ! జగన్నివాస! దంష్ట్రాకరాలములు ప్రలయకాలానలసదృశములు నగు నీముఖములను జూచినంతమాత్రముననే కల్గిన భయముచే దిక్కుల నెరుగకుంటిని. నీరూ

గీ॥ అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వే సహైవావనిపాలసంఘైః ।
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ సహాస్మదీయై రపి యోధముఖ్యైః ॥

పదవిభాగము:— అమీ- చ- త్వాం- ధృతరాష్ట్రస్య- పుత్రాః- సర్వే- సహ- ఏవ- అవనిపాలసంఘైః- భీష్మః- ద్రోణః- సూతపుత్రః- తథా- అసౌ- సహ- అస్మదీయైః- అపి- యోధముఖ్యైః ॥ ॥౨౬॥

ప్రతిపదార్థము:— అమీ=ఈ; ధృతరాష్ట్రస్య=ధృతరాష్ట్రునియొక్క; సర్వే=సమస్తమైన; పుత్రాః=కుమారులగుదుర్యోధనాదులు; భీష్మః=భీష్ముడు; ద్రోణః=ద్రోణాచార్యులు; తథా=అట్లే; అసౌ= సూతపుత్రశ్చ=కర్ణుడును; అవనిపాలసంఘైస్సహైవ=భూపరిపాలకక్షత్రియసంఘముతోగూడ; అస్మదీయైః= మా సంబంధమైన; యోధముఖ్యైరపి=యోధముఖ్యులగుధృష్టద్యుమ్నుడు మొదలగువారితోగూడ; త్వాం= నిన్ను; విశన్తి=(ఈపదమపకృష్టము)ప్రవేశించుచుండిరి. ॥౨౬॥

శాంకరభాష్యమ్:—

యేభ్యో మమ పరాజయాశంకాఽఽసీ త్సా చాపగతా యతః— అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రా దుర్యోధనప్రభృతయ స్త్వరమాణా విశంతీతి వ్యవహితేన సంబంధః । సర్వే సహైవ సంహతా అవనిపాలసంఘై రవనిం పృథ్వీం పాలయంతీ త్యవనిపాలా స్తేషాం సంఘైః । కించ భీష్మో ద్రోణః సూతపుత్రః కర్ణ స్తథాఽసౌ సహాస్మదీయై రపి ధృష్టద్యుమ్న ప్రభృతిభి ర్యోధముఖ్యై ర్యోధానాం ముఖ్యైః ప్రధానై స్సహ ॥ ॥౨౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓ శ్రీకృష్ణప్రభూ! ఎవరివలన నాకు అపజయము ప్రాప్తించునని శంకించుచుంటినో అట్టి శంకగూడ తొలగినదని చెప్పుచున్నాడు— ఈధార్తరాష్ట్రులుగూడ భూపాలసంఘము లతోగూడ తొందరతో నిన్ను ప్రవేశించుచుండిరి. మరియు భీష్ముడు, ద్రోణుడు, ఈకర్ణుడు, వీరు, మన పక్షీయులగు ధృష్టద్యుమ్నాదియోధప్రముఖులతో గూడ త్వరాయుక్తులై నిన్ను ప్రవేశించుచుండిరి. ॥౨౬॥

పము జూచుచుంటిని. కాని సుఖమును పొందలేకుంటిని. కాన (నీరూపదర్శనముచే సుఖము కలుగునట్లు) అను గ్రహించుము. ॥౨౫॥

—• ౧౧వ అధ్యాయము ౨౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "మమ దేహే గుడాకేశ య చ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి" అనుదానిచే చెప్పబడిన శత్రుపరాజయమును, మనజయమును చూడుమను విషయమునే యైదు శ్లోకములచే జెప్పుచున్నాడు.— ఈధృతరాష్ట్రపుత్రులు (యుయుత్సువువినా) నూర్గురును, తమపక్షమందున్న రాజవర్గ ముతోగూడ నిన్ను ప్రవేశించుచుండిరి. మరియు నజేయులనుకొనిన భీష్ముడు, ద్రోణుడు, ("అసౌ" సర్వదా నాకువిద్వేషియగు) ఈకర్ణుడు, మనపక్షమందున్న ముఖ్యయోధులతోగూడ నిన్నుప్రవేశించుచుండిరి ॥౨౬॥

గీ॥ వక్త్రాణి తే త్వరమాణా విశంతి దంష్ట్రాకరాళాని భయానకాని ।
కేచి ద్విలగ్నా దశనాంతరేషు సంధృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః ॥ ॥౨౭॥

పదవిభాగము:— వక్త్రాణి- తే- త్వరమాణాః- విశంతి- దంష్ట్రాకరాళాని- భయానకాని- కేచిత్- విలగ్నాః- దశనాంతరేషు- సంధృశ్యంతే- చూర్ణితైః- ఉత్తమాంగైః ॥ ॥౨౭॥

ప్రతిపదార్థము:— దంష్ట్రాకరాళాని=కోరలచేభయంకరములును; భయానకాని=స్వతఃభయంకరములునగు; తే=నీయొక్క; వక్త్రాణి=ముఖములను; త్వరమాణాః=తొందరతోకూడినవారై; విశంతి=ప్రవేశించుచుండిరి; కేచిత్=నీముఖమునందుప్రవేశించినవారిలోగొందరు; చూర్ణితైః=చూర్ణముగాచేయబడిన; ఉత్తమాంగైః=శిరస్సులతోగూడ; దశనాంతరేషు=దంతములయొక్కమధ్యప్రదేశములయందు; విలగ్నాః=చిక్కొనినవారై; సంధృశ్యంతే=అగుపడుచుండిరి. ॥౨౭॥

గీ॥ యథా నదీనాం బహవోఽంబువేగాః స్సముద్ర మేవాఽభిముఖా ద్రవంతి ।
తథా తవామీ నరలోకవీరా విశంతి వక్త్రా ణ్యభివిజ్వలంతి ॥ ॥౨౮॥

పదవిభాగము:— యథా- నదీనాం- బహవః- అంబువేగాః- సముద్రం- ఏవ- అభిముఖాః- ద్రవంతి- తథా- తవ- అమీ- నరలోకపాలాః- విశంతి- వక్త్రాణి- అభివిజ్వలంతి ॥ ॥౨౮॥

ప్రతిపదార్థము:— యథా=ఎట్లు; నదీనాం=నదులయొక్క; బహవః=అనేకములైన; అంబువేగాః=జలవేగములు; సముద్రమేవ=సముద్రమునే; అభిముఖాః=అభిముఖములై; ద్రవంతి=ప్రవహించుచున్నవో; తథా=అట్లే; అమీ=ఈః; నరలోకవీరాః=మనుష్యలోకమునవీరులగుభీష్మాదులు; తవ=నీయొక్క; అభివిజ్వలంతి=అంతటనుప్రకాశించుచున్న: వక్త్రాణి=ముఖములను; విశంతి=ప్రవేశించుచుండిరి. ॥౨౮॥

శాంకరభాష్యమ్:—

కించ— వక్త్రాణి ముఖాని తే తవ త్వరమాణా స్త్వరాయుక్తా స్సంతో విశంతి. కిం విశిష్టాని ముఖాని దంష్ట్రాకరాలాని భయానకాని భయంకరాణి । కించ కేచిన్ముఖాని ప్రవిష్టానాం మధ్యే విలగ్నా దశనాంతరేషు దంతాంతరేషు మాంస మివ భక్షితం సంధృశ్యంత ఉపలభ్యంతే చూర్ణితై శ్చూర్ణీకృతై రుత్తమాంగై శ్శిరోభిః ॥ ॥౨౭॥

కథం ప్రవిశంతి ముఖా నీత్యాహ— యథా నదీనాం స్రవంతీనాం బహవోఽనేకేఽమ్బూనాం వేగా అంబువేగా స్త్వరావిశేషా స్సముద్ర మేవాభిముఖాః ప్రతిముఖా ద్రవంతి ప్రవిశంతి తథా తద్వ త్తవామీ భీష్మాదయో నరలోకవీరా మనుష్యలోకశూరా విశంతి వక్త్రా ణ్యభివిజ్వలంతి ప్రకాశమానాని ॥ ॥౨౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మఱియు వారు కోరలచే భయంకరములై, స్వతఃభీకరములై యున్న నీముఖములను త్వరాయుక్తులై ప్రవేశించుచుండిరి. మరియు నీముఖమున ప్రవేశించువారిలో గొందరు చూర్ణముగా చేయబడిన (నలుగగొట్టబడిన) శిరస్సులతో దంతముల మధ్యభాగమునందు భక్షితమాంసఖండమువలె చిక్కువడి కనుపడుచుండిరి. ॥౨౭॥

ఎట్లు అనేకములగు నదీవేగములు సముద్రమునుగూర్చి అభిముఖములై ప్రవహించుచు సముద్రమునే ప్రవేశించుచున్నవో యట్లే మనుష్యలోకమున వీరులైన యీభీష్మాదులు ప్రకాశించుచున్న నీయొక్క ముఖములను ప్రవేశించుచుండిరి. ॥౨౮॥

గీ॥ యథా ప్రదీప్తం జ్వలనం పతంగా విశంతి నాశాయ సమృద్ధవేగాః।
తథైవ నాశాయ విశంతి లోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥ ॥౨౯॥

పదవిభాగము:— యథా- ప్రదీప్తం- జ్వలనం- పతంగాః- విశంతి- నాశాయ- సమృద్ధవేగాః- తథా- ఏవ- నాశాయ- విశంతి- లోకాః- తవ- అపి- వక్త్రాణి- సమృద్ధవేగాః॥ ॥౨౯॥

ప్రతిపదార్థము:— యథా=ఎట్లు; ప్రదీప్తం=ప్రజ్వలించుచున్న; జ్వలనం=అగ్నిహోత్రిని; పతంగాః=పక్షులు(శలభములు) సమృద్ధవేగాః=ఉద్భూతవేగముకలవై; నాశాయ=నాశనముకొరకు; విశంతి=ప్రవేశించుచున్నవో; తథైవ=అట్లే; సమృద్ధవేగాః=ఉద్భూతవేగముగల; లోకాః=ప్రాణులు; నాశాయ=నాశనముకొంకు; తే=నీయొక్క; వక్త్రాణి=ముఖములను; విశంతి=ప్రవేశించుచుండిరి. ॥౨౯॥

శాంకరభాష్యమ్:—

తే కిమర్థం ప్రవిశంతి కథం చేత్యాహ— యథా ప్రదీప్తం జ్వలన మగ్నిం పతంగాః పక్షిణో విశంతి నాశాయ వినాశాయ సమృద్ధవేగాః సమృద్ధ ఉద్భూతో వేగో గతి ర్యేషాం తే సమృద్ధవేగా స్తథైవ నాశాయ విశంతి లోకాః ప్రాణిన స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥౨౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆప్రాణులు ఎందునిమిత్తమై ప్రవేశించుచుండిరి? ఎట్లు ప్రవేశించుచుండిరి? అను ప్రశ్నపై జెప్పుచున్నాడు— ఎట్లు ప్రజ్వలించుచున్న యగ్నిహోత్రమును శలభములు (మిడుతలు)సముద్భూతమైన వేగముకలవై తను నాశమునకై ప్రవేశించునో అట్లే యీప్రాణులు సమృద్ధవేగులై తమ వినాశనమునకై నీముఖములను ప్రవేశించుచున్నారు. ॥౨౯॥

—• ౧౧వ అధ్యాయము ౨౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈధృతరాష్ట్ర ప్రభృతులందరు దంష్ట్రాకరాలములగు నీవక్త్రములను త్వరతో ప్రవేశించుచుండిరి. వీరిలో కొందరు చూర్ణితములైన శిరస్సులుగలవారై దంతాంతరాళములలో జిక్కుకొని కన్పట్టుచున్నారు. ॥౨౭॥

నీలకంఠీయము:— ఈశ్లోకమున యభిప్రాయమిది.— ధృతరాష్ట్రపుత్రులు త్రైలోక్యశరీరుడగు నిన్ను పాపానురూపముగ నీపాయుస్థానస్థితములగు నరకములనే పొందుచుండిరి. భీష్మాదులగు భక్తులు- అగ్నియు, బ్రాహ్మణులు, వేదములు వీటికి యుత్పత్తిస్థానమగు నీముఖమును ప్రవేశించుచుండిరి. (ఉత్తమగతులను పొందుచుండిరి.) అనుభావమును సూచించుటకు "త్వాంధార్త రాష్ట్రా విశంతి" అనియు, "తే భీష్మాదయః వక్త్రాణి విశంతి" అని పృథక్కథనముచే సూచింపబడెను. ॥౨౭॥

—• ౧౧ అధ్యాయము ౨౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఎట్లుఅనేక మార్గగాములగు నదుల యుదకజవప్రవాహములు సముద్రాభిముఖములై ప్రవహించి సముద్రమునే పొందుచున్నవో యట్లే యీనరలోకవీరసంఘములు అంతట ప్రజ్వలించు నీముఖములను ప్రవేశించుచున్నవి. ॥౨౮॥

పరమార్థప్రపా:— నానామార్గప్రవృత్తములైన నదీవేగములు సముద్రాభిముఖముగ ప్రవహించి సముద్రమున ప్రవేశించి, సముద్రాకారమునే యెట్లు పొందుచున్నవో యట్లె పుణ్యాత్ములగు యీభీష్మాదులు గూడ నీవక్త్రములందు ప్రవేశించి నీస్వరూపము నొందుచుండిరి. ॥౨౮॥

గీ॥ లేలిహ్యసే గ్రసమాన స్సమంతా ల్లోకా న్సమగ్రా న్వదనై ర్జ్వలద్భిః ।
తేజోభి రాపూర్య జగత్సమగ్రం భాస స్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో! ॥ ॥౩౦॥

పదవిభాగము:— లేలిహ్యసే- గ్రసమానః- సమన్తాత్- లోకాన్- సమగ్రాన్- వదనైః- జ్వలద్భిః- తేజోభిః- ఆపూర్య- జగత్- సమగ్రం- భాసః- తవ- ఉగ్రాః- ప్రతపన్తి- విష్ణో ॥ ॥౩౦॥

ప్రతిపదార్థము:— హేవిష్ణో!—ఓవ్యాపనశీలుఁడా; త్వం—నీవు; జ్వలద్భిః—ప్రజ్వలించుచున్న, వదనైః—ముఖములచే; సమగ్రాన్—సమస్తమైన, లోకాన్—లోకములను, సమన్తాత్—అంతటను, గ్రసమానః—మ్రింగుచున్నవాఁడవై, లేలిహ్యసే—ఆస్వాదించుచుంటివి, తే—నీయొక్క, భాసః—దీప్తులు, సమగ్రం—సమస్తమైన, జగత్—జగత్తును, తేజోభిః—కాంతులచే, ఆపూర్య—పూరించి, ప్రతపన్తి—తపింపజేయుచున్నవి ॥

శాంకరభాష్యమ్:—

త్వం పునః లేలిహ్యసే ఆస్వాదయసి గ్రసమానోఽన్తః ప్రవేశయ న్సమన్తతో లోకా న్సమగ్రా న్సమస్తా న్వదనై ర్వక్త్రై ర్జ్వలద్భి ర్దీప్యమానై స్తేజోభి రాపూర్య సంవ్యాప్య జగత్సమగ్రం సహాగ్రేణ సమస్త మిత్యేతత్ । కించ భాసో దీప్తయ స్తవోగ్రాః క్రూరాః ప్రతపంతి ప్రతాపం కుర్వంతి హేవిష్ణో వ్యాపనశీల ॥ ॥౩౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓవ్యాపశీలుఁడ వగు శ్రీకృష్ణా! నీవు ప్రజ్వలించుచున్న ముఖములచే సమస్తలోకములను పూర్తిగ మ్రింగుచున్నవాఁడవై, యాస్వాదించుచుంటివి. నీయుగ్రమైన దీప్తులు కాంతులచే సర్వజగమును వ్యాపించి తపింపజేయుచున్నవి. ॥౩౦॥

— ౧౧వ అధ్యాయము ౨౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు —

మధుసూదనసరస్వతీయము:— అబుద్ధిపూర్వకప్రవేశమునకు నదీవేగమును దృష్టాంతముగాఁ జెప్పి, బుద్ధిపూర్వకప్రవేశమును దృష్టాంతముతో జెప్పుచుండెను.— ఎట్లు మిడుతలు వేగసమృద్ధములై తమనాశనమునకై ప్రదీప్తాగ్నిని ప్రవేశించునో యట్లే యీదుర్యోధనాది ప్రాణిజాతములు బుద్ధిపూర్వకముగా తమ నాశనమునకై నీముఖములందు ప్రవేశించుచున్నారు; ॥౨౯॥

— ౧౧వ అధ్యాయము ౩౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు —

మధుసూదనసరస్వతీయము:— యుద్ధము చేయు కోరికగల రాజులయొక్క భగవన్ముఖప్రవేశనమును జెప్పి, ప్రస్తుతము భగవంతుని యొక్కయు, భగవంతుని కాంతులయొక్కయు, బ్రవృత్తిని చెప్పుచున్నాఁడు.— పైవిధముగ వేగముతో ప్రవేశించుచున్న దుర్యోధనాదుల నందరను ప్రజ్వలించుచున్న ముఖములతో మ్రింగుచుంటివి. ఓమహావిష్ణూ! నీయొక్క తేజస్సులచే సమస్తజగత్తును పూరించి నీవుంటివిగాన నీతీవ్రములగు తేజస్సులు తపింపజేయుచున్నవి. ॥౩౦॥

గీ॥ ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో నమోఽస్తు తే దేవవర ప్రసీద ।
విజ్ఞాతు మిచ్ఛామి భవన్త మాద్యం నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥ ॥౩౧॥

పదవిభాగము:— ఆఖ్యాహి- మే- కః- భవాన్- ఉగ్రరూపః- నమః- అస్తు- తే- దేవవర- ప్రసీద- విజ్ఞాతుం- ఇచ్ఛామి- భవంతం- ఆద్యం- న- హి- ప్రజానామి- తవ- ప్రవృత్తిమ్ ॥ ॥౩౧॥

ప్రతిపదార్థము:— ఉగ్రరూపః=క్రూరాకారముకల; భవాన్=నీవు; కః=ఎవడవో; మే=నాకొరకు; ఆఖ్యాహి=చెప్పుము; దేవవర=దేవతలలోశ్రేష్ఠుడా; తే=నీకొరకు; నమః=నమస్కారము; అస్తు=అగుగాక; ప్రసీద=అనుగ్రహించుము; ఆద్యం=ఆదిపురుషుడవగు; భవంతం=నిన్ను; విజ్ఞాతుం=విశేషముగా తెలిసికొనుటకు; ఇచ్ఛామి=కోరుచుంటిని; తవ=నీయొక్క; ప్రవృత్తిం=చేష్టను; నహిప్రజానామి= తెలిసికొనలేకుంటిని. ॥౩౧॥

---

శాంకరభాష్యమ్:—

యత ఏవ ముగ్రస్వభావోఽతః— ఆఖ్యాహి కథయ మే మహ్యం కో భవా నుగ్రరూపః క్రూరాకారః । నమోఽస్తు తే తుభ్యం హే దేవవర దేవానాం ప్రధాన! ప్రసీద ప్రసాదం కురు విజ్ఞాతుం విశేషేణ జ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్య మాదౌ భవ మాద్యమ్ । న హి యస్మా త్ప్రజానామి తవ త్వదీయాం ప్రవృత్తిం చేష్టామ్ ॥ ॥౩౧॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్వోక్తవిధముగా నుగ్రస్వరూపుడవుగాన—ఉగ్రస్వరూపుడ వగు నీవెవ్వడవు? నాకు చెప్పుము. దేవశ్రేష్ఠుడా! నీకై నమస్కారమగుగాక. అనుగ్రహింపుము. నీప్రవృత్తిని తెలిసికొనలేకుంటిని. కాన ఆదిపురుషుడవగు నిన్ను తెలిసికొనగోరుచుంటిని. ॥౩౧॥

---

—• ౧౧వ అధ్యాయము ౩౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈవిధముగ నుగ్రరూడపువగు నీవెవడవో అత్యంతానుగ్రాహ్యుడనగు నాకు తెల్పుము. సర్వగురుడవగు నీకై నమస్కారము. ఓదేవశ్రేష్ఠుడా! క్రౌర్యత్యాగరూపానుగ్రహమును జేయుము. నీసఖుడనైనను నీప్రవృత్తిని తెలిసికొనలేకుంటిని. న కాసర్వకారణుడవగు నిన్ను దెలిసికొనగోరుచుంటిని. ॥౩౧॥

శంకరానందీయము:— ప్రలయకాలమునందు ప్రలయాంతకుడువలె నీవు మహాశూరులను గూడ మ్రింగుచుంటివి. విచారింప నీకృత్యము మహాద్భుతము. కాన నీవెవడవో నాకు జెప్పుము అని యడుగుచున్నాడు. ఓదేవతాశ్రేష్ఠుడా! నీకు నమస్కారము. అనుగ్రహింపుము. ఈయుగ్రత్వమును వీడి ప్రసన్నుడవగుము. నీవెవడవు? ప్రలయకాల రుద్రుడవా? ప్రలయాగ్నిహోత్రుడవా? మహామృత్యుస్వరూపుడవా? లేక, కాలాన్తకుడవా? లేక మరొకడవా? నీస్వరూపమును ప్రవృత్తిని నాకు జెప్పుము. "ఆసమంతా దత్తుం ప్రవృత్తః ఆద్యః" (అంతటను తినుటకు ప్రవృత్తు డాద్యుడనబడును.) లేక "ఆదౌ భవ ఆద్యః" (ఆదికాలముననుండువాడు ఆద్యుడనబడును. నిన్ను సంహారకర్తలలో నగ్రేసరునిగా జగదాద్యుడగు యీశ్వరునిగా తెలిసికొనుటకు కోరుచుంటినిగాన చెప్పుమని యర్థము. నాస్వరూపము నాచేష్టాదర్శనముచేతనే తెలియబడును. ఇక నీవెవడవను యీప్రశ్న మెట్టి దందువా? అట్లుకాదు. "నహి ప్రజానామి తవ ప్రవృత్తిం" నేను మనుష్యుడను, కించిజ్ఞుడుగాన నీప్రవృత్తి తెలియకున్నది. కాన నీవే చెప్పుమని యర్థము. ॥౩౧॥

శ్రీభగవా నువాచ: —

గీ॥ కాలోఽస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో లోకా న్సమాహర్తు మిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వా న భవిష్యంతి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥౩౨॥

పదవిభాగము:— శ్రీభగవాన్-ఉవాచ-కాలః-అస్మి-లోకక్షయకృత్-ప్రవృద్ధః-లోకాన్-సమాహర్తుం-ఇహ-ప్రవృత్తః-ఋతే-అపి-త్వా-న-భవిష్యంతి-సర్వే-యే-అవస్థితాః-ప్రత్యనీకేషు-యోధాః ॥ ॥౩౨॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=శ్రీకృష్ణభగవానులు; ఉవాచ=పలికెను; లోకాన్=లోకములను; సమాహర్తుం=సంహరించుటకై; ఇహ=ఇపుడు; ప్రవృత్తః=ప్రవర్తించినట్టియు; లోకక్షయకృత్=లోకములనునశింపజేయునట్టియు; ప్రవృద్ధః=వృద్ధినిపొందిన; కాలః=క్రియాశక్త్యుపహితపరమేశ్వరుడనై; అహం=(ఈపదమధ్యాహార్యము)నేను; అస్మి=అయితిని; ప్రత్యనీకేషు=ప్రతిపక్షభూతములగుప్రతిసేనలయందు; యే=ఏభీష్మద్రోణాదులు; అవస్థితాః=నిలచిరో; తే=అట్టి; సర్వే=సమస్తయోధులును; ఋతేఽపిత్వా=నిన్ను విడచినను; నభవిష్యంతి=ఉండరు ॥ ॥౩౨॥

శాంకరభాష్యమ్:—

కాలోఽస్మీతి— కాలోఽస్మి లోకక్షయకృ ల్లోకానాం క్షయం కరోతీతి లోకక్షయకృ త్ప్రవృద్ధో వృద్ధిం గతో యదర్థం ప్రవృద్ధ స్తచ్ఛృణు లోకా న్సమాహర్తుం సంహర్తు మిహాస్మి న్కాలే ప్రవృత్తః। ఋతేఽపి వినాపి త్వా త్వాం న భవిష్యంతి భీష్మద్రోణకర్ణప్రభృతయః సర్వే యేభ్య స్త్వాఽఽశంకా యేఽవస్థితాః ప్రత్యనీకే ష్వనీక మనీకం ప్రతి ప్రత్యనీకేషు ప్రతిపక్షభూతే ష్వనీకేషు యోధా యోద్ధారః ॥ ॥౩౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓయర్జునా! నేను లోకములను నశింపజేసెడి ప్రవృద్ధమైన కాలమును (క్రియాశక్త్యుపహితపరమేశ్వరుడను) అయితిని. 'నీవిట్లు ప్రవృద్ధుడవగుటకు ప్రయోజన మే' మందువా? వినుము! ఈయుద్ధసమయమున లోకములను సంహరించుటకై ప్రవృత్తుడనైతిని. నీవు యుద్ధము చేయకున్నను మన శత్రుసైన్యములయందున్న భీష్మద్రోణాదియోధవరు లందరుగూడ నిక యుండజాలరు. ॥౩౨॥

—• ౧౧వ అధ్యాయము ౩౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వోక్తవిధముగ నర్జునునిచే ప్రార్థితుడై శ్రీకృష్ణభగవానులు తన ప్రవృత్తి దేని నిమిత్తమో ఆవిషయమును మూడు శ్లోకములచే చెప్పుచున్నాడు.— నేను క్రియాశక్త్యుపహితుడనైన కాలస్వరూపుడనై సర్వసంహర్తనైతిని. ఇపుడు ప్రవృద్ధుడనై దుర్యోధనాదులను సంహరించుటకై ప్రవృత్తుడనైతిని; 'నాప్రవృత్తిని విడచి యిది యెట్లు పొసగు' ననెదవా? వినుము. నిన్ను విడచి, (నీవ్యాపారములేకున్నను) నావ్యాపారము చేతనే యీభీష్మద్రోణాదులు నుండరు. (నశించెదరు.) (యుద్ధము చేయుట కనర్హులుగా నీచే తలవబడిన భీష్మద్రోణాదులు, మరియు నితరులు నెవరు శత్రుసైన్యములలో కలరో

తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్।
మయైవైతే నిహతాః పూర్వ మేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥33॥

ప్ర భా గ ము:— తస్మాత్- త్వం- ఉత్తిష్ఠ- యశః- లభస్వ- జిత్వా- శత్రూన్-
రాజ్యం- సమృద్ధం- మయా- ఏవ- ఏతే- నిహతాః- పూర్వం- ఏవ- నిమిత్తమాత్రం- భవ-
॥33॥

ప దా ర్థ ము:— తస్మాత్=ఆ కారణమువలన; త్వం=నీవు; ఉత్తిష్ఠ=లెమ్ము; యశః=
లభస్వ=పొందుము; శత్రూన్=శత్రువులను; జిత్వా=జయించి; సమృద్ధం=నిస్సపత్నమైన;
రాజ్యమును; భుంక్ష్వ=అనుభవింపుము: ఏతే=వీరు; మయైవ=నాచేతనే; పూర్వమేవ=పూర్వము
నిహతాః=చంపబడిరి; హేసవ్యసాచిన్=ఎడమచేయితోగూడబాణములనుప్రయోగించుఓయర్జునా;
నిమిత్తమాత్రం=నిమిత్తమాత్రుడవై; భవ=అగుము. ॥33॥

భాష్యమ్:—

యస్మా దేవమ్— యస్మా త్త్వ ముత్తిష్ఠ భీష్మద్రోణప్రభృతయో౽తిరథా
దేవై రప్యర్జునేన జితా ఇతి యశో లభస్వ కేవలం పుణ్యైర్హి త త్ప్రాప్యతే జిత్వా
దుర్యోధనప్రభృతీ న్భుంక్ష్వ రాజ్యం సమృద్ధ మసపత్న మకంటకమ్ । మయైవైతే
... యేన హతాః ప్రాణై ర్వియోజితాః పూర్వ మేవ । నిమిత్తమాత్రం భవ త్వం
... చి న్సవ్యేన వామే నాపి హస్తేన శరాణాం క్షేప్తా త్సవ్యసాచీ త్యుచ్యతే౽ర్జునః ॥33॥

తత్త్వబోధిని:—

ఓయర్జునా! నీవులెమ్ము. దేవతలకుగూడ నజేయులగు భీష్మద్రోణాద్యతి
... అర్జునుడు జయించెనను కీర్తిని వడయుము. ఈకీర్తి కేవలపుణ్యైకలభ్యముకదా!
... శత్రువులను జయించి, నిస్సపత్నమగు రాజ్యము ననుభవింపుము. ఇంతకు
నాచేతనే వీరు నిశ్చయముగ హతులైరి. ఎడమచేతితోగూడ బాణములను ప్రయో
ముగల ఓయర్జునా! నీవు నిమిత్తమాత్రుడవు కమ్ము. ॥33॥

... చే హతులైరిగాన ముందు కాలమున వారుండరు; అవిషయమై నీవ్యాపారముగూడ నేమియు
... యర్థము. ॥3-౨॥

... ర్థ ప్ర పా:— తరచుగ సేనలయం దుండువారందరు జీవింపరు. అట్లగుచో నాగతియేమి?
... ప్రశ్నము నాశంకించుకొని చెప్పుచున్నాడు.— "నమే భక్తః ప్రణశ్యతి" అని చెప్పినట్లు నాభ
... తప్ప వీరందరు నశింపగలరని యాశయము. (శేషము గతార్థము.) ॥3-౨॥

—• ౧౧వ అధ్యాయము ౩౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

సూ ద న స ర స్వ తీ య ము:— నీవ్యాపారము లేకుండగనే వీరు నశించుదురుగాన నీవు
యుద్ధోద్యుక్తుడవుకమ్ము! దేవాదులకుగూడ దుర్జయులగు భీష్మద్రోణాది అతిరథులను గూడ స్వల్పకాల
... జయించెనను కీర్తిని బడయుము. కీర్తి యెంతయో పుణ్యము చేసినగాని లభింపదుగదా!
... కుండగనే దుర్యోధనాది శత్రువులను జయించి నిష్కంటకము, సమృద్ధమునగు రాజ్యము ననుభ
నీశత్రువులు కాలాత్మవగు నాచేనీయుద్ధమునకు పూర్వమే సంహృతాయుష్కులైరి. కేవలము నీకు

గీ॥ ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ కర్ణం తథాఽన్యానపి యోధముఖ్యాన్ ।
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్॥

పదవిభాగము:— ద్రోణం- చ- భీష్మం- చ- జయద్రథం- చ- కర్ణం- తథా- అన్యాన్- అపి-యోధవీరాన్- మయా- హతాన్- త్వం- జహి-మా- వ్యథిష్ఠాః- యుధ్యస్వ- జేతా- అసి- రణే- సపత్నాన్ ॥ ॥34॥

ప్రతిపదార్థము:— ద్రోణం=ద్రోణాచార్యుని; భీష్మం=భీష్మాచార్యుని; జయద్రథంచ=సైంధవుని; కర్ణంచ=కర్ణుని; తథా=అట్లే; అన్యానపి=యితరులగు; యోధవీరాన్=యోధవీరులను; మయా=నాచే; హతాన్=హతులైనవారిని; త్వం=నీవు; జహి=సంహరించుము; మావ్యథిష్ఠాః=వ్యథనొందకుము; యుధ్యస్వ=యుద్ధముచేయుము; రణే=యుద్ధమునందు; సపత్నాన్=శత్రువులను; జేతాసి=జయింపగలవు. ॥34॥

శాంకరభాష్యమ్:—

ద్రోణం చేతి । ద్రోణం చ యేషు యేషు యోధే ష్వర్జునస్యాఽఽశంకా స్తాం స్తా న్వ్యపదిశతి భగవా న్మయా హతా నితి । తత్ర ద్రోణభీష్మయో స్తావ త్ప్రసిద్ధ మాశంకాకారణం ద్రోణో ధనుర్వేదాచార్యో దివ్యాస్త్రసంపన్న ఆత్మన శ్చ విశేషతో గురు ర్గరిష్ఠో భీష్మః స్వచ్ఛందమృత్యు ర్దివ్యాస్త్రసంపన్న శ్చ పరశురామేణ ద్వంద్వయుద్ధ మగమ న్నచ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అర్జునునకు ఎవరెవరి విషయమై "జయింపగలనా" యను సందేహమున్నదో వారిని ప్రత్యేకముగా పేర్కొనుచున్నాడు— ఓయర్జునా! ద్రోణుడు ధనుర్వేదాచార్యులనియు, విద్యాసంపన్నుడనియు అందునను నీకు విశేషించి గురువనియు నీకారణములచే నజేయుడని నీవు శంకించుచుంటివి. ఇట్లే భీష్ముడు స్వచ్ఛన్దమరణుడనియు, దివ్యాస్త్రసంపన్నుడనియు, పరశురామునితో ద్వంద్వయుద్ధమున బ్రవృత్తుడై పరాజయము నొందనివాడనియు, సందే

యశస్సు ప్రాప్తించుటకై వీరిని రథమునుండి పతితులను చేయుచుంటిని. కాన నీవు "నిమిత్త మాత్రం భవ" సర్వలౌకికవ్యపదేశాస్పదుడవు. (అందరును నీవే శత్రుసంహారము చేసినట్లు జెప్పుకొనుటకు నిమిత్తమై) యగుము. "సవ్యసాచిన్" అను సంబుద్ధిచే నీవు ఎడమ చేతితోగూడ బాణప్రయోగము చేయగలవాడవుగాన వస్తుతః నేనే వీరందరిని సంహరించుచున్నను సమర్థుడవగు నీయందు కర్తృత్వమును లోకులు కల్పింపగలరను యభిప్రాయము సూచితమయ్యెను. ॥33

—• ౧౧వ అధ్యాయము ౩౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ద్రోణాచార్యుడు బ్రాహ్మణోత్తముడును, ధనుర్వేదాచార్యుడును; అందునను నాకు (అర్జునునకు) గురువు, దివ్యాస్త్రసంపన్నుడునుగదా! అట్లే భీష్మాచార్యులు దివ్యాస్త్రసంపన్నుడును, స్వచ్ఛందమరణుడును, పరశురామునితో ద్వంద్వయుద్ధమునందు డీకొనిగూడ పరాజితుడు కానివాడును కదా! మరియు నెవని తండ్రి వృద్ధక్షత్రియుడై గూడ తపము చేయుచు తన కుమారుని శిరము నెవడు ఖండించునో వాని శిరముగూడ నా కాలమునందే భూమిపై పడునట్లు వరము నొంది యిప్పటి

శాంకరభాష్యమ్:—

...రాజితః । తథా జయద్రథో యస్య పితా తప శ్చరతి మమ పుత్రస్య శిరో భూమౌ పాతయి
ష్యతి యస్తస్యాపి శిరః పతిష్యతీతి । కర్ణోఽపి వాసవదత్తయా శక్త్యా త్వమోఘయా సంపన్న
సూర్యపుత్రః కానీనో యతోఽత స్తన్నామ్నైవ నిర్దేశః । మయా హతాం స్త్వం జహి
నిమిత్తమాత్రేణ మా వ్యథిష్ఠా స్తేభ్యో భయం మా కార్షీ ర్యుధ్యస్వ జేతాసి దుర్యోధనప్రభృతీ
...్రణే యుద్ధే సపత్నా న్శత్రూన్ ॥ ॥౩౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

...ంచుచుంటివి. అట్లే సైంధవుని తండ్రి తపస్సుచేయుచు "నాపుత్రుని శిరమును భూమిపై
...డున ట్లెవడు చేయునో ఆతని శిరముగూడ భూమిపై పడుగాక" అని కోరి తపస్సుచేయు
...ండెను. గాన అతని విషయమై సందేహించుచుంటిని. ఇట్లే కర్ణుడు (సూర్యపుత్రుడు)గూడ
...ంద్రదత్తము, అమోఘము నగు శక్తితో గూడినవాడుగాన నాత డజేయుడని శంకించు
...ంటివి. కాని వీరందరును మఱియు నితరులగు యోధవీరులుగూడ నాచే నిశ్చయముగ
...తులైరి. అట్టి వీరి నందరిని నీవు నిమిత్తమాత్రుడవై సంహరింపుము. వారియెడ నీవు
...యమునొందకుము. యుద్ధము చేయుము. శత్రువులను జయింపగలవు. ॥౩౪॥

...తపము చేయుచుండెనో యట్టి జయద్రథుడు స్వయముగ మహాదేవారాధనపరుడై దివ్యాస్త్రసంపన్నుడై
...ండెను కదా! ఇక కర్ణుడు స్వయముగ సూర్యసుతుడై సూర్యారాధనముచే దివ్యాస్త్రసంపన్నుడై, ఇంద్ర
...త్తమగు ఏకవీరఘ్నీశక్తితోగూడి ప్రకాశించుచుండెనుగదా! అట్లే కృపాశ్వత్థామ భూరి శ్రవః ప్రభృతు
...ందరో దుర్జయులు గదా! ఇట్టి వీరందరు నుండగ శత్రువులను గెల్చి రాజ్యము నెట్లనుభవింపగలను? యెట్లు
...ని పొందగల్గుదును: అను అర్జున సందేహమును తొలగించుటకై నామగ్రహణపూర్వకముగా చెప్పుచు
...డు.— నీవు సందేహించుచున్న ద్రోణాదిసర్వవీరులను కాలాత్మనగు నాచే హతులైనవారినిగ తెలిసి
...నుము. హతులైనవారి హననమునందేమి శ్రమ కలదు. కాన వ్యథనొందకుము. భీతినివీడి యుద్ధము చేయుము.
...శత్రువులను జయింపగలవు. (ఇట "ద్రోణంచ, భీష్మంచ, జయద్రథంచ" అను చకారత్రయముచే
...గార్వోక్తాశంక యనువదింపబడెను. "తథా" శబ్దముచే కర్ణుని విషయమునను "యోధ వీరా నపి" అను స్థల
...మున యున్న "అపి" శబ్దముచేతను, నీకు పరాజయము వచ్చునని గాని, వధనిమిత్త పాపము ప్రాప్తించునని గాని
...శంకింపవలదని సూచించెను. ॥౩౪॥

శంకరానందీయము:— చెప్పిన విషయమునే సందేహము లేకుండుటకై స్పష్టముగ చెప్పు
...చుండెను.— ద్రోణ, భీష్మ, కర్ణ, జయద్రథాదులును, మరియు నితరులగు భగదత్తసోమదత్తాది యోధ వీరు
...లను నాచే తేజోబల, పౌరుషాకర్షణముచే హతులైరిగాన నీవు వారిని బాణములచే బడవేయుము. ద్రోణుడు
...దివ్యాస్త్రసంపన్నుడనిగాని, భీష్ముడు స్వచ్ఛందమరణుడనిగాని, కర్ణు డేకవీరఘ్నీశక్తియుక్తుడనిగాని, సైంధ
...వుడు పితృవరముచే నజేయుడనిగాని నీమనమున కొంచెమైనను వ్యథ నొందకుము. నాయనుగ్రహముచే రణ
...మున శత్రువులను జయింపగలవు. సంశయములేదు. కాన యిట "యుధ్యస్వ" అనునది విధి కాదు. ఇక నేమన
...మోక్షమునకు కారణము జ్ఞానము. దీనికి కారణము చిత్తశుద్ధి. ఆచిత్తశుద్ధికి స్వధర్మానుష్ఠానము కారణము.
...ని చెప్పుటకు "యుధ్యస్వ" అని చెప్పుచున్నాడు.— ముముక్షువువగు నీవు స్వధర్మము ననుష్ఠింపుమని

శాంకరభాష్యమ్:—

పరాజితః । తథా జయద్రథో యస్య పితా తప శ్చరతి మమ పుత్రస్య శిరో భూమౌ పాతయిష్యతి య స్తస్యాపి శిరః పతిష్యతీతి । కర్ణోఽపి వాసవదత్తయా శక్త్యా త్వమోఘయా సంపన్నస్సూర్యపుత్రః కానీనో యతోఽత స్తన్నామ్నైవ నిర్దేశః । మయా హతాం స్త్వం జహి నిమిత్తమాత్రేణ మా వ్యథిష్ఠా స్తేభ్యో భయం మా కార్షీ ర్యుధ్యస్వ జేతాసి దుర్యోధనప్రభృతీ న్రణే యుద్ధే సపత్నా న్శత్రూన్ ॥ ॥౩౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

హించుచుంటివి. అట్లే సైంధవుని తండ్రి తపస్సుచేయుచు "నాపుత్రుని శిరమును భూమిపై పడునట్లెవడు చేయునో ఆతని శిరముగూడ భూమిపై పడుగాక" అని కోరి తపస్సుచేయుచుండెను. గాన అతని విషయమై సందేహించుచుంటివి. ఇట్లే కర్ణుడు (సూర్యపుత్రుడు)గూడ ఇంద్రదత్తము, అమోఘము నగు శక్తితో గూడినవాడుగాన నాత డజేయుడని శంకించుచుంటివి. కాని వీరందరును మరియు నితరులగు యోధవీరులుగూడ నాచే నిశ్చయముగ హతులైరి. అట్టి వీరి నందరిని నీవు నిమిత్తమాత్రుడవై సంహరింపుము. వారివలన నీవు భయమునొందకుము. యుద్ధము చేయుము. శత్రువులను జయింపగలవు. ॥౩౪॥

కిని తపము చేయుచుండెనో యట్టి జయద్రథుడు స్వయముగ మహాదేవారాధనపరుడై దివ్యాస్త్రసంపన్నుడై యుండెను కదా! ఇక కర్ణుడు స్వయముగ సూర్యసుతుడై సూర్యారాధనముచే దివ్యాస్త్రసంపన్నుడై, ఇంద్రదత్తమగు ఏకవీరఘ్నీశక్తితోగూడి ప్రకాశించుచుండెనుగదా! అట్లే కృపాశ్వత్థామ భూరిశ్రవః ప్రభృతులెందరో దుర్జేయులు గదా! ఇట్టి వీరందరు నుండగ శత్రువులను గెల్చి రాజ్యము నెట్లనుభవింపగలను? యెట్లు కీర్తిని పొందగల్గుదును: అను అర్జున సందేహమును తొలగించుటకై నామగ్రహణపూర్వకముగా చెప్పుచున్నాడు.— నీవు సందేహించుచున్న ద్రోణాదిసర్వవీరులను కాలాత్మనగు నాచే హతులైనవారినిగ తెలిసికొనుము. హతులైనవారి హననమునందేమి శ్రమ కలదు. కాన వ్యథనొందకుము. భీతినివీడి యుద్ధము చేయుము. నీవు శత్రువులను జయింపగలవు. (ఇట "ద్రోణంచ, భీష్మంచ, జయద్రథంచ" అను చకారత్రయముచే బూర్వోక్తాశంక యనువదింపబడెను. "తథా" శబ్దముచే కర్ణుని విషయమునను "యోధ వీరా నపి" అను స్థలమునయున్న "అపి" శబ్దముచేతను, నీకు పరాజయము వచ్చునని గాని, వధనిమిత్త పాపము ప్రాప్తించునని గాని శంకింపవలదని సూచించెను. ॥౩౪॥

శంకరానందీయము:— చెప్పిన విషయమునే సందేహము లేకుండుటకై స్పష్టముగ చెప్పుచుండెను.— ద్రోణ, భీష్మ, కర్ణ, జయద్రథాదులును, మరియు నితరులగు భగదత్తసోమదత్తాది యోధ వీరులును నాచే తేజోబల, పౌరుషాకర్షణముచే హతులైరిగాన నీవు వారిని బాణములచే బడవేయుము. ద్రోణుడు దివ్యాస్త్రసంపన్నుడనిగాని, భీష్ముడు స్వచ్ఛందమరణుడనిగాని, కర్ణు డేకవీరఘ్నీశక్తియుక్తుడనిగాని, సైంధవుడు పితృవరముచే నజేయుడనిగాని నీమనమున కొంచెమైనను వ్యథ నొందకుము. నాయనుగ్రహముచే రణమున శత్రువులను జయింపగలవు. సంశయములేదు. కాన యిట "యుధ్యస్వ" అనునది విధి కాదు. ఇక నేమన మోక్షమునకు కారణము జ్ఞానము. దీనకి కారణము చిత్తశుద్ధి. ఆచిత్తశుద్ధికి స్వధర్మానుష్ఠానము కారణము. అని చెప్పుటకు "యుధ్యస్వ" అని చెప్పుచున్నాడు.— ముముక్షువువగు నీవు స్వధర్మము ననుష్ఠింపుమని

సంజయ ఉవాచః—

గీ॥ ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాంజలి ర్వేపమానః కిరీటీ ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥ ॥౩౫॥

పదవిభాగము:— ఏతత్- శ్రుత్వా- వచనం- కేశవస్య- కృతాంజలిః- వేపమానః- కిరీటీ- నమస్కృత్వా- భూయః- ఏవ- ఆహ- కృష్ణం- సగద్గదం- భీతభీతః- ప్రణమ్య ॥ ॥౩౫॥

ప్రతిపదార్థము:— సంజయః=సంజయుడు; ఉవాచ=పలికెను; కేశవస్య=శ్రీకృష్ణభగవానులయొక్క; ఏతత్=ఈపూర్వోక్తమైన; వచనం=వాక్యమును; శ్రుత్వా=విని; కిరీటీ=అర్జునుడు; వేపమానః=వణకుచున్నవాడై; కృతాంజలిః=దోసెలొగ్గినవాడై; నమస్కృత్వా=నమస్కరించి; కృష్ణం=శ్రీకృష్ణభగవానునిగూర్చి; భీతభీతః=మాటిమాటికిభయావిష్టచిత్తుడై; ప్రణమ్య=వంగి; సగద్గదం=గద్గదస్వరముతోకూడుకొనునట్లుగా; భూయఏవ=తిరిగి; ఆహ=పల్కెను. ॥౩౫॥

శాంకరభాష్యమ్:—

ఏత చ్ఛ్రుత్వేతి । ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య పూర్వోక్తం కృతాంజలి స్స న్వేపమానః కంపమానః కిరీటీ నమస్కృత్వా భూయః పున రేవాఽహోక్తవా న్కృష్ణం సగద్గదం భయావిష్టస్య దుఃఖాభిఘాతా త్స్నేహావిష్టస్యచ హర్షోద్భవా దశ్రుపూర్ణనేత్రత్వే సతి శ్లేష్మణా కంఠావరోధ స్తతశ్చ వాచోఽపాటవం మందశబ్దత్వం య త్సగద్గద స్తేన సహ వర్తత ఇతి సగద్గదం వచన మాహేతి వచనక్రియావిశేషణ మేతత్, భీతభీతః పునః పున ర్భయావిష్టచేతాః స న్ప్రణమ్య ప్రహ్వీభూత్వాఽఽహేతి వ్యవహితేన సంబంధః । అత్రావసరే సంజయవచనం సాభిప్రాయమ్ । కథం? ద్రోణాది ష్వర్జునేన నిహతే ష్వజేయేషు చతుర్షు నిరాశ్రయో దుర్యోధనో నిహత ఏవేతి మత్వా ధృతరాష్ట్రో జయం ప్రతి నిరాశ స్స న్సంధిం కరిష్యతి తతః శాంతి రుభయేషాం భవిష్యతీతి । త దపి నాశ్రౌషీ ద్ధృతరాష్ట్రో భవితవ్యవశాత్ ॥ ॥౩౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సంజయుడు పలుకుచున్నాడు— ఈవిధముగా శ్రీకృష్ణభగవానులు చెప్పగా విని యర్జునుడు కృతాంజలియై, వణకుచున్నవాడై, నమస్కరించి, నమ్రుడై, మాటిమాటికి భయావిష్టుడై గద్గదస్వరముతోగూడ తిరిగి పలికెను. (భయావిష్టునకుగాని, దుఃఖాభిఘాతునకుగాని, స్నేహావిష్టునకు హర్షోద్భవము వలనగాని కండ్లు బాష్పపూర్ణములగును. అందుచే శ్లేష్మముచే కంఠావరోధము, వాక్కునకు అపాటవముకల్గి, స్వరము మందమగును. అదియే గద్గదస్వరము.) ఈసమయమున సంజయవాక్యము సాభిప్రాయము. ఎట్లన;— అజేయులగు ద్రోణాదు లర్జునునిచే నిహతులు కాగనే దుర్యోధనుడు నిరాశ్రయుడై తప్పక నిహతుడగునని తలచి ధృతరాష్ట్రుడు జయవిషయమై నిరాశుడై తప్పక సంధిని జేసుకొనగలడు. గాన నుభయులకు శాంతి చేకూరునని సంజయాభిప్రాయము.) భవితవ్యవశముచే ధృతరాష్ట్రుడు దానినికూడ వినిపించుకొనలేదు. ॥౩౫॥

తాత్పర్యము. ఈచెప్పుటచే భక్తితో నారాధితుడగు పరమేశ్వరుడు తనభక్తులకు దుర్లభమగు కార్యమునుగూడ సులభమగునట్లు చేయునని సూచింపబడెను. ॥౩౪॥

అర్జున ఉవాచ:—

గీ॥ స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః ॥ ॥౩౬॥

పదవిభాగము:—అర్జునః- ఉవాచ- స్థానే- హృషీకేశ- తవ- ప్రకీర్త్యా- జగత్- ప్రహృష్యతి- అనురజ్యతే- చ- రక్షాంసి- భీతాని- దిశః- ద్రవంతి- సర్వే- నమస్యంతి- చ- సిద్ధసంఘాః ॥ ॥౩౬॥

ప్రతిపదార్థము:— అర్జునః=అర్జునుడు; ఉవాచ=పలికెను; హేహృషీకేశ=ఇంద్రియప్రవర్తకుడవగుఓశ్రీకృష్ణప్రభూ; తవ=నీయొక్క; ప్రకీర్త్యా=మాహాత్మ్యముయొక్క కీర్తనముచేగాని శ్రవణముచేగాని; జగత్=జగత్తు; ప్రహృష్యతీతియత్=మిక్కిలిసంతసించుచున్నది అనుట ఏదికలదో, తత్=అవిషయము; స్థానే=యుక్తము (లేక, "స్థానే" అనునది విషయవిశేషణము. నీప్రకీర్తనముచే జగత్తు హర్షించినదన అందుకై నీవు తగుదువు; జగత్=జగత్తు; అనురజ్యతేతిచయత్=అనురక్తినిపొందుచున్నదనుటయు, స్థానే=యుక్తము; రక్షాంసి=రాక్షసులు; భీతాని=భీతులై; దిశః=దిక్కులనుగూర్చి; ద్రవంతి=పరుగిడుచుండిరి; సర్వే=సమస్తమగు; సిద్ధసంఘాః=సిద్ధసంఘములు; నమస్యంతీతియత్=నమస్కరించుచుండిరనుటయు; స్థానే=యుక్తము ॥

శాంకరభాష్యమ్;—

స్థాన ఇతి । స్థానే యుక్తం । కిం తత్, తవ ప్రకీర్త్యా త్వన్మాహాత్మ్యకీర్తనేన శ్రుతేన హే హృషీకేశ! యజ్జగత్ప్రహృష్యతి ప్రహర్షముపైతి తత్స్థానే యుక్తమిత్యర్థః । అథవా విషయవిశేషణం స్థాన ఇతి, యుక్తో హర్షాదివిషయో భగవాన్ । యత ఈశ్వర స్సర్వా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అర్జునుడు పలుకుచున్నాడు— ఇంద్రియప్రవర్తకుడ వగు ఓశ్రీకృష్ణప్రభూ! నీ యొక్క మాహాత్మ్యమును కీర్తించుటచేగాని, వినుటచేగాని యీజగము ప్రహర్షము నొందుచున్నదనుట యుక్తము. మరియు అనురక్తి నొందుచున్నదనుటయు యుక్తము. (లేక "స్థానే" అనునది విషయవిశేషణము. అందుచే ఈశ్వరుడవగు నీవు సర్వాత్మవు గావునను, సర్వభూత

—• ౧౧వ అధ్యాయము ౩౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ద్రోణ, భీష్మ, జయద్రథ, కర్ణులు హతులగుటచే జయాశ సన్నగిలి, నిరాశ్రయుడై దుర్యోధనుడు హతుడేయగును. అని యూహించుకొని సంధి చేసికొనినచో నుభయపక్షములకు శాంతి చేకూరునను యభిప్రాయము కలవాడై సంజయుడు జరిగిన వృత్తాంతమును చెప్పుచుండెను. ఈపూర్వోక్తమైన కేశవుని వాక్యమును విని, దోసిలొగ్గినవాడై, కిరీటి పరమాశ్చర్యదర్శనజనితసంభ్రమముచే వణకుచున్నవాడై, భక్తుల పాపముల హరించెడి శ్రీకృష్ణుని గూర్చి నమస్కరించి, భయముచేతను, హర్షముచేతను అశ్రుపూర్ణ నయనుడగుట రుద్ధకంఠుడై, అతి భీతుడై, వంగినవాడై తిరిగి యిట్లనెను. ॥౩౫॥

—• ౧౧వ అధ్యాయము ౩౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అర్జునుడు ౧౧ శ్లోకములచే జెప్పుచున్నాడు.— ఓ సర్వేంద్రియప్రవర్తకా! నీవీ విధముగ అత్యంతాద్భుతప్రభావము కలవాడవు, భక్తవత్సలుడవు, గాన నీనిరతి

శాంకరభాష్యమ్:—

త్మా సర్వభూతసుహృ చ్చేతి । తథాఽనురజ్యతేఽనురాగం చోపైతి తచ్చ విషయ ఇతి వ్యాఖ్యేయమ్ । కించ రక్షాంసి భీతాని భయావిష్టాని దిశో ద్రవంతి గచ్ఛంతి తచ్చ స్థానే విషయే । సర్వే నమస్యంతి నమస్కుర్వంతి చ సిద్ధసంఘాః సిద్ధానాం సముదాయాః కపిలాదీనాం తచ్చ స్థానే ॥ ॥౩౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సుహృత్తువుగావునను జగత్తు నీయొక్క మాహాత్మ్యకీర్తనశ్రవణములచే నతిహృష్టమగుచున్నదన యందుకు నీవు తగుదువు అను యాశయము సిద్ధించుచున్నది.) రాక్షసులు భీతులై దిక్కులకు పరుగిడుచుండిరి. కపిలాదిసిద్ధసంఘములు నమస్కరించుచుండిరి. అనుటయు యుక్తము. ॥౩౬॥

శయప్రశస్త్యకీర్తనము చేతను, శ్రవణము చేతను నేనొకడనే సంతసించుటగాదు. ఇకేమన: రక్షోవిరోధియగు చేతనమాత్రమెల్ల ప్రహర్షము నొందుచున్నదని చెప్పుటయుక్తము. అట్లే నేనేగాక సర్వజగత్తు అనురక్తమగుచున్నదనుటయు తగును. అట్లే రాక్షసవర్గము భయావిష్టమై నలుదిశలకు పరిగిడు చున్నదనుటయు తగును. అట్లే సర్వసిద్ధసంఘములు నమస్కరించుచున్నవనుటయు దగును. (ఈశ్లోకము రక్షోఘ్నమంత్రముగా మంత్రశాస్త్రమునందు ప్రసిద్ధముగాన పిశాచాదిబాధలుకలిగినపుడు వాటిని నివారించుట కుపయోగించును.) ॥౩౬॥

శంకరానందీయము:— ఓహృషీకేశా! నీమహత్త్వమును కీర్తించుట చేతను, వినుటచేతను సర్వజగత్తు హర్షము నొందుచున్నది. సర్వజగద్ధర్షమునకు నీవే విషయుడవు గాన యట్లందరు హర్షము నొందుట యుక్తము. నీప్రకీర్తనముచే సర్వులు నీయం దనురక్తుల నగుచున్నారు. నీవు సర్వానురాగ విషయుడవుగాన వారట్లగుట యుక్తము. నిన్ను కీర్తించుటచే రాక్షసులు భీతులై నలుదిక్కులకు పరుగిడుచుండిరి. నీవు రాక్షసపలాయనహేతువు గాన యట్లగుట యుక్తము. నీవు సర్వదేవనమస్కార విషయుడవుగాన సర్వసిద్ధసంఘములు నిన్ను నమస్కరించుచున్నవి. ఇదియు యుక్తమే.

"కాలోఽస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో లోకా న్సమాహర్తు మిహ ప్రవృత్తః" అను గీతోక్తరీతిని భూమికి భారాయమాణులగు సర్వదుష్టులను నశింపజేయుటకు నేను ప్రవృత్తుడనైతిని," అను నీసంబంధమగు ప్రకీర్తనముచే (అని చాటుటచే) దానిని వినుటచే "జగత్" సాధులోకము ప్రహర్షము నొందుచున్నది. సర్వేశ్వరుడవగు నీవు సర్వదుష్టసంహారము చేయుచుండ, వారట్లు సంతసించుట యుక్తమే. పూర్వోక్తమగు నీప్రకీర్తనమును విని సాధులోకము భక్తవత్సలుడవు, సర్వభూత హృదయుడవు నగు నీయందనురక్తమగుచున్నది. పరమకృపాలుడవు, పరమేశ్వరుడవు నగు నీవు సర్వలోకోపద్రవ నివారణమునం దుద్యుక్తుడవైయుండ సాధుజనులు నీయందనురక్తులగుట యుక్తము. "దుష్టులను సంహరించెద" నను నీప్రకీర్తనమును విని రాక్షసులందరు భీతులై దిగంతములకు పరుగిడుచుండిరి. నీప్రకీర్తనముచే సర్వలోకసుఖకాములగు సిద్ధసంఘములు (ఇట "సిద్ధ" అను పదము దేవర్షి, సాధ్య, గంధర్వచారణాదుల కుపలక్షణము.) ఓప్రభూ! నీవట్లే చేయ గోరుచుంటి" మని నమస్కరించుచున్నారు. వారట్లు చేయుటయు యుక్తమే. ॥౩౬॥

నీలకంఠీయము:— ఈశ్లోకార్థము గతార్థము. ఈశ్లోకము నారాయణాష్టాక్షరీ, సుదర్శనాస్త్రమంత్రములతో సంపుటితమై రక్షోఘ్నమంత్రముగ మంత్రశాస్త్రమందు చెప్పబడినది. ఇట యిదియొక రహస్యము. ॥౩౬॥

గీ॥ కస్మాచ్చ తే న నమేర న్మహాత్మ న్గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే ।
అనంత! దేవేశ! జగన్నివాస! త్వ మక్షరం స దస త్తత్పరం యత్ ॥ ॥౩౨॥

పదవిభాగము:— కస్మాత్– చ– తే– న– నమేరన్– మహాత్మన్– గరీయసే– బ్రహ్మణః– అపి– ఆదికర్త్రే– అనంత– దేవేశ– జగన్నివాస– త్వం– అక్షరం– సత్– అసత్– తత్– పరం– యత్– ॥

ప్రతిపదార్థము:— హేమహాత్మన్=ఓమహానుభావ; బ్రహ్మణః=హిరణ్యగర్భునకు గూడ; ఆదికర్త్రే=కారణమగుటఆదికర్తవు; గరీయసే=గొప్పవాడవునగు; తే=నీకై; ఏతే=(ఈపదమధ్యాహార్యము) ఈపూర్వోక్తులు; కస్మాత్=ఏకారణమువలన; న నమేరన్=నమస్కరించకుందురు; హేఅనంత=అంతములేనివాడా; దేవేశ=దేవప్రభూ; జగన్నివాస=జగన్నివాస; త్వం=నీవు; యత్=ఎద్ది; సత్=సత్స్వరూపమో; అసత్=అసత్స్వరూపమో; (ఉపచారముగ చెప్పబడెనో) పరం=పరమార్థతఃయారెంటికి విలక్షణమో; తత్—అట్టి, అక్షరం—అక్షరస్వరూపుడవు. ॥౩౨॥

శాంకరభాష్యమ్:—

భగవతో హర్షాదివిషయత్వే హేతుం దర్శయతి— కస్మాచ్చ హేతో స్తే తుభ్యం న నమేర న్న నమస్కుర్యు ర్హే మహాత్మ న్గరీయసే గురుతరాయ యతో బ్రహ్మణో హిరణ్యగర్భస్యా ప్యాదికర్తా కారణ మత స్తస్మా దాదికర్త్రే కథ మేతే న నమస్కుర్యు రతో హర్షాదీనాం నమస్కారస్య చ స్థానం త్వ మర్హో విషయ ఇత్యర్థః । హేఽనంత! దేవేశ! జగన్నివాస!

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓ(శ్రీ)కృష్ణప్రభూ! సర్వజగత్స్రష్ట యగు హిరణ్యగర్భునకుగూడ కారణమగుట సర్వాధికుడ వగు నీకై యీమహర్షిసిద్ధసంఘము లెందుకు నమస్కరింపకుందురు? (వారందరు నమస్కరించుచుండి రనుట యుక్తమే యని భావము.) అంతములేనివాడా! సర్వదేవతాప్రభూ! జగన్నివాస! సత్తనియు, అసత్తనియు నీబుద్ధులు అక్షరస్వరూపమున కుపధానభూతములు. (సదసదుపధాద్వారమున నుపచారముగ అక్షరము సత్తనియు, అసత్తనియు, చెప్పబడును.) నీవు అట్టి సదసద్రూపుడవు. పరమార్థముగ నారెంటికంటె విలక్షణము నుత్కృష్టము

—• ౧౧వ అధ్యాయము ౩౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— భగవంతుడు హర్షాదివిషయు డగుటలో హేతువును జెప్పుచున్నాడు.—"మహాత్మన్...జగన్నివాస" ఓపరమోదాత్తస్వభావ! సర్వపరిచ్ఛేదరహిత! హిరణ్యగర్భాదులకుగూడ నియామకుడా! సర్వాశ్రయ! హిరణ్యగర్భాదులకంటె గూడ గొప్పవాడవగు ఆదికర్తా! ఆసిద్ధసంఘములు నీకై యెందుకు నమస్కరింపకుందురు? సర్వనియన్తృత్వము, ఉపదేష్టృత్వము, జనకత్వము వీనిలో నొక్కొక్కటి యున్నను నమస్కరింపదగుననిన నివన్నియు నున్న నీకై నమస్కరించుట యాశ్చర్యముగాదు. మరియు విధిముఖమున 'కలదు' అని ప్రతీయమానమైన సత్తువు, (వ్యక్తస్వరూపుడవు) నిషేధముఖమున 'లేదు' అని ప్రతీయమానమైన అసత్తువు (అవ్యక్తము) నీవే. అట్లే ఆసదసత్తులకు మూలకారణమగు అక్షరబ్రహ్మము గూడ నీవే. నీకంటె వేరగునదేదియు లేదని యర్థము. కాన నిన్ను నమస్కరించిరన యాశ్చర్యమేమియు లేదని యర్థము. ॥౩౨॥

శాంకరభాష్యమ్:—

త్వ మక్షరం తత్పరం య ద్వేదాంతేషు శ్రూయతే కిం। త త్సదసద్విద్యమాన మసచ్చ యత్ర నాస్తీతి బుద్ధి స్తే ఉపధానభూతే సదసతీ యస్యాక్షరస్య యద్ద్వారేణ సదస దిత్యుపచర్యతే। పరమార్థత స్తు సదసతోః పరం యద్య దక్షరం వేదవిదో వదంతి తత్త్వ మేవ నాన్య దిత్యభిప్రాయః ॥ ॥౩౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నగు నీవు వేదవేత్తలు చెప్పుకొనెడి యక్షరస్వరూపుడవు. (వర్తమానజగత్తు "సత్తు" అనియు భూతభవిష్యజ్జగత్తు "అసత్త"నియు, ఇట్లే వ్యావహారిక జగత్తు "సత్త"నియు, ప్రాతిభాసికజగత్తు "అసత్త"నియు జెప్పబడును. లేక, స్థూలజగత్తు "సత్తు"అనియు, సూక్ష్మావస్థ మగు జగత్తున్నను ప్రత్యక్షాగోచరముగాన "అసత్తు"అనియు జెప్పబడును. ఈసదసత్తు లక్షరోపాధిభూతములుగాన యక్షరముగూడ సదసద్రూపమని లక్షణచే జెప్పబడును. ఈసదసత్తులు జడములగుటవలన అక్షరపరబ్రహ్మము చిన్మాత్రమగుటసదసద్విలక్షణము. నీవు అట్టి అక్షర పరబ్రహ్మస్వరూపుడవు.) ॥౩౭॥

శంకరానందీయము:— భగవంతుడు సర్వదేవనమస్కార్యుడగుటలో హేతువులను జెప్పుచు, కాకుస్వరముచే సర్వనమస్కార్యత్వమును స్థిరపరచుచుండెను.– "మహాత్మన్!" సర్వోత్కృష్టమైన స్వభావముకలవాడా! ఆసిద్ధాదిదేవత లేకారణముచే నిన్ను నమస్కరింపకుందురు? (ఆలోచింపగ నన్నివిధముల చేతను నీకు నమస్కరించెదరని యర్థము. నేనును లోకసాధారణుడనే కదా! నన్నే కారణముచే నమస్కరించెదరనెదవా? జ్ఞానైశ్వర్య బల, తేజ, శక్తి విశేషములచే వాస్తవముగ నీవే సర్వోత్తముడవు, సర్వనమస్కార్యుడవు. సర్వనమస్కార్య డగుటలో హేతువులను చెప్పుచున్నాడు.— "గరీయసే" నీవు జ్ఞానైశ్వర్యాదులచే నందరికంటెను గొప్పవాడవు. "బ్రహ్మణోప్యాదికర్త్రే" హిరణ్యగర్భునకు గూడ కారణుడవు, నియామకుడవును. ఇట్టి నీవు సర్వనమస్కార్యుడ వనుటలో నేమి సందేహము? ఓయనంత! దేవేశ! జగన్నివాస! (ఇట అనంతత్వ, దేవేశత్వములచే సర్వదేవనమస్కార్యుడవని సంబుద్ధ్యాశయము.) "అనంత శ్చాత్మా యో దేవానా మధిపో యస్మిం ల్లోకా అధిశ్రితాః" అను శ్రుతియుపై విషయమునే చెప్పుచున్నది. "జగత్తు చేతను, జగత్కారణము చేతను నేను వ్యవహితుడనుగాన నాకనంతత్వ మెట్లు పొసగు" నను శంకపై జెప్పుచున్నాడు.— "సదత్తత్పరం యత్" నామరూపములచే 'కలదు' అని యేది నిర్దేశింపబడునో యట్టి కార్యభూతమగు జగత్తు సత్తనబడును. తద్విలక్షణము, జగత్కారణరూపము నగు యవ్యక్తము అసత్తనబడును. నీవట్టి వ్యక్తావ్యక్తస్వరూపుడవు. "సర్వం హ్యేతద్బ్రహ్మ" అను శ్రుతి పైవిషయమునే చెప్పుచున్నది. పరబ్రహ్మ వ్యవధానమున్నది కాన సదసద్రూపుడవైనను నాకనంతత్వము సంభవింపదు. అను ఆశంకపై జెప్పుచున్నాడు.– "త్వమక్షరం" నీవు కార్యకారణములగు జగదవ్యాకృతములకంటె విలక్షణుడవు. నిత్యుడవగుటవలనను, సచ్చిదానందస్వరూపుడ వగుటవలనను, నిరతిశయమహత్త్వము కలవాడవగుటచేతను, అతిసూక్ష్ముడ వగుటచేతను విలక్షణుడవు, కారణుడవుగూడను. "యో వా ఏతదక్షరం గార్గి అవిదిత్వా" అను శ్రుతిప్రసిద్ధమగు (ఎప్పుడును, ఏకారణముచేతను; ఏవిధముగను వశింపనిదిగాన యక్షరమనబడును.) అక్షరస్వరూపము, నిత్యకూటస్థము, సచ్చిదానందైకరసము, అద్వితీయము; నిర్విశేషము నగు [అపరబ్రహ్మము నీవే. నీకంటె

గీ॥ త్వ మాదిదేవః పురుషః పురాణ స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వ మనంతరూప ॥ ॥౩౮॥

పదవిభాగము:— త్వం– ఆదిదేవః– పురుషః– పురాణః– త్వం– అస్య– పరం– నిధానం– వేత్తా– అసి– వేద్యం– చ– పరం– చ– ధామ– త్వయా– తతం– విశ్వం– అనంతరూప ॥ ॥౩౮॥

ప్రతిపదార్థము:— త్వం=నీవు; ఆదిదేవః=తొలివేల్పువు; పురుషః=పరమపురుషుడవు; పురాణః=సనాతనుడవు; త్వం=నీవు; అస్య=ఈ; విశ్వస్య=ప్రపంచకమునకు; పరం=పరమమైన; నిధానం=స్థానము; వేత్తా=తెలిసికొనదగినసర్వమును తెలిసినవాడవు;అసి–అయితివి. వేద్యం=తెలిసికొనదగినవస్తువవు;పరంచ=ఉత్కృష్టమైన; ధామ=స్థానము; ("త్వం"అనుపదమునుఅనువృత్తిచేయదగును.) నీవు; అనంతరూప=అంతములేనిస్వరూపములుకలవాడా; త్వయా=నీచే; ఇదం=ఈ, విశ్వం=ప్రపంచము; తతం=వ్యాప్తమైనది. ॥౩౮॥

శాంకరభాష్యమ్:—

పున రపి స్తౌతి — త్వ మాదిదేవో ంగతః స్రష్టృత్వాత్, పురుషః పురి శయనాత్, పురాణ శ్చిరంతన స్త్వ మేవాస్య విశ్వస్య పరం ప్రకృష్టం నిధానం నిధీయతేఽస్మి న్జగ త్సర్వం మహాప్రలయాదా వితి । కించ వేత్తాసి వేదితాసి సర్వస్యైవ వేద్యజాతస్య । యచ్చ వేద్యం వేదనార్హం తచ్చాసి । పరం చ ధామ పరమం పదం వైష్ణవమ్ । త్వయా తతం వ్యాప్తం విశ్వం సమస్త మనంతరూపాంతో న విద్యతే తవ రూపాణామ్ ॥ ॥౩౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నీవు సర్వజగత్స్రష్టవుగాన ఆదిదేవుడవు. పురాణపురుషుడవు. మహాప్రలయదశయందు సమస్తవిశ్వము నీయందు లీనమైయుండునుగాన సమస్తజగత్తునకు నిధానుడవు. సర్వవేద్యసమూహమును తెలిసికొనినవాడవు. తెలిసికొనదగినవాడవుగూడ నీవే. నీవు వైష్ణవమగు పరమధామస్వరూపుడవు. అంతములేని రూపములు గలవాడా! నీవు యీసర్వప్రపంచమును వ్యాపించియుంటివి. ॥౩౮॥

వేరద్దియు లేదు గావునను "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను శ్రుతిచొప్పున నీవే యనంతుడవు. కనుకనే నీవు సర్వదేవతలకు నమస్కరింప దగినవాడవు. ॥౪౨॥

—• ౧౧వ అధ్యాయము ౩౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము.— భక్త్యుద్రేకముతో తిరిగి స్తుతించుచుండెను.— నీవు జగత్సృష్టిహేతువుగాన యాదిదేవుడవు, పూరయితవు, అనాదివి, నీవీవిశ్వమునకు (లయస్థానమగుటచే సర్వము దీనియం దుంచబడునుగాన నిధానమనబడును.) నిధానుడవు, సర్వమును తెలిసికొనినవాడవు, వేద్యుడవు, సచ్చిదానందఘనము, అవిద్యాతత్కార్యవినిర్ముక్తమునగు విష్ణుస్థానము నీవే. ఈవిశ్వమంతయు నీచేతనే సత్తారూపముగను; స్ఫురణారూపముగను, కారణరూపముగను వ్యాప్తమైనది. ॥౩౮॥

శంకరానందీయము:— "బ్రహ్మైవేదం సర్వం" అను శ్రుత్యర్థము నాధారముగ జేసుకొని, సవిశేషబ్రహ్మమును, నిర్విశేషబ్రహ్మమును నీవేయని భగవంతుని సార్వాత్మ్యమును ప్రతిపాదించుచుండెను. పూర్ణుడగుటవలన పురుషు డనబడును. స్వయముగ నిర్వికారుడగుటవలన పురాణు డనబడును. జగత్కారణు డగుట ఆది యనబడును. అట్టి సృష్ట్యాదికర్తవు మాయోపాధికుడవగు నీవే యీపరిదృశ్యమానమగు విశ్వమునకు నిధానుడవు. (మృత్తునందు ఘటాదులువలె జలమునందు తరంగాదులువలె దేనియందు మహదాది

గీ॥ వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాంకః ప్రజాపతి స్త్వం ప్రపితామహ శ్చ ।
నమో నమ స్తేఽస్తు సహస్రకృత్వః పున శ్చ భూయోఽపి నమో నమ స్తే ॥

పదవిభాగము:— వాయుః- యమః- అగ్నిః- వరుణః- శశాంకః- ప్రజాపతిః- త్వం- ప్రపితామహః- చ- నమః- నమః- తే- అస్తు- సహస్రకృత్వః- పునః- చ- భూయః- అపి- నమః- నమః- తే ॥ ॥౩౯॥

ప్రతిపదార్థము:— వాయుః=వాయువవు; త్వం=నీవే; యమః=యముడు; వరుణః=వరుణదేవుడు; శశాంకః=చంద్రుడు; ప్రజాపతిః=కశ్యపాదిప్రజాపతులు; త్వం=నీవే; ప్రపితామహశ్చ=బ్రహ్మకు గూడతండ్రివి; త్వం=నీవు; తే=అట్టినీకై; నమః=నమస్కారము; అస్తు=అగుగాక; సహస్రకృత్వః=వేయి సారులు; పునశ్చ=తిరిగి; భూయోపి=మరియు; నమః=నమస్కారము; తే=నీకై; నమః=నమస్కారము. ॥౩౯॥

శాంకరభాష్యమ్:—

కించ వాయు స్త్వం యమ శ్చాగ్ని ర్వరుణోఽపాంపతి శ్శశాంక శ్చంద్రమాః ప్రజాపతి స్త్వం కశ్యపాదిః ప్రపితామహశ్చ పితామహస్యాపి పితా ప్రపితామహో బ్రహ్మణోఽపి పితేత్యర్థః । నమో నమస్తే తుభ్య మస్తు సహస్రకృత్వః పున శ్చ భూయోఽపి నమో నమస్తే । బహుశో నమస్కారక్రియాభ్యాసావృత్తిగణనం కృత్వసుచోచ్యతే । పున శ్చ భూయో పీతి శ్రద్ధాభక్త్యతిశయా దపరితోష మాత్మనో దర్శయతి ॥ ॥౩౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వాయువు, అగ్నియు, జలాధిపతియగు వరుణుడు, చంద్రుడు, కశ్యపాదిప్రజాపతులు, వీరందరు నీవే. బ్రహ్మకుగూడ తండ్రివి నీవే. నీకై నమస్కారము. నీకై నమస్కారమగుగాక. వేయసారులు నమస్కారము. తిర్గి నమస్కారము తిర్గి నమస్కారము. (ఇట "పున శ్చ భూయోఽపి" అని నమస్కారావృత్తి శ్రద్ధాభక్త్యతిశయముచే దనసంతుష్టిరాహిత్యమును వెల్లడించెను.) ॥౩౯॥

సర్వవికారములు యుంచబడునో యది నిధానఃపనబడును.) అట్టి జగద్బీజమగు మాయకూడ నీవే. బుద్ధిని, తద్వికారములగు నహంకార మమకారాదులను వ్యవధానరహితముగ నెల్లపుడు తెలిసికొనెడి సర్వసాక్షి ప్రత్యగాత్మవుగూడ నీవే. వేద్యమగు బుద్ధి, తద్వికారాది సర్వదృశ్యజాతము నీవే. మరియు. 'పరం' సర్వదృశ్యవిలక్షణమగుటచే సర్వోత్తమము, మాయా తత్కార్యలేశసంబంధశూన్యము, జీవేశజగదాభాసకల్పనాధిష్ఠానము, నిత్యశుద్ధ, బుద్ధముక్తస్వభావము, నిర్విశేషము, నిరాభాసము, నిత్యానందైకరసము, అద్వితీయము, తురీయమునగు ప్రకృష్టజ్యోతీరూపమగు పరబ్రహ్మమును నీవే. నాశశూన్యమగు చిత్స్వరూపముగలవాడా! సద్రూపమగు బ్రహ్మస్వరూపుడవగు నీచే భ్రమకల్పితమగు నీసర్వజగము వ్యాప్తము. "యేన యద్వ్యాప్తం తత్తన్మాత్ర మేవ" అను న్యాయముచే సర్వము నీస్వరూపమే. ॥౩౮॥

—• ౧౧వ అధ్యాయము ౩౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— వాయువు, యముడు, వరుణుడు, చంద్రుడు, (ఈపదము సూర్యాదులకుగూడ నుపలక్షణము.) ప్రజాపతి హిరణ్యగర్భుడు; ప్రపితామహుడవుగూడ నీవే. సర్వదేవా

గీ॥ నమః పురస్తా దథ పృష్ఠత స్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।
అనంతవీర్యామితవిక్రమ స్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥ ॥౪౦॥

పదవిభాగము:— నమః- పురస్తాత్- అథ- పృష్ఠతః- తే- నమః- అస్తు- తే- సర్వతః- ఏవ- సర్వ- అనంతవీర్యామితవిక్రమః- త్వం- సర్వం- సమాప్నోషి- తతః- అసి- సర్వః ॥ ॥౪౦॥

ప్రతిపదార్థము:— పురస్తాత్=పూర్వదిక్కునందు: తే=నీకై; నమః=నమస్కారము; అథ=అనంతరమునందు; పృష్ఠతః=వెనుకభాగమందు, తే=నీకై; నమః=నమస్కారము; హేసర్వ=ఓసర్వస్వరూపుడా; సర్వతఏవ=అన్నిదిక్కులయందును; తే=నీకై: నమః=నమస్కారము; త్వం=నీవు: అనంతవీర్యామితవిక్రమః=అంతములేనివీర్యము, అమితమైన విక్రమముకలవాడవై; సర్వం=సమస్తజగత్తును; సమాప్నోషి=వ్యాపించియుంటివి; తతః=ఆ కారణముచే సర్వః—సర్వస్వరూపుడవై: అసి=అయితివి. ॥౪౦॥

శాంకరభాష్యమ్:—

తథా— నమః పురస్తా త్పూర్వస్యాం దిశి తుభ్య మథ పృష్ఠత స్తే పృష్ఠతోపి చ తే। నమోస్తు తే సర్వత ఏవ సర్వాసు దిక్షు సర్వత్ర స్థితాయ హే సర్వానన్తవీర్యామితవిక్రమోఽనంతం వీర్య మస్యామితో విక్రమోఽస్య వీర్యం సామర్థ్యం విక్రమః పరాక్రమః । వీర్యవానపి కశ్చి చ్ఛస్త్రాదివిషయే న పరాక్రమ తే మందపరాక్రమోవా త్వం త్వనన్తవీర్యామితవిక్రమశ్చే త్యనన్తవీర్యామితవిక్రమ స్సర్వం సమస్తం జగ త్సమాప్నోషి సమ్య గేకే నాఽఽత్మనా వ్యాప్నోషి యత స్తస్మా దసి భవసి సర్వ స్త్వయా వినాభూతం న కించి దస్తీ త్యర్థః ॥౪౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓసర్వస్వరూపుడా! నీకై పూర్వదిక్కునందు నమస్కారము. వెనుకభాగమందు నీకై నమస్కారము. నీకై అన్నిదిక్కులయందును నమస్కార మగు కాక. నీవు అంతములేని వీర్యము, అమితమైన పరాక్రమము కలవాడవు. సర్వమును వ్యాపించి యుంటివి. కాన సర్వము నీవై తివి. (నీవు కాని దేదియు లేదని యర్థము.) ॥౪౦॥

...త్మకుడవగుట నీవు సర్వులకు నమస్కార్యుడవు. కాన నానమస్కారము నీకు జెందుగాక. నీకై వేయి నమస్కారములు. తిరిగి నమస్కారము. మరల నమస్కారము. (భక్తిశ్రద్ధాతిశయముచేనైన నమస్కారాలం ప్రత్యయము లేకుండుట నమస్కారావృత్తిచే సూచితము.) ॥౩౯॥

—• ౧౧వ అధ్యాయము ౪౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నీకై ముందుభాగమున నమస్కారము. వెనుకభాగమందు నమస్కారము. అంతటను యుండు నీకై నమస్కారము. ఓసర్వాత్మకుడా! నీవు అనంతమైన శరీరబలము, అపరిమితమైన విక్రమము (శస్త్రప్రయోగనైపుణి) కలవాడవు. (లేక "అనంతవీర్య" అని సంబోధనముగ జూడనగును. సర్వజగత్తును లెస్సగ సద్రూపముతో వ్యాపించుచుంటివి. కాన సర్వస్వరూపుడవు. నీకంటె నతిరిక్తమగున దేదియు లేదని యాశయము. ॥౪౦॥

శంకరానందీయము:— అర్జునుడు భక్తివేగముచేనైన సంతోషాతిశయముచే స్తుతించుచు తిరిగి యంతటను నమస్కరించుచుండెను:— ఓసర్వాత్మకుడా! నీకై ముందు వెనుక భాగములయందు నమస్కా—

గీ॥ సఖేతి మత్వా ప్రసభం య దుక్తం హేకృష్ణ హేయాదవ హెసఖేతి ।
అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదా త్ప్రణయేన వాపి॥ ॥౪౧॥

పదవిభాగము:— సఖా- ఇతి- మత్వా- ప్రసభం- యత్- ఉక్తం-హేకృష్ణ- హేయాదవ- హేసఖా- ఇతి- అజానతా- మహిమానం- తవ ఇదం- మయా- ప్రమాదాత్- ప్రణయేన- వా- అపి ॥౪౧॥

ప్రతిపదార్థము:— తవ=నీయొక్క; ఇదం=ఈవిశ్వరూపమును; మహిమానం=మహిమనుగ; అజానతా=గుర్తెరుగనట్టి; మయా=నాచేతను; సఖేతి=సమానవయస్కుడవని; మత్వా=తలచి; హేకృష్ణేతి=ఓకృష్ణ అనియు; హేయాదవ=ఓయదువంశీయ!అనియు; హేసఖేతి=ఓచెలికాడా!యనియు; ప్రసభం— అభిభవించి; ప్రమాదాత్=విక్షిప్తచిత్తముతోగాని; (పరాకునగాని) ప్రణయేనవాపి=చెలిమిచేగాని; యత్=ఏది; ఉక్తం= పలుకబడెనో. (ముందుశ్లోకముతోనన్వయము) ॥౪౧॥

గీ॥ యచ్చావహాసార్థ మసత్కృతోఽసి విహారశయ్యాసనభోజనేషు ।
ఏకోఽథ వా ప్యచ్యుత త త్సమక్షం త త్క్షామయే త్వా మహ మప్రమేయమ్ ॥

పదవిభాగము:— యత్- అవహాసార్థం- అసత్కృతః- అసి- విహారశయ్యాసనభోజనేషు- ఏకః- అథ- వా- అపి- అచ్యుత- తత్- సమక్షం- తత్- క్షామయే- త్వాం- అహం- అప్రమేయమ్ ॥౪౨॥

ప్రతిపదార్థము:— విహారశయ్యాసనభోజనేషు=విహరించుట, పరుండుట, కూర్చొనుట, భోజనముపీటియందు; ఏకః=ఒక్కరుడవైగాని; అథవా=లేక; తత్సమక్షం=ప్రత్యక్షముగగాని; హేఅచ్యుత= ఓచ్యుతిరహితుడా; అవహాసార్థం=పరిహాసనిమిత్తమై; అసత్కృతోసీతియత్=తిరస్కరింపబడితివనునదేది కలదో; తత్=ఆయపరాధమును; అప్రమేయం=ప్రమాణాతీతుడవగు; త్వాం=నిన్ను; అహం=నేను; క్షామయే=క్షమింపగోరుచుంటిని. ॥౪౨॥

శాంకరభాష్యమ్:—

యతోఽహం! త్వన్మాహాత్మ్యాపరిజ్ఞానాపరాధ్యతః— సఖా సమానవయా ఇతి మత్వా జ్ఞాత్వా విపరీతబుద్ధ్యా ప్రసభ మభిభూయ ప్రసహ్య యదుక్తం హేకృష్ణ! హేయాదవ! హెసఖేతి చాజానతాఽజ్ఞానినా మూఢేన । కి మజానతే త్యాహ- మహిమానం మాహాత్మ్యం తవేద మీశ్వరస్య విశ్వరూపమ్ । తవేదం మహిమాన మజానతేతి వైయధికరణ్యేన సంబంధః । తవేమ మితి పాఠో యద్యస్తి తదా సామానాధికరణ్య మేవ । మయా ప్రమాదా ద్విక్షిప్త చిత్తతయా ప్రణయేన వాఽపి ప్రణయో నామ స్నేహనిమిత్తో విస్రమ్భ స్తేనాపి కారణేన య దుక్తవా నస్మి ॥ ॥౪౧॥

యచ్చేతి యచ్చావహాసార్థం పరిహాసప్రయోజనాయాఽసత్కృతః పరిభూతోఽసి భవసి, క్వ, విహారశయ్యాసనభోజనేషు విహరణం విహారః పాదవ్యాయామః శయనం శయ్యా

రము. అంతటను నీకై నమస్కారము. (ఇట "సర్వ" అను విశేషణముచే దిగ్విభాగహేతువగు సూర్యుడు గూడ సర్వాత్మయం దంతర్భవించునుగాన సర్వాత్మకునికి ప్రాగాదిదిగ్విభాగము సంభవింపనేరదు. అట్లయినను స్వదృష్టిగతి ననుసరించి యట్లు చెప్పబడెనుగాని, వస్తుస్థితినిబట్టిగాదు. ఇట "సర్వ", అని నామను బట్టియే చెప్పబడెనుగాని, అర్థమునుబట్టికాదు." అని యనరాదు. అట్లే యగుచో "అనంత, జగన్నివాస,

శాంకరభాష్యమ్:—

ఽఽసన మాస్థాయికా భోజనమదన మిత్యేతేషు విహారశయ్యాసనభోజనే ష్వేకః పరోక్షః సన్న సత్కృతోఽసి పరిభూతోఽస్యథ వాఽపి హేఽచ్యుత! తత్సమక్షం తచ్ఛబ్దః క్రియావిశేషణార్థః। ప్రత్యక్షం వాఽసత్కృతోఽసి తత్సర్వ మపరాధజాతం క్షామయే క్షమాం కారయే త్వా మహ మప్రమేయం ప్రమాణాతీతమ్ ॥ ॥౪౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నీమాహాత్మ్యమును తెలియనివాడను గాన— నీయీవిశ్వరూపమును నీమాహాత్మ్యము తెలియనట్టి నాచే సమానవయస్కుడవని తలచి, యభిభవించి, "ఓకృష్ణ! ఓయాదవ! ఓచెలికాడా"అని చిత్తవిక్షేపముచే గాని, చెలిమిచేగాని యేవాక్యము పలుకబడెనో దానిని నేను క్షమింపమని కోరుచుంటిని. ॥౪౧॥

ఓచ్యుతిరహిత! విహార, శయ్యా, సన, భోజనములయందు పరోక్షముగ గాని, ప్రత్యక్షముగగాని పరిహాసమునకై యగౌరవించియుంటిని. అట్టి నాయపరాధజాతమును క్షమింపమని ప్రమాణాగోచరుడ వగు నిన్ను గోరుచుంటిని. ।౪౨।

ఆదిదేవ త్వ మాదిదేవః" ఇత్యాదిశబ్దముల యర్థమునకు వ్యాఘాతము ప్రసక్తమయ్యెడిని. కనుకనే సర్వశబ్దార్థమును స్వయముగనే నిర్వర్తించి తత్సిద్ధియందు హేతువును జెప్పుచున్నాడు.— "సర్వతః విశిష్య ఈరయితుం యోగ్యం వీర్యం" అంతటను విశేషించి ప్రసరింపజేయుటకు దగినదిగాన 'వీర్య' మనబడును. (తేజస్సు) విక్రమశబ్దముచే వ్యాపనశీలత్వ మూహింపబడును.) నీవు అంతములేని వీర్యము, అమితమైన వ్యాపనశీలత్వము కలవాడవు. ఇది (హేతుగర్భవిశేషణము.) అట్టివాడవు కనుకనే "సర్వం సమాప్నోషి" వహ్ని అయఃపిండమునువలె వీర్యము (స్ఫూర్తి) చేతను, విక్రమము (సత్త) చేతను అంతటను వ్యాపించియుంటివి. కనుకనే "సర్వోఽసి" సర్వాత్మకుడవైతివి. (ఈచెప్పుటచే నామరూపాత్మకమగు సర్వజగత్తునీవే. నిరాత్మకమయినది యణుమాత్రముగూడ లేదు. అని సూచితము.) ॥౪౦॥

—• ౧౧వ అధ్యాయము ౪౧, ౪౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నేను నీమాహాత్మ్యము తెలియనివాడనై యనేకాపరాధములను చేసితిని. కావ వాటిని క్షమించుటకై నిన్నర్థించుచుంటిని. అని రెండు శ్లోకములచే చెప్పుచున్నాడు.— నీవు నాకు సఖుడవని తలచి స్వోత్కర్షఖ్యాపనరూపమగు అభిభవముతో నాడినమాటలను, నీయీయైశ్వర్యాతిశయము నెరుగని నాచే చిత్తవిక్షేపరూపమగు ప్రమాదముచేగాని, ప్రణయముచేగాని "హేకృష్ణ! హేయాదవ! హేసఖ!" అని పిలువబడినదానిని, పరిహాసమునకై విహార, శయ్యా, ఆసన భోజనములయందు పరిభూతుడవయితివో ఆవిషయమును, రహస్థుడవైగాని, స్నేహితుల సమక్షమునగాని అసత్కృతుడవైతివో యీసర్వమునగు వచనరూపము, అసత్కారరూపమునగు సర్వఅపరాధజాతమును నీవు క్షమించుటకు కోరుచుంటిని. (చ్యుతిరహితుడవు, (నిర్వికారుడవు,) అచింత్యప్రభావుడవు, పరమకారుణికుడవు నగు నీవు నీమాహాత్మ్యము నెరుగని నన్ను క్షమింపదగుదువని యర్థము.) ॥౪౧, ౪౨॥

గీ॥ పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావ ॥౪౩॥

పదవిభాగము:— పితా- అసి- లోకస్య- చరాచరస్య- త్వం- అస్య- పూజ్యః- చ- గురుః- గరీయాన్- న- త్వత్సమః- అస్తి- అభ్యధికః- కుతః- అన్యః- లోకత్రయే- అపి- అప్రతిమప్రభావ॥

ప్రతిపదార్థము:— త్వం=నీవు; అస్య=ఈ; చరాచరస్య=స్థావరజంగమాత్మకమగు; లోకస్య=ప్రాణిజాతమునకు; పితా=జనకుడవు; అసి=అయితివి; పూజ్యః=పూజార్హుడవు; అసి—అయితివి, గరీయాన్=గొప్ప; గురుః=గురుడవు; అసి=అయితివి; లోకత్రయేపి=ముల్లోకములయందును; అప్రతిమప్రభావ=సాటిలేనిప్రభావము కలవాడా; అన్యః=ఇతరుడు; త్వత్సమః—నీతో సమానుడు. నాస్తి=లేడు, అధికః=అధికుడు, కుతః=ఎట్లు, స్యాత్=ఉండును. ॥౪౩॥

పరమార్థప్రపః:— ఈయర్థము తెలిసికొనదగును.— సామవేదముననున్న బృహద్రథంతరాది పావమాన్యస్తుతులచే బ్రసన్నుడగు భగవంతునుండి "యశోలభస్వ" అను పూర్వోక్తరీతినగు నశ్వరఫలము కోరను; ఇకనేమన: నాయపరాధమును క్షమింపుమని కోరెదను. అందుచే విష్ణుస్వరూపదర్శనముచే ముక్తినే పొందెదను. కృతాపరాధుడు నశ్వరఫలమునే పొందును. అని యిట యర్జునాభిప్రాయము. వాజసనేయారణ్యకశ్రుతియు నిట్లు చెప్పుచున్నది.— "అథాతః పవమానానా మేవాభ్యారోహః స వై ఖలు ప్రస్తోతా సామ ప్రస్తౌతి స యత్ర ప్రస్తుయాత్తదేతాని జపేదసతో మా సద్గమయ తమసో జ్యోతిర్గమయ మృత్యోర్మాఽమృతం గమయ" అని. దీనికి భాష్యానుసృతార్థము:— ఈశ్వరస్తావక వాక్యోపక్రమమును బట్టి పావమాన్యశ్రుతులకుత్కర్షము చెప్పబడుచున్నది. కారణమేమన: ప్రస్తోతసామరూపుడగుపరమేశ్వరుని స్తోత్రము చేయుచుండెను. ఎపుడుస్తోత్రము చేయునో అప్పుడుయీయజుస్సులనుమూడింటిని జపింపదగును. అవిఏవన "(1) అసతో మాసద్గమయ। (2) తమసోమా జ్యోతిర్గమయ। (3) మృత్యోర్మామృతంగమయ" అనునవి. వీటికి యర్థము:— నన్ను అసద్రూపమగు సంసారమునుండి బ్రహ్మను పొందించుము. (తెల్పుము.) అజ్ఞానమునుండి నన్ను ప్రకాశరూపమును పొందించుము. సంసారమునుండి నన్ను మోక్షమును పొందించుము. అని. తైత్తిరీయకమునందు గూడ యిట్లు చెప్పబడినది,— "యథా మధ్యే సముద్రస్య ప్లవమన్వారోహేయుస్తాదృక్తదనుత్సర్గం బృహద్రథంతరాభ్యాం మిత్వా ప్రతిష్ఠాం గచ్ఛతి" అర్థము:- సముద్రపతితులగు జనులు నావను ఆశ్రయించినట్లు బృహద్రథంతరముల (ఆశ్రయించి) చే నజ్ఞానసముద్రము స్వల్పమైనదానిని గదలచి దాటి బ్రహ్మమునందు ప్రతిష్ఠను పొందుచుండిరి. ఇక నశ్వరఫలము ఇంద్రాదిస్తుతులచే బొందబడును. "శ్రు॥ అథ యా నీతరాణి స్తోత్రాణి తే ష్వాత్మనేఽన్నాద్యమాగాయేత్తస్మాత్తదుత్తేషు వరం వృణీత యం కామం కామయతే తమాగాయేత్" అని. అర్థము:— ఇక పావమాన్యశ్రుత్యతిరిక్తములగు స్తోత్రములు. వాటియందు తన కొరకు అన్నాదిఫలము కోరదగును. అప్రసన్నమగు దేవతలనుండి యేకోరికను కోరునో, ఏవరమును కోరునో ఆఫలమును పొందును. ॥౪౧, ౪౨॥

—• ౧౧వ అధ్యాయము ౪౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పరమేశ్వరుని యచింత్యప్రభావమునే యీ శ్లోకమున విస్తరింప జేయుచున్నాడు. ఈచరాచరప్రపంచమునకు నీవు తండ్రివి. సర్వేశ్వరుడవగుట పూజ్యుడవు, గురుడవుకూడను. కాన అన్నివిధములచేతను నీవు గొప్పవాడవు. కనుకనే ఈలోకత్రయమందును నీతో సమానుడు లేడు. ఇక అధికుడెట్లుండును. ॥౪౩॥

శాంకరభాష్యమ్:—

యత స్త్వమ్ — పితాసి జనయితాసి లోకస్య ప్రాణిజాతస్య చరాచరస్య స్థావర జంగమస్య। న కేవలం త్వ మస్య జగతః పితా, పూజ్య శ్చ పూజార్హో యతో గురు ర్గరీయా న్గురుతరః। కస్మా ద్గురుతర స్త్వ మిత్యాహ। న చ త్వత్సమ స్త్వత్తుల్యోఽన్యోఽస్తి। నహీశ్వర ద్వయం సంభవ త్యనేకేశ్వరత్వే వ్యవహారానుపపత్తేః। త్వత్సమ ఏవ తావ దన్యో న సంభవతి కుతో ఽన్యోఽభ్యధిక స్స్యాత్। లోకత్రయేపి సర్వస్మి న్నప్రతిమప్రభావ ప్రతిమీయతే యయా సా ప్రతిమా న విద్యతే ప్రతిమా యస్య తవ ప్రభావస్య స త్వ మప్రతిమప్రభావో హే అప్రతిమప్రభావ! నిరతిశయప్రభావ ఇత్యర్థః ॥ ॥౪౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

స్థావరజంగమాత్మక మగు యీప్రాణిసమూహమునకు జనకుడవు. ఇంతియే కాదు. పూజ్యుడవు గూడను. కారణ మేమందువా? గురుతరుడవు. యేమందువా? నీతో సమానుడు లేడు. (అట్లే యున్నచో నొకయీశ్వరుడు సృష్టింపదలంచుచుండిన మరియొక ఈశ్వరుడు సంహరింపదలచునుగాన లోకవ్యవహారమే లోపించెడిని. కాన నొకే యీశ్వరు డుండెననవలెను. ఇక నీకంటె నధికు డెట్లుండును? ఉండ డని భావము.) నీవు లోకత్రయమందునను సాటిలేని స్వభావము కలవాడవు. ॥౪౩॥

శంకరానందీయము:— "నీకున్న గదాదిపరికరములే నాకును గలవు. నిన్ను క్షమించుటకు నేనెంతటివాడను!" అను ఆశంకపై నీవు సర్వలోకపూజ్యుడవు, పరమేశ్వరుడవు. అని సహేతుకముగ ప్రతిపాదించుచుండెను.— జంగమస్థావరాత్మకము, పరిదృశ్యమానము నగు యీ సర్వ ప్రాణిజాతమునకు "యతో వా ఇమాని భూతాని జాయన్తే" అను శ్రుత్యుక్తరీతిని నీవు జనకుడవు. మరియు సకలానర్థములకు బీజభూతమైన యవిద్యకును, తత్కార్యములను నశింపజేసెడి జ్ఞానము నుపదేశించువాడవుగాన సర్వోత్తముడవగు గురుడవు. కనుకనే సర్వలోకములకు పూజ్యుడవు. కాన నాకు గురుడవని చెప్పనేమిటికి? "ఆత్మన ఆకాశ స్సంభూతః, అస్య మహతో భూతస్య" అను శ్రుతిచొప్పున ఆకాశాదిసర్వభూత జనకుడవగుట యందును ధర్మజ్ఞానమూలకమగు సర్వవేదముల నుపదేశించుట యందును ఈలోకత్రయమున నీకంటె నెక్కువవాడు గాని, నీతో సమానుడు గాని, మరియొకడు లేడు. అట్లు మరియొక ఈశ్వరుడే యుండెనని యంగీకరించినచో సర్వవ్యవహారములు లోపించెడిని. అనగా నొకయీశ్వరుడు సృష్టించుచున్న మరియొక యీశ్వరుడు తత్కాలముననే నశింపజేయుచుండును. కాన లోకవ్యవహారము సిద్ధింపకుండును. కనుకనే తత్సముడగు యీశ్వరుడు మరొకడు లేడనుచుంటిని. నీతో సమానుడే లేనపుడు నీకంటె యధికు డెట్లుండునని యర్థము. ఈవిషయమునే "న తత్సమ శ్చా భ్యధికశ్చ దృశ్యతే" అను శ్రుతియు జెప్పుచున్నది. "ప్రతిమీయతే అనయేతి ప్రతిమా సాదృశ్యం న విద్యతే యస్య అసావప్రతిమః అప్రతిమః ప్రభావః యస్య స అప్రతిమప్రభావః" దీనిచేతను కొలవబడునదిగాన సాదృశ్యము ప్రతిమయనబడును. అట్టి సాదృశ్యము (సాటి)లేని ప్రభావము (మాయాయోగజము ప్రపంచ బంధమోక్షాది కార్యఘటనాఘటనసామర్థ్యము) కలవాడు అ ప్రతిమ ప్రభావము ("అప్రతిమస్వభావ" అను సంబుద్ధిచే నీతోసమానుడగు పురుషుడు లేడని సూచింపబడెను.) స్వభావుడనబడును. ॥౪౩॥

శ్లో॥ తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్॥ ॥౪౪॥

పదవిభాగము:— తస్మాత్- ప్రణమ్య- ప్రణిధాయ- కాయం- ప్రసాదయే- త్వాం- అహం- ఈశం- ఈడ్యమ్- పితా- ఇవ- పుత్రస్య- సఖా- ఇవ- సఖ్యుః- ప్రియః- ప్రియాయాః- అర్హసి- దేవ- సోఢుమ్॥ ॥౪౪॥

ప్రతిపదార్థము:— తస్మాత్—ఆ కారణమువలన, ప్రణమ్య—నమస్కరించి, కాయం—శరీరమును, ప్రణిధాయ—వొంచి, ఈశం—ప్రభుడవు, ఈడ్యం—స్తోత్రార్హుడవునగు, త్వాం—నిన్ను, అహం—నేను, ప్రసాదయే—అనుగ్రహింపజేసుకొనెదను, పుత్రస్య—కుమారుని, అపరాధం—(ఈపదమధ్యాహార్యము) అపరాధమును, పితేవ—తండ్రివలె, సఖ్యుః—స్నేహితుని, అపరాధం—తప్పును, సఖేవ—స్నేహితుడువలె, ప్రియాయాః—ప్రియురాలి, అపరాధం—తప్పును, ప్రియఇవ—ప్రియుడువలె, మే—నాయొక్క, అపరాధం—తప్పును, సోఢుం—సహించుటకు, హే దేవ—ఓ శ్రీకృష్ణప్రభూ!, త్వం—నీవు, అర్హసి—తగుదువు. ॥౪౪॥

శాంకరభాష్యమ్:—

యత ఏవమ్— తస్మాత్ప్రణమ్య నమస్కృత్య ప్రణిధాయ ప్రహ్వీకృత్య నీచైర్ధృత్వా కాయం శరీరం ప్రసాదయే ప్రసాదం కారయే త్వా మహ మీశమీశితార మీడ్యం స్తుత్యం త్వం పునః పుత్రస్యాపరాధం పితా యథా క్షమతే సర్వం సఖేవ సఖ్యు రపరాధం యథా వా ప్రియాయా అపరాధం క్షమత ఏవ మర్హసి హేదేవ సోఢుం ప్రసహితుం క్షంతు మిత్యర్థః ॥౪౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కానయోదేవ! నమస్కరించి, శరీరమును వంచి సర్వసమర్థుడవు, స్తోత్రార్హుడవునగు నిన్ను అనుగ్రహింపజేసుకొనుచుంటిని. (బ్రతిమాలుకొనుచుంటిని.) తనకుమారుని యపరాధమును తండ్రివోలె, స్నేహితుని యపరాధమును స్నేహితుడువలె, ప్రియురాలి యపరాధమును ప్రియుడువలె నాయపరాధమును సహించుటకు (మన్నించుటకు) నీవు తగుదువు.

—• ౧౧ అధ్యాయము ౪౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— కాన శరీరమును వంచి, నమస్కరించి (సాష్టాంగనమస్కారమాచరించి) సర్వులకు స్తోత్రార్హుడవగు నిన్ను వేడుచుంటిని. హేదేవ! పుత్రాపరాధమును తండ్రివలె, స్నేహితుని యపరాధమును స్నేహితుడువలె, పతివ్రతాపరాధమును భర్తవలె, నాయపరాధమును క్షమించుటకుతగుదువు. (ఇట ప్రియాయార్హసి"అనుస్థలమున. ఇవశబ్దలోపము సంధియు నార్షములు.) ॥౪౪॥

శంకరానందీయము:— జగద్గురుడవు, జగజ్జనకుడువు, సర్వలోకపూజ్యుడవు నగుట నేను నీకపరాధము చేయరాదు. ప్రమాదవశముచే చేసిన యపరాధమును నీవు మన్నింపదగును. అని చెప్పి ప్రణామపూర్వకముగ భగవంతుని ప్రసన్నుని జేసుకొనుచుండెను.— నీవు నిరతిశయైశ్వర్యసంపన్నుడవుగాన సాష్టాంగప్రణామపూర్వకముగా నిన్ను ప్రసన్నుడవుకమ్మని ప్రార్థించుచుంటిని. శేషము గతార్థము.) ॥౪౪॥

గీ॥ అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే ।
తదేవ మే దర్శయ దేవ రూపం ప్రసీద దేవేశ జగన్నివాస ॥ ॥౪౫॥

పదవిభాగము:— అదృష్టపూర్వం- హృషితః- అస్మి- దృష్ట్వా- భయేన- చ- ప్రవ్యథితం- మనః- మే- తత్- ఏవ- మే- దర్శయ- దేవ- రూపం- ప్రసీద- దేవేశ- జగన్నివాస ॥ ॥౪౫॥

ప్రతిపదార్థము:— అహం=(ఈపదమధ్యాహార్యము)నేను; అదృష్టపూర్వం=పూర్వముచూడని విశ్వరూపమును; దృష్ట్వా=చూచి; హృషితః=సంతసించినవాడనై; అస్మి=అయితిని; మే=నాయొక్క; మనః=మనస్సు; ప్రవ్యథితం=వ్యథనొందినది; హే దేవ=ఓప్రభూ!, తదేవ=మత్స్యకచ్ఛపస్వరూపమైన; రూపం=రూపమును; మే=నాకొరకు; దేవేశ=ఓదేవప్రభూ; జగన్నివాస=జగత్తునకునివాసభూతుడా; ప్రసీద=అనుగ్రహింపుము. ॥౪౫॥

గీ॥ కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ ।
తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో భవ విశ్వమూర్తే ॥ ॥౪౬॥

పదవిభాగము:— కిరీటినం- గదినం- చక్రహస్తం- ఇచ్ఛామి- త్వాం- ద్రష్టుం- అహం- తథా- ఏవ- తేన- ఏవ- రూపేణ- చతుర్భుజేన- సహస్రబాహో- భవ- విశ్వమూర్తే ॥ ॥౪౬॥

ప్రతిపదార్థము:— అహం=నేను; కిరీటినం=కిరీటముగలట్టియు; గదినం=గదకలట్టియు; చక్రహస్తం=చక్రముహస్తమునందుగలట్టి; త్వాం=నిన్ను; తథా=అట్లే; ద్రష్టుం=చూచుటకై; ఇచ్ఛామి=ఇచ్ఛయించుచుంటిని; సహస్రబాహో=వేయిబాహువులుగల; విశ్వమూర్తే=విశ్వస్వరూపుడా; చతుర్భుజేన=నాల్గుభుజములుగల; తేనైవరూపేణ=వాసుదేవస్వరూపముతో; భవ=అగుము. ॥౪౬॥

—• ౧౧వ అధ్యాయము ౪౫, ౪౬ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పైవిధముగ నపరాధక్షమాపనమును జెప్పుకొని, తిరిగి విశ్వరూపోపసంహారపూర్వకముగ పూర్వరూపదర్శనమును గోరుచుండెను.— ఎప్పుడును చూడని నీవిశ్వరూపమును జూచి ప్రహృష్టుడనైతిని. నీవికృతరూపదర్శనముచేతనైన భయముచే నామనస్సు వ్యాకులమైనది. నాప్రాణములకంటె ప్రియమైన నీప్రాచీనరూపమును జూపుము. ఆరూపమెట్టిదందువా? కిరీటము, చక్రము, గదయు హస్తములయందు గలిగి యున్న నిన్ను జూడ వేడ్కయగుచున్నది. కాన చతుర్భుజుడవగు వాసుదేవస్వరూపముతో నీవుండుము. సహస్రబాహువులుకల యోవిశ్వరూపుడా! నీయీరూపము నుపసంహరింపుము. పూర్వరూపముతో నుండుమని యర్థము. (ఈచెప్పుటచే నర్జునుడు సర్వదా చతుర్భుజాదియుక్తరూపమునే జూచుచుండెడివాడని సూచింపబడెను.) ॥౪౫, ౪౬॥

పరమార్థప్రప:— క్షమాపనానంతరము ప్రార్థించుచుండెను.— జన్మజన్మాంతరములయందు గూడ జూడని నీవిశ్వరూపాంతముగ చతుర్భుజరూపమును జూచి హర్షించితిని. అనంతరము దంష్ట్రాకరాళములగు నీరూపములజూచి నామనస్సు భయవిహ్వల మగుచున్నది. కాన నోదేవేశ! జగన్నివాస! యనుగ్రహింపుము. ప్రథమముగ నేజూచిన నీచతుర్భుజరూపమును నాకు జూపుము. అంతమాత్రముననే కృతార్థుడను గాగలను. ప్రథమమున నే జూచిన రూప మెట్టిదందువా? కిరీటము, గద, చక్రము కల్గినట్టిది. (ఇది సర్వాయుధముల కుపలక్షణము.) (ఇట నిష్కృష్టార్థమిది:— విశ్వరూపమును జూపు సమయమున ప్రథమముగ నీవిచ్చిన దివ్యదృష్టితో చతుర్భుజయుక్తము, మనోహరమునగు రూపమును జూచితిని. ఆరూపము వైకుంఠమందు గాక మరొకస్థలమున జూడశక్యము గానిదని పురాణములనుండి వింటిని. అట్టిరూపము ప్రయాసము లేకుండగనే

శాంకరభాష్యమ్:—

అదృష్టపూర్వ మితి । అదృష్టపూర్వం న కదాచి దపి దృష్టపూర్వ మిదం విశ్వరూపం తవ మయాఽన్యై ర్వా త దహం దృష్ట్వా హృషితోఽస్మి భయేన చ ప్రవ్యథితం మనో మేఽత స్త దేవ మే మమ దర్శయ హే దేవ! రూపం య న్మత్సఖం ప్రసీద దేవేశ జగన్నివాస ॥౪౫॥

కిరీటిన మితి । కిరీటినం కిరీటవంతం తథా గదినం గదావంతం చక్రహస్త మిచ్ఛామి త్వాం ప్రార్థయే త్వాం ద్రష్టు మహం తథైవ పూర్వవ దిత్యర్థః । యత ఏవం తస్మా త్తేనైవ రూపేణ వసుదేవపుత్రరూపేణ చతుర్భుజేన సహస్రబాహో వార్తమానికేన విశ్వరూపేణ భవ విశ్వమూర్తే ఉపసంహృత్య విశ్వరూపం తేనైవ రూపేణ వసుదేవపుత్రరూపేణ భవేత్యర్థః ॥౪౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓ శ్రీకృష్ణప్రభూ! నేనుగాని, యితరులుగాని యింతకు పూర్వము చూడనట్టి నీవిశ్వరూపమును దర్శించి యెంతయో హర్షము నొందితిని. దంష్ట్రాకరాళమగు నీవికృతరూపమును జూచి నామనస్సు యెంతయో వ్యథ నొందినది. కాన నాకు స్నేహితుడవై యున్నపుడుండు నీరూపును జూపుము. ఓదేవతాప్రభూ! జగన్నివాస! అనుగ్రహింపుము. ॥౪౫॥

కిరీటమును ధరించినట్టియు, గదాసమలంకృతమైనట్టియు, చక్రము హస్తమునందు గలట్టియు నిన్ను పూర్వవిధముగ చూడగోరుచుంటిని. కాన వేయిబాహువులు కల్గిన యోవిశ్వరూపధారీ! చతుర్బాహుయుక్తమగు వాసుదేవరూపముతోనే యుండుము. ॥౪౬॥

నేనిట జూచి హర్షించితిని. అనంతరము దంష్ట్రాకరాళమగు రూపమును జూచి భయము నొందుచుంటిని. కనుక ఆకిరీటాదిసంశోభితమగు రూపమును జూప గోరుచుంటిని. ఓవిశ్వరూపుడా! సహస్రబాహూ! (ఈసంబోధనద్వయముచే భయజనకమై ప్రస్తుతమున్నరూపము ద్యోతితము) నీ ఈరూపము నుపసంహరించి, చతుర్భుజయుక్తమైన మనోహరరూపముతో నుండుము. అని యర్థము.)

(ఈస్థలమున— అర్జునుడు విశ్వరూపదర్శనమున పూర్వముగూడ శ్రీకృష్ణుని సర్వదా చతుర్భుజునిగనే చూచెడివాడు. కనుకనే అట్టి పూర్వరూపమును జూపుమనికోరెను. అని కొందరు వ్యాఖ్యానించిరి. అట్లనుట సరికాదు. అట్లగుచో "పశ్యామి దేవాం స్తవదేవ! దేహే" అను స్థలములనందు "కిరీటినం గదినం చక్రిణంచ" అని క్రొత్తగ అప్పుడే చూచుచున్నట్లు చెప్పుట యసంగత మగును. మరియు నీచతుర్భుజరూపము దైవసంబంధిగాని మానుషముకానందున, ఆదినుండియు దైవరూపమునే చూచుచున్నచో "యచ్చావహాసార్థ మసత్కృతోసి" అని చెప్పుటపొసగదు. (మరియు "అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్" అనియు, "దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన!" అనియు చెప్పబడిన యుపక్రమోపసంహారములచే సర్వమానుషసాధారణమైన ద్విభుజరూపమే నిర్దేశింపబడుటవలన ఆదినుండియు అర్జునుడు చూచినది మానుషసాధారణమైన ద్విభుజరూపమేయనియు, విశ్వరూపప్రదర్శనప్రథమకాలమున చతుర్భుజాద్యుపేతదైవరూపమనియు, అనంతరప్రదర్శితము భయానకరూపమనియు, దానిని యుపసంహరించి యాచతుర్భుజ మనోహరరూపమును జూపుమని యర్జునుడు కోరెననుటయు సముంజసము)

॥౪౫, ౪౬॥

శ్రీభగవానువాచ:—

గీ॥ మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శిత మాత్మయోగాత్ ।
తేజోమయం విశ్వ మనన్త మాద్యం య న్మే త్వ దన్యేన న దృష్టపూర్వమ్ ॥౪౭॥

పదవిభాగము:— మయా- ప్రసన్నేన- తవ- అర్జున- ఇదం- రూపం- పరం- దర్శితం- ఆత్మయోగాత్- తేజోమయం- విశ్వం- అనంతం- ఆద్యం- యత్- మే- త్వదన్యేన- న- దృష్టపూర్వమ్ ॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=శ్రీకృష్ణభగవానులు; ఉవాచ=పలికెను; హేఅర్జున=ఓయర్జునుడా; ప్రసన్నేన=అనుగ్రహయుక్తుడనైన; మయా=నాచే; ఆత్మయోగాత్=ఐశ్వర్యముయొక్క సామర్థ్యమువలన; తవ=నీకు; ఇదం=ఈ; తేజోమయం=తేజస్స్వరూపమైనదియు; విశ్వం=విశ్వస్వరూపము; అనంతం=అంతములేనిదియు; ఆద్యం=ఆదికాలమునందుండునదియు; పరం=ఉత్కృష్టమైన; రూపం=విశ్వరూపము; దర్శితం=చూపబడెను; మే=నాయొక్క; యత్=ఏరూపము; త్వదన్యేన=నీకంటెనితరునిచే; నదృష్టపూర్వం=పూర్వమునందుజూడబడలేదో. ॥౪౭॥

---

శాంకరభాష్యమ్:—

అర్జునం భీత ముపలభ్యోపసంహృత్య విశ్వరూపం ప్రియవచనే నాశ్వాసయన్— మయా ప్రసన్నేన ప్రసాదో నామ త్వ య్యనుగ్రహబుద్ధి స్తద్వతా ప్రసన్నేన మయా తవ హేఽర్జునేదం పరం రూపం విశ్వరూపం దర్శిత మాత్మయోగా దాత్మన ఐశ్వర్యస్య సామర్థ్యా త్తేజోమయం తేజఃప్రాయం విశ్వం సమస్త మనన్త మన్తరహిత మాదౌ భవ మాద్యం య ద్రూపం మే మమ త్వదన్యేన త్వత్తోఽన్యేన కేనచి న్న దృష్టపూర్వమ్ ॥౪౭॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భయవిహ్వలుడైన యర్జునుని జూచి విశ్వరూపము నుపసంహరించి ప్రియవచనముచే నాశ్వాసించుచు శ్రీకృష్ణభగవాను లిట్లు పలికెను— ఓయర్జునా! నీయందనుగ్రహబుద్ధి కలవాడనై నా యైశ్వర్యసామర్థ్యముచే తేజఃప్రాయము, విశ్వాత్మకము నాద్యము నుత్కృష్టము నగు యీవిశ్వరూపమును నీకు ప్రదర్శించితిని. నాఈ రూపము నితరు లెవ్వరును యింతకు బూర్వము జూచియుండలేదు. ॥౪౭॥

---

—• ౧౧వ అధ్యాయము ౪౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పైవిధముగ నర్జునునిచే ప్రసాదితుడై, శ్రీకృష్ణభగవానులు అర్జునుని భయవిహ్వలునిగ దెలిసికొని తన విశ్వరూపము నుపసంహరించి, సముచితవచనములతో నాతవి నూరడించుచు నిట్లనెను.— ఓయర్జునా! భయపడకుము. ఏమందువా? నీయందలి కృపచే నేనీశ్రేష్ఠమగు విశ్వరూపమును నాయసాధారణసామర్థ్యము నీకు జూపివాను; ఈనారూపము తేజఃప్రచురము, విశ్వాత్మకము, అనంతము, ఆదియు నైనది. ఇట్టి నారూపమును నీవుగాక మరెవ్వడు నింతక్షుపూర్వము చూడలేదు. ॥౪౭॥

శ్లో॥ న వేదయజ్ఞాధ్యయనై ర్న దానై ర్న చ క్రియాభి ర్న తపోభి రుగ్రైః ।
ఏవంరూపః శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥ ॥౪౮॥

పదవిభాగము:— న- వేదయజ్ఞాధ్యయనైః- న- దానైః- న- చ- క్రియాభిః- న- తపోభిః- ఉగ్రైః- ఏవంరూపః- శక్యః- అహం- నృలోకే- ద్రష్టుం- త్వదన్యేన- కురుప్రవీర. ॥ ॥౪౮॥

ప్రతిపదార్థము:— హేకురుప్రవీర=ఓకురువంశశ్రేష్ఠుడా; నృలోకే=మనుష్యలోకమునందు; ఏవంరూపః=ఇట్టివిశ్వరూపముగల; అహం=నేను; త్వదన్యేన=నీకంటెనితరునిచే; ద్రష్టుం=చూచుటకై; వేద,యజ్ఞాధ్యయనైః= వేద=వేదములయొక్కయు; యజ్ఞ=యజ్ఞములయొక్కయు; అధ్యయనైః=అధ్యయనములచే; నశక్యః=శక్యుడనుగాను; దానైః=తులాపురుషాదిదానములచే; నశక్యః=శక్యుడనుగాను; క్రియాభిః=శ్రౌతకర్మలచే: నశక్యః=శక్యుడనుగాను; ఉగ్రైః=ఘోరములగు; తపోభిః=చాంద్రాయణాదితపస్సులచే; నశక్యః=శక్యుడనుగాను. ॥౪౮॥

శాంకరభాష్యమ్:—

ఆత్మనో మమ రూపదర్శనేన కృతార్థ ఏవ త్వం సంవృత్త ఇతి తత్స్తౌతి— న వేదయజ్ఞాధ్యయనై ర్న దానై శ్చతుర్ణా మపి వేదానా మధ్యయనై ర్యథావ ద్యజ్ఞాధ్యయనై శ్చ వేదాధ్యయనై రేవ యజ్ఞాధ్యయనస్య సిద్ధత్వా త్పృథగ్యజ్ఞాధ్యయనగ్రహణం యజ్ఞవిజ్ఞానోపలక్షణార్థమ్, తథా న దానై స్తులాపురుషాదిభి ర్నచ క్రియాభి రగ్నిహోత్రాదిభిః శ్రౌతాదిభి ర్నాపి తపోభి రుగ్రై శ్చాంద్రాయణాదిభి రుగ్రై ర్ఘోరై రేవంరూపో యథా దర్శితం విశ్వరూపం యస్య సోఽహ మేవంరూపః శక్యో న శక్యోఽహం నృలోకే మనుష్యలోకే ద్రష్టుం త్వ దన్యేన త్వత్తోఽన్యేన కురుప్రవీర! ॥౪౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కురువంశమున వీరశ్రేష్ఠుడా! ఈమనుష్యలోకమున నీకంటె నితరు డెవడు నా ఈ విశ్వరూపమును జూచుద మన్నను శక్యము గాదు. వేదాధ్యయనముచేగాని, యజ్ఞవిజ్ఞాన సంపాదనముచేగాని నేను వారికి చూచుటకై శక్యుడనుగాను. అట్లే తులాపురుషాదిదానములచేతను, శ్రౌతకర్మలచేతను, ఘోరతములచేతను శక్యుడను గాను. ॥౪౮॥

—• ౧౧వ అధ్యాయము ౪౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము?— నాయీవిశ్వరూపదర్శనాత్మకమైన నాయనుగ్రహమును సంపాదించి నీవు నిశ్చయముగ కృతార్థుడ వైతివి. అని యీశ్లోకమున జెప్పుచున్నాడు.— నాలుగు వేదములయొక్కయు, మీమాంసాకల్పసూత్రాదిద్వారముగ యజ్ఞములయొక్కయు, అధ్యయనముచేతను, తులాపురుషాదిదానములచేతను, అగ్నిహోత్రాది శ్రౌతకర్మలచేతను, కృచ్ఛ్రచాంద్రాయణాదులగు ఉగ్రతపస్సులచేతను, ఈవిశ్వరూపధారివగు నన్నుజూచుటకు నీకుతప్ప యెవరికిని శక్యముగాదు. ॥౪౮॥

గీ॥ మా తే వ్యథా మా చ విమూఢభావో దృష్ట్వా రూపం ఘోర మీదృ ఙ్మమేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం తదేవ మే రూప మిదం ప్రపశ్య ॥ ॥౪౯॥

పదవిభాగము:— మా- తే- వ్యథా- మా- చ- విమూఢభావః- దృష్ట్వా- రూపం- ఘోరం- ఈదృక్- మమ- ఇదం- వ్యపేతభీః- ప్రీతమనాః- పునః- త్వం- తత్- ఏవ- పునః- త్వం- తత్- ఏవ- మే- రూపం- ఇదం- ప్రపశ్య ॥ ॥౪౯॥

ప్రతిపదార్థము:— ఈదృక్=ఇట్టిఘోరమైన; మమ=నాయొక్క; ఇదం=ఈ; రూపం=రూపమును; దృష్ట్వా=చూచి; తే=నీకు; వ్యథా=మానసికబాధ; మాస్తు=లేకుండుగాక; విమూఢభావః=విమూఢమనస్కత్వము; మాస్తు=లేకుండుగాక; త్వం=నీవు; వ్యపేతభీః=తొలగినభయముకలవాడవై; ప్రీతమనాః=సంతసించినమనస్సుకలవాడవై; పునః=తిరిగి; తదేవ=చతుర్భుజ, శంఖ, చక్ర, గదాసంకలితమైన; మే=నాయొక్క; రూపం=స్వరూపమును; ప్రపశ్య=లెస్సగజూడుము. ॥౪౯॥

---

శాంకరభాష్యమ్:—

మా తే వ్యథేతి । మా తే వ్యథా మా భూత్తే భయం మా చ విమూఢభావో విమూఢచిత్తతా దృష్ట్వోపలభ్య రూపం ఘోర మీదృ గ్యథాదర్శితం మమేదం వ్యపేతభీ ర్విగతభయః ప్రీతమనా శ్చ స న్పునరపి త్వం తదేవ చతుర్భుజం శంఖచక్రగదాధరం తవేష్టం రూప మిదం ప్రపశ్య ॥ ॥౪౯॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓయర్జునా! ఇట్టి ఘోరమగు రూపమునుజూచి వ్యథనొందకుము. నీకు విమూఢచిత్తత్వము కలుగకుండుగాక. భయమును వీడుము. ప్రీతమనస్కుడవై తిరిగి చతుర్బాహుసంశోభితము, శంఖచక్రగదాసంకలితము, నీకు యిష్టమునగు నారూపమును జూడుము. ॥

---

—•౧౧వ అధ్యాయము ౪౯వ శ్లోక వ్యాఖ్యావిశేషములు•—

మధుసూదనసరస్వతీయము:— నిన్ననుగ్రహించుటకై యావిర్భూతమైన యీవిశ్వరూపముచే నీకుద్వేగమే కలుగునో— అనేకబాహూదరాదియుక్తమగుటచే భయంకరమగు నారూపమును జూచియున్న నీకువ్యథకలుగకుండుగాక. నారూపదర్శనముచే వ్యాకులీభావము నీకు కలుగకుండుగాక. భయముతొలగినవాడవై, ప్రీతమనస్కుడవై తిరిగిచతుర్భుజత్వాదివిశిష్టమైన యా సౌమ్య రూపము నే నిర్భయముగ జూడుము. ॥౪౯॥

నీలకంఠీయము:— చూచుట కతిదుర్లభమగు ఈస్వరూపమును చూచియు వ్యథనొందుచుంటివా? అట్లయిన నీరూపమును గూడ నుపసంహరించెదను. అని ఈశ్లోకమున జెప్పుచుండెను.— నా యీ ఘోర రూపమును జూచి నీవు వ్యథనొందకుము. మోహము నొందకుము. భయమును వీడుము. ప్రీతమనస్కుడవై నీవు గోరిన నారూపమును జూడుము. ॥౪౯॥

సంజయ ఉవాచ:—

గీ॥ ఇత్యర్జునం వాసుదేవ స్తథో క్త్వా స్వకం రూపం దర్శయామాస భూయః।
ఆశ్వాసయామాస చ భీత మేనం భూత్వా పునః సౌమ్యవపు ర్మహాత్మా ॥ ౫౦॥

పదవిభాగము:— సంజయః- ఉవాచ- ఇతి- అర్జునం- వాసుదేవః- తథా- స్వకం- రూపం- దర్శయామాస- భూయః- ఆశ్వాసయామాస- చ- భీతం- ఏనం- భూత్వా- పునః- సౌమ్యవపుః- మహాత్మా ॥ ॥౫౦॥

ప్రతిపదార్థము:— సంజయః=సంజయుడు; ఉవాచ=పలికెను; వాసుదేవః=శ్రీకృష్ణభగవానులు; అర్జునం—అర్జునునిగూర్చి, ఇతి—ఈవిధముగా: ఉక్త్వా= పలికి; స్వకం= వసుదేవగృహమునం దావిర్భవించినప్పటిస్వీయమగు; రూపం=రూపమును; భూయః=తిరిగి; దర్శయామాస=జూపెను; మహాత్మా=మహానుభావుడగుశ్రీకృష్ణభగవానుడు; పునః=తిరిగి; సౌమ్యవపుః=ప్రసన్న దేహుడై; భీతం=భయపడిన; ఏనం=ఈయర్జునుని; ఆశ్వాసయామాసచ=ఊరడించెను. ॥౫౦॥

శాంకరభాష్యమ్:—

ఇత్యర్జున మితి। ఇత్యేవ మర్జునం వాసుదేవ స్తథాభూతం వచన ముక్త్వా స్వకం వసుదేవగృహే జాతం రూపం దర్శయామాస దర్శితవాన్। భూయః పున రాశ్వాసయామాస చాఽఽశ్వాసితవాంశ్చ భీత మేనం భూత్వా పునః సౌమ్యవపుః ప్రసన్న దేహో మహాత్మా ॥౫౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సంజయుడు ధృతరాష్ట్రునిగూర్చి చెప్పుచున్నాడు— శ్రీకృష్ణభగవానులు అర్జునునిగూర్చి యీవిధముగ జెప్పి, వసుదేవగృహమునం దావిర్భవించినప్పటి తన రూపమును తిరిగి యాతనికి జూపెను. మహానుభావుడగు శ్రీకృష్ణభగవానులు తిరిగి ప్రసన్నదేహధారియై భీతి నొందిన యీయర్జునుని యూరడించెను. ॥౫౦॥

—• ౧౧వ అధ్యాయము ౫౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సంజయుడు చెప్పుచున్నాడు.— శ్రీకృష్ణభగవానులు యీవిధముగ నర్జునునిగూర్చి పలికి, పూర్వ మెట్టిరూపమో అట్టి తన రూపమును కిరీట, మకరకుండల, గదా చక్రాదియుక్తమును చతుర్భుజోపేతమును, శ్రీవత్స, కౌస్తుభ, వనమాలా, పీతాంబరాదిశోభితము, నగు రూపమును) జూపెను. సౌమ్యశరీరధారియై సమస్తకల్యాణగుణాకరుడై, పరమకారుణికు డగు శ్రీకృష్ణపరమాత్మ తిరిగి భీతుడైన యర్జును నూరడించెను. ॥౫౦॥

నీలకంఠీయము:— సంజయుడు చెప్పుచున్నాడు.— వసుదేవ సుతుడు అర్జునునిగూర్చి పూర్వోక్తవిధముగ బలికి, పూర్వ మెట్లుండెనో యట్టి తన మానుషరూపమును తిరిగి చూపెను. అర్జునునిచే ప్రార్థితమై ధరించిన చతుర్భుజరూపమును గూడ తిరోహిత మొనర్చెనని యర్థము. అట్లే వ్యాపకుడైనను తిరిగి సౌమ్యశరీరధారియై బెదరిన యీయర్జును నూరడించెను. ॥౫౦॥

అర్జున ఉవాచ:—

గీ॥　దృష్ట్వేమం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।
ఇదానీ మస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః ॥　॥౫౧॥

పదవిభాగము:— అర్జునః- ఉవాచ- దృష్ట్వా- ఇమం- మానుషం- రూపం- తవ- సౌమ్యం- జనార్దన- ఇదానీం- అస్మి- సంవృత్తః- సచేతాః- ప్రకృతిం- గతః ॥　॥౫౧॥

ప్రతిపదార్థము:— అర్జునః=అర్జునుడు; ఉవాచ=పలికెను; హేజనార్దన=ఓశ్రీకృష్ణప్రభూ!; ఇదానీం=ఇప్పుడు; తవ=నీయొక్క; సౌమ్యం=సుందరమైన; మానుషం=మనుష్యసంబంధమైన; రూపం=ఆకారమును; దృష్ట్వా=చూచి; సచేతాః=ప్రసన్నచిత్తుడనై; ప్రకృతిం=స్వభావమును; గతః=పొందినవాడనై; సంవృత్తోఽస్మి=అయితిని.　॥౫౧॥

శ్రీభగవా నువాచ:—

గీ॥　సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః ॥　॥౫౨॥

పదవిభాగము:— సుదుర్దర్శం- ఇదం- రూపం- దృష్టవాన్- అసి- యత్- మమ- దేవాః- అపి- అస్య- రూపస్య- నిత్యం- దర్శనకాంక్షిణః ॥　॥౫౨॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=శ్రీకృష్ణభగవానులు; ఉవాచ=పలికెను: త్వం=నీవు; యత్=ఏ; మమ=నాయొక్క; రూపం=రూపముకలదో; తత్=ఆ; ఇదం=ఈరూపము; సుదుర్దర్శమ్=చూచుటకుశక్యముగానిదానిని; దృష్టవానసి=చూచితివి; దేవాఅపి=దేవతలుగూడ; నిత్యం=ఎల్లప్పుడు; అస్య=ఈ; రూపస్య=రూపముయొక్క; దర్శనకాంక్షిణః=దర్శనమునుకోరెడివారు; భవంతి=అగుచుండిరి.　॥౫౨॥

శాంకరభాష్యమ్:—

దృష్ట్వేద మితి । దృష్ట్వేదం మానుషం రూపం మత్సఖం ప్రసన్నం తవ సౌమ్యం జనార్ద నేదానీ మధునాస్మి సంవృత్తః సంజాతః కిం సచేతాః ప్రసన్నచిత్తః ప్రకృతిం స్వభావం గత శ్చాస్మి ॥　॥౫౧॥

సుదుర్దర్శ మితి । సుదుర్దర్శం సుష్ఠు దుఃఖేన దర్శన మస్యేతి సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి య న్మమ దేవా అప్యస్య మమ రూపస్య నిత్యం సర్వదా దర్శనకాంక్షిణో దర్శనేప్సవోఽపి న త్వ మివ దృష్టవంతో న ద్రక్ష్యంతి చే త్యభిప్రాయః ॥　॥౫౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అర్జునుడు చెప్పుచున్నాడు— ఓజనార్దన! నీయీప్రసన్నమైనదియు, మత్సఖమునగు మానుషరూపమును జూచి, ప్రసన్నచిత్తుడనైతిని. స్వభావస్థితిని పొందినవాడనయితిని. ॥౫౧॥

శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నాడు— మనుజులు చూడశక్యముగాని నాయీరూపమును నీవు జూచితివి. దేవతలు గూడ నా యీరూపమును నిత్యము జూడగోరుదురు. కానివారు నీవలె నిదివరలో జూడలేదు, ముమ్ముందు జూడజాలరు.　॥౫౨॥

—• ౧౧వ అధ్యాయము ౫౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— విశ్వరూపోపసంహరణానంతరము అర్జునుడు పలుకుచు

గీ॥ నాహం వేదై ర్న తపసా న దానేన నచేజ్యయా ।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవా నసి యన్మమ ॥ ॥౫౩॥

పదవిభాగము:— న-అహం-వేదైః-న-తపసా-న-దానేన-న-చ-ఇజ్యయా-శక్యః-ఏవంవిధః-ద్రష్టుం-దృష్టవాన్-అసి-మాం-యథా ॥ ॥౫౩॥

ప్రతిపదార్థము:— త్వం=నీవు; మాం=నన్ను; యథా=ఏవిధముగా; దృష్టవాన్=చూచినవాడవై; అసి=అయితివో; తథా=అప్రకారముగా; ఏవంవిధః=ఇట్టివిధమైన; అహం=నేను; వేదైః=వేదములచే; ద్రష్టుం=చూచుటకు; నశక్యః=శక్యమైనవాడనుగాను; తపసా=తపస్సుచే నశక్యః=శక్యమైనవాడనుగాను; దానేన=దానముచే; నశక్యః=శక్యమైనవాడనుగాను; ఇజ్యయా=యాగముచే; నశక్యః=శక్యుడనుగాను. ॥

శాంకరభాష్యమ్:—

కస్మాత్— నాహం వేదై ఋగ్యజుస్సామాథర్వవేదై శ్చతుర్భి రపి న తపసోగ్రేణ చాంద్రాయణాదినా న దానేన గోభూహిరణ్యాదినా న చేజ్యయా యజ్ఞేన పూజయా వా శక్య ఏవంవిధో యథాదర్శితప్రకారో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా త్వమ్ ॥౫౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నీవు యేవిధముగ నన్ను చూచితివో అప్రకారముగ జూచుటకు యథాదర్శితాకారుడ నగు నేను ఋగ్యజుస్సామాథర్వవేదములచేగాని, ఉగ్రచాంద్రాయణాదితపస్సులచేగాని, గో, భూ, హిరణ్యాదిదానములచేగాని, యజ్ఞముచేగాని, పూజచే గాని శక్యమైనవాడనుగాను. ॥౫౩॥

న్నాడు.— ఓజనార్దన! ఈనీసౌమ్యాకారమును జూచి యిపుడు భయకృతమగు వ్యామోహము తొలగుటచే నవ్యాకులితమైన యంతఃకరణము కలవాడనై యైతిని. భయజనితమైన వ్యథ తొలగుటచే స్వస్థచిత్తుడనైతిని. ॥౫౧॥

—• ౧౧వ అధ్యాయము ౫౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— శ్రీకృష్ణభగవానులు తన యనుగ్రహ మతిదుర్లభమని నాల్గు శ్లోకములతోఁ జెప్పుచున్నాడు.— చూచుటకు శక్యముకాని నాయీవిశ్వరూపమును నీవిపుడు చూచితివి. దేవతలుగూడ నీరూపమును దర్శించుటకై నిత్యము కోరుచుందురు. కాని నీవలె వారు జూడలేరు. ॥౫౨॥

—• ౧౧వ అధ్యాయము ౫౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— దేవతలు మద్భక్తిశూన్యులగుట నన్ను జూడలేరని చెప్పుచున్నాడు.— ఈశ్లోకము "న వేదయజ్ఞాధ్యయనైః" అను శ్లోకముచే గతార్థము. ॥౫౩॥

శంకరానందీయము:— జన్మాంతరములయందు భోగేచ్ఛతో యథావిధిగ వేదాధ్యయనాది పుణ్యకర్మానుష్ఠానముచే దేవభావము నొందినను మద్భక్తిశూన్యులగుయిందాది దేవతలకు నీదర్శనభాగ్యములేదని (కలుగకుండెనని) సూచించుటకు వేదాదులకు స్వస్వరూపసాక్షాత్కారమునందు సాధనత్వమును నిషేధించుచున్నాడె.—వేదములచేగాని, తపస్సుచేగాని, దానముచేగాని, యాగాదికముచేగాని, నావిశ్వరూపము చూడశక్యమైనదికాదు. నీవెట్లు నావిశ్వరూపమును జూచితివో యట్లు వేదా

గీ॥ భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున! ।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప! ॥ ॥౫౪॥

పదవిభాగము:— భక్త్యా-తు-అనన్యయా-శక్యః-అహం- ఏవంవిధః-అర్జున-జ్ఞాతుం- ద్రష్టుం-చ-తత్త్వేన-ప్రవేష్టుం-చ-పరంతప॥ ॥౫౪॥

ప్రతిపదార్థము:— హేపరంతప!=శత్రువులనుతపింపజేయు ఓయర్జునా!; ఏవంవిధః=విశ్వరూపధారినగు; అహం=నేను; తత్త్వేన=తత్త్వముచే; జ్ఞాతుం=తెలిసికొనుటకుగాని; ద్రష్టుంచ=సాక్షాత్కరింపజేసుకొనుటకుగాని; ప్రవేష్టుంచ=మోక్షమునుపొందుటకుగాని; అనన్యయా=భగవదేకపరమైన; భక్త్యా=భక్తిచే శక్యః=శక్యమైనవాడను. ॥౫౪॥

---

శాంకరభాష్యమ్;—

కథం పున శ్శక్య ఇత్యుచ్యతే— భక్త్యా తు కిం విశిష్టయేత్యాహ— అనన్యయాఽపృథగ్భూతయా భగవతోఽన్యత్ర పృథఙ్న కదాచిదపి యా భవతి సా త్వనన్యా భక్తి స్సర్వైరపి కరణై ర్వాసుదేవా దన్య న్నోపలభ్యతే యయా సాఽనన్యా భక్తి స్తయా భక్త్యా శక్యోఽహ మేవంవిధో విశ్వరూపప్రకారో హేఽర్జున జ్ఞాతుం శాస్త్రతో న కేవలం జ్ఞాతుం శాస్త్రతో ద్రష్టుం చ సాక్షాత్కర్తుం తత్త్వేన తత్త్వతః ప్రవేష్టుం చ మోక్షం చ గంతుం పరంతప ॥౫౪॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శత్రువులను తపింపజేయు ఓయర్జునా! విశ్వరూపప్రకారుడ నగు నేను తత్త్వతః శాస్త్రము ననుసరించి తెలిసికొనుటకును, సాక్షాత్కరింపజేసుకొనుటకును, మోక్షమును పొందుటకును (భగవంతునికంటె వేరొకచోట నిలువ బడని భక్తి యనన్యభక్తి యనబడును. అనగా సర్వేంద్రియములచేతను వాసుదేవునికంటె నితరము దేనిచే నుపలబ్ధము కాదో యట్టి భక్తి యనన్యభక్తి యనబడును.) అట్టి అనన్యభక్తిచే శక్యుడను. ॥౫౪॥

---

ధ్యయనాది పుణ్యకర్మ కారులైనను నాసవిశేషబ్రహ్మస్వరూపమునే చూడలేకుండిరి. ఇక నిర్విశేషబ్రహ్మము నెట్లు చూడగలరని యర్థము. (ఈచెప్పుటచే గర్మలు మోక్షమును గూర్చి సాక్షాత్సాధనములు గావని సూచితమయ్యెను. ॥౫౩॥

—౹ ౧౧వ అధ్యాయము ౫౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ౹—

మధుసూదనసరస్వతీయము:— వేద, తపో, దాన, ఇజ్యాదికముచే నీదర్శన మశక్యమగుచో నిక నేయుపాయముచే నిన్ను జూడ శక్యమగును? అను ఆశంకపై జెప్పుచున్నాడు.— (ఇట 'తు' అనునది మరియొక సాధనమేదియు లేదను యర్థమునందు ప్రయుక్తము.) మదేకనిష్ఠమగు నిరతిశయప్రీతి (భక్తి) చే దివ్యరూపధరుడనగు నేను తెలిసికొనుటకు శక్యుడను. స్వస్వరూపముగ సాక్షాత్కరింప జేసుకొనుటకు వేదాంతవాక్యశ్రవణమనననిదిధ్యాసనపరిపాకముచే శక్యుడను. స్వరూపసాక్షాత్కారమువలన యవిద్యాతత్కార్యనివృత్తి యయిన నారూపముతో నుండుటకు శక్యుడను. "హే పరంతప!" అను సంబుద్ధిచే నజ్ఞానమనెడి శత్రువును నశింపజేసిన అర్జునునకుసులభముగా ప్రవేశించుటకు యోగ్యత్వము సూచితమయ్యెను. ॥౫౪॥

గీ॥ మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః ।
నిర్వైర స్సర్వభూతేషు య స్స మా మేతి పాండవ! ॥ ॥౫౫॥

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి
శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున
సంవాదే విశ్వరూపదర్శనయోగో నామైకాదశోఽధ్యాయః ॥౧౧॥

పదవిభాగము:— మత్కర్మకృత్-మత్పరమః-మద్భక్తః-సంగవర్జితః-నిర్వైరః-సర్వభూతేషు-యః-సః-మామ్-ఏతి-పాండవ ॥ ॥౫౫॥

ప్రతిపదార్థము:— యః=ఎవడు; మత్కర్మకృత్=నానిమిత్తమైనకర్మనుజేయునో; మత్పరమః=నేనేయుత్కృష్టమైనగతికలవాడై; మద్భక్తః=నాయందేభక్తికలవాడై; సంగవర్జితః=సంగరహితుడై; సర్వభూతేషు=సమస్తభూతములయందు; నిర్వైరః=శత్రుభావములేనివాడై: భవతి=(ఈపదమధ్యాహార్యము)అగునో; సః=అట్టివాడు; హేపాండవ=ఓపాండునందనా; మామ్=నన్ను: ఏతి=పొందుచున్నాడు. ॥౫౫॥

శాంకరభాష్యమ్:—

అధునా సర్వస్య గీతాశాస్త్రస్య సారభూతోఽర్థో నిశ్శ్రేయసార్థోఽనుష్ఠేయత్వేన సముచ్చిత్యోచ్యతే— మత్కర్మకృ న్మదర్థం కర్మ మత్కర్మ తత్కరోతీతి మత్కర్మకృ న్మత్పరమః కరోతి భృత్యః స్వామికర్మ న త్వాత్మనః పరమా ప్రేత్య గన్తవ్యా గతి రితి స్వామినం ప్రతిపద్యతే,

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రస్తుతము సమస్తగీతాశాస్త్రమునకు సారభూతమైనదియు, మోక్షము ప్రయోజనముగా గలదియు నగు విషయమును ప్రోగుచేసి చెప్పుచుండెను— ఓపాండునందనా! యెవడు నానిమిత్తమే శ్రౌతాదికర్మనుజేయువాడై, (భృత్యుడు తన ప్రభువున కనుకూల

శంకరానందీయము:— వేదాదులు సాధనములు గానిచో నిక నీసాక్షాత్కార మెట్లు కలుగునను ప్రశ్నపై జెప్పుచున్నాడు.— "భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున!" "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శాస్త్రాచార్యోపదేశజన్యజ్ఞానసంపన్నము, శ్రుతము, దృష్టము, స్పృష్టము, మతము, విజ్ఞాతముగూడ నీసర్వము బ్రహ్మమే అని సర్వమునకు, జనకు బ్రహ్మమాత్రత్వావగాహిని యగు ప్రత్యయాంతరశూన్యానుసంధానరూపమగు భక్తిచేతనే "ఏవంవిధోఽహం" విశ్వాత్ముడనగు నేనులెస్సగ నారాధింపబడినవాడనై యథార్థస్వరూపముచే నిదియే పరమార్థమని తెలిసికొనుటకును, సాక్షాత్కరింప జేసుకొనుటకును, విదేహకైవల్యమునొంది మత్స్వరూపముతో నుండుటకును సుగముడను. (నిర్విశేషబ్రహ్మముగా జ్ఞానములో విషయుడను కాగలనని యర్థము) ముముక్షువు, ముఖ్యాధికారియు నగువాడు చిత్తశుద్ధికై భక్తిశ్రద్ధలతో నెల్లపుడు నీసర్వము నేనేయను సవిశేషబ్రహ్మోపాస్తిని చేసినచో భేదప్రత్యయనాశమై పరిశుద్ధాత్ముడగును. అట్టివానికి నిర్విశేషబ్రహ్మము తెలిసికొనుటకును, సాక్షాత్కరింపజేసుకొనుటకును, తత్స్వరూపముతో నుండుటయును విదేహముక్తి నొందుటకును నీవే విషయుడవగుమంటివి. ॥౫౪॥

—• ౧౧వ అధ్యాయము ౫౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇక సర్వగీతాశాస్త్రమునకు సారభూతమైన విషయమును పుంజముగ జేసి చెప్పుచుండెను.— వేదవిహితమైన కర్మను న్నాకొరకు జేయుచున్నవాడై, నేనే పరమ

శాంకరభాష్యమ్:—

అయం తు మత్కర్మకృన్మా మేవ పరమాం గతిం ప్రతిపద్యేత ఇతి మత్పరమోఽహం పరమః పరా గతి ర్యస్య సోఽయం మత్పరమ స్తథా మద్భక్తో మా మేవ సర్వప్రకారైః సర్వాత్మనా సర్వోత్సాహేన భజత ఇతి మద్భక్త స్సంగవర్జితో ధనపుత్రమిత్రకలత్రబంధువర్గేషు సంగవర్జితః

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ములగు పనులను జేయునుగాని యాప్రభువే తనకు పరమప్రాప్యుడని తలువడు. నాకై కర్మను జేయువాడు నన్నే జీవితావసానమున పరమప్రాప్యునిగ దలచును.) అట్టివాడై, (నన్నే సర్వప్రకారములచేతను సర్వోత్సాహముతోటి భజించువాడు మద్భక్తు డనబడును.) అట్టి నాభక్తుడై, ధన, పుత్ర, మిత్ర, కలత్రబంధువర్గాదులయందు సక్తి (ప్రీతి) లేనివాడై, తనకు అత్యంతాపకారమునందు ప్రవృత్తులైనవారియెడ గూడ శత్రుభావమును వహింపని

ప్రాప్యుడనుగ తలచినవాడై, సంగవర్జితుడై (బాహ్యవస్తుస్పృహావర్జితుడై, అపకారులయందుగూడ ద్వేషము లేనివాడై, యెవడుండునో అట్టివాడు (అభేదముతో) నన్ను పొందును. నీవు తెలిసికొనదగినదియు, నేనుపదేశింప దగినదియు నిదియే. ఇంతకంటె వేరేమియు లేదు. ॥౫౫॥

ఇట్లు శ్రీమధుసూదన సరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా ఏకాదశాధ్యాయ గూఢార్థ

దీపికకు తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార"

బులుసు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన తాత్పర్యబోధిని

సమాప్తము.

శంకరానందీయము:— ఈవిధముగ బ్రహ్మప్రాప్తికి భక్తి కారణమని చెప్పి యీచెప్పబోవు సాధనపంచకసంపత్తితో నెవడు నన్ను సేవించునో అతడే ప్రసన్నచిత్తుడై సమ్యగ్జ్ఞానమును, మోక్షమును పొందునని సూచించుచు అధ్యాయము నుపసంహరించుచుండెను,— "మత్కర్మకృత్" నానిమిత్తమే లౌకిక కర్మనుగాని; వైదికకర్మనుగాని చేష్టామాత్రమును సర్వకర్మను జేయువాడై, "మత్పరమః" లోకమున పురుషుడు యెందుకై కర్మ నాచరించునో దానిని బొందునుగాని మరియొకదానిని పొందడు. అట్లే నానిమిత్తమై కర్మ చేయుచో నన్నే పొందును. నానిమిత్తమై కర్మను జేయువారలకు నేనే గతియగుదును. కాన అట్టివాడు 'మత్పరము' డనబడును. అట్టివాడై, లేక, 'మీయతే పదార్థో ఽనయేతిమా, మత్పరా మా యస్య స మత్పరమః' దీనిచే పదార్థము తెలిసికొనబడును గాన ఇంద్రియప్రవృత్తి "మా" అనబడును. నాస్వరూపగ్రహణాసక్తమైన యింద్రియప్రవృత్తి గలవాడు "మత్పరము" డనబడును. అట్టివాడై, కనుకనే "మద్భక్తః" సర్వాత్మ డనగు నన్ను (అంతట) చక్షురాదులకు విషయముగు వస్తుజాతమునెల్ల సర్వము బ్రహ్మస్వరూపముగ ననుసంధానము చేయువాడు భక్తు డనబడును.) అట్టివాడై, "సంగవర్జితః" పుత్రమిత్రకలత్రాదులయందు అనుబుద్ధితో సక్తిని విడినవాడై, "నిర్వైరః" తన కపకారులయందు గూడ (అంతటను బ్రహ్మభావనచే) వైరము లేనివాడై, (ఉపశాంత సర్వవికారములు కలవాడై) యెవడుండునో అట్టి భక్తవర్యుడు నిర్విశేషబ్రహ్మవిజ్ఞానముచే "మామే తైతి" పరబ్రహ్మనగు నన్ను పొందును. (విదేహకైవల్యము నొందునని యర్థము.) ॥౫౫॥

ఇట్లు శ్రీశంకరానందసరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా ఏకాదశాధ్యాయవాక్య

తాత్పర్యబోధినికి "తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణ, దర్శనాలంకార"

బులుసు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన తాత్పర్యబోధిని

సమాప్తము.

శాంకరభాష్యమ్:—

సంగః ప్రీతిః స్నేహ స్తద్వర్జితో నిర్వైరో నిర్గతవైరః సర్వభూతేషు శత్రుభావరహిత ఆత్మనోఽత్యంతాపకారప్రవృత్తే ష్వపి య ఈదృశో మద్భక్తః స మా మే త్యహమేవ తస్య పరా గతి ర్నాన్యా గతిః కాచి ద్భవ త్యయం తవోపదేశ ఇష్టో మయోపదిష్టో హేపాండవేతి ॥౫౫॥

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిందభగవత్పూజ్యపాదశిష్యశ్రీమచ్ఛంకర భగవతః కృతౌ శ్రీభగవద్గీతాభాష్యే విశ్వరూపదర్శనయోగో నామ ఏకాదశోఽధ్యాయః ॥౧౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వాడై యెవ డుండునో, అట్టి నాభక్తుడు నన్నే పొందును. నేనే యట్టి వానికి పరమగతి నగుదునుగాని, వేరొండు యధమగతి ప్రాప్తింపనేరదు. ఈయుపదేశము నీకు హితము చేకూర్చునట్లు నీకుపదేశింపబడెను. ॥౫౫॥

ఇట్లు నూరువేల సంఖ్య కలిగి, వ్యాసప్రోక్తము, సంహితారూపము నగు మహాభారతమునం దంతర్గతమైన భీష్మపర్వమునందున్న యుపనిషద్రూపము, బ్రహ్మవిద్యారూపము, యోగశాస్త్రము నగు భగవద్గీతలయందున్న శ్రీకృష్ణార్జునసంవాదమునందుగల విశ్వరూపదర్శనయోగ మను పేరి ఏకాదశాధ్యాయమునకు గౌతమసగోత్రుడగు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార" బిరుదు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన, ఆనందగిరీయవ్యాఖ్యానుసృత శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని సమాప్తము.

హరిః ఓమ్ తత్సత్.

శ్రీధరీయము:— నేననన్యభక్తి లభ్యుడను కాన: సర్వశాస్త్రసారమగు ఈరహస్యమును వినుము:— నానిమిత్తమే కర్మ చేయుచు, నేనే పరమపురుషార్థముగ దలచి, నన్నే యాశ్రయించి; పుత్రాదులయందు సంగమును వీడి. సర్వభూతములయందు వైరమును వీడి యెవ డుండునో అట్టివాడు నన్ను పొందును.

శ్లో॥ "దేవై రపి సుదుర్దర్శం తపోయజ్ఞాదికోటిభిః ।
భక్తాయ భగవా నేవం విశ్వరూప మదర్శయత్॥"

తా॥ తపస్సులు, యజ్ఞములు మొదలగు కోటిసాధనములచే గూడ జూడశక్యముగాని విశ్వరూపమును భక్తుడగు యర్జునునకు శ్రీకృష్ణభగవానులు చూపెను. ఈవిషయ మీయేకాదశాధ్యాయమున తెలుపబడెను.

ఇట్లు శ్రీధరవిరచిత శ్రీభగవద్గీతా ఏకాదశాధ్యాయిటీకకు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార" బిరుదు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని సమాప్తము.

భాష్యోత్కర్షదీపిక:— ప్రస్తుతము సర్వశాస్త్రసారభూతమైన యీగీతాశాస్త్రమునందు సారభూతము, నిశ్శ్రేయస ప్రయోజనకము నగు విషయమును సంగ్రహించి యవశ్యమనుష్ఠించుటకై పరమకారు

శత్రువర్గమును నావిశ్వరూపమునందు చూడుము. అని యీయేకాదశాధ్యాయమున శ్రీకృష్ణభగవానునిచే చెప్పబడెను.

ఇట్లు దైవజ్ఞపండితవిరచిత శ్రీభగవద్గీతాఏకాదశాధ్యాయ పరమార్థప్రపకు
"తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

నీలకంఠీయము:— శాస్త్రసర్వస్వసారము నీశ్లోకమున సంగ్రహించుచుండెను— "మత్కర్మకృత్" నానిమిత్తమే కర్మలుచేయువాడై, "మత్పరమః" నేనే పరమప్రాప్యుడనుగ కలవాడై, (ఈచెప్పుటచే త్వంపదార్థశోధకమగు సమస్తకర్మయోగము, ధ్యానయోగము చెప్పబడెను.) "మద్భక్తః" నాయారాధనము జేయువాడై (ఈచెప్పుటచే నుపాసనాకాండార్థము సంగ్రహింపబడెను.) "సంగవర్జితః" సక్తిలేనివాడై, (ఏకాంతధ్యాననిష్ఠుడని జెప్పబడెను.) "నిర్వైరః" వైరరహితుడై (భేదబుద్ధికలవానికి వైరరాహిత్యము సంభవింపదుగాన నీవిశ్వమును భగత్స్వరూపముగ జూడదగునని చెప్పబడెను.) యెవడుండునో "సమామేతి పాండవ!" అట్టివాడు తత్పదలక్ష్యార్థము, అఖండానందైకరసము నగు నన్ను (పరబ్రహ్మను) ప్రత్యగభేదముగ పొందుచున్నాడు. (విశుద్ధవంశజాతుడవగు నీవే యట్టి బ్రహ్మమును తెలిసికొనగలవని "పాండవ" అను సంబోధనముచే సూచితము.) ||౫౫||

ఇట్లు శ్రీనీలకంఠాచార్య విరచిత శ్రీభగవద్గీతా ఏకాదశాధ్యాయ భారతభావదీపమునకు
బులుసు వెంకటశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

హరిః ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.



శు భ మ స్తు.

# శ్రీభగవద్గీతా శాంకరభాష్యతత్త్వబోధిని

## ద్వాదశోఽధ్యాయః.

### భ క్తి యో గః.

అర్జున ఉవాచ:—

గీ॥ ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే ।
యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥ ॥౧॥

ప ద వి భా గ ము:— అర్జునః- ఉవాచ- ఏవం- సతతయుక్తాః- యే- భక్తాః- త్వాం- పర్యుపాసతే- యే- చ- అపి- అక్షరం- అవ్యక్తం- తేషాం- కే- యోగవిత్తమాః ॥౧॥

ప్రతి ప దా ర్థ ము:— యే=ఏ; భక్తాః=భక్తులు; ఏవం="మత్కర్మకృత్" ఇత్యాదికముచే చెప్పబడిన రీతిని; సతతయుక్తాః=నిరంతరము భగవత్కార్యాదులయందు సమాహితులై ప్రవృత్తులై; త్వాం=చూపబడిన విశ్వరూపుడవగునిన్ను; పర్యుపాసతే=ధ్యానించెదరో; యేచాపి=పరిత్యక్తసర్వైషణలు కలవారై; సంన్యసింపబడిన సర్వకర్మలుకల యేసంన్యాసులు; అవ్యక్తం=కరణములకు గోచరము కానట్టి; అక్షరం=అక్షరబ్రహ్మమును; యేచాపి=ఎవరు; పర్యుపాసతే=ధ్యానించెదరో; తేషాం=వారలలో; కే=ఎవరు; యోగవిత్తమాః=అతిశయముగ యోగవిదులు; ఇతి=ఈప్రకారము; అర్జునః=అర్జునుడు; ఉవాచ=పలికెను. (ప్రశ్నించెను.) ॥౧॥

---

శాంకరభాష్యమ్.—

ద్వితీయప్రభృతి ష్వధ్యాయేషు విభూత్యంతేషు పరమాత్మనో బ్రహ్మణోఽక్షరస్య విధ్వస్తసర్వవిశేషణ స్యోపాసన ముక్తం సర్వయోగైశ్వర్యసర్వజ్ఞానశక్తిమ త్పత్యోపాధే రీశ్వ

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ద్వితీయాధ్యాయమున "అశోచ్యాన్" ఇత్యాదికము మొదలుకొని విభూత్యధ్యాయాంతమగు యధ్యాయములయందు విధ్వస్తసర్వవిశేషములుకల యక్షరపరబ్రహ్మము యొక్క

---

—• ౧౨వ అధ్యాయము ౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మ ధు సూ ద న స ర స్వ తీ య ము:— పూర్వాధ్యాయాంతమున "మత్కర్మకృ న్మత్పరమః మద్భక్త స్సంగవర్జితః । నిర్వైరః సర్వభూతేషు య స్సమా మేతి పాండవ!" అను శ్లోకమున వచ్చునర్థము

మగు యీసర్వమును పొందువాడు (కల్గినవాడు) గాన యక్షర మనబడును. అట్టి యక్షరమయ్యు, నిర్విశేషుడ వగు నిన్ను (పరబ్రహ్మమును) శమదమాదిసత్సాధనములచే సంపన్నులై నిరంతర మనుసంధానము చేయుదురో అట్టి యీయుభయులలోను యెవరు సమాధినిష్ఠాగరిష్ఠు లగుదురు? ఇట అభిప్రాయ మిది:— ముముక్షువు లకు సగుణోపాసనము, నిర్గుణోపాసనము నీరెండును మోక్షసాధనములుగ నుపదిష్టమైనవి. (ఆరెండింటిలో) సుకరమగునది యేది? సాక్షాన్మోక్షసాధన మెద్ది? ఈవిషయమై చెప్పుమని యర్థము. ॥౧॥

భాష్యార్థదీపికా:— శ్లో॥ "యత్కృపాలవమాత్రేణ మూర్ఖో భవతి పండితః। తం వందే పరమానందం జిష్ణుం విష్ణుం శివం గురుం"—ద్వితీయాధ్యాయము మొదలుకొని విభూత్యధ్యాయాంతము "త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున। నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥ యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే। తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ యస్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః। ఆత్మ న్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే॥ నైవతస్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చన। నచాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః॥ యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున। జ్ఞానాగ్ని స్సర్వకర్మాణిభస్మసాత్కురుతే తథా॥ నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే। తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి॥ తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠాస్తత్పరాయణాః। గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః॥ యోఽంత స్సుఖోఽన్తరారామ స్తథాన్తర్జ్యోతిరేవ యః। స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి। తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥ సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః। సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే। ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః॥ అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః। పరం భావ మజానన్తో మమావ్యయ మనుత్తమమ్॥ పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః। య స్సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్త మాహుః పరమాం గతిమ్। యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్। ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్॥ అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప। అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని॥ న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః। అహ మాది ర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః॥ యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరమ్। అసంమూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥" అను యీ మొదలగు గ్రంథముచే విధ్వస్త సర్వవిశేషములుగల యక్షరపరబ్రహ్మముయొక్క యుపాసనము చెప్పబడెను. "ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ। అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా॥ మత్తః పరంతరం నాన్య త్కించిదస్తి ధనంజయ। మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥ కవిం పురాణ మనుశాసితార మణోరణీయాంస మనుస్మరే ద్యః। సర్వస్య ధాతార మచింత్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్॥ ప్రయాణకాలే మనసాచలేన భక్త్యాయుక్తో యోగబలేన చైవ। భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్ స తం పరం పురుష ముపైతి దివ్యమ్॥ అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే। ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్। కథయంతశ్చ మాం భక్తా నిత్యం తుష్యంతి చ రమంతి చ॥" ఈమొదలగు గ్రంథముచే నటనట సర్వయోగైశ్వర్యములుగల సత్త్వము నుపాధిగా కల యీశ్వరునియొక్క యుపాసనము చెప్పబడెను. విశ్వరూపాధ్యాయమునందు పరమేశ్వరుని యైశ్వర్యము చూపబడెను. దానిని జూచి "మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః। నిర్వైర స్సర్వభూతేషు య స్స మా మేతి పాండవ!" అని చెప్పబడెను. కాని నీనిర్విశేష సవిశే

శ్రీ భగవానువాచ:—

గీ॥ మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః ॥ ॥౨॥

పదవిభాగము:— శ్రీభగవాన్ - ఉవాచ - మయి - ఆవేశ్య - మనః - యే - మాం - నిత్యయుక్తాః - ఉపాసతే - శ్రద్ధయా - పరయా - ఉపేతాః - తే - మే - యుక్తతమాః - మతాః ॥ ॥౨॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=షడ్గుణైశ్వర్యసంపన్నుడగు శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ=పలికెను; యే=ఏభక్తులు; మయి=విశ్వరూపుడగు పరమేశ్వరునియందు; మనః=మనస్సును; నివేశ్య=ఉంచి; నిత్యయుక్తాః=నిత్యయుక్తులై; పరయా=ఉత్కృష్టమైన; శ్రద్ధయా=శ్రద్ధతోటి; ఉపేతాః=కూడినవారై; మాం=సర్వయోగేశ్వరుడను, సర్వజ్ఞుడను అగు నన్ను; ఉపాసతే=ఉపాసించెదరో; తే=అట్టివారు; మే=నాకు; యుక్తతమాః=యుక్తతములని; మతాః=అభిప్రేతులు. ॥౨॥

శాంకరభాష్యమ్:—

యే త్వక్షరోపాసకా స్సమ్యగ్దర్శినో నివృత్తైషణా స్తే తావ త్తిష్ఠంతు తా న్ప్రతి యద్వక్తవ్యం తదుపరిష్టా ద్వక్ష్యామః । యే త్వితరే — మయి విశ్వరూపే పరమేశ్వర ఆవేశ్య

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సగుణోపాసన, నిర్గుణధ్యానరూపములగు యోగములలో నేది సుఖముగ నాచరించుటకు శక్యమని ప్రశ్నించుచుంటివా? లేక ఆరెంటిలో యేది సాక్షాన్మోక్షసాధనమని ప్రశ్నించుచుం

షోపాసనరూపమగు పక్షములలో నేది విశిష్టతరమో తెలిసికొనుటకై యర్జునుడు ప్రశ్నించుచుండెను— "ఏవం...యోగవిత్తమా" నిరంతరము భగవత్కర్మాదులయెడ చిత్తసమాధానముతో బ్రవృత్తులగు ఏభక్తులు అనన్యశరణులై నిన్ను సర్వయోగైశ్వర్య, సర్వజ్ఞాన, సర్వశక్తిమత్త్వ సత్త్వోపాధుం కలవిశ్వరూపుడవగు నిన్ను ధ్యానించెదరో, మరియు నెవరు పుత్రవిత్త, లోకైషణలను వీడినవారై, సర్వకర్మలను సన్యసించినవారై, ద్వితీయాధ్యాయమునయందు చెప్పబడినదియు, కరణగోచరముగానిదియు, విధ్వస్తసర్వవిశేషములు కలదియు, నగు అక్షరపరబ్రహ్మమును ప్రత్యగభిన్నముగ ననుసంధించెదరో ఇట్టి యీయుభయులలో నెవ రధికముగ యోగజ్ఞులని యర్థము. ॥౧॥

నీలకంఠీయము:— సప్తమాధ్యాయప్రభృతి ఇంతవరకగు గ్రంథభాగముచే తత్పదవాచ్యార్థము నిరూపితము. ప్రస్తుతము తత్పదార్థశోధనరూపమగు ఉపాసనాకాండమును పూర్తిచేయుచు నిటు యర్థమునుబట్టి ప్రధానమగుట తత్పదలక్ష్యార్థమును తత్పదలక్ష్యార్థవేత్తల లక్షణములనుకూడ ప్రసక్తించుచుండెను. శబ్దము ననుసరించి లౌకికబుద్ధ్యనుసారముగ తత్పదవాచ్యార్థముయొక్క యుపాసనాదికము వివరింపబడుచుండెను. అందు వెనుకటి యధ్యాయాంతమున "మత్కర్మకృత్" అనుమొదలగుదానిచే దన భజనము చెప్పబడెను. ఇట "మచ్ఛబ్దార్థము సగుణబ్రహ్మమా? లేక నిర్గుణబ్రహ్మమా? యని (పూర్వగ్రంథమున రెండుస్థలములయందును అస్మచ్ఛబ్దముప్రయుక్తమగుటచే) సంశయించినవాడై యర్జునుడు ప్రశ్నించుచుండెను— "ఏవం...యోగవిత్తమాః" ఎవరు "మత్కర్మకృత్" అని చెప్పినరీతి సగుణబ్రహ్మవేత్తలై నిన్నుపాసించెదరో, మరియు నెవరు బుద్ధ్యాగోచర యక్షరోపాసకులో, వారిద్దరిలో నెవరు యోగవిత్తములు? ॥౧॥

—• ౧౨వ అధ్యాయము ౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సర్వజ్ఞుడగు శ్రీకృష్ణభగవానులుయర్జునునకు సగుణోపాసనయందే యధికా

శాంకరభాష్యమ్:—

సమాధాయ మనో యే భక్తాస్సంతో మాం సర్వయోగేశ్వరాణా మధీశ్వరం సర్వజ్ఞం విముక్త రాగాదిక్లేశతిమిరదృష్టిం నిత్యయుక్తా అతీతానంతరాధ్యాయాంతోక్తశ్లోకార్థన్యాయేన సతత యుక్తాస్సంత ఉపాసతే శ్రద్ధయా పరయా ప్రకృష్టయోపేతా స్తే మే మమ మతా అభిప్రేతా యుక్తతమా ఇతి। నైరంతర్యేణ హి తే మచ్చిత్తయాఽహోరాత్రి మతివాహయంత్యతో యుక్తం తాన్ప్రతి యుక్తతమా ఇతి వక్తుమ్ ॥ ॥౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

టివా! శ్రీకృష్ణపరమాత్మ క్రమముగ సమాధానమును చెప్పుచుండెను.

ఎవరు నివృత్తమైన ఏషణములు కలవారై, అక్షరబ్రహ్మోపాసకులై సమ్యగ్దర్శనము కలవారో, వారినటుల యుండనిమ్ము. అట్టివారలనుగూర్చి యేదిచెప్పదగినదో దానిని ముందు చెప్పెదము. ఎవరు విశ్వరూపుడైన పరమేశ్వరునియందు మనస్సునుంచి భక్తులైనవారై సర్వయోగేశ్వరుల కధీశ్వరుడు, సర్వజ్ఞుడు, విడిచిపెట్టబడిన రాగాదిక్లేశ తిమిరదృష్టికల పరమేశ్వరుని అతీతానంతరాధ్యాయాంతోక్తశ్లోకార్థన్యాయముచే సతతయుక్తులై యుత్కృష్టమైన శ్రద్ధతో కూడినవారై యుపాసించెదరో అట్టివారు యుక్తతములని నాయభిప్రాయము. నైరంతర్యముచే వారలు నాయందే చిత్తముకలవారై అహోరాత్రములను వెళ్ళబుచ్చుచుండిరి. కాన వారలనుగూర్చి యుక్తతములని చెప్పుటయుక్తమే. ॥౨॥

రము నూహించి దానినే చెప్పదలచెను. యధికారానురూపముగ సాధనములు తారతమ్యవిశిష్టములుగాన ముందు సాకారబ్రహ్మవిద్యనే ప్రరోచనార్థమై స్తుతించుచుండెను. "మయి" వాసుదేవుడనగు నాయందు (సగుణబ్రహ్మమునందు) "మన ఆవేశ్య" అనన్యశరణత్వముతోటి, నిరతిశయప్రీతితోటి మనస్సునుంచి, "యే" ఎవరు "మాం" సర్వయోగ్యేశ్వరులకు బ్రభువును, సర్వజ్ఞుడను, సమస్తకల్యాణగుణములకు స్థానమును, సాకారబ్రహ్మస్వరూపుడను, అగు నన్ను "నిత్యయుక్తాః" సతతోద్యుక్తులైరి. "శ్రద్ధయా పరయోపేతాః" ప్రకృష్టమగు సాత్త్వికీవృత్తిరూపమైన శ్రద్ధతో కూడినవారై, "ఉపాసతే" ఎల్లపుడు చింతించెదరో, "తే మే యుక్తతమా మతాః" అట్టివారెల్లపుడు మదాసక్తచిత్తులై విషయాంతరవిముఖులై యహోరాత్రములను నిమేషప్రాయముగ వెళ్ళబుచ్చెదరు. కాన వారే నాకు యుక్తతములుగ నభిమతులు. ॥౨॥

శంకరానందీయము:— "అముముక్షువునకు ప్రథమమగు సగుణబ్రహ్మోపాసనమే సుకరము. ఇక నాయాఘుడు ద్వితీయమగు నిర్గుణబ్రహ్మోపాసనమే చేయదగునని" సూచించుచు ద్వైవిధముగ ప్రశ్నించిన యాముముక్షువగు యర్జునున కాదిమమగు సగుణబ్రహ్మోపాసనమునే ప్రరోచనాపూర్వకముగ నుపదేశింపదలచి శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నాడు— "మయి...యే" మోక్షస్వరూపుడనగు నాయందును మనస్సు లెస్సగ నిలిపి మోక్షమునే కోరుచున్నవారై, లేక నాస్వరూపమునందే దృష్టము, శ్రుతము, స్పృష్టము, మతము నీ సర్వము బ్రహ్మమే యని సర్వమునకు సన్మాత్రత్వగ్రహణమునందే మనస్సును లెస్సగనుంచి, లేచి విషయాంతరమునందు గాక నాధ్యానమునందే మనస్సును వినియోగించి "నిత్యయుక్తాః" మత్కర్మకరణాది ధర్మములయందెల్లపుడు నియతులై "పరయా భక్త్యా" నిశ్చలమగు భక్తితో (నియుక్తసాధనములతో పరమేశ్వరోపాసనము జేయుచో జిత్తశుద్ధిగలిగి దానివలన జ్ఞానము, దానివలన మోక్షమునగూడ సిద్ధించునా సిద్ధింపదా యను సంశయము లేని యాస్తిక్యబుద్ధితో) గూడినవారయి స్వధర్మమును, స్వాశ్రమమును, స్వజనమును, స్వలక్షణమును

గీ॥ • యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే ।
సర్వత్రగ మచిన్త్యం చ కూటస్థ మచలం ధ్రువమ్ ॥ ॥౩॥

పదవిభాగము:— యే- తు- అక్షరం- అనిర్దేశ్యం- అవ్యక్తం- పర్యుపాసతే- సర్వత్రగం- అచిన్త్యం- చ- కూటస్థం- అచలం- ధ్రువమ్ ॥ ॥౩॥

ప్రతిపదార్థము:—అనిర్దేశ్యం=శబ్దమునకు గోచరము కానందున యిదియని నిర్దేశించుట కశక్యము, అవ్యక్తం=యేప్రమాణముచేతను వ్యక్తము కానిది; సర్వత్రగం=ఆకాశమువలె వ్యాపించునది; అచిన్త్యం చ=వ్యక్తము కానిదగుటవలన నచిన్త్యము; (ఊహించుట శక్యము కానిది) కూటస్థం=మాయాధ్యక్షముగ మాయయం దున్నది; లేక రాశివలెనున్నది; అచలం=చలింపని; ధ్రువం=నిత్యము; అగువట్టి; అక్షరం= అక్షరబ్రహ్మ మును; యేతు=ఎవరైతే; పరి=అంతటను; ఉపాసతే=ఉపాసించెదరో. ॥౩॥

---

శాంకరభాష్యమ్:—

కి మితరే యుక్తతమా న భవంతి స కింతు తాన్ప్రతి యద్వక్తవ్యం తచ్ఛృణు — యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తత్వా దశబ్దగోచర మితి న నిర్దేష్టుం శక్యతేఽతోఽనిర్దేశ్య మవ్యక్తం న కేనాపి ప్రమాణేన వ్యజ్యత ఇత్యవ్యక్తం పర్యుపాసతే పరి సమంతా దుపాసతే । ఉపాసనం నామ యథాశాస్త్రముపాస్య స్యార్థస్య విషయీకరణేన సామీప్య ముపగమ్య తైలధారావ త్సమానప్రత్యయప్రవాహేణ దీర్ఘకాలం య దాసనం త దుపాసన మాచక్షతే। అక్షరస్య విశేషణ మాహ-సర్వత్రగంవ్యో మవద్వ్యాప్యచింత్యంచావ్యక్తత్వాదచింత్యంయద్ధికరణగోచరంతన్మన

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నిర్గుణానుసంధానతత్పరులు యుక్తతములు కారా? అని శంకింపజనదు. అట్టివారలను గూర్చి చెప్పదగిన విషయమును చెప్పెదవినుము. ఏఅక్షరబ్రహ్మమవ్యక్తమగుటవలన శబ్దమునకు గోచరముకాదు. అందుచే "ఇది" అని నిర్దేశించుటకు శక్యమైనదికాదు. కాన అనిర్దేశ్యము, "అవ్యక్తం" ఏప్రమాణముచేతను వ్యక్తముకాదుకాన నవ్యక్తము, "సర్వత్రగం" ఆకాశము

---

వీడకుండగనే యెవరు "మాం" విశ్వస్వరూపుడను, సర్వజ్ఞుడను, సర్వాత్మకుడను, పరమేశ్వరుడను అగు నన్ను "ఉపాసతే" యెల్లప్పుడు అంతటను సర్వమును నన్నుగనే భావించెదరో "తే మేయుక్తతమా మతాః" అట్టి వారే యోగశ్రేష్ఠులని నాకు సమ్మతులు, (గృహమందే యున్నవారయి మోక్షైక కామనతో మత్కర్మకృత్త్వాదిమోక్ష సాధనపరినిష్ఠితులై, యెల్లప్రుడు సర్వమును పరమేశ్వరునిగనే భావించుచున్నవారయి యెవరు కాలమును వెళ్లబుచ్చెదరో యోగవరిష్ఠులని నాయభిప్రాయము.) ఈచెప్పుటచే తమయధికారమునకు తగునట్లు సుగుణబ్రహ్మోపాసనమే అరురుక్షువులగు ముముక్షువులకు సుకరమును, స్వార్థదము నగు సాధనమని సూచితము)

—౧౨వ అధ్యాయము ౩ శ్లోకవ్యాఖ్యావిశేషములు.—

మధుసూదనసరస్వతీయము:— నిర్గుణబ్రహ్మవేత్తలకంటె సగుణబ్రహ్మవేత్తల కాధిక్యమేమి? ఏ యాధిక్యము ననుసరించి సగుణబ్రహ్మవేత్తలు యుక్తతములుగ నీ కభిమతులయిరి? అనుప్రశ్నపై అట్టి యాధిక్యమును చెప్పుటకై తన్నిరూపణోపయోగముగ ముందుగ నిర్గుణబ్రహ్మవేత్తలను ప్రస్తావించుచుండెను.

గీ॥ సన్నియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః ॥

పదవిభాగము:— సన్నియమ్య- ఇన్ద్రియగ్రామం- సర్వత్ర-సమబుద్ధయః- తే- ప్రాప్నువన్తి- మాం ఏవ సర్వభూతహితే-రతాః ॥

ప్రతిపదార్థము:— యే=ఎవరు; ఇన్ద్రియగ్రామం=ఇన్ద్రియసమూహమును; సన్నియమ్య=లెస్సగ నియమించి; సర్వత్ర=అంతట; సమబుద్ధయః=సమానమైన బుద్ధికలవారై; సర్వభూతహితే=సర్వభూతముల హితవుయందు; రతాః=ఆసక్తులో; తే=వారు; మామేవ=నన్నే; ప్రాప్నువన్తి=పొందుచున్నారు. ॥౪॥

శాంకరభాష్యమ్:—

సాపిచింత్యం తద్విపరీతత్వా దచింత్య మక్షరం కూటస్థం దృశ్యరూపగుణ మంతర్దోషం వస్తు కూటం కూటరూపం కూటసాక్ష్య మిత్యాదౌ కూటశబ్ద ప్రసిద్ధో లోకే । తథా చావిద్యాద్యనేకసంసార బీజ మంతర్దోషవ న్మాయావ్యాకృతాదిశబ్దవాచ్యతయా "మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్" "మమ మాయా దురత్యయా" ఇత్యాదౌ ప్రసిద్ధం యత్త త్కూటం తస్మిన్కూటే స్థితం కూటస్థం త దధ్యక్షతయాఽథవా రాశి రివ స్థితం కూటస్థ మత ఏవాచలం యస్మా దచలం తస్మా ద్ధ్రువం నిత్య మిత్యర్థః ॥ ॥౪॥

సంనియమ్యేతి । సంనియమ్య సమ్య గ్నియమ్య సంహృత్యేంద్రియగ్రామ మింద్రియసముదాయం సర్వత్ర సర్వస్మి న్కాలే సమబుద్ధయః సమా తుల్యా బుద్ధి ర్యేషా మిష్టానిష్ట

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వలె నంతట వ్యాపించునది. "అచిన్త్యంచ" ఏది యింద్రియగోచరమో అది మనస్సుచేగూడ నూహించుటకు శక్యమైనది, ఈయక్షరబ్రహ్మమన్న నేకరణములకు గోచరము కానందున (అవ్యక్తమగుటవలన) మనస్సుచేగూడ నూహించుటకు శక్యమైనది కానిది. (అచిన్త్యము) "కూటస్థం" చూడబడు గుణములుకలది. లోపల దోషములుకల వస్తువు కూటమనబడును. లోకమున కూట రూప్యము, కూటసాక్ష్యము, ఇత్యాదికమునందు కూటశబ్దము ప్రసిద్ధము. అట్లే అవిద్యాద్యనేక సంసార బీజములు కలది. అంతర్దోషములు కలదియు మాయ, అవ్యాకృతము ఇత్యాదిశబ్దవాచ్యమగుటచేతను "మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్" 'మమ మాయా దురత్యయా' ఇత్యాది శ్రుతిప్రసిద్ధమైన మాయ కూటమనబడును. అట్టి మాయాధ్యక్షుడుగ మాయయం, దుండువాడు లేక రాశివలెనుండువాడు కాన కూటస్థుడనబడును. కూటస్థుడు కనుకనే అచలుడు, కనుకనే నిత్యుడు ; అట్టి యక్షరపరబ్రహ్మము నెవడంతట నుపాసించునో శాస్త్రము నతిక్రమించకుండగ (యథాశాస్త్రముగ) ఉపాస్యార్థము యొక్క విషయీకరణముచే సామీప్యమును పొంది తైలధారవలె సజాతీయ ప్రత్యయప్రవాహముచే దీర్ఘకాలముండుటయె యుపాసన మనబడును. ॥౩॥

ఎవ రింద్రియసమూహమును లెస్సగ విషయములనుండి యుపసంహరించి (అనగా విషయములను యింద్రియములు ప్రవేశింపకుండగ లెస్సగనరికట్టి) నిఖిలలోకములందు ఇష్టానిష్టప్రాప్తి

శాంకరభాష్యమ్:—

ప్రాప్తా తే సమబుద్ధయ స్తే య ఏవంవిధా స్తే ప్రాప్నువంతి మా మేవ సర్వభూతహితేర తాః। న తు తేషాం వక్తవ్యం కించి న్మాం తే ప్రాప్నువంతీతి। జ్ఞానీ త్వాత్మైవ మే మత మితి హ్యుక్తమ్। న హి భగవత్స్వరూపాణాం సతాం యుక్తతమత్వ మయుక్తతమత్వం వా వాచ్యమ్॥ ॥౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యందు సమానమైన బుద్ధికలవారై, సర్వభూతహితవుయం దాసక్తికలవారో అట్టివారలకు చెప్పదగిన దేదియు లేదు. అట్టివారు నన్నే పొందుచున్నారు. "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అని చెప్పబడెను. భగవత్స్వరూపులయినవారలకు యుక్తతమత్వముకాని, అయుక్తతమత్వము కాని చెప్పుట కలవికాదు. ॥౪॥

ఎవరు అక్షరబ్రహ్మోపాసకులో వారుగూడ నన్నే బొందెద రని రెండవశ్లోకముతో నన్వయము. పూర్వమునందు చెప్పబడి వారికంటె వీరికి వైలక్షణ్యమును సూచించుటకై యీశ్లోకమున "తు" అనుశబ్దము ప్రయోగింపబడినది. వాచక్నవీబ్రాహ్మణమునందు ప్రసిద్ధమైన నిర్విశేషాక్షరబ్రహ్మస్వరూపమును చెప్పుటకై యీశ్లోకమున ఏడు విశేషణము లీయబడినవి. "అనిర్దేశ్యం" శబ్దప్రవృత్తిహేతువులగు జాతి, గుణ, క్రియల సంబంధము లేనిదిగాన బ్రహ్మము శబ్దముచే జెప్పుటకు శక్యముకానిది. బ్రహ్మము జాత్యాదిరహిత మను టలో కారణమేమందువా: "సర్వత్రగం" సర్వవ్యాపి, సర్వకారణము కాన జాత్యాదిశూన్యంబగును. కనుకనే పరిచ్ఛిన్నమైన కార్యమునకు జాత్యాదిసంబంధము కన్పట్టుచున్నది. ఆకాశాదులకుగూడ నట్టి కార్యత్వ మంగీక రింపబడెను. కనుకనే "అచింత్యం" పరిచ్ఛిన్నమగునది మనోవృత్తికి విషయమగుటవలన యపరిచ్ఛిన్నమగు అక్షరబ్రహ్మమునందు శబ్దవృత్తివలె మనోవృత్తిగూడ సంభవింపనేరదు. (అనగా అక్షరపరబ్రహ్మము మనో వృత్తివిషయము కాదనుట.) ఈవిషయమునే "యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ" అను శ్రుతియు బోధించుచున్నది.

అట్లయినచో "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" "దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా" "శాస్త్రయోనిత్వాత్" అను శ్రుతిస్మృతులు ఎట్లు పొసగునని. శంకింపజనదు. అవిద్యాకల్పితసంబంధముచే శబ్దజన్యమయిన చరమబుద్ధివృత్తియందు పరమానందబోధరూపము, శుద్ధము నగు వస్తువు ప్రతిబింబింప కల్పిత ములయిన అవిద్యాతత్కార్యములు నివర్తించుటవలన ఉపచారముచే బ్రహ్మమునకు విషయత్వము చెప్ప బడెను. కానబ్రహ్మమునందు కల్పితమైన అవిద్యాసంబంధమును చెప్పుటకై "కూటస్థం" అని చెప్పబడెను. ఏది మిథ్యాభూతమై సత్యమూగా ప్రతీయమానమగునో యది కూటమనబడును. కనుకనే కూటకార్షాపణము, కూటసాక్షిత్వము అనుచోట కూటశబ్దము ప్రయోగింపబడెను. మాయ యనెడి యజ్ఞానముగూడ మిథ్యాభూత మైనను లౌకికులకు సత్యముగ ప్రతీయమానమై కూటమనబడును. అట్టి మాయయందు అధ్యాసికసంబంధముచే నధిష్ఠానముగా నుండునది కూటస్థమనబడును. (అనగా అక్షరపరబ్రహ్మము అజ్ఞానతత్కార్యాధిష్ఠానమని యర్థము.) ఇట్లు చెప్పుటచే పూర్వమునందు చెప్పబడిన యనుపపత్తులన్నియు తొలగింపబడినవి. కనుకనే సర్వవికారములు అవిద్యాకల్పితములగుట తదధిష్ఠానము నిర్వికారసాక్షిచైతన్యమేయని "అచలం" అనుపదముచే చెప్పచుండెను. నిర్వికారమని యర్థము. కనుకనే "ధ్రువం" అపరిణామియు, నిత్యము నగు శుద్ధబ్రహ్మ (నన్ను) శ్రవణముచే ప్రమాణగతమైన యసంభావనను మననముచే ప్రమేయగతాసంభావనను తొలగిం

చుకొని విపరీతభావనావృత్తికై ధ్యానించుచుండిరి. (విజాతీయప్రత్యయతిరస్కారపూర్వకముగా తైలధారవలె నవిచ్ఛిన్నసజాతీయప్రత్యయప్రవాహరూపమైన నిదిధ్యాసనమనెడిధ్యానము చేవిషయముగ చేసికొనుచుండిరి.) విషయేంద్రియసంయోగము సంభవించుచుండగా విజాతీయప్రత్యయతిరస్కార మెట్లు సంభవించు నను శంకను తొలగించుటకై "సంనియమ్య" అని చెప్పబడెను. ఇంద్రియసముదాయమును విషయములనుండి యుపసంహరించి, ఈచెప్పుటచే శమదమాదిసంపత్తి చెప్పబడెను. విషయభోగవాసన యుండగా విషయములనుండి ఇంద్రియములయొక్క నివృత్తి ఎట్లు సంభవించునను శంకను తొలగించుటకై "సర్వత్ర సమబుద్ధయః" అని చెప్పబడెను. సర్వవిషయములయందు హర్షవిషాదములతోటి, రాగద్వేషములతోటి రహితమైన బుద్ధిగలవారని యర్థము. సమ్యగ్జ్ఞానముచే తత్కారణమైన అజ్ఞానము పోగొట్టబడినదగుటవలన, విషయములయందు దోషదర్శనాభ్యాసముచే స్పృహ పోయినదగుటవలన వారు సర్వత్ర "సమబుద్ధయః" అని చెప్పుచుండిరి. ఈచెప్పుటచే వశీకారమనెడి వైరాగ్యము చెప్పబడెను. కనుకనే అంతటను ఆత్మదృష్టిచే హింసాకారణద్వేషరహితు లగుటవలన "సర్వభూతహితే రతాః" అని చెప్పబడుచుండిరి. "అభయం సర్వభూతేభ్యో మత్తస్స్వాహా" "అభయం సర్వభూతేభ్యో దత్వా సంన్యాస మాచరేత్" అను శ్రుతిస్మృతులు బోధించునటుల సర్వభూతములకొఱకు అభయమనెడు దక్షిణ నొసంగి స్వీకరింపబడిన సంన్యాసము గలవారై సర్వసాధనసంపన్నులై స్వయముగ బ్రహ్మభూతులై నిర్విచికిత్సారూపమైన సర్వసాధనఫలభూతమైన సాక్షాత్కారముచే అట్టివారు అక్షరపరబ్రహ్మస్వరూపమైన నన్ను పొందుచుండిరి. అనగా పూర్వమునందు గూడ నాస్వరూపమై యుండి అవిద్యానివృత్తిచే నాస్వరూపులై యుండెదరు. ఈవిషయమునే బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" "ఇత్యాది శ్రుతులు బోధించుచున్నవి. ఈగీతలయందు గూడ "జ్ఞానీ త్వాత్మైవ మే మతం" అని చెప్పబడెను, ॥3, ౪॥

శంకరానందీయము;— మందప్రజ్ఞగల ముముక్షువులకు సగుణోపాసనయందు ప్రవృత్తిసిద్ధికొఱకై "తే మే యుక్తతమాః" అని కర్మయోగులను స్తుతించి యిపుడు సాధకునకు పరబ్రహ్మయొక్క స్వరూపమును, సాధనసంపత్తిని చెప్పుచు నిర్గుణోపాసకులకు యుక్తతమత్వమును, నిర్గుణోపాసనకు సాక్షాన్మోక్షసాధనత్వము, ఫలప్రకాశనద్వారా స్వయముగనే సిద్ధించునని బ్రహ్మవేత్తలయొక్క బ్రహ్మోపాసనకు ఫలమును, "యే తు" అనుశ్లోకము మొదలు రెండు శ్లోకములచే జెప్పబడెను. ఉపాసకులయొక్క ఉపాసనకు ఉపాస్యమునకు క్రమముగా, సాధనమువలన, ఫలమువలన, స్వరూపమువలన సగుణోపాసనకంటె వైలక్షణ్యము కలదని సూచించుటకు "తు" అను శబ్దము ప్రయోగింపబడెను. "సంనియమ్యేంద్రియగ్రామం" విషయగ్రహణముకొఱకై ఇంద్రియములు చలించుచుండగా మనస్సుగూడ చలించును. దానిచే సమాధి భంగమగును. కాన ఇంద్రియములకు విషయగ్రహణవైముఖ్యమును సంపాదించి "సర్వభూతహితే రతాః" మశకపిపీలికాది సర్వభూతముల కుపద్రవానాచరణమునందు "జనకృపానైష్ఠుర్య ముత్సృజ్యతాం" అను న్యాయముచే అహితానాచరణయందు నిరతులై, లేక బ్రహ్మాదిస్తంబపర్యంత సర్వప్రాణులయొక్క పరమప్రేమాస్పదమగుటవలన ప్రియతమమైన ప్రత్యగాత్మయందు రతులై, అనగా అంతటను ప్రత్యగాత్మస్వరూపముచే నుండినయాత్మను "సర్వాత్మకోఽహం" అని తన స్వరూపముచే చూచెడివారు కనుకనే సర్వప్రపంచమునందు బ్రహ్మదృష్టిగల బ్రహ్మవేత్తలు శబ్దస్పర్శరూపాదులు లేమింజేసి, వ్యక్తము కానట్టి (సర్వేంద్రియాగోచరమైనట్టి) కనుకనే 'అనిర్దేశ్యం' రాగాదులచే "ఇదం" అని నిర్దేశించుటకు శక్యము కానట్టి గగనమువలె నిరాకారమై పరిపూర్ణమైనట్టి, అవ్యక్తమగుటవలన అచింత్యము కనుకనే కూటమువలె అకంప్యముగా ఉండునదగుటచే కూటస్థము, కనుకనే చలనవర్జితము, కనుకనే శాశ్వతముఅగు అక్షరపరబ్రహ్మ

గీ॥ క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్ ।
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే ॥ ॥౫॥

పదవిభాగము:— క్లేశః-అధికతరః-తేషాం-అవ్యక్తాసక్తచేతసాం-అవ్యక్తా-హి-గతిః- దుఃఖం-దేహవద్భిః-అవాప్యతే ॥ ॥౫॥

ప్రతిపదార్థము:— తేషాం=ఆ; అవ్యక్తాసక్తచేతసాం=నిరాకారాక్షరబ్రహ్మస్వరూపమునుధ్యానించువారలకు, అధికతరః=అత్యంతమధికమైన; క్లేశః=క్లేశము; సంభవతి=(ఈపదమధ్యాహార్యము) సంభవించుచున్నది; హి=ఏ కారణమువలన; దేహవద్భిః=దేహాభిమానముకలవారిచే; అవ్యక్తా=అక్షరాత్మికమైన; గతిః=గతి; దుఃఖం=దుఃఖముగ; అవాప్యతే=పొందబడుచున్నదో. ॥౫॥

---

శాంకరభాష్యమ్:—

కింతు — క్లేశోఽధికతరో యద్యపి మత్కర్మాదిపరాణాం క్లేశోఽధిక ఏవ క్లేశోఽధికతరస్త్వక్షరాత్మనాం పరమార్థదర్శినాం దేహాభిమానపరిత్యాగనిమిత్తోఽవ్యక్తాసక్తచేతసా మవ్యక్త ఆసక్తం చేతో యేషాం తేఽవ్యక్తాసక్తచేతస స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్ । అవ్యక్తా హి యస్మా ద్గతి రక్షరాత్మికా దుఃఖం సా దేహవద్భి ర్దేహాభిమానవద్భి రవాప్యతేఽతః క్లేశోఽధికతరః । అక్షరోపాసకానాం యద్వర్తనం త దుపరిష్టా ద్వక్ష్యామః ॥ ॥౫॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విచారింప నన్నుద్దేశించి కర్మాదుల నాచరించువారలకు క్లేశము కలదు. అక్షరాత్ములగు పరమాత్మదర్శులకన్ననో దేహాభిమానపరిత్యాగనిమిత్త మగు క్లేశ మధికతరము "అవ్యక్తాసక్తచేతసాం" అక్షరబ్రహ్మమునం దాసక్తమైన చిత్తముకలవారలకు అధికతరమైన క్లేశము కలదు. ఏ కారణమువలన నవ్యక్తబ్రహ్మరూపమే గతి యో అందువలన దేహాభిమానము కలవారలచే దుఃఖము పొందబడుచున్నది. ॥౫॥

---

మును సర్వదా అనుసంధానము చేయుదురో, అనగా సర్వమును నిర్విశేషబ్రహ్మముగా ఎవరు చూచెదరో
అట్టి బ్రహ్మనిష్ఠులు సచ్చిదానందైకరసస్వరూపమగు పరబ్రహ్మమును పొందుచుండిరి. పూర్వోక్తమైన సగుణో
పాసకులగు భక్తులు అగ్న్యాదిదేవతలను పొంది క్రమముగా నన్నుపొందుచుండిరి. అక్షరోపాసకులన్ననో
ఉత్క్రాంతిని, దేవతాంతరప్రాప్తినివిడిచి సాక్షాద్బ్రహ్మస్వరూపమైన నన్ను పొందుచుండిరి. కనుకనే
సాక్షాద్బ్రహ్మప్రాప్తియే బ్రహ్మవేత్తలకు, అబ్రహ్మవేత్తలకు యుక్తతమత్వాయుక్తతమత్వములను స్పష్టము
చేయుచున్నది. పరుల నపేక్షింపక రాజసాన్నిధ్యమును పొందినవారలకు, అప్తతమత్వము పరాపేక్షచే రాజసా
న్నిధ్యమును పొందినవారలకు, నాప్తతమత్వమును తత్ప్రాప్తియే యెట్లు స్పష్టపరచుచున్నదో అటులనే
సగుణోపాసకులకు యుక్తతమత్వము ఔపచారికమని సిద్ధము. నిర్గుణోపాసనకే సాక్షాత్సాధనత్వము బ్రహ్మ
ప్రాప్తిచే సూచితము. ఈచెప్పుటచే సదసద్వివేకముగల పండితులైన పరిశుద్ధమైన యంతఃకరణముగల
తీవ్రమోక్షేచ్ఛ గలవారలకు సర్వకర్మసంన్యాసపూర్వకముగ శ్రవణాదులచే బ్రహ్మమును తెలిసికొని తదు ॥౩, ౪॥
పాసనమే విదేహకైవల్యసిద్ధికొఱకు కర్తవ్యమని సూచింపబడెను.

—॥ ౧౨వ అధ్యాయము ౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ॥—

మధుసూదనసరస్వతీయము:— ప్రస్తుతము నిర్గుణోపాసకులకంటె సగుణోపాసకులకు

గీ॥ యే తు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥ ॥౬॥

పదవిభాగము:— యే- తు- సర్వాణి- కర్మాణి- మయి- సంన్యస్య- మత్పరాః- అనన్యేన- ఏవ- యోగేన- మాం- ధ్యాయన్తః- ఉపాసతే ॥ ॥౬॥

ప్రతిపదార్థము:— యే తు=ఎవరైతే; సర్వాణి=నిఖిలమైన; కర్మాణి=కర్మలను; మయి=పరమేశ్వరునియందు; సంన్యస్య=లెస్సగనుంచి:(సంన్యసించి) మత్పరాః=నేనే పరుడుగా కలవారై; అనన్యేనైవ=విశ్వరూపాదిఅన్యమగు యాలంబనములేని; యోగేన=సమాధిచే; మాం=నన్ను; ధ్యాయన్తః=ధ్యానించువారై; ఉపాసతే=ఉపాసించెదరో. ॥౬॥

గీ॥ తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి న చిరా త్పార్థ మ య్యావేశితచేతసామ్ ॥ ॥౭॥

పదవిభాగము:— తేషాం- అహం- సముద్ధర్తా- మృత్యుసంసారసాగరాత్- భవామి- న- చిరాత్- పార్థ- మయి- ఆవేశితచేతసామ్ ॥ ॥౭॥

ప్రతిపదార్థము:— హే పార్థ=ఓయర్జునా;మయి=విశ్వరూపమునందు;ఆవేశితచేతసాం=ఆవేశిత=ఉంచబడిన; చేతసాం=చిత్తముకల; తేషాం=నాయుపాసనాపరులకు;అహం=నేను; మృత్యుసంసారసాగరాత్=మృత్యు=మృత్యుయుక్తమైన; సంసారసాగరాత్=సముద్రమువంటిసంసారమునుండి; నచిరాత్=శీఘ్రముగ; సముద్ధర్తా=లెస్సగనుద్ధరించువాడనై; భవామి=అగుచున్నాను. ॥౭॥

---

అతిశయమును జూపుచున్నాడు— సగుణోపాసకులు గూడ సగుణబ్రహ్మమునందు మనస్సును నిల్పుటయందును, ఎల్లప్పుడు తత్కర్మపరాయణులగుటయందును, యుత్కృష్టశ్రద్ధోపేతు లగుటయందును క్లేశమధికమే యగును. కాని వీటికంటె "క్లేశః...చేతసాం" నిర్గుణబ్రహ్మోపాసకులై పూర్వోక్తసాధనసంపన్నులైయుండువారికి క్లేశమధికతరము. ఇందుకు కారణమేమందువా? "అవ్యక్తా హి...రవాప్యతే" గంతవ్యము, ఫలభూతము నగు అక్షరబ్రహ్మము దేహాభిమానులచే నధికకష్టముచే బొందబడుచున్నది. (సర్వకర్మలను సంన్యసించి గురూపసదనవిధితో వేదాంతవాక్యముల విచారముచే నాయాభ్రమనిరాకరణమునందు అధికప్రయాసము కలదని భావము.) విచారింప సగుణబ్రహ్మ, నిర్గుణబ్రహ్మోపాసకుల బ్రహ్మప్రాప్తిరూపఫల మొకటియే యైనను దుష్కరోపాయముచే బ్రహ్మము నొందువారికంటె సుకరోపాయముచే బ్రహ్మము నొందువారలు శ్రేష్ఠులని భావము. ॥౫॥

శంకరానందీయము:— చిత్తము పక్వము కానివారలకు అక్షరబ్రహ్మోపాసనమునందు క్లేశాధిక్యము కలదని చెప్పుచున్నాడు— "క్లేశః...చేతసామ్" వ్యక్తిత్వము నొందిన పరమేశ్వరుని (నాయొక్క) యుపాసకులకుగూడ మత్కర్మకృత్త్వాదిధర్మములు సిద్ధించుటలో క్లేశము కలదు కాని వారినిబట్టి జూడ సర్వేంద్రియాగోచరము, అదృశ్యము, అతర్క్యము, అచింత్యము, అప్రమేయము నగు పరబ్రహ్మమునందు తద్భావాపత్తికై ప్రయత్నించు మనస్సుగలవారలకు (నిరాకారబ్రహ్మను నిదిధ్యాసించు యతులకు) విషయత్యాగకృతము, ఆశ్రమధర్మకృతము, యమనియమాభ్యాసకృతము, అసత్ప్రత్యయనిరాసకృతము, నిరాకారబ్రహ్మమునందు మనస్థిరీకరణకృతము నగు క్లేశము అధికతరము. (పైన చెప్పిన యొక్కొక్క సాధనసిద్ధియే దుష్కరమగుటచే నందునను అనాత్మయందైన యహంభావమును వీడుట బ్రహ్మకుగూడ శక్యము కానిది. ఇట్లే బ్రహ్మమునందు జగత్ప్రత్యయపరిత్యాగముగూడ నిరంతరక్లేశసాధ్యమగుట బ్రహ్మవేత్తలకు అధికతరక్లేశబహుల మని యర్థము.) ఈవిషయమును స్వయముగనే శ్రీకృష్ణభగవానులు స్పష్టపరచుచుండెను.

శాంకరభాష్యమ్:—

యే త్వితి । యే తు సర్వాణి కర్మాణి మయీశ్వరే సంన్యస్య మత్పరా అహం పరో యేషాం తే మత్పరాః సంతోఽనన్యే నైవావిద్యమాన మన్య దాలంబనం విశ్వరూపం దేవ మాత్మానం ముక్త్వా యస్య సోఽనన్య స్తేనానన్యే నైవ కేన యోగేన సమాధినా మాం ధ్యా యంత శ్చింతయంత ఉపాసతే ॥ ॥౬॥

తేషాం కిమ్— తేషాం మదుపాసనైకపరాణా మహ మీశ్వర స్సముద్ధర్తా । కుత ఇత్యాహ మృత్యుసంసారసాగరాత్, మృత్యుయుక్త స్సంసారో మృత్యుసంసారః స ఏవ సాగర ఇవ సాగరో దురుత్తరత్వా త్తస్మా న్మృత్యుసంసారసాగరా దహం తేషాం సముద్ధర్తా భవామి న చిరా త్కిం తర్హి క్షిప్ర మేవ హేపార్థ! మయ్యావేశితచేతసాం మయి విశ్వరూప ఆవేశితం ప్రవేశితం సమాహితం చేతో యేషాం తే మయ్యావేశితచేతస స్తేషామ్ ॥ ॥౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎవరు సర్వకర్మలను పరమేశ్వరునియం దర్పించి (సర్వకర్మలను సంన్యసించి) పరమేశ్వరుడే పరుడుగాకలవారై అన్యమగు విశ్వరూపాద్యాలంబనము లేని సమాధిచే నన్ను ధ్యానించువారై యుపాసించెదరో. ॥౬॥

పూర్వశ్లోకమునందు చెప్పబడినవారలకేమి జరుగునెదవా? విశ్వరూపమునం దావేశిత చిత్తముకల మదుపాసనైకపరులకు మృత్యుయుక్తమైన సముద్రమువంటి సంసారమునుండి శీఘ్ర ముగ నుద్ధరించువాడనై నే నగుచున్నాను. ॥౭॥

"అవ్యక్తా హి...అవాప్యతే" అవ్యక్తస్వరూపమైన తద్భావాపత్తిరూపమైన గతి దేహాతాదాత్మ్యవంతులచే నతిదుఃఖము కలుగునట్లు బొందబడుచున్నది. (ఇట "దుఃఖం" అనునది క్రియావిశేషణము) (అత్యంతక్లేశముచే బొందబడుచున్నదని యర్థము) దేహాభిమానము నిశ్శేషముగ నశించిననే బ్రహ్మాత్మత్వము సిద్ధించును. అట్టి దేహాభిమానము చిరకాల, నిత్య, నిరంతర, నియత, నిర్వికల్పసమాధినిష్ఠావిశేషాధిక్యమును విడచి సామాన్య ప్రయత్నముచే తొలగునది కాదు. కాన యవ్యక్తాసక్తచేతస్కులకు క్లేశాధికతరత్వము యుక్తము. వీరికి దేహాద్య హంకారవిచ్ఛిత్తియు, సాధనసంపత్తియు ముందు చెప్పబడును. ॥౫॥

—• ౧౨వ అధ్యాయము ౬, ౭ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సగుణనిర్గుణోపాసనలకు యొకే ఫలమగుచో క్లేశమెక్కువగ నున్న ఆఫల మెక్కువయనియు, స్వల్పమగుచో నాఫలముగూడ స్వల్పమేయనియు కల్పింపదగును. కాని ఆఫలముల కైక్యమేలేదు. ఏమందువా; నిర్గుణబ్రహ్మవేత్తలకు అవిద్యాతత్కార్యనివృత్తిచే నిర్విశేషపరమా నందబోధబ్రహ్మరూపముగ నుండుట (మోక్షము) పొందబడును. సగుణోపాసకులకు అధిష్ఠానప్రమ యుండదు. కాన యవిద్య తొలగదు. అందుచే నైశ్వర్యవిశేషము, కార్యబ్రహ్మలోకగతియు, ఫలము. కాన ఫలాధిక్యమునకై యాయాసాధిక్యము న్యూనతాపాదకము గానేరదని శంకింపజనదు. సగుణోపాసనచే సర్వ ప్రతిబంధములు తొలగినవారికి గురూపదేశముగాని, శ్రవణమననాదిక్లేశముగాని లేకుండగనే స్వయమావి ర్భూతమైన యీశ్వరానుగ్రహసహకృతమగు వేదాంతవాక్యముచే దత్త్వజ్ఞానోదయమై యవిద్యాతత్కార్య నివృత్తియై బ్రహ్మలోకమునందే యైశ్వర్యభోగాన్తమున నిర్గుణబ్రహ్మవిద్యాఫలమైన పరమకైవల్యముప

పన్నమగును. "స ఏతస్మాజ్జీవఘనాత్ పరాత్పరం పురిశయం పురుష మీక్ష్యతే" (సగుణోపాసకుడు హిరణ్యగర్భైశ్వర్యము నొందినవాడై భోగాన్తమున సర్వజీవసమష్టిరూపము, శ్రేష్ఠమునగు హిరణ్యగర్భుని కంటె విలక్షణము స్వహృదయగుహానివిష్టము, నగు ప్రత్యగభిన్నాద్వితీయపరబ్రహ్మమును సాక్షాత్కరింపజేసుకొనును.) అను శ్రుతియు నీవిషయమునే జెప్పుచున్నది. కనుక ప్రాగుక్తక్లేశబాహుళ్యము లేకుండగనే సగుణబ్రహ్మవేత్తలకు యీశ్వరప్రసాదముచే నిర్గుణబ్రహ్మవిద్యాఫలము ప్రాప్తించునని రెండు శ్లోకములచే జెప్పుచున్నాడు.— ఎవరు సర్వకర్మలను సగుణబ్రహ్మనగు నాయందు సమర్పించి, నేనే (వాసుదేవుడే) ప్రకృష్టమైన ప్రీతివిషయుడుగా కలవారై, అనన్యయోగముచే (ఏకాన్తముచే నన్ను సకలసౌందర్యసారవిధానము, ఆనందఘనవిగ్రహము, ద్విభుజములుగాని, చతుర్భుజములుగాని, కలిగి సమస్తజనమనోహారిణియగు మురళిని సప్తస్వరములతో బూరించుచున్న స్వరూపము గలవానిగగాని, శంఖ, పద్మ, కౌమోదకీ, రథాంగసంగిపాణిపల్లవములు కలవానిగగాని, నరసింహ, రాఘవాదిరూపధరునిగగాని, పూర్వదర్శితవిశ్వరూపునిగగాని, ధ్యానించుచు సమానాకారము, నవిచ్ఛిన్నమునగు చిత్తవృత్తిప్రవాహము కలుగునట్లుగ నుందురో లేక, సమీపవర్తులైయుందురో. ॥౬॥ నాయందు ఆవేశితమైన చిత్తముకల యట్టివారలను సతతోపాసితుడనగు నేను మృత్యుయుక్తము, సాగరమువలె దుస్తరము నగు సంసారమునుండి శీఘ్రముగనే యుద్ధరించెడివాడనై యగుదును. ॥౭॥

శంకరానందీయము:— అనాయాసముగ అక్షరపరబ్రహ్మోపాసనము సిద్ధించుటకై కారణముగాన సగుణోపాసన మవశ్యము ముముక్షువు చేయదగును. సగుణోపాసకులు- సుఖముగ నక్షరోపాసనము నాచరించి తత్ఫలమును పొందగల్గుదురు. కాన నిర్గుణోపాసన, సగుణోపాసనములు రెండింటికిని సాధ్యసాధనభావము నంగీకరించి సాధనమగు సగుణోపాసనమున కవశ్యకర్తవ్యత్వమును సూచించుటకై చెప్పుచున్నాడు.— (ఇట "తు" శబ్దము పూర్వోక్త నిర్గుణోపాసకవ్యావృత్త్యర్థకము) ఏసగుణోపాసకులైన నాభక్తులు- వైదికములు నవైదికములు నగు సర్వకర్మలను నాయందే సన్యసించి (నాకై యర్పించి) మదేకపరాయణులై, లేక్క తమకంటె వేరుగ నేనే (పరమాత్మయే శ్రోతవ్యముగను, మంతవ్యముగను, ద్రష్టవ్యముగను, స్ప్రష్టవ్యముగను, జ్ఞాతవ్యముగను కలవారు మత్పరు లనబడుదురు. అట్టివారై తనకంటె నతిరిక్తమగు సర్వమునందు పరమేశ్వరబుద్ధికలవారై) కనుకనే "అనన్యేన" నాకంటె నితరమగునది బుద్ధికి ఆలంబనముగా నుండదో యట్టి సమాధిరూపయోగముచే విశ్వరూపుడ నగు నన్ను మదాకారవృత్తితో సేవించెదరో (ముందుశ్లోకముతో నన్వయము) పైవిధముగా సగుణోపాసనచే శుద్ధాత్ములగువారికి యక్షరబ్రహ్మోపాసనము, తత్ఫలము గూడ సులభము అని సూచించుటకై సగుణోపాసనాఫలమును చెప్పుచున్నాడు— "మయి ఆవేశితచేతసాం (నాయందు) "ఏష సర్వభూతాంతరాత్మా" ఇత్యాదిశ్రుతిప్రసిద్ధమగు విశ్వరూపస్వరూపుడగు పరమాత్మయందు సర్వము బ్రహ్మమేయని స్థిరీకృతమైన చిత్తముకలవారై, సర్వావస్థలయందును, సర్వవిధములచేతను నన్నే భజించుచుసంప్రాప్తసత్త్వశుద్ధి కలవారై యుండు "తేషాం" అట్టినాభక్తులను "నచిరాత్" నాయుపాసనముచే లెస్సగ చిత్తశుద్ధికల్గిన యుత్తరక్షణముననందే "తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ । దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే" "తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః । నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా" అని నేజెప్పినరీతిని నేను సమ్యగ్దర్శనరూపమగు జ్ఞానయోగము నిచ్చి, జ్ఞానదీపముచే నజ్ఞానధ్వాంతమును నశింపజేసి (లెస్సగ నిర్గుణపరబ్రహ్మనిష్ఠచేకూర్చి) "మృత్యుసంసారసాగరాత్" "మ్రియంతే పునః పునః ప్రాణినో యస్మా త్స మృత్యు రజ్ఞానం" ఏయజ్ఞానమువలన ప్రాణులు పుట్టుచు గిట్టుచు నుండిరో యట్టి యజ్ఞానము మృత్యు

గీ॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ ॥౮॥

పదవిభాగము:— మయి- ఏవ- మనః- ఆధత్స్వ-మయి- బుద్ధిం- నివేశయ- నివసిష్యసి-మయి- ఏవ- అతః- ఊర్ధ్వం- న- సంశయః ॥ ॥౮॥

ప్రతిపదార్థము:— మయ్యేవ=విశ్వరూపస్వరూపమగు నాయందే; మనః=సంకల్పవికల్పాత్మకమగు మనస్సును; ఆధత్స్వ=స్థాపించుము; మయి=నాయందే; బుద్ధిం=నిశ్చయాత్మకమను బుద్ధిని; నివేశయ=ఉంచుము; అత ఊర్ధ్వం=శరీరపాతానంతరము; మయ్యేవ=నాయందే; నివసిష్యసి=నివాసమును చేయగలవు; సంశయః=సంశయము; న=లేదు. ॥౮॥

శాంకరభాష్యమ్.—

యత ఏవం తస్మాత్— మయ్యేవ విశ్వరూపే ఈశ్వరే మనః సంకల్పవికల్పాత్మకమాధత్స్వ స్థాపయ మయ్యేవాధ్యవసాయం కుర్వతీం బుద్ధిమాధత్స్వ నివేశయ । తతస్తే కిం స్యాదితి శృణు నివసిష్యసి నివత్స్యసి నిశ్చయేన మదాత్మనా మయి నివాసం కరిష్యస్యేవాతః శరీరపాతాదూర్ధ్వం న సంశయః సంశయోఽత్ర న కర్తవ్యః ॥ ॥౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

భగవదుపాసన గొప్పఫలము కలది, కాన భగవన్నిష్ఠయందు ప్రయత్నము చేయవలెను. కాన విశ్వరూపమగు నాయందే సంకల్పవికల్పాత్మకమగు మనస్సును ఉంచుము. నిశ్చయాత్మకమగు బుద్ధిని యుంచుము. అందుచే నీకేమి ప్రాప్తించుననెదవా? వినుము— ఈ శరీరపాతానంతరమున నాయందే నిశ్చయముగ నాస్వరూపముచే నివాసము చేయగలవు. ఈ విషయమై సంశయము చేయదగినది కాదు. ॥౮॥

---

పబడును. సర్వానర్థ కారణమైన యట్టి యజ్ఞానముతో గూడి తత్కార్యభూతమైన 'అహం మమ' ఇత్యాది ప్రవృత్తిరూపమగునది సంసారము. అట్టి సంసారము నిరవధికమగుటవలనను దుస్తరమగుటవలనను తాపత్రయబడబానలోపేతమగుటవలనను, సాగరమువంటిది. అట్టి సంసారసాగరమునుండి యుద్ధరించువాడను నేనగుదును. (బ్రహ్మజ్ఞానము, తన్నిష్ఠ; తత్ప్రాప్తియు, నెట్లగునో ఆవిధముగ నేననుగ్రహించెద నని యర్థము.) (ఈ చెప్పుటచే సగుణోపాసనము అంగమనియు, నిర్గుణోపాసనము అంగి యనియు వాటికి ఫలము మోక్షమే యనియు, నయ్యది మదనుగ్రహైకలభ్యమనియు సూచింపబడెను. ॥౭॥

— ౧౨వ అధ్యాయము ౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు —

మధుసూదనసరస్వతీయము:— ఈ విధముగ నింతవరకగు గ్రంథభాగముచే సగుణోపాసనను స్తుతించి, సాధనావిధానమును చెప్పుచుండెను— "మయ్యేవ మన ఆధత్స్వ" నాయందే (సగుణబ్రహ్మమునందె) సంకల్పవికల్పాత్మకమగు మనస్సును నిల్పుము. (సర్వమనోవృత్తులను మద్విషయములుగనే చేయుము. "మయిబుద్ధిం నివేశయ" నాయందే మద్వ్యవసాయా (నిశ్చయా) త్మకబుద్ధినుంచుము. బుద్ధివృత్తుల నన్నిటిని మద్విషయములుగనే చేయుము. విషయాంతరపరిత్యాగపూర్వకముగ నెల్లపుడు నన్ను జింతింపుమని యర్థము. అట్లు చేయుచో నేమగు నందువా? "నివశిష్యసి...సంశయః" లబ్ధజ్ఞానుడవై ఈ దేహాంతమున శుద్ధబ్రహ్మమువందు మత్స్వరూపముతో నుండగలవు. ఈ విషయమై ప్రతిబంధశంక చేయదగదు. ॥౮॥

శంకరానందీయము:— అక్షరబ్రహ్మజ్ఞానము, దానిఫలముగూడ మదనుగ్రహైకలభ్యములు. నాయనుగ్రహము నాయుపాసనముచేతనే లభ్యమగును. కాన నన్నుపాసించుమని చెప్పుచున్నాడు— "మయ్యేవ

గీ॥ అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ ॥ ॥౯॥

పదవిభాగము:— అథ-చిత్తం-సమాధాతుం- న- శక్నోషి- మయి-స్థిరం- అభ్యాసయోగేన- తతః- మాం- ఇచ్ఛ- ఆప్తుం- ధనంజయ। ॥౯॥

ప్రతిపదార్థము:— ధనంజయ=ఓయర్జునా; అథ=నేను చెప్పినరీతిని; చిత్తం=చిత్తమును, మయి=నాయందు; స్థిరం=స్థిరముగ; సమాధాతుం=స్థాపించుటకు; నశక్నోషి=సమర్థుడవు కానివాడగుచో; తతః=అనంతరమున; అభ్యాసయోగేన=అభ్యాసపూర్వకమైనయోగముచే; మాం=విశ్వరూపమును, ఆప్తుం=పొందుటకు; ఇచ్ఛ=ప్రార్థించుము. ॥౯॥

---

శాంకరభాష్యమ్:—

అథేతి । అథైవం యథాఽవోచామ తథా మయి చిత్తం సమాధాతుం స్థాపయితుం స్థిరమచలం న శక్నోషి చే త్తతః పశ్చా దభ్యాసయోగేన చిత్త స్యైకస్మి న్నాలంబనే సర్వతః సమాహృత్య పునః పునః స్థాపన మభ్యాస స్తత్పూర్వకో యోగ స్సమాధానలక్షణ స్తేనాభ్యాసయోగేన మాం విశ్వరూప మిచ్ఛ ప్రార్థయస్వాప్తుం ప్రాప్తుం హే ధనంజయ! ॥౯॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓయర్జునా! నేనెట్లు చెప్పితినో యట్లు నాయందు చిత్తమును స్థిరముగ స్థాపించుటకు సమర్థుడవు కానిచో అనంతరము యితరవిషయములయెడ మనస్సును పోనీయక యొకయాలంబనమునందే తిరిగి తిరిగి మనస్సును స్థాపించుట యభ్యాసము. అట్టి యభ్యాసపూర్వకమైన యోగముచే విశ్వరూపుడ నగు నన్ను పొందుటకు ప్రార్థించుము. ॥౯॥

---

అతఊర్ధ్వం అనుస్థలమున "మ" కారమును ప్రయోగించి సంధిచేయనగును కాని తాను బహువ్యాకరణజ్ఞుడని తెల్పుటకై విసంధిగనే ప్రయోగించెను. నాయుపాసనమును చేయక, అక్షరబ్రహ్మజ్ఞానముగాని తదుపాసనముగాని యతిదుర్లభములుగాన, అట్టి యక్షర బ్రహ్మమునందు గాక, నాయందే (సగుణబ్రహ్మమునందే) మనస్సును నిల్పుము. (అంతటను మనోవృత్తికి విషయునిగ నన్నే జేసుకొనుమని యర్థము.) మరియు నాయందే (సగుణబ్రహ్మమునందే వస్తుతత్త్వావధారణశీలమగు అంతఃకరణవృత్తివిశేషము నుంచుము. (ఈసర్వము బ్రహ్మమేయని నిశ్చయాత్మకమగు బుద్ధితో నన్ననుసంధించుము.) అటుపిమ్మట నిర్విశేషబ్రహ్మజ్ఞానమును పొంది దాని బలముచే దేహసంబంధమును వీడి నిర్విశేషాత్మస్వరూపముతో (నాయందే నిర్విశేషపరబ్రహ్మమునందే) యుండగలవు. (విదేహకైవల్యము నొందగలవు.) నాభక్తుడవగు నీకట్టి ప్రతిబంధకములు సంభవింపవు. కాన నాకు కైవల్యము సంభవించునా? సంభవింపదా? అనియేమాత్రము సందేహింపకుము. మదేకాశ్రయునకు నాయుపాసనముచే చిత్తము శుద్ధమగును. కాన జ్ఞాన ముత్పన్నమగును. జ్ఞానముచే విదేహకైవల్యము నిర్విఘ్నముగా సిద్ధించునని యర్థము.

—॥ ౧౨వ అధ్యాయము ౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ॥—

మధుసూదనసరస్వతీయము:— ప్రస్తుతము సగుణబ్రహ్మధ్యానాసక్తులకు అశక్తి తారతమ్యము ననుసరించి ముందుగ బాహ్యప్రతిమయునందు భగవద్ధ్యానాభ్యాసము చేయ దగుననియు, దానియందశక్తులు భాగవతధర్మానుష్ఠానము చేయదగుననియు, దానియందుగూడ నశక్తులగుచో సర్వకర్మఫలత్యాగమును

గీ॥ అభ్యాసే ప్యసమర్థోసి మత్కర్మపరమో భవ ।
మదర్థ మపి కర్మాణి కుర్వ న్సిద్ధి మవాప్స్యసి ॥

పదవిభాగము:— అభ్యాసే- అపి- అసమర్థః- అసి- మత్కర్మపరమః- భవ- మదర్థం- అపి- కర్మాణి- కుర్వన్- సిద్ధిం- అవాప్స్యసి ॥

ప్రతిపదార్థము:— అభ్యాసేపి=అభ్యాసయోగమునందునను; అసమర్థః=అశక్తుడవై; : అసి= అయితివేని; మత్కర్మపరమః=నానిమిత్తము చేయుకర్మమేప్రధానముగ కలవాడవై; భవ=కమ్ము; మదర్థమపి= నానిమిత్తమై యైనను; కర్మాణి=కర్మలను; కుర్వన్=చేయుచున్నవాడవై; సిద్ధిం=సిద్ధిని; అవాప్స్యసి=పొందగలవు. ॥౧౦॥

---

శాంకరభాష్యమ్:—

అభ్యాసేఽపీతి। అభ్యాసే ప్యసమర్థోఽప్యశక్తోసి తర్హి మత్కర్మపరమో భవ మదర్థం కర్మ మత్కర్మ తత్పరమో మత్కర్మప్రధాన ఇత్యర్థః । అభ్యాసేన వినా మదర్థ మపి కర్మాణి కేవలం కుర్వ న్సిద్ధిం సత్త్వశుద్ధియోగజ్ఞానప్రాప్తిద్వారేణావాప్స్యసి। ॥౧౦॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓయర్జునా! అభ్యాసయోగము ననుష్ఠించుటకుగూడ నసమర్థుడ వగుచో నీవు నానిమిత్తమై కర్మను జేయుట ప్రధానముగా కలవాడ వగుము అభ్యాసమును విడచికూడ నానిత్తమై కర్మలను కేవలము చేయుచో సత్త్వశుద్ధియోగజ్ఞానప్రాప్తిద్వారమున సిద్ధిని పొందగలవు. ॥౧౦॥

---

చేయదగునని సాధనత్రయమును శ్లోకత్రయముచే జెప్పుచున్నాడు.— "అథ...ధనంజయః" (ఇట అథఅను నది పక్షాంతరమునందు అను యర్థమున ప్రయుక్తము.) ఓధనంజయా! నాయందు చిత్తమును స్థిరముగ నిల్పుటకు సమర్థుడవు కానిచో (అంతటనుండియు, చిత్తమును మరలించి యొకప్రతిమాదిరూపాలంబమునందు మాటిమాటికి నిల్పుట అభ్యాసయోగమనబడును.) అట్టి అభ్యాసయోగముచే నన్ను పొందుటకు ప్రయత్నింపుము. (రాజసూయయాగనిర్వహణకై యనేకశత్రువులను జయించి ధనమును సేకరించి యాగనిర్వాహకుడవైతివి. అట్లే నీవు ఒక మనశ్శత్రువును జయించి తత్త్వజ్ఞానధనము నాహరింపగలవని "ధనంజయ" అను సంబోధనముచే సూచితమయ్యెను. ॥౯॥

శంకరానందీయము:— విశ్వరూపోపాసనము అనేక విపరీతప్రత్యయకోటిప్రతిబంధకము గలది. అట్టి విశ్వరూపోపాసనమును యథోక్తరీతి నాచరించుట కశక్తులగు మందప్రజ్ఞులకు సాధనాంతరముల నుపదేశించుచుండెను.— "అథ......ధనంజయ!" ప్రజ్ఞాబలముచే జ్ఞానధనమును సేకరించు ఓయర్జునా! పూర్వోక్తరీతిచే విశ్వరూపుడనగు నాయందు మనస్సును నిశ్చలమగునట్లు చేయుటకు నీవు సమర్థుడవు కానిచో "అభ్యాసయోగేన" (విపరీతప్రత్యయములను తిరస్కరించి సజాతీయప్రత్యయముల నావృత్తిచేయుట యభ్యాసమనబడును.) ఘటపటాదిప్రత్యయప్రవిలాపనపూర్వకముగ యీసర్వము భౌతికమేయని సద్వప్రమాణసిద్ధమగు భౌతికత్వప్రత్యయము చిరకాలము, నిత్యము తత్పరత్వబుద్ధితో లెస్సగ నభ్యసించినచో నెల్లపుడు సర్వత్ర అభౌతికప్రత్యయము విపరీతప్రత్యయానంతరితమై దృఢమగును. దానిచే మనశ్చలనహేతువు లగు ఘటాదిప్రత్యయములు వాసనలతోగూడ నశించును. అట్టియెడ మనస్సు సుస్థిరమగును. ఈవిధముగ సర్వము నందునగు భౌతికమాత్రత్వప్రత్యయాభ్యాసము సగుణబ్రహ్మోపాసనమున కుపాయమగుట యోగమనబడును. అట్టి అభ్యాసయోగముచె మనస్సు నిశ్చలమైనచో నటుపిమ్మట విశ్వరూపుడనగు నన్ను (పరమేశ్వరుని) పొందుటకై యంతటను భౌతికప్రత్యయమును వీడి, సర్వము బ్రహ్మమేయని బ్రహ్మప్రత్యయములచే నన్నుపాసించుటకై నీవిచ్ఛయింపుము. (సర్వము బ్రహ్మమేయని సర్వమును నన్నుగ నుపాసింపుము.) ॥౯॥

గీ॥ అథైత దప్యశక్తోసి కర్తుం మద్యోగ మాశ్రితః ।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ ॥౧౧॥

పదవిభాగము:— అథ– ఏతత్– అపి– అశక్తః– అసి– కర్తుం– మద్యోగం– ఆశ్రితః– సర్వకర్మఫలత్యాగం– తతః– కురు– యతాత్మవాన్ ॥ ॥౧౧॥

ప్రతిపదార్థము:— అథ=అట్లు కానిపక్షమున; ఏతదపి=ఈమత్కర్మపరమత్వమునుగూడ; కర్తుం=చేయుటకై; అశక్తోసి=అశక్తుడవగుచో; మద్యోగం=నా యెడయోగమును; ఆశ్రితః=ఆశ్రయించినవాడవై; సర్వకర్మఫలత్యాగం=సర్వకర్మలయొక్క ఫలమును సన్యసించుటను; తతః=అనంతరము; యతాత్మవాన్=సంయతచిత్తుడవై; కురు=చేయుము. ॥౧౧॥

---

శాంకరభాష్యమ్:—

అథైత దితి । అథ పున రేత దపి యదుక్తం మత్కర్మపరమత్వం తత్కర్తు మశక్తోసి మద్యోగ మాశ్రితో మయి క్రియమాణాని కర్మాణి సంన్యస్య యత్కరణం తేషా మనుష్ఠానం స మద్యోగ స్త మాశ్రిత స్సన్సర్వకర్మఫలత్యాగం సర్వేషాం కర్మణాం ఫలసంన్యాసం సర్వకర్మఫలత్యాగం తతోఽనంతరం కురు యతాత్మవా న్సంయతచిత్త స్సన్నిత్యర్థః ॥ ॥౧౧॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అట్లు కానిపక్షమున నేజెప్పిన మత్కర్మపరమత్వము నాచరింప నశక్తుడ వగుచో (నీవు చేయు కర్మ లన్నిటిని నాకై యర్పించుట యోగ మనబడును.) అట్టి మద్యోగము నాశ్రయించినవాడవై, అనంతరము నియమితచిత్తుడవై యాకర్మల యన్నిటిఫలమును సన్యసించుము. ॥౧౧॥

---

—• ౧౨వ అధ్యాయము ౧౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— నేను సంతసించుటకై జేయు కర్మము "మత్కర్మ" యనబడును. అది శ్రవణకీర్తనాది భాగవతధర్మము. దానియందే నిష్ఠకలవాడ వగుము. పూర్వోక్తాభ్యాససామర్థ్యము లేనిచో నానిమిత్తమై భాగవతధర్మరూపములగు కర్మలను జేసినను బ్రహ్మభావరూపమగు సిద్ధిని సత్త్వశుద్ధి జ్ఞానోత్పత్తి ద్వారమున పొందగలవు. ॥౧౦॥

శంకరానందీయము:— పూర్వోక్తాభ్యాసయోగముచే గూడ బ్రహ్మోపాసనమునం దసమర్థుడగు మందబుద్ధికి మరియొక సాధనమును జెప్పుచున్నాడు— సజాతీయప్రత్యయావృత్తిరూపాభ్యాసమునందుగూడ నీవసమర్థుడవగుచో దానిని జేయకయే నియమముగ వైదికము, లౌకికము నగు సర్వకర్మము స్వార్థము కించిత్తైనను గాకుండగ నానిమిత్తమే ప్రధానముగ కలవాడవై యగుము. (ఎట్లు రాజప్రీతికై భటుడు రాజకార్యమును నిర్వహించునో యట్లే నానిమిత్తమై సర్వకర్మమును జేయు మని యర్థము.) అట్లు చేయుచో గల్గు ఫలమును జెప్పుచున్నాడు— "మదర్థమపి...అవాప్స్యసి" నియమముగ శ్రద్ధతో నానిమిత్తమే కర్మలను జేయువాడైనను అట్టి కర్మానుష్ఠానముచే సంభావితచిత్తశుద్ధిజన్యజ్ఞానద్వారమున కైవల్యమును పొందగలడు. (ఈచెప్పుటచే నజ్ఞుడు ఈశ్వరోద్దేశముతో జేయు సర్వకర్మాచరణము అభ్యాసయోగమును బట్టిజూచిన సుఖసాధన మని సూచింపబడెను.) ॥౧౦॥

—• ౧౨వ అధ్యాయము ౧౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "అథైతత్...యతాత్మవాన్" బాహిరవిషయములచే నా

గీ॥ శ్రేయో హి జ్ఞాన మభ్యాసా జ్జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే।
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాన్తి రనంతరమ్॥ ॥౧౨॥

పదవిభాగము:— శ్రేయః- హి- జ్ఞానం- అభ్యాసాత్- జ్ఞానాత్- ధ్యానం- విశిష్యతే- ధ్యానాత్- కర్మఫలత్యాగః- త్యాగాత్- శాంతిః- అనంతరమ్॥ ॥౧౨॥

ప్రతిపదార్థము:— అభ్యాసాత్=అభ్యాసముకంటె; జ్ఞానం=జ్ఞానము; శ్రేయః=ప్రశస్యతరము; జ్ఞానాత్=జ్ఞానముకంటె; ధ్యానం=ధ్యానము; విశిష్యతే=ప్రశస్తమగుచున్నది; ధ్యానాత్=ధ్యానముకంటె; కర్మఫలత్యాగః=కర్మఫలమునువీడుట; విశిష్యతే=ప్రశస్తమగుచున్నది; త్యాగాత్=కర్మఫలత్యాగమువలన; అనంతరం=అనంతరమున; శాంతిః=సంసారోపరమరూపశాంతి; భవతి=యగుచున్నది. ॥౧౨॥

---

క్లిష్టమనస్కుఁడవై కర్మపరుడవు కాలేకుంటివేని నన్నే శరణముగా తలచినవాడవై సర్వకర్మసమర్పణరూప యోగము నాశ్రయించినవాడవై యింద్రియగ్రామము నరికట్టి వివేకవంతుడవై, సర్వకర్మఫలముల సన్యసింపుము. ॥౧౧॥

శంకరానందీయము:— నిరుక్తకర్మానుష్ఠానమునందుగూడ అసమర్థుడగు అత్యంతమందప్రజ్ఞునకు సాధనాంతరమును చెప్పుచు నెల్లపుడు నాయుపాసనమునే ముముక్షు వవశ్యము జేయదగునని సూచించుచుండెను. నే జెప్పిన విధముగ నన్నుద్దేశించి కర్మను చేయుట కసమర్థుడవగుచో "యతాత్మవాన్" కామసంకల్పములనుండి విముఖీకృతమైన మనస్సుకలవాడవై "మద్యోగ మాశ్రితః" ఈకర్మచే నీశ్వరుడు సంతసించుగాక. అని నాయందు (ఈశ్వరునియందు) నీవు జేయు సర్వకర్మలను సమర్పించుట యోగమనబడును. దీనినే సర్వకర్మసంన్యాస మందురు. ఇట్టియోగము నాశ్రయించినవాడవై. యనంతరము సర్వకర్మల యొక్కయు ఫలమును వీడుము. కర్మఫలములయందు గోరికను వీడుము.) పరార్థముచేయు కర్మలయందు ఫలకామన యెట్లు సంభవింపదో అట్లే నాకై సర్వకర్మల సమర్పించినచో ఫలకామనయు సంభవింపకుండును. అట్టివానికి ముక్తి సులభము. ఈచెప్పుటచే కర్మఫలమునందు కోరికనువీడి యీశ్వరార్పణబుద్ధితో విధ్యుక్తకర్మాచరణ మతిమూఢునకు గూడ సుకరమగు ముక్తిసాధనమని సూచింపబడెను. ॥౧౧॥

—• ౧౨వ అధ్యాయము ౧౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ప్రస్తుతము సాధనవిధానపర్యవసానమునకై యీసర్వకర్మఫలత్యాగమును స్తుతించుచుండెను— శబ్ద (శ్రుతి) యుక్తులచే గల్గిన యాత్మయాథాత్మ్యనిశ్చయము జ్ఞానమనబడును. అట్టి జ్ఞానము జ్ఞాననిష్పత్తికై జేయు శ్రవణమాపాభ్యాసముకంటె బ్రశస్యతరము. శ్రవణమననపరినిష్పన్నమగు జ్ఞానముకంటె నిదిధ్యాసనారూపమగు ధ్యానము బ్రహ్మసాక్షాత్కార మవ్యవధానముగ గల్గుటలో హేతువుగాన యుత్కృష్టము. ఈవిధముగ సర్వసాధనశ్రేష్ఠము జ్ఞానము. దానికంటెగూడ అజ్ఞకృతమగు కర్మఫలత్యాగ ముత్కృష్టము. నియతమనస్కునిచే చేయబడిన సర్వకర్మఫలత్యాగమువలన వ్యవధానము లేకుండగనే సహేతుకమగు సంసారముపశమించును. "యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది స్థితాః। అథ మర్త్యోఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే" అను మొదలగు శ్రుతులయందును, "ప్రజహాతి యదా కామాన్ సర్వాన్" ఇత్యాది స్థితప్రజ్ఞలక్షణములందును కామముల నన్నిటిని విడచుట మోక్షసాధనముగ నవగతమగుచున్నది. కర్మఫలములుగూడ కామనలే. గాన వాటిని విడచుటయు, కామత్యాగసామాన్యము ననుసరించి సర్వకర్మఫలత్యాగముతో స్తుతించెను. ॥౧౨॥

శంకరానందీయము:— నీవీవిధముగ నియమితమనస్కుఁడవై సర్వకర్మఫలత్యాగమును జేయు

శాంకరభాష్యమ్.—

ఇదానీం సర్వకర్మఫలత్యాగం స్తౌతి—శ్రేయో హి ప్రశస్యతరం జ్ఞానం కస్మా దవివేకపూర్వకా దభ్యాసా త్తస్మా దపి జ్ఞానా జ్జ్ఞానపూర్వకం ధ్యానం విశిష్యతే । జ్ఞానవతో ధ్యానా దపి కర్మఫలత్యాగో విశిష్యత ఇత్యనుషజ్యతే । ఏవం కర్మఫలత్యాగా త్పూర్వవిశేషణవతః శాంతి రుపశమ స్సహేతుకస్య సంసారస్యాఽనంతర మేవ స్యా న్నతు కాలాంతర మపేక్షతే । అజ్ఞస్య కర్మణి ప్రవృత్తస్య పూర్వోపదిష్టోపాయానుష్ఠానాశక్తౌ సర్వకర్మణాం ఫలత్యాగ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇపుడు సర్వకర్మఫలత్యాగమును "శ్రేయః" అను శ్లోకముచే స్తుతించుచుండెను అవివేకపూర్వకమైన యభ్యాసముకంటె జ్ఞానము ప్రశస్యతరము. జ్ఞానముకంటె జ్ఞానపూర్వకమైన ధ్యాన ముత్కృష్టము. జ్ఞానవంతునకు ధ్యానముకంటె కర్మఫలత్యాగ ముత్కృష్టము. జ్ఞానవంతునకు కర్మఫలత్యాగమువలన శాంతి అనగా సహేతుకమైన సంసారముయొక్క యుపశమము కర్మఫలత్యాగానంతరమే యగును. కాలాంతరము నపేక్షింపదు. (కాన కర్మఫలత్యాగ ముత్కృష్టము) కర్మయందు ప్రవృత్తమైన యజ్ఞానికి పూర్వమునం దుపదిష్టమైన

మని యుపదేశించి, అపండితుడగు ముముక్షువునకు ప్రవృత్తిసిద్ధినిమిత్తము రుచ్యుత్పాదమునకై సర్వకర్మఫలత్యాగమే మోక్షసాధనము లన్నిటిలో నుత్తమమైనదని స్తుతించుచుండెను— "శ్రేయోహి జ్ఞానమభ్యాసాత్" సర్వకర్మసంన్యాసపూర్వకము, యమనియమాదిశ్రమసాధ్యము నగు శ్రవణాద్యభ్యాసముకంటె శ్రవణమననసంభావితశ్రుతి, యుక్తిజన్యమగు బ్రహ్మాత్మైకత్వవేదనరూపమగు జ్ఞానము మోక్షమునకు శ్రేష్ఠతరమగు సాధనము. (ఇట "హి" అను పదము పైవిషయము సర్వశాస్త్రప్రసిద్ధమని తెల్పుటకై ప్రయుక్తము.) "జ్ఞానాద్ధ్యానం విశిష్యతే" ప్రతిబంధకసామగ్రీయుక్తమగు యీశాస్త్రజన్యజ్ఞానముకంటె సజాతీయప్రత్యయావృత్తిరూపమగు ధ్యానము శ్రేష్ఠము. (జన్మాదిహేతువగు అవిద్యాకామసంకల్పాదిప్రతిబంధకమును నివర్తింప జేయునదగుట ధ్యాన ముత్కృష్టసాధనమని భావము.) "ధ్యానా త్కర్మఫలత్యాగః" ఇట్టిధ్యానముకంటె కర్మఫలత్యాగ మెక్కుడు. (మనోనిశ్చలత యతిదుర్లభమగుటవలనను, విపరీతప్రత్యయనివారణమతిదుష్కరమగుటవలనను, నిరంతరప్రయత్నైకసాధ్యమగుటవలనను ధ్యానము మహత్తరక్లేశసాధ్యముగాన దానికంటె శక్తిననుసరించి చేసిన కర్మలయొక్క ఫలమును పరిత్యజించుట పూర్వోక్తశ్రమలు లేనిదగుటచేతను, మోక్షమునుగూర్చి యంతరంగసాధనమగుటచేతను శ్రేష్ఠము. కామనాశకత్వము రెంటియందు సమానమైనను, శ్రమరాహిత్యము ననుసరించి చూచినచో ధ్యానముకంటె కర్మఫలత్యాగము శ్రేష్ఠమని యర్థము.) "త్యాగాచ్ఛాంతిరనంతరం" సర్వకర్మఫలత్యాగానంతరము వెనువెంటనే యట్టి సర్వకర్మసంన్యాసియు, నియతచిత్తుడు, కామసంకల్పాదిదోషనిర్ముక్తుడు, శుద్ధబుద్ధియునగు కర్మయోగికి సంసారోపశమరూపమోక్షము సిద్ధించునని యర్థము.

కర్మఫలత్యాగమాత్రముననే మోక్షము సిద్ధించుచో "తరతి శోక మాత్మవిత్ తమేవం విద్వానిహ భవతి. నాన్యః పంథా విద్యతేఽయనాయ" ఈ మొదలగు బహుశ్రుతులకు విరోధము, "జ్ఞానము చేతనే మోక్షము" అనుసర్వశాస్త్రజ్ఞ సమయమునకు విరోధము వాటిల్లునందువా? అట్లుకాదు. "త్యాగాచ్ఛాంతి రతః పరమ్" అను వాక్యము కర్మఫలత్యాగమును స్తుతించుటకై విన్యసింపబడినది. అట్లు స్తుతించుట ముముక్షువు లగు మందప్రజ్ఞుల ప్రవృత్తిప్రరోచమునకు నుపయుక్తమగును. "అథ చిత్తం సమాధాతుం" అనునది మొద

శాంకరభాష్యమ్:—

శ్రేయస్సాధన ముపదిష్టం న ప్రథమ మేవాతశ్చ శ్రేయో హి జ్ఞాన మభ్యాసా దిత్యుత్తరోత్తరవిశిష్టత్వోపదేశేన సర్వకర్మఫలత్యాగ స్స్తూయతే సంపన్నసాధనానుష్ఠానాశక్తౌ వనుష్ఠేయత్వేన శ్రుతత్వాత్ । కేన సాధర్మ్యేణ స్తుతిత్వం "యదా సర్వే ప్రముచ్యంతే" ఇతి సర్వకామ ప్రహాణా దమృతత్వ ముక్తం త త్ప్రసిద్ధమ్ । కామాశ్చ సర్వే శ్రౌతస్మార్తసర్వకర్మణాం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యుపాయముల యందు శక్తిలేనిచో సర్వకర్మల ఫలత్యాగము శ్రేయస్సాధన మని యుపదిష్టము ప్రథమముననే కాదు. అందువలననే "శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్" అని యుత్తరోత్తరమున కుత్కృష్టత్వముయొక్కయుపదేశముచే సంపన్నసాధనానుష్ఠానమునందు శక్తిలేనిచో ననుష్ఠేయముగ శ్రుతమగుటవలన సర్వకర్మఫలత్యాగము అనుష్ఠేయమని స్తుతింపబడుచుండెను. దేనితో సమానమగు ధర్మము కలదగుటచే కర్మఫలత్యాగమును స్తుతించుచుంటివి? అనెదవా? "యదా సర్వే ప్రముచ్యన్తే" అను శ్రుతిచే సర్వకామములను విడచుటచే నమృతత్వము సిద్ధించు నని చెప్పబడిన విషయము ప్రసిద్ధము. ఇట కామములన శ్రౌతస్మార్తకర్మఫలములు.

లు కొని ముముక్షువు, అతిమందప్రజ్ఞుడును, నాఅభ్యాసమందుగాని, ఈశ్వరోద్దేశముతో జేయదగు కర్మయందుగూడ అశక్తుడగువానికి చిత్తము శుద్ధమగుటకై కర్తవ్యముగా కర్మఫలత్యాగము చెప్పబడెను. ఇదియే ముఖ్యసాధనమగుచో ప్రధానముగనే నిర్దేశించియుండును. మరియు "మత్కర్మకృ న్మత్పరమః" అను సాధనపంచకమును చెప్పుటయు వ్యర్థమగును. "ఆత్మావారే ద్రష్టవ్యః" అని యాత్మసాక్షాత్కారము నుద్దేశించి చేయబడిన శ్రవణాదివిధికి యానర్థక్యము సంభవించెడిని. కాన నిట కర్మఫలత్యాగస్తుతియే చేయబడెనని నిశ్చయింపనగును. తాను జేసిన కర్మలను పరమేశ్వరున కర్పించినచో దిరిగి వానియందు కామముగాని, సంకల్పముగాని సంభవింపనేరదు. కామసంకల్పములు పుట్టకుండుటయే చిత్తము శుద్ధమగుట యనబడును. అట్టి చిత్తశుద్ధి కలిగినచో నొకమా రుపదేశించినంతమాత్రముననే జ్ఞానముకలిగి, దానిచే మోక్షము సిద్ధించునని యూహించి యుపాయముతో గూఢతమముగా తననిమిత్తమై యర్పింపబడు కర్మయందు ప్రవర్తింపజేయుటకై యిట కర్మఫలత్యాగము స్తుతింపబడెను. కాన నిట శ్రుతివిరోధముగాని, సమయవిరోధముగాని ప్రాప్తింపనేరవు.

లేక, "మయ్యేవ మన ఆధత్స్వ" అనునది మొదలుకొని "సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్" అనునది యంతముగా గల గ్రంథభాగముచే ముముక్షువులకు చిత్తశుద్ధికై పరమ కారణమును అధికారిభేదము ననుసరించి గురు, లఘుక్రమము ననుసరించి వేర్వేరుగ సగుణోపాసనమును కర్తవ్యముగ ప్రతిపాదించి, ప్రస్తుతము సగుణోపాసనముచే బరిశుద్ధాంతఃకరణునకు ఆయుపాసనాఫలభూత మగు అక్షరోపాసనమును కర్తవ్యముగ బోధించుటకై తదుపాసనమునకు శ్రవణాదులకు ఉత్తరోత్తరోత్కర్షను ప్రతిపాదించుచుండెను. పరిశుద్ధాంతఃకరణు డగు ముముక్షువునకు సగుణోపాసనల యన్నిటికంటె శ్రవణరూపాభ్యాస ముత్తమసాధనము. "జ్ఞానా దేవ తు కైవల్యం" అను శ్రుత్యుక్తరీతిని "తు" శబ్దముచే నితరవ్యావృత్తిపూర్వకముగ జ్ఞానమే సాక్షాన్మోక్షసాధనమని నిశ్చయింపబడుటచే జ్ఞానసిద్ధికి పరమకారణము శ్రవణాదికమే యగును. జ్ఞానహేతు వగు శ్రవణాదికమే లేనిచో పూర్వోపాసనలు నిష్ఫలములే యగును. కాన అట్టి సగుణోపాసనములకంటె శ్రవణాద్యభ్యాసమునకు శ్రేష్ఠత్వము చెప్పుట యుక్తము. మోక్షైక కాము డగు పరిశుద్ధాంతఃకరణునకు సర్వకర్మసంన్యాసపూర్వకముగ శ్రవణాద్యభ్యాసమే చేయ దగు నని "శ్రేయః" అను ఉక్తిచే

శాంకరభాష్యమ్:—

ఫలాని । తత్త్యాగే చ విదుషో జ్ఞాననిష్ఠస్యానంతరైవ శాంతి రితి సర్వకామత్యాగసామాన్యమజ్ఞకర్మఫలత్యాగస్యాస్తీతి తత్సామాన్యాత్సర్వకర్మఫలత్యాగస్తుతి రియం ప్రరోచనార్థా । యథాఽగస్త్యేన బ్రాహ్మణేన సముద్రః పీత ఇదానీంతనా అపి బ్రాహ్మణా బ్రాహ్మణత్వసామాన్యాత్ స్తూయంతే । ఏవం కర్మఫలత్యాగాత్కర్మయోగస్య శ్రేయస్సాధనత్వమభిహితమ్ ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వానిని విడచినచో బ్రహ్మవేత్తయగు జ్ఞానికి వెనువెంటనే సంసారోపరమరూపమగు శాంతి సంభవించునుగాన అజ్ఞకృతకర్మఫలత్యాగమునకు సర్వకర్మత్యాగముతో సామాన్యము కలదుగాన యాసామ్యమును పురస్కరించుకొని ప్రరోచనార్థమై సర్వకర్మఫలత్యాగము స్తుతింపబడెను. ఎట్లు బ్రాహ్మణు డగు అగస్త్యునిచే సముద్రపానము చేయబడినందున బ్రాహ్మణసామాన్యమునను సరించి ప్రస్తుతమున్న బ్రాహ్మణులుగూడ స్తుతింపబడుచుందురో యట్లే కర్మఫలత్యాగమువలన కర్మయోగమునకు శ్రేయస్సాధనత్వము చెప్పబడెను. ॥౧౨॥

బోధింపబడెను. "ఆత్మా వా అరే ద్రష్టవ్యః సోఽన్వేష్టవ్యః" అనియు "సంన్యస్య శ్రవణం కుర్యాత్" అనియు శ్రుతిస్మృతిప్రసిద్ధిద్యోతనమునకై యిట "హి" శబ్దము ప్రయోగింపబడెను. "శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్" శ్రవణాద్యభ్యాసముకంటె తజ్జన్య మగు బ్రహ్మాత్మైకత్వగ్రాహక మగు జ్ఞానము శ్రేష్ఠతరము. (జ్ఞానమే కలుగనిచో నభ్యాసము నిష్ఫలమే యగునుగాన శ్రవణాద్యభ్యాసముకంటె జ్ఞానము శ్రేష్ఠతరమని యర్థము.) ఇట గూడ "శ్రేయః" అనుపదముచే బ్రహ్మవేత్తలగు అనేకుల సన్నిధిలో ననేకవిధములుగ శ్రవణము జేసి యవశ్యము జ్ఞానము సంపాదింపదగు నని బోధింపబడెను. "జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే" ప్రతిబంధసహిత మగు అట్టి జ్ఞానముకంటె "తత స్తుతం నిష్కలం ధ్యాయమానః" అను శ్రుతి చొప్పున ప్రతిబంధవిఘటకమై యాత్మసాక్షాత్కారహేతువగు ధ్యానము శ్రేష్ఠమయినది. "ధ్యానాత్కర్మఫలత్యాగః" ప్రత్యగ్వృత్తివాసన కర్మయే యగుటచే ఈదృశ్యజాతము నంతను యేది ఫలింపజేయుచున్నదో యది కర్మఫల మనబడును. దాని త్యాగము అనగా నిత్యనిరంతరనిర్వికల్పసమాధినిష్ఠచే నంతటను అన్నివిధములుగను బ్రహ్మమాత్రోపలంభము కర్మఫలత్యాగ మనబడును. అట్టి స్థితి ధ్యానముకంటె నెక్కువది యగును. "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్" అను శ్రుతిచొప్పున నిరవశేషితసర్వవిశేషములు గల కర్మఫలత్యాగము (నిర్వికల్పసమాధిస్థితి) ధ్యాన, ధ్యేయ, ధ్యాతృరూపత్రిపుటి కల ధ్యానము కంటె శ్రేష్ఠమగుట యుక్తము. "త్యాగా చ్ఛాంతి రనంతరం" సర్వకర్మఫలత్యాగరూప మగు నిర్వికల్పకసమాధిచే విశ్లేషవిశిష్టవిపరీతవాసనాగ్రంథులు గల బ్రహ్మవేత్తకు ఈదేహపాతానంతరమే ఆత్యంతికసంసారోపరమరూపము, బ్రహ్మాత్మనా అవస్థానరూపము నగు విదేహకైవల్యము సిద్ధించునని యర్థము. ధ్యాన, కర్మఫలాధిక్యస్థలముల రెంటియందును "విశిష్యతే" అని చెప్పుటచే మోక్షైకకాముడు నిష్ప్రత్యూహముగ జ్ఞానసిద్ధికై యధికారానురూపముగ సవికల్పకసమాధిని గాని, నిర్వికల్పకసమాధిని గాని యవశ్యమాచరింపదగు నని బోధింపబడెను. ॥౧౨॥

గీ॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ ॥ ॥౧౩॥

పదవిభాగము:— అద్వేష్టా- సర్వభూతానాం- మైత్రః- కరుణః- ఏవ- చ- నిర్మమః- నిరహంకారః- సమదుఃఖసుఖః- క్షమీ ॥ ॥౧౩॥

ప్రతిపదార్థము:— సర్వభూతానాం=సమస్తభూతములకు; అద్వేష్టా=ద్వేషింపనివాఁడై; మైత్రః=మైత్రికలవాఁడై; కరుణఏవచ=దయాయుక్తుఁడై; నిర్మమః=మమతాశూన్యుఁడై; నిరహంకారః=అహంకారము లేనివాఁడై; సమదుఃఖసుఖః=సమములైనదుఃఖసుఖములుకలవాఁడై; క్షమీ=క్షమావంతుఁడై. ॥౧౩॥

—• ౧౨వ అధ్యాయము ౧౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పైవిధముగ మందాధికారినిగూర్చి అతిదుష్కరముగుటచే నక్షరోపాసననిందచే సుకరమగు సగుణోపాసనమును చెప్పి, అశక్తితారతమ్యానువాదముచే నితరములగు సాధనములనుగూడ శ్రీకృష్ణభగవానులు “మందాధికారి సర్వప్రతిబంధములు తొలఁగి యుత్తమాధికారియై యక్షరవిద్యయం దెట్లు ప్రవిష్టుఁడగునా? అను యూహతో జెప్పుచుండెను— ఫలసిద్ధికై సాధనసంపాదనమే యావశ్యకము. ఈవిషయ మిట్లు చెప్పబడెను— “నిర్విశేషం పరం బ్రహ్మ సాక్షాత్కర్తు మనీశ్వరాః । యే మందా స్తేఽనుకంప్యంతే సవిశేషనిరూపణైః ॥ వశీకృతే మన స్యేషాం సగుణబ్రహ్మశీలినాం । తదేవావిర్భవే త్సాక్షా దపేతోపాధికల్పనమ్” (నిర్విశేషపరబ్రహ్మసాక్షాత్కారాసమర్థు లగు మందాధికారుల ననుగ్రహించుటకై సవిశేషబ్రహ్మము నిరూపింపబడెను. ఈసగుణబ్రహ్మోపాసకులకు మనస్సు వశీకృతమయిన యానిర్విశేషపరబ్రహ్మోపాసనము సిద్ధించునని యర్థము.) ఈవిషయమునే పతంజలిమహర్షియు “సమాధిసిద్ధి రీశ్వరప్రణిధానాత్” “తతః ప్రత్యక్చేతనాధిగమో ప్యంతరాయాభావశ్చ” అనుసూత్రములచే జెప్పెను. ఇట అక్షరోపాసనమును నిందించుట సగుణోపాసనమును స్తుతించుటకై చెప్పబడినదిగాని, అక్షరోపాసనను నిందించుటకై నిర్దేశింపబడలేదు. “నహి నిందా నింద్యం నిందితుం ప్రవర్తతేఽపి తు విధేయం స్తోతుమ్” (నిందింపదగినవానిని నిందించుటకై నింద ప్రవర్తింపదు. ఇక నేమన, స్తుతింపదగినవానిని స్తుతించుటకై నింద యుపయోగించును.) అను న్యాయ మిట జూడదగును. కాన అక్షరోపాసకులే వస్తుతః యోగిశ్రేష్ఠులు. “ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః । ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్” ఈ మొదలగు గ్రంథముచే వారి ప్రాశస్త్యమే చెప్పబడెను. అట్టివారి జ్ఞానమును, ధర్మజాతమును నీవు అధికారివై యనుసరింపదగు నని యర్జునునికి దెల్పదలచినవాఁడై శ్రీకృష్ణభగవానులు అభేదదర్శులు, కృతకృత్యులు నగు అక్షరోపాసకులను ఏడుశ్లోకములచే స్తుతించుచుండెను— “అద్వేష్టా సర్వభూతానాం” సర్వభూతములను యాత్మగా జూచుచు తనకు దుఃఖహేతువు ప్రాప్తించినను ప్రతికూలబుద్ధి లేనివాఁడుగాన సర్వభూతములను ద్వేషింపనివాఁడై. “మైత్రః” స్నేహభావము గలవాఁడై, “కరుణః” దుఃఖితులయెడ దయ కలవాఁడై (ఇట్టి సర్వభూతాభయదాత పరమహంసపరివ్రాజకుఁడగును.) “నిర్మమః” తనదేహమునందును గూడ “నాది” యను మమత లేనివాఁడై, “నిరహంకారః” వృత్తస్వాధ్యాయాదికృతమగు యహంకారము లేనివాఁడై “సమదుఃఖసుఖః” రాగద్వేషములకు ప్రవర్తకుడు కాకుండుటచే సుఖదుఃఖములయందు సముఁడై కనుకనే “క్షమీ” ఆక్రోశనతాడనాదికముచేగూడ వికారమును పొందనివాఁడై (ముందుశ్లోకముతో నన్వయము.) ॥౧౩॥

శంకరానందీయము:— ఎవఁడు విదేహకైవల్యము నొందదలచినవాఁడై, అద్వేష్టృత్వాది ధర్మసంపన్నుఁడై, బ్రహ్మనిష్ఠయందే యుండునో యాతఁడే నాభక్తుఁడును, ప్రియుఁడును అని యతులకు లెస్సగ

శాంకరభాష్యమ్:—

అతః చాత్మేశ్వరభేద మాశ్రిత్య విశ్వరూప ఈశ్వరే చేతస్సమాధానలక్షణో యోగ ఉక్త ఈశ్వరార్థం కర్మానుష్ఠానాదిచ । "అథైత దప్యశక్తోసి" ఇత్యజ్ఞానకార్యసూచనా న్నాభేద దర్శినోఽక్షరోపాసకస్య కర్మయోగ ఉపపద్యత ఇతి దర్శయతి । తథా కర్మయోగినోఽక్షరోపాసనానుపపత్తిం దర్శయతి భగవాన్ "తే ప్రాప్నువంతి మా మేవ" ఇతి । అక్షరోపాసకానాం కైవల్యప్రాప్తౌ స్వాతంత్ర్య ముక్త్వేతరేషాం పారతంత్ర్య మీశ్వరాధీనతాం దర్శితవాం స్తేషామహం సముద్ధర్తేతి । యది హీశ్వరస్యాత్మభూతా స్తే మతా అభేదదర్శిత్వా దక్షరరూపా ఏవ త ఇతి సముద్ధరణకర్మవచనం తా న్ప్రత్య పేశలం స్యాత్। యస్మా చ్చార్జునస్యాత్యంత మేవ హితైషీ భగవాం స్తస్య సమ్యగ్దర్శనానన్వితం కర్మయోగం భేదదృష్టిమంత మేవోపదిశతి । న చాత్మాన మీశ్వరం ప్రమాణతో బుద్ధ్వా కస్యచి ద్గుణభావం జిగమిషతి కశ్చి ద్విరోధాత్ । తస్మా దక్షరోపాసకానాం సమ్యగ్దర్శననిష్ఠానాం సంన్యాసినాం త్యక్తసర్వైషణానాం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇట ఆత్మేశ్వరభేదము నాశ్రయించి, విశ్వరూపుడగు యీశ్వరునియందు చేతస్సమాధానరూప మగు యోగమును, యీశ్వరప్రీతికై కర్మలను జేయుమనియు జెప్పబడెను. "అథైత దప్యశక్తోసి" అని యజ్ఞానకార్యము సూచింపబడుటచే నభేదదర్శియగు అక్షరోపాసకునకు కర్మయోగ ముపపన్నము కాదని సూచించెను. అట్లే కర్మయోగికి అక్షరోపాసన ముపపన్నము గాదని శ్రీకృష్ణభగవానులు తెలిపెను. "తే ప్రాప్నువంతి మా మేవ' అని అక్షరోపాసకులకు కైవల్యప్రాప్తివిషయమున స్వాతంత్ర్యమును జెప్పి, "తేషా మహం సముద్ధర్తా" అని తదితరులకు-సగుణోపాసకులు పరతంత్రులగుటవలన ఈశ్వరాధీనత్వము జూపెను. అక్షరోపాసకులు ఈశ్వరునకాత్మభూతులుగనే యభిమతులుగాన యభేదదర్శులగు అట్టివారు అక్షరస్వభావులే కాన "వారిని నేనుద్ధరించువాడను" అని చెప్పుట సమంజసము కానేరదు. అర్జునునకు అత్యంతహితైషి యగుట శ్రీకృష్ణభగవానులు సమ్యగ్దర్శనలేశశూన్యజ్ఞానము కలుగుటకై బ్రహ్మనిష్ఠ చేయదగునని సూచించుటకై బ్రహ్మవేత్తను స్తుతించుచుండెను.— "అద్వేష్టా" సర్వప్రాణులను ద్వేషింపనివాడై, (ఇట ద్వేషమనగ యప్రీతి, అట్టి యప్రీతిని తనకు ఉపద్రవమును జేసెడి ఏప్రాణియందును మనోవాక్కాయకర్మలచే నాచరింపనివాడు, అద్వేష్టయనబడును. నిర్వికల్పసమాధినిష్ఠచే సమస్తభేదప్రత్యయములను నిర్మూలించి నేనే యీ సర్వము నను సర్వాత్మభావము నొందిన బ్రహ్మవేత్తకు ద్వైతప్రత్యయమే కలుగక స్వస్వరూపమగు యంతటను ప్రీతికలవాడగుటచే ద్వేషబుద్ధియే కలుగనందున బ్రహ్మవేత్తయగు యతి సర్వభూతములయెడ అద్వేష్టయే యగును. ఒకచో రాగమున్నచో తదపకారులయందు ద్వేషము కలుగును. సర్వాత్మభావాపన్ననకొకనియందును రాగము సంభవింపదుగాన సర్వభూతములను ద్వేషింపకుండుట యుక్తము. "అద్వేష్టా" అని చెప్పుటచే బ్రహ్మవేత్తలు ముక్తులగుటలో రాగద్వేషాద్యభావరూపప్రతిబంధకాభావము చూపబడెను.) "మైత్రః" సర్వభూతములయెడను మిత్రునివలె స్నేహభావముతో వర్తించువాడై, (బ్రహ్మవేత్త స్వాత్మభూతములగు సర్వభూతములయెడను మిత్రునివలె యుండుట యుక్తము.) అట్టి మిత్రత్వము సిద్ధించుటకు కారణమును చెప్పుచున్నాడు,— "కరుణః" సర్వభూతములయందును ద్వేషబుద్ధి యెట్లు బంధకమగునో అట్లే గుణబుద్ధియు బంధకమే యగును. గాన

శాంకరభాష్యమ్:—

"అద్వేష్టా సర్వభూతానాం" ఇత్యాదిధర్మపూగం సాక్షా దమృతత్వకారణం వక్ష్యా మీతి ప్రవర్తతే— అద్వేష్టా సర్వభూతానాం న ద్వేష్టాఽఽత్మనో దుఃఖహేతు మపి న కించి ద్ద్వేష్టి సర్వాణి భూతా న్యాత్మత్వేన హి పశ్యతి । మైత్రో మిత్రభావో మైత్రీ మిత్రతయా వర్తత ఇతి మైత్రః । కరుణ ఏవ చ కరుణా కృపా దుఃఖితేషు దయా తద్వాన్కరుణ స్సర్వభూతాభయప్రదః సంన్యాసీత్యర్థః । నిర్మమో మమప్రత్యయవర్జితో నిరహంకారో నిర్గతాహంప్రత్యయః । సమదుఃఖసుఖః సమే దుఃఖసుఖే ద్వేషరాగయో రప్రవర్తకే యస్య స సమదుఃఖసుఖః క్షమీ క్షమావా నాకృష్టోఽభిహతో వాఽవిక్రియఏవాఽఽస్తే ॥ ॥౧౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మును, భేదదర్శనము కలదియు నగు కర్మయోగము నే యుపదేశించెను. ఏమనః ప్రాజ్ఞు డగువాడెవడును తనను ప్రమాణముననుసరించి యీశ్వరునిగ దెలిసికొని గుణభావమును (శేషభావమును) పొందుట కిచ్చగింపకుండును (నేనీశ్వరుడనే యనుకొనువాడు తానే యీశ్వరుడగుటచే భక్తితో నీశ్వరుని భజింపడు. సేవ్యసేవకభావ ముభయనిష్ఠముకదా! కాన జ్ఞాని తనను శేషిగనే తలచునుగాని, శేషభూతునిగ తలువడు. కనుక అభేదదర్శికి విశ్వరూపోపాసనాదికర్మయోగ ముపపన్నము గానేరదు. కాన భేదదర్శి నుద్దేశించియే యిట యర్జునునకు హితైషియగు శ్రీకృష్ణభగవానులు కర్మయోగము నుపదేశించె నని యర్థము.) ఇకనక్షరోపాసకులు, సమ్యగ్దర్శననిష్ఠులు, సంన్యాసులు, త్యక్తసర్వైషణులు నగువారికి సాక్షాన్మోక్షసాధన మగు ధర్మసముదాయమును జెప్పుటకై ప్రవర్తించుచున్నాడు. సర్వభూతములను స్వాత్మనుగనే చూచునుగాన తనకు దుఃఖహేతు వగు దేనినిగూడ ద్వేషింపనివాడై, మిత్రత్వముతో నుండువాడై, (దుఃఖితులయెడ దయావిశిష్టుడై, సర్వభూతాభయప్రదుడైన సంన్యాసియై) మమజ్ఞానశూన్యుడై, అహంప్రత్యయము లేనివాడై, రాగద్వేషప్రవర్తకము లగు దుఃఖసుఖములయెడ సముడై, ఆకృష్టుడైగాని తాడితుడైగాని వికృతినొందక యవిక్రియుడువలె నుండుటకు కారణమగు క్షమకలవాడై. ॥౧౩॥

యట్టి గుణబుద్ధితోగాక కేవల కరుణతోడనే యందరియెడ నానుకూల్యముతోనుండువాడై, ఈయద్వేష్టృత్వాది ధర్మత్రయము సిద్ధించుటకై కారణమును చెప్పుచున్నాడు.— "నిర్మమః" పరదేహమునం దెట్లు మమకారముండదో యట్లే తన దేహమునందుగూడ మమతారహితుడై (రాగద్వేషాదిహేతువగు మమతాబంధనము నుండి వినిర్ముక్తుడని యర్థము.) మమకారము లేకుండుటచేతనే యద్వేష్టృత్వాది ధర్మత్రయము సిద్ధించును. నిర్మమత్వసిద్ధికై కారణమును జెప్పుచున్నాడు.— "నిరహంకారః" నేనే బ్రహ్మమును, అను పరబ్రహ్మమునందు కలిగిన యాత్మభావాపత్తిచే తనదేహమునుండి నిశ్శేషముగ నిర్గతమైన యహంకారము కలవాడై, (నిరంతరబ్రహ్మనిష్ఠచే బ్రహ్మమునందే నిరూఢమైన యాత్మబుద్ధి కలవాడగుట దేహాదికమునం దహంభావము విచ్ఛిన్నమగును. కనుకనే నిర్మమత్వము సిద్ధించును. దేహమునం దహంబుద్ధి యున్నచో మమతకొంచెమైనను తొలగకుండును. కాన దేహమునం దహంభావము లేకుండుటచేతనే విద్వాంసునకు నిర్మమత్వము సిద్ధించును.) కనుకనే "సమదుఃఖసుఖః" బ్రహ్మనిష్ఠతో నుండువాడగుటచే ద్వేష, రాగములకు కారణములగు దుఃఖ, సుఖములను, అనిష్టత్వ, ఇష్టత్వ బుద్ధిని విడినవాడై యొకేవిధముగ గ్రహించినవాడై, (సుఖదుఃఖములు ప్రాప్తింప

గీ॥ సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః ॥ ॥౧౪॥

పదవిభాగము:— సంతుష్టః- సతతం- యోగీ- యతాత్మా- దృఢనిశ్చయః- మయి- అర్పితమనోబుద్ధిః- యః- మద్భక్తః- సః- మే- ప్రియః ॥ ॥౧౪

ప్రతిపదార్థము:— సతతం=నిత్యము; సంతుష్టః=సంతుష్టికలవాడై; సతతం=నిత్యము, యోగీ=సమాహితచిత్తుడై; యతాత్మా=సంయతస్వభావముకలవాడై; దృఢనిశ్చయః=దృఢమైనస్వభావముకలవాడై; మయి=నాయందు; అర్పితమనోబుద్ధిః=అర్పింపబడినమనస్సు, బుద్ధికలవాడై; యః=ఏవడు; మద్భక్తః=నాభక్తుడో; సః=అట్టివాడు; మే=నాకు; ప్రియః=ఇష్టుడు. ॥౧౪॥

శాంకరభాష్యమ్:—

సంతుష్ట ఇతి । సంతుష్ట స్సతతం నిత్యం దేహస్థితికారణస్య లాభేఽలాభే చోత్పన్నాఽలంప్రత్యయ స్తథా గుణవల్లాభే విపర్యయే చ సంతుష్ట స్సతతం యోగీ సమాహితచిత్తో యతాత్మా సంయతస్వభావో దృఢనిశ్చయో దృఢః స్థిరో నిశ్చయోఽధ్యవసాయో యస్యాఽఽ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దేహస్థితికారణ మగునదిగూడ లభించినను, లభింపకున్నను నిత్యము అలంప్రత్యయశోభితుడై, మరియు గుణవత్తగునది లభించినను లభింపకున్నను నిత్యము సంతసించువాడై, నిత్యము సమాహితచిత్తుడై స్వభావము నరికట్టినవాడై, ఆత్మతత్త్వముయెడ దృఢమగు

పూర్వవిషాదశూన్యుడై) సుఖదుఃఖములయెడ సామ్యబుద్ధి సిద్ధించుటకు— "క్షమీ" ఆధ్యాత్మికాదిదుఃఖము అను సంతాపవిలాపనరహితముగ సహించు స్వభావము కలవాడై, (ఈవిషయమునే "వృక్ష ఇవ తిష్ఠాసే చ్ఛిద్యమానో న కుప్యేత న కంప్యేత" అను శ్రుతి చెప్పుచున్నది.) ముందు శ్లోకముతో నన్వయము. ॥౧౩॥

—• ౧౨వ అధ్యాయము ౧౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మరియు, "సంతుష్ట స్సతతం" శరీరస్థితి కారణమగునది ప్రాప్తించినను, ప్రాప్తింపకున్నను యెల్లపుడు నలంప్రత్యయము గలవాడై, "యోగీ" సమాహితచిత్తుడై, "యతాత్మా" నియమితమైన శరీరేంద్రియసంఘాతము కలవాడై, "దృఢనిశ్చయః" కుతార్కికులకు తిరస్కరించుటకు అశక్యమగుటచే స్థిరమగు "నేను అకర్త భోక్త సచ్చిదానందాద్వితీయబ్రహ్మనైతి" నను నిశ్చయము కలవాడై, "మయి...ప్రియః" నాయందు (శుద్ధబ్రహ్మమునందు) అర్పింపబడిన యంతఃకరణము కలవాడై యెవడు శుద్ధాక్షరబ్రహ్మవేత్తయై యుండునో వాడు సదాత్మగాన నాకు ప్రియుడు. ॥౧౪॥

శంకరానందీయము:— బ్రహ్మవేత్త యెట్లుండదగునో చెప్పుచున్నాడు— "సంతుష్ట స్సతతం" సుఖదుఃఖములు ప్రాప్తించినను మానావమానములు ప్రాప్తించినను, లాభాలాభములు ప్రాప్తించినను, సర్వదా బ్రహ్మానందానుభూతిచే సంతోషయుక్తుడై, (ఇట"సతతం" అను పదము విశేషణపంచకముతో సంబంధించును.) అట్లుండుటకు సాధనమును చెప్పుచున్నాడు— "యోగీ" సర్వదా ఆనందాత్మయగు బ్రహ్మమునందే చిత్తనైశ్చల్యముతో నుండుటయే యోగము, అట్టియోగముకలవాడై, (సదాఆత్మారాముడై యని యర్థము.) అట్టి యోగిత్వ మెట్లు సిద్ధించునందునా? "యతాత్మా" "సమం కాయశిరోగ్రీవ" మిత్యాద్యుక్తలక్షణానుసారమ్ స్థాపితమైన శరీరముకలవాడై, (కార్యకరణసంఘాతమును నిరోధించినవా

శాంకరభాష్యమ్.—

త్మతత్త్వవిషయే స దృఢనిశ్చయో మయ్యర్పితమనోబుద్ధి స్సంకల్పాత్మకం మనోఽధ్యవసాయ లక్షణా బుద్ధి స్తే మయ్యేవార్పితే స్థాపితే యస్య సంన్యాసినః స మయ్యర్పితమనోబుద్ధి ర్య ఈదృశో మద్భక్తః స మే ప్రియః "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః" ఇతి సప్తమేఽధ్యాయే సూచితం త దిహ ప్రపంచ్యతే ॥ ॥౧౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

నిశ్చయముకలవాడై, స్వసంకల్పవికల్పాత్మకమగు మనస్సును, నిశ్చయరూపమైనబుద్ధినినాయందే యర్పించినవాడై, నాభక్తుడై (ఆత్మనిష్ఠుడై,) యెవ డుండునో అట్టివాడు నాకు ప్రియుడు. "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః" అని సప్తమాధ్యాయమున సూచితమయినదాని నిట వివరించుచుండెను. ॥౧౪॥

సమాధి సిద్ధించును. అట్టి సమాధివంతునకే విపరీతప్రత్యయనాశమగును. దానివలననే సమ్యగ్ జ్ఞానము, అట్టి జ్ఞానవంతునకే విదేహముక్తి సంభవించునుగాన బ్రహ్మవిద్యతి సర్వకాలములయందును, సమాధితో నుండదగు నని సూచింపబడెను)

లేక, "యతః నిరుద్ధః ఆత్మా స్వభావః వాసనా యస్య స యతాత్మా" నిరుద్ధమైన స్వభావము (వాసన) కలవాడై, "యతాత్మా యోగీ" అను విశేషణద్వయముచే నిశ్చలయోగసిద్ధికి కారణమును జెప్పుచున్నాడు- "దృఢనిశ్చయః" నిరంతరసమాధిసంజనిత సమ్యగ్ జ్ఞానమునకు విషయభూతమగు బ్రహ్మమునందే ఆత్మత్వానుభూతితో గూడినవాడై, "నేనే బ్రహ్మమును. సంసారిని కాను" అను దృఢమగు (ప్రమాణాంతరప్రత్యయములచే భిన్నముగాని,) స్వభావముకలవాడై, (మూఢుడు తన దేహమునం దెట్లుఅహంబుద్ధికలవాడగునోయట్లే బ్రహ్మమునం దహంబుద్ధికలవాడై, యని యర్థము.)

లేక, "దృఢనిశ్చయః" నిత్యనిరంతరసమాధినిష్ఠచే నధిష్ఠానయథాత్మ్యజ్ఞానము కలుగును. దాని నారోపితవస్తువు, దద్వస్తుప్రత్యయము తొలగిన "ఈసర్వము నేను బ్రహ్మస్వరూపమే అని సర్వమునకు తనకు సాక్షాద్బ్రహ్మమాత్రత్వాధిగమరూపము, ప్రమాణాంతరాబాధితము నగు వస్తుతత్త్వావధారణరూపమగు దృఢ నిశ్చయము కలవాడై, అట్టి దృఢనిశ్చయము కలుగుటకు కారణమును. జెప్పుచున్నాడు.—"మయ్యర్పితమనో బుద్ధిః" అహంవృత్తి బుద్ధియనబడును. ఇదంవృత్తి మనస్సనబడును ఇదమహమాత్మికమగు మనోబుద్ధులను ప్రత్యగభిన్నము, పరిపూర్ణము నగు బ్రహ్మమునం దర్పించి సర్వదా నన్నే విషయముగ జేసుకొనినవాడై, నాభక్తుడై (మదనుసంధానుపరుడై) యెల్లప్పుడు అంతటను బ్రహ్మమాత్రత్వము జూచెడు వాడు నాకు ప్రియుడు. లోకమున తనకు తాను నిర్నిమిత్తముగ ప్రియుడగును. గాన అట్టివాడు ఆత్మస్వరూపుడు గాన నాకు (ఈశ్వరునకు) ప్రియుడు. ఇతరులన్నచో ఆయానిమిత్తముల ననుసరించి ప్రియులగుదురని యర్థము. ఈవిషయమే "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్" అను దానిచే చెప్పబడెను. "ప్రియో హి జ్ఞానినో త్యర్థ మహం సచ మమప్రియః" అను దానిచే జెప్పబడిన యర్థము చెప్పబడెను. శుద్ధాత్ములు, వివేకవంతులునగు సూక్ష్మబుద్ధులకు "మేము గూడ బ్రహ్మభావము నొంది యీశ్వరునకు ప్రియుల మయ్యెదము., అను భావముతో శ్రవణ మనన నిదిధ్యాసన సమాధులయందు ప్రవృత్తులయ్యెదరను యూహతో నట్లు తిరిగి చెప్పెను. కాన నిట పునరుక్తి దోషావహము కాదు. ॥౧౪॥

గీ॥ యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః ॥ ॥౧౫॥

పదవిభాగము:— యస్మాత్- న- ఉద్విజతే- లోకః- లోకాత్- న- ఉద్విజతే- చ- యః- హర్షామర్షభయోద్వేగైః- ముక్తః- యః- సః- చ- మే- ప్రియః ॥ ॥౧౫॥

ప్రతిపదార్థము:— లోకః=లోకము; (జనము) యస్మాత్=ఏసంన్యాసివలన; నోద్విజతే చ=సంక్షోభమునుపొందదో; యః=ఎవడు; లోకాత్=లోకమువలన; నోద్విజతే=సంక్షోభమునుపొందడో; యః=ఎవడు; హర్షామర్షభయోద్వేగైః=ప్రీతి, అసహిష్ణుత, త్రాసము, ఉద్వేగము వీనిచే; ముక్తః=విడువబడినవాడో; సః=అట్టివాడు; మే=నాకు; ప్రియః=ప్రియుడు. ॥౧౫॥

శాంకరభాష్యమ్:—

యస్మాదితి । యస్మాత్సంన్యాసినో నోద్విజతే నోద్వేగం గచ్ఛతి న సంతప్యతే న సంక్షుభ్యతే లోకః । తథా లోకాన్నోద్విజతే చ యః । హర్షామర్షభయోద్వేగైః హర్షశ్చామర్షశ్చ భయం చోద్వేగశ్చ తైర్హర్షామర్షభయోద్వేగైర్ముక్తః । హర్షః ప్రియలాభేఽన్తఃకరణస్యోత్కర్షో రోమాంచనాశ్రుపాతాదిలింగః, అమర్షోఽసహిష్ణుతా, భయం త్రాస ఉద్వేగ ఉద్విగ్నతా తైర్ముక్తో యః స చ మే ప్రియః ॥ ॥౧౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

బ్రహ్మనిష్ఠుడైన ఏసంన్యాసివలన లోకము సంతాపము నొందదో, (సంక్షోభమునొందదో) అట్లే లోకమువలన నెవడు సంక్షోభము నొందడో, ఇష్టమగునది లభించినచో గల్గునదియు, రోమాంచనాశ్రుపాతాదిలింగకము నగు ప్రీతిరూపమగు అంతఃకరణోత్కర్షము హర్ష మనబడును. తాను కోరునది లభించుటకు విఘ్నమేర్పడినచో గల్గు అసహిష్ణుత్వము అమర్ష మనబడును. నివియు, భయము, ఉద్వేగము వీటిచే నెవడు విడువబడునో అట్టివాడు నాకు ప్రియుడు. ॥౧౫॥

—• ౧౨వ అధ్యాయము ౧౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— తిరిగి యట్టి బ్రహ్మవేత్తనే విశేషణములతో చెప్పుచుండెను. "యస్మాత్...ప్రియః" సర్వభూతములకు నభయము నొసగు నేసంన్యాసినుండి యెవడును గూడ తపింపడో (బాధనొందడో) మరియు నిష్కారణముగనే నిరపరాధులను తపింపజేయుట వ్రతముగా కల దుష్టులవలనగూడ నేబ్రహ్మవేత్త అద్వైతదర్శియు, పరమకారుణికుడు, క్షమాశాలియునగుటవలన తపింపకుండునో, మరియు తనకు యిష్టమగునది లభించిన రోమాంచ, అశ్రుపాతాదిహేతువగు ఆనందాభివ్యంజకమగు చిత్తవృత్తివిశేషము హర్ష మనబడును. పరోత్కర్షాసహనరూపమగు చిత్తవృత్తివిశేషము అమర్ష మనబడును. వ్యాఘ్రాదిదర్శనాధీనమగు త్రాసరూపమగు చిత్తవృత్తివిశేషము భయ మనబడును. ఏసౌకర్యములులేని విజనవనమున నేకాకియై యెట్లు గడపుదును. అను మొదలగు వ్యాకులచిత్తత్వ ముద్వేగ మనబడును. ఇట్టి హర్ష, భయ ఉద్వేగములచే విడువబడినవాడగునో అట్టివాడు నాకు ప్రియుడు. ॥౧౫॥

శంకరానందీయము:— అద్వేష్టృత్వము మొదలుకొని స్థిరమతిత్వమువరకు నగు 33లక్షణ

శ్లో॥ అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః ॥ ॥౧౬॥

పదవిభాగము:— అనపేక్షః- శుచిః- దక్షః- ఉదాసీనః- గతవ్యథః- సర్వారంభపరిత్యాగీ- యః- మద్భక్తః-సః- మే-ప్రియః ॥ ॥౧౬॥

ప్రతిపదార్థము:—అనపేక్షః=నిస్పృహుడును; శుచిః=శౌచసంపన్నుడును;= దక్షః=సమర్థుడును; ఉదాసీనః= ఉదాసీనుడును; గతవ్యథః-గతవ్యథుడును;=సర్వారంభపరిత్యాగీ=సమస్తములగు కర్మలను వీడినవాడునునై; యః= ఎవడు; మద్భక్తః= బ్రహ్మనిష్ఠుడో; సః= అట్టివాడు; మే= నాకు; ప్రియః=ఇష్టుడు; ॥౧౬॥

---

శాంకరభాష్యమ్:—

అనపేక్ష ఇతిః । దేహేంద్రియవిషయసంబంధాది ష్వపేక్షావిషయే ష్వనపేక్షో నిస్పృహ శ్శుచి ర్బాహ్యే నాభ్యంతరేణ చ శౌచేన సంపన్నో దక్షః ప్రత్యుత్పన్నేషు కార్యేషు సద్యో యథావ త్ప్రతిపత్తుం సమర్థః । ఉదాసీనో న కస్యచి న్మిత్రాదేః పక్షం భజతే । యః

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఎవడు దేహ, ఇంద్రియ, విషయసంబంధాదులయెడ అపేక్షారహితుడై (నిస్పృహుడై) బాహ్యాంభ్యంతర శౌచసంపన్నుడై, ప్రాప్తించిన కార్యములయందు యాథాత్మ్యము తెలిసికొనుటకు సమర్థుడై, మిత్రాదులగు ఏ యొకనిపక్షమునందు నుండనివాడై, భయము

---

శులు సిద్ధుడగు బ్రహ్మవేత్తకుండును. వాటిని సాధకుడగు ముముక్షువు జ్ఞానపరిపాకసాధనములుగ నవశ్యము సంపాదింపదగును గాన వీటిని యధ్యాయాంతమువరకు జెప్పుచున్నాడు.— యేబ్రహ్మవేత్త యొక్క ఆగమన, శ్రవణ, దర్శనాదికముచే ప్రాణివర్గ ముద్వేగమును (విక్షోభమును) పొందకుండునో, మరియు లోకోపద్రవకారులగు చోర, సర్ప, వ్యాఘ్రాదులనుండి స్వయముగ తాను వాటి దర్శనస్పర్శనాదికముచే నుద్వేగము నొందడో, మరియు, ఇష్టప్రాప్తియెడ హర్షమును, రోగాద్యుపద్రవప్రాప్తియెడ అసహిష్ణుత్వము, చోరాదులనుండి కల్గు భయము, ప్రాణాపాయహేతువు ప్రాప్తించిన గల్గు ఉద్వేగము మొదలగు స్వాజ్ఞానకృతములగు చిత్తవికారములచే నిర్ముక్తుడై, యెవడు బ్రహ్మనిష్ఠయందే కాలము గడుపునో యట్టి బ్రహ్మవేత్త నాకు ప్రియుడు. ॥౧౫॥

—• ౧౨వ అధ్యాయము ౧౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మరియు, "అనపేక్షః" యదృచ్ఛోపనతము లగు సర్వభోగోపకరణములయందును, స్పృహ లేనివాడై, "శుచిః" బాహ్యాభ్యంతరశౌచసంపన్నుడై, "దక్షః" తెలిసికొనదగినవై, చేయదగినవై యుపస్థితము లగు వానిని తెలిసికొనుటకును, చేయుటకును సమర్థుడై, "ఉదాసీనః" ఏయొకని పక్షము నాశ్రయించనివాడై, "గతవ్యథః" ఇతరులచే ప్రహృతుడగుచుగూడ పీడ ననుభవింపనివాడై, "సర్వారంభపరిత్యాగీ" ఐహికాముష్మికము లగు సర్వకర్మలను సన్యసించినవాడై, బ్రహ్మనిష్ఠుడై యెవ డుండునో యాతడు నాకు ప్రియుడు. ॥౧౬॥

శాంకరభాష్యమ్:—

స ఉదాసీనో యతి ర్గతవ్యథో గతభయః । సర్వారంభపరిత్యాగీ, ఆరభ్యంత ఇత్యారంభాః ఇహాముత్రఫలభోగార్థాని కామహేతూని కర్మాణి సర్వారంభాస్తా న్పరిత్యక్తుం శీల మస్యేతి సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః ॥ ॥౧౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లేనివాడై, ఐహికాముష్మికఫలభోగము ప్రయోజనముగా గలవియు, కామహేతువులు నగు సర్వకర్మలను వీడినవాడై. యెవడు నాభక్తు డగునో (బ్రహ్మనిష్ఠు డగునో) యాతడు నాకు ప్రియుడు. ॥౧౪॥

శంకరానందీయము:— బ్రహ్మవేత్తయొక్క మరికొన్ని లక్షణములను జెప్పుచున్నాడు— "అనపేక్షః" దృష్టము, శ్రుతము నగు ప్రతివస్తువునందును, దేహ, జీవనాదికము నందును అసద్బుద్ధిచేతను జీవించియుండగనే ముక్తుడగుటచే మోక్షము నందుకూడ అపేక్ష లేనివాడై, (సర్వకామవిముక్తుడై "కర్మస్వసంగమశ్చాచం' అను న్యాయమున తనచేగాక దేహేంద్రియాదికముచేతనే చేయబడు అన్నాదాన, విసర్గాది దుష్టాదుష్టకర్మములయందు కర్మణ్యకర్మత్వదర్శనముచే దనకు వానితో సంబంధము లేకుండుటవలన యకర్త్రాత్మదర్శి యగు బ్రహ్మవేత్తయే శుచి యనబడును. (నిత్యశుద్ధుడని యర్థము.) "దక్షః" శ్రుతిస్మృతీతిహాస పురాణ, న్యాయ, మీమాంసాది సర్వశాస్త్రముల అధ్యయ, నాధ్యాపన, తదర్థప్రకాశన, అనుష్ఠాన, అనుష్ఠాపనాది సర్వకర్మలను స్వయముగ తెలిసికొనుటకును, బోధించుటకును, చేయుటకును చేయించుటకును, సమర్థుడైనవాడై, అల్లైనను "సర్వారంభపరిత్యాగీ" వైదికములు, లౌకికములు నగు సర్వకర్మలు అవిద్యా, కామ, సంకల్ప, అహంకారాదిదోషప్రవర్ధకములగుటచేతను, జ్ఞాన తత్ఫలప్రతిబంధకము లగుటచేతను వానిని విడచు స్వభావము కలవాడై (సర్వకర్మసంన్యాసియై యని యర్థము.)

విహితాచరణము ధర్మము. తదనాచరణము అధర్మముగదా! అధర్మమునందు ధర్మబుద్ధియు, ధర్మమునం దధర్మబుద్ధియు శ్రోత్రియుడు వివేకియు నగువానికి పతనకారణమే యగును. శ్రోత్రియుడు ధర్మమును విడచి యధర్మము నాచరించినచో నెట్లు సంతాపము నొందకుండును. అని యాశంకించెదవా? అట్లుకాదు. కర్మలు మోక్షమునుగూర్చి సాధనములు కానందునను, సముత్పన్నజ్ఞానవంతునకు ప్రతిబంధకము లగుటచేతను ముముక్షువు వానిని వీడుటయే న్యాయము. అట్టిన్యాయము ననువర్తించు బ్రహ్మవేత్త యందుకై సంతాపము నొందడని చెప్పుచున్నాము— "గతవ్యథః" తనచిత్తమునుండి కృత్యాకృత్యానుష్ఠానానుష్ఠానకృతమగు చింతను దొలగించినవాడై, (అనాత్మకర్తృకము లగుకృత్యాకృత్యములయెడ అకర్త్రాత్మదర్శియగు బ్రహ్మవేత్త సంతాపము నొందడని యర్థము. ఈవిషయమునే "నైనం కృతాకృతే తపతః" అను శ్రుతియు జెప్పుచున్నది.) అట్లగుచో నెట్లుండు ననెదవా? "ఉదాసీనః" ఆహారాదియుక్తాయుక్తకర్మలయందు దేహేంద్రియాదికము తమ ప్రారబ్ధానుసారముగ బ్రవర్తించుచుండ దాను స్వయముగ తటస్థుడువలె నుదాసీనుడై (సాక్షియై) యవిక్రియాత్మగ నూఱక యుండునని యర్థము. ఎవడిట్టిభక్తు డగునో అట్టివాడు నాకు ప్రియుడు. ॥౧౬॥

గీ॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః ॥ ॥౧౭॥

పదవిభాగము:— యః– న– హృష్యతి– న– ద్వేష్టి– న– శోచతి– న– కాంక్షతి– శుభాశుభపరిత్యాగీ– భక్తిమాన్– యః– సః– మే– ప్రియః ॥ ॥౧౭॥

ప్రతిపదార్థము:— యః=ఎవడు; నహృష్యతి=హర్షమునుపొందడో; నద్వేష్టి=ద్వేషింపడో; నశోచతి=దుఃఖింపడో; న కాంక్షతి=కోరడో; శుభాశుభపరిత్యాగీ=శుభాశుభకర్మలనువీడుస్వభావముకలవాడో; భక్తిమాన్=భక్తిగల; సః=అట్టివాడు; మే=నాకు; ప్రియః=ఇష్టుడు. ॥౧౭॥

శాంకరభాష్యమ్:—

కించ యో న హృష్యతీష్టప్రాప్తౌ న శోచతి ప్రియవియోగే న చాప్రాప్తం కాంక్షతి శుభాశుభే కర్మణీ పరిత్యక్తుం శీల మస్యేతి శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యః స మే ప్రియః ॥ ॥౧౭॥

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

మరియు నెవడు యిష్టమగునది ప్రాప్తించిన హర్షము నొందడో, యనిష్టముప్రాప్తించిన దుఃఖింపడో, ప్రియవియోగమగుచో నట్టి యప్రాప్తమగుదానిని కోరడో, శుభాశుభరూపములగు కర్మలను వీడు స్వభావముకలవాడై యుండునో, భక్తి (బ్రహ్మనిష్ఠ) కల యట్టివాడు నాకు ప్రియుడు. ॥౧౭॥

—• ౧౨వ అధ్యాయము ౧౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— మరియు, "సమదుఃఖసుఖః" అనుదానిని వివరించుచుండెను — ఎవడు ఇష్టమగునది లభింప హర్షింపడో, యనిష్టము ప్రాప్తింప ద్వేషింపడో, ప్రాప్తమైనదాని యొక్క వియోగము ప్రాప్తింపదుఃఖింపడో. యిష్టసంయోగము ప్రాప్తింపనపుడు కోరకుండునో, సుఖసాధనములు దుఃఖసాధనములునగుకర్మలను వీడెడిశీలముగలవాడై, యెవడుండునో, అట్టి నాభక్తుడు నాకు ప్రియుడు. ॥౧౭॥

శంకరానందీయము:— ముక్తికి రాగద్వేషములకంటె వేరొండు ప్రతిబంధక మేదియు లేదు. కాన ముముక్షువగువాడు ఆరెండింటిని తప్పక వీడదగునని సూచించుటకై రాగద్వేషరాహిత్యరూప మగు ముక్తలక్షణము నిట జెప్పుచుండెను— ఏబ్రహ్మవేత్తయగు యతి స్వయముగ స్వేచ్ఛచేగాని, పరేచ్ఛచేగాని, ప్రాప్తమగు వస్తువిషయమై హర్షమునొందకుండునో, (పరప్రయత్నముచే గూడ నట్టిదానివిషయమై హర్షింపడని యర్థము.) అట్లే యనిష్టమును పొంది ద్వేషించపడో, (స్వానిష్టప్రాపకునియందును, అనిష్టార్థమునందును ద్వేషమును జేయడని యర్థము) గొప్ప యనర్థము ప్రాప్తించినను తనయందు ధైర్యముచేతను అనిష్టము విషయముగా లేనట్టి యాత్మజ్ఞానముచేతను తాను దుఃఖింపడని యర్థము.) అట్లే ప్రాప్తమగు అనర్థము నివర్తించుటకై కోరకుండునో, (ప్రారబ్ధభోగక్షయమును విడచి వాంఛామాత్రముచే ననర్థనివృత్తి యసంభవముగాన తితీక్షతో నూరకుండును. గాని దానికి ప్రతీకారమునకై యౌషధయత్నమును గూడ జేయడని యర్థము.) మరియు, పుణ్యములు శుభము లనబడును. పాపములు అశుభము లనబడును. అజ్ఞానసహభావులును ఇచ్ఛచేగాని, యనిచ్ఛచేగాని చిదాభాసచే చేయబడునవియు నగు కర్మలను "నేను కర్తను గాను" అను జ్ఞానముచే విడిచిపెట్టెడి (తననుండి వేరుపరచు) స్వభావము కలవాడై, (దేహేంద్రియాదులచే జేయబడిన కర్మలతో

గీ॥ సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానాపమానయోః ।
శీతోష్ణసమదుఃఖేషు సమ స్సంగవివర్జితః ॥ ॥౧౮॥

పదవిభాగము:— సమః- శత్రౌ- చ- మిత్రే- చ- తథా- మానావమానయోః- శీతోష్ణసుఖదుఃఖేషు- సమః- సంగవివర్జితః.

ప్రతిపదార్థము:— శత్రౌచ=శత్రువులయందును; మిత్రేచ=మిత్రులయందును; సమః=సముడై; తథా=అట్లే; మానాపమానయోః=మానావమానములయెడ; సమః=సముడై; శీతోష్ణసుఖదుఃఖేషు=శీతోష్ణసుఖదుఃఖములయెడ; సమః=సముడై; సంగవివర్జితః=సంగమును వీడినవాడై. ॥౧౮॥

గీ॥ తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్ ।
అనికేతః స్థిరమతి ర్భక్తిమా న్మే ప్రియో నరః ॥ ॥౧౯॥

పదవిభాగము:— తుల్యనిందాస్తుతిః- మౌనీ- సంతుష్టః- యేన- కేన- చిత్- అనికేతః-స్థిరమతిః- భక్తిమాన్- మే- ప్రియః- నరః- ॥౧౯॥

ప్రతిపదార్థము:— తుల్యనిందాస్తుతిః=నిందాస్తుతులు; (దోషసంకీర్తన, గుణవర్ణనములు) సమానముగా కలవాడై; మౌనీ=మౌనముకలవాడై; యేనకేనచిత్=ఏదోయొకదానిచే; సంతుష్టః=సంతుష్టుడై; అనికేతః=నియమితమైన నివాసస్థానము లేనివాడై; స్థిరమతిః=పరమార్థవిషయకమైన బుద్ధికలవాడై; భక్తిమాన్=బ్రహ్మిష్ఠుడగు; నరః=నరుడు; మే=నాకు; ప్రియః=ప్రియుడు. ॥౧౯॥

---

శాంకరభాష్యమ్:—

సమ ఇతి । సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానాపమానయోః పూజాపరిభవయో శ్శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సర్వత్ర చ సంగవర్జితః ॥ ॥౧౮॥

కించ తుల్యనిందాస్తుతిః నిందా చ స్తుతిశ్చ నిందాస్తుతీ తే తుల్యే యస్య స తుల్యనిందాస్తుతి ర్మౌనీ మౌనవా న్సంయతవా క్సంతుష్టో యేన కేన చి చ్ఛరీరస్థితిమాత్రేణ । తథా చోక్తమ్— "యేన కేనచి దాచ్ఛన్నో యేన కేన చి దాశితః । యత్ర క్వచన శాయీ స్యా

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శత్రుమిత్రులయెడను, మానావమానములయెడను, శీతోష్ణసుఖదుఃఖములయెడను సముడై (అవికృతచిత్తుడై) చేతనములగుస్త్ర్యాదులయందును, అచేతనములగు చందనాదులయందును సంగమును వీడినవాడై, ॥౧౮॥

మరియు, దోషసంకీర్తనరూపమగు నిందయు, గుణవర్ణనరూపమగు స్తుతియు సమముగా కలవాడై, వాక్కును నియమించినవాడై, శరీరస్థితిమాత్రప్రయోజనము కలయేదో యొకదానిచే సంతుష్టుడై "యేనకేనచి దాచ్ఛన్నః యేనకేనచి దాశితః । యత్ర

---

బ్రహ్మవేత్త లేపమును పొందడని యర్థము. ఈవిషయమును "పుష్కరపలాశే" అను శ్రుతియు, జెప్పుచున్నది.) ఇట్టి లక్షణములు కలవాడైయుండునో అట్టిభక్తుడు (జ్ఞానియగు యతి) నాకు ప్రియుడు. ॥౧౪॥

—: ౧౨వ అధ్యాయము ౧౮, ౧౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— "పూర్వశ్లోకార్థము నీశ్లోకమున విస్తరించెను. "సంగవివర్జితః" చేతనములు నచేతనములు నగు సర్వవిషయములయందును శోభనాధ్యాసను (మంచిది యను సక్తిని)

శాంకరభాష్యమ్:—

త్తం దేవా బ్రాహ్మణం విదుః" ఇతి । కిం చానికేతో నికేత ఆశ్రయో నివాసో నియతో న విద్యతే యస్య సోఽనికేతోఽనాగార ఇత్యాదిస్మృత్యంతరాత్ । స్థిరమతిః స్థిరా పరమార్థవస్తు విషయా మతి ర్యస్య స స్థిరమతి ర్భక్తిమా న్మే ప్రియో నరః ॥ ॥౧౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

క్వచన శాయీ స్యా త్తం దేవా బ్రాహ్మణం విదుః" (ఏదో యొకదానిచే గప్పబడినవాడై, ఏదో యొకదానిచే క్షున్నివృత్తి చేసుకొనినవాడై, ఎక్కడనో యొకస్థలమున పరుండినవాడై, ఎవడు కాలము వెళ్ళబుచ్చునో అట్టివాడు బ్రహ్మనిష్ఠుడుగా జెప్పబడును.) నియతమగు నివాసముగలవాడై, పరమార్థవిషయకబుద్ధికలవాడై యుండు భక్తిమంతుడగు నరుడు నాకు ప్రియుడు. ॥౧౯॥

వీడినవాడై (అన్నివిధములుగను హర్షవిషాదశూన్యుడనియర్థము.) శేషము స్పష్టము. మరియు "తుల్యనిందాస్తుతిః" దోషకథనరూపమగు నిందయు, గుణకథనరూపమగు స్తుతియు నీరెండును దుఃఖమును, సుఖమును గల్గింపనివై యుంట సమములుగనే కలిగినవాడై, "మౌనీ" సంయతవాగ్వ్యాపారుడై, శరీరయాత్రానిర్వహణమునకై వాగ్వ్యాపార మపేక్షితము గాదా? అని యందువా? "సంతుష్టః యేన కేన చిత్" తనప్రయత్నము లేకుండగ బలవత్ప్రారబ్ధకర్మోపనీత మగునదియు, శరీరస్థితిమాత్రహేతు వగునదియు నగు అశనాదికముచేతనే సంతుష్టుడై, (నిస్పృహుడై) మరియు, "అనికేతః" నియతనివాసరహితుడై స్థిరమతిః" పరమార్థవిషయకమైన మతికలవాడై, యెవడు నాభక్తుడై యుండునో అట్టివాడు నాకు ప్రియుడు. ఇట భక్తియే యపవర్గసాధనమని చెప్పుటకై పునఃపునః భక్తి స్వీకరింపబడెను. ॥౧౮, ౧౯॥

శంకరానందీయము:— మనోవికృతిహేతువు లున్నను అవికారస్వరూపముగనుండుట యనునది బ్రహ్మవేత్తయగుయతికి సర్వప్రత్యక్షమగు విశిష్టలక్షణము అగుటనీరెండుశ్లోకములచే దానిని జెప్పుచున్నాడు. లోకదృష్టి నాశ్రయించి చెప్పుచో నపకారి శత్రువనియు, నుపకారి మిత్రుడనియు చెప్పదగును. ఇక విద్వద్దృష్టి నాశ్రయించి జూచిన "సర్వము నేనే" అను సర్వాత్మదర్శియగు బ్రహ్మవేత్తకు శత్రుమిత్రాభేదజ్ఞానమే సంభవింపదుగాన, ప్రారబ్ధకర్మవశమున దేహమునకు యొక డపకారియు మరియొక డుపకారియు నగుచుండును. అట్టియెడ బ్రహ్మవేత్త శత్రు, మిత్రులయందు సమదర్శి యగును. మరియు నట్టి ఆశత్రుమిత్రులుజేసెడి మానావమాన (పూజాతిరస్కార) ముల యెడ సముడగును. అట్టి పూజాతిరస్కారములు అజ్ఞులకు సంతోషవిషాదదాయులైనను (బ్రహ్మవేత్త సంప్రాప్తములగువానియెడ నిర్వికారుడై యుండునని యర్థము.) అట్లే శీతోష్ణసుఖదుఃఖములు ప్రాప్తించినపుడును బ్రహ్మవేత్త సమదర్శియే యగును. మరియు దోషములున్నను లేకున్నను వాటిని ప్రత్యక్షముగ నున్నట్లు వర్ణించుట నింద యనబడును. గుణము లున్నను లేకున్నను వానిని యున్నట్లు ప్రత్యక్షముగ గీర్తించుట స్తుతి యనబడును. అనాత్మగోచరములగు యట్టి నిందాస్తుతులయెడ బ్రహ్మవేత్త సమదర్శియగును. (వాటియెడ బ్రహ్మవేత్త నిర్వికారుడగునని యర్థము.) ఈపూర్వోక్తములయెడ సమదర్శనము సిద్ధించుటకు హేతువేమందువా? "సంగవివర్జితః" మానావమానాదుల ననుభవించునది సాభాసాహంకారము, తత్తాదాత్మ్యాధ్యాసమే సంగ మనబడును. బ్రహ్మవేత్త అట్టి సంగములేనివా డగును. బ్రహ్మవేత్త మానావమానాదుల కవిషయమగు పరబ్రహ్మమునందు ఆత్మభావా

గీ॥ యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్దధానా మత్పరమా భక్తాఽ స్తేఽతీవ మే ప్రియాః ॥ ॥౨౦॥

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి
శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున
సంవాదే భక్తియోగోనామ ద్వాదశాధ్యాయః ॥౧౨॥

పదవిభాగము:— యే- తు- ధర్మ్యామృతం- ఇదం- యథోక్తం- పర్యుపాసతే- శ్రద్ధధానాః- మత్పరమాః- భక్తాః- తే- అతీవ- మే- ప్రియాః- ॥౨౦॥

ప్రతిపదార్థము:— యేతు=ఏసంన్యాసులు; ధర్మ్యామృతం=ధర్మానపేతము, నమృతత్వసాధనమగు; ఇదం=యథోక్తం=ఈయథోక్తవిషయమును; పర్యుపాసతే=ఉపాసించెదరో; శ్రద్ధధానాః=శ్రద్ధాయుక్తులై; మత్పరమాః=నేనే నిరతిశయమైన గతిగాకలవారై; భక్తాః=భక్తులైన; తే=వారు; మే=నాకు; అతీవ=అత్యంతము; ప్రియాః=ఇష్టులు. ॥౨౦॥

---

పన్నుడుగాన స్వయముగ తాను ఆ మానావమానాదుల సంబంధము లేనివాడై యంతట సమదర్శియే యగునని యర్థము.) "మౌనీ" తాను చెప్పునదేమియు నుండమిగాన బ్రహ్మజ్ఞాని వాచంయము డగును. ('విజానన్ విద్వా న్భజతే నాతివాదీ' అను శ్రుతిచొప్పున సర్వమును బ్రహ్మముగ తెలిసికొనినజ్ఞాని చెప్పదగినదేదియు నుండమిగాన మౌని యగునని యర్థము.) 'సంతుష్టో యేన కేన చిత్' జ్ఞాని- ప్రారబ్ధవశమున ప్రాప్తమగునదియు, నేదోయొక శిష్టముగాని, అశిష్టముగాని, అల్పముగాని యగు సదసత్త్వభావనానిర్ముక్తమగు భిక్షాప్రాప్త వస్తువుచే కల్గిన యలంప్రత్యయము గలవా డగును, "అనికేతః" యతి- 'అష్టౌ మాస్వేకాకీ యతి శ్చరేత్'' అను స్మృత్యనుసారము నియతనివాసస్థానము లేనివాడగును. 'స్థిరమతిః' బ్రహ్మవేత్త-విపరీతభావనాజనకము లగు మానావమాన, శీతోష్ణ, సుఖదుఃఖాదులు ప్రాప్తించినను "ఈసర్వము నేనును బ్రహ్మస్వరూపమే" అని సర్వదా అంతటను బ్రహ్మాకారాపన్నమగు ఒకేవృత్తిచే స్థిరమైన మననశీలమైన చిత్తవృత్తి కలవాడగును. ('దృఢనిశ్చయః' అను స్థలమున జ్ఞానమునకు ప్రమాణాంతరబాధారాహిత్యము, "స్థిరశ్చయః" అనుస్థలమున జ్ఞానమునకు నిశ్చలత్వము వివక్షితములు.) 'భక్తిమాన్' "ఏకాంతభక్తి ర్గోవిందే య త్సర్వత్ర దదీక్షణమ్। అహైతుక్యవ్యవహితా యా భక్తిః పురుషోత్తమే॥ లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య వ్యుదాహృతమ్" (అహైతుకీ= విపరీతప్రత్యయనివృత్త్యాదిప్రయోజనవర్జితమైన బ్రహ్మవేత్తలకు స్వభావసిద్ధమైన అవ్యవహితమై (అవిచ్ఛిన్నమై) వృత్త్యంతరరహితమై పురుషోత్తమునియందు పత్యగభిన్నపరమాత్మయందు కలుగు అఖండాకారవృత్తిరూపమగు యే భక్తి కలదో అదియే నిర్గుణబ్రహ్మము విషయముగా గల భక్తియోగముయొక్క లక్షణముగా పెద్దలచే జెప్పబడెను. ఎవ డిట్టి భక్తికలవాడో అట్టి "నరః" (తనను స్వనిష్ఠచే బ్రహ్మమునే పొందించును.) అను వ్యుత్పత్తి ననుసరించి బ్రహ్మనిష్ఠుడు నాకు ప్రియుడు. ॥౧౮, ౧౯॥

—• ౧౨వ అధ్యాయము ౨౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:—"అద్వేష్టా" అనునది మొదలుకొని యక్షరోపాసకులును, జీవన్ముక్తులు నగు సంన్యాసులకు లక్షణభూతము, స్వభావసిద్ధము నగు ధర్మసముదాయము చెప్పపడెను. ఈవిషయమే వార్తికమున "ఉత్పన్నాత్మావబోధస్య హ్యద్వేష్టృత్వాదయో గుణాః । అయత్నతో భవ న్త్యేవ వతు సాధనరూపిణః" (ఆత్మజ్ఞానము కల్గినవానికి అద్వేష్టృత్వాది గుణములు, ప్రయత్నమును విడిచియే కల్గును.)

శాంకరభాష్యమ్.—

అద్వేష్టా సర్వభూతానా మిత్యాదినాఽక్షరస్యోపాసకానాం నివృత్తసర్వైషణానాం సంన్యాసినాం పరమార్థజ్ఞాననిష్ఠానాం ధర్మజాతం ప్రక్రాంత ముపసంహ్రియతే.— యే తు సంన్యాసినో ధర్మ్యామృతం ధర్మా దనపేతం ధర్మ్యం చ త దమృతం చ త దమృతత్వహేతుత్వాద్విదం యథోక్త మద్వేష్టా సర్వభూతానా మిత్యాదినా పర్యుపాసతేఽనుతిష్ఠంతి శ్రద్దధానాస్సంతో మత్పరమా యథోక్తోఽహ మక్షరాత్మా పరమో నిరతిశయా గతి ర్యేషాం తే మత్పరమా మద్భక్తా శ్చోత్తమాం పరమార్థజ్ఞానలక్షణాం భక్తి మాశ్రితా స్తేఽతీవ మే ప్రియాః।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"అద్వేష్టా సర్వభూతానాం" అనునది మొదలుగాగల గ్రంథముచే నక్షరబ్రహ్మోపాసకులును, నివృత్తసర్వైషణులును, సంన్యాసులు నగు పరమార్థజ్ఞాననిష్ఠుల ధర్మసముదాయము నుపక్రమించి యుపసంహరించుచుండెను.— ఏసంన్యాసులు ధర్మానపేతమును, మోక్షసాధనమునగు ఈపూర్వోక్తవిషయము ననుష్ఠించెదరో, అట్టి శ్రద్ధావంతులును, యథోక్తాక్షరోపాసకులును, నేనే నిరతిశయగతిగా కలవారును, పరమార్థజ్ఞానరూపమగు భక్తి నాశ్రయించినవారు నగు అట్టివారు నాకత్యంతము ప్రియులు. "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థం" అని చెప్పబడెను. ఈధర్మజాతమే స్థితప్రజ్ఞలక్షణముగా బూర్వము చెప్పబడెను. కాన ఆత్మజ్ఞానమే ప్రయత్నముతో సంపాదింపదగుననియు, నదియే ముముక్షువునకు మోక్షసాధనమగు ననియు, ప్రతిపాదించుచు అధ్యాయము నుపసంహరించుచుండెను. ఏసంన్యాసులు ధర్మరూపమైనదియు, యమృతత్వ సాధనమగుటవలన లేక యమృతమువలెనే నాస్వాద్యమగు ఈపూర్వోక్తవిషయము ననుష్ఠించెదరో ప్రయత్నముతో శ్రద్ధావంతులై యక్షరాత్మనగు నేనే పరమప్రాప్తవ్యముగ గలవారై నిరుపాధికమగు బ్రహ్మమును భజించువారై యెవరుందురో వారు నాకు అత్యంత ప్రియులు. "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః" అని పూర్వము సూచించినదాని నిట ఉపసంహరించెను. ఈధర్మామృతమునతిశ్రద్ధతో ననుష్ఠించువాడు పరమేశ్వరున కత్యంతప్రియుడు గాన, జ్ఞానవంతున కిది స్వతః ప్రాప్తించు లక్షణమైనను ముముక్షువగు ఆత్మతత్త్వజిజ్ఞాసువు ఆత్మజ్ఞానోపాయముగ నవశ్యము సప్రయత్నముగ ననుష్ఠింపదగునదని యర్థము. ఈవిధముగ సోపాధికబ్రహ్మధ్యానపరిపాకముచే నిరుపాధికబ్రహ్మము ననుసంధించువాడై, అద్వేష్ట్రిత్యాదిధర్మవిశిష్టుడై, ముఖ్యాధికారియై శ్రవణమనననిదిధ్యాసనముల నావర్తించువానికి వేదాంతతత్త్వవాక్యార్థతత్త్వసాక్షాత్కారము కలిగి ముక్తి సంభవించును. కాన ముక్తిహేతువగు వేదాన్తమహావాక్యాన్వయయోగ్యమగు తత్పదార్థము అనుసంధింపదగునని మధ్యమషట్కముచే ప్రతిపాదింపబడెను. ||౨౦||

ఇట్లు మధుసూదన సరస్వతీ విరచిత శ్రీభగవద్గీతా

ద్వాదశాధ్యాయ గూఢార్థదీపికకు "తర్కరత్న,

న్యాయవేదాన్తవిద్యాపారీణ, దర్శనాలంకార" బులుసు

అప్పన్నశాస్త్రి విరచితతాత్పర్యబోధిని

సమాప్తము.

శాంకరభాష్యమ్:—

ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మితి యత్ సూచితం తద్వ్యాఖ్యా యేహోపసంహృతం భక్తాస్తేఽతీవ మే ప్రియా ఇతి । యస్మా ద్ధర్మ్యామృత మిదం యథోక్త మనుతిష్ఠ న్భగవతో విష్ణోః పరమేశ్వర స్యాతీవ మే ప్రియో భవతి తస్మా దిదం ధర్మ్యామృతం ముముక్షుణా యత్నతోఽను ష్ఠేయః విష్ణోః ప్రియం పరం ధామ జిగమిషుణేతి వాక్యార్థః ॥ ॥ ౨౦॥

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యగోవిందభగవత్పూజ్యపాదశిష్యశ్రీమదాచార్య శ్రీశంకరభగవతః కృతౌ శ్రీభగవద్గీతాభాష్యే భక్తియోగో నామ ద్వాదశోఽధ్యాయః ॥౧౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అని పూర్వమునందు చెప్పినదానినే యిట వివరించి "భక్తా స్తేఽతీవ మే ప్రియాః" అను దానిచే నుపసంహరించెను. ఈధర్మ్యము, నమృతప్రదము నగు నీయథోక్తవిషయము ననుష్ఠించినవాడు పరమేశ్వరున కత్యంతప్రియుడుగాన ఈధర్మ్యామృతమును ముముక్షువగువాడు (ప్రియమగు విష్ణుస్థానమును పొందునిచ్ఛగలవాడు) అవశ్యము ప్రయత్నముతో ననుష్ఠింపదగు నని వాక్యార్థము. ॥ ౨౦॥

ఇట్లు నూరువేలసంఖ్య కలిగి, వ్యాసప్రోక్తము, సంహితారూపము నగు మహాభారత మునం దంతర్గతమైన భీష్మపర్వమునందున్న యుపనిషద్రూపము, బ్రహ్మవిద్యా రూపమును, యోగశాస్త్రము నగు భగవద్గీతలయం దున్న శ్రీకృష్ణార్జునసంవా దమునందు గల భక్తియోగ మనుపేరి ద్వాదశాధ్యాయమునకు గౌత మసగోత్రు డగు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార" బులుసు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన, ఆనందగిరీయవ్యాఖ్యానుసృత శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని

సమాప్తము

హరిః ఓమ్ తత్సత్.

శంకరానందీయము:— "అద్వేష్టా సర్వభూతానాం" అనునది మొదలుకొని చెప్పబడిన బ్రహ్మవిల్లక్షణసముదాయము నంతను- మోక్షైక కాములు, అంతట విరక్తులు, సాధకులు నగు యతులు శ్రవణ, మననసముత్పన్నమగు జ్ఞానము పరిపక్వమగుటకు సాధనముగ నవశ్యము సంపాదింపదగునని బోధించుటకై, తత్సంపాదననిష్ఠులగు సాధకులను స్తుతించుచు అధ్యాయము నుపసంహరించుచుండెను— (ఇట "తు" శబ్దము సిద్ధులకంటె వేరగు సాధకుల నుద్దేశించి చెప్పుటకు ప్రయుక్తము.) "యేతు" మద్భావాపత్తి నే కోరుచు సుఖసాధనముల నన్నిటిని వీడి, శ్రవణాదిసంజనితజ్ఞానులై, ఇదియే ముక్తికి పరమసాధన మను విశ్వాసము కలవారై, నిర్విశేషపరబ్రహ్మమే పరమప్రాప్యముగ గలవారై, లేక, నేనే (ఈశ్వరుడే) నిరతిశయైశ్వర్యసంపన్నుడును, విశ్వాధికుడును, అనుల్లంఘ్యశాసనుడు నను బుద్ధికలవారై మదాజ్ఞావశ

వర్తులై, యతులకు స్వధర్మము సప్రయత్నముగ ననుష్ఠింపదగునది ధర్మ్యమనబడును. లేక, ముముక్షుత్వ ధర్మముచే బొందదగినది ధర్మ్యము. అమృతమునకు (మోక్షమునకు) నియతసాధనమగుటచే అమృత మనబడును.) అట్టి ధర్మ్యామృతమగు ఈపూర్వోక్తమగు అద్వేష్ట్రృత్వాది ధర్మజాతము నెవరు నిత్యమనుష్ఠించెదరో అట్టి మద్భక్తులు (మద్భావనానిష్ఠులు) నాకు (ఈశ్వరునకు) అత్యంతము ప్రియులు. లోకమున దాము చెప్పిన పని నెవరు జేయుదురో వారు వారి కత్యంతప్రియు లగుట యనుభవసిద్ధము. నాచే చెప్పబడినరీతి ఈధర్మ జాతము ననుష్ఠించు యతులు నాకత్యంతప్రియులని చెప్పుటచే స్వోక్తమగు మోక్షసాధనమున వారికి ప్రవృత్తి సిద్ధించుటకై ఈస్తుతి యుపయోగించును. దానిచే దాము పరమేశ్వరున కతిప్రియు లగుటకును, భవబంధవిముక్తికై, యథోక్తమగు ధర్మ్యామృతమును కృతశ్రవణులును, మోక్షైకకాములు నగువారు ప్రయత్నముతో ననుష్ఠింపదగునని సిద్ధించినది. ॥౨౦॥

ఇట్లు శ్రీశంకరానందసరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా ద్వాదశాధ్యాయవాక్య తాత్పర్యబోధినికి "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార" బిరుదు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన తాత్పర్యబోధిని

సమాప్తము.

శ్రీధరీయము:— ధర్మజాతమును జెప్పి యుపసంహరించుచుండెను.— యథోక్తధర్మరూపమైన అమృతమును (మోక్షసాధనమగుట అమృతమనబడును.) ఎవరు పాలించెదరో, శ్రద్ధాళువులై నేనే యుత్కృష్ట గతిగ గలవారై, నాభక్తులై, యుందురో అట్టివారు నాకు ప్రియులు. ॥౨౦॥

శ్లో॥ దుఃఖ మవ్యక్తవర్త్మైత ద్బహువిఘ్నం మతో బుధః ।
సుఖం కృష్ణపదాంభోజభక్తిసత్పథ మాభజేత్ ॥

తా॥ అనేకవిఘ్నపరీతుడగు విద్వాంసునకు నిర్గుణోపాసనము తెలియని మార్గము గలదై దుఃఖసాధ్యమగును గాన సుఖసాధ్యమగు శ్రీకృష్ణపాదారవిందభక్తి యనెడు మంచిమార్గమును సేవింపదగును.

ఇట్లు శ్రీధరవిరచిత శ్రీభగవద్గీతా ద్వాదశాధ్యాయటీకకు "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార" బిరుదు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని సమాప్తము.

భాష్యోత్కర్షదీపిక:— "అద్వేష్టా సర్వభూతానాం" అనునది మొదలుకొని అక్షరబ్రహ్మోపాసకులును, సంన్యాసులునగు పరమార్థజ్ఞాననిష్ఠుల ధర్మసముదాయము నుపపాదించి యుపసంహరించుచుండెను:— అద్వేష్టా సర్వభూతానాం" అను మొదలగుదానిచే జెప్పబడిన యీధర్మపూగము అమృతత్వ (మోక్ష) సాధనమగునది గాన "ధర్మ్యామృత" మనబడును. అట్టి ధర్మజాతమును యెవరు "శ్రద్ధధానాః" వెక్కువశ్రద్ధతో గూడినవారై; "మత్పరమాః" నేనే (అక్షరాత్మయే) నిరతిశయమైన గతిగా కలవారై, "పర్యుపాసతే" అనుష్ఠించెదరో, "మద్భక్తాః" పరమార్థజ్ఞానరూపమగు భక్తి నాశ్రయించినవారై, యుందురో "తే" వారు "మమ" పరమాత్మ నగు నాకు "ప్రియాః" ఇష్టులు. పూర్వము "ప్రియో హి జ్ఞానినో త్యర్థ మహం స చ మమ ప్రియః" అని సూచింపబడినదాని నిట ప్రతిపాదించి, "భక్తాఽస్తేతీవ మే ప్రియాః" అని యుపసంహరించెను. ఈయథోక్తమగు ఈధర్మ్యామృతము ననుష్ఠించిన వాడు భగవంతునకు అత్యంతము ప్రియుడగునుగాన భగవద్ధామమును పొందదలచిన ముముక్షువు ఈధర్మజాతమును ప్రయత్నపూర్వకముగా ననుష్ఠింపదగు నని వాక్యార్థము. ఈవిధముగ ద్వాదశాధ్యాయముచే సోపాధికజ్ఞానపరిపాకమువలన నిరుపాధికాక్షరబ్రహ్మము ననుసంధించు "అద్వేష్టా సర్వభూతానాం"

మిథ్యాదిధర్మవిశిష్టునకు శ్రవణాద్యావర్తనము బరమార్థజ్ఞానముచే కల ముఖ్యాధికారికి సాక్షాన్మోక్షప్రాప్తిహేతుత్వమును నిరూపించెనుగాన సోపాధిక, నిరుపాధికబ్రహ్మరూప తత్పదార్థము చూపబడెను. ॥౨౦॥

ఇట్లు ధనపతిసూరివిరచిత శ్రీభగవద్గీతా ద్వాదశాధ్యాయ భాష్యోత్కర్షదీపికకు
"తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రివిరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

పరమార్థప్రపా:— అధ్యాయము నుపసంహరించుచుండెను— యథోక్తము, ధర్మసంబంధియు అమృతత్వప్రదము నగు యీధర్మజాతమును శ్రద్ధావంతులై, నేనే పరమగతిగ కలవారై, యెవరనుష్ఠించెదరో వారు నాకత్యంతము ప్రియులు. ॥౨౦॥

శ్లో॥ నానావిక్షేపవిఘ్నై రుపహతమనసాఽఽలంబశూన్యేన భూయో
హ్యవ్యక్తోపాస్తి మేకే విదధతి సుచిరం లౌకికాచార్యతోఽన్యే,
భక్తిం యోగేశ్వరాణా మపి పరమగురౌ కుర్వతే స్మాత్మలబ్ధ్యై
తత్క్లేశే తారతమ్యం విశదమభిహితం ద్వాదశాధ్యాయమధ్యే ॥

ఇట్లు దైవజ్ఞ పండితవిరచిత శ్రీభగవద్గీతా ద్వాదశాధ్యాయ పరమార్థప్రపకు
"తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార"
బులుసు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

నీలకంఠీయము:— ముక్తుని లక్షణములనే, ముముక్షువునకు సాధనములుగా నిరూపించుచుండెను— "యేతు" పూర్వోక్తులుకంటె వేరగు ముముక్షువులు "ఇదం" "అద్వేష్టా సర్వభూతానాం" అను మొదలగుదానిచే జెప్పబడిన "ధర్మామృతం" అమృతత్వసాధన మగుధర్మజాతమును "యథోక్తం" చెప్పినదానిని తప్పకుండగ "పర్యుపాసతే" సంపూర్ణముగ ననుష్ఠించెదరో, "శ్రద్దధానాః" శ్రద్ధాయుక్తులై, "మత్పరమాః" నేనే (సర్వవిశేషశూన్యము, పరమానందరూపము నగు అక్షరపరబ్రహ్మమే) అంతిమమైన ప్రాప్యస్థానముగా కలవారై "భక్తాః" శాంతిదాంత్యాదివంతులై నన్ను సేవించు స్వభావము కలవారై యుందురో "తే" అట్టివారు "మే" నాకు "అతీవ ప్రియాః" ప్రియులు. బ్రహ్మజ్ఞాని భగవంతునకు ఆత్మస్వరూపుడే కాన పరిశేషన్యాయమున యత్యంతప్రియత్వము భక్తులయందే విశ్రాంత మగును. ముక్తుల స్వాభావికధర్మములను ముముక్షువులు యత్నపూర్వకముగ ననుష్ఠింపదగు నని యర్థము. ఈవిషయము వార్తికమున ఇట్లు చెప్పబడినది– "ఉత్పన్నాత్మప్రబోధస్య హ్యద్వేష్టృత్వాదయో గుణాః। అయత్నతో భవంత్యేవ నతు సాధనరూపిణః" (బ్రహ్మజ్ఞానము కలిగినవారికి అద్వేష్టృత్వాదిధర్మములు ప్రయత్నము లేకుండగ సిద్ధించియే యుండును. దానికపుడవి సాధనములు గావు. సాధకుడగు ముముక్షువు వాటిని సాధనములుగ గ్రహించి యనుష్ఠింపదగు నని యర్థము) ఉపాసనాప్రధాన మగుతత్పదార్థవివేకము సమాప్తము. ఈపైన జీవబ్రహ్మభేదప్రతిపాదక మగు గ్రంథ మారంభింపబడును.

ఇట్లు శ్రీనీలకంఠాచార్య విరచిత శ్రీభగవద్గీతా ద్వాదశాధ్యాయ భారతభావదీపమునకు
బులుసు వెంకటశాస్త్రివిరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

హరిః ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.
సమాప్తం మధ్యమం షట్కమ్.

శ్రీ భ గ వ ద్గీ తా మ ధ్య మ ష ట్క స్థ శ్లో క ము ల కు

# అకారాద్యనుక్రమణిక.


అ. — అ. శ్లో. పే.

అపరేయ మిత 7- 5-384
అంతవత్తు ఫలం 7-23-438
అవ్యక్తం వ్యక్తి 7-24-440
అధియజ్ఞః కథం 8- 2-457
అక్షరం బ్రహ్మ 8- 3-460
అధిభూతం క్షరోభావః 8- 4-466
అంత కాలేచ మా మేవ 8- 5-470
అభ్యాసయోగయుక్తేన 8- 8-478
అనన్యచేతా స్సతతం 8_14-497
అవ్యక్తా ద్వ్యక్తయః 8-18-507
అవ్యక్తోఽక్షరఇత్యుక్తః 8-21-510
అగ్నిర్జ్యోతి రహ శ్శుక్లః 8-24-524
అశ్రద్ధధానా 9- 3-549
అవజానంతి మాం 9_11-573
అహంక్రతు రహం 9-16-585
అనన్యా శ్చింతయంతో 9_22-595
అహం హి సర్వ 9-24-599
అపి చే త్సుదురా 9_30-612
అహింసా సమతా 10- 5-631
అహం సర్వస్య 10- 8-636
అహ మాత్మా గుడా 10-20-654
అశ్వత్థ స్సర్వవృక్షా 1_-26-660
అనంత శ్చాస్మి 10-29-662
అక్ష రాణా మకా 10-33-667
అధ వా బహు 10-42-676
అనేకవక్త్రనయనం 11-10-689
అనేకబాహూదర 11-16-684
అనాదిమధ్యాంత 11-19-698
అమీ హి త్వా సుర 11-21-700
అమీ చ త్వాం 11_26-705
అదృష్టపూర్వం 11-45-727
అద్వేష్టా సర్వ 12_13-763
అనపేక్ష శ్శుచి 12_16-769
అభ్యాసే ప్యసమర్థోసి 12-10-757
అథైత దప్యశక్తో 12-11-758
అథ చిత్తం సమా 12- 9-756

ఆ. — అ. శ్లో. పే.

ఆబ్రహ్మభువనా 8-16-501
ఆహు స్త్వా మృషయ 10-13-646
ఆదిత్యానా మహం 10-21-656
ఆయుధానా మహం 10-28-661
ఆఖ్యాహి మే కో 11-31-709

ఇ.

ఇచ్ఛాద్వేష సము 7-27-447
ఇదం తు తే ప్రవ 9- 1-539
ఇహైకస్థం జగ 11- 7-686
ఇత్యర్జునం వాసు 11-50-732

ఉ.

ఉదారా స్సర్వ ఏవైతే 7-18-429
ఉచ్చైశ్శ్రవసమశ్వా 10-27-660

ఏ.

ఏతద్యోనీని భూతాని 7- 6-386
ఏతాం విభూతిం 10- 7-634
ఏవ మేత ద్యథాత్థ 11_ 3-683
ఏవ ముక్త్వా తతో 11- 9-688
ఏత చ్ఛ్రుత్వా 11-35_714
ఏవం సతతయుక్తా 12- 1-741
ఏ త్వక్షర మనిర్దేశ్యం 12- 3 747
ఏతు సర్వాణి కర్మా 12- 6-752

ఓ.

ఓమిత్యే కాక్షరం బ్రహ్మ 8-13_495

క.

కవిం పురాణ మను 8- 9-480
కథం విద్యా మహం 10-17-649
కస్మా చ్చ తే న 11-37_717

కా.

కామై స్తైస్తై 7-20-433
కాలోస్మి లోకక్షయ 11-32-710

కి.

కిం త ద్బ్రహ్మ 8- 1-457
కింపున ర్బ్రాహ్మణాః 9-33_618

కి. — అ. శ్లో. పే.

కిరీటినం గదినం 11-17-695
కిరీటినం గదినం చక్రి 11-46-727

క్లే.

క్లేశోధికతరస్తేషాం 12- 5-751

గ.

గతి ర్భర్తా ప్రభు 9-18-588

చ

చతుర్విధా భజంతే 7-16_424

జ

జరామరణమోక్షాయ 7-29-451

త.

తస్మా త్సర్వేషు 8- 7_475
తపా మ్యహ మహం 9-19-589
తత్రైకస్థం జగ 11-13-692
తత స్స విస్మయా 11-14_692
తస్మా త్త్వ ముత్తిష్ఠ 11_33-711
తస్మా త్ప్రణమ్య 11-44-726
త్వ మక్షరం పరమం 11_18-696
త్వ మాదిదేవః 11-38-719
త్రిభి ర్గుణమయై 7-13-412
తుల్యనిందాస్తుతిర్మౌనీ 12-19-772
తేషాం జ్ఞానీ నిత్య 7_17-427
తే తం భుక్త్వా 9-21-593
తేషాం సతతయుక్తా 10_10-638
తేషా మేవానుకంపా 10-11-641
తేషా మహం సము 12- 7- 52
త్రైవిద్యా మాం 9-20-592

ద.

దండో దమయతా 10-38-672
దంష్ట్రాకరాళాని 11_25-704
ద్యావాపృథివ్యో 11_20-699
దివ్యమాల్యాంబరధరం 11_11_689
దివిసూర్యసహస్రస్య 11-12-690
ద్యూతంఛలయతా 10-36-671

| ద. | అ. శ్లో. పే. |
|---|---|
| దృష్ట్వేదం మానుషం | 11-51-733 |
| దైవీహ్యేషా గుణ | 7-14-414 |
| ద్రోణంచ భీష్మంచ | 11-34-712 |
| **ప.** | |
| పర స్తస్మాత్తు భావో | 8-20-513 |
| పత్రం పుష్పం ఫలం | 9-26-605 |
| పరం బ్రహ్మ పరం | 10-12-544 |
| పవనః పవతామస్మి | 10-31-663 |
| పశ్య మే పార్థ | 11-5-685 |
| పశ్యాదిత్యాన్వసూ | 11-6-685 |
| పశ్యామి దేవా స్తవ | 11-15-693 |
| పితాస్య లోకస్య | 11-43-724 |
| ప్రయాణకాలే మనసా | 8-10-485 |
| ప్రకృతిం స్వా మవ | 9-8-562 |
| ప్రహ్లాదశ్చాస్మి దైత్యా | 10-30-663 |
| పితాహ మస్య జగతః | 9-17-587 |
| పుణ్యో గంధః పృథి | 7-9-401 |
| పురుష స్స పరః పార్థ | 8-22-517 |
| పురోధసాం చ | 10-24-659 |
| **బ.** | |
| బలం బలవతాం | 7-11-405 |
| బహూనాం జన్మనా | 7-19-431 |
| బీజం మాం సర్వ | 7-10-403 |
| బుద్ధి ర్జ్ఞాన మసం | 10- 4-631 |
| బృహత్సామ తథా | 10-35-669 |
| **భ.** | |
| భవాప్యయౌ హి | 10- 2-628 |
| భక్త్యా త్వనన్యయా | 11-54-735 |
| భూమి రాపోనలో | 7- 4-381 |
| భూతగ్రామ స్స | 8-19-510 |
| భూయ ఏవ మహా | 10- 1-626 |
| **మ.** | |
| మయ్యాసక్త మనాః | 7- 1-373 |
| మనుష్యాణాం సహ | 7- 3-379 |
| మత్తః పరతరం నాన్యత్ | 7- 7-394 |
| మయా తత మిదం సర్వం | 9- 4-551 |
| మయాధ్యక్షేణ ప్రకృ | 9-10-566 |
| మహాత్మాన స్తు మాం | 9-13-579 |
| మన్మనా భవ | 9-34-621 |

| మ. | అ. శ్లో. పే. |
|---|---|
| మహర్షయ స్సప్త | 10- 6-633 |
| మచ్చిత్తా మద్గత | 10- 9-637 |
| మహర్షీణాం భృగు | 10-25-659 |
| మృత్యు స్సర్వ | 10-34-668 |
| మదనుగ్రహాయ | 11- 1-680 |
| మన్యసే యది త | 11- 4-684 |
| మయా ప్రసన్నేన | 11-47-729 |
| మత్కర్మకృన్మత్పర | 11-55-736 |
| మయ్యావేశ్య మనో | 12- 2-745 |
| మయ్యేవ మన ఆధ | 12- 8-755 |
| మా ముపేత్య పున | 8-15-499 |
| మాం హి పార్థ | 9-32-617 |
| మా తే వ్యథా మా | 11-49-731 |
| మోఘాశా మోఘ | 9-12-576 |
| **య.** | |
| యం యం వాపి | 8- 6-473 |
| యదక్షరం వేదవిదో | 8-11-488 |
| యత్ర కాలే త్వనా | 8-23-520 |
| యథాకాశస్థితో నిత్యం | 9- 6-559 |
| య త్కరోషి య | 9-27-606 |
| యచ్చాపి సర్వభూతా | 10-39-673 |
| యద్య ద్విభూతిమ | 10-41-675 |
| యథా నదీనాం | 11-28-706 |
| యథా ప్రదీప్తం | 11-29-707 |
| యస్మా న్నోద్విజతే | 12-15-768 |
| య చ్చావహాసార్థ | 11-42-722 |
| యాంతి దేవవ్రతా | 9-25-602 |
| యేచైవ సాత్త్వికా | 7-12-407 |
| యేషాం త్వంతగతం | 7-28-449 |
| యే ప్యన్య దేవతా | 9-23-598 |
| యే తు ధర్మ్యామృ | 12-20-774 |
| యో యో యాం | 7-21-434 |
| యో మా మజ మనా | 10- 3-629 |
| యోనహృష్యతిన ద్వేష్టి | 12-17-771 |
| **ర.** | |
| రసోహమప్సు కౌంతేయ | 7- 8-399 |
| రాజవిద్యా రాజ | 9- 2-544 |
| రుద్రాణాం శంకర | 10-23-658 |
| రుద్రాదిత్యా వసవో | 11-22-701 |
| రూపం మహ త్తే | 11-23-702 |

| ల. | అ. శ్లో. పే. |
|---|---|
| లేలిహ్యసే గ్రస | 11-30-708 |
| **వ.** | |
| వక్తు మర్హ స్యశేషేణ | 10-16-649 |
| వక్త్రాణి తే త్వర | 11-27-706 |
| వాయు ర్యమోగ్ని | 11-39-720 |
| విస్తరే ణాత్మనో | 10-18-650 |
| వృష్ణీనాం వాసు | 10-37-671 |
| వేదాహం సమతీ | 7-26-445 |
| వేదేషు యజ్ఞేషు | 8-28-449 |
| వేదానాం సామవేదో | 10-22-657 |
| **శ.** | |
| శుక్లకృష్ణే గతీహ్యేతే | 8-26-531 |
| శుభాశుభఫలైః | 9-28-608 |
| శ్రేయో హి | 12-12-759 |
| **స.** | |
| స తయా శ్రద్ధయా | 7-22-437 |
| సర్వద్వారాణి | 8-12-492 |
| సహస్రయుగపర్య | 8-17-504 |
| సర్వభూతాని | 9- 7-561 |
| సతతం కీర్తయంతో | 9-14-581 |
| సమోహం సర్వ | 9-29-610 |
| సర్వ మేత దృతం | 10-14-646 |
| సర్గాణా మాది | 10-32-664 |
| సఖేతి మత్వా | 11-11-722 |
| సంన్నియమ్యేంద్రి | 12- 4-748 |
| సంతుష్ట స్సతతం | 12-14-766 |
| సమ శ్శత్రౌ చ | 12-18-772 |
| స్వయమేవాత్మనా | 10-15-647 |
| సాధిభూతాధిదైవం | 7-30-453 |
| స్థానే హృషీ కేశ | 11-36-715 |
| **హ.** | |
| హంత తే కథ | 10-19-652 |
| **క్ష.** | |
| క్షిప్రం భవతి | 9-31-663 |
| **జ్ఞా.** | |
| జ్ఞానం తేహం | 7- 2-377 |
| జ్ఞాన యజ్ఞేన | 9-15-583 |

గీ॥ నమః పురస్తా దథ పృష్ఠత స్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।
అనంతవీర్యామితవిక్రమ స్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥ ॥౪౦॥

ప ద వి భా గ ము:— నమః- పురస్తాత్- అథ- పృష్ఠతః- తే- నమః- అస్తు- తే- సర్వతః- ఏవ- సర్వ- అనంతవీర్యామితవిక్రమః- త్వం- సర్వం- సమాప్నోషి- తతః- అసి- సర్వః ॥ ॥౪౦॥

ప్ర తి ప దా ర్థ ము:— పురస్తాత్=పూర్వదిక్కునందు: తే=నీకై; నమః=నమస్కారము; అథ=అనంతరమునందు; పృష్ఠతః=వెనుకభాగమందు, తే=నీకై; నమః=నమస్కారము; హేసర్వ=ఓసర్వస్వరూపుడా; సర్వతఏవ=అన్నిదిక్కులయందును; తే=నీకై: నమః=నమస్కారము; త్వం=నీవు; అనంతవీర్యామితవిక్రమః=అంతములేనివీర్యము, అమితమైన విక్రమముకలవాడవై; సర్వం=సమస్తజగత్తును; సమాప్నోషి=వ్యాపించియుంటివి; తతః=ఆ కారణముచే సర్వః—సర్వస్వరూపుడవై: అసి=అయితివి. ॥౪౦॥

శాంకరభాష్యమ్;—

తథా— నమః పురస్తా త్పూర్వస్యాం దిశి తుభ్య మథ పృష్ఠత స్తే పృష్ఠతోపి చ తే। నమోస్తు తే సర్వత ఏవ సర్వాసు దిక్షు సర్వత్ర స్థితాయ హె సర్వానన్తవీర్యామితవిక్రమోఽనంతం వీర్య మస్యామితో విక్రమోఽస్య వీర్యం సామర్థ్యం విక్రమః పరాక్రమః । వీర్యవానపి కశ్చి చ్ఛస్త్రాదివిషయే న పరాక్రమ తే మందపరాక్రమోవా త్వం త్వనన్తవీర్యామితవిక్రమశ్చే త్యనన్తవీర్యామితవిక్రమ స్సర్వం సమస్తం జగ త్సమాప్నోషి సమ్య గేకే నాఽఽత్మనా వ్యాప్నోషి యత స్తస్మా దసి భవసి సర్వ స్త్వయా వినాభూతం న కించి దస్తీ త్యర్థః ॥౪౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఓసర్వస్వరూపుడా! నీకై పూర్వదిక్కునందు నమస్కారము. వెనుకభాగమందు నీకై నమస్కారము. నీకై అన్నిదిక్కులయందును నమస్కార మగు గాక. నీవు అంతములేని వీర్యము, అమితమైన పరాక్రమము కలవాడవు. సర్వమును వ్యాపించి యుంటివి. కాన సర్వము నీవైతివి. (నీవు కాని దేదియు లేదని యర్థము.) ॥౪౦॥

త్మకుడవగుట నీవు సర్వులకు నమస్కార్యుడవు. కాన నానమస్కారము నీకు జెందుగాక. నీకై వేయి నమస్కారములు. తిరిగి నమస్కారము. మరల నమస్కారము. (భక్తిశ్రద్ధాతిశయముచేనైన నమస్కారాలం ప్రత్యయము లేకుండుట నమస్కారావృత్తిచే సూచితము.) ॥౩౯॥

—• ౧౧వ అధ్యాయము ౪౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మ ధు సూ ద న స ర స్వ తీ య ము:— నీకై ముందుభాగమున నమస్కారము. వెనుకభాగమునందు నమస్కారము. అంతటను యుండు నీకై నమస్కారము. ఓసర్వాత్మకుడా! నీవు అనంతమైన శరీరబలము, అపరిమితమైన విక్రమము (శస్త్రప్రయోగ నైపుణి) కలవాడవు. (లేక "అనంతవీర్య" అని సంబోధనముగ జూడదగును. సర్వజగత్తును లెస్సగ సదూప్రమముతో వ్యాపించుచుంటివి. కాన సర్వస్వరూపుడవు. నీకంటె నతిరిక్తమగున దేదియు లేదని యాశయము. ॥౪౦॥

శ ం క రా న ం దీ య ము:— అర్జునుడు భక్తివేగముచేనైన సంతోషాతిశయముచే స్తుతించుచు తిర్గి యంతటను నమస్కరించుచుండెను:— ఓసర్వాత్మకుడా! నీకై ముందు వెనుక భాగములయందు నమస్కా—